# రుద్రమ దేవి

( ఐతిహాసిక నవల )



కవి సమ్రాట్

నోరి నరసింహ శాస్త్రి

సాహితీ సమితి . రేపల్లె

# పీఠిక

శ్రీమదాంధ్ర మహాభారతావతరణము ఆంధ్రుల చరిత్రయందే కాక భారతీయచరిత్రయందే మహోజ్జ్వలమగు ఘట్టము. నిర్మలమైన భారతీయసంస్కృతియం దభిమానము పురుషసింహులయందు విజృంభించినప్పు డెల్ల ఆంధ్రమహాభారతరచన సాగినది.

భారతదేశాంచలముల యవనుల దండయాత్రలు ప్రారంభించినవేళ, దక్షిణదేశములో భారతీయధర్మాభిమానము స్థిరమై చోళాంధ్రసంపర్కముతో నూతనశక్తి యొకటి ఉదయించినది. ఆసమయమున నన్నయభట్టారకుడు ఆంధ్రమహాభారతరచన కుపక్రమించినాడు.

ఆ పిమ్మట రెండువందలసంవత్సరములకు యవనులు ఉత్తరదేశమునంతయు నాక్రమించి దక్షిణదేశముపై తమ దృష్టి సారింప సాగిరి. వారిని ప్రతిఘటించుటకు కాకతిగణపతిదేవుడును రుద్రమయు ఆంధ్రసామ్రాజ్యమను చెలియలికట్టను దృఢపరచిరి. ఆ కాలముననే తిక్కనసోమయాజులు మహాభారతరచన సాగించెను.

మరల డెబ్బదియైదు సంవత్సరములలో యవనవాహినులు దక్షిణదేశముగూడ ముంచివేసినవి. సముద్రములో మునిగిపోయిన భూదేవిని ఆదివరాహమూర్తి యుద్ధరించినట్లు, ప్రోలయ వేమాదులు, ఆంధ్రదేశమున భారతధర్మమును సముద్ధరింప బూనుకొనిరి. అట్టి సమయముననే ఎఱ్ఱయ ఆరణ్యపర్వశేషమును హరివంశమును రచించి యాంధ్రభారతరచనము పూర్తి కావించెను.

అందులో మొదటి ఘట్టమును చిత్రించుచు నేను 'నారాయణభట్టు'లో నన్నయభట్టారకుని సృష్టికర్తృత్వమును ప్రదర్శించితిని. 'రుద్రమదేవి' లో రెండవఘట్టమును వర్ణించుచు తిక్కనసోమయాజుల భారతనిర్వహణము ప్రపంచింప యత్నించితిని. మూడవఘట్టమున

మల్లారెడ్డి' లో విపులముగా నిర్వచించి శంభుదాసుని గరళకంఠత్వము సాధింప పూనుకొనియున్నాను.

భారతభూమికి పారతంత్ర్యము వదలినది. అంతే కాదు. పురాణకాలములో తప్ప, బహుకాలముగా ఈమధ్య ఎరుగని రాజకీయైక్యత ఆసేతుహిమాచలమునకు నేడు సాధింపబడినది. సరిగా నిట్టి సమయముననే, ముందు 'నారాయణభట్టు' ను, పిమ్మట 'రుద్రమదేవి' యు, నిప్పుడు 'మల్లారెడ్డి' యు రచించు నుత్సాహము నాకు కలుగుట కూడ సమంజసమే. నిత్యనూతనమై యచంచల మగు భారతధర్మము మన దేశమును ఇప్పుడు మరల నావేశించినది. తత్ఫలమే నా యీ ప్రయత్నములు. పూర్వము నన్నయాదులను రచనకున్ముఖులను చేసిన యీ నిత్యశ్రీశక్తియే నన్నుకూడ నావహించుట చేతనే నా కిట్టి ఘట్టముల చిత్రింప నుత్సాహము కలిగినది. మదరాసు ప్రభుత్వమువారు 'నారాయణభట్టు' ను ఉత్తమనవలగా నిర్ణయించి బహూకరించుట నావిశ్వాసమును బలపరచుచున్నది. ఆ బహుమానము నాది కాదు; నన్ను రచనకు ప్రేరేచిన భారతశక్తిదే.

భారతధర్మము ఏయే కాలముల నెట్లెట్లు విజృంభించినదో వర్ణించుటే యీ నవలలు వ్రాయుట కుద్యమించుటకు ప్రధానకారణము. కాని మూడింటియందును మూడు వేరువేరు మార్గములు అవలంబింప యత్నించితిని. 'నారాయణభట్టు' లో అనేకఘట్టములు సన్నివేశములు కల్పింపబడినవి. కాని యవి యన్నియు ఒకేవిషయముపై — భారతాంధ్రీకరణముతో ధర్మవ్యాప్తిపై — కేంద్రీకరించును. అందులో ఆంతరంగిక విప్లవము ప్రధానము.

రుద్రమదేవిలో బాహ్యమైన విప్లవము ముఖ్యము. దాని నెదుర్కొనుటకు ఆంతరంగికమగు పరస్పరవిరుద్ధశక్తు లెన్నియో ఏకమై ఆత్మస్థైర్యము సాధించిన విధము దీనిలో చిత్రింపబడినది. ఇందులో వ్యక్తులెందరో కనిపింతురు. కాని వారందరు నేదో యొక

తీరున ఆంధ్రసామ్రాజ్యరక్షణ కుపయోగింతురు. త్రిమూర్తు లన దగిన విశ్వేశ్వరశంభుదేశికులు, తిక్కనసోమయాజులు, అన్నమంత్రీశ్వరులు అను మహానుభావులు మూడు శక్తులై యందరను ధర్మవృక్షమునకు బ్రోదిచేయునట్లు నడిపింతురు. అందులో ఒకరు రాజగురువు, ఒకరు కవీశ్వరుడు, ఒకరు మంత్రిపుంగవుడు.

సమగ్రమగు ఆంధ్రుల చరిత్ర మిప్పటికి వెలువడలేదు. ఉన్న కొలదిమంది చరిత్రకారులును ఒకరితో నొకరు ఏకీభవింపరు. ఇట్టి సందర్భమున చారిత్రకనవలలు వ్రాయ యత్నించువారికి బహుప్రయాసపడి మూలధారములు శోధించుట తప్పుటలేదు. ఈ నవలలో వర్ణించిన చరిత్రాంశములకు నాకు ప్రధానమైన యాధారము డాక్టరు మారేమండ రామారావు ప్రచురించిన కాకతీయసంచిక. అందును ముఖ్యముగా శ్రీరామారావు వ్రాసిన 'కాకతీయచరిత్ర' యను సంపాదకీయవ్యాసమును, వా రెంతో శ్రద్ధగా సేకరించి అనుబంధములుగా చివర ప్రకటించిన గ్రంథభాగములును శాసనములును, నాకు మిక్కిలి ఉపకరించినవి.

ఆ కాలపు చరిత్రలో చరిత్రకారులకు విడకున్న కొన్ని చిక్కులను కొంత విడదీయుటకుకూడ ఈ నవలలో మార్గములు సూచించినాను. అట్టివానిలో రుయ్యమ్మవివాహము, రుద్రమకు రాజ్యాభిషేకము చేయుటకు గలకారణము, ప్రతాపరుద్రునికి రాజ్యము సంక్రమించిన విధము, రుద్రమ శాసనములలో తన భర్తను ప్రస్తావింపకుండుటకు హేతువు, కొప్పెరుంజింగని దాక్షారామశాసనము, ప్రధానములు.

రమారమి ఆరుసంవత్సరములలో జరిగిన చరిత్రాంశములను ఆరుమాసములలో జరిగినట్లుగా కుదించి యిందులో వర్ణించినాను. చరిత్ర యన తిథివారనక్షత్రములు మాత్రమే కాదు.

ఈ నవలను రచించు సమయమున నేను ఓరుగల్లు, దర్శింపగా నప్పుడు నన్ననుగమించి ఎన్నియో అపూర్వవిషయములు ఆదరముతో నాకు ప్రదర్శించిన శ్రీమాన్ దూపాటి వెంకటరమణాచార్యులవారికి నా వందనములు. ఏకశిలపై వారితో గూర్చుండి సంభాషించుచు గడపిన గంటల స్మృతి ఈ గ్రంథరచనాకాలమున మాటిమాటికి నా కానందము కూర్చినది.

ఈ నవలను తమ ఆంధ్రవారపత్రికలో ముందు ప్రచురించి, మరల పుస్తకరూపమునగూడ ప్రకటించి, నన్నాదరించిన శ్రీ శివలెంక శంభుప్రసాద్ గారికి నేను కృతజ్ఞుడను.

"శ్రీగిరి," రేపల్లె,
వికృతి, పుష్యశుద్ధ ౧౦.

నోరి నరసింహ శాస్త్రి

## ద్వితీయ ముద్రణ పీఠిక

ఈ నవలను భారతీయ భాషలలోనికి అనువదించుటకు నిర్ణయించిన ఢిల్లీ సాహిత్య అకాడెమీ వారికి కృతజ్ఞుడను.

నో. న.

౧

“జయతి భగవాన్ స్వయంభూః, గణపతినృపతే ర్హృది స్థిత స్సతతమ్,
యత్కారుణ్యకటాక్షైః, వృద్ధిం ప్రాప్తాంధ్రదేశశ్రీః” (మల్కాపురశాసనమ్)

అది మహాలయామావాస్య !

ఆకాశము మేఘావృతమై యున్నది. సూర్యోదయమైనను భగవానుడు కనుపడియు కనుపడకుండ నున్నాడు. వీరోత్సవములతో పొంగిపొరలుచుండు నేకశిలానగర మానాడు వర్షపాతమునకు బూర్వము గగనాంగనవలె పూర్ణగర్భిణియై యించుక మాంద్యము వహించియున్నది.

రాచనగరులో మంగళతూర్యపంచకము అనుదినము ప్రాతస్సమయముల మ్రోయుచునే యున్నవి. కాని యిప్పటికి నెలనాళ్ళనుండియు నవి యెప్పటివలె దీర్ఘకాలము శ్రవణపర్వము చేయక, ప్రారంభించిన యల్పకాలమునకే సమాప్తి నొందుచు, ప్రవర్తింపని రాగస్వరమువలెను, విస్తరింపని వర్ణనవలెను, సవరింపని కావ్యమువలెను, వివరింపని కథావస్తువువలెను ఆనందదాయకములుగా లేవు. పైపెచ్చు అనిర్వాచ్యమగు నశాంతిని భయమును, వినువారి కావేశింపజేయుచుండెను.

మహారాజు జనమందరికి నిత్యము దర్శనమిచ్చు నియమితవేళ ప్రాతఃకాలమున గలదు. అంతకుముందుగనే పురజనులు రాజద్వారసమీపమున మూగుచు నిశ్శబ్దముగా తమ చూపులు రాజమందిరాట్టాలకమందలి గవాక్షముపై వ్యగ్రతతో నిలుపుచుండిరి. ఆ ప్రదేశములనుండి మహారాజు దర్శన మొసంగును. కాని యీ నెలరోజులనుండియు నా యట్టాలకమునుండి కాని గవాక్షమునుండి గాని ప్రజలకు మంగళప్రదమగు రాజదర్శన మగుటలేదు. అందుకుమారు రాజదూత యొక డట్టాలకముపై ప్రత్యక్షమై దీర్ఘగంభీరస్వరముతో నిట్లు ప్రకటించుచుండెను:

“స్వస్తి! సమస్తపంచమహాశబ్ద మహామండలేశ్వర, రాజపరమేశ్వర ఉద్దండమండలాగ్రప్రచండ నెలవీడుగండ శేషణి హమ్మంతె శ్రీమత్ గణపతిదేవమహారాజులుంగారు అస్వస్థులై యుండి వారి వాత్సల్యప్రతివచనములు ప్రజలందరికు ఎరుకచేయుమని యాజ్ఞాపించిరి.

అది యాలకించి ప్రజలు నిర్విణ్ణులై చింతాక్రాంతహృదయములతో వెనుదిరిగి పోవుచుండిరి. రోజులు గడచినకొలదియు నా వేళకు చుట్టుప్రక్కల జనపదములనుండియు జనసమూహము లా ప్రదేశమున జేరుచున్నందున నానాటికి జన మెక్కువగుచుండెను.

అందులకు ఈనాడు అట్లు చేరిన పౌరులయు జానపదులయు సంఖ్య యపరిమితముగా నున్నది. రేపటినుండి శరన్నవరాత్రోత్సవము ప్రారంభించును. నవరాత్రపూజాదీక్షితులైన మహారాజుల దర్శించు భాగ్యమైనను మన కీ సంవత్సరము లభ్యమగునా, కాదా? నవరాత్రపూజ జరుపని మహారాజురాజ్యమున మంగళము లెట్లు

సమకూరును? ఆ కూడిన జనముల హృదయములలో ఈ ప్రశ్నయే శల్యమువలె వేధించుచుండెను.

దూరదేశములనుండి సామంతులును మండలేశ్వరులును దండనాథులును రాజబంధువులును జేయు రాకపోక లానాటి కానాడు రాజమందిరమున నతిశయించుచుండెను. తిక్కచమూపతి రాచనగరు విడుచుటయే లేదు. మహాప్రధానులగు శ్రీమల్ల గోవిందనాయకుడు బయ్యననాయకుడు విశేషకాలము రాజమందిరముననే గడపుచుండిరి. ఏకశిలాపురపాలకుడగు మేచయనాయకుడు శ్రద్ధవూని రాత్రింబవళ్ళు రాజమందిరమును భటసమూహములతో సంరక్షించుచుండెను.

ఈనాడుకూడ రాజదర్శనము కాలేదు. ఈనాడుకూడ రాజదూత మహారాజు నస్వస్థవార్త దీర్ఘగంభీరస్వరముతో ప్రకటించి మహారాజులు తమ ప్రజలకు బంపిన ప్రీతిసందేశము నెరిగించెను.

ఆ సందేశము పూర్తియైనది. కాని జన మెప్పటివలె వెంటనే జయజయనినాదములు చేయుచు కదలిపోలేదు. అసలు జయజయనినాదములే వారు చేయలేదు. కదలనే లేదు.

వారీనాడు సామాన్యప్రీతివచనములు దూతముఖమున వినుటకు రాలేదు. ఇందరు జనము నవరాత్రపూజావిశేషము లెరుంగివచ్చిరి. రాజమందిరమున పండుగ కాకున్న ప్రజలు పండుగ చేసికొనుట యెట్లు?

వారట్లొక్క గడియపాటు నీరవముగా నిలిచియుండిరి. ఐనను రాజమందిరమునుండి మరి ప్రకటన రాలేదు. అంతట నామహాజనము నిరాశతో నిశ్శబ్దముగా విచ్చిపోసాగెను. అంతటి జనసమూహము విచ్చిపోవు కదలికవలన కలిగిన శబ్దమే నేలయురిమినట్లు భయంకరమంద్రఘోషమై కోటగోడల నెల్ల వడవడ వడకించెను.

ఆశబ్దమునకు అలకియో యన్నట్లు ఇంతలో రాజదూత మరల సౌధాట్టాలికమున ప్రత్యక్షమై ఆ సాయంకాలముననే మరియొక ప్రకటన మహారాజులు చేయింపగల రని తెలిపెను. విచ్చిపోవుచున్న జనులు వెనుదిరిగివచ్చి వ్యగ్రులై అది యాలకించి వికసించిన ముఖములతో నొకరికొకరు చెప్పికొనుచు జయజయనినాదములు చేయుచు వెడలిపోయిరి.

శ్రీ కాకతిగణపతిదేవమహారాజుకు డెబ్బదియైదేళ్ళున్నవి. ఈ వార్ధకములో నాతి డప్పుడు వ్యాధిపీడితుడై మంచముపట్టియుండెను. పాదములను ముఖమునను నీరు చూపినది. రాజవైద్యులు ఆయన నేమాత్రము కదలగూడ దని నిషేధించిరి.

ఆ మహారాజు చిన్నతనమున పడరాని కడగం డ్లనుభవించెను. కాకతీయుల కప్పటికి హనుమకొండ రాజధాని. దేవగిరియాదవరాజగు జైతుగి దండెత్తివచ్చి హనుమకొండను ముట్టడించి గణపతిదేవుని తండ్రియగు మహాదేవరాజును సంహరించి చిన్నవాడగు గణపతిదేవుని బంధితుని గావించి దేవగిరికి తీసికొనిపోయెను. గణపతి యౌవనమంతయు దేవగిరిచెరసాలలోనే గడచిపోయెను. దేవగిరిలో నున్న యా పది పదునొకొండేండ్లు నాతడు మహాతపస్సు చేసెను. కులదైవత మగు హనుమంతుని ఇష్టదైవమగు శంకరుని ఆరాధించెను. కొంతకాలమున కాతి డెట్లో హృదయములో

క్రోధవహ్నిని కాలకంఠుడు గరళమునువలెనే దిగమ్రింగి యాదవరాజును శాంతి పరచెను. జైతుగి కాతనిపై ననుగ్రహము కలిగి బంధవిముక్తుని జేసి యనుమ కొండకు పంపివేసెను.

అత డట్లు స్వరాజ్యము ప్రాపించునాటికి విశాలాంధ్రావని యంతయు నల్లకల్లోలముగ నుండెను. అతని పెదతండ్రి రుద్రదేవమహారాజు దీక్షతో స్థాపించిన రాజ్యమంతయు ఛిన్నభిన్నములై యుండెను. సామంతులును మండలేశ్వరులును స్వతంత్రులైరి. అమరావతిలో కోటవంశీయులును, మడపల్లెలో నతవాడివారును, నారసిపురమున కొలనినాయకులును, గుడిమెట్టలో చాగివంశమువారును, కృష్ణానదీ ముఖద్వారమున అయ్యవంశీయులును, పొత్తపి నెల్లూరుమండలములలో తెలుగుచోళు లును, పాదుకొని వారిలో వారు కలహించుచుండిరి. దానికి తోడుగా నీశాన్యమున కళింగగాంగులును, ఆగ్నేయమున చోళులును, గాతుసమున హోయసలులును, వాయ వ్యమున యాదవులును, విజృంభించి ఎవరి కందిన భూఖండములు వారు కబళించు చుండిరి. రేచర్ల రుద్రసేనానిమాత్రము నాగతిభూపాలుడు మొదలగు శత్రుల బారి దోలి హనుమకొండప్రాంతమును శత్రులబారి పడకుండ సంరక్షించి గణ పతిదేవున కప్పగించి కాకతిరాజ్యభారధౌరేయు డను నన్వర్థబిరుదము వహించెను.

అప్పుడు గణపతిదేవుడు చేయవలసినది విశేషముండెను. స్వతంత్రులైన సామంతులను వశపరచుకొనవలెను. శత్రురాజు లాక్రమించిన రాజ్యభాగములు తిరిగి సంపాదింపవలెను. అన్నిటికంటె ముఖ్యమైనది, తనతండ్రిని జయించి వధించిన దేవగిరిరాజుపై కడుపులో దాచుకొన్న పగ సాధింపవలెను!

గణపతిదేవుడు ఈ కార్యములు సాధించుటకు రుద్రదీక్షతో నుపక్రమించెను. దాని కనుకూలముగ నాసమయముననే యాతనికి శ్రీ విశ్వేశ్వరశంభువుల దర్శనము ప్రాప్తించెను. విశ్వేశ్వరశంభువు ఉగ్రతపస్వి యగు శ్రీ ధర్మశంభువులకు కరక మలసంజాతుడు; 'పృథ్వీపాలావనిముకుటఘృష్టాంఘ్రికమలద్వయుడు; విద్యావల్లీ వలయకలనాకల్పతరువు.' యౌవనసంపదతో శివదీక్షాసంపద యేకమై దివ్యజ్యోతి వలె ప్రకాశించు నా మహాయోగి యిహపరరాజ్యవిజిగీషు వగు గణపతిదేవుని నెంతయు నాకర్షించెను. కొలదికాలముననె యాతడా దేశికునియొద్ద శాంభవదీక్ష గ్రహించెను. తదాది గణపతిదేవునికి విజయ పరంపరలు సిద్ధించెను. సామంతులందరు నొకరితరువాత నొకరు వశులైరి. శత్రువశమైన నిజభూభాగమె కాక శత్రురాజుల భూభాగములుకూడ కొన్ని యా మహారాజువశ మయ్యెను. ఇట్లాతడు తెలుగుభాష మాట్లాడు మహాంధ్రదేశమున కంతటికి నిష్కంటకముగా నేకచ్ఛత్రాధిపతి యయ్యెను. ఆతని రాజ్యము దక్షిణమున కల్యాణకటకమువరకును, ఉత్తరమున సింహాద్రిదాటి మాల్యవంతమువరకును, పశ్చిమమున కల్యాణకటకమువరకును, తూర్పున సముద్రమువరకును విస్తరించెను. ఒక్కొక్కసీమను జయించినప్పుడెల్ల ఆత డచ్చ కము లగు శివాయతనములు ప్రతిష్ఠించి, తన నామముతో గణపేశ్వరములను ఘర మలను నిర్మించెను. ఆతడు త్రవ్వించిన తటాకములకు, కట్టించిన గ్రామములకు వేయించిన రాజమార్గములకు, నడిపించిన కాలువలకు లెక్కలేదు. గాంధ నీరగరము

నోరుగల్లునకు మార్చెను. ఇట్లాతడు బహుదీర్ఘకాలము సమర్థతతో రాజ్యపరిపాలన మొనర్చెను.

ఇందరు రాజన్యులను ఇన్ని రాజ్యములను గణపతిదేవుడు జయింపగలిగెను గాని వార్ధకమును గాని మృత్యుదూతయగు వ్యాధిని గాని, జయించు శక్తి యాతనికి లేకపోయినది. ముదిమి పెరుగుచున్నకొలది పాలనములో పటుత్వము తగ్గజొచ్చినది. దానికి తోడాతనికి పురుషసంతతి లేకపోయెను. స్త్రీసంతతికైనను పురుషసంతతి కలుగలేదు. అందుచే నీ వృద్ధరాజునంతరమున రాజ్యశాసకుఁ డెవడగు నను ప్రశ్న తీరక ఎల్లప్పుడు వచ్చుచుండెను. రాజబంధువులలో భేదాభిప్రాయములు వ్యక్తమగుచుండెను. అవి సామంతులకును మండలేశ్వరులకును సూక్ష్మ సూక్ష్మముగా ప్రాకసాగెను. మిక్కిలి విశాలమగు నాతని రాజ్యాంచలములలో గదలికలు ప్రారంభించెను. ఒకవంక కాంచీపు-చోళులు స్వతంత్రులై నెల్లూర గణపతి సామంతుడగు మనుమసిద్ధిని రాజ్యపదభ్రష్టు నొనర్చిరి. మనుమసిద్ధి కూడ విద్రోహులతో నేకమైనట్లు వార్తలు వచ్చుచున్నవి. తొండమండలమునుండి కొప్పెరుంజింగడు మరికొంతభూమిలో ప్రవేశించి దాక్షారామమువరకు నెత్తిరా నుంకించుచుండెను. కళింగగాంగులు ఈశాన్యమున కోల్పోయిన భూభాగమును దిరిగి కబళింప యత్నించుచుండిరి. అంతలో నప్పటి యాదవరాజగు మహాదేవరాజు దండెత్తివచ్చుటకు మహాసైన్యములు సమకూర్చుచుండె నని వార్తాహరులు తరుచుగా తెలుపుచువచ్చిరి.

కాకతీయప్రజాజీవనములో మతభేదములచే సామరస్యము నశించెను. శైవవైష్ణవులకు తమలోతమకును, ఉభయులకును జైనులతోడను ద్వేషములు తీవ్రము కాజొచ్చెను. వానికి తోడు ఒకవైపున వీరశైవమును మరొకవైపున వీరవైష్ణవమును జనులను మతావేశముతో నున్మత్తప్రాయుల నొనర్చుచుండెను. వారుభయులకు జైనులతో తరచుగా వాదోపవాదములు సాగుచుండెను. రాజ్యమునకు మూలాధారమగు గ్రామములలో కరణములుగా విశేషముగా జైనులే యుండిరి. పట్టణములలో కూడ పలువు రుద్యోగులు జైనులే. రాజకోశమునకు అధిపులుగా నున్నవారిలో పెక్కురుజైనులే. అందుచే ఆనాడు రాజ్యములో జైనులపలుకుబడి బలముగా పాదుకొనియుండెను. రాజధానీనగరమునను పెద్దపట్టణములను శైవవైష్ణవము లెంత శీఘ్రముగా ప్రాకుచున్నను గ్రామములలో నవి యంత శీఘ్రముగా వ్యాపింపలేకుండెను.

కాకతీయసామంతులందును దండనాథులందును అన్నికులములవారును గలరు. వారిలో కొందరు బ్రాహ్మణులు. కొందరు చాళుక్యక్షత్రియులు. కొందరు కదంబ గాంగ పల్లవ కాకతీయాది వంశముల క్షత్రియులు. మరికొందరు పద్మనాయకులు. ఇంకను కొందరు బహువంశముల రెడ్లు. కొందరు కమ్మవారు. వెండియు గొందరు కాయస్థులు. వారెన్ని భిన్నకులములవారైనను పూర్వము ప్రభువునెడ సమానముగా భక్తిగలవారై యుండిరి. ఇప్పుడు భిన్నమతాభిమానములచే వారిలో నందరకు నేకభావన లేక అనేక పక్షములుగా నంతరంగములలో చీలియుండిరి. భవిష్యద్రాజనిర్ణయములో నీ చీలికలు గాఢమగు సూచన లున్నవి. స్పృశించినంతనే చిదికిపోవు బుడగ [illegible] పరిస్థితులున్నవి. అది బుద్ధిశాలి

యగు గణపతిదేవునకు తెలియకపోలేదు. అందుచే నా ప్రస్తావన రానీయకుండ ఇప్పటి వరకెన్నియో సంవత్సరములు గడచెను. కాని యెన్నాళ్ళు గడపగలడు?

ఈ సంవత్సరము నవరాత్రదీక్షకు తాను కూర్చుండుటకుగూడ నోపిక లేని యవస్థవచ్చినది. ఏదో ఒక నిర్ధారణ చేసితీరవలసిన తరుణము వచ్చినది. ఇక నాలసింప సాధ్యము కాదు.

పలువురు సామంతులును దండనాథులును రాజబంధువులును రాజధానికి వచ్చి యున్నారు. కాని మహారాజునకు భుజదండములవంటి మండలేశ్వరులు కొందఱింకను రాలేదు. ఇందులూరి అన్నమదేవుడును కొలని రుద్రదేవుడును ఎంత ప్రయత్నించినను రాలేకపోయిరి. గోదావరియు దాని యుపనది యగు శబరియు పొంగి వరదలు విపరీతముగా వచ్చినందున అనేకగ్రామముల జనములు నిరాధారులై ప్రాణాపాయస్థితిలో నుండిరి. వారలు దగ్గర నుండి అవసర మగు ప్రతిక్రియలు చేయింపనిచో ప్రజాబాధ దుర్భర మగును. అందుచే తాము విదియతదియలకుగాని రాలే మని గణపతిదేవులకు వినతు లంపుకొనిరి.

మరియు జన్నిగదేవుడును త్రిపురాంతకుడు అంబదేవుడును అను కాయస్థదండనాథులు మువ్వురుండిరి. వారు రాజధానికి రాలేదు. వా రెందుకు రాలేదోగూడ తెలుపలేదు. వారు రాకున్నందుకు గణపతిదేవునికి ముందు కోపమువచ్చెను. ఈనాడు వత్తురు, ఈనాడువత్తురని నిరీక్షించెను. కోపము చిరాకు నెక్కు వగుచుండెను. మహాలయామావాస్యకుకూడ రాకుండుటయేగాక వార్తకూడ వ్రాసి పంపలే దని తెలిసి గణపతిదేవుడు కుప్పకూలిన ట్లయ్యెను. ధైర్యమును ఆగ్రహమును తెచ్చుకొనును. మరల నధైర్య మావేశించును.

గణపతిదేవునకు చాలకాలమువరకు ముందు సంతతియే కలుగలేదు. రుద్రమదేవి గర్భములో నుండగా జ్యోతిష్కులు భావిరాజ్యాధిపతి పుట్టు నని ప్రశ్నలు చెప్పిరి. అందుచేత పుత్రజనన మగు నని పేరాసతో నిరీక్షించెను. కాని తుదకు పుత్రిక యను వార్త తెలిసినది. వెంటనే యాతడు మనోనిశ్చయము చేసికొని మహారాజులకు పుత్రోత్పత్తి కలిగెనని ప్రకటింపజేసెను. ఆ కుమార్తె కాతడు రుద్రదేవు డనియే తన పెదతండ్రి పేరుపెట్టి పురుషవేషమువేయించి వ్యవహరింపజొచ్చెను. కాని యట్టి యంతఃపుర రహస్యమెంతకాల మాగగలదు? నిజవార్త యానోట నానోట బడి వ్యాపింపజొచ్చెను. ఆమెకు పదేండ్లు దాటకముందె కన్యక యని రాజ్యములో నలుమూలల నది తెలిసిపోయెను. రాజాజ్ఞలయెడ భయమునకైన నది ప్రజలచే రహస్యముగా నుంచునట్లు చేయుట యసాధ్యమయ్యెను. ఆ సందర్భమున నున్న విషయమును మరుగుపరచి కల్లోలములు పెంచుట కతని కిష్టము లేకపోయెను.

అంతలో మరియొక భార్య గర్భవతి యయ్యెను. ఈమారైనను పుత్రు డుదయింపడా యని యాశపడెను. మరల పుత్రికయే కలిగెను.

ఆసమయమున రుద్రమదేవి పూర్ణయౌవన యయ్యెను. ఖడ్గాద్యాయుధ విద్యల నామె ప్రవీణ. దండనీతి యామెకు హృద్గతము. వనిత ఎంత విద్యావతి యైనను శాశ్వతముగా కన్యకగా నుండ సాధ్యమా? ఆమెకు వివాహము చేయక తప్పినదికాదు.

గణపతిదేవు డాలోచించెను. వీరాంగన యగు నామెను వీరాధివీరునే భర్తగా జేయ నాతడు నిశ్చయించెను. అంతట నామె కతడు వీర్యశుల్కము నిశ్చయించి కులీను లగు దండనాథులను సామంతులను ఆహ్వానము లంపెను. రుద్రమదేవిని ఖడ్గయుద్ధ మునను ధనుర్విద్యయందును జయింపగల వాని కామె నిచ్చి వివాహము చేసెదనని చక్రవర్తి నిర్ణయముచేసి యీవిధముగా వార్తలంపెను.

అట్లాహూతులయిన క్షత్రియవీరులు పలువురు రాజాజ్ఞ పాలించి రాజధానికి వచ్చిరి. కాని వారిలో పెక్కురకు రుద్రమదేవిని వివాహమాడుట యిష్టము లేదు. కొందరు రాజపుత్రికయందు భయభక్తులు చూపి యామెతో యుద్ధము చేయ నియ్యకొన లేదు. కొందరు యుద్ధములో పాల్గొని ప్రయత్నపూర్వకముగా నోటమి యంగీకరించిరి. పురుషునివలె వ్యవహరించు స్త్రీని వారు భార్యగా స్వీకరించుట కిష్టములేమినే వారట్లు ప్రవర్తించుచుండి రని గణపతిదేవు డూహింపకపోలేదు.

మరి చాళుక్యవీరభద్రేశ్వరుడో? మిగిలిన సామంతులవంటివాడు కా డతడు! రాజ్యభ్రష్టుడై యాతడు యౌవనదశలో బహుకాల ముత్తరదేశములలో సంచరించెను. అప్పు డచ్చట విజృంభించుచున్న ఇస్లాముమతావేశము నతడు కన్నులార జూచెను. శిథిలప్రాయము లగు బౌద్ధసంఘారామములను వీడి దేశాటనము చేయుచున్న బౌద్ధభిక్షువుల నెందరినో యాతడు సందర్శించి వారితో సంభాషించియుండెను. వారి యుపదేశములచే దేశమంతట నైకమత్యము లేకుండ వేరుచేసిన సంస్థ వర్ణవ్యవస్థయే యను విశ్వాస మాతనికి స్థిరపడెను. ఇట్టి కాలములో స్త్రీలు అంతఃపురములలో కుములుచుండుట శ్రేయస్కరము కా దనియు నూహ యాతనికి ప్రబలెను. అతని రాజ్యము హరించిన జ్ఞాతులవలననుండి తన వేంగీమండలమును గణపతిమహారాజుసాహాయ్యముననే తిరిగి యాతడు సంపాదించుకొనగల్గెను.

వీరభద్రరాజు చాళుక్యక్షత్రియుడు! అనాదిగా వారు చంద్రవంశజుల మని చెప్పికొనుచుండిరి. కాకతీయుల క్షత్రియత్వము వారి ప్రభుత్వముతోపాటు ఈ మధ్య పెరిగినది. చాళుక్యులు కాకతీయులతో వివాహసంబంధములు చేయుట హీనముగా భావించి యందు కుద్యుక్తులు కాకుండిరి. కాని వీరభద్రేశ్వరున కట్టిపూర్వాచారముల యందు విశ్వాసము లేదు. అదిగాక అత డప్పటికే యొక క్షత్రియకన్యను వివాహ మాడియుండెను. తా నిప్పుడు రుద్రమను వివాహ మాడినచో నాంధ్రసామ్రాజ్యమునకే ప్రభుత్వము సంపాదింపగలుగును. పూర్వము మధ్యదేశమునంతయు పాలించిన చాళుక్యవంశప్రభ మరల కర్ణాటాంధ్రములలో తాను వెలిగించి యుద్ధరింపవచ్చు నని యతని కాశ కలిగెను. అందుచే నాతడు ప్రయత్నించి ఖడ్గయుద్ధమునను ధనుర్విద్య యందును రుద్రమ నెదుర్కొని జయించి, యామెను వరించి వివాహమాడి గణపతిదేవులకు ప్రియతము డయ్యెను.

గణపతిదేవుని ద్వితీయపుత్రిక గణపాంబ. ఆమెను ధాన్యకటకపాలకు డగు కోట బేతరాజున కిచ్చి వివాహ మొనర్చెను. పుత్రులు తనకు గలుగుదురను నాశ యడుగంటిన తర్వాత దౌహిత్రు లైన గలుగుదురేమో యని యాత డాశించెను. కాని దౌహిత్రులుకూడ కలుగు భాగ్య మాతనికి లేకపోయెను. రుద్రాంబిక కొక పుత్రిక

కలిగెను. గణపాంబకు సంతతియే లేక బేతరాజు గతించెను. భర్తరాజ్యమును గణపాంబయే పాలించుచుండెను.

రుద్రాంబ సవతికి హరిహరుడు మురారిదేవుడు నను నిరువురు కుమారు లుండిరి. వారును వీరభద్రరాజుతోపాటు గణపతిదేవుని శ్రద్ధాభక్తులతో సేవించుచుండిరి. వారిరువురును దండనీతివిశారదులు. రాజలక్షణలాంఛితులు. గణపతిదేవునకు రాజపురుషులకును వారు ఆదరపాత్రులుగా నుండిరి. వారిలో పెద్దవా డగు హరిహరుడే గణపతిసామ్రాజ్యమునకు అనంతరపాలకు డగు నని యందరు దలంచుచుండిరి. గణపతిదేవుడుగూడ నదియే యాలోచించుచుండెను గాని ప్రత్యక్షముగా నెన్నడు నా మాట చెప్పలేదు. మర్యాదాదికము లన్నియుమాత్ర మట్టి యూహనే బలపరచుచుండెను.

ఇట్లుండగా ఇప్పటికి నాలుగేండ్లక్రిందట నొక విశేషము జరిగినది. రుద్రమదేవిసమార్తియగు ముమ్మడయ్య మహాదేవరాజును వివాహమాడియుండెను. మహాదేవరాజుకూడ గణపతిని భక్తిభావముతో కొలుచుచు చక్రవర్తియనుగ్రహము సంపాదించుచుండెను. ఆ దంపతులకు నాలుగేండ్లనాడు కుమారుడు కలిగెను. ఆ కుమారుడు పుట్టినదియు ఏకశిలానగరమునందే. దౌహిత్రజననవార్త రుద్రమదేవి వినగానే పుత్రజనన మైనట్లె యానందించెను. వెంటనే యా వార్త గణపతిదేవుల కెరిగించిరి. పాలిపోయియున్న చక్రవర్తిముఖమున రక్తపు జీరలు చిమ్మి కమలమువలె వికసించెను. రాజజ్యోతిష్కులను సాముద్రికులను శాకునికులను రాజసన్నిధికి పిలిపించిరి. జ్యోతిష్కులీ కుమారుడు మహాచక్రవర్తి యగు నని చక్రములు వేసి గుణించి నిశ్చయించిరి. సాముద్రికులు పసివాని శరీరము పరీక్షించి చక్రవర్తిచిహ్నములు కలవాడని యా మాటనే దృఢపరచిరి. శాకునికులు భవిష్యచ్చక్రవర్తి పుట్టె నని నిర్ధారణచేసిరి.

గణపతిదేవుని యాశాంకురము హృదయములో విచ్చెను. కాని దాని నాతడు పైకి పొక్కనీయలేదు. ఈ వంశాంకురము వృద్ధియై స్వతంత్రముగా నిలువగలుగునంతవరకు తాను జీవించునా? ముందుగా తన యూహ తెలిసినచో పసివాని జీవితమున కెంత ప్రమాదము! ఐనను ప్రియపుత్రికా దౌహిత్రునిపై ప్రేమచూపుట వింత కాదుకదా! ఆ విధముగనే అత డా పసికందును అంగీకరించెను.

నామకరణోత్సవము మహావైభవముగా జరిగెను. ఆనాడు పరిషత్తులో రుద్రమదేవి పురుషవేషము ధరించి యా కుమారుని చేతులలో తీసికొని 'ఇదుగో నా కుమారుడు!' అని గణపతిదేవుల పాదములకు మ్రొక్కించెను. మహారాజు ప్రీతిపూర్వకముగా నాశీర్వదించి ప్రతాపరుద్రదేవుడని నామకరణముచేయ నాదేశించెను. మహాదేవరాజు 'మహాప్రసాద' మని ముత్యాలుంచిన బంగారుపళ్లెరములో మణిఖచితాంగుళీయకముతో నక్షతున కా వ్యవహారనామము వ్రాసి శ్రీకారము చుట్టి వినిపించెను. జయజయఘోషములు భూసురాశీర్వచనములు మంగళవాద్యవాదములతో చెలరేగెను.

తదాది దినదినము గణపతిదేవునకు ఆ యర్భకునిపై మమకార మతిశయింపసాగెను. ఆ యర్భకుడును రుద్రమదేవిని తల్లిగను గణపతిదేవుని తండ్రిగను భావించు

చున్నట్లు పెరిగెను. బహుమానముగా మహాదేవరాజునకు మహామండలాధిపత్యపదవీ లాంఛనము చక్రవర్తి ప్రసాదించెను.

ఇప్పుడు గణపతిదేవుడు తన సామ్రాజ్యమునకు ప్రతాపరుద్రదేవునకే యౌవ రాజ్యపట్టము కట్టవలెనను నిశ్చయము చేసెను. ఇంతవరకు హరిహరుడే రాజగు నని యందరు దలంచుచుండిరి. ఇప్పుడు ప్రజాహృదయములలో హరిహరమూర్తిని తొలగించి యా స్థానమున ప్రతాపరుద్రదేవమూర్తిని ప్రతిష్ఠించు టెట్లు?

ముదిమి వచ్చినది. దేహదార్ఢ్యము తగ్గినది. బుద్ధిలో తైక్ష్ణ్యముకూడ ఉజ్జ్వలముగా లేదు. అన్నిటికి దోడు వ్యాధి ప్రవేశించినది. జీవితశేష మెక్కువ లేనట్లు గోచరించుచున్నది. ఇట్టిస్థితిలో తన పుత్రికాదౌహిత్రుని రాజ్యమున స్థిరమొనర్చు టెట్లు?

ఇట్టి సందర్భములలో నవరాత్రోత్సవము జరుపవలసివచ్చినది. ఆ యుత్సవ మెవరిమీదుగా జరిపించిన, వాడు భవిష్యత్ప్రభువు కాగల డని చక్రవర్తి నియమించినట్లే!

అందులకై యీ మహాలయామావాస్యనాడు గణపతిదేవరాయలు అంతరంగిక మహాసభ చేసెను.

## ౨

"త్వంగత్పింగజటాకిరీట ముదయస్మేరారవిందాననమ్
ముక్తాకుండలతాడితాంసశిఖరం హారైర్మనోహారిణమ్
విద్యామండపవర్తినం గణపతిక్ష్మాపాలదీక్షాగురుమ్
శ్రీవిశ్వేశ్వరశంభు మీక్షితవతాం తే చక్షుషీ చక్షుషీ."

ఆ మహాసభకు ప్రధానమంత్రి పురోహిత దండనాథ సామంతులు వచ్చిరి. అందు గణపతిదేవుడు వెనుకకు వ్రాలియుండునట్లమర్చిన మనోజ్ఞాసనమున వైద్యుల నియోగమున నుపవిష్టుడై యుండెను. ఆతని దక్షిణపార్శ్వమున నున్నతాసనమున రుద్రమదేవి వీరపురుషవేషము ధరించి కూరుచుండెను. వా రిరువురనడుమ రత్నఖచితాసనమున నాలుగేండ్లబాలుం డగు ప్రతాపరుద్రదేవు నాసీను గావించిరి. గణపతి వామపార్శ్వమున వీరభద్రరాజును, ఆతని ప్రక్కను హరిహరమురారిదేవులును, ఆపై మహాదేవరాజును, జాయపనాయకుడును, మిగిలిన సభ్యులును యథోచితస్థానముల నలంకరించి యుండిరి. ఎవరితోడను గలయక రాజగురువు లగు శ్రీవిశ్వేశ్వరశంభుదేవులు ప్రత్యేకము సమున్నతాసనమున వెలుగుచుండెను.

వందిమాగధుల కైవారములైనవి. ఇతర రాజమర్యాదలును పూర్తియైనవి. అంతట మహాప్రధాని శ్రీమన్ గోవిందనాయకుడు లేచి రాజగురువులకును మహారాజునకును చేతులొగ్గి యిట్లు సభాప్రారంభ మొనర్చెను.

"శ్రీమత్ మహారాజ రాజపరమేశ్వరులు శ్రీగణపతిదేవులు అస్వస్థులై యున్నారు. ఈ యేట నవరాత్రదీక్షకు వారికి ప్రతినిధులుగా కూర్చుండుటకు యుక్తమగువారిని నియమించి, యట్టివారికి విజయదశమికి యౌవరాజ్యాభిషేకము గావించి, రాజ్యభారము వారిపై నుంచి, విశ్రాంతి గైకొని నిరంతరము భగవచ్చింతతో కాలము గడుప నిశ్చయించినారు. యౌవరాజ్యపట్టమున కధికారనిర్ణయము ప్రకృతుల సమక్షమున జేయు ననూచానాచారము నవలంబించి యీ మహాసభ చేసియున్నారు. పరిష దనుజ్ఞ పొంద మహారాజరాజపరమేశ్వరులు ఇచ్ఛయించుచున్నారు."

దూరభాగములనుండి వచ్చిన సభ్యుల కీ ప్రకటన కొంత యాశ్చర్యము కలిగించినది. వారందరకు హరిహరుడే యువరా జగు నను నిశ్చయభావ మున్నది. మరి ముందుగనే హరిహరదేవుని నామ మెందుకు ప్రకటింపబడలేదు ?

రాజబంధువులలో పలువురకు హరిహరదేవుడు యువరా జగుట సమ్మతము కాదు. అతడు గణపతికి రక్తస్పర్శకల బంధువు కాడు. అట్టి రాజబంధువుల కీ ప్రకటన మెంతయు రుచించెను.

ఒక్క క్షణకాలము సభ నిశ్శబ్దముగా నుండెను. అంతట చాళుక్యవీరభద్రేశ్వరుడు లేచి చక్రవర్తికి మ్రొక్కి యిట్లు విన్నవించెను:

"సార్వభౌములతో మాకు గల సన్నిహితబంధుత్వముచే మేము ముందు మనవి చేయుట సభవారికి సమ్మతమని తలంతుము. మా పుత్రులగు హరిహరదేవరాజులు మహారాజులకు ధర్మశాస్త్రరీత్యా దౌహిత్రులే యగుదురు. పుత్రాభావమున దౌహిత్రుడు పుత్రునంతటివాడు. మా పుత్రులు చిన్ననాటినుండియు చక్రవర్తులను సేవించి వారికి ప్రేమపాత్రులై యఖిలవిద్యలు వారి సన్నిధానముననే అభ్యసించినారు. సర్వవిధముల హరిహరదేవరాజులే యౌవరాజ్యపట్టమును మహారాజానుగ్రహముచే పొందుటకు పాత్రు లని యీ మహాసభాసమక్షమున దేవరవారికి విన్నవించుకొనుచున్నాము. ఈ సభలో నందుకు భిన్నమగు చింత యుండదని తలంతుము."

వీరభద్రేశ్వరుని మాటలు విని సభయంతయు జలదరించి నిశ్శబ్దముగా నుండెను. అతడు నిర్వచించినది ధర్మము కాదని ప్రత్యాఖ్యానము చేయ నెవ్వరికి సాధ్యము కాకపోయెను. ప్రతాపరుద్రదేవులు జన్మించువరకు భవిష్యత్ప్రభువు హరిహరదేవ రాజే యగు నని మంత్రిసామంతమండలము భావించుచుండినదియు వాస్తవమే. కాని ముమ్మడయ్యకుమారుడు జన్మించినదాది గణపతిదేవుల యూహలో కలిగిన మార్పు మహామాత్యులకు తెలియును. ఐతే చక్రవర్తుల యభీప్సిత మీ మహాసభలో నెట్లు సమర్థించుటెట్లు ? అందును వారికెట్టి యవకాశము లేకుండ ముందుగనే వీరభద్రేశ్వరుడు ధర్మప్రస్తావముకూడ చేయుటచే వారి ప్రయత్నము మరింత క్లిష్టతరమయ్యెను. ప్రతాపరుద్రదేవుని వారసత్వము ధర్మబద్ధ మని నిరూపించు టెట్లు ? దుహితృదౌహిత్రునకి ఎక్కడనైనను దాయభాగ ముండునా ? అట్టి వానిని ధర్మవిదులు ఆత్మబంధువులలోనైన నుదాహరించిరా ? మహామాత్యు లొకరి మొగము లొకరు చూచుకొనిరి.

మహాప్రధాని గోవిందనాయకుని చూపందుకొని మరియొక మహాప్రధాని యగు బయ్యననాయకుడు కార్యధరణు డగు దామనామాత్యునివంక జూచెను. దామనామాత్యుడు మహాదేవరాజువంక సార్థకముగా ప్రోత్సహించుచు చూచెను.

మహాదేవరాజు కేవలఖడ్గవాదియే కాని కార్యవాదమునందు నిపుణుడు కాడు. అతని మాట సూటిగా, కొంచెము పెటుసుగా నుండును. ఆ మోటుదనములో గూడ కొంత యాకర్షణ మున్నది. అతని మనస్సులోని అమాయకత్వము వింతయైన నిర్భయత యాతనికి అలవరచెను. మహాదేవరాజు లేచెను. లేచి వెంటనే ముందు విశ్వేశ్వరశంభులకు వందన మాచరించి పిమ్మట గణపతిదేవులకును మహాసభకును మ్రొక్కెను. అంతట నంతకుమునుపే ఎక్కువభాగము వల్లించుకొనియున్న ఉపన్యాస మిట్లు చేసెను.

“ శ్రీమత్ రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీగణపతిదేవచక్రవర్తులకు అపరప్రాణ మగు వారి ఆత్మజాత శ్రీమతిరుద్రమదేవులతో మాకు గల సమీపసంబంధమ్ము పురస్కరించుకొని మేము ఈ మహాసభాసమక్షమున జేయవలసిన విన్నప మున్నది. పూజ్యులగు మా శ్వశురులు శ్రీవీరభద్రేశ్వరులు పల్కిన వాక్యములు మాననీయములే. శ్రీహరిహరదేవరాయలును మా కెంతయు నిష్టులే. మా కుమారులు శ్రీప్రతాపరుద్రదేవుల్ల నటు ఒకమారు తిలకింపుడు ! వారు రుద్రమదేవులకు దౌహిత్రులగుట యేమి? జన్మప్రభృతి రుద్రమదేవులు దత్తపుత్రునిగా గ్రహించి స్వకీయపుత్రునివలెనే పెంచుచున్నారు. దేవరవారును పుత్రనిర్విశేషముగా కటాక్షించుచున్నారు.తద్రీత్యా ప్రతాపరుద్రదేవులే రాజాధిరాజరాజపరమేశ్వరులకు రక్తస్పర్శ కల దౌహిత్రులును ముఖ్యులగువారసులును ఐయున్నారు. చక్రవర్తిశుభలక్షణలక్షితులని జ్యోతిషికులును సాముద్రికులును శాకునికులును జన్మకాలముననే ప్రభువుల సమక్షమున నేకగ్రీవముగా నిర్ణయించినారు. దేవర కిప్పుడు అవ్యవహితముగా దక్షిణపార్శ్వమున శుభాసనాంకితుల జేయుటం ప్రతాపరుద్రదేవులే యువరాజపదవీభాజను లని నిరూపిత మైన దని మనవి చేయుచున్నాము. ”

ఇంత సంగతముగా నాతడు మాట్లాడుట పలువుర కాశ్చర్య మయ్యెను. ఇవి మహాదేవరాజుమాటలేనా ? ఆ మాటలు విన్న సభ్యుల ముఖములలో నశాంతి యించుక వ్యక్తమయ్యెను. ఆసనవీధిలో హరిహరదేవుని దూరమున నుంచి ప్రతాపరుద్రదేవుని చక్రివర్తిపక్షసన్నిధానమున నుంచుటలో దూరార్థము ధ్వనించెను.

చాళుక్యవీరభద్రేశ్వరు డిట్లు ప్రతివచన మొనర్చెను. అతని ముఖమునను కంఠమునను ఎట్టి కలతగాని తొందరగాని స్ఫురింపలేదు. పరమశాంతముగా నుండెను.

“ స్త్రీలు తమ భర్తకు పుత్రు లుండగా స్వయముగా దత్తపుత్రగ్రహణ మొనర్చుట మే మెక్కడను ధర్మజ్ఞులవలన వినియుండలేదు. ఈనాడు మా జామాతలు మహాదేవరాజులుంగారు విశేషధర్మము ప్రవచించుచున్నారు. మా దౌహిత్రులు ప్రతాపరుద్రదేవులు గణపతిదేవుల దౌహిత్రులగుట ఎట్లు? ఇది చక్రవర్తులును ధర్మవిదు లగు నీ సభాసదులును అంగీకరింతురా ? ”

చక్రవర్తి మాటాడలేదు. మహాప్రధాని శ్రీమర్క గోవిందనాయకుడు సభ వారిని అభిప్రాయము తెలుప నర్థించెను.

కోటకేతరాజు వీరభద్రేశ్వరుని మాటలు సమర్థించెను. ఇతడు గణపతిదేవుని మేనగోడ లగు బయ్యలదేవిభర్త. ధరణికోటవాడు. బౌద్ధమతాభిమాని. అట్లే రేచర్ల గణిపిరెడ్డియు, కామిరెడ్డియు వీరభద్రేశ్వరుని వాదము బలపరచిరి. ఆ రెడ్డి వీరు లిరువురును గణపతిదేవుడు దేవగిరిచెరసాలనుండి వచ్చిననాటికి హనుమకొండ రాజ్యమును రక్షించి ప్రభువు కప్పగించి కాకతిరాజ్యభారధౌరేయు డని యన్వర్థ నామము వహించిన ప్రఖ్యాతరుద్రసేనాని వంశమువారలు. వారల కా సభలో గౌరవము కలదు.

మహాప్రధాని యగు బయ్యనవాయకుడును, మేచయనాయకుడును, తిక్కచమూపతియు, ప్రోలరౌతును, సివిరి అన్నయమంత్రియు, పర్వతనాయకుడును, ఆదిదమ్మయు, వల్లనాయకుడును మరికొందరును మహాదేవరాజుపక్షము వహించిరి.

అంతట వీరభల్లటదేశికు లను జైనాచార్యు లిట్లు వాక్రుచ్చిరి.

"ఈ యిరుపక్షములను పలువురు మాట్లాడినారు. కాని శ్రీ వీరభద్రేశ్వరులు నిర్వచించిన ధర్మము నిందు ఖండించినవా రొక్కరును లేరు. శ్రీహరిహరదేవరాయలు చక్రవర్తు లగు శ్రీగణపతిదేవులకు ధర్మశాస్త్రరీత్యా దౌహిత్రులు, నందుచే ముఖ్యమగు వారసులు నగుదురు. శ్రీ రుద్రమదేవులు అంతకంటె సన్నిహితులే యైనను నిర్బీజాలగు స్త్రీలకు రాజ్యపరిపాలనాధికారము లేనందున ఆమె జ్యేష్ఠపుత్రు లగు శ్రీ హరిహరదేవరాయలే యౌవరాజ్యపదవికి యోగ్యు లనుటకు మా కెట్టి సందియమును లేదు. శ్రీ ప్రతాపరుద్రదేవులతో శ్రీ గణపతిదేవులకు గల రక్తస్పర్శరీత్యా పుత్రనిర్విశేషముగా ప్రేమించి పెంచుట సహజమే. కాని వారికి రాజ్యాధికారము సంక్రమింపజేయుట కేవలము ఆత్మేచ్ఛచే చేయవలసినదికాని ధర్మనిర్దేశమున జేయునది కానేరదు. ప్రేమపాశములను ప్రభువులు ధర్మపాశముచే బంధించి యమించుట రాజనీతి."

ఇంత విస్పష్టముగా నా జైనాచార్యులు వివరింపగా మహాదేవరాజుముఖము కోపముతో నెఱ్ఱవారెను. దేహ మంతయు కంపించెను. ఏదో మాటాడబోయెను గాని నోట మాట పెకలిరాలేదు.

మహాప్రధాని శ్రీమర్క గోవిందనాయకుడు జైనాచార్యుల వాక్యములలోని సూక్ష్మము గ్రహించెను. కాని అతని వాక్యతీవ్రత సహింపలేకపోయెను. బయ్యనవాయకుడు, మేచయనాయకుడు, తిక్కచమూపతి, ప్రోలరౌతు, పర్వతనాయకుడు, ఆదిదమ్మ, వల్లనాయకుడు ఇత్యాదు లుద్రిక్తులై అప్రయత్నముగా ఒరలలో నున్న తమ ఖడ్గముల పిడులపై చేతు లుంచి లేవబోవుచుగూడ తాము రాజసభాముఖమున నున్నది జ్ఞప్తికి తెచ్చుకొని ప్రయత్నపూర్వకముగా చేతులు దింపి శ్రీగణపతిదేవుల వంకను రుద్రమదేవివంకను విధేయదృష్టులతో దిలకించిరి.

'రుద్రమదేవికి ఒకవంక భర్తపక్షము, మరియొకవంక తన ప్రియదౌహిత్రునికై వాదించు నల్లుని పక్షము! ఒకవంక గౌరవము, రెండవవంక ప్రేమ, — ఈ రెండు

భావములను ఆమెహృదయములో మహాయుద్ధము చేయుచుండెను. ఐనను ఆమెకు మనోభావములు పొంగనీయకుండుట చిరతరాభ్యస్తమైనందున శాంతముగా చిరునవ్వు విడువని ముఖముతో నిర్లిప్తముగా గాన్పించెను.

వృద్ధులును వ్యాధిగ్రస్తులును నగు గణపతిదేవులు మాత్రము వెనుకటి యాత్మసంయమనము కనబరచలేకపోయిరి. ఆయనముఖమున నొక్కసారిగా రక్తము పరుగెత్తెను. అందుపై దేహ మొక్కించుక కంపించెను. సమీపవర్తులగు సేవకు లౌషధ మొకటి త్రావించిరి. ఐనను ఆతని కన్నులు చంద్రనిప్పులవలె కణకణ లాడుచుండెను.

కార్యధిరణు డగు దామనామాత్యుడు సభాస్థితి సూక్ష్మముగా గ్రహించి యిట్లనెను.

“శ్రీ వీరభల్లటదేశికులును పూజ్యులే. ఐనను ఈ మహాసభలో శ్రీవిశ్వేశ్వర శంభుదేశికులును మరియు నిందరు పెద్దలును ఉండగా, వా రొక్కరే ధర్మవేదులైనట్లు పల్కిన తీవ్రవాక్యములు సహించుట కష్టతరముగా నున్నది.”

ఇట్లనుచు నాతడు శ్రీరాజగురువులవంకకు ప్రత్యేకాహూతులై చేరిన పండితబృందమువంకను నిర్దేశించెను.

అంతట మహాప్రధానులు గోవిందనాయక బయ్యనాయకులును, తిక్కచమూపతియు, మేచయనాయకాదులును పరిపరివిధముల శ్రీవీరభల్లటదేశికుల వాక్పారుష్యమును ఖండించిరి. గణపతిదేవచక్రవర్తులు శాంతించి నిట్టూర్పు విడిచిరి.

మహాప్రధానులును బలవంతులగు నితరముఖ్యసభాసదులు పలువురును అంతరంగములలో మహాదేవరాజ పక్షపాతులుగా నున్నారని వీరభద్రేశ్వరునకు విదితమయ్యెను. అతని కది ఉద్వేగము కలిగించి భరింపజాలక యిట్లనెను.

“శ్రీ వీరభల్లటదేశికుల ధర్మదీక్ష మన మందర మెరిగినదే. వారి వాక్యములు తీక్ష్ణముగా నున్నవని యిందరు వచించుచున్నారు. కాని వారు చేసిన ధర్మనిర్ణయమును ఖండించినవా రొక్కరు నీ సభలో లేరు. ధర్మము ఖడ్గమువలెనే ఒక్కొక్కచో నిశితమైన దని ధర్మవిదులకు తెలియనిది కాదు. కార్యభగణు లగు శ్రీదామనామాత్యులు ఈ సభలో ధర్మవేదులు శ్రీవీరభల్లటదేశికు లొక్కరే కారని సెల విచ్చినారు. నిజమే! రాజగురువులు శ్రీవిశ్వేశ్వరశంభుదేశికులు ప్రత్యక్షముగా నుండగా, వారి నిర్ణయమైనను ఈ సభవారికిని శ్రీచక్రవర్తులకును సమ్మతముగా నుండదా? ఈవిషయమున ధర్మనిర్ణయము చేయుటకే సభాముఖమున శ్రీవిశ్వేశ్వరశంభుదేశికుల నర్థించుచున్నాము!”

దానితో సభ ఒక్కసారిగా మూగవారిపోయినది. వా రేమి సెల విత్తురో యని సభవా రందరు సంశయభయోద్వేగములతో నుద్రిక్తులైరి.

ఈ విశ్వేశ్వరశంభువులకు చోళమాళవరాజులు శిష్యులు. ఆ మహానుభావుడు కలచురిరాజునకు దీక్షాగురువు. శ్రీ గణపతిదేవు లా తపస్విని నిజజనకునిగా భావించి తండ్రి యనియే సంబోధింతురు. వా రాయనకు వెలినాడువిషయములో కంద్రవాటి యందు కృష్ణానదీదక్షిణతీరమున మందడ మను గ్రామము నగ్రహారముగా సమ

వక్షస్థలమున బంగారు పొది...
మాలయు మనోజ్ఞముగా విరాజిల్లుచు...
మును విపులమును నగు వారి శరీరము ...

శ్రీవీరభద్రేశ్వరుడు వారిని ధర్మనిర్ణ...
యీ సభలో కొంచెము గుసగుసలు ఎక్కు...
వులు వెంటనే ప్రత్యుత్తరమీయలేదు. కతిపయ...
లైనట్లు కనిపించిరి. అంతలో వారు రత్నకంకణములు
మొక్కింత యెత్తిరి. అంతలో సభ మరల నిశ్శబ్దమయ్యెను.
ధీరగంభీరవాక్కులతో వారిట్లు సెలవిచ్చిరి.

"మేము మౌనము వహించి యీ మహాసభ దర్శించి మా...
లగు గణపతిదేవచక్రవర్తులను యథావరాజ్యపట్టభద్రులుగ...
యుంటిమి. మా కిట్లని నిర్దేశించు నిచ్ఛలేదు. కాని శివాజ్ఞచే శ్రీగణ...
మా పేరెత్తి నిర్ణయింప నర్థించినారు. అందుచే మేమిక మౌనము వహించుట...
కాని యవస్థ కలిగినది.

"ఇది రాజబంధువులకును మహాప్రధానులకును దండనాయకులకును సామంతుల
కును అభిప్రాయభేదము లుండదగిన సమయము కాదు. సమయధర్మము విశేషమైనది.
అదియు బహుసూక్ష్మతరము !

"ఇటు వీరభద్రేశ్వరులును అటు శ్రీమహాదేవరాజులును శ్రీమురారిదేవుల
వల్ల నేరదా సన్నిహితబాంధవ్య మున్న దని స్ఫురించుచున్నది! [illegible]
సించి వీరావతారమై ప్రత్యక్షముగా పరమసింహాసనముతో శ్రీగణపతిదేవ
చక్రవర్తుల దక్షపార్శ్వము నలంకరించి శ్రీరుద్రమదేవి శ్రీరుద్రదేవమహారాజులుగా
మూర్తికొంతమై మా కన్నులకు పొడకట్టుచున్నది. ఈ సభవారికి ఎందుకు తోచ
కున్నదో మరి!"

పలితమైన శ్రీగణపతిదేవచక్రవర్తి ముఖమునుండి హిమాచలముపై ఉదయిం
చిన చంద్రరేఖవలె నొక చిరునవ్వు ద్యోతమయ్యెను.

నమామ యగు జాయపనాయకునకు నాశీర్వదించెను.

గా సువర్ణరత్నాక్షతలు పంచి పెట్టెను. నించి సభకు నమస్కరించెను. వేదవిదులు తుడు ఆశీర్వచనములు చెప్పుచుండగా సభ్యులు రుద్రదేవమహారాజుపై జల్లిరి. కాని శ్రీ వీరభద్రే రయు నక్షత లామెపై బడలేదు.

శ్రీ మల్ల గోవిందనాయక బయ్యననాయకులు జ్యోతిషికుని లోచించి శ్రీ రాజగురువులతోడను మహారాజుతోడను కొంత నంతట శ్రీ మల్ల గోవిందనాయకుడు మహారాజుల శాసన మిట్లు ప్రక

పటినుండి శ్రీ గణపతిదేవచక్రవర్తులకు ప్రతినిధిగా శ్రీ రుద్రదేవమహా శరన్నవరాత్రపూజలు నిర్వర్తించి విజయదశమినాడు యౌవరాజ్యాభి షేకము పొందెదరు. ఆనాటి సాయంతనము సామంతులును, మండలేశ్వరులును, దండ నాథులును యువరాజపూజకు పేరోలగమున సమావేశము కావలెనని పెద్దల నిర్ణయ మైన దని శ్రీ రాజపరమేశ్వరులు శాసించుచున్నారు."

"శివాజ్ఞ!" యని రాజగురువులు మహేశ్వరస్మరణ చేసిరి.

వెంటనే చక్రవర్తి యనుమతితో నగరి గోపురద్వారమునొద్ద కూడిన జనసమూహ ములకీ వార్త రాజదూత ఉత్సాహముతో ప్రకటించెను. నగరివాకిట జనుల జయ జయనినాదములు మిన్నుముట్టెను.

ఉదయమునుండి త న్నాచ్ఛాదించిన మేఘముల తెర చీల్చుకొని భాస్కరుడు సముజ్జ్వలముగా ప్రకాశించెను.

వెంటనే రాజశాసనము వార్తాహరులు ఏకశిలానగరము వాడవాడల వీథివీథుల ప్రకటించిరి. అఖండసామంతమండలేశ్వరు లందరు విధిగా విజయదశమికి పూర్వమే

రాజధానీనగరమున సమావేశము కావలె నను శాసనమును ఆహ్వానమును శీఘ్రవార్తాహరులగు నాశ్వికులు గ్రహించి వెడలిపోయిరి.

సభవా రందరు శ్రీవిశ్వేశ్వరశంభుదేశికుల ధర్మజ్ఞసమయమును వేనోళ్ళ శ్లాఘింపసాగిరి. పరమేశ్వరానుగ్రహము గలవారికిగాని సిద్ధవాక్కులు లభ్యమగునా?- ఎన్నిగ్రంథములు తిరుగవేసినా మనుకొన్న నేమి లాభము!

ఆ మహాకోలాహలములో వీరభద్రేశ్వరులును హరిహరదేవరాయలునుగాని, మహాదేవరాజులు గాని, ఏ మనుకొనుచుండిరో కూడ గమనించినవారు లేకపోయిరి. శ్రీవీరభల్లటదేశికుల ముఖము విన్న నయ్యెను. ఆ సభలో వాగ్బంధమై ఆయన చిత్తరువులోని బొమ్మవలె నిలిచిపోయెను.

# 3

సభానంతరమున శ్రీ రుద్రమదేవి యాత్మమందిరమునకు ప్రయాణమయ్యెను. దారిపొడుగున నందరు "శ్రీరుద్రదేవమహారాజా, జయ!" అని ఆమెకు జయాభినందనములు చేయుచుండిరి. ఆమె సవినయముగా తలయొగ్గి వారల జయశబ్దములు స్వీకరించుచు కన్నులలో చిరునవ్వువెన్నెలలు ప్రతిఫలింపజేయుచుండెను. ఆమె మందిరము చేరగనే మందిరపాలకులుకూడ నట్లే జయజయనాదము లొనర్చిరి. చెలికత్తెలు మంగళారార్తికము లొసంగి దృష్టితీసిరి. దాసదాసీజనమును వృద్ధకంచుకులును ఆమెచుట్టు చేరి ప్రీతిపురస్సరముగా నామెను బహువిధముల బ్రశంసింపసాగిరి. ఆమె పరమశాంతముగా నాదరముతో నందరి యభినందనము లందుకొనుచుండెను. ఆ సందడి చీకటిపడువరకు దగ్గలేదు.

దీపములు వెలిగించువేళ కామె యేకాంతమందిరమునకు విశ్రాంతికై చేరెను. పరిచారిక యొక్కతె యామె ధరించిన పురుషవస్త్రము లూడ్చి స్త్రీజనోచితమగు వలువలు ధరింపజేసి తొలగిచనెను.

వెంటనే రుద్రమదేవి నిలువున మారిపోయెను. రాజసభలో మహావీరసమాజమున వీరాధివీరావతారముగా కనిపించిన దీ మూర్తియేనా? వేషముతోపాటు స్వభావముకూడ మారిపోవునా? ఇప్పు డామె దీనముగా శయ్యపై మేనువాల్చెను. అచ్చట నామె కాంతరంగికురా లగు రుయ్యాంబమాత్ర ముండెను.

రుద్రమదేవి నానా దందరు నభినందించిరి. కాని యామె యాంతరంగికురా లగు నీ రుయ్యాంబ యొక్కతెమాత్రి మభినందింపలేదు. ఆమె పదునారేండ్ల యువతి. నిండుయౌవనములో నున్న యామెముఖమున విశిష్టమైన పూర్ణత యొకటి గోచరించుచుండెను. ఆమెకు పసితనముననే తల్లి గతించినది. ఆమెతండ్రి రుద్రాంబికకు విలువిద్య నేర్పిన ఆచార్యుడు. రెండేళ్ళకే ఆ పిల్లకు అసహాయస్థితి సంభవించి

నది. రుద్రమదేవి కిది తెలియగానే తండ్రి యనుమతితో దానిని తన పుత్రికగా స్వీక రించినది. అప్పటినుండి యామెను తన పుత్రికకంటె ప్రేమాతిశయముతో పెంచినది. కొలదికాలమునకే యా బాలికతండ్రికూడ కాలధర్మము నొందుటచే వారి యను బంధము దృఢతర మయ్యెను. ఆ బ్రాహ్మణబాలికకు రుద్రాంబయే తల్లియు, తండ్రియు. వారిమధ్య వ్యవహారము లన్నియు తల్లికూతుండ్రవలెనే జరుగు చుండెను. రుయ్యాంబ బుద్ధి మిక్కిలి సూక్ష్మమైనందున సమస్తవిద్యలు శీఘ్ర ముగా నభ్యసించుటయేకాక రుద్రమకును అంతఃపుర జనముల కందరకును ప్రీతిగౌరవ భాజన మయ్యెను.

రుద్రమ వ్రాలిన శయ్యసమీపముగా నున్న యాసనముపై రుయ్యమ్మ కూర్చుండి రుద్రమవంక తదేకదృష్టితో చూచుచుండెను. రుద్రమ కనులు మూసియే యుండెను. కాని ఆ మూసియున్న రుద్రమకన్నులలోనికిగూడ రుయ్యమ్మదృష్టి కాంతులు ప్రసరించుచున్నట్లుండెను.

ఇంతలో రుద్రమ పెదవులు కదలెను. కన్నులుమాత్ర మింకను మూసికొనియే యుండెను.

"అమ్మాయీ, నీవు నాకు జయాభినందనము చేయలే దేమి ?"

"అందరూ చేసిరిగదమ్మా ! "

"అమ్మాయీ, నా కానందముగా లేదు!"

"నీ కానందముగా లేనిదానికి నే నెట్లు జయజయనినాదము చేయగలనే తల్లీ?"

"నన్నొక్కసారి కౌగిలించుకో !"

రుయ్యాంబ రుద్రమదేవి వక్షఃస్థలముపై తన శిరస్సుంచి రెండుచేతుల నామె శిరస్సును పొదివెను.

"అమ్మా! నీకన్నుల నీరు రానీయకు, నే చూడలేనే !"

రుద్రమదేవి నెమ్మదిగా తన కనుగొలుకులలోని ముత్యాలు తుడిచికొనుచు కనురెప్పలు విప్పెను. మరల రుయ్యాంబ యడిగెను.

"అమ్మా, నీగుండెలు జలయంత్రమువలె ఇట్లు కొట్టుకొనుచున్న వేమే ?"

"జరిగిన దంతయు నీ వెరుగుదువా ?"

"రాణివాసము సోరణగండ్లనుండి సభాస్థానము నంతయు శ్రద్ధగా చూచితిని ."

."కాపుసాని నీ పక్క నున్నదా ?"

"ఉన్నది. శ్రీవిశ్వేశ్వరశంభుదేశికులు నిర్వచించువరకు కాపుసానికిని నావలెనే గుండెలు దడదడలాడుచుండెను. వారి వాక్కులు వినగానే ఆ ముడుతలుపడ్డ కాపుసానిముఖము ఒక్కసారిగా వికసించినది. అప్పు డామె చిన్నతనములో ఎంత అందముగా ఉండెడిదో కొంత ఊహింపగలిగితిని. "

"అమ్మాయీ, మరి నీకో ?"

"ఎందుకమ్మా, నా నోట చెప్పించుట ? నీ వూహించలేవటమ్మా ?"

"కాదు నీనోటనే వినవలె నమ్మాయీ !"

"అయితే సరే, శ్రీవిశ్వేశ్వరశంభువుల వాక్కులు వినగానే, నా గుండెలాగి పోయినవి—కొంతసేపు నిలువుమాపు పడ్డవి. ?రల భూదేవులు ఆశీర్వచనమునకు ఉపక్రమించుచు చేసిన ప్రణవోచ్చారణముతో నా సర్వాంగము నుప్పొంగ?యినది— అమ్మా, ఐనను శ్రీవీరభద్రేశ్వరులు వదలిన అక్షతలు నీ శిరస్సుపై పడకున్నచో నా కానందము కలిగియుండేదే !"

"అమ్మాయీ, అదికూడా నీకళ్ళబడినదా?"

"కామసాని కళ్ళలోకూడా పడినది. ఆమె కోపావేశముతో ఒళ్ళువడకినది."

"మరి, నీకో ?"

"ఎందుకమ్మా, ఇంత వాచ్యముగా నానోట అనిపించుచున్నావు ?—నాకు దిగులుతో గుండెలు జారినవి."

"కామసానిని ఒకసారి పిలిపించగలవా ?"

రుయ్యమ్మ పరుగెత్తుకొని పోయి కామసానిని పిలుచుకొని వచ్చెను.

కామసాని ఎనుబదేళ్ళవృద్ధ. ఆమె రుద్రమ పితల్లులగు నారాంబ పేరాంబలతో కృష్ణాముఖద్వామండలి కోయిల్వారునుండి దాసిగా చెలికత్తెగా చేటికగా వచ్చెను. నారామ, పేరమలకు జాయపనాయకుడు సోదరుడు. వారల తండ్రి పినచోడినాయకుడు కోయిల్వారుసాలకుడై యుండ గణపతిదేవు డాతని తన దిగ్విజయయాత్రలో జయించి, కూతుండ్ర నిరువుర పెండ్లియాడి, జాయపనాయకునికి తన గజసైన్యాధ్యక్ష పదవి యొసంగెను. పేరమను సోమ? యనికూడ నందురు.

కామసానియే రుద్రమదేవి దాది. ఆమె చర్మము పండి ఎండిన మామిడిపండువలె ముడుతలుపడి యుండును. ఆమె కనుబొమ్మలలోని కండ లెండినందున వాని చర్మము కన్నులమీదికి తెరలవలె వ్రేలాడుచుండెను. ఆమె తల ఎత్తినప్పుడు లోపల లోతుగా నున్న చిన్న కన్నులు మిణుగురుపురుగులవలె మిలమిలలాడి యాకర్షించును. ఆమె నడుములో వార్ధకముచే బలహీనమైనను, వంగక ప్రయత్నపూర్వకముగా నిలువబట్టుకొని విరారుగా నిలుచుండును.

ఆమె వచ్చుచునే నిండారు ప్రేమతో రుద్రమదేవి చెక్కుల రెంటిని తన రెండు చేతులతో నువ్వి యా చేతులు తన చెక్కులపై పెట్టుకొని మెటికలు విరుచుకొనెను. అంతట నామె యాదరముతో రుద్రమదేవి వెన్నుక్రింద నొకచేయియు మధ్యముపై రెండవ చేయియు నుంచి లేవదీసి శయ్యపై కూర్చుండ జేసెను. రుద్రమ తనవైపు చూచుటకు వెనుదీయుచున్న దనికూడ గమనింపక పొంగారుచున్న వాత్సల్యముతో తన వార్ధకసహజ మగు వాక్కులు సాగించెను.

"నా కొక్కటే కొరవగా ఉన్నదే యీనాడు! నారాంబా పేరాంబ లీ మహోత్సవము చూడలేకపోయిరే అని దిగులుగా ఉన్నదే తల్లీ! వా రీనాడేగదే వీరప్రసువులై ధన్యలైనారు!"

కామసాని ఒకేతీరున ఉత్సాహవచనము లాడసాగెను. దానితో రుద్రమదేవి యించుక తేరుకొని ముఖము పటముతో తుడిచికొనెను. రుద్రమదేవి నుదుట చెరిగిన తిలకము కల్యాణరేఖగా దిద్ది యలంకరించెను. రేగిన యలకలు సరిచేసెను. పెదవులకును చెక్కులకును అంగరాగ మద్ది చెదరిన హారములు సవరించెను. అంతట నామె మణిదర్పణము తెచ్చి రుద్రమదేవి ముఖముముందుంచి చూచుకొమ్మనెను. రుద్రమ పరాకుగా చూచుకొనుచు ఇట్లనెను.

"దినదినమూ చూచుకొను ముఖములో నే ముందును కామసానీ!"

కామసాని: "రుయ్యమ్మా, రుద్రమ్మ ఎంత అమాయకపు తల్లియో చూచితివమ్మా? — ఇప్పుడీమె మహిషాసురమర్దనార్థ మవతరించిన చండికాదేవివలె తే దటమ్మా?"

రుయ్యమ్మ: "మన రుద్రమ్మ మనస్సు నేడు స్వస్థముగా లేదు."

కామసాని: "నీ పిరికిమందేమైనా పోసినావా యేమి? — ముందు, విషయమేమిటి?"

రుయ్యమ్మ: "శ్రీవీరభద్రేశ్వరుల యాశీర్వచనాక్షతలు అమ్మపై పడలే దని దిగులుపడుచున్నది."

కామసాని: "శ్రీగణపతిదేవచక్రవర్తులయు శ్రీజాయపనాయకులయు ఆశీరక్షతలు తల్లిపై పడినవిగదా?"

రుయ్యమ్మ: "శ్రీ వీరభల్లటదేశికుల యక్షతలుకూడ పడలేదు."

కామసాని: "శ్రీవిశ్వేశ్వరశంభుదేశికుల యాశీర్వచనాక్షతలు అమోఘము లనీ సర్వదోషపరిహారము లనీ చెప్పలేకపోతివా?

రుయ్యమ్మ: "స్త్రీలకు భర్త సాక్షాత్తు పరదైవము కాదా, మరి!"

కామసాని: "పిచ్చిదానా, రుద్రమదేవినికూడా సామాన్యస్త్రీలోకముతోపాటు లెక్కకట్టుచున్నావా? ఆమె గర్భములో ఉన్నప్పుడే గణపతిదేవుని యనంతర చక్రవర్తి పుట్టు నని దైవజ్ఞు లైకకంఠ్యముగా నిర్ణయించిరి. అందరస్త్రీలవలెనే రుద్రమదేవి పెరిగినదా?"

అంతవరకును మౌనముగా రుద్రమదేవి వారి సంభాషణ మాలకించుచుండెను. ఉభయుల వాక్యములును ఆమె అంతరంగములో ప్రతిధ్వనింపగా నామెను బాహ్యాభ్యంతరములలో నా సంవాదము జరుగుచున్నట్లనిపించినది. రుద్రమ ఇప్పుడు అందుకొనినది.

"ఈనాటివరకు వివాహకాలమాదిగా నేను భర్త్రభీష్టమునకు విరుద్ధముగా మనోవాక్కాయముల ప్రవర్తించి యెరుగను. ఈనాడు ఆ మహాసభలో పితృపాదులు చక్రవర్తులు నగు శ్రీగణపతిదేవుల యాజ్ఞకు బద్ధనై యట్లాచరించితిని."

కామసాని : "అంతే కాదు. అది రాజగురువుల యాజ్ఞ ! శివాజ్ఞ ! నీ విధి నీవు నిర్వర్తించితివి."

రుద్రమ : "చాళుక్యరాజేంద్రులు నా చేసిన యవజ్ఞ సహింతురా ?"

కామసాని : "రుద్రమా, నీ విక ముందు మహారాజ్ఞివి, రుద్రదేవమహారాజవు ! చాళుక్యవీరభద్రేశ్వరుడు నీ పాదపద్మారాధకుడు !"

రుద్రమదేవి ఉలిక్కిపడెను. రుయ్యమ యామాటలకు ఆపాదమస్తకము కంపించెను.

రుద్రమదేవి రుయ్యమకు కరసంజ్ఞ చేయగా నామె పసుపుపచ్చని చీనాపటమును తూలికయు నందుకొనెను.

రుద్రమ : "అమ్మాయీ, శ్రీ వీరభద్రేశ్వరులకు నీ వొక లేఖ వ్రాయుము ! మొదలు పెట్టుము !"

రుయ్యమ వేగిరముగా తూలికతో పటముపై చిత్రరచన చేయుచున్నట్లే యక్షరవిన్యాస మొనర్చి చదివి వినిపించెను.

"శ్రీ శ్రీ శ్రీ చాళుక్యవంశవర్ధనులు శ్రీ వీరభద్రేశ్వరులకు ప్రియతనయ రుయ్యాంబ తెలుపుకొను విజ్ఞాపనము—

"ఆపై నేమి వ్రాయను ?"

రుద్రాంబ : "మీ పాదదాసి రుద్రాంబ మీ దర్శనభాగ్యమునకై యనుక్షణము నిరీక్షించుచున్నది."

ఆ మాటలు వినుచు కామసాని ముఖము చిట్లించెను. ఆ మాట లంతలో వ్రాసి రుయ్యాంబ రుద్రమకు వినిపించెను. అది విని రుద్రమ చాలు ననగా రుయ్యమ చేవ్రాలు చేసి ముగించి రుద్రమదేవిచేతి కిచ్చెను.

రుద్రమ చేటికను పిలిపించి బంగారుపళ్ళెరమును అశోకపుష్పగుచ్ఛములును తెప్పించెను. ఆ తెచ్చిన బంగారుపళ్ళెరములో రుద్రమ స్వీయహస్తములతో నా లేఖ యుంచి దాని నశోకపుష్పములతో పూజించి శ్రీ వీరభద్రేశ్వరుల కిచ్చి రమ్మని పంచెను.

చేటిక నటు పంపినవెంటనే యామె పరిచారికలను పలువుర బిలిపించి యొక యున్నతపీఠమును దాని కొక పాదపీఠమును దానియెదుర మొదటి పీఠముకంటె నీచ మగు మరియొక పీఠికయు స్థాపింపజేసెను. దానికి దక్షిణపార్శ్వమున పూజాద్రవ్యములు సమకూర్ప నియోగించెను.

ఇట్లు సమస్తము భర్తృపూజకు సన్నాహ మొనర్చి రుద్రమ భర్తరాకకై ఉత్కంఠతో నిరీక్షించుచుండెను. కామసాని మూతి బిగించి ఏమియు మాట్లాడకుండెను. రుయ్యమ నీలదృక్కులతో రుద్రమను విలోకించుచుండెను.

కామసానికి వీరభద్రేశ్వరుడు వచ్చి శ్రీరుద్రదేవమహారాజు చేయు పాదపూజ యందుకొనునేమో యని భయము ! రుయ్యమకు నాతడు రాడని నిశ్చయభావముతో కూడిన యాందోళనము !

అడుగుల సవ్వడి యేమాత్ర మైనను సంభ్రమముతో రుద్రాంబ తల యెత్తుచు లేవనుంకించుచుండెను. ఆమె పెంపుడు నెమలి ఉపవనమున క్రేంకారము చేయుచుండ రుద్రమ పరధ్యానముతో ఒకటి రెండుమారులు ఉలిక్కిపడెను. "రామ చిలుక పంజరములో, "శివా!—శివా!" యని యరువజొచ్చెను.

రెండు గడియలకు చేటిక తిరిగివచ్చెను. కాని యా రెండుగడియలును ఆ ముప్వురకు రెండు నెలలుగా తోచెను.

అట్లు తిరిగివచ్చిన చేటికయాననములోని దైన్యము గాంచి రుద్రమదేవి గాంభీర్యము వహించెను. చేటిక నమస్కరించి ఇప్పుడు మొగలిపూవులతో నిండియున్న యా బంగారుపళ్ళెరమును రుద్రాంబికముందుంచెను.

రుద్రమ యనుజ్ఞతో రుయ్యమ యందులో నున్న పటపత్రము తీసి ఇట్లని చదివెను.

"అమ్మాయీ, విజయదశమిలోపల దివాణములో అందించవలసిన లెక్కలు సిద్ధముచేయుచు తీరిక లేకున్నాను. విజయదశమినాడు పేరోలగమున శ్రీరుద్రదేవ మహారాజులను వారి పాదపద్మారాధకుడు వీరభద్రేశ్వరుడు దర్శించి విధేయవంత నాదికము లర్పింపగల డని మీ అమ్మగారికి మనవిచేయుము!"

ఆ ఉత్తరము వినుచునే శ్రీరుద్రమదేవి శరీరమంతయు బిగించి నిలువున గూర్చుండెను.

"ఉయ్యాంబా, శ్రీ రుద్రదేవమహారాజుల భావివిధులు శ్రీ వీరభద్రేశ్వరులు చక్కగా సూచించినారు. భావిమహారాజుల సంకల్పములకు భంగ మొదవరాదు. వెంటనే మేము చిత్రించిన శ్రీవీరభద్రేశ్వరుల ప్రతికృతి యా యున్నతాసనముపై పెట్టు తల్లీ!"

రుయ్యాంబ తల్లియాజ్ఞ పాలించెను. అంతట రుద్రమదేవి శయ్యాసనమునుండి లేచి శౌచ మొనరించుకొని యా యున్నతాసనము ముందున్న భద్రపీఠముపై నధివసించి, యచ్చట సేకరింపబడియున్న పూజాద్రవ్యములతో నా పటచిత్రమునం దధ్యస్తుడైయున్న శ్రీ వీరభద్రస్వామిని పూజించెను.

అది యంతయు సంభ్రమాశ్చర్యములతో మౌనమువహించి చూచుచున్న కామసానికి ఆ పటచిత్రములో శ్రీ చాళుక్యవీరభద్రేశ్వరుని యాకారలక్షణము లేవియు కనిపించలేదు. శ్రీ శివావజ్ఞాదూషితదక్షాధ్వరధ్వంసనోద్యతభయంకర వీరభద్రాకారమే యందామెకు ద్యోతమయ్యెను.

శ్రీ రుద్రమదేవియాజ్ఞచే నామె చెప్పిన చాళుక్యవీరభద్రేశ్వర ప్రతికృతి కాక యామెయే చిత్రించిన వీరభద్రావతారచిత్రము తెచ్చిన రుయ్యమకంతేమియు వింత తోచలేదు. రుయ్యమ సద్యస్స్ఫూర్తి యామె యా పట ముంచినంతనే గ్రహించిన రుద్రమదేవికి రుయ్యముపై వాత్సల్యముతోపాటు గౌరవ మాకస్మికముగా నినుమడించెను.

౪

సభానంతరమున శ్రీ చాళుక్యవీరభద్రేశ్వరుడు మౌనముగా నిజమందిరము చేరికొనెను. పెద్దకుమారుడగు హరిహరదేవునిగాని చిన్నవాడగు మురారిదేవునిగాని యతడు పలుకరింపలేదు. దాసదాసీ జనులందరును హరిహరదేవుల పట్టాభిషేకనిర్ధారణవార్త నేడు విని బహూకృతులం బొందుదు మని సముత్సుకులై నిరీక్షించుచుండిరి. ఎన్నాళ్ళుగానో వారా వార్త విందు మని కుతూహలముగా నుండిరి. నేటి కది సిద్ధింపనున్నదని వారికి గలిగిన సంతోషమునకు నంతము లేకుండెను.

వీరభద్రేశ్వరుడు రాకముందే చూచాయగా నిజవార్త వారికి తెలిసినది. కాని వారి యాశ తాము విన్నది నిజమని నమ్మనీయకుండెను. సరిపడనివారు పుట్టించిన ప్రవాద మని వారు సరిపెట్టుకొనుచుండిరి.

వీరభద్రేశ్వరుడు తుదకు వచ్చెను. అతని గంభీరమగు ముఖభంగి చూచి తాము విన్నది నిజమే యని నిశ్చయించుకొని, నిరాశాదృక్కులతో ఎదురువచ్చిన పరిజనులందరు ఎవరిపనిపై వారు వెడలిపోయి తమ నిర్ణీతకార్యములందు అప్రమత్తులై యుండిరి.

వీరభద్రేశ్వరుడు తన ప్రధానకరణముతో ఒక్క అరగడియపాటు ఏకాంతముగా మాట్లాడి యాపిమ్మట శాంతగంభీరవదనముతో ఆరామములోని కేగెను. ముందందులో నాతడు నాటించిన విదేశవృక్షములను పరిశీలించి వాని కవసరము లగు దోహదాదికములు తోటమాలితో సంప్రదించెను. ఆపై నాతడు యథాచారముగా తన పారశీకాశ్వముపై నెక్కి దూరము స్వారిచేసి బాగుగా చీకటిపడినపిమ్మట నిజమందిరము చేరుకొనెను.

అప్పటికే రుద్రాంబ యంపిన పటపత్రిక తెచ్చిన చేటిక యాతనికై వచ్చి నిరీక్షించుచుండి వాకిటనే దర్శించెను. ఆ వేషముతోడనే యాత డా యుత్తర మందుకొని చదువుకొని పూర్వోక్తమగు ప్రత్యుత్తరము వ్రాసి మరల నాపళ్ళెరములో నుంచెను. అప్పుడా పళ్ళెరమందలి యశోకపుష్పము లాతని దృష్టి నాకర్షించెను. ఒక్క క్షణ మాత్ర మాలోచించి తన పరిచారిక నొక్కతెను రమ్మని సంజ్ఞ చేసెను. ముందామె నా యశోకపుష్పములు తన యభ్యంతరమందిరములో నుంచ నియమించి కేతకీపుష్పములు తెమ్మని యాజ్ఞాపించెను. ఆమె యట్లు చేయగా నా తెచ్చిన కేతకీపుష్పములు పది లెక్కించి తన పటపత్రికపై గప్పి యా పళ్ళెరమును రుద్రమదేవికి పంపివేసెను.

అంతట నాతడు స్నానాదిక మాచరించి భోజనము చేసి తన యభ్యంతర మందిరమున నేకాంతముగా కూరుచుండి యేదో ఆలోచింపసాగెను. అతని కప్పుడు మెరపుమెరసిన ట్లొక్కసారిగా తన పూర్వకథ యంతయు స్మృతివీధిలో ప్రసరించెను.

తనది అనాదిగా పవిత్ర మని ప్రసిద్ధిచెందిన చంద్రవంశము. తన పూర్వులు కోసలమునుండి దక్షిణాపథమునకు వచ్చి పల్లవరాజుల జయించి పూర్వపశ్చిమసముద్ర

మధ్యస్థ మగు మధ్యదేశము నేలెను. అతని తండ్రి ఇందుశేఖరనరేశ్వరుడు చిన్న తనమున గతించగా కళింగగాంగరా జగు అనియంకభీముని సేనాపతి యగు జగ్రసాజ కుడు దండెత్తివచ్చి తన జ్ఞాతుల కండగా నిలిచినందున తాను రాజ్యభ్రష్టు డై దేశాంతరగతు డయ్యెను. కతిపయ పరివారముతో నాతి డుత్తరదేశము సంచరించెను. ఆకాలపు అలజడులచే ధ్వంసములైన సంఘారామములు వదలి నిలువ నీడ లేక పరిభ్రమించు బౌద్ధభిక్షువులు పలువు రాతనికి పరిచితు లైరి. ఆతనికి కళింగగాంగులపై ప్రత్యేక ద్వేషముండుటచే తురుష్కుల కొలువులో నాతడు కొన్నాళ్ళు చేరి వారి దండనాథులు ఉత్తరకళింగముపై చేసిన దండయాత్రలలో పాల్గొనెను. కాని అవి లాభము లేకపోయెను. అందువల్ల ముసల్మానులు పలువురితో నాతనికి మైత్రి కలిగెను. వారి యుద్ధపద్ధతులుకూడ కొంత యవగతి మొనర్చుకొనెను. వారితో కొన్నాళ్ళు కలసిమెలసి మెలగినపిమ్మట వారి మతాభిమానము సమస్తబంధములను కోసివేయు ననియు, వారిలో నేను తన మిత్రులుగా సంచరించువారుకూడ వారి అవసరము తీరినపిమ్మట తాను ఇస్లాము నంగీకరింపనిచో తన్నుగూడ త్యజించి శత్రువునుగా పరిగణింతు రనియు గ్రహించెను.

ఎన్నడో తన పూర్వీకు డగు విజయాదిత్యుడు త్రిలోచనపల్లవునితో యుద్ధములో మడియగా, నాతని కుమారుడు విష్ణువర్ధనుడు చళుక్యగిరిపై తపస్సు చేసి నందాభగవతిని తృప్తిగా చేసి సామ్రాజ్యచిహ్నములను బడసి త్రిలోచనపల్లవుని జయించి యాతని కూతు బెండ్లాడి కళింగగాంగాది భూపాలుర వశ మొనర్చుకొని మధ్యదేశమును నిష్కంటకముగా పాలించె నని యాతడు పెద్దలవలన వినియుండెను. తానును మరల నట్లే మహాసామ్రాజ్యమునకు పాలకుడు కావలె నని కలలు గనుచు నా ప్రయత్నములో నుండెను. తన పూర్వీకుడు నందాదేవిసహాయము పొందెను, ఆమె నిజముగా దేవత యైయుండదు. చళుక్యగిరిసమీపమున నొకానొక యాటవిక జాతివారి పురపాలకురాలై యుండును. కానున్న దేవతలు ఈ లోకమునకు దిగివచ్చి వరాహలాంఛనాను లిత్తురా ? నందాదేవి యొక కిరాతేశ్వరి యైయుండును. తా నిప్పుడు కాలానుగుణముగా తురుష్కప్రభువుల నాశ్రయించితి నని సమాధానపెట్టుకొనెను.

తురుష్కుల సాయముపై నమ్మకము పోయినంత మాత్రమున నాతడు బాల్యాదిగా వాంఛించుచున్న సామ్రాజ్యకాంక్ష విడనాడలేదు. అత డంతట దేవగిరిప్రభు వగు జైతుగి నాశ్రయించెను. అప్పటికే గణపతిదేవుడు బంధవిముక్తు డై స్వరాజ్యమును స్థిరపరచుకొనుచు దేవగిరిప్రభువులను గూడ ధిక్కరించు స్థితిలో నుండెను. అట్టి సమయమున దూరదేశపు దేవగిరిప్రభువు నాశ్రయించుటకంటె తూర్పుసముద్రతీరముపై దండయాత్రలు సలుపుచున్న గణపతిదేవు నాశ్రయించుట శ్రేయస్కరమని యాతనికి తోచినది. అంతట నతడు దేవగిరియాదవుల కొలువు వదలి గణపతి నాశ్రయించెను. గణపతిదేవుని దండనాథు డగు కొలని సోమయమంత్రిసహాయముతో తన జ్ఞాతుల బారద్రోలి మరల తన సంస్థానమును సంపాదించుకొనెను. కాని యతడు చిన్ననాటినుండి కన్నకలలు కలలుగానే ఉండిపోయెను. అత డిప్పుడు గణపతిదేవుని మండలేశ్వరులలో చిన్నమండలేశ్వరుడు ! అంతే !

అంతలో శ్రీ రుద్రమదేవిస్వయంవరము వచ్చెను. దానికి గణపతిదేవుడు తనకు గూడ నాహ్వాన మంపెను. అతడప్పటికే యొక చోళరాజపుత్రికను వివాహమై పుత్రులగూడ బడసియుండెను. తన సంస్థానపాలనతో చిన్ననాటి కలలుకూడ నెమ్మదిగా విస్మృతిపథము పట్టుచుండెను. ఆసమయములో వచ్చిన యీ స్వయంవరాహ్వానము అడగియున్న యాతని చిరకాలవాంఛలను ఉద్బుద్ధము లొనర్చెను.

అంతకుముందు చాళుక్యక్షత్రియులు కాకతీయక్షత్రియులతో సంబంధములు చేసి యెరుగరు. ఆంతరంగిక సంభాషణలలో కాకతీయులను గుమ్మడితీగ క్షత్రియులని పరిహసించుచుండెడివారు. కాకతీయుల మూలపురుషుడు గుమ్మడి తీగకు పుట్టిన వాడని యైతిహ్య ముండుటయె దానికి కారణము.

కాని వీరభద్రేశ్వరుడు మిగిలిన చాళుక్యక్షత్రియులవలె నట్టి దురభిమానము కలవాడు కాడు. అతనికి కులభేదమందే అభిమానము లేదు. వర్ణాశ్రమభేదము నిరసించు బౌద్ధభిక్షువులను ముసల్మానుమౌల్వీలను ఎందరినో అతడు చూచియుండెను. వారిలో పలువురు సన్మార్గప్రవర్తకులును, సాధువులును మహానుభావులు నుండిరి. ఈ యగ్రవర్ణములవారిలో నెందరు నీచగుణము గలవారు లేరు! 'కులము ప్రధానమే గుణము లేకున్న ?'

అతని సంపర్కానుభవములచే తరతరములుగా నతని రక్తముతో కలసి వచ్చిన యాత్మకులగౌరవము మాయమైనను, అట్లే అతనికి వచ్చిన ప్రభుత్వకాంక్షమాత్రము పోలేదు. గణపతిదేవుల యాహ్వానము చూడగా నతనికి గలిగిన సంతోషాతిశయము వయస్సులో ఐదేళ్లు చిన్నవానినిగా మార్చివేసెను. ముప్పదియైదేండ్ల ప్రాయము గల యాతడు ముప్పదేళ్ళవానివలె గోచరించెను.

అప్పుడు కాకతీయుల రాజధాని యగు ననుమకొండకు పలువురు రాజపుత్రులు స్వయంవరమున కాహూతులై యరుదెంచిరి. వారిలో చోళులు గాంగులు కదంబులు పల్లవులు చాళుక్యులు కాకతీయులు నుండిరి. వారిలో పలువురకు రుద్రమదేవిని వివాహమాడుట సమ్మతము కాదు. మిగిలిన సంగతు లెట్లున్నను పురుష వేషము ధరించి స్వేచ్ఛగా సంచరించు స్త్రీని వివాహమాడ నే సుక్షత్రియకుమారు డంగీకరించును ? అందులో నామె చక్రవర్తిసుపుత్రి. అట్టివానికి రాజజామాతయంటె హీనమగు నవస్థపట్టును !

చాళుక్యవీరభద్రేశ్వరుడు వారల మనోగతులు శీఘ్రముగా గ్రహించెను. దానితో నతని యుత్సాహ మెక్కు వయ్యెను. గణపతిసామ్రాజ్యమున కంతటికిని తాను ప్రభువు కగుచున్నా నని భావించెను. గణపతిదేవునకు పుత్రులు లేరు. తాను కాకున్న తన కుమారుడైనను తప్పక సామ్రాజ్యాధీశుడు కాగల డనియు చాళుక్య వంశప్రతిభ మరల నొకసారి దేదీప్యమానముగా వెలుగు ననియు నతనికి నిశ్చయము కలిగెను. అతని ఊహాసౌధము మిన్నుముట్టెను.

అతడంపించే నా స్వయంవరక్రీడాయుద్ధములలో జిగీషతో పాల్గొనెను. ధనుఃప్రయోగమునను ఖడ్గయుద్ధమునను రుద్రమదేవి మహాచతుర. అయినను వీరభద్రేశ్వరుడు విశేషముగా దేశాటన మొనర్చి బహునిపుణుల ఖడ్గయుద్ధములు తిలకించి

యనేకమార్గము లభ్యసించినవాడగుటచే నొకవిధముగ నాతడు రుద్రమదేవికంటె ఖడ్గసాధనలో చతురతరుడనవచ్చునేమో! కాని యాతనికి వయస్సు మళ్ళుచుండుటచే నతని యంగములలోని చురుకుదనము ఏ కొంచెమో క్షీణోన్ముఖముగా నున్నది. మరి రుద్రమదేవియో, నిండు యౌవనములో నిజేచ్ఛావశవర్తియై యుండు శరీర సౌష్ఠవముతో నలరారుచుండెను. కాని తాను పురుషుడు. ఆమె వనిత. యౌవనములో గురుతరమగు స్తనజఘనభార మాపెకు యుద్ధక్రీడ కాటంకప్రాయముగా నుండెను.

ఆనాడు అనుమకొండలో తనకును రుద్రమదేవికిని జరిగిన క్రీడాఖడ్గయుద్ధ మాతని కన్నుల యెదుట చిత్రితమై యిప్పటికిని కనుపట్టుచున్నది. గణపతిదేవుడును సామంతులును దండనాథులును మండలేశ్వరులును రాజబంధువులును మిక్కిలి ఉత్సుకతతో నా రంగస్థలము నవలోకించుచుండిరి.

ఒకవైపున వీరభద్రేశ్వరుడును మరియొకవైపున రుద్రమదేవియు నా రంగములో ఖడ్గహస్తులై ప్రవేశించిరి. ఇరువురు తమ ఖడ్గములు నియమితపరీక్షాధికారులకు పరీక్ష కప్పగించి మరల గ్రహించిరి. ఇరువురు గణపతిదేవులకును మహాసభకును వీరోచితవందన మాచరించిరి. వారొకరి ముఖము లొకరు చూచుకొనలేదు. ఒకరి దేహభంగి యొకరును ఒకరి ఖడ్గధారణభంగి యొకరును చూచుకొనిరి. రుద్రమది సనాతనాంధ్రవైఖరి. చాళుక్యవీరభద్రేశ్వరునదో, సనాతనవైఖరియేగాని యందొక నవ్యత రుద్రమకు గోచరించెను. ఆనవ్యతపై రుద్రమమనస్సు లగ్నమయ్యెను. ఆమెకు ఆనవ్యతయే కలవరము కలిగించెను. ఇటు తనకును ఆ వీరనారి దృఢప్రాచీనవైఖరి యాందోళనము కలిగించెను.

ఇద్దరి ఖడ్గములును కలసినవి. ఆ కలయికలోననే వీరభద్రేశ్వరుడు దురుసుగా ప్రవర్తించెను. రుద్రమదేవి నిపుణముగా కలిపెను. కొన్ని ఖడ్గభ్రమణము లైనవి. ముమ్మారు మధ్యవర్తులు క్రీడాయుద్ధ మాపి వీరభద్రేశ్వరుని అక్రమమార్గము నిరూపించి యతని సరిదిద్దుకొమ్మనిరి. రుద్రమ చిరునవ్వుతో మధ్యవర్తుల యనుజ్ఞ నిరీక్షించుచుండెను.

"ఇతడింత మూర్ఖముగా క్రీడించుచున్నాడేమి?"

"ఇతడిది క్రీడాయుద్ధముగా నెంచుచున్నట్లు లేదే?"

"నియమోల్లంఘనము చేయుచున్నచో దోష మేమి? ఖడ్గయుద్ధము చెమ్మచెక్కవలె నుండునా?"

ఈవిధముగా ప్రేక్షకులు పరిపరివిధముల వీరభద్రేశ్వరుని యుద్ధమునుగూర్చి పలుకుచుండిరి. కాని యతనికి జయమొందవలె నను కాంక్షయేకాని వేరూహ లేకుండెను.

కొంతవడి రుద్రమ జయించున ట్లుండును. కొంతవడి తాను జయించున ట్లుండును. ఇద్దరును పరిశ్రాంతి నొందిరి. రుద్రమకు కేవల మది క్రీడగా నుండెను. అందుచే నామె కది యొక క్రీడావిశేషముగానే ఉండెను. మరి వీరభద్రేశ్వరునకో! అందులో నాతని జీవితసర్వస్వము కేంద్రీకృతమై యుండెను. ఈ క్రీడాయుద్ధములో

నతడు త్రిగ్గుడు కానిచో జీవించి లాభ మేమి ? ఆ రాత్రియే యత డాత్మహత్య కావించుకొనియుండును. అందుచే నలసిపోయిన యతని యవయవములను అతడు ప్రయత్నపూర్వకముగా ఆత్మాంతరాంతరములనుండి యొక శక్తిని క్షణక్షణ ముద్బుద్ధము చేసికొనుచుండెను. అతడు విదేశములలో నలవరచుకొన్న నైపుణి యచలమగు శ్రీరుద్రమఖడ్గవిద్యయెదుట నేమియు పనికిరాలేదు. అధైర్యము కలిగెను.

వీరభద్రేశ్వరుడు కాలు నిలువద్రొక్కుకొనలేకుండెను. చూచువార కతడు తూలిపడుపోవుచున్న ట్లుండెను. చేయి వడకుచున్న ట్లుండెను. రుద్రమదేవిహస్తమును శరీరమును ఏమరుపాటు లేకుండెను.

ఆ సమయములో వీరభద్రేశ్వరుడు మరల నొకసారి తన యంతరాంతరములలో దాగియున్న యాత్మశక్తిని జగీషచే నుద్బుద్ధ మొనర్చుకొనెను. అతని ఖడ్గాగ్రము నందలి సిందూరము రుద్రమదేవివక్షస్స్థల మంటి రంజిత మొనర్చెను.

చూచువా రది యెట్లు జరిగెనో తెలిసికొనలేకపోయిరి. వారి కన్నులనే వారు నమ్మలేకపోయిరి. వీరభద్రేశ్వరుడు శ్రాంతుడై తూలిపడిపోయెను. రుద్రమదేవి చిరునవ్వుతో నిలిచియే యుండెను. కాని రుద్రమ విజిత యయ్యె ననియు వీరభద్రేశ్వరుడు జయించె ననియు మధ్యవర్తులు ప్రకటించిరి.

ఆప్రకటనతో మరల తనకు తెలివి వచ్చెను. దేహము నెట్లో నిలువరించుకొని గణపతిదేవుల పాదపీఠమునొద్దకు పోయి యాతడు వందన మాచరించెను. యథార్థముగా జయించినది రుద్రమగానే ప్రాకృతులకు గోచరించినది. కాని క్రీడాయుద్ధవిదులకు వీరభద్రేశ్వరుడు జయించె ననుటలో సందేహము లేదు.

ఆపిమ్మట రెండు దినములకు చాపవిద్యాకౌశలపరీక్ష జరిగెను. మరల నందును నట్లే వీరభద్రేశ్వరుడు జయ మందె నని పరీక్షాధికారులు ప్రకటించిరి. అంతట శ్రీ గణపతిదేవుల యనుజ్ఞతో రుద్రమదేవి వీరభద్రేశ్వరుని కంఠమును ఇష్టపూలమాలతో నలంకరించెను. తనకా మహాభ్యుదయక్షణము నేడు ప్రవర్తించుచున్నట్లే తోచెను. అదియు చైత్రశుద్ధదశమి ! తనకే కాక అప్పుడు నది చూచిన వారి కందరకు కాకతిసామ్రాజ్యలక్ష్మియే యతని వరించినట్లు చూపట్టెను.

రాజపుత్రిక తన కంఠసీమను హారముతో నలంకరించినందుకే మాత్రమును అతడు పులకితుడు కాలేదు. కాని యక్కడ కూడిన రాజలోకమంతయు నప్పుడు చేసిన జయఘోష కాతడు పులకితు డయ్యెను !

అప్పటినుండి యాతడు విశేషకాలము రాజధానినగరముననే గడపసాగెను. శీఘ్రముగనే అతడు గణపతిదేవుని కుడిభుజమయ్యెను. సామంతుల కాతనిపై ననూయ కలుగుచుండ వారి నాదరబహుమానములచే నాతడు సత్కరించి యందరి మైత్రి నేర్పుగా సంపాదించుకొనుచుండెను.

రుద్రమదేవివలన నాతనికి ముమ్మడమ్మ యను పుత్రికమాత్రమే కలిగెను. పుత్రసంతానము కలుగు ననునాశ క్షీణించజొచ్చెను. అలసి నాతడు తన సంసారపాలనభారము చిన్నకుమారుడగు మహాదేవుని కప్పగించి స్వేచ్ఛాపరు డగు

హరిహరదేవుని రాజధానీనగరమునకు రప్పించి చక్రవర్తికొలువులో చేర్పించెను. హరిహరదేవుడు రుద్రమను నిజమాతవలె గౌరవించుచు నామెకును గణపతిదేవులకును ప్రజలకును ఇష్టుడయ్యెను. హరిహరదేవుడే గణపతిదేవునియనంతరమున చక్రవర్తి యగు నను భావము అందరికు దృఢపడుచుండెను.

ఇది యంతయు వీరభద్రేశ్వరుని మనోవీధిలో చిత్రపటంపగ వలె భాసించెను. మహారాజ్యకాంక్షతో వంశక్రమాగత మగు తన కులగర్వమునే తాను పరిత్యజించెనే! దేనికై తా నా త్యాగ మొనర్చెనో ఆ ఫలము అనుభవించు సమయ మాసన్న మైనది, నేడు! అది యందుకొనబోవుచుండగా నే డాకస్మికముగా భంగ మైనది!

కాటికి కాళ్ళు చాపుకొనియున్న యొక వృద్ధరాజా ఒకానొక సన్యాసి యాదేశముతో ఒక అబలను సాధనముగా చేసికొని తనకు ప్రాణప్రియ మగుజీవితాదర్శమును భగ్న మొనర్చునా? అతడే అది నమ్మలేకపోయెను.

రుద్రమదేవికి యౌవరాజ్యాభిషేకము చేయుట ప్రస్తుతము హరిహరుని త్రోసివేసి కాలాంతరమున ప్రతాపరుద్రదేవుని చక్రవర్తిని చేయుటకే యని తా నంత మాత్ర మూహింప లేకున్నాడా?

తన కిప్పుడు షష్టిపూర్తి యైనను దేహదార్ఢ్యముగాని బుద్ధికుశలతగాని యేమాత్రము తగ్గలేదు. మహావాహిని నింకను నిపుణతతో నడుపగలడు! రాజ్యతంత్రమును పటుత్వముతో నిర్వహింపగలడు! మరి యిప్పుడు తన కర్తవ్య మేమి?

అతడు నిజమందిరమునకు వచ్చినప్పటినుండియు పరమశాంతముగా ప్రవర్తించుచున్నను, అంతరంగమున తీవ్రముగా యోజించుచుండెను. తన సంకల్పమును వృథ కాకుండ చేయు నుపాయ మేమి? తనకు నిశ్చయముగా సహాయభూతులగు మిత్రులెవరు? తన్ను ప్రతిఘటించు శత్రువు లెవరు? ఈవివాదమున తటస్థు లెవరు? ఉభయుల బలాబలము లెట్లున్నవి?

సభారంగముననె ఇందులో కొన్నివిషయములు స్పష్టమయ్యెను. గణపతిదేవుని రాజ్యప్రారంభకాలమున ఆతని సామ్రాజ్యమూలస్తంభములై నిలిచిన పిల్లలమర్రి రెడ్లకీనాడు ఆస్థానములో నాదరము తగ్గినది. ఇప్పటికి కొంతకాలముగా పద్మనాయకులపై చక్రవర్తిపక్షపాతము అతిశయించినది. పద్మనాయకుల ప్రాపు తనకు ప్రాప్తింపదు. ఈ పిల్లలమర్రి రేచర్ల రెడ్డి దండనాథులు ఉపయోగ పడుదురు. వారు మంచి శూరులు, యోధులు. కాని వారికి వారి పూర్వు డగు రుద్రదండనాథుని సమర్థత లేదు.

మరి సభకు రాకున్న అన్నయమంత్రియు కొలని రుద్రుడునో? ఆ బ్రాహ్మణులపై నాశ పెట్టుకొనరాదు. వారు ఎంత చదువుకొన్నను పూర్వాచారపరాయణులు! ఎంత సమర్థు లైనను ఆశావిహీనులు! మదిరాజు చిత్తచాంచల్యమునే వారు తలదాల్చెదరు.

ఇక ప్రబలులగు కాయస్థసేనానులు జన్నిగదేవుడును, త్రిపురాంతకుడును, అంబదేవుడును ఉన్నారు. వారీ సభకేలనో రాలేదు. వారు రాకుండుటకు

కారణమునుగూడ తెలిపియుండలేదు. ముదుసలిరాజును వారిపై నాగ్రహ మంకురించినది. వారును ఏదో ఉద్దేశము లేక యిట్లు కారణము తెలుపక రాకుందురు. వారు చారులవలన రాజధానిరహస్యములను దెలిసికొని సమయానుకూలముగా ప్రవర్తింపనెంచియుందురు. వారి యాశలతో తన యాశలు ప్రతిఘటింపకుండునట్లు చూడవలెను. అది దుర్ఘటము !

కాని యిప్పుడు కర్తవ్య మేమి?

పూజ్యుడగు వీరభల్లటదేశికునికి సభాముఖమున ఆనాడు తనకారణమున పరాభవమైనది. పాపము, న్యాయ మాడిన యా మహానుభావునికి రాజసభలో అవమానమా? ఆయనను విస్తారగౌరవముతో రాజధానిలో జైను లందరు పూజించుచుండిరి. రాజధానిలోనె కాక రాజ్య మంతటను ప్రాయసకాంద్రు ప్రధానముగా జైనులే. మహారాజుల శైవాభిమానము చాలకాలముగా జైనులకు కష్టము కలిగించుచున్నది. కాని వారి యసమ్మతి యాగ్రహముగా రూపొందుటకు ఇంతవరకు నవకాశము కలుగలేదు. ఈ అవకాశము పురస్కరించుకొని ప్రాయసకాంద్రలో రాజకార్యములపై ద్వేషము కలిగించిన దండనాథులందరు కలసియు నేమియు జేయజాలరు. అందులో ఈ పద్మ నాయకులకు చాలమందికి కత్తి పట్టుటయే తెలియునుగాని గంటము మొదలేదియో తుద యేదియోకూడ తెలియదు. ప్రాయసకాంద్రను తానుకూడగట్టుకొనుట ప్రథమకర్తవ్యము.

ఇదిగాక రాజ్యమునకు వెలుపల ఒకవైపున చోళులు, ఒకవైపున కొప్పెరుంజింగడు, ఒకవైపున దేవగిరియాదవులు, ఒకవైపున కళింగులు నున్నారు. వీ రెవ్వరైనను కాకతీయరాజ్యమును మ్రింగుటకు కుతూహలముతో నున్నవారే!

శ్రీవీరభద్రరాజు నిద్రించుటకు బోయినట్లే శయనమందిరము ప్రవేశించెను. కొంతవడి యందుండి కుడ్యమున వ్రేలుచున్న గణపతిదేవుల చిత్రపట మొకటి యించుక ఎత్తి యొక మెట్టు నొక్కెను. వెంటనే యొక లోహపుతలుపు ప్రక్కకు పోయి దారిచేసెను. అతడు లోనికి బోయి మరియొక మెట్టు నొక్కగా నా పటము క్రిందగోడ యథాప్రకారము మూసికొనెను.

అత డా దారిని కొంత దవ్వేగి యొక రహస్యాగారమును జేరెను. అది విశాలమైనది కాకున్నను పాతికమంది సుఖముగా కూరుచుండుట కనువుగానుండెను. అచ్చట గాలి బాగుగా నాడకున్నను ఉడ్డుకుడుచుకొనునట్లు లేదు. వెలుతురుమాత్రము దివిటీలవలన పుష్కలముగా నున్నది.

అతడు వెళ్ళునప్పటికే పలువు రందు సమావిష్టులై యుండి యాతని రాకకై నిరీక్షించుచుండిరి. అందులో పిల్లలమర్రిరెడ్లు ముఖ్యులు. రేచర్ల కామయ, నామయ, మల్లయ యను సోదరులును, గణపిరెడ్డి మల్రెడ్డి యను సోదరులును కలరు. రాజబంధువులలో గణపతిదేవుని మేనగోడలి పెనిమిటి ధాన్యకటకవాసి యగు కోట కేతరాజు ఒక్కడే యచట కలడు. అనెగొందిపాలకుడు రామదేవరాయలును ఆ చేరినవారిలో నుండెను.

వీరభద్రరాజు "బొల్లా !" యని పిలిచినంతనే మైలారు భటు డొకడు ప్రత్యక్షమై "స్వామీ, ఏమి యాజ్ఞ? " అని యడిగెను.

"వీరభల్లటదేశికులకు రమ్మని విజ్ఞప్తి చేయలేదా ?"

"వారి రాత్రి విశేషానుష్ఠాన మున్న దని సెలవిచ్చిరి."

"మంచిది !"

ఎవరును గుసగుసలుకూడ నాడుటలేదు. చేరినవా రందరికి మనస్సులు ఉద్విగ్నములై యుండెను. ముందు వారందరు ఖడ్గములు ఒరలలోనుండి ఒక్కసారి బయటికి తీసిరి. తీసి వాని నన్నిటిని ఏకముఖముగా కలిపిరి. అవి యన్నియు నాలుకలు తెంచిన పాములవలె మెరిసి యేకమై నాగపాశముగా విద్యోతించెను. ఎన్నియో విద్యుల్లతలు ఒక్కచో గలసి యాదరముతో పరస్పర మాలింగనము చేసికొన్నట్లే భాసించెను. అన్నియు కలసి అనేకశిఖల వెలుగుచున్న యగ్నిహోత్రుని మూర్తి వలెనే అవి పొడగట్టెను.

అది నోటితో మాటలు చెప్పని యొక మహాప్రమాణము! శస్త్రజీవులకు వారి శస్త్రమే ప్రత్యక్షదైవము. ఆ ప్రత్యక్షదైవము నెవరిది వా రచ్చో నేకముఖముగా న్యాసముచేసిరి. అందుచే నీవిధముగా కత్తులు కలిపినవారు మరల తిరిగిపో మనియు నొకరికొకరము ఆ ప్తమిత్రులముగా నుందు మనియు తీవ్రమగు ప్రమాణము చేసి రన్న మాట ! ఈ ప్రమాణము చేసినతరువాత నా సభారహస్యము బయటికి పోరాదు. అందులో నెవరైన నే కారణముచేనైని వెనుకంజ వేసిరేనియు ఈ రహస్యము రహస్యముగనే యుండితీరును !

అంతట సంభాషణముప్రారంభమయ్యెను. నూతను డగు నొక విచిత్రపురుషుడా సంభాషణ మారంభించెను. ఆతడు చాలకాలమునుండి పశ్చిమపు సరిహద్దును గ్రామములలో పర్యటించుచుండెను. అతని పే రెవరికి దెలియదు. అతడు మహాభక్తుడు, మహాయోగి, సకలధర్మవేత్త, మహాతపస్వి యని ప్రజలలో నమ్మకముండెను. అతనికి వేదశాస్త్రములే గాక యంతకంటెక్షుణ్ణముగా జైనబౌద్ధగ్రంథములును కొరానును బైబిలునుకూడ వచ్చునని ప్రతీతి.

ఆ సభ రాత్రి మూడుజాములవరకు సాగెను. తెలుగుసామ్రాజ్యమును నాలుగు వైపులనుండి ముంచివేయుటకు విజృంభించుచున్న నాలుగు సేనావాహినులకును యథాశక్తిగా చేయూత యిచ్చుటకు ఆ రహస్యసభలో నిర్ధారణ జరిగినది. అందులో వారు ఎవ రెవరే కార్యము సాధింపవలెనో విభజించుకొనిరి. ఇట్లు వచ్చెడి శత్రువాహినులకు ఎదురులేకుండుటకు రాజధానినగరమునను కల్లోలములు ప్రేరేచుటకును నిశ్చయించిరి.

ముంచు కార్యభార మూనుటకు ఉగ్రరూత లూగినవారు పిల్లలమర్రిరెడ్లు. వారు కొప్పెరుంజింగని కూతగా నుండ నియ్యకొనిరి. కోటకేతరాజును రామదేవరాయలును చోళసైన్యములకు సహాయము చేయుట కొప్పుకొనిరి. కళింగబలములకు మురారి దేవుడు తోడుగా నంగీకరించెను. హరిహరదేవుడు దేవగిరి కేగ నియమితు డయ్యెను.

వీరభద్రేశ్వరుడు స్వయముగా రాజధానీనగరమున నుండి నూతనవిచిత్రపురుషునితోడను పైనామాత్యులతోడను అంతఃకలహములు రేపు పాలు పంచుకొనెను.

ఆ సభావసానమున ఆ మహాలయామావాస్యాపరరాత్రవేళ అచటకూడినవీరులందరు కాకతీయసామ్రాజ్యమున కంతటికి శ్రీహరిహరదేవరాయలను మహారాజుగా చేసి యతని యాజ్ఞలకు విధేయులై యుండుటకుప్రతిజ్ఞలు ప్రమాణపూర్వకముగా నొనర్చిరి.

అజ్ఞాతకులగోత్రనాము డగు నా నూతనమహాయోగి బొల్ల డందిచ్చినజలములతో నాతనికి పట్టాభిషేక మొనర్చెను. ఆత డప్పు డుచ్చరించిన మంత్రములును అతని సమస్తచర్యలవలెనే అభినవములు. ఆ అభినవత్వములో నొక చిత్రశక్తి ద్యోతమయ్యెను. హరిహరదేవరాయ జయజయ! యను శబ్దములతో నా రహస్యసభ ముగిసెను.

## ౩

"అవుఅవ మందు నెట్టని చంద్రవల్లెల
చోద్యంపు గుండాలు చొచ్చువారు,
కరవాఁడియలుఁగుల గనపపాఁతర్లలో
నుట్టిచేరులు కోసి యిఱుకువారు,
గాలంపుఁగొంకిఁ గంకాళచర్మము గ్రుచ్చి
యుడువీథి నుయ్యేల లూఁగువారు,
కటి కయోనాళంబు గండకత్తెర వట్టి
మిసిమింతులును గాక మ్రింగువారు,
పందులను నారసంబులు సలుపువారు,
యెడను కుడి చేత నారతు లిచ్చువారు,
సాహసము మూర్తి గైకొన్న సరణివారు,
ధీరహృదయులు మైలారువీరభటులు."

—క్రీడాభిరామము

శరన్నవరాత్రములు ప్రారంభమైనవి.

భరతభూమిని భగతరాజులే పాలించు దినములలో శరన్నవరాత్రములకంటె జగన్మోహనమగు నుత్సవము మరొక్కటి లేదు. ఆ తొమ్మిది దినములును ప్రకృతియే దివ్యరూపముల నవతరించి పూజలు స్వీకరించును. శారదారూపములో శృంగారమూర్తి ప్రధానమో, వీరరేఖ ప్రధానమో, అద్భుతము ప్రధానమో, శాంతమే ప్రధానమో ఎవరు నిర్వచింపగలరు? నవరసములకు నధిష్ఠానమగు నా మహామాయ నేమని వర్ణింతుము! ఉపనీతులుగూడ గాని విద్యార్థిబాలకులే చేతుల విండ్లు నంబులు పూని

వీరచున్మ ధావతారములవలె వాడవాడల సంచరింతురే! తారకసంహారమున కీరూపము తోడనే కుమారుడు బయలుదేరెనా?

ఏకశిలానగరముచుట్టును పుట్టకోట కలదు. దానికి లోపల రాతికోట యొకటి కట్టింపవలె నని స్థపతులతో జరుగుచున్న యాలోచన లింకను కార్యరూపమున బరిణమింపలేదు.

పట్టణమునం దంతటిలోకన్న వెలిపాలెములో నవరాత్రోత్సవ మెక్కువ సందడిగా ప్రారంభమయ్యెను. తప్పెటల రుంజల మ్రోతతో చెవులు గింగురు మనుచుండెను. ఆవేశపూరితులై మైలారుభటులు బొబ్బలు పెట్టుచుండిరి. వారి వీరావేశము చూడవలసినదేకాని వర్ణింప శక్యము కాదు. భక్తిపారవశ్యముతో బాటు వారల యుదరములలో నిండిన మద్యము వారికి సంపూర్ణముగా దేహభ్రాంతి పోగొట్టినది. ఒకడు దండచేతులమీద కొరడాతో కొట్టుకొనగా, నతని చర్మము చిట్లి రక్తబిందు వులు చెమర్చుచుండెను. అట్లే యాశీ డావందమున గంతులు వేయుచుండెను. మరి యొకడు రెండు బుగ్గలలో రెండు నారసములు గ్రుచ్చుకొని ఠీవిగా నూగుచు నృత్యము చేయుచుండెను. మరియొకడు మండుచున్న కర్పూరఖండములు రెండు తన రెండర చేతులలో ఆధారములేకుండ పెట్టుకొని యవి వెలుగుచుండ జయజయ నినాదములు చేయుచుండెను. ఇంకొకడు మండుచున్న దీపములే వత్తులతో మ్రింగివేయుచుండెను. కొందరు కణకణలాడు నగ్నికుండములలో దుమికి ముందుకు సాగిపోవుచుండిరి. వారు చేయు కేకలును బొబ్బలును మైలారుదేవుని మహత్త్వమునే ఘోషించుచుండెను.

అంతలో నందొక మైలారుభటున కావేశము హెచ్చినది. అతడు ఎందరుపట్టినను ఆగువట్లు లేదు. "ఏమి టీగోల, బొల్లా?" అని ప్రక్కవాడడుగగా ఆ అడిగిన వారి నాతడు తన్నివైచెను. కొందరు చెంపలు వేసికొని "అపరాధము మైలారుదేవా, నీ కేమి కావలె చెప్పుస్వామీ!" అని ప్రార్థింపసాగిరి.

ఆ మాటలకు బొల్లడు బుసలుకొట్ట నారంభించెను. నా రాతనికి గుగ్గిలపు ధూపము వేసి మైలారుదేవుని పరిపరివిధముల ప్రార్థింపమొదలిడిరి. ప్రార్థించిన కొలదియు బుస లెక్కువయ్యెను. తుద కాతడు గోజుము దేవత పూని చెప్పిన వాక్యము లిట్లు నెమ్మదిగా చెప్పజొచ్చెను.

"నాకు తపనగా—ఉన్నది—తపన!—ఆడది—నన్ను ముట్టితే—ఊరులో లేదు—ఆడస్పర్శ—తపన!—నాకు పనికిరాదు—"

"ఏమో అంటు సోకినదట స్వామికి!"

"ఏమి సోకినది?"

"ఆడస్పర్శ ఏమిటి? ఇక్కడ ఆడంగు లెవరూ లేరే!"

పరిపరివిధముల జనముల మాటలు చెలరేగినవి. చివరకు కొంద రడిగినారు.

"ఏమి అపరాధము జరిగింది స్వామీ నీకు? ఎక్కడ జరిగింది అంటు?"

బొల్లడు ఊగుతూ శివముతో చెప్పినాడు.

"ఒళ్ళంతా తపనగా ఉన్నది. మండిపోతున్నది!"

చుట్టుప్రక్కలవారు కడవలతో నీళ్ళందుకొని వానిపై గ్రుమ్మరించినారు. కాని దానితో మంట చల్లారిన ట్లగపడలేదు. ఆ అంటు శుద్ధి ఐనట్లు తోచలేదు. బొల్లడు అరవసాగినాడు.

"ఆడస్వప్న — నేను —— భరించను —— నేనీ ఆడమళయాళంలో ఉండను! ఆడమళయాళం !———"

అప్పుడా ఆడస్వప్నస్వరూపము యూగినవారికి కొంత లీలగా అవగత మైనది. చుట్టుప్రక్కల నున్నవారు ఆ మాటలకు గడగడలాడిపోయిరి. ఒకవంక మైలారుదేవుని భయము! మరొకవంక ఎందుకు ఏమగునుందు రాజభటుల భయము! అంతకుముందే రుద్రమదేవి యీనాడు నవరాత్రదీక్ష ప్రారంభింపనున్న దని నగర మంతట చాటింపు జరిగియుండెను. ప్రభువుల యాజ్ఞలు ధిక్కరించి మాటాడువారి కెట్టి శిక్ష యుండునో అంద రెరుగుదురు. నగరమంతటను చక్రవర్తిగూఢచారు లెల్ల వేళల సంచరించుచుందు రని కూడ జగద్విదితమే.

ఇట్లే కొంతసేపు బొల్లని యలజడి సాగినది. అంతలో మరియొకవైపునుండి కాకతిదేవతకొలుపుకు మరియొక గుంపు ఊరేగుచు బోవుచుండెను. ఆ గుంపులో పోవువారు మరియొకవిధముగా వీరమార్గమున కాకతిదేవతను కొలుచుచు నూరేగు చుండిరి.

ఆ ఊరేగింపుకు ముందుభాగమున నొక మాతంగకన్యక మద్యపూర్ణకుంభమును ధరించి సాగుచుండెను. ఆ కుంభము పచ్చని యాకులతోడను ఎర్రని పూలతోడను సర్వాంగసుందరముగా నలంకరింపబడియుండెను. పాలసముద్రమునుండి యిప్పుడే యవతరించిన వారుణీదేవతయా యిది యనిపించుచున్న దా కలశహస్తయగు మాతంగ కన్య! ఆ కన్యక ముందుకు పోవుచుండ నామె యడుగులకు మడుగు లొత్తుచుండిరి. ఆమెయు నడచిపోవుచుండలేదు. అదె యొక నృత్యము చేయుచుండెను. ఒక చిందు త్రొక్కుచుండెను.

ఆమెకు ఒకప్రక్కను శకటముపై సిడిపోతు వచ్చుచుండెను. ఉన్నతమైన సిడికోలచివర గ్రుచ్చబడిన యా మేకపోతు కాకతి దేవతధ్వజ స్తంభమువలె కనిపించు చున్నది. అదిగాక బలికై ఎన్నియో మేకపోతులను, కొన్ని మహిషములను ఆ గుంపు లోనివారు తీసికొనిపోవుచుండిరి. ఆ గుంపులోని జనుల చేతులలో విస్తారముగా వేప మండలు కలవు. వారు చల్లుచున్న పసుపుకుంకుమలు భూనభోంతరమును హారిద్రా కుంకుమాంకితము చేయుచుండెను.

కాకతిశక్తి కాకతీయప్రభువుల కులదేవత. అట్లగుటచే నా దేవత పూజోత్సవ ములు అసాధారణవైభవముతో జరుగుచుండెను. ఆ దేవాలయమునకును ఆదాయ మెక్కువ. ఆ కొలుపుకు పోవు జనసమూహములుకూడ మైలారుభటులకంటె నధిక సంఖ్యాకులు. మైలారుభటుల యరుపులు ఉరుములవలె నుండ, కాకతివీరుల కేకలు పిడుగులవలెనే వినిపించుచుండెను.

కాకతి వీరులలో గండడు అనువానికి శివము పూనినది. కాని యతని శివము బొల్లని శివమువలె లేదు. ఇతనిది ఆనందతన్మయత. గండడు కనపడ్డవారినెల్ల వికటాట్ట హాసముతో కౌగిలించుకొనును. ఆ యాలింగనములో స్త్రీపురుషవిచక్షణ లేదు. అత డాలింగనము చేసికొనగా పలువురు స్త్రీలు కెవ్వున కేకవేసి యతడు వదలగానే పక పక నవ్వుచు తొలగుచుండిరి. అత డానందబాష్పములు కార్చును. పెద్దలు కనపడిన నట్టివారికి పాదము లంటి మ్రొక్కును. విరామము లేకుండ జయజయనినాదములు చేయును. అతనితోపాటు ఆ జనసమూహమంతయు జయజయనినాదములు చేయ నారంభించెను.

ఆ రెండు ఊరేగింపులును ఒక చతుష్పథములో తారసిల్లినవి. మైలారుభటు లును కాకతిశాక్తవీరులును ఎప్పుడట్లు తారసిల్లినను సంఘర్షణ రాకుండుట యరుదు. విద్యుత్తు పుట్టినట్లే. ప్రాణాగ్ని సంయోగముచే శబ్దము పుట్టినట్లే.

బొల్లడు "ఆడసోకు సోకినది" అనుచు మహాతపనతో కేకలు వేయ నారంభిం చెను. ఆ మాట చెవి సోకినంతనే అంతవరకు ఆనందమూర్తివలె నున్న గండడు ఒక్క సారిగా భైరవమూర్తిగా మారిపోయెను. అతడు విజృంభించి శివశక్తివలె బొల్లని మీదికి లంఘించెను.

"జయ జయ రుద్రదేవమహారాజ! జయ కాకతమ్మతల్లీ జయ!" అని బొబ్బలు పెట్టుచు పోయి గండడు బొల్లని రొమ్ములో బలముగా తన్నెను.

ఆ తాపుతో బొల్లని యావేశ మొక్కసారిగా నణగి యాతడు పడిపోయెను. మైలారుదేవున కపరాధ మైన దనుచు సింహనాదములతో మిగిలిన మైలారుభటులు మూగిరి. కాని గండ డది లెక్కచేయక క్రింద పడిన బొల్లనిపై కెక్కి కాల చేతుల మట్టగింపసాగెను.

ఇంత యాకస్మికముగా గండడు విజృంభించినందున నొక్క క్షణకాల మందరు నిర్విణ్ణులై యాగిపోయిరి. బొల్లడుకూడ నిశ్చేష్టు డయ్యెను.

కాని మరియొక నిమేషములో స్థితిగతులు మారిపోయెను. క్రింద పడిన బొల్లడు సందు చూచి, పైనున్న గండని వదలించుకొనుటకు తీవ్రప్రయత్నము చేయుచు నాతని కాలుచేతుల గ్రుచ్చసాగెను. మరియు నందినచోట గఱచుచు కొరుకు చుండెను.

గండని లాగివేయుటకు మైలారుభటులు పలువురు మూగగా వారిపై కాకతి వీరులు కవిసి కొట్టసాగిరి. అటు మైలారుభటులును ఇటు కాకతివీరులును నై ఉభయ పక్షములకు మల్లయుద్ధము ప్రారంభమయ్యెను.

ఆ కొట్లాట అంతకంతకు తీవ్ర మగుచుండెను. ఇంతవరకును మల్లయుద్ధమే సాగుచుండెను. ఉభయదేవతల కొలుపులకు నుపయోగించు కత్తులు బల్లెములు తోమర ములు గదలు నా యూరేగింపులో కలవు. వాని ప్రయోగ మింకను ప్రారంభింప లేదు. ఆ రాజమార్గములో నా కొట్లాట తీవ్రమై ఆయుధప్రయోగమున నుభయపక్ష

ములం నుద్యోగించు సమయ మాసన్నమైనది. పరిస్థితి యిట్లు విషమమై ఘోరముగా పరిణమించు స్థితిలో నుండెను.

అంతలో నాకస్మికముగా రాజభటుల శంఖారావములు బోరుకలగెను. ఆ వచ్చుచున్న రాజభటులను గాంచి రెండుగుంపులును చెల్లాచెద రయ్యెను.

ఏకశిలానగరపాలకు డగు మేచయనాయకుడే స్వయముగా నశ్వారూఢుడై యచ్చట ప్రత్యక్షమయ్యెను. ఆ నాయకుని జూచినంతనే పారిపోయినవారు పోగా, తప్పించుకొన వీలులేని మిగిలిన రెండు గుంపులవారిలోని కొలదిమందియు ప్రక్కల కొదిగి గడగడలాడుచు నక్కి మాటలాడ సాహసింపకుండిరి.

పైన ఇంత జరుగుచున్నను ఆ పోట్లాటకు మూలకారకు లగు బొల్లనికిని గండని కిని అది ఎక్కలేదు. పైవారు తొలగుటచే వారికి స్వేచ్ఛగా పోరాడుకొను తెరపి చిక్కినది. ఇద్దరును బలశాలులే. ఇద్దరును మల్లయుద్ధవిశారదులే. ఏకశిలానగరమందలి మేటిమల్లులు వా రిద్దరే! పూర్వము వా రెన్నిమారులో మల్లరంగములో తమ మల్ల యుద్ధప్రవీణత ప్రభువులకు ప్రదర్శించియుండిరి. వారిలో బొల్లనికి బల మెక్కువ; గండనికి చురుకుదన మెక్కువ. ఒక్కొక్కతరి వారిలో నొక్కొక్కడు జయశాలి యగుచుండెను. వారి స్పర్థ యీనాటిది కాదు!

కాని ఈనాడు వారిద్దరికి ప్రవృత్తమైన మల్లయుద్ధము రంగస్థలమున జరుగు యుద్ధమువంటిది కాదు. దీనికి నియమములు లేవు. మధ్యవర్తులు లేరు. అందినచోట అందినట్లు వైరిని కొట్టుటయే. వారిద్దరు సమపగు నుద్దీ లయినను ప్రథమములో గండ నికి ప్రాప్తించిన పైచేయి యతడు వదలుకొనలేదు. పైన క్రమ్మినవారు ఇప్పుడు దూరమగుటతో నా యవకాశము నాతడు పోనీక గట్టిగా నిలుపుకొనసాగెను. అతని దేహము గంట్లుపడి నెత్తురు కారుచుండెను. ఐనను అది లెక్కచేయక నాగసర్ప మును ఒడిసిపట్టిన ముంగిసవలె బొల్లనిమాత్ర మతడు లేవనీయక బాధించుచుండెను.

"గండా!"

అది మేచయనాయకుని కంఠము! నాయకుడు గుర్రముపైనుండి దిగనైనలేదు. ఎట్టి యాందోళనమును అతడు కనబరచలేదు. శాంతముగా దృఢముగా స్వచ్ఛముగా అధికారికముగా నా రెండక్షరములు నాత డుచ్చరించెను.

ఆ కంఠస్వనము చెవులబడినంతనే గండడు మంత్రముగ్ధునివలె గడగడలాడుచు బొల్లని విడిచి లేచి నిలుచుండి వినయవిధేయతలతో నాయకునికి వందనము చేసెను.

క్రిందపడియున్న బొల్లనికి నాయకుని గొంతు వినిపించలేదు. రాజభటుల రాకయే అతనికి తెలియదు. అనుకొనకుండగా తన కా తెరపి ఎట్లు చిక్కెనోకూడ తెలియలేదు. కాని యా తెరపి చిక్కినదే వ్యవధానముగ నతడు రోషముతో లేచి గండని గొంతు పట్టుకొన నుప్పించెను. అప్పటి కాతడు గండడు కదలక ఎవరికో వందనము చేయుచుండుట గమనించి తల యటు త్రిప్పబోవుచుండెను. మేచయ నాయకుని కొరడా యాతని వీపున బడి చురుక్కుమన్నది. బొల్లని కావేశ మెక్కి యా దెబ్బ కొట్టినవానిపై విజృంభింప నెనుదిరిగెను. వెంటనే యతని కొరడాదెబ్బ

కంటె తీక్ష్ణమగు మేచయనాయకుని దృష్టి వానిపై ప్రసరించెను. దానితో బొల్లడు నిస్తబ్ధుడై వంగి సిగ్గుపడుచు నాయకునికి నమస్కరించెను.

నాయకుడు మరి మాటాడలేదు. అతడు కుడిచేతి తర్జనితో తనవెంట నున్న భటులకు గండని బొల్లని నిర్దేశించి యొక్కింత సంజ్ఞచేసెను. భటు లు తత్క్షణమున బొల్లని గండని బంధించిరి. మిగిలినవారి నెవ్వరిని భటులు ఏమియు చేయలేదు. అది చూచి ధైర్యము తెచ్చుకొని రెండుత్సవములలోని జనమును వగల ఒక్కరొక్కరే నిశ్శబ్దముగా నక్కడ చేరసాగిరి. ఉభయపక్షములవారును వివాదకారణ మావలి వారిపై మోపి చెప్పుట కుంకించుచుండిరి. కాని ఎవ్వరికిని ముందు మాట్లాడుటకు నాయకునిఎదుట నోరు రాలేదు.

“అలజడిచేయక మీ మీ కొలువులు సాగించుకోవలసిన దని నాయకుల యాజ్ఞ!”

ఇట్లని నాయకునివెంట నున్నవారిలో ప్రధానభటు డనుజ్ఞయిచ్చినంతనే ఉభయ పక్షములవారును తాము చెప్పికొనదలచినది చెప్పికొను ప్రయత్నమే మానివేసి నాయకునికి వంగి వంగి దణ్ణములు పెట్టుచు నెమ్మదిగా ఉత్సవములు సాగదీసిరి.

పురములో నలజడి యెచ్చట జరిగినను అది మేచయనాయకుని కండ్లకు కనబడునంతటి దివ్యదృష్టిగలవా డని యాతనికి ప్రతీతి కలదు. పూర్వము పలుమారులు వ్యక్తమైన యాతని దివ్యదృష్టి యీనాడు మరియొకపర్యాయము స్పష్టపడెను. వెనుకటి యనుభవములకు మరియొక యుదాహరణముగా నీనాటి వృత్తాంతము కలసెను.

బొల్లని గండని కారాగృహమునకు బంపి మేచయనాయకు డింకను పురసంచారకుతూహలియై కదలిపోయెను.

## ౬

వసంతర్తువును శరదృతువును మానవులకు యమదంష్ట్రిల వంటివి. ఆ ఋతువులు ఆరంభింపగనే రోగములు విజృంభించును. అందుచే శుభములగోరు మానవులు ఆ రెండు ఋతువుల యారంభములో నవరాత్రదీక్షతో పరదేవతా పూజ చేసి తత్ప్రసాద మందవలెను. అందును శరన్నవరాత్రమహోత్సవము ముఖ్యతరము. ఈ విధి భరత భూమిలో చక్రవర్తు లనాదిగా పరిపాలించుచు వచ్చిరి.

శరత్కాలము జైత్రయాత్రలకును సేనాచలనములకును మిక్కిలి యనువైన సమయము. వర్షర్తు వప్పుడే గతించి ప్రయాణముల కనుకూలించు కాలము సంప్రాప్త మగును. శౌర్యసంపదలతో తులదూగు రాజుల కా కాలము ప్రమదావహము. తా ముద్యమించు కార్యముల కనుకూలింప నాసమయమున నిష్టదేవతార్చన మొనర్తురు. పురుష కారమునకు దైవానుకూల్యము ప్రాపుగానుండినప్పుడే కదా ప్రయత్నములు ఫలించుట!

ఐనను ఈశరన్నవరాత్రములు కేవలము దేవతాపూజావసరములుమాత్రమే యని తలంపరాదు. ఆ సమయమున విధిగా రాజధానీనగరమున సామంతులును మండలేశ్వరులును దండనాథులును మంత్రులును ఉన్నతరాజపురుషులందరును రాజసేవకు సమకూడుదురు. ఈ విధముగా మూలమూలల నున్న పరిపాలకులు నున్నతోద్యోగులు చక్రవర్తిని దర్శించి, కానుక లర్పించి, తమ రాజభక్తి దృఢము చేసికొందురు. అప్పుడే దేశదేశముల పరిస్థితులు చక్రవర్తికి సమగ్రముగా నవగత మగును. మండలేశ్వరులు తాము పాలించు మండలముల లెక్కలు సమర్పించి పరిపాలనావిశేషములు చక్రవర్తికి నివేదింతురు. తమ కష్టసుఖములు తెలిపికొందురు. ఒకచోట కొరతగానున్న సరకులు ఎక్కువగా నున్న ప్రదేశములనుండి తెప్పించు నేర్పాట్లు జరుగును. అధికారుల నొక స్థానమునుండి మరియొక స్థానమునకు మార్పులు చేయుటయు నెక్కువగా నీ సమయముననే జరుగును. సమర్థులకు బహుమతులును, అసమర్థులకు శిక్షలును ఇప్పుడే లభించును. ఈవిధముగా రాజకీయవ్యవహారములకును వివిధప్రాంతముల ఏకీకరణమునకును ఈ ఉత్సవము లుపకరించెడివి.

మరియు నా యుత్సవములలో నొకనాడు సరస్వతీపూజ జరుగును. ఆనాటి దేశమున నన్నియెడల గల మహావిద్వాంసులు కవులు గాయకులు నటులు బహుకళాకుశలురు రాజధానికి మూగి తమతమ విద్యలు ప్రదర్శించి, మహారాజులయు సామంతమండలేశ్వరదండనాథులయు మన్ననలు పడయుచుందురు. అది యానాటితో ప్రారంభమై తుదవరకు కొనసాగును. ఆ వినోదములలో శాస్త్రవాదములు ప్రధానములు. ఆ సభలలో నూతనగ్రంథములు చర్చకు వచ్చును. అప్పటి రాజులు తరచుగా స్వయముగా విద్వాంసులుగా కూడ నుండెడివారు. ఐనను సర్వాధికారము నందుచేరిన పండితులదేకాని, బలవంతు డగు రాజాదికాని, విద్యాహీను లగు సామాన్యప్రజలదికాని కాదు. ఆ విద్వదగ్నిపరీక్షకు నిలిచిన యుత్తమగ్రంథములకే మాన్యత కలిగెడిది. అట్లు నిలిచిన గ్రంథములు శీఘ్రముగా నలుగడల దేశమంతట వ్యాప్తి గాంచెడివి. పూర్వము శీఘ్రగమనమునకు సాధనములు తక్కువ. ఐనను ఉత్కృష్టము లగు నూతనగ్రంథములు ఆసేతుశీతనగమధ్యస్థభూమినంతట విదితములై ఖండనమండనగ్రంథములు కొలదికాలమునకె దేశమంతట ప్రభవించుచుండెను. విద్వత్సభలో నిలిచినగ్రంథమునకే మాన్యతగాని, ధనవంతునో బలవంతునో అధికారినో ఆశ్రయించి ప్రతులు ఎన్ని వ్రాయించినను తుచ్ఛగ్రంథములకు నిలుకడ లేదు. విద్వత్సభ లందువలన పూజార్హములు. అట్టి పూజ్యవిద్వత్సభలు స్వయముగా నెరిగి యట్టివానిలో పాల్గొని నిష్పక్షపాతముగా నడిపించిన ఆద్యాంధ్రకవి వానేమని వర్ణించినాడు?

> "పరమవివేకసౌరభవిభాసితసద్గుణపుంజవారిజో
> త్కరరుచిరంబులై సకలగమ్యసుతీర్థములై మహామనో
> హరసుచరిత్రపావనపయఃపరిపూర్ణము లైన సత్సభాం
> తరసరసీవనంబుల ముదం బొనరం గొనియాడి వేడుకన్."

[6]

అంతేకాదు ! మహాభారత ముత్తమసభాపూజ్యం బని వర్ణించి యందలి పర్వములలో యతిశయము చెప్పుచు మరలమరల సభాపూజ్యమని వర్ణించినాడు.

తొమ్మిదవనాటితో దీక్షాసమాప్తి యగును. ఆనాడాయుధపూజ! వీరులకు వారివారి యాయుధములే ప్రత్యక్ష దైవములు. వాని నానాడు వారు విశేషముగా నర్చింతురు. ఖడ్గినీ శూలినీ చాపినీ పాశినీ అంకుశినీ చక్రిణీ గదినీ శంఖినీ— ఇత్యాదిదేవతలును తత్తన్మంత్రములును పుస్తకములలోకంటె వీరుల హృదయాంతరాళములలో దృఢతరాధిష్ఠితములై యుండెడివి. ఆయుధపూజనాడు వీరజనసమ్ముఖమున వివిధరణప్రదర్శనములు జరుగును. నూతనసాధనములు ప్రాతసాధనముల నూతనప్రయోగములు ప్రదర్శింపబడును.

వీరరసము ప్రజలలో తాండవమాడు నా కాలములో నీ విధముగా దైవపూజ, వినోదము, ప్రయోజనము పరస్పరవిరోధము లేక సామరస్యముతో చెల్లుబడి సాగించుకొనుచుండెను.

ఆ నవరాత్రములలో నాలవనాటికి గాని ఇందులూరి అన్నయమంత్రి ఏకశిలానగరము చేరుకొనలేకపోయెను. అతడు దక్షిణకళింగాధిపతి. వేగివిషయములో నూరవర మాతని రాజధాని. కాకతిసామ్రాజ్యమును కాళింగుల యొత్తిడినుండి యతడే సంరక్షించుచుండెను. ఇతరభాగములలో సామంతులకు రాజభక్తి తగ్గినందున తరుచుగా గణపతిదేవు డాతని రాజధానికి పిలిపించుచుండెను. ఈ రాకపోకలతో నాతడా భాగమును దృఢముగా పరిపాలించు నవకాశము తగ్గిపోవుచుండెను. కాళింగులు సరిహద్దున నున్న చిన్నచిన్న ప్రభువులను నెమ్మదిగా తమ కనుకూలురుగా త్రిప్పుకొనుచుండిరి.

ఇందులూరివంశము పారంపర్యముగా మహామంత్రుల జన్మమునకు నెలవైనది. గణపతిప్రభువు వెలనాటిపై దండయాత్రలు చేయుచున్నప్పుడు అతని యమాత్యులలో నొకరగు ఇందులూరి సోమయమంత్రి కొలనిపుర మను నామాంతరము గల సారసిపురమును ముట్టడించి దాని ప్రభు వగు కేశవనాయకుని జయించెను. తదాదిగా ఇందులూరివారికే కొలనివారను ప్రతాపనామమును సంక్రమించెను.

ఇందులూరివంశములో పుట్టిన మహామాత్యదండనాథులలో నాయకమణి యీ అన్నయమంత్రి. అతడు కేవలము మానుష్యమాత్రు డనుటకే వీలు లేదు. కారణజన్ము డాతడు !

అతని తండ్రి గన్నభూపతి మైలికొలని సోముని కూరిమితమ్ముడు. తల్లి గౌరాంబ. ఆ దంపతు లిరువురు పుత్రార్థులై యున్నయెడ నొకానొకనాడు గ్రామసన్నిధికి యతీంద్రు డొకడు వచ్చి భిక్షాదాన మర్థించెను. ఆమె యథాచారముగా నాతనికి భిక్షము పెట్టబోవుచుండ నాత డది యంగీకరింపక యిట్లనియెను.

"అమ్మా! పరమపవిత్రురాల వగు నిన్ను ఇతరు లగు తల్లులయొద్దవలె సామాన్య భిక్ష యాచించుటకు నేను రాలేదు. నాకు ప్రాప్తించిన దివ్యదృష్టిచే నాకు మరి యొక జన్మము తప్ప దని తెలిసికొంటిని. నాకు దల్లిగా నుండ యోగ్యురా లగు మహా

సాధ్వి కై బహుకాలముగా నన్వేషించుచుంటిని. పలువురు పుణ్యాంగనల దర్శించితిని. నేటికి నిన్ను చూచినంతనే నీ కడుపున బుట్టు భాగ్యము పొందవలె నని యిచ్ఛ జనించినది. ఇది గతజన్మముల సంబంధము. నాకు మాతృభిక్ష పెట్టు, తల్లీ!"

ఆ సాధ్వి యది విని యాశ్చర్యచకితయై వల్లె యనెను. ఆ యతీశ్వరుడును తాను పుత్రుడుగా జన్మించినప్పు డుండబోవు చిహ్నములు ప్రత్యేకముగా వ్రాసి యామె కిచ్చి, యానాడే మంథెనకాళేశ్వరము వోయి యచ్చట సమాధినిష్ఠుడై దేహయాత్ర చాలించెను. ఆ మాసమే గౌరాంబకు నెల తప్పెను. ఆ గర్భశుక్తిముక్తాఫలమే అన్నయమంత్రి యయ్యెను.

"యతి మున్ను చెప్పిన ట్లు
న్నతఘనతంత్రాలికములు నాసము శ్యామా
యతదేహము గౌరకన్నుల
గతి వలపతిగుబ్బపిన్న కంతునిఁ గనియెఁ"!

శివయోగసారము.

అన్నయమంత్రి తన పెదతండ్రికుమారు డగు రుద్రమంత్రిని కొలనివీడులో నధికారిగా నుంచెను. ఈ రుద్రమంత్రి దండనీతిపారగు డగుటయే గాక మహావిద్వాంసు డగుటచే 'వ్యాకరణబ్రహ్మ' యను ప్రతీతి సంపాదించెను. అన్నయకు రుద్రు డపర ప్రాణమే.

రాజధానికి నవరాత్రమహోత్సవములకు జేరెడు విద్వద్బ్రాహ్మణబృందము తరుచుగా అన్నమంత్రి రుద్రమంత్రుల దివాణముల జేరెడువారు. వారి కక్కడ శుచిగా పుష్టుగా సగౌరవముగా నన్నవిశ్రాంతులు లభించును. వారి దివాణములకు అరుదెంచిన యతిగులు నభ్యాగతులు తమ భాగ్యవశమున తమ యింటి కరుదెంచిన నారాయణుని యపరావతారములుగా భావించి యా గృహస్థు లిరువురు నాదరింతురు. వారిరువురును స్వయముగా నెట్టి సహాయ మైనను జేయగల సమర్థులు. మరియు రుద్రమంత్రిసంస్థానమున సమ్మానభాజను డైన విద్వాంసునకు ఏకశిలానగరమున గౌరవాదరములకు కొదువ యుండదు. 'వ్యాకరణబ్రహ్మ' సమ్మాన మొక గీటురాయి, ఒక ఒరవడి!

అందరు ప్రధానమండలేశ్వరులకువలెనే అన్నమంత్రికిని రాజధానీనగరమున ప్రత్యేకమందిర ముండెను. అందు రాజకార్యములు నిర్వహించుటకు అనేకు లగు కరణము లున్న వ్యవహారశాల కలదు. కరణము లనగా వ్రాయసగాండ్రు. వా రప్పుడు విశేషముగా జైనులును స్వర్ణకారులును ఐ ఉండిరి. శాణము పట్టనేర్చిన హస్తములకు గంటము లూనుట చులకనగా నుండెడిది.

భరతభూమిలో అనాదిగా వేదశాస్త్రవిదు లగు బ్రాహ్మణోత్తములు భారత రాజులయొద్ద మంత్రులుగా నుండెడివారు. ఆ యాచారమే చాళుక్యప్రభువుల యొద్దను కొంతవరకు కాకతీయులయొద్దకూడ సాగినది. అందుచే పూర్వాచారపరాయణు లగు బ్రాహ్మణులకుగూడ అమాత్యపదవి మాననీయమే. కాని యట్టివారు వ్రాయసవృత్తిమాత్రము సేవావృత్తిగా పరిగణించి దానిని కొంత నీచముగా భావిం

చెడివారు. ఐనను వేదశాస్త్రాదివిశేషవిద్యలు నేర్వలేని పేదబ్రాహ్మణులు కొందరు అప్పటికి కొంతకాలమునుండి యా వృత్తి విధిలేక యంగీకరింపసాగిరి. అట్టివారు ఆ వృత్తిలో చిరకాలానుభవముగల జైనకరణముల ప్రతిభతో సరితూగలేక వారికి ఒదిగి యుండవలసివచ్చుచుండెను.

అన్నమంత్రిదివాణములో వ్యవహారములు చూచువా రందరుగూడ జైనకరణములే. అతడు విజయదశమిలోపల తనమండలముతెక్కలును వ్యవహారములును చక్రవర్తికి విధిగా అప్పగింపవలసియుండెను. చవితినాటి సాయంత్రమాతడు రాజధానికి వచ్చి ముందు గణపతిదేవసార్వభౌముల దర్శించి తన యనామయవార్త తెలిపి వారి కుశలవార్త యెరింగెను.

పంచమినాడు ఉదయమున అన్నమంత్రిదివాణముమోసాలపై గడియారమున నాలుగు గడియలు కొట్టిరి. అంతకు ముందుగనే యక్కడ మూగుచుండవలసిన కరణములలో నొక్కడును ఆనాడు కనపడలేదు. అది అదృష్టపూర్వము. ఊహింపరానిది! అందులో నాలస్యముగా వచ్చిన తాను తన ప్రధానకరణమునకు అవసరముగా అప్పగించి సిద్ధము చేయింపవలసిన వ్యవహారము లెన్నియో పేరుకొని యున్నవి.

కరణములు సకాలమున రాకపోగా తాను రాజధానీనగరమున బహుకాలము లేని యవకాశముపురస్కరించుకొని వీ రందరు నలసత కలవాటువడినారా? అను తలపుతోడనే యాతని మనస్సులో కోప మంకురించెను. దాని నడచుకొనుటయే కష్టముగా నుండెను. కాని ఒక్కడును రా డేమి? ఈనాడు ఆటవిడుపా? కాదే! ప్రధానకరణము నాగాచారి వినయవిధేయతలు కలవాడే! ఎన్నడు కాలాతిక్రమణము చేసిగాని యలసత అశ్రద్ధ చూపిగాని యెరుగడే!—పాపము జబ్బుగా నున్నాడేమో!

బవిరిసీ డను నాశ్వికభటుని బిలిపించి నాగాచారియింటికి బోయి శీఘ్రముగా బిలిచికొని రమ్మని యాతడు పంపెను. వాడు శీఘ్రముగా తిరిగివచ్చి యాతడింటినుండి యుదయవేళకే బయలు వెడలియుండె నను వార్త తెచ్చెను.

అది విని యా మహామంత్రీశ్వరుడు నిర్ఘాంతపోయెను. ఒక్క కరణముకూడ రాలేదు. పరిచారకులు వచ్చి ఎదుటికి రా సాహసింపక చుట్టుపట్టుల తారటలాడుచుండిరి. ఒకడు ధైర్యముచేసి స్నానముచేయ రమ్మని పిలిచినను నాగాచారికి తొందరపను లప్పగించి వత్తు నని కదలలేదు. దేహము నలంకరింపలేదు.

అంతె యున్నతపదవిలో నున్నను అన్నమంత్రికి వయస్సు పాతికేండ్లేని నున్నవో లేవో. పసితనమునుండియు నాతడు చూపుచు వచ్చిన యసాధారణ మేధచే నాతని కా చిన్నప్రాయముననే వంశక్రమాగత మగు పదవి లభించెను. చామనచాయ శరీరము, ఉన్నతమైన ఫాలనాసములు, చిక్కని మీసములు, సింహమునవలె పచ్చని కన్నులు చిత్రమైన పురుషసింహాకార మాతనికి గూర్చుచుండెను.

అన్నమంత్రికి చిరాకు ఎక్కువైపోయెను. ఎంత మేధావియైనను వయస్సుతోగాని నిబ్బరము అలవడునా? మేధావియైనవానికి చిన్నవయసున కలుగు చిరాకు ఇతరుల చిరాకునకు శతగుణముగా నుండును. అట్టి శతగుణ మగు చిరాకే యాతని

కప్పుడు కలిగెను. ఆ చిరాకు వృద్ధి యగుచుండెను. ఏమి చేయగలడు ? ఒక్క కరణమును రాలేదు ! చిరాకు కాదు. అది కోపమే యయ్యెను. అది క్షణక్షణము లోపల రేగసాగెను. కాని ఎవరిమీద ? అగ్నివలె పుట్టి చెలరేగు కోపమంత యాలోచించునా ? అన్నమంత్రి యిప్పుడు కేవలము క్రోధావతారమై కాన్పించెను. అతని పచ్చని కన్నులలో ఎఱ్ఱని రేఖలు చేరి యచ్చట ఏదో అపూర్వమగు ప్రళయాగ్ని పుట్టినట్లే చూచువారికి భయంకరముగా నుండెను. పరిచారకులు ఎదుట బడ సాహసింపక మూలమూలల నక్కి యడగి యుండిరి.

సరిగా నాతని కోపము మహోజ్జ్వలమై ప్రజ్వలించుచున్న సమయమున నొక సోమపీథి యగ్నులప్పుడే వ్రేల్చి జపాదికము పూర్తిచేసివచ్చిన యులికభస్మాది చిహ్నములతో ఇద్దరఛాత్రుల కైదండతో అన్నమంత్రియెదుట సాక్షాత్కరించెను.

ఆ సోమయాజి నాలుగుమూరల ప్రమాణము కల దీర్ఘకాయుడు. శరీరవర్ణము కొంచెము నలుపుతిరిగిన చాయనచాయ గలిగి మనోజ్ఞముగా నున్నది. కాయబారు శరీర మైనందున పుష్టిపూర్తియైన యాయనదేహము ఏ కొంచెముగనో వంగి యున్నది. అంత వయస్సున్నను ఆ పురుషుని దంతముల స్వచ్ఛకాంతి గాని పటుత్వము గాని ఏ మాత్రము తరగినట్లు లేదు. నిరంతరముగా తాళీదళ సంచారము చేయుటచే గాబోలు, దృష్టిమాత్ర మించుక మందగించి కనురెప్పల మాటిమాటికి నల్లార్పజేయుచుండెను. బాల్యమునుండి సుప్రస్రవాదులు ప్రయోగించుచున్నందుననో గాక ఖడ్గాదిశస్త్రసాధనలు చేసియుండుటచేతనో, ఆయుఖిచేతులు కాయలుకారి యుండెను. ఆయన చెవులకు ధరించిన చిన్న రత్నకుండలములు ముఖముపై క్రొత్త వెన్నెలలు పరపుచుండెను.

ఆయనవెంట వచ్చిన శిష్యులలో పెద్దవానికి ముప్పదై డేండ్లుండును. అతడు చక్కగా దేహపరిశ్రమ చేసినందున కండలుతిరిగి దృఢమై స్థూలమగు దేహము కలవాడు. అందుచే నాతడు విద్యాదికములలోకంటె మల్లయుద్ధాదికములలో నెక్కువ ప్రవీణుడా యనిపించుచున్నది.

రెండవశిష్యుడు బ్రహ్మచారి. అతనికి పదునారేండ్లు దాటలేదు. బంగారు వంటి మైచాయ. ముఖము పాలుగారుచున్నది. అతని మూర్తి శాంతమై బ్రహ్మతేజస్సు పొంగారుచున్నది.

ఆహవనీయ దక్షిణాగ్నుల మధ్యస్థమైన గార్హపత్యాగ్నివలె నా సోమయాజి అన్నమంత్రిదివాణములోనికి వచ్చుచుండగా దౌవారికుడు గాని ఇతరభటులు గాని వారించుటగాని ఆయనరాక అన్నయకు నివేదించుటగాని చేయలేదు. అందరు మంత్రముగ్ధులవలెనే నిలిచియుండిరి. ధనుర్ముక్తమైన శరమువలెనే ఆ సోమయాజి సరాసరి నిశ్చలగమనముతో లోనికి వచ్చి యన్నమంత్రిని సమీపించెను.

కోపదుర్నిరీక్ష్యుడైయున్న యన్నమంత్రికి ఆ సోమయాజిదర్శనము కలలో నుండి లేపినట్లయ్యెను. అకస్మికముగా నాతని ముఖమందలి కోపజ్వాల లదృశ్యమై ప్రసన్న మయ్యెను. కేవలము అగ్నిభట్టారకుడే మూర్తీభవించి యీ రూపమున

ప్రత్యక్ష మయ్యెనా యను భావ మాతని కుదయించినది. కారణజన్ము లైనవారికి కోర్కెలు కూడ లీలలేగదా!

అన్నమంత్రి యాసనమునుండి లేచి సోమయాజికి వందన మాచరించి, "తమ నామధేయము ?" అని ప్రశ్నించెను.

"నన్ను తిక్కనసోమయాజి యందురు!" అని యా సోమయాజి క్లుప్తముగా ప్రత్యుత్తర మిచ్చెను.

# 8

"చతురాననసన్నిభునకు - సతతస్వాహాస్వధాదిశబ్దవ్యసనం
స్కృతహవ్యకవ్యసంత - ర్పితముఖశిఖిముఖనిలింపపితృవర్గునకున్"

దశకుమారచరిత్రము

వెంటనే ఇనుమడించిన యాదరముతో అన్నయదేవుడు సోమయాజి కెదురేగెను.

"క్షంతవ్యుడను ! సొగసైన మీ మీసకట్టు పోవుటచేతను శ్రవణకుండలములచే మీ ముఖమునకు తోడుకూడిన నూతనవర్చస్సుచేతను వెంటనే గుర్తింపలేకపోయినాను."

ఇట్లనుచు చిరునవ్వుతో వికసించిన ముఖముతో అన్నయమంత్రి తిక్కన సోమయాజిని వెంటవచ్చిన శిష్యులను సుఖాసీనుల జేసి బంధుసపర్యలు చేయ బంచెను. తనవెంటవచ్చిన శిష్యులలో పెద్దవానిని గురునాథుడు గను బ్రహ్మచారిని మారన యనియు సోమయాజి అన్నయ కెరుకచేసెను. ఎన్నడో వదలివేసిన సోమ యాజిమీసకట్టును అన్నయ జ్ఞప్తికి దెచ్చినను దానిపై గల వ్యామోహ మాయనకు స్మృతిలోనికి రాలేదు. అందుచే నాయన ఆవిషయమున నెట్టి యుత్తరమును నీయ లేదు. అన్నయమాత్రము కొంత వేడుకతోడను విశేషగౌరవముతోడను, తాను చిన్నతనములో దర్శించిన మహామాత్యస్వరూపము సోమయాజిమూర్తిగా ఎట్లు పరి ణామ మందెనో పరీక్షించుచుండెను.

సోమయాజి ప్రకృతిసిద్ధముగా మితభాషి. సుఖదుఃఖములు లాభాలాభములు జయాపజయములు సమానముగా గ్రహించి తొణకకుండు స్వభావము కలవాడు. స్వప్న ములో హరిహరనాథమూర్తిని దర్శించినదాదిగా ఆ ప్రకృతి దృఢపడినది. పునర్జ న్మము లేకుండజేయు మని ఆ దేవదేవుని దా నర్థించినక్షణమునుండి యందు కధి కారము సంపాదించుకొన దీక్షప్రయత్న మతిశయించినది. మహాభారతాంధ్రీకర ణము సాగుచున్న కొలదియు సోమయాజి కా సాధన ప్రబలము కాసాగినది.

అట్లయినను ఆ మహానుభావుని స్వభావము సమగ్రముగా నెరిగినవారు నేడాయ నను జూచినచో, చింతాశల్య మేదో ఆయనహృదయమును బాధించుచున్నదని ఊహింపలేకపోరు.

అన్నయదేవుడు పదునారేండ్ల యువకుడై యుండగా నొకమారు తన తండ్రిని చూడవచ్చిన తిక్కనామాత్యుని నీ యేకశిలానగరమున నే చూచియుండెను. అప్పుడు తిక్కనతీవ దర్పము జనాకర్షణ అన్నయ నెంతయు ముగ్ధుని జేసి యుండెను. ఈ మేధావి చక్రవర్తియొద్ద మహామాత్యపదవిలో నుండదగినవాడు సామంతప్రాయుఁ డగు మనుమసిద్ధియొద్ద నున్నా డేమి ? అన్నయదేవుని తండ్రి యది తిక్కనకు సూచించియుండెను. కాని తిక్కనకు మనుమసిద్ధిపై వాత్సల్యము చేత నాతని వదలుటకుగాని, బంధుమిత్రాదులు పాదుకొనియున్న నెల్లూరుపరిసరములనుగాని పెన్నానదీతీరమునుగాని వదలి వచ్చుటకుగాని సమ్మతము కాదాయెను.

ఆనాడు అన్నయదేవునికి గలిగిన సందేహము, ఈనాడు తిక్కనసోమయాజి రూపమును జూడగా జూడగా తీరిపోయినది. [ ఈ లోకమందు ఉన్నతపదవులపై వ్యామోహము గలవారికి తృప్తి ఎన్నటికిని చేకూరదు. తృప్తి లేనివానికి సుఖ మెక్కడిది? తిక్కనామాత్యుడు నెల్లూర మంత్రిపదవి వదలి, కాకతీయచక్రవర్తికొలువులో మహామంత్రి యగుట కప్పు డిచ్ఛగింపలేదు. తరువాత నేమి చేసినాడు? నెల్లూర నామంత్రిపదవికూడ విసర్జించి ఈత డీ సోమయాజిపదవి నధిష్ఠించినాడు నేడు ! మనుమసిద్ధి యాస్థానకవిపదము వదలి నేడతడు హరిహరనాథునాస్థానమున మహాకవియైనాడు ! ఈ ప్రభువుపై నభిమానము కలవానికి మహామంత్రిపదవులపై నభిలాష యె ట్లుండును ?

అన్నమంత్రికిని తిక్కనసోమయాజులకును దూరపుబంధుత్వ మున్నది. కాని వారి కెక్కువ పరిచయము లేదు. అందుచే అన్నమంత్రి తిక్కనసోమయాజిహృదయములో శల్యమున్నట్లే తెలిసికొనలేకపోయెను. అదియుగాక నే డాతని నావేశించిన చింతలో ఇతరుల చింతలు తెలిసికొను స్థితిలో నున్నాడా ? పూజ్యుడైన అతిథి తన గృహమును పావనముచేసినందున గలిగిన ఉత్సుకతతో తాత్కాలికముగా గౌరవాదులు చూపుచున్నాడుగాని యన్నమంత్రి తన యప్పటి చిక్కు మరువగలడా ?

ఇక నైదురోజులలో తన లెక్కలను మండలపరిపాలనానివేదికయు సిద్ధము చేయించి యాతడు చక్రవర్తి కప్పగింపవలెను. అవి పంపుటలో ము న్నెన్నడు నన్న దేవుడు ఆలసించి యెరుగడు. అతనికి భ్రమప్రమాదములు నలసతయు నేమాత్రము నిష్టము లేదు. మరి ఒక్క కరణమును ఇంకను రాకున్న నేమి కావలెను? ఇప్పుడేమి చేయవలెను?

తిక్కనసోమయాజులతో మాట్లాడుచునె కరణములు వచ్చిరేమో చూచుటకు రెండుమూడుమారు లాతడు తలయెత్తి ద్వారమువంక చూచెను.

వెంటనే తిక్కనసోమయాజి యా యమాత్యశేఖరు డేదో చిరాకులో నుండి మనస్సులో తొందరపడుచుండె నని గ్రహించెను.

"మహామాత్యా, మీరు పనితొందరలో నున్న సమయమున వచ్చిన ట్లున్నాను. మరొకప్పుడు దర్శనమునకు వత్తునా ?"

పూజ్యుడును వృద్ధబంధువును అగు సోమయాజి చిన్నవా డగు తన్నంత గౌరవముతో సంబోధించుట యన్నమంత్రికి రుచింపలేదు

"అయ్యో! ఎంతమాట! మీబోటి పెద్దలు వచ్చినప్పుడు పనితొందర యేమిటి? నన్ను మీ ఆజ్ఞానువర్తినిగా భావింపవలెను!"

సోమయాజి కన్ను లార్చుచు ప్రశ్నించెను.

"మీ రెవరికొరకో నిరీక్షించుచున్న ట్లున్నారే?"

"నేటితో నైదవనాటికి లెక్కలు నివేదికలు చక్రవర్తికి అందీయవలెను. మా కరణము లందరు నీ నాడు ఒక్కసారిగా పని చాలించుకొన్న ట్లున్నారు! దానికి కారణమును గన్పడుటలేదు. మానము దక్కుట ఎట్లా యని ఆలోచించు చున్నాను. అంతే!"

తిక్కన: "మహామాత్యా!—"

అన్నమంత్రి: మీరు నన్ను "మహామాత్యా' యని సంబోధించుట వింత కలవరము రేపుచున్నది నా అంతరములలో!"

తిక్కన: "మహామాత్యులను మ రేమందును?"

అన్నమంత్రి: "మీ రన్నందుకు కాదు. ఎందరట్లు నన్ను సంబోధించుట లేదు? అట్లు పిలువబడినప్పు డెన్ని మారులు నాకు సంతుష్టి కలిగిఉండలేదు?— కాని మీ రీనాడు నన్నట్లు పిలుచుటచే హృదయములో అశాంతి కలుగుచున్నది."

తిక్కన: "మహాయోగీశ్వరులు మీరు కారణజన్ములై యీ పుట్టువులో మహామంత్రులైనారు!"

అన్నమంత్రి: "మా అమ్మగారు నాపై ప్రేమాతిశయముచే చెప్పు కథ మీ చెవులగూడ బడినదా, స్వామీ? ఈ జన్మములోనే మోక్షము నొందబోవువాడు సర్వసంగపరిత్యాగము చేయక నావలెనే ఈ మహామాత్యపదవీభారము పైన వేసికొనునా?"

తిక్కన: "మహామాత్యా! నాకు చూడగా మహామాత్యపదవి నిర్వహించుట కును మోక్షమున కధికారి యగుటకు విరోధము కనపడదు. కేవలము స్వయం ముక్తుడుకూడ సచివాగ్రణిగా నుండవచ్చును."

అన్నమంత్రి: "పెద్దలు చెప్పునది కా దనుటకు నాకు సాహసము లేకున్నది కాని నా బుద్ధి కది ఎక్కుటలేదు."

తిక్కన: "మహామాత్యా!— శ్రీకృష్ణభగవానుని హృదయములో ఒక్కసారి స్మరించుకొనుడు! ఆ భగవానుడు ధర్మరాజునకు సచివోత్తముడా, కాడా?"

అన్నమంత్రి యొక్క క్షణకాలము ఆలోచనాపరుడై మౌనము వహించెను. ఆ క్షణములో నేదో అతని హృదయమున విద్యుత్తువలె మెరసి మాయమైన ట్లుండెను. మరుక్షణములో చిరునవ్వుతో వికసించిన ముఖముతో సోమయాజిని ప్రశ్నించెను.

"అయితే, శ్రీకృష్ణభగవానులుకూడ నావలెనే—ఎన్నడైనను కార్యభార మున్నపుడు—కరణములు వేళకు రాలేదని కన్నుబున్సు లాడెనా?—"

ఆ మాట లనుచునే అన్నమంత్రి పెద్దలతో నట్లనియుండగూడదేమో యని
విచారించుచుండెను. ఆమాటలు తిక్కనసోమయాజులకు నొప్పి కలిగించునేమో యని
సందేహమును కలిగెను. కాని యందుకు మారుగా తిక్కనసోమయాజుల ముఖము
చిరునవ్వుతో వికసించుటేకాదు. అప్రయత్నముగా ఆయన నవ్వానే నవ్వెను.
ఆ నవ్వులో ఆయనస్వచ్ఛమైన దంతపంక్తి మెరపుతీగవలె మెరసెను. ఆ నవ్వు
దూరముననుండి వినబడిన మేఘఘోషవలె గంభీరముగా శబ్దించెను.

"మహామాత్యా! శ్రీకృష్ణభగవానులు ఇంతకంటెను చిరాకుపడెను. మహా
భారతసమరము ఉపక్రమించినవేళనుండి అది యుపసంహార మగువేళవరకును అను
క్షణము ఆయనపడిన చిరాకు ఉభయపక్షములలో నెవరును పడలేదు! రణము
ప్రారంభింపబోవుచున్నది. పాండవజ్యేష్ఠుడు రథము దిగి పాదచారియై ఎదిరిపైపున
బయలుదేరెను గదా! అప్పుడు శ్రీకృష్ణు డెట్టి చిరాకు చెందియుండును? భీష్ము
బాణములు ఆతని వక్షస్థలము చీల్చివేయగా ఎంత బాధకలుగనిది సుదర్శనము
చేబూని భీష్మునిపై కుప్పించెను? కర్ణుని శక్తి అర్జునునిపై ప్రయోగింపకుండ చేయు
టకు ఎంత అలజడిపడెను? సంశప్తకు లొకమారు ఒక్కపెట్టున అర్జునుని రథముపై
బడగా అర్జునుడు కనిపించకపోగా శ్రీకృష్ణభగవానుడే ఎంత పరితపించెను? వ్యా
భగవానులు భగవానుని లీలల నట్లు ప్రదర్శించుట, మరి ఎందుకు?—"

అన్నమంత్రి: "మహామంత్రుల నుద్బోధించుటకే!"

తిక్కన: "మహామంత్రులనే కాదు, మీబోటి కారణజన్ములను, మాబోటి
వైదికకర్మనిష్ఠులను—సమస్త మానవకోటిని!— సరేగాని మహాభారతప్రసంగముతో
తన్మయత నొంది ముందు చెప్పదలచినది చెప్పలేదు!—"

అన్నమంత్రి: "అదేదో, వెంటనే సెల విండు!"

తిక్కన: "ఏమియు లేదు. కరణములు రాలే దనియే మీ విచార మైనచో వి
రంత చింతింపబనిలేదు. నావెంట వచ్చిన శిష్యులు ఎట్టి కష్టపు లెక్కలైనను సిద్ధ
చేయగలరు. వారికి ప్రస్తుతము పనిలేదు. వారిని మీ రుపయోగించుకొనవచ్చును.

అన్నమంత్రి సోమయాజి వెంట వచ్చిన ఇరువురు శిష్యులవంకను జూచెను
తన యశేషకార్యభారము నీ యిద్దరుశిష్యులును చేయగల రనియే సోమయాజు
తలంచుచున్నారు! పెద్దలతో నా విషయము చెప్పు టెట్లు? వినయముతో వ
మధ్య మాట లాపుచు నన్నయదేవు డుపక్రమించెను.

"మీ మంచిమాటకు మిక్కిలి కృతజ్ఞుడను. కాని—ఇప్పుడు—సిద్ధము చేయ వలసి
లెక్కలు ఒక రిద్దరితో తీరునవి కావు, అధమపక్షము—"

తిక్కన: "ఎందరు కావలె మహామాత్యా?"

అన్నమంత్రి: "అధమపక్షము—మిక్కిలి సమర్థు లైనచో—అధమపక్ష
పాతికమంది గైనను లేనిది కాదు. అనియు గాక వ్రాలించుకొన్నవారు మొద
లెక్క లేస్థితిలో నుంచిరోకదా!"

తిక్కన: "మహామాత్యా, నావెంట నూరుగురుశిష్యు లట్టి సమర్థు లున్నారు. అందులో మీరు కావలసినంతమందిని వినియోగించుకొనుడు!"

ఆమాటలకు అన్నయమంత్రి నిర్ఘాంతపోయెను. అతని మనస్సులో నంత సేపుగా నావరించి యున్న చింతానీహారమొక్కసారిగా విరిసెను. తుష్టుడై నవ్వుచు నిట్లనెను.

"నూరుమంది శిష్యులా, సోమయాజీ? మీరందరును ఏకశిలానగరము పట్టుకొనుటకు దండెత్తి రాలేదుగదా!—అందరును ఈ గురునాథునివంటివారే యైనచో ముందు మీ యందరను రాజభటుల కప్పగింపవలెనేమో!"

గురునాథుడును మారనయు చిరునవ్వు నవ్విరి. తిక్కనసోమయాజి నిట్టూర్పు పుచ్చెను! అయినను స్వకార్యవ్యగ్రతలో అన్నమంత్రికి సోమయాజులకు చింతాశల్య ముండె నని స్ఫురింపలేదు.

అంతట సోమయాజియాదేశమున మారన బయలుదేరిపోయి వారి వసతినుండి పాతికమంది కరణముల బిలిచికొనివచ్చెను. వారు దివాణముముందుకు రాగానే వేద మంత్రములతో సూక్ష్మముగా స్వస్తిచెప్పి యన్నయమంత్రిని ఆశీర్వదించిరి.

ఆకరణముల యుదాత్తతకు అన్న మంత్రి నిర్ఘాంతపోయెను. ఇన్నాళ్ళును తానెరిగిన కరణములు తన్ను సేవించువారు. మరి వీరో, కేవలము వేదమాతృస్వరూపులై తన్ను ఉద్ధరించుటకు వచ్చిన పుణ్యబ్రాహ్మణమూర్తులు. అ ప్రయత్నముగా అన్న మంత్రియే వారికందరను నెదురుపోయి నమస్కరించి లోనికి తెచ్చెను.

తిక్కనసోమయాజి యావచ్చిన కరణములకు వారప్పుడు చేయవలసిన కార్య మాదేశించెను. వా రన్నయదేవునివెంట వ్యవహారపుదివాణములో ప్రవే శించిరి. ఆ మందిరము చెక్కుచెదరక యుండెను. పత్రములు దస్త్రములలో స్పష్ట ముగా కనపడుచున్న ముఖపత్రముల సూచికలతో నన్నియు యథాస్థానములలో నున్నవి. ఆ క్రొత్తకరణములు నిస్తంద్రులై యామందిరము ప్రవేశించిరి. చిరకాల మచ్చట పనిచేయుట కలవాటుపడినవారివలెనే వా రొక్కొక్క స్థానమాక్రమించి పని ప్రారంభించిరి. వీరికి క్రొత్తకూడ లేదేమి?

అన్నదేవునికి పోయిన ప్రాణములు లేచివచ్చిన ట్లయ్యెను. ఇది యంతయు నతనికి కలయా యని విభ్రాంతి కలిగెను. అయితే అత డట్లు ఆశ్చర్యపడుచు నాలోచించుట కాతనికి తీరిక లేదు. శీఘ్రముగా కార్యనిమగ్ను డయ్యెను. అతడు తన పని ఏకాగ్రచిత్తుడై యొక మహాయోగివలెనే చేయసాగెను.

మధ్యాహ్నకాల మతిక్రమించెను. దివాణమున గడియారమున రెండెనిమిదుల ఘంటాఘణత్కారములు మ్రోసెను. అన్నయదేవుడు ఆ ప్రక్కనున్న గదిలో సోమయాజులను వదలివచ్చినసంగతియే మరచిన ట్లుండెను. ఇదిగో వచ్చును, అదిగో వచ్చును అని తిక్కనసోమయాజి యాతనిరాకకై దీర్ఘకాలము నిశ్శబ్దముగా నిరీక్షించెను. గురునాథున కొకవైపునుండి కోపము వచ్చుచుండెను. మారన తన కభిమానమైన మార్కండేయపురాణములోని ఘట్టములు పఠనముచేయుచు నితరము మరచిపోయెను.

తిక్కనసోమయాజికి అన్నమంత్రికార్యవ్యగ్రతకు అచ్చెరువయ్యెను. అత డిక పని తీరనిది రా దని నిశ్చయించి మాధ్యాహ్నికకృత్యములకు వేళ యతిక్రమించు చున్నందున వసతికి బయలుదేరుటకు లేచెను. గురునాథుడును లేచెను. మారన నిద్రలోనుండి లేచినవానివలె గురునాథు డుద్బోధింపగా లేచెను. అన్నమంత్రికి చెప్పి వెళ్ళుట ధర్మముకదా!

"మరల మీ దర్శనమునకు వచ్చెదను మంత్రీశ్వరా!"

ఈ మాటలు అన్నమంత్రీశ్వరుని ఎదుటికి పోయి తిక్కనసోమయాజులు పలికెను. కాని యా మాటలు అన్నమంత్రి వినిపించుకొన్నట్లు లేదు. ఏమి చేయుటా యని తిక్కనసోమయాజి ద్వారపార్శ్వమున సందేహించుచు నిలువబడెను.

అత డట్లు నిలుచున్న ప్రదేశము అన్నమంత్రియంతఃపురములోనివారికి కనబడు చుండెను. సోమయాజులు తన దివాణములోనికి వచ్చినప్పటినుండియు, అన్నమంత్రి తల్లియు నిద్దరు భార్యలు పార్వతియు లకుమాంబయు నాయనను జాగరూకులై కని పెట్టియుండిరి. అందుచే సోమయాజుల ప్రస్తుతస్థితి వారికి వెంటనే యవగత మయ్యెను.

ఆరేళ్ళపిల్ల యొకతె దాసిని వెంట నిడుకొని సోమయాజులకు ప్రత్యక్ష మయ్యెను. బాలాత్రిపురసుందరి యీ రూపమున దర్శన మిచ్చినదా యని సోమ యాజితలపులో బారుచున్నదే తడవుగా నది—

"తాతగారూ, మా అమ్మగారే.—మిమ్మను లోపలికి తీసికొనిరమ్మన్నారు!"

ఇట్లనుచు నా పిల్ల ప్రేమతో గౌరవముతో సోమయాజుల చేయి పుచ్చు కొని, గురునాథునివంక బెదరుబెదరుగను, మారనవంక సిగ్గుతోడను, చూపులు పరపుచు వారల ముగ్గురను అభ్యంతరమందిరములోనికి తోడ్కొనిపోయెను.

౮

అట్లానాడు సమ్మె చేసినది అన్నమంత్రికరణములే కాదు. ఆ సమ్మె రాజధానీ నగరమం దంతట సాగెను. రాజమందిరములో దప్ప పెరతావుల నెల్లయెడలను మంత్రిదండనాథసామంతుల వ్యవహారస్థానములందును— కరణము లెవ్వరు పనిలోనికి రాలేదు. అధికరణస్థానములలో లేఖకులు రాకుంటచే విచారణ లాగిపోయెను. పెద్ద వర్తకుల యంగళ్ళలోగూడ వ్రాయసకాండ్రు రానందున క్రయవిక్రయములుకూడ ఎక్కువభాగము కట్టువడిపోయినవి.

ఈ యపూర్వసంఘటన మెం దెవరికి నర్థము కాలేదు. ఎవరికి వారు తమ కరణ ములు రాకుండుటకు కారణ మేదో ఉండు నని ఊహించి వారి రాకకై కొంతసేపు నిరీక్షించిరి. ఎంతసేపటికిని రానందున నాశ్చర్యముతో తమ సేవకులను కరణముల

యిండ్లకు బంపిరి. ఎవరు వెళ్ళినను ఇంటిదగ్గరవారు ఇంటిలో లేరని చెప్పుచుండిరి. ఆ మహానగరములో వారెక్కడ నుండిరో కనుగొనుట యెట్లు ?

అధికారులకు ప్రభువులకు నాగ్రహము వచ్చుచుండెను. కాని ఏమి చేయగలరు? వారిలో పలువురు అన్నమంత్రివంటివారైన గారు. వారు సహజముగా లెక్క లాలస్యముచేయ నలవాటుపడినవారు. పైగా, "మా హస్తములు కత్తి పలక పట్ట నేర్చినవికాని గంటములు పత్రములు పూనుటలో నేర్పుకలవి కావు" అని సగర్వముగా చెప్పికొనుచు వ్యవధి తీసుకొనుచుండువారు. వారు చైత్రశుద్ధదశమికి పంపవలసిన లెక్కలు ఏ శ్రావణాంతమునకోగాని పూర్తికావు. విజయదశమి లెక్కలు శివరాత్రికిగాని కావు. అట్టివారి లెక్కలు పేరుకొనియుండి చాల వెనుకబడియుండుటే గాక అయోమయావస్థలో నుండెడివి. అందుచే నట్టివారు కొంతవరకైన దారికి తెచ్చుటకు నవరాత్రములలో అదనము క్రొత్తకరణములనుగూడ పెట్టుకొని పని చేయించుకొనువారు. ఏది ఎట్లున్నను వారు పూర్తిగా తమ కరణములపైననే ఆధారపడియుండెడివారు.

కొంతకాలమునుండి బ్రాహ్మణులలో వేదశాస్త్రాభ్యాసము క్షీణింపసాగినది. అట్టివారికి అగ్రహారములలో వృత్తులను లోపింపసాగినవి. శిష్టులైన బ్రాహ్మణులలో వారికి గౌరవముకూడ బోవుచున్నందున తప్పనిసరిగా వారు మహాపట్టణములకును చిన్న పట్టణములకును చేరుకొనసాగిరి. వారిలో కులధర్మము క్షీణించినను వారి కులాభిమాన మేమియు దగ్గలేదు. వారందుచే జీవనోపాధికై చేయదగిన వృత్తులు స్వల్పముగా నుండెను. వర్తకము చేయుటకూడ వారికి హీనముగా కనిపించెడిది. ఏమిచేయగలరు?

వారిలో పలువురు వ్రాయను జదువను చిన్నచిన్న లెక్కలు వేయను నేర్చినవారు. అట్టివారు తాత్కాలికముగు వ్రాయసవృత్తిలో పెక్కురు ప్రవేశింపసాగిరి. ఆ ఉద్యోగములకై అట్టివానిలో చిరకాలముగా స్థిరపడియున్న జైనోద్యోగులవా రాశ్రయింపవలసివచ్చుచుండెను. ఐనను అ జైనోద్యోగులు ఈ బాపనవ్రాయసకాండ్రను పనిలో చేర్చుకున్నను వృత్తిలోని గుట్టులు బయటపెట్టకుండగనే వారినుపయోగించుకొనెడివారు. వారు తాము వ్రాసిన పత్రములకు ప్రతులుమాత్రము ముఖ్యముగా వీరిచే వ్రాయించెడివారు. అవియును ముఖ్యమైన వగుచో కొంతభాగము ఒకరిచేతను కొంతభాగము మరియొకరిచేతను వ్రాయించి దాని పూర్ణస్వరూపము వీరికి తెలియకుండ జేసెడివారు. అట్లు కార్యకలాపము లవగాహనయగుటకు వారెన్ని ఆటంకములు కలిగించుచున్నను సూక్ష్మబుద్ధి కల కొందరుమాత్రము ఆ వ్యవహారనిర్వహణమున సమర్థత నెమ్మదిగా రహస్యముగా సంపాదించుచుండిరి. కాని యట్టి పట్టుదల గలవారు కొలదిమందియే కలరు. వారైనను పైపదవులలో నున్న జైనోద్యోగుల నాశ్రయించి ఉండవలసివచ్చుటచే తమ ప్రతిభను బయటపెట్టుకొనుటకు జంకుచుండిరి.

చిరకాలముగా పనిచేయుచున్న జైనకరణముల పద్ధతికి ఈ బ్రాహ్మణకరణముల వ్యవహారవిధానము కొంచెము భిన్నముగా నుండెడిది. వేదప్రామాణ్య మంగీ

కరింపని తమకంటె నన్యు లని వీరిని నిర్దేశించుటకు ఈ బ్రాహ్మణకరణములకు వైదిక కరణము లని వారు పేరుపెట్టిరి. ఆ పేరే కొన్నాళ్ళుగా వ్యవహారములోనికి వచ్చినది.

ఇది జైనులు సాగించిన సమ్మె యని మొదట ఎవరికిని తెలియలేదు. వైదిక కరణములు దివాణములకు వచ్చిరి. కాని యక్కడ పెద్దకరణము లెవ్వరును లేకున్నందున వారు సందేహించి తారటలాడుచు వెనుదిరిగిపోవ నుంకించుచుండిరి. అట్టివారు ప్రభువుల కన్నుల బడగా ప్రభువులు వారిని పిలిపించి వ్యవహారము చూడుమని చెప్పచుండిరి. అయినను వారు తమకు స్వతంత్రముగా పని చేయు సమర్థత లేదనియు చెప్పిన పత్రములు వ్రాయుటే కాని ఎక్కువ చేతకా దనియు చెప్పికొని తప్పకొనిరి. వారిలో సమర్థులైనవారికి అది మంచి యదనే. అట్టివారుకూడ తమ్ము చేరదీసిన జైనోద్యోగులకు విరుద్ధముగా ప్రవర్తించుట ధర్మము కాదను ధర్మభీతిచే కొందరును, ప్రబలురకు కోపము తెప్పించుట శ్రేయస్కరము కాదను భీతిచే కొందరును, పనిలోనికి స్వయముగా దిగుటకు జంకుచుండిరి.

మహాప్రధాను లగు శ్రీచుణ గోవిందనాయకుడును బయ్యననాయకుడును కొంతకాలముగా రాజప్రాసాదములో నున్న తమ కార్యస్థానములనే పనిచూచుకొనుచుండిరి. అక్కడి కరణములు పనిలోనికి వచ్చినందున వారి కార్యకలాపముల కెట్టి యాటంకమును గలుగలేదు. కొంతవడికి వారి గృహములయొద్ద గల వ్యవహారశాలలలో కరణములు రాక పని యాగిపోయిన దని వార్త యందుకొనిరి. వారు వెంటనే మేచయనాయకుని బిలిపించి గూఢచారులను పట్టణమం దంతటను పరిసరములను సంచరించి వార్తలు తెప్పించు నేర్పాట్లు చేసిరి. ఆ పిమ్మట తిక్కచమూపతిని సర్వసేనలతో నెల్లయెడల కట్టాయితమై యుండ నిర్దేశించి యే క్షణమున కాక్షణము వార్త లందుకొనుచు ప్రతిక్రియలు ఆజ్ఞాపించుచుండిరి. వృద్ధుడై వ్యాధిచే బలహీనముగా నున్న గణపతిదేవుల కీ వార్త తెలిసినచో నావేగము నొందుదురు. రాజవైద్యులు ఎట్టి ఆవేగము కలిగినను వ్యాధి వికటించు నని కఠినముగా శాసించియుండిరి. మహాలయసభనాడు చక్రవర్తికి గలిగిన కలతచే గలిగిన దుర్లక్షణము లింకను శాంతింపలేదు. మహామంత్రు లందుచే గణపతిదేవుల కిది ఎంతమాత్రము తెలియకుండ కట్టడి చేసిరి.

రుద్రదేవమహారాజులు నవరాత్రదీక్షలో నుండిరి. వారు శ్రీవిశ్వేశ్వరశంభుదేశికుల యాజ్ఞానుసారము పాడ్యమినాడు కలశస్థాపన చేసిరి; అఖండజ్యోతిని ప్రతిష్ఠించిరి. ఒకవంక సింహధ్వజమును మరియొకవంక వరాహలాంఛనమును ఎత్తి ధ్వజారోహణము నిర్వర్తించిరి. నిత్యమును ప్రాతఃకాలమున రుద్రాభిషేకపురస్సరముగా శివపూజ కావింతురు. మధ్యాహ్నప్రభృతి నియతముగా నాయుధదేవతాపూజ చేయుదురు. రాత్రులందు శివాపూజ నిర్వర్తింతురు. కుమారీపూజలును సువాసినర్చనలును వైభవముగా జరుపుచుండిరి. పూజాసమయములలో వారు కనబరుచు భక్తిశ్రద్ధలకు నేకాగ్రతకు నక్కడ చేరెడి విప్రులందరు నాశ్చర్యచకితు లగుచుండిరి. పవ లెట్టి యాహారము వారు భుజింపరు. రాత్రులందైన హవిష్యమే యాహారము! శివశక్తియు శివాశక్తియు నేకాకారమై యీరూపమున నవతరించెనా యని రుద్రదేవమహా

రాజులు చూపఱకు గనుపట్టుచుండిరి. అట్టివారి కీ దీక్షాకాలము ముగియువరకు రాజ కార్యభారము నివేదింపరాదు! రయ్యమకును కామసానికిని రహస్యముగా మహా ప్రధాను లీ వార్త యెఱిగించి వారల జాగరూకలుగా నుండ నియమించిరి.

మరి యా ఉదయమున మహాదేవరాజు తన వ్యవహారశాలకు కరణములు రాలే దనునది గమనించునప్పటికే పదిగడియల ప్రొద్దెక్కెను. తెలిసినవెంటనే ఆతని కాగ్రహము వచ్చెను. వెంటనే భటులను కరణముల ఇండ్లకుపోయి వారు నెమ్మదిగా చెప్పిన రాకున్న కశాఘాతములు చేసి బలవంతముగా లాగికొనిరమ్మని యాజ్ఞాపించెను. కాని ఏమిచేయుటకైనను వారు కనబడిన నేగదా!

నాగదేవుడు ఆయగాండ్లపై యధికారి. గోన గన్నారెడ్డి స్థలసుంకాధికారి. వారి కరణములు రాకుండుటచే వారికి లోకమే తల్లక్రిందు లైన ట్లుండెను. కాని ఏమి చేయగలరు? ఆ క్రిందటిరోజుననే కాయస్థసేనాను లగు జన్నిగదేవుడును, అతని సోదరులు త్రిపురాంతకుడును, అంబదేవుడును రాజధానికి వచ్చియుండిరి. వారి మండలముల సరిహద్దులలో పల్లవులును పాండ్యుడును చోళులును చేయుచున్న యలజడివలన కదలుటకు వీలు చిక్కకపోయిన దనియు అప్పుడు వచ్చుటైనను రాజాజ్ఞమేరకు వచ్చియుండిరేగాని మండలస్థితి ప్రమాదకరముగా నున్న దనియు మహారాజుకు నివేదించుకొనిరి. వారు మరియును మహారాజునాజ్ఞ తమకు మండలాంతమున నున్నందున నాలస్యముగా నందినదనియు వివరించినందున వారిని చక్రవర్తి విని యుదాసీనత వహించెను. ఈముువ్వురలో అంబదేవుడు సర్వతోముఖముగుప్రజ్ఞ కలవాడు. యుద్ధవిద్యలో నీ సేనాని సాటిలేని మేటి. అంతియకాక అతడు గణితమున నద్వితీయుడు. అతడెక్కడ అధికారములో నున్నను భూమి యంతయు 'పెనుంబాకమానదండము'తో చక్కగా కొలిపించి 'నీరునేల' పై న్యాయమైన 'కోరు' ను 'వెలిపొలము' పై 'పుట్టిపహిండి'యు క్రమముగా నిర్ధారణ చేయించువాడు. అందుచే భూస్వాములు చెల్లించ వలసిన పన్నుకంటె ఎక్కువ కరణములు వసూలు చేయుటకు గాని, ఈయవలసిన 'కోరు'గాని 'పుట్టిపహిండి' గాని భూస్వాములు తప్పించుకొనుటకుగాని యతని మండలములో నవకాశ ముండెడిదికాదు. ఈ యంబదేవుడుగూడ నానా డేమియు జేయజాలకపోయెను. జన్నిగయు త్రిపురాంతకుడును అంబదేవుని కంటె పెద్దవారైనను ఆతని సమర్థతయందు గౌరవము కలవారు. అతడే అసహాయుడై యున్నందున ప్రస్తుతము ఈనాటికి తాముును ఏమియు జేయలేమని నిస్పృహత వహించి ఉదాసీనులైరి.

చాళుక్యవీరభద్రేశ్వరుని కరణములుకూడ నానాడు రాలేదు. అప్పటి కైదు దినములనుండియే యతని దివాణములో చురుకుదనము తగ్గినది. విజయదశమికి కార్య నిర్వహణభారము చక్రవర్తికి నివేదింపవలసిన యాతురత యాతని దివాణమున కున్నట్లులేదు. ఈనాడు తన కరణములు రామికి కారణముకూడ విచారింపకుండ అతడు తన పారశీకాశ్వ మెక్కి ఎచ్చటికో వెడలిపోయెను.

అట్లే రేచర్ల కామయరెడ్డి, నామయరెడ్డి, మల్లయరెడ్డి, గణపిరెడ్డి, మల్రెడ్డి దివాణములను కోట కేతరాజు, ఆనెగొంది రామదేవరాయల దివాణములను కరణములు

రాలేదు. వారు అలజడి నొందినట్లే లేదు. వారు నగరవీధుల తమ జవనాశ్వములపై సంచరింపసాగిరి.

వృద్ధుడగు జాయపనాయకునకు ఇప్పుడు అధికారభారము లేదు. పూర్వ మాతడు గణపతిదేవుల గజసైన్యముల కధ్యక్షుడు. ఇప్పుడు చేబ్రోలులోనుండి విశ్రాంతితీసుకొనుచుండి రాజధానికి నవరాత్రోత్సవములకు వచ్చెను. ఆతని కున్న స్వల్ప కార్యములను నిర్వహించు కరణ మొక్కడే. అతడును ఆనాడు రాకుండుట జాయపనాయకునకు మనస్సునకు విరామ మిచ్చెను. అందుచే తాను రచించిన 'నృత్త రత్నావళి' భాగములు మరల చదువుకొని ఆలోచించుకొనుటకు తీరిక చిక్కె నని సంతోషించుచు నా పనిలో మునింగియుండెను.

అంతలో, బద్దెన యాతనికడకు వచ్చెను. అతనికి పల్నాటిలో పది గ్రామములు కలవు. ఆ చిన్న సంస్థానమునకు పని తక్కువ. ఆతనికిని తన ముగ్గురు కరణములానాడు రాకుండుట విద్యార్థులకు తుపానుగాలిచే లభించిన ఆటవిడుపువలెనే భాసించెను. వెంటనే యాతడప్పుడు రచించుచున్న సుమతీశతకములోనికి పద్యములాలోచింపసాగెను. అట్లాలోచించుచునే యాతడు జాయపనాయకునియొద్దకు బోయెను.

జాయపనాయకునకు బద్దెనయందు వాత్సల్యము గలదు. ఆ చిన్నవాని వినయ విధేయతలు జాయపనాయకున కెంతయేని నచ్చెను. మరియు నాతని వయస్సువలన నేమి, స్వభావమువల్ల నేమి, బిడియపడు స్వభావము కలవాడు. అతను నలువురున్నచో మాట్లాడుటకు జంకును. కాని ఆప్తు లని తెలిసినవారియొద్ద మనస్సు విప్పి మాట్లాడును. అట్టి యేకాంతగోష్ఠిలో నొక్కొక్కతరి నతడు వదరుబోతా యేమి యనునట్లుకూడ మాటాడును. జాయపనాయకునియొద్ద నాతడట్లు మనసు విప్పి మాటాడును. తనయొద్ద నట్లు నిర్భయముగా—కొంత అతిగా—మాట్లాడుటయు నలువురలో నున్నప్పుడు మౌనముద్ర వహించుటయు నతనికి బద్దెనపై ప్రీతి నతిశయింప జేసెను. వృద్ధుడును రాజబంధువును మహాపదవి వదలినవాడును విద్వాంసుడును సరసుడును ప్రేమాస్పదుడును నగు జాయపనాయకునందు బద్దెనకు మిక్కిలి గౌరవము కలదు. అందుచే తన మనస్సు విప్పి మాటాడుట కాతడు తరుచుగా జాయపను దర్శించును.

వీరిద్దరివలె ఆనాడు కరణములు రానందుకు బరువు తీరినట్లు భావించినవారు మిక్కిలి కొలదిమందియే. పలువురు దానికై యాతన యనుభవించినవారే. ముందు వారు ఎవరికివారు తమ కరణములుమాత్రమే రాలేదని తలంచి దానికి కారణములను ప్రతిక్రియలను నూహించుచుండిరి. కాని రాజధానీనగరమం దంతటను వ్యవహారశాలలకు ఆనాడు కరణములు రాలేదను వార్త నెమ్మదిగా మధ్యాహ్నము కాక ముందే పాకిపోయెను. ఆ వార్త యందరికి విభ్రాంతి కలిగించెను.

వారు పూర్వము కులసమ్మె లెరుగుదురు. వానికి రావలసిన కట్టడిలో లోపము జరిగినచో ఆ ఇంటికి ఆ పనివాడు పోడు. ఆ పని చేయు నా కులమువారే పోరు. గ్రామస్థు లందరు నా విషయమున వారికి విరుద్ధముగా వ[illegible] గ్రామసు మం[illegible]

టను వారా సమ్మె చేయుదురు. చాకలి, మంగలి, కుమ్మరి,—ముఖ్యముగా ఈ కులముల సమ్మె లెరుగుదురు. సంఘములో వారి కున్న హీనస్థితిచేత ఏపెద్దపైననైన గాని పెద్దలపైన గాని వారికి తీవ్రముగా ఆగ్రహము కలిగినచో నది చూపుటకు ముందు వెనుకలు దూరము ఆలోచించి సమ్మె సాగించువారు. సమ్మెవరకు వచ్చినతర్వాత ఆ గృహయజమాని గాని ఆ గ్రామస్థులు గాని వెంటనే వారి కష్టము విచారించి న్యాయముగా నలుగురు పెద్దలు చెప్పినట్లు సరిచేసికొనెడివారు.

కాని ఈ సమ్మెయో? అపూర్వము! ఇట్టి దెన్నడు నెవ్వరు నెక్కడ నెరుగనిది! ఇది నిష్కారణమైన సమ్మె. అదియు ఉద్యోగులది! ఈ సమ్మె చేసిన వారిలో వ్యవహారజ్ఞానము లేనివారు లేరు. అందులో చిన్నవ్రాయసగాండ్రనుండి సామంతమండలేశ్వరపదవుల నధిష్ఠింపదగినవారివరకు గలరు. ఏదో అల్పులు విధిలేక చేయు సమ్మె వీరు చేయు టేమిటి? ఎందుకు చేసినట్లు? ముందు వీరికీ యాలోచన ఎట్లు తట్టినది? ఎవరు చెప్పిరి?

ఎవ్వరికిని ఏమియు తోచలేదు. అందరును దీనినిగురించి పరిపరివిధములుగా ప్రశ్నించువారే! ఉత్తర మిచ్చువా రొక్కరును లేరు. చిత్రముగా ఈ కరణములు ఎక్కడను కనపడనేలేదు. ఏమైరి? ఒకవిధమైన అవ్యక్తమగు భయము ఏకశిలానగర ప్రజలనే ఆవహించినది.

అంతలో మరియొక వార్త ఏకశిలానగర మంతట ప్రాకిపోయెను. పైవార్త యంత చిత్రముగనే ఈ వార్తగూడ ప్రతివారును చెప్పుకొనసాగిరి. అన్నియెడలను సమ్మె యున్నది. కాని ఇందులూరి అన్నయమంత్రిదివాణమునమాత్రము ఏమియు అలజడి లేదు. అక్కడ పని చురుకుగా యథాప్రకారము సాగిపోవుచున్నది.

మరి ఎట్లు? ఈ వార్త నమ్మలేక జనములు వచ్చి కొంచెము దూరమున గల రాజమార్గమునకు వచ్చి అన్నయమంత్రివ్యవహారశాలవంక ఒకరి కొకరు చూపుకొనుచు అచ్చటి పని జరుగుచుండుట చూచి యాశ్చర్యపడసాగిరి.

“ఈ అన్నమంత్రి నిన్ననే రాజధానికి వచ్చినాడే! అప్పుడే అతని కరణములను ఏవిధముగా పనిలోనికి రప్పించుకొన్నాడు? ఇతడు మహామేధావి!”

మరి కొలనిరుద్రదేవుని దివాణముననో? అతని దివాణములో కరణములు పని చేయుటలేదు. అత డింకను రాజధానికే రాలేదు!

## ౬

ఆశ్చర్యముతో పలువురు సామంతులును దండనాథులును మంత్రులును ఆ సాయంకాలమున ఇందులూరి అన్నయమంత్రిని చూడబోయిరి. ఇంత చిన్నవాఁడే యీతడు? ఇత డీ బాధ లేకుండ నెట్లు తప్పించుకొనగలిగెను? దీనికి మూలకారణ మేమి? ఇందుకు చేయదగిన ప్రతిక్రియ ఏమున్నది?

అప్పటికే అన్నమంత్రి యానాటి రాజకార్యములు ముగించుకొని, భోజనము చేసి యించుక విశ్రాంతితీసికొని, సావధానముగా మిత్రులు బంధువులు కవులు గాయకులు నర్తకులు పరివేష్టించియుండ నిష్టకథావినోదంబుల ప్రొద్దుపుచ్చుచుండెను.

ముందుగా నచ్చటికి జాయపనాయకుడు వచ్చెను. ఆతనికి తాను వ్రాయుచున్న సుమతిశతకములోని పద్యములు వినిపించుచు, బద్దెనయు నాతనివెంట నరుదెంచెను. జాయపనాయకునకు యువకు లన్న నెక్కువ యభిమానము. అందును అన్నమంత్రిపై నాతనికి ప్రేమయు గౌరవమును మెండు. ఈ పడుచువాని కార్యఖడ్గముల నాశ్రయించి కాకతిరాజ్యలక్ష్మి చిరకాలము స్థిరముగా నుండగల దని జాయప• తరచుగా ననుచుండును. అన్నయసమక్షమున నున్నపుడు అతివృద్ధుడగు జాయపనాయకునకు యౌవనోన్మేషము కలిగినట్లుండును. రాజధానికి వచ్చినపు డాతడన్నయదివాణమునకు తరచుగా పోవుచుండును. అందును ఈనాడు ఎక్కువ ఉత్కంఠతో నాత డన్నమంత్రిని చూడబోయెను.

జాయప రాగానే అన్నయయింట రాజమర్యాదలు సాగినవి. ఆత డంతసుఖోపవిష్టుడై ఠీవిగా గూర్చుండెను. 'నృత్తరత్నావళి' వ్రాసినవాడైనను అతని కదలికలో నిప్పుడు నృత్తవిద్య యేమాత్రము కాన్పింపదు. అతివృద్ధుడైనందున నడుము బిగిసిపోయెను. వ్యాయామకర్కశ మగుటచే నాతని శరీరము క్షీణించినను బలహీనమైనను సడలిమాత్రము పోలేదు. నడుమును మెడయు వంగక నిటారుగా నుండును. అందుచే నతని నిప్పుడు చూచినవారు "ఇతడు నిజముగా నృత్తరత్నావళి స్వయముగా రచించెనా?" అని సందేహింతురుకాని యతనిముఖములోనుండి త్రోసికొనివచ్చి నాట్యమాడుచుండు నాతని చిరునవ్వులను గమనించినవారి కా సందేహము తీరిపోవును. ఆతని వాక్చమత్కృతి విన్నవారికి ఆతని హృదయములో నిత్యనృత్యమొనర్చు దివ్యశక్తి ప్రత్యక్షమగును. ఐనను సంభాషణము అక్షరవిన్యాసమున తొందర లేక ధీరమై గజగమనమునే అనుకరించును. చిరకాలసహవాసముచే గజప్రకృతి యతని ప్రకృతిలో కలసిపోయినది.

యథాచారముగా జరుగు ననామయకుశలప్రశ్నాదిక మైనతర్వాత జాయపనాయకు డిట్లు ప్రారంభించెను. ఆనాటి కరణముల చర్యనుగూర్చి ఎట్టి ప్రసంగమును చేయలేదు.

"అన్నమంత్రీశ్వరా, మన బద్దెన ఈనాడు చెప్పిన క్రొత్తపద్యము విన్నావా?"

ఆ మాట లనుచుండగా జాయపముఖము చిరునవ్వుతో ఇంచుక విప్పారెను. ఆ ప్రశ్నలోని కొంటెతనముమాత్రము గొంతులోగాని ముఖములోగాని ద్యోతమము కాలేదు. ఆ మాటలు వినుచున్న బద్దెనలో కొంత అశాంతిమాత్రము కనపడెను. జాయపవంకనే చూచుచున్న అన్నమంత్రి కది యేమియు గోచరింపలేదు. అందుచే ప్రాసంగి[illegible]నే భావించి యడిగెను.

అన్నమంత్రి : "ఏది? విందాము—"

బద్దెన వెంటనే చదువలేదు. జాయప బద్దెనను సంబోధించి యీ పద్యము మహామంత్రులకు వినిపింపు మనెను. బద్దెన దేహ మంతయు నెర్రవారెను. ఇంకుతో ముఖ మంతయు తుడుచుకొనెను.

జాయప : "క్రొత్తపెండ్లికూతురువలె సిగ్గుపడెదవేమి? బద్దెనా!— చదువు! ఇంతమంది రసికు లున్నచోట చదువని నీ పద్యము మరి ఎందుకు?"

ఇట్లనుచు నక్కడ చేరిన కవిగాయకాదులను నిర్దేశించెను.

బద్దెన ధైర్యము తెచ్చుకొని గొంతు సవరించుకొనెను. కాని నోట మాట రాలేదు.

జాయప : "అన్నమంత్రీశ్వరా, ఆ మీ నట్టువ పేరేమి?"

అన్నమంత్రీశ్వరుడు ప్రత్యుత్తర మీయకముందే, మేళనాయకుడు వంగి జాయపకు దండముపెట్టి, "దాని పేరు మదాలస బాబూ!" అనెను.

జాయప : "అయితే బద్దెనా, దానిచేత నవవధువును వర్ణించే శ్లోక మొకటి అభినయింపుమందునా?— ఏదీ, అది అమరుకములో ఈ శ్లోకము చెప్పుకొన్నదా?

"పటాలగ్నే పత్యౌ నమయతి ముఖం జాతవినయా
హఠాశ్లేషం వాంఛ త్యపహరతి గాత్రాణి నిభృతమ్—"

మేళనాయకుడు : "చిత్తము స్వామీ! అభినయము పట్టించేదా?—" తంబుర శ్రుతి ప్రారంభించెను. మురజాదులు పరిచూచుకొనుచుండిరి.

జాయప : "శ్రుతి పెట్టినారు. నీవు పద్యము చదివెదవా? దానిని ముగ్ధాభినయము ప్రారంభించు మందునా?"

అన్నమంత్రి చిరునవ్వు నవ్వుచు, "తాతగారు నిన్ను వదలడు. అంత సందేహింతు వెందుకు! వినిపించు మరి!" అనెను.

బద్దెన గొంతు సవరించుకొని రెండు మూడు మారులు ప్రయత్నించి పద్యమిట్లు తుదకు చదివెను.

"పొరుగున బగవా డుండిన
నిరవందగ వ్రాతకాడె యేలిక యైనన్
ధర గాపు కొండె మైనను
గరణాలకు బ్రతుకు లేదు గదరా సుమతీ!"

ఆ పద్యము విని యన్నయమంత్రి చిరునవ్వు నవ్వుచు, "చదవడములోనే గాని మాధుర్యము పలుకులలో కనపడదే! ఎంత గడుసువాడవు బద్దెనా!— ఇందులో సంబుద్ధ్యైన సుమతి నేనేనా?" అని యడిగెను.

జాయప : "కానేకాదు! నేను!"

అన్నమంత్రి : "మీగద్ద నన్నుగూర్చి చెప్పినదా? అవును మీరేలెండు, సుమతి!"

అంతలో వ్యవధి లేకుండ నౌకరి వెంట నౌకరు పలువురు దండనాథులును సామంతులును మంత్రులును ఇష్టాగోష్ఠి కక్కడ చేరిరి.

జన్నిగదేవుడు, త్రిపురాంతకుడు, అంబదేవుడు కలసి వచ్చిరి. జన్నిగదేవుడు అన్నమంత్రిని ప్రశ్నించెను.

"మంత్రీశ్వరా, నీ వీనాడు రాజకార్యములు ఎట్లు నిర్వర్తింపగలిగితివి ?

అన్నమంత్రి తొణకకుండగా నిట్లు జవాబు చెప్పెను. "మా పెద్దలు అనాదిగా సేవించుచు వచ్చిన త్రేతాగ్నులు నా కీనాడు ప్రత్యక్షమై సాయము చేసినవి.

త్రిపురాంతకుడు : "నిజముగా అట్లే కనబడుచున్నది."

అన్న లిద్దరు మాటాడినందున అంబదేవుడు మౌనము వహించి, నలుదిక్కులు తేరిపారజూచుచుండెను. నిర్లిప్తుడై చూపట్టుచున్న అన్నమంత్రి తీరు ఆతని కాశ్చర్యము కలిగించెను.

అంతలో నక్కడికి మహాదేవరాజు వచ్చెను. అతడు మిక్కిలి స్థూలకాయుడు. కరణములపై నాతనికి కలిగిన కోపము ఇంకను ఏమాత్రము తగ్గలేదు. అది ముఖము నుండి జారి కూడ పోలేదు. ఆ ఉగ్రరూపముతోడనే యాతడు వేగముగా లోపలికి వచ్చెను. అతనికి చేయుచున్న మర్యాదలైన జేయించుకొనకుండ సరాసరి అన్నమంత్రిని ప్రశ్నించెను.

"అన్నమంత్రీ! నీ కరణములను నీ వెట్లు శాస్తి చేసితి వయ్యా? నావారి నందరినీ పొడిచివేయవలె నని ఉన్నది."

అన్నమంత్రి : "నే నింకా ఏమీ చేయలేదు. వారిని పొడిచివేసిన వ్యవహారములు సాగు టెట్లు ?"

మహా : "మరి ఎట్లు సాధించినావు ?"

అన్నమంత్రి : "మా పూర్వులు అర్చించిన త్రేతాగ్నులు న న్నీనాడు రక్షించినవి."

అ ట్లనుచుండగానే గోన గన్నారెడ్డితో గలసి నాగదేవుడు అచ్చటికి వచ్చెను. అతడు ఏకశిలానగరపాలకు డగు మేచయనాయకుని యల్లుడు. మల్లమాంబాపతి. ఆత డెంతయు విసుగు వ్యక్తమగుచున్న మొగముతో నచ్చటికి వచ్చెను. రాగానే అన్నమంత్రిని ఇట్లు ప్రశ్నించెను.

"ఈనాడు నా దివాణములో పనిచేయు ఆయగాం డ్లెవ్వరూ రాలేదు. వీరు చిక్కు దిద్దుకొంటి రందురు. ఎట్లు సాధ్యమైనది ?"

అన్నమంత్రి : మా కులదేవత లగు త్రేతాగ్నులే నన్ను కాపాడినారు."

నాగదేవుడు : "ఏమి చిత్రమైన సమాధాన మయ్యా—" అనుచుండగనే, ప్రసాదాదిత్యనాయడు రుద్రమనాయడు నచ్చటి కరుదెంచిరి. వీరు ప్రసిద్ధు లగు పద్మనాయక సేనానులు. వీరు ముఖ్యముగా ఖడ్గవాదులు. వా రేమి చేయను దోపని స్థితిలో

నుండి యచ్చటికి వచ్చిరి. వారును, అన్నమంత్రిని ఇతరులవలెనే ప్రశ్నించిరి. అన్నమంత్రియు త్రేతాగ్నులు తనకు సహాయులైనట్లు ప్రత్యుత్తర మిచ్చెను.

అందరకు నావిధముగా నాతడు సమాధాన మిచ్చుచుండుట వచ్చినవారల కందరకు నిజము తెలిసికొనవలె నను నుత్కంఠను శతగుణము చేయుచుండెను.

జాయపనాయకుడు సమస్తమును విని విని చివర కందుకొనెను.

జాయప : "ఆ అగ్నుల నింకను, కొంపతీసి, వ్యవహారశాలలోనే ఉంచినావా యేమి?—అచ్చటి పత్రములకు వేడి తగులకుండా జాగ్రత్తచేసినావా?"

అన్నమంత్రి : "ఆ అగ్నులు అమృతమయమైనవి."

మహాదేవరాజు అందుకొనెను.

"ఖడ్గవాదము తప్ప మీ వాగ్వాదముల చురుకుదన మెరుగము మేము. అర్థము కాని మాటలు చాలించి సూటిగా చెప్పవు?—ఎవరో వైదికవిప్రులు మీ దివాణములోని వ్యవహారము లీనాడు చూచినా రని వింటిమి నిజమా, కాదా?"

అన్నమంత్రి : "మీరు విన్నదానిలో నసత్యము లేదులెండి!"

జన్నిగ : "వైదికకరణములకు త్రేతాగ్నులకు సంబంధ మేమిటి?"

జాయప యందుకొనెను. "మీ రందరూ ఖడ్గవాదులుగదా? మరి కత్తులకూ నిప్పుకూ సంబంధ మున్నదా?"

జన్నిగయు మహాదేవరాజును ప్రసాదాదిత్యనాయడును ఒక్కసారిగా 'లేదు' అని పల్కిరి.

జాయప : "అయ్యో, మీ తెలివితేట లింతేనా? రెండు కత్తులు కలసినచో నిప్పు పుట్టునా, పుట్టదా?—ఇక ముగ్గురు వైదికబ్రాహ్మణులు కలసినచో త్రేతాగ్నులగుటలో నాశ్చర్య మే మున్నది?"

జాయప యట్లు వ్యాఖ్యానముచేయగా సందర్భ మర్థమయి నట్లందరును నవ్విరి. మహాదేవరాజు తొందరచేసెను.

"ఇంతసేపును చెప్పక మా ప్రాణములు తీసితివి. ఆ ముగ్గురు బ్రాహ్మణులను మాకు వెంటనే చూపించు!"

జన్నిగ : "ఇంకను ఇక్కడనే ఉన్నారా?"

అంతలో జాయపనాయకునకు చిరునవ్వు వచ్చెను.

"బద్దెనా! వైదికకరణములమీద పద్య మేదో చెప్పితివే, ఏదీ?"

బద్దెన తల వంచుకొని చదువుటకు సందేహింపసాగెను.

జాయప : "చదువ వేమి, బద్దెనా! మరల మదాలసను అభినయము చేయుమనవలెనా?"

బద్దెన : "అక్కరలేదు! జ్ఞాపకము వచ్చుటలేదు."

జాయప : "మూడవ పాదము జ్ఞాపకము చేయుదునా?"

బద్దెన : "అక్కడనుండి జ్ఞాపకమున్నది."

జాయప : "చాలులే, అక్కడనుండి చదువు !"

బద్దెన సిగ్గుపడుచు చదివెను.

"—కరణము వైదికు డైనను
మరణాంతక మగును గాని మానదు సుమతీ !"

అదివిని అన్నమంత్రి చిరునవ్వు నవ్వెను. చేరినవా రందరు పరిపరివిధముల ప్రసంగించుచు పెద్దగా నవ్వుకొనసాగిరి.

కొంతవడి యిట్లు సాగినపిమ్మట ఆకస్మికముగా అన్నయముఖమున చింతా మేఘ మావరించిన ట్లయ్యెను. అది తీవ్రతరమై యందరకు స్పష్టముగా గోచరించెను.

అంతట నందరు తా మేమైన నాతని మనస్సు నొప్పించినా మేమో అని పరిపరివిధముల ననునయవాక్యములు పలుకుచు విచారకారణ మడుగసాగిరి. అతడు నెక్కువ మాటాడక ముక్తసరిగా వారించి తప్పించుకొనుచుండెను. వారు గ్రుచ్చి గ్రుచ్చి యడుగగా తుద కత డిట్లనెను :

"బద్దెన లోకానుభవము మీ రంద రెరిగినదే గదా !"

"అతనిది సిద్ధవాక్కే!" అనెను జాయప. మిగిలినవా రందరు నతనితో నేకీభవించిరి.

అన్నయ : "ఈనాడు నా రాజకార్యములకు చిక్కులేకుండ రక్షించినది వైదికకరణములే. మరి యీ బద్దెనపద్యము వింటిరి గదా !"

మహాదేవరాజాదుల కా సందర్భము అర్థముకాక ఏమిటని యడిగిరి. అన్నమంత్రి యంతట బద్దెన నా పద్యము చదువు మనెను. అత డా పద్యార్థమునే మరల చదివెను.

అన్నమంత్రి : "విన్నారుగదా ? మరణాంతక మైన పని ఈ వేళ ప్రారంభించినా నని, ఒక్కసారిగా నాకు దిగు లిప్పు డావేశించినది."

చేరినవారందరు పకపక నవ్విరి.

"బాబూ, మాకందరికీ ఆ మరణాంతకపుపనే సాధించే వీలు చూపి రక్షింపవయ్యా!"

అన్నమంత్రి : "మీకందరికీ కూడనా ?"

మహాదేవరాజు : "నీవేనా మహా ప్రాణభయము లేనివాడివి !"

జన్నిగ : "మీ చదువుసంధ్యలు మాకు లేకపోయినా, మేమూ పిరికిపందలము మాత్రము కాము !"

నాగదేవుడు : "మీతోపాటు మేమును ఈ మరణాంతకపు పనికి పూనుకొందుము !"

మహాదేవరాజు : "రాజబంధువులకు నేను పూట !"

ప్రసాదాదిత్యనాయకుడు : "పద్మనాయకుల పక్షమున నేను !"

గన్నారెడ్డి : "రెడ్లకు నాది పూచీ !"

నాగదేవుడు : "కమ్మవారిపక్షమున నేను !"

జన్నిగ : "కాయస్థులకు నేను !"

అన్నమంత్రి : "ఇందరు సమ్మతించిరి. ఐనను శ్రీగణపతిదేవుల పాదపద్మారాధకుల నిందరను, ఒక్కసారిగా ఈ మరణాంతక మగు పనిలోనికి దింపుటకు నేనుమాత్ర మంగీకరింపను."

అంబదేవుడు : "అన్నమంత్రీశ్వరుడు తప్పించుకొనుటకు మంచి ఎత్తు వేసినాడు !"

నాగదేవుడు : "ఒక యుపాయము చేసినచో ?—"

మహాదేవరాజు : "ఏమిటది ?"

నాగదేవుడు : "ఏ మున్నది ?—బద్దెనా, పోనిండు ఆ పద్యము కొంచెము మార్చరాదూ !"

జన్నిగ : "ఏమని ?"

నాగదేవుడు : "మరణాంతక మేల యతాను మానకసుమతీ,—అని అనరాదూ ?"

బద్దెన మాటాడలేదు. అన్నమంత్రియే అందుకొనెను.

"అందరూ పద్యాలు చెప్పేవారే! ఈ మార్పుతో పద్యానికి సరసమైన అర్థమంటూ చిక్కునా ?"

వారల వివాదములో జాయపనాయకుడు అందుకొని నిష్కర్ష చేసెను.

"మీ అర్థములతో సరసతతో పని లేదు. మన బద్దెన ఋషివంటివాడు. అతని వాక్కుకు తిరుగు లేదు. అతని పద్యములలో అబద్ధము ఉండదు !"

అంతట మిత్రు లందరు నా త్రేతాగ్నులను చూపింపుమని అన్నమంత్రి నొత్తిడి చేసిరి. వారితో కొంతవడి సరససల్లాపములు చేసి, తుదకు తన మందిరాంతరములోని కేగి, తనవెంట సగౌరవముగా తిక్కనసోమయాజులను గురునాథుని మారనను తీసికొని యచ్చటికి వచ్చెను.

## ౧౦

తిక్కనసోమయాజి యచ్చటికి వచ్చినంతనే అచ్చట కూడినవా రందరును అప్రయత్నముగా లేచి యాతనికి నమస్కరించిరి. సోమయాజియు వారి నందర నాదరముతో నాశీర్వదించెను. "చిరంజీవ! చిరంజీవ! చిరంజీవ!" ఆయనధీరగౌరవ

మూర్తి తిలకించినంతనే వా రందరును అంతవరకు అవలంబించియున్న ఉల్లాసమిశ్ర మగు హాస్యభావము మానిరి. ముఖములు గంభీరము లయ్యెను. "తిక్కనసోమయాజి!" యని వారిలో గుసగుసలు పర్వెను.

బద్దెన సోమయాజుల కెరగి రెండు పాదము లంటి కన్నుల కద్దుకొనెను. అతని కా మహాకవిప్రథమదర్శనసమయమున నానందబాష్పము లంకురించెను; దేహము పులకించెను. సోమయాజియు నాతని విశేషాదరకటాక్షదృష్టితో తిలకించి యాశీర్వదించెను.

సభామధ్యమున సోమయాజులను గౌరవోన్నతాసనమున నుపవిష్టు గావించి శిష్యులనుగూడ నాతని సమీపమున గూర్చుండునట్లు అన్నమంత్రి ఏర్పాటుచేసెను. వారల ముువ్వుర నంతట నిర్దేశించుచు మిగిలినవారి కిట్లాతడు చెప్పెను.

"మా పెద్ద లర్చించిన త్రేతాగ్నులు మూర్తిమంతములైన నీనాడు చిక్కులో నుండి తప్పించినవని చెప్పగా మీరు నమ్మకుంటిరే?— మీకుగూడ నవి ప్రత్యక్ష మైనవి చూచుకొనుడు!"

ఆ మాటలకు మారనముఖము సిగ్గుతో నెఱ్ఱవారి వికసించిన దానిమ్మపూవు రంగులో శోభిల్లెను. గురునాథుని స్థూలకర్కశకాయము మరింత కర్కశ మైనట్లు తోచెను. తిక్కనసోమయాజిముఖమున నెట్టి మార్పును లేదు. కనురెప్పలు మాత్రము మూడు నాలుగు మారు లల్లార్చెను. ఇతడు సుఖదుఃఖముల కతీతుడా? మానావమానములు రెండింటిలో తుల్యబుద్ధి కలవాడా? అన్నయమంత్రి తన మిత్రుల నందరను సోమయాజుల కెరుక చేసెను.

ఆ పిమ్మట వృద్ధు డగు జాయపనాయకుడే ముందు తిక్కనను సంబోధించి సంభాషణ కుపక్రమించెను.

"మా బద్దెన విశేషముగా లోకానుభవము కలవాడు. అతడు సుమతిశతక మిప్పుడు చెప్పుచున్నాడు. ఇంత వయస్సు వచ్చిన మాబోంట్లకుగూడ తెలియరాని లోకధర్మము ఈ కుఱ్ఱవాని కట్టె స్ఫురించును!"

తిక్కన : "అది పూర్వజన్మకృతపుణ్యఫలము!"

జాయప : "ఇతని కవితలో అబద్ధము రాదు. అది మా కనుభవమే. ఈమధ్యనే ఒక పద్యము చెప్పినాడు. మీ ఎదుట చదివించుటకు జంకుగా ఉన్నది. అనుమతి ఇచ్చినచో చదువు మందును."

అందుగూడిన నాయకు లందరును ఆ మాటలకు ఆశ్చర్యపడుచు నిశ్శబ్దముగా నుండిరి. జాయప వృద్ధుడు, స్వయముగా విద్వాంసుడు, నవాసదవి నిర్వహించినవాడు, చక్రవర్తికి దగ్గరచుట్టము— అత డేమన్నను చెల్లుబాటగును. ఐనను యుక్తాయుక్తవిచక్షణ గల ఈత డీవిధముగా నెందుకు మాట్లాడుచున్నాడో యని వారికి సందేహము కలుగుచున్నది.

తిక్కన శాంతముగా ప్రత్యుత్తర మిచ్చెను. "నేను మధ్యమధ్య రాజకార్యములు చూడవలసివచ్చుచున్నను నా కభిమానము కవిత్వమే. మీబోంట్ల విజ్ఞులు రసజ్ఞులు మెచ్చుకొనుచున్న యీ పడచువాని పద్యము లాలకించుట నాకు చెవులపండువుగా

నుండును. జంకు ఏటికి?—మా మారనకూడ ఈమధ్య కవిత్వ మల్లుచున్నాడు. అతడు కూడ విని సంతోషింపగలడు."

జాయప : "బద్దెనా, ఇందాకటి పద్యము వినిపింపవయ్యా సోమయాజులకు. ఇట్టి పెద్దలకు వినిపించినప్పుడే నీ కవిత్వము కృతార్థ మగుట ! నీ వాక్కు కూడ పవిత్రము కాగలదు !"

బద్దెన తడబడుచు వినయముతో "ప్రభూ, విద్వన్మహాకవు లగు కవిబ్రహ్మల యెద్దనా, నా కాపుకవిత్వము వినిపింప సాహసించుటలు !" అనెను.

తిక్కనచూపులు బద్దెనపై అద్భుతమే ప్రసరింపజేసెను.

"నాయనా, మీకు కాపుకవిత్వమే అలవడినచో ధన్యులే. మొదలు తెలుగెవరి భాష?—కాపులదేగదా ! మాబోంట్లము సంస్కృతసంస్కృతి విడువలేకున్నాము. లోకమునం దన్నివిధముల వారితో కలసి మెలసి యుండుటచేతనే మాబోంట్లకు తెలుగుభాష కొంత విరివిగా నభ్యసించు నవకాశము కలిగినది. నన్నయభట్టారకు లేమన్నారు ? తన్ను లోకజ్ఞుడ నని చెప్పికొని అంతటితో ఊరకొనక శబ్దసిద్ధి లోకము వలన నని సూత్రింపలేదా ? తెలుగుభాషే కాపుభాష !"

సామాజికుల కా మాటలతో ఆనందమై తిక్కన యన్న భయము తీరినది.

జాయప : "విన్నావా ? బద్దెనా ! ఇక సందేహ మెందుకు?"

బద్దెనకు ఒడ లంతయు చెమటలు కారసాగెను. నోటమాట తడబడజొచ్చెను. "పద్యము జ్ఞాపకము లేదు!"

జాయప : "పోనీ, జ్ఞాపక మున్న యా చివరి రెండు పాదములే వినిపింతువు గానిలే !"

ఇక పెద్దవాడు వదలడు. చదువక తప్ప దని తుదకు తడబడుచు బద్దెన యా రెండు పద్యపాదములు చదివివేసెను.

"కరణము వైదికు డైనను
మరణాంతక మగును గాని మానదు సుమతీ !"

సోమయాజు లే మందురో వినవలెనని యందరకు వ్యగ్రతతోకూడిన కుతూహల మంకురించెను. ఆ పద్యభాగము విని యాయన సంతోషించినట్లే వారికి తోచెను.

తిక్కన : "దీని పూర్వార్థ మెట్లున్నదో ?"

బద్దెనకు పూర్వార్థము స్పష్టముగా జ్ఞాపక మున్నను, చదువుట కేమాత్రము నిష్టములేక 'ఎంత ప్రయత్నించినను నోటికి రాకున్నది' అని ఖండితముగా చెప్పివేసెను.

తిక్కన : "ఈయనది నిజముగా సత్యవాక్కనే తోచును. లోకానుభవము గల జాయపనాయకుల వాక్కులోగూడ అబద్ధము రాదు !"

అన్నమంత్రి అంతలో చిరునవ్వుతో అందుకొనెను.

"బాబూ, మీ రీనాడు నాకు వైదికకరణముల ననుగ్రహించినదానిమీద నీత డీ పద్యము చెప్పినా డని తోచును. అయితే, మీ అనుగ్రహముకూడ మరణాంతక మనే మీ సెలవుకూడనా ?"

తిక్కన : "ఓయి పిచ్చివాడా, ఇట్లైనా ఆ పద్యము అన్నమంత్రీశ్వరుల కర్థమయినది ?"

అన్నమంత్రియంతవానిని ఈవిధముగా సంబోధించుట సోమయాజినోట తప్పనిపింపలేదు. అక్కడ నున్నవారి కందరకు అన్నమంత్రి కర్థమయినట్లే అది అర్థమయినది. వారును అట్లే స్పష్టపరచిరి.

తిక్కన : "ఆయనకవిత్వము కాపుకవిత్వ మని ఈసడించినదేనా ఈ మిత్ర లోకము అంతాను? "

అన్నమంత్రి : ", సోమయాజులవారి శ్రీమదాంధ్రమహాభారతములో కొన్ని ఘట్టములేమైనను మాకు అన్వయింపకపోవచ్చును గాని, మాకీ బద్దెనపద్యమే అర్థము కాలే దందురా?"

తిక్కన: "మహామంత్రీశ్వరుడవు నీవు. వీ రందరు ఉద్దండదండనాథులు ! నీకును మిత్రులకును అర్థముకాలేదందునా ? కాని కాపుకవిత్వము సరిగా గ్రహించుట కెంత మెలకువ కావలెనో మీకు నాటజేయవలెనని నా ఉద్దేశము !— సరే !—' మరణాంతక మగును' అన్నాడు కాదూ కవి ?— అయితే ఆ మరణాంతక మెవరి కవునో మీ రెవరైనా ఆలోచించినారా ?"

త్రిపురాంతకుడు : "ఎవరికి మరి ?—ఎవరిదగ్గర నుంటే వారికే !"

తిక్కన : "బద్దెన ఎక్కడనైనా ఆ మాట అన్నాడా ?— శత్రువులకు మరణాంతక మగును అని ఎందు కన్వయింపరాదు?"

ఆ వాక్యముల కందరి ముఖములు వికసించెను. కొందరికి నవ్వుకూడ వచ్చెను.

జాయప: "భేష్ ! కాపుకవిత్వమునకుకూడ వ్యాఖ్యానముచేయుట మీ సొమ్మే నయ్యా, సోమయాజీ !"

అంతట వా రందరు నవ్వైనచో వైదికకరణములు మాకు కావలె నంటే మాకు కావలె నని కోరిరి.

అందుపై నిష్టకథాగోష్ఠి కొంతతడవు జరిగినది. తుదకు సోమయాజులు సూచించినట్లు వారందరు నొక నిర్ధారణకు వచ్చిరి.

తిక్కనసోమయాజులవెంట లెక్కలు క్షుణ్ణముగా తెలిసిన బ్రాహ్మణులు నూర్వురుమాత్రమే యుండిరిగదా ! వారందరు ప్రస్తుత మీ నాలుగుదినములలో వలసినవారికి అత్యవసరము లగు వ్యవహారములు చూచిపెట్టెదరు. ఇంతలో నయమునగాని భయమున గాని ప్రాతయుద్యోగుల గొందరినైన పనులకు రప్పింపజాలమా ? వ్రాయస వృత్తి యొక్క సంఘముపై నాధారపడియుండుట ప్రమాదకరము. ఆరువేలమంది బ్రాహ్మణులకు గ్రామకరణీకములనుండి పెద్దయుద్యోగముల వరకు గావలసిన లెక్కలు

కొలతలు వ్రాతలు అభ్యసింపజేయుటకు ఓరుగల్లులో నొక విద్యాశాల ఈవిజయదశమి నాటికి ప్రారంభింతము. అందులో ఈ నూరుగురు బ్రాహ్మణులే సాయంకాలము లందు అధ్యాపనము గావించుచుందురు. చక్కగా వ్రాయుట చదువుట నేర్చి, సంకలనము వ్యవకలనము గుణనము భాగహారము తెలిసియున్న బ్రాహ్మణు లందరు నీ పాఠశాలలలో చేరవచ్చును. ఆరువేలమంది చాలరు. వారిని మూలధనముగా నుంచుకొన్నచో రెండుసంవత్సరములలో ముప్పదియారువేలమంది సిద్ధమయ్యెదరు. ఇందుకు మహారాజులయు యువరాజులయు అనుమతి పొంది, పురమున చేరిన బ్రాహ్మణబృందములలో నీవార్త పాకునట్లు ప్రకటించి, తగు ప్రయత్నము లన్నియు వెంటనే చేయింపవలెను.

అందున్న మంత్రిసామంతదండనాథు లందరును, అది విని పొందిన యానంద మునకు మేరలేదు. అన్నమంత్రి యందరిపక్షమున మాటాడుచు తిక్కనసోమయాజు లను గురుదక్షిణ కోరుకొమ్మనెను. మిగిలినవారును అట్లే కోరుకొమ్మనిరి.

“ఈ సామ్రాజ్యమునకు మూలస్తంభులైన మీ రంచరు సంతోషించుటే మాకు గురుదక్షిణ. అయినను గురుదక్షిణ విద్యాంతమందు గాని ముందు కాదుగదా!”

తిక్కనసోమయాజుల నిరీహ వా రందరికి నాయనపై నుదయించిన గౌరవ మును శతగుణ మొనర్చెను.

ఆపైని సమ్మె చేసిన కరణముల ప్రస్తావన రాకుండునా? ఆ సంభాషణలో సోమయాజులు కల్పించుకొనలేదు. సల్లాపములకు జేరిన యా దండనాథగోష్ఠి యొక్క క్షణకాలములో రాజవ్యవహారసభగా మారిపోయెను. అన్నమంత్రి యాస్థాన ములోని కవులు గాయకులు నట్టువలు ఇత్యాదులు సెలవుతీసికొని వెళ్ళిరి.

అంబదేవుడు: “మాసోదరులము నిన్ననే రాజధానీనగరమునకు వచ్చినాము. ఉనికి కారణమే యూహింపలేకున్నాము.”

అన్నమంత్రి: “నేనును నిన్ననే వచ్చితిని.”

నాగదేవుడు: “నిన్న సాయంకాలమువరకు నీ ప్రయత్నమే లేదు. భూ వ్యవహారశాలలో స్థితిగతులు ఎట్టి హెచ్చుతగ్గులును లేక క్రమముగా ఉన్నవి. మా అయగాండ్లు నిన్న సాయంత్రమువరకు పనిలో నెట్టి లోపమును చేయలేదని నేడు సరిచూచుకొంటిని.”

గన్నారెడ్డి: “మా స్థలసుంకముల కోశమును సరిగనే యున్నది.”

త్రిపురాంతకుడు: “మేచయనాయకులు ఏ మనుచున్నారో?”

మేచయనాయకులకు నాగదేవు డల్లుడైనందున నీ ప్రశ్న నాతనివైపు తిరిగి యడిగెను.

నాగదేవుడు: “నాయకుల నీనాడు నేను దర్శించుట పడలేదు. నిన్నరాత్రి వరకు వారి కెట్టి శంకయు నున్నట్లు తోపదు.”

అన్నమంత్రి : మా కరణములను నేను కలిసియే యుండనందున మాకు పూర్వ పరిస్థితులుంకూడ తెలియుటలేదు."

మహాదేవరాజు : "మహాలయసభావిశేషములు అందరు నెరుగుదురా ?"

అంబదేవుడు : "మా కవి యేదో చూచాయగా తెలిసినవి."

మహాదేవరాజు ఆ సభావిశేషములు క్లుప్తముగా వర్ణించెను. మధ్యమధ్య జాయపనాయకుడు కలుగజేసికొని మాట్లాడెను.

అన్నమంత్రి : "ఈసమ్మె రాజధానీనగరముననేనా ? జనపదములలో గూడ వ్యాపించినదా ?"

నాగదేవుడు : "జనపదములలో వ్యాపింపలేదని తోచును. ఈ యుదయమున గూడ బంపిన పత్రిక లెన్నో జనపదములనుండి నే నీ యపరాహ్ణమున నే అందుకొని వచ్చితిని."

అంబదేవుడు : "అది కొంత శుభవార్త!"

అన్నమంత్రి ; " శీఘ్రముగా దీనికి ప్రతిక్రియ చేయవలెను."

మహాదేవరాజు :"రాజద్రోహులే ఈ ప్రయత్నము పురికొల్పినారు !"

అందర మనస్సులలో నా తలపే యున్నను ఇతరులు అట్లు వాచ్యముగా చెప్పలేదు.

జాయప : "ఏనుగులకు శిరస్సులో నొక మాద పుట్టును. అది పుట్టినప్పుడు శిరస్సు నటు నిటు లాడించుట యాపివేయును. దానికి వెంటనే ప్రతిక్రియ చేయనిచో ఒకటి రెండు దినములలో గజశరీరమును పట్ట సాధ్యము కాదు."

త్రిపురాంతకుడు : "జాయపనాయకులు సరిగా సెలవిచ్చినారు."

మహాదేవరాజు : "రుద్రదేవమహారాజుల యౌవరాజ్యాభిషేకమునకు విఘ్నము కలిగింపదలచినవారు పన్నిన పన్నుగడ ఇది !"

ఆ భావమే సుందరకు తోచుచుండెను. కాని వీరభద్రేశ్వరనామ ముచ్చరించుటకు శంకించుచు నెవ్వరు నావిషయ మెత్తలేదు.

అన్నమంత్రి : "ఇది మహాప్రమాదకరమైనది. "

జాయప : "మదమెక్కిన సింధురవ్రజమువలెనే విపరీతనష్టము చేయగలదు."

జన్నిగ : "దీనికి శిక్షకూడ కఠినముగా నుండవలెను."

అన్నమంత్రి : "నిజమే ! కాని ఎవరిని శిక్షించునట్లు ? ఎంతమందిని ?— అందరను శిక్షించి వ్యవహారములు సాగించు టెట్లు ?"

చిరునవ్వుతో జాయప ప్రశ్నించెను. " అన్నమంత్రీశ్వరా ! మీ రెన్నడైన వేటాడి ఎరుగుదురా ?"

రాజసేవకై యాతని పూర్వులు శస్త్రధారణ మపక్రమించిరి. ఇన్నితరములుగా శస్త్రము ధరించినను యుద్ధములలో తప్ప ఆ కుటుంబమువారు శస్త్రప్రయో

గము చేసి యెరుగరు. మృగయావినోదము ఇందులూరివారి వంశములో లేదు. అందుచే అన్నమంత్రి తల యెత్తిజాయపవంక జూచి మిన్నకుండెను.

జన్నిగ : "రాజశత్రువుల వేటాడుటలో కొంతకాలముగా మా కాలముగడచి పోవుచున్నది. మృగముల వేటాడిన దినములు మరపుకగులుచున్నవి."

జాయప : "ప్రభుత్వము నెరపువారు వేటాడుచున్నను వేటాడకున్నను మృగ ప్రకృతి తెలిసియుండవలెను. గజములే కాక ఇతరజంతువులును బహుళముగా మందలుగా జీవించుచు సంచరించుచుండును. ప్రతిమందకు అగ్రేసరమైన దుండును. దానిని పట్టివేసినచో మరియొక అగ్రేసరము వచ్చువరకు ఆ మంద చిందరవందర యగును."

అంబదేవుడు : "జాయపనాయకులు చక్కగా నుపదేశించినారు."

త్రిపురాంతకుడు : "ప్రధానకరణములను బట్టి వెంటనే శిరశ్ఛేదములు చేయింప వీరముష్ఠుల కర్పింపవలెను!"

అందు చేరిన మహామాత్యులకును దండనాథులకును సామంతులకును తమ పరి జనమునకు శిరశ్ఛేదము చేయించు నధికారము కలదు. రాజధానీనగరమున నున్నందున మహారాజులకు ముందు తెలుపవలసిన నియమ మొక్కటే యున్నది. మహారాజాను మతి యడిగినదే తడవుగ వారికి లభించును. అట్టి యధికార మన్నమంత్రికిని గలదు. ఐనను అత డొక్కడును కొంచెము వెనుకాడెను.

"వీరిలో కొందరు నిజముగా అనారోగ్యాదికారణములచే రాకుండియుండ వచ్చును. పులువురు చిరకాలముగా విశ్వాసపాత్రులై కొలిచినారు. వెంటనే ఇట్టి కఠినశిక్ష విధించుట ఉచిత మని తోపదు."

మహాదేవరాజు : "ఎంత పదవిలో నున్నను మీ బాపనగుణము విడువలేదే!"

జాయప : "మహాదేవరాజా! మీ రెప్పుడైనా యజ్ఞశాలకు పోయి పశువును పట్టుట చూచినారా?"

అంబదేవుడు : "వారు కత్తితో పశువుప్రాణము తీయించరు."

జాయప : "నవరంధ్రములు మూయింతురు. అన్న మంత్రీశ్వరుల విధానము బ్రాహ్మణవిధానము! మహాదేవరాజులు తొందరపడుచున్నారు."

అచ్చటవా రందరు పెద్దగా నవ్విరి.

అన్నమంత్రి తుద కిట్లు నిర్ధారణ చేసెను.

"ఈ రాత్రియు రేపునుగూడ నందరను తెప్పించుటకు ప్రయత్నింతము. సాధ్యముకానిచో ఇందులో ప్రధానకరణములకుమాత్రము కఠినశిక్షలు విధించి కొలదిమందినిమాత్రమే శిరశ్ఛేదము చేయింప నుత్తరువు లిత్తము."

అచ్చటివా రందరు నందు కంగీకరించిరి. కఠిననిశ్చయములతో వారు ఎవరి మందిరములకు వారు వెడలిపోయిరి.

మరునాడు ఏకశిలానగరములో వీథివీథులను వాడవాడలను వెంటనే పనులలో చేరని కరణములకు కఠినశిక్షలు విధింతుమని వారు ప్రధానుల యనుమతితో చాటింపబంచిరి. అట్లు చాటించి కరణములను రప్పించుటకును, పట్టుకొనుటకును సమస్త ప్రయత్నములు చేసిరి. దానితో నానాడు నగరమంతట నలజడి విపరీతమయ్యెను. పలువురు ప్రధానకరణములను ఇతరకరణములను ఇండ్లు వాకిండ్లు భార్యాపుత్రులను వదలి పారిపోయిరి. దొరకినవారిని దొరకినట్లు భటులు బంధించి యధికారుల కప్పగించుచుండిరి.

సప్తమినాటి యుదయమునకు పలువురు కరణములు స్వయముగా దివాణములకు వినీతులై వచ్చి సామంతదండనాథులకును మంత్రులకును వందనములు చేసి క్షమాభిక్ష వేడికొని పనులు సాగించుటకు ఒప్పుకొనిరి. కాని వారిని నమ్ముటెట్లు ?

వారిలో పలువురను పనులలో చేర్చుకొనిరి. ప్రధానకార్యాలయములలో తిక్కనసోమయాజివెంట వచ్చిన కరణములకు అగ్రస్థానములు లభించెను. వారికి ప్రాణాపాయము రాకుండ ప్రభువులు భటుల గాపుంచి వారిని వేయి కండ్లతో సంరక్షింపవలసివచ్చెను.

## ౧౧

విజయదశమి వచ్చినది. !

నవరాత్రోత్సవములు ముగిసినవి. శ్రీవిశ్వేశ్వరశంభుదేశికుల సమక్షమున వారి శిష్యు డొకడా కార్యకలాప మంతయు దేవేంద్రవైభవముతో నిర్విఘ్నముగా జరిపించెను. దీక్షాంగోపవాసములచే రుద్రమదేవి ఇంచుక కృశించినను ఒక యపూర్వ తేజస్సుతో నలరారుచుండెను.

గణపతిదేవులకుగూడ నొక్కసారిగా ఆరోగ్యము వచ్చినట్లే కనబడెను. బహుకాలముగా మనస్సును బాధించుచున్న హృదయశల్యము ఉద్ధృత మగుటచే వృద్ధచక్రవర్తికి ముఖములో నూతనవికాస ముదయించెను. క్షీణించిన యాయన శరీరమున గూడ క్రొత్తశక్తి యంకురించెను. కూర్చుండు నోపిక వచ్చినది.

ఈనాడు జరుగనున్న యౌవరాజ్యపట్టాభిషేకమునకు కూడిన జనములతో ఓరుగల్లు నిండిపోయెను. సమస్తమండలములనుండియు మహామండలేశ్వరులు, మండలేశ్వరులు, సామంతులు, మంత్రులు దండనాథులు సపరివారముగా నచ్చటికి విచ్చేసిరి. చుట్టుపట్టులనున్న పరిసరగ్రామములనుండియే గాక దూరస్థజనపదములనుండి కూడ ఆ మహోత్సవము తిలకింప జనులు తండోపతండములుగా మూగిరి.

ఆ ఉత్సవమునకై స్థపతులు విశాలోన్నత మగు నొక మనోజ్ఞమండపము సహస్రస్తంభవిరాజితముగా నిర్మించిరి. ఏకశిలానగరమున సహస్రాధికముగా గల చిత్రకారులు అందరును వివిధవర్ణములతోడను చిత్రములతోడను, స్తంభములను

అధోర్ధ్వభాగములందు అలంకరించిరి. అందు ఎల్లరు జూడ ననువగు ప్రదేశమున నున్నత మగు నభిషేకవేది యొందు కల్పించిరి.

అంతకుమున్న వేగరుల బంపి చతుస్సముద్రములనుండియు గంగాకృష్ణాగోదావరీ తుంగభద్రాదిపవిత్రనదులనుండియు సువర్ణకలశములలో జలములు తెప్పించి యుంచిరి. అవి వేరువేరుగా నలంకరించిన వేదికలపై నుంచిరి.

అభిషేకోత్సవము ప్రాతఃకాలముననె మంగళతూర్యపురస్సరముగా జయజయ ఘోషలు మిన్నుముట్టుచుండ ప్రారంభమయ్యెను.

అభిషేకవేదికపై సమున్నతాసనమున శ్రీవిశ్వేశ్వరశంభుదేశికు లాసీను లైరి. వారి సమీపముననే ఉన్నతాసనమున గణపతిదేవులును మరియొక భద్రాసనమున రుద్రమదేవియు నుపవిష్టులైరి. ఆవేదిసమీపముననే ఉత్తమబహువేదవిప్రులు అపరాగ్నిహోత్రులవలె సమావిష్టులై యుండిరి.

ముందుగా నా విప్రుల యనుజ్ఞ నొంది శ్రీవిశ్వేశ్వరశంభుదేశికులు శ్రీ మహాగణాధిపతిపూజయు స్వస్తిపుణ్యాహవాచనమును మంటపారాధనమును గావించిరి. సువర్ణకలశములలో సముద్రోదకములను గంగాదినదీతోయములను ఉంచి నవరత్నములు మంత్రపూర్వకముగా నందు నిక్షేపించి అభిషేకోచితమూలికాదిద్రవ్యము లందుంచి సామ్రాజ్యాధిదేవతాహ్వాన మొనర్చి పూజాదికము నిర్వర్తించిరి.

రాజపురోహితు డంతకుమున్న పూజాసంస్కారములు చేసిన వరాహలాంఛిత సువర్ణరత్నపట్ట మొకటి శ్రీగణపతిదేవచక్రవర్తులు స్వహస్తములతో శ్రీరుద్రమదేవిఫాలమున గట్టి యక్షత లామెశిరస్సున నుంచిరి. ఆమెశిరస్సుపై సువర్ణచ్ఛత్ర మెత్తబడెను. వేదవిప్రులు స్వస్తివాచన మారంభించిరి. అభిషేకోదకము ఏడు కలశములలో వేర్వేరుగా నుంచబడెను.

అందు ప్రథమకలశము రాజగురువులయొద్దను, రెండవది శ్రీగణపతిదేవులయొద్దను ఉంచిరి. మూడవదానియొద్దకు ఇందులూరి అన్నమంత్రిని, అప్పటి కందుకోనిన కోలని రుద్రుని, రమ్మని యాహ్వానించిరి. నాలవదానియొద్దకు వీరభల్లటదేశికుల బిలిచిరి. మరియొకదానియొద్ద వీరభద్రేశ్వరుని మహాదేవరాజును బాలప్రతాపరుద్రుని నిలిపిరి. ఇంకొక కలశపార్శ్వమున మేచయనాయకుని శ్రీమక్ గోవిందనాయకుని బయ్యనునాయకుని జన్నిగదేవుని గన్నారెడ్డిని నాగదేవుని ఉండ నియమించిరి. చివరదానియొద్ద నిలువ పౌరజానపదులలో పెద్దలను శ్రేణీపతులను బిలిచిరి.

అట్లు ఆహూతులైనవారి కెల్లరకును చక్రవర్తి రత్నాంబరాభరణాదులు ముందు కట్టబెట్టించెను.

అంతట రాజగురువుల యనుమతితో వేదవిప్రుల సామ్రాజ్యమంత్రపఠనము నారంభించిరి. పూర్వనియమితు లందరు తమయెదుట నుంచిన సువర్ణకలశములనుండి పచ్చని యాకులతో శ్రీరుద్రమదేవి నభిషేకించిరి.

ఈ యభిషేకకలాపము రెండుగడియలసేపు సాగెను. శిరస్సునుండి స్రవించుచున్న యా పవిత్రవారిధారలతో రుద్రమదేవి గంగాధరు డగు రుద్రునివలెనే భాసిం

చెను. ఆ మండపమున గూడిన మహాజనము లానందముతో జయజయనినాదములు చేయుచుండెను. ఎవరి నిర్ణీతస్థానములలో వారు కదలక కూర్చుండి వేరు ప్రసంగములు మాని యా మహోత్సవమునే తిలకించుచుండిరి.

యౌవరాజ్యపట్టాభిషేకానంతరమున కులపెద్ద లందరకు సువర్ణాక్షతలు పంచి పెట్టిరి. పరంపరాగతముగా నిర్ణీతమై వచ్చుచున్న యాచారక్రమమున వరుసతప్పక వారొక్కరొక్కరె శ్రీరుద్రమదేవిని సమీపించిరి. ఎవరి యధికారప్రకారము వా రామెశిరస్సునను పాదములను ఆ యక్షత లుంచిరి. అట్లు వచ్చినవారి కెల్ల గణపతి దేవులు సువర్ణరత్నాంబరాభరణాదులు విరివిగా కట్టబెట్టించుచుండిరి. ఈఉత్సవము మధ్యాహ్న సమయమువరకు పట్టెను.

అప్పుడు శ్రీవిశ్వేశ్వరశంభుదేశికులు ఏదో సెలవీయనున్నా రని సువర్ణదండములు ధరించిన చోపుదారులు కేకలు వేసిరి. ఆ మహాసభ యనతికాలముననె నిశ్శబ్ద మయ్యెను.

"మీ యందర సమక్షమునను శ్రీగణపతిదేవచక్రవర్తులయు ఇందు కూడిన సమస్తమంత్రిసామంతమండలేశ్వరదండనాథపౌరజానపదుల యనుమతితో శ్రీరుద్రమ దేవులకు యౌవరాజ్యపట్టాభిషేకము జయప్రదముగా తీర్చినాము. ఈ పవిత్ర దీక్షాసమయమున రాజగురువులు నామకరణము చేయు నాచారము మీ రెరుగనిది కాదు. ఏతత్క్షణమునుండి ఈయువరాజులు శ్రీ రుద్రదేవమహారాజనామము ధరింతురు గాక! ఇతఃపరం శ్రీరుద్రదేవమహారాజనామ్నా వర్ధస్వ!" యనుచు రాజగురువులు స్వయముగా నామెశిరస్సుపై సువర్ణరత్నాక్షత లుంచిరి.

వెంటనే జయజయ శ్రీ రుద్రదేవమహారాజ! అను జయఘోషలు మండప మంతట జెలంగెను.

ఆసమయమున ప్రక్కన నంతఃపురజనము కూరుచున్న యవనికచాటుననుండి మంజుల మగు నొక కలకలము ప్రారంభించెను. అందుండి పలువురు బాలురు బాలికలు చిత్రచిత్రోజ్జ్వలవేషములు ధరించి రంగురంగుల పతాకలు గల గిడలు పట్టుకొని శ్రీరుద్రమహారాజు నెదుట ప్రత్యక్షమై—

"జయ! అభిజయీ భవ! దిగ్విజయీ భవ!" అనుచు జయనాద మొనర్చిరి. శ్రావ్యములగు కంఠములతో నిరువురుబాలకులు ముందు చెప్పుచుండగా మిగిలినవారు వారివెంట నిట్లు పఠించిరి.

ధర సింహాసనమై, నభంబు గొడుగై, తద్దేవతల్ భృత్యులై,
పరమామ్నాయము లెల్ల వందిగణమై, బ్రహ్మాండ మాకారమై,
సిరి భార్యామణియై, విరించి కొడుకై శ్రీగంగసత్పుత్రియై,
వరుసన్ నీ ఘనరాజసంబు నిజమై వర్థిల్లు నారాయణా!
జయ! అభిజయీ భవ! దిగ్విజయీ భవ!

శ్రీ హరికరుణాకటాక్షవీక్షణాలంకారా! అర్థిజనకుముదచంద్రోదయా! ఆశ్రితవిద్వజ్జనాధార! సత్యభాషాహరిశ్చంద్రా! సంగీతవిద్యానారదా! సాహిత్య విద్యాచతుర్ముఖా! దానరాధేయా! సంగ్రామధనంజయా! ఒయ్యారికోలాహలా! కదనవిజయమార్తాండా! కలియుగరామా! కలియుగభీమా! మనుజమందారా!

జయ! అభిజయీ భవ! దిగ్విజయీ భవ!
శ్రీగణాధీశాయ శివకుమారాయ
నాగముఖతుండాయ నాగభూషాయ
లోకజనవంద్యాయ లోలనేత్రాయ
శ్రీకంఠతనయాయ సృష్టి కారాయ—మంగళమ్
బాగుగా విద్యలకు ప్రౌఢిగా దేవ
నీ గరిమ జగములను నిలిపితివి భళిర!
కనకాద్రిధీరాయ గణనాయకాయ - మంగళమ్!
గణుతింతు మి మ్మెపుడు గణనాథదేవ!
జయ! అభిజయీ భవ! దిగ్విజయీ భవ!
సరస్వతి మతి మాకు చాలగా నిమ్మ
పరమభక్తుల నెల్ల పాలించవమ్మ
వల్లకీన్పృదుపాణి, వరనీలవేణి,
పల్లవారుణపాణి, పరమకల్యాణి,
సమ్మతిగ మము బ్రోవు సద్గుణకదంబ
మమ్ము ధన్యుల జేయుమా శారదాంబ!
జయ! అభిజయీ భవ! దిగ్విజయీ భవ!

ఆ యంధ్రబాలబాలికలు గావించిన విజయదశమీవిజయాశీర్వాదముతో సభ యంతయు నానందతన్మయ మయ్యెను. గణపతిదేవుల కానందబాష్పములే వచ్చెను. శ్రీరుద్రదేవమహారాజు దానిని తలయొగ్గి స్వీకరించెను. రాజాజ్ఞతో వా రందరికి నమూల్యము లగు బహుమానములు పంచిపెట్టబడెను.

అంతట వెండికఱ్ఱలు ధరించిన చోపుదారు లిట్లు ప్రకటించిరి.

"మీ రందరును మిక్కిలి బడలి యున్నారు. శ్రీగణపతిదేవచక్రవర్తులవారు మీకై యేర్పరచి యుంచిన భోజనశాలలలో సుఖభోజనములు చేసి వారి నానందింప జేయ నాహ్వానించుచున్నారు. ఈ మండపముననే మూడుజాములవేళ పేరోలగము తీరియుందురు. మీ రందరును రావలసినది!"

అది యాలకించి చేరిన జనములు విచ్చిపోయి భోజనశాలలకు చేరిరి. అచ్చట వేలసంఖ్యలుగా సేవకులు వారి మజ్జనభోజనాదులకు సదుపాయములు చేసియుంచిరి. అవసరము లగున వన్నియు ఎవరి కులకట్టాచారములకు అనువుగా సిద్ధపరచియున్నవి. వా రందరందు పంచభక్ష్యపరమాన్నములతో షడ్రసోపేతముగ భుజించి తాంబూలములు సేవించి యించుక విశ్రమించి పేరోలగము దర్శింప సభామండపమునకు చేరికొనసాగిరి.

స్వరిగా మూడుజాములకింకను ఒక గడియ వ్యవధి యుండగనే ఆ విశాలసభామండపము నిండిపోయెను. వేదికామధ్యమున రెండు భద్రాసనములును వానివెనుక నొక యున్నతాసనము నుండెను.

సభాప్రారంభమునకు అరగడియ ముందుగా అంధ్రోర్వీశుమోసాలపై గడియారమున ఖంగుఖంగున ఇరువదిరెండు గంటలు కొట్టిరి. ఆ ఘంటానినాదము ప్రణవనాదమువలె నా మండప మంతట ప్రసరించి మ్రోగెను. ఆ శ్రుతి ఉపశమించులోతడవుగా రాజమందిరాంతరములనుండి మంగళతూర్య పంచకము శ్రవణపర్వముగా నొక్కసారి మ్రోసెను. ఆ మంగళవాద్యములలోనుండి జంటసన్నాయిస్వరము, జంటడోళ్ళ ధ్వనియు వెలువడి మనోజ్ఞమై దిగంతముల వ్యాపించెను.

వందిమాగధుల కైవారములు విననయ్యెను. చోపుదారులు బహుపరాకులు చెప్పిరి. ముందు పగటిదివ్వెలు కననయ్యెను.

శ్రీసాంబసదాశివు ననుగమించు కేశవస్వయంభూమూర్తుల ననుకరించుచు శ్వేతాతపత్రములనీడల శ్రీవిశ్వేశ్వరశంభుదేశికుల వెంట గణపతిదేవులును రుద్రదేవమహారాజులును చామరగ్రాహిణులు వింజామరలు వీవ ఆ సభామండపము ప్రవేశించిరి. ఒక్కసారిగా సభాసదు లందరు జయజయనినాదములు చేయుచు లేచి నిలుచుండి నమస్కరించిరి.

చక్రవర్తియు యువరాజును శ్రీవిశ్వేశ్వరశంభువులను వేదికవెనుకభాగమున నున్న యున్నతాసనమున సగౌరవముగా నాసీను జేసి వారికి నమస్కరించిరి. అంతట గణపతిదేవులు మహాసభకు చేతులుజోడించి నిలిచెను. అంతలో రాజపురోహితుడు చక్రవర్తుల భద్రాసనమును సంస్కరించి పూజింపగా, శ్రీగణపతిదేవులు దానికి నమస్కరించి పరిషదనుజ్ఞ నంది యం దధివసించెను. అట్లే శ్రీరుద్రదేవమహారాజును పరిషద్వందన మాచరించి సంస్కృతపూజిత భద్రాసనమునకు నమస్కరించి యందుపవిష్ట యయ్యెను.

కార్యభరణు డగు దామనామాత్యు డిట్లు ప్రకటించెను :

"స్వస్తి, శ్రీమదపారపారావారపరివృతమహీతలంబున సకలవిద్వజ్జననినుతంబగు నంధ్రదేశంబునకు విభూషణం బగు నేకశిలాపురవరంబు నిజరాజధానిగా నొప్పుచున్న శ్రీకాకతిభూపాలక్రమంబున జనవినుతయశోవిలాసుండును విజయలక్ష్మీవిలాసుండును శ్రీమన్మహాదేవరాయపుత్రుండును సదారాధితత్రినేత్రుండును విబుధజనవనవసంతుండును రమణీయసీమంతినీజయంతుండును సకలజనమనోరంజనుండును అరాతిరాజమదభంజనుండును శరణాగతరాజన్యశరణ్యుండును సత్యహరిశ్చంద్రుండును విభవామరేంద్రుండును వరాహలాంఛనుండును స్వర్లోకాశ్రియ శ్రీకాకతివంశపారావారసుధాకరుండును నగు శ్రీగణపతిదేవచక్రవర్తులు శ్రీరుద్రదేవమహారాజులుంగారి కీనాడు యువరాజ్యాభిషేకము రాజగురుప్రధానమంత్రిదండనాథ ప్రకృతి

సామంతసర్వజనసమక్షంబున జేసి యీ శుభముహూర్తమున పేరోలగము తీరి యున్నారు. సమస్తమంత్రి సామంతమండలేశ్వరదండనాథ ప్రధానాదులును శ్రీరుద్ర దేవమహారాజులయెదుట తత్సేవాప్రతిజ్ఞలు పరిషత్సమక్షమున జేయ చక్రవర్తు లాజ్ఞాపించుచున్నారు."

రాజాజ్ఞ ననుసరించి యందరను ప్రభుభక్తిప్రమాణములు చేసిరి. ముఖ్యు లందరు నొకరి తరువాత నొకరు వచ్చి శ్రీరుద్రదేవమహారాజులకు వందన మాచరించి ఖడ్గము చేత బుచ్చుకొని వారికి తను సేవకజీవిత మంకిత మొనర్చుచున్నా మని కఠిన ప్రతిజ్ఞలు చేసిరి. ముఖ్యు లందరు నైనపిమ్మట సమస్తప్రకృతులును ఒక్కసారిగా నట్లే ప్రతినలు చేసిరి.

ఆ మహాసభకు శ్రీ వీరభద్రేశ్వరుడు కాని యాతని పుత్రులు గాని రాలేదు. గణపతిదేవులును మహామాత్యులును వది ప్రథమముననే గమనించిరి. వారు ముగ్వురను వారొకకంట గనిపెట్టుచునే యుండిరి. పట్టాభిషేకమహోత్సవమునకే వారువత్తురో రారో యని వారు ముందు సంశయించిరి. వారా సమయమునకు వచ్చినందున నీ సాయంకాలమునకు వత్తురను నూహ వారలకు బలపడెను. అందుచే వారు సకాల మునకు రాకుంట ప్రమాదజనితమైన యాలస్య మగు నేమో యని కొంతతడవు చింతించిరి.

అంతలో దౌవారికుడు పరిజనముచే చక్రవర్తికి మూడు పత్రములు పంపించెను. అవి కార్యభరణు డగు దామనామాత్యుడు చదువుకొని చక్రవర్తుల శ్రీహస్తముల కందింపజేసెను.

అవి వీరభద్రేశ్వరుడును అతని కుమారు లిద్దరును పంపుకొనిన పత్రములు! వానిలో వారు ముగ్వురును శ్రీగణపతిదేవుల యనుగ్రహముచే వారికి సంప్రాప్తమైన సమస్తగౌరవములును బిరుదములు ఉద్యోగములును వినయవిధేయతలతో వదలుకొని ప్రభువులకు తిరిగి సమర్పించుకొనిన ట్లుండెను. వీరభద్రేశ్వరుని పత్రములో నొక విశేషముకూడ కలదు. అందు దాను విరక్తుడై సన్యసించు నుద్దేశముతో నున్నందున పేరోలగమునకు వచ్చుట సమంజసము కాదని మానివేసినట్లు కూడ తెలిపెను.

గణపతిదేవుడు స్వయముగా నాపత్రములు చదువుకొని వారల ముగ్వురను వెంటనే చెరసాలలో పెట్టవలె నను నాజ్ఞ లిఖించి మేచయనాయకున కందించెను. ఆ విజయసభ జరుగుచుండగనే మేచయనాయకు డందుండి వెడలిపోయెను.

అంతట గణపతిదేవులు రాజసభలోనుండి పర్వతనాయకుని బిలిపించిరి. అతడు నాలుగుమూరల ప్రమాణమును మించిన యత్యున్నతశరీరుడు. అంత పొడవు మీద నాతడు లావున్నను సన్నగా కనబడును. పూర్వము అగస్త్యుని దర్శనము కాక ముందు వింధ్యపర్వత మిట్లే యుండెనా యనిపించును. వెంటనే యాతడు మహా రాజులఎదుట నిలిచి వంగి నమస్కరించి నిలుచుండెను. ఆతని నిలుచున్న తీరులోని ఠీవి రాజసభ నెల్ల ఆకర్షించెను.

ఇతని నెందులకు మహారాజులు పిలిపించిరి? మహారాజుకు అకారణముగా నిగ్రహానుగ్రహములు కలుగుట వారి కెల్లరకు గొంత యనుభవ మున్నది. పర్వత

నాయకుని ముఖములో నాక్షణమున నెట్టి భయమును కలుగలేదు. లోతైన కన్నులలోనుండి గణపతిదేవుడా నిలిచియున్న వ్యక్తిని కొన్ని క్షణములపాటు తదేక దృష్టితో తిలకించెను. ఆ దృష్టి యాపాదమస్తకము నాతనిలోనుండి చొచ్చుకొని యంతరాంతరములు తిలకించుచున్నట్లుండెను. ఆ చూపును నిలువగలుగుట సామాన్యులకు కష్టతరము. పర్వతనాయకుడు నిశ్చలుడై, పాలుగారుచు వినయగౌరవగాంభీర్యములు ప్రకటించు ముఖభంగితో రాజాజ్ఞకెదురుచూచుచుండెను.

"పర్వతనాయకా, యువరాజుల కంగరక్షకుని నియమింపవలసి యున్నది. నిన్నా పదవికి నియోగింప నెన్నితిమి !"

"మహాప్రసాదము ! అనుచు పర్వతనాయకుడు గణపతిదేవులయెదుట మోకరించి పాదాభివందన మొనర్చెను.

వెంటనే కార్యభరణు డగు దామనామాత్యు డాజ్ఞాపత్రము లిఖించి రాజముద్రాంకితము చేయించి మహారాజుల కందిచ్చెను. అది స్వహస్తముతో మహారాజు పర్వతనాయకున కీయ నాత డది రెండుచేతుల నందుకొని కన్నుల కద్దుకొని లేచి శ్రీరుద్రదేవమహారాజులకు నమస్కరించి తన ఖడ్గము నంటి సేవాప్రతిజ్ఞ చేసెను.

అంతట గణపతిదేవుల యాజ్ఞ దామనామాత్యుడు వినిపించెను. జన్నిగదేవుని త్రిపురాంతకుని అంబదేవుని వారి ఖడ్గములను తిక్కచమూపతి వెంటనే యర్పించి మహారాజుల సన్నిధికి రావలసిన దని యాయాజ్ఞ తెలిపెను.

ఆ యాజ్ఞ సభ నంతటిని సమ్మోహితుల జేసెను. ఈ మహాసేనానులపై మహారాజు కాగ్రహము కలిగినదా ? కాకతిసామ్రాజ్యమహాసౌధమునకు మూలస్తంభుల వంటివారే వీరు. వీరిని గణపతిదేవు లేమి చేయదలచినారు ? ఇంతవారి కింత యవమానము చేసిన వారు సహింతురా ? మహాప్రధాను లగు శ్రీమల్ల గోవిందనాయకుడును బయ్యనినాయకుడునే అంతరంగములలో నలజడి నొందిరి. సభనిస్తబ్ధమయ్యెను. ఇది యంతయు త్రుటికాలములో జరిగిపోయెను.

అట్లు నిర్దేశింపబడిన ముప్వురు సేనానులును నిలువున నిలుచుండిరి. వరుసగా వారు తిక్కచమూపతిని సమీపించిరి. ముందు జన్నిగదేవుడు తన యొరలోనుండి రత్నత్సరువిరాజిత మగు ఖడ్గము తీసి కన్నుల కద్దుకొని నిస్తంద్రుడై తిక్కచమూపతి కర్పించెను. ఆతని కన్ను లార్ద్రము లగుట యొక విశేషమా ? అతనివెంట త్రిపురాంతకుడును అంబదేవుడును అట్లే యొనర్చిరి. వారు ముప్వురును ఖడ్గహీనులై శక్తిహీను లగు శివులవలెను నికృత్తశిఖు లగు శ్రోత్రియగృహస్థులవలెను నిస్తేజులై యా సభాస్థానమున గనబడిరి. ఆ మహావీరుల నా యవస్థలో చూచుటకుగూడ సభాసదులకు కష్ట మనిపించెను.

మరల దామనామాత్యుడు రాజశాసనము వినిపించెను.

"మీరు ముప్వురును శ్రీగణపతిదేవులకు ప్రియతమసేవకులలోనివారు. మహాలయామావాస్యనాటి సభకు రాజధానీనగరమునకు విధిగా రావలసిన దని మీ కాజ్ఞలు పంపబడినవి. అయినను మీరు రాకుంటిరి. మీవంటి ప్రధానపురుషులు రాకుండుటచే

వా సభలో లోటుగా కనిపించెను. మీరు మువ్వురును ఈ సభకు మూడు కత్తులవంటి వారు. మీరు లేని సభ మీ యిప్పటి మూర్తులవలెనే యుండెను. మీరు రాకుండు టకు కారణమైన ముందుగా నివేదించుకొని యుండలేదు. ఈ మహాసభాసమక్షమున మీరు అందువిషయము చెప్పికొనునది విన్నవించుకొందురుగాక !”

జన్నిగదేవుడు మహాసభకును చక్రవర్తికిని నమస్కరించి వినీతుడై యిట్లు నివే దించెను.

“మా మండలము దక్షిణపు సరిహద్దులు దాటి జటావర్మసుందరపాండ్యునియు కొప్పెరుంజింగనియు మహాసేనలు అలజడిచేయుచున్నవి. అట్టి ప్రమాదస్థితి నెదుర్కొ నుచు దూరమున నుండుటచే రాజశాసనము ఆలస్యముగా నాకు జేరినది. అందుచే సకా లమున జేరికొనలేకపోతిని. వచ్చు ప్రయత్నములో నుండుటచే ముందుగా వార్త పంప లేదు.”

త్రిపురాంతకు డిట్లు నివేదించెను.

“మా అన్నగారు జన్నిగదేవుల శాసనముచే సిద్ధయదేవచోడుని సేనలతో బోరుచు సకాలమున రాలేకపోతిని. నాకును రాజశాసన మాలస్యముగా చేరినది. ఎప్పటికప్పుడు రాజధానికి బయలుదేరుచు నాగుచు నున్నందున ముందు వార్త పంపుట పడలేదు.”

అంబదేవు డిట్లు పల్కెను.

“మహారాజా, అన్నగారి శాసనమున నేను రాజశత్రువులు పలువురతో పోరు చుంటిని. ఎఱువమల్లిచోడుని పారదోలిన కేశవదేవసోమిదేవుల నెదుర్కొనవలసి వచ్చినది. వారల నిర్జించిన అల్లుగంగును, మల్లికార్జునుని, దామోదరుని సేనలు తాకి నవి. మహారాజసేవావ్యగ్రుడనై సమయమునకు రాలేకపోతిని. క్షంతవ్యుడను.”

వారల మాటలచే సామ్రాజ్యమున కట్టి యుపద్రవములు దాపురించినవో సభకు విస్పష్ట మయ్యెను. ఇట్లు దీక్షతో రాజసేవ చెయుచున్నవారి కీ యగౌరవ మేమి ?

వెంటనే గణపతిదేవుల శాసనము దామనామాత్యుడు వినిపించెను.

“మహావీరు లగు మిమ్ముల నెట్టి యగౌరవమును జేయుట మహారాజులకు సమ్మ తము కాదు. మహారాజులు వృద్ధులై విరక్తులై రాజ్యభారము శ్రీరుద్రదేవమహా రాజులయందు ప్రతిష్ఠించుచున్నారు. ప్రకృతిసిద్ధముగా వాడిగల మీ ఖడ్గములకు వేడికూడ కూర్పవలసిన సమయ మాసన్న మైనది. మీరు పేర్కొనిన రాజశత్రువుల నెల్లర శీఘ్రముగా లోగొందు మని శ్రీరుద్రదేవమహారాజులకు ప్రతిజ్ఞాపూర్వక ముగా విన్నవించుకొని, మీ ఖడ్గములును సమస్తగౌరవములును మీరు పొందవచ్చును.”

సభ కొక్కసారిగా భారము తీరిన ట్లయ్యెను. ఈ వృద్ధరాజు కెట్టి నైపుణ్య మున్నది !

వెంటనే ఆ వీరసోదరులు మువ్వురును శ్రీరుద్రదేవమహారాజుల కెరగి, మరల విజయదశమి రాకమున్న, పాండ్యపల్లవచోళాదిశత్రువుల నెల్లర బేర్కొని, వారి

నిర్జింతు మని కఠోరప్రతిజ్ఞలు చేసిరి. శ్రీరుద్రదేవమహారాజులు వారల నెర్రవుగ్దియల రసముతో నలంకరింపజేసి, మూడు బంగారుపళ్ళెరములలో వీరతాంబూలము లుంచి అందులో నా ఖడ్గములు మూడును వేర్వేర నునిచి వరుసగా ముప్పురకు బహూకరించెను. వా రవి మహాప్రసాద మని స్వీకరించి మరల పూర్వప్రతిజ్ఞలు చేసిరి. ఒక్కసారిగా సభ్యులు జయజయ నినాదములు చేసిరి. ఆ కాయస్థసేనానుల కది నూతన గౌరవముగన్నె భాసించెను.

పిమ్మట మరియొక రాజశాసనము కార్యభరణు డిట్లు చదివెను.

"ఇందులూరి అన్నమంత్రులును కొలని రుద్రదేవులును మహాలయామావాస్య సభకు రాకున్నందుకు కారణము మహాసభకు నివేదించుకొందురుగాక !"

ఇది యేమి ? వీరిని ఖడ్గములు వదలు డనలేదు. ఇం దేదో రహస్య మున్నది !

ఇందులూరి అన్నమంత్రి లేచి మహాసభకు నమస్కరించి చెప్పకొనెను.

"గోదావరీనదియు శబరియు విపరీతముగా వరదలు వచ్చి పొంగి మండలముపై బడినవి. గ్రామము లెన్నో మునిగినవి. వేనవేలుగా ప్రజలు నిరాధారులై ప్రాణాపాయస్థితిలో నుండిరి. అల్లాడిపోవుచున్న జనుల బాధ చూచుచు ప్రతిక్రియలు స్వయముగా దగ్గర నుండి చేయింపకుండ కదలి రాలేకపోతిని. ఖనకులకు స్థపతులకు తక్షకులకు ఆజ్ఞ లిచ్చుచు ఆర్తులకు అన్నవస్త్రనివాససౌకర్యములు కలిగించుచు మహారాజులకు క్షమాపణపత్రము ముందుగనే పంపుకొంటిని. స్థితిగతులు కొంత దారిలోనికి వచ్చినతరువాత మిగిలిన కార్యములు రుద్రదేవుల కప్పగించి ముందు రాజదర్శనమునకు వచ్చితిని. కొలని రుద్రుల యాలస్యమునకు గూడ నేనే కారణుడను !"

కొలని రుద్రుడు అన్నమంత్రివాక్యము లే ధ్రువపరిచెను.

గణపతిదేవుల యాజ్ఞ మరల కార్యభరణుడు వినిపించెను.

"ఇందులూరి అన్నమంత్రీశ్వరులును కొలని రుద్రులును వారియందు మహారాజులు మోపిన కార్యభారము విధిపూర్వకముగా నెరవేర్చిరి. అన్నమంత్రీశ్వరులు ప్రజాక్షేమమునకై కోరుకొను వర మేదే నున్న శ్రీరుద్రదేవమహారాజులు తీర్పగలరు. మే మింతటితో ప్రత్యక్షముగా శాసనములు చేయుట విరమించి శ్రీరుద్రదేవమహారాజుల కా భార మిప్పుడే అప్పగించుచున్నాము !"

అంతట గణపతిదేవులు శ్రీరుద్రదేవమహారాజులకు రత్నఖచితసువర్ణముద్రాంగుళీయము సమర్పింప, నది వినయపూర్వకముగా వా రందుకొని కన్నుల కద్దుకొని స్వీకరించిరి.

అన్నమంత్రీశ్వరు డిట్లర్థించెను :

"మహారాజులు నవరాత్రదీక్షలో నిమగ్నులై యుండ నొక్కసారిగా మా కరణములు పనులకు రాక చికాకుపగచిరి. వా రెక్కువభాగము జైనులు. వారి నింతవరకు మే మెట్టి చిక్కులు పెట్టక అధికాదరముతో జూచుచుంటిమి. వారి కీ బుద్ధి యొక్కసారిగా ఏల పుట్టినదో ఎరుగము. అందుచే ఈ వ్రాయసవృత్తి యొకే సంఘమున పారంపర్యముగా నుండుట పరిపాలనకు ప్రమాదకర మని స్పష్టమైనది. విచారించగా

పలువురు బ్రాహ్మణులు వ్రాయసవృత్తి ఆమూలాగ్ర మభ్యసింప కుతూహలముతో నున్నట్లు మాకు తెలిసినది. అదృష్టవశమున పాకనాటినుండి తద్వ్యవహార రహస్యము లెరిగిన విప్రులు నూరుగు రిమధ్య ఓరుగంటికి వచ్చియున్నారు. వారు దక్షులు. వారిచే బ్రాహ్మణులకు కరణపాఠశాల ప్రారంభింపజేయుట ప్రజాక్షేమకర మని మాకు తోచినది. శ్రీరుద్రదేవమహారాజుల సముఖమున, ఈ గోధూళికాపవిత్ర లగ్న మున, అందు మంగళపాఠ ముపక్రమింప ననుజ్ఞ యిచ్చుటే నేను అర్థించువరము!"

శ్రీరుద్రదేవమహారాజు ప్రీతివిలోకనములు అన్నమంత్రిపై పరపెను. ఆ మధ్యాహ్నమే వారికి కరణముల యలజడి నివేదింపబడియుండెను. దానికి ప్రతి క్రియగా అన్నమంత్రి యిది తన కుపదేశించుచున్నట్లే ఆమె భావించెను. వెంటనే యామె యిట్లు శాసించెను.

"శ్రీగణపతిదేవులు రాజ్యభారము మాపై మోపిన దిప్పుడే! మా ప్రథమశాస నము మా కెంతయు నానందదాయకముగా నున్నది. ఈ పాఠశాల వెంటనే ప్రారం భింప ననుజ్ఞ యిచ్చుచున్నాము!"

ఇంచులూరి అన్నమంత్రిచే ననుజ్ఞాతులై, ఆ మహామండపమునకు ఆ నూరుగురు బ్రాహ్మణులును గురునాథుని వెంట వచ్చి, వారి కాయితమొనరించిన యాసనముల నుపవిష్టులైరి. ఆ పాఠశాలలో నభ్యసింపదలచిన బ్రాహ్మణులను రండన, నొక్క సారిగా ఆరువేలమంది శ్రోత్రియబ్రాహ్మణులు వచ్చిరి. ఉత్తరక్షణములో గురు నాథుడు పరిషదనుజ్ఞ పొంది, శ్రీమహాగణాధిపతిపూజ కావించి, మంగళపాఠము ధీరగంభీరవాక్కులతో ప్రారంభించెను. ఆనాడు ద్రవ్యసంజ్ఞ, తులామానము, భూమానము, ధాన్యసంజ్ఞ, సంఖ్యాస్థాననిరూపణమును లీలావతీగణితములోని మొదటి పదిశ్లోకములతో అధ్యాపన మొనర్చి మంగళము చెప్పెను.

అంతలో కార్యభరణుడు శ్రీరుద్రదేవమహారాజుల హస్తములలో కొన్ని పత్రము లుంచెను. అవి చూచి యామె యుత్తరక్షణమున నిట్లు శాసనము చేసెను.

"మా మంత్రులును సామంతులును దండనాథులును తమ ప్రధానకరణములను శిరశ్ఛేదము చేయింప మా యనుమతి వేడుచు పంపిన పత్రము లివి! మా మహా మాత్యుల యభ్యర్థనము ధర్మబద్ధమే. అయినను ఈ యానందసమయమున ఈ కరణ ముల నందరను మేము క్షమించుచున్నాము. అందుచే ఈ యపరాధమునకు బంధింప బడినవారినిగూడ, నందర విడిపింపవలె నని ఇందుమూలముగా నాజ్ఞాపించుచున్నాము. వారల మరల పూర్వోద్యోగములో చేర్చుకొనుటో మానుటో మా మహామాత్యాదుల నిర్ణయమునకే వదలిపెట్టుచున్నాము. ఐనను వారల నందర దయాదృష్టితో వారు చూడగల రని మా విశ్వాసము! మా ప్రజలయం దందరియెడ మాకెట్టి సమాన వాత్సల్య మున్నదో, సమస్తజనమును దీనితోనైన దెలిసికొందురుగాక!"

ఈ యాజ్ఞ విని యా మహాసభలోని యార్యజనములు సాధువాదము లొనర్చిరి.

అంతలో మేచయనాయకు డచ్చటికి తిరిగివచ్చెను. అతడు తాను వెడలిన వ్యవహారఫలితము శ్రీగణపతిదేవులకు నివేదింపబోయెను. గణపతిదేవులు వినిపించు కొనలేదు. కార్యభరణుడు రాజ్యభారము వారు శ్రీరుద్రదేవమహారాజుల కప్పగించి

రని చెప్పగా, నాతడు దిద్దుకొని శ్రీ రుద్రదేవమహారాజులకు మ్రొక్కి జనాంతికముగా నిట్లు నివేదించెను.

"శ్రీ చాళుక్యవీరభద్రేశ్వరులను హరిహరదేవమురారిదేవులను మహారాజాజ్ఞచే బంధించుటకు వెళ్ళితిని. వారు దొరకలేదు. కాని వారికై యాశ్విక లన్ని దిశల వెదకుచున్నారు. కారాగారమునుండి బంధితులు కొందరు తప్పించుకొని రని తెలియవచ్చినది."

ఇట్లు నివేదించి యాతడు సెలవుతీసికొని వెళ్ళిపోయెను.

పంచతూర్యారవము లొక్కసారి చెలంగెను. బ్రాహ్మణులు స్వస్తివాచనము ప్రారంభించిరి. సభ్యులు జయజయనినాదము లొనర్చిరి. సువర్ణదండధరులు బహుపరాకులతో దారితీసిరి. ముందు దివిటీలు కదలెను. వందిమాగధులు కైవారము లొనర్చిరి. శ్రీ రుద్రదేవమహారాజులు విజయయాత్రోత్సవమునకు బయలుదేరిరి. వారివెంట అన్నమంత్రీశ్వరాదులు అనుగమించిరి.

ఆ సభామండపమునకు సమీపముననే యొక విశాలప్రదేశమున నొక జమ్మిచెట్టు కలదు. దానిపైనుండి వివిధశత్రునామము లున్న చిత్రపత్రములు వ్రేలాడగట్టియుండెను. పర్వతనాయకుడు శ్రీ రుద్రదేవమహారాజులకు విల్లు నంబులు నందించెను. నారం దర్ధచంద్రబాణము సంధించి ఆ వ్రేలాడు పత్రములలో ప్రధానమై ఆకర్షించుచున్న దానిని రెమ్మతోకూడ పడునట్లు ఛేదించిరి. జయజయనినాదములు పిక్కటిల్లెను.

అన్నమంత్రీశ్వరాదివీరులు తమ ఖడ్గములు తీసి యట్లే జమ్మిపైనున్న పత్రములు రెమ్మలతో ఛేదించిరి. వారి వీరతావిజృంభణము ఒక్కొక్కరది ఒక్కొక్క విధముగా భాసించెను. వా రట్లు ఛేదించిన పత్రములు రాజభటులు శ్రీరుద్రదేవమహారాజుల కందీయ, వారివలననుండి య ట్లవి ఛేదించిన వీరులు బహుమానముగా వడసిరి.

జన్నిగదేవునికి ప్రసాదించిన పత్రములపై జటావర్మసుందరపాండ్యకొప్పెరుంజింగల నామము లున్నవి; త్రిపురాంతకునకు సిద్ధయదేవచోడపత్రము వచ్చినది; అంబదేవునకు అనేకపత్రము లబ్బినవి— ఎఱువమల్లిచోడ, కేశవదేవ, సోమిదేవ, ఆల్లుగంగు మల్లికార్జున, దామోదర నామము లం దున్నవి.

ఇట్లు పవిత్ర మగు జమ్మిపత్రములు, సాక్షులుగా, నంధ్రోర్వీశసామంతులు కాకతిరాజ్యశత్రువుల దునుమాడగల మను ప్రతిజ్ఞ ఖడ్గధారచే గైకొనిరి.

ఇందులూరి అన్నమంత్రికిని, కొలని రుద్రునికిని లభించిన పత్రము లెవ్వి ? శ్రీ రుద్రదేవమహారాజులు ఛేదించిన ప్రధానశత్రు వెవ్వరు ?

అంతలో కరదీపికలతో నా విశాలప్రదేశమున క్రమ్ముచున్న చీకటులు విరిసెను.

పారువేటవినోదముగా సాగెను. మందలు మందలుగా మూగిన శత్రుసైన్యములు గొఱ్ఱెలవలె పలాయనమయ్యెను. నానావేషధారులు చేతుల గాజులు ధరించి వచ్చి మహారాజులకు మ్రొక్కిరి.

పండితులకు కవులకు గాయకులకు నటులకు వినోదకులకు మల్లురకు నానా యుధకుశలురకు సగౌరవముగా సాదరముగా పాత్రోచితముగా శ్రీ రుద్రదేవమహారాజు లారాత్రి ప్రొద్దుపోవువరకు భూరిసంభావనలు పంచిపెట్టుచునే యుండిరి.

## ౧౩

ఆశ్వయుజశుద్ధపాడ్యమినాడు వీధిలో పోరాడుచున్నందుకు మేచయనాయకుడు బంధింపజేసి బొల్లని గండని బంపిన కారాగృహము ఓరుగల్లుకోటలో నుత్తర భాగమున నుండెను. ఆ గృహము నేలపై గట్టినదో భూమ్యంతర్భాగమున గట్టినదో ఏర్పరుపరాకుండెను.

వా రిద్దరను ఒకదాని కొకటి సమీపమున గల రెండు వేర్వేరు కొట్లలో నుంచిరి. ఆ సాయంత్రముననే మేచయనాయకుడు వారి వివాదకారణము చెరసాల లోనే విచారించెను. జరిగిన పోరునుగూర్చి ఉభయులు మొత్తముమీద ఒకేవిధముగా జెప్పిరి. అందుచే వేరు సాక్ష్యము అవసరము లేకపోయెను.

నగరరక్షకులు రెండువిధములవారు. అందులో వీరభద్రులలోనివాడు గండడు, వీరముష్టులలోనివాడు బొల్లడు. ఇరువురు వీరసాహసకార్యములకు ప్రసిద్ధులే. నగర రక్షకులే ఇట్లు కలహించిన పాలించు టెట్లు ?

బొల్లడు తన కావేశము వచ్చి యట్లు మైమరచి యరచుచుంటి నని చెప్పెను. కాని నాయకు డా మాటలు నమ్మలేకపోయెను. అందుపై దానిగూర్చి యత డెన్ని విధములనో బొల్లని బ్రశ్నించెను. కాని లాభము లేకపోయినది. ఆ దైవతావేశములో తా నేమి మాట్లాడెనోకూడ తెలియ దని బొల్లడు ప్రత్యుత్తర మిచ్చెను. గ్రుచ్చి గ్రుచ్చి యడిగినకొలదియు నాతడు ఏ మాత్రమును తొణకలేదు. దేవత పూనినవాని చేష్టలు మాటలు తర్వాత జ్ఞప్తియుండునా ?

బొల్లడు 'ఆడసోకు భరించలే'నని అరచు కేకలు వినగానే తన హృదయములో మంట మండిన దనియు, కోపము పట్టలేక బొల్లని రాజవీధిలో తన్నితి ననియు, నాయకులు రాకున్న నా రాజద్రోహిని చంపియుందుననియు, తప్పున్న క్షమింపు డనియు గండడు ప్రార్థించెను.

వెంటనే మేచయనాయకుడు గండని బంధవిముక్తుని జేయించి, నూరుగురు వీరభద్రుల కధపతిని గావించి యాజ్ఞాపత్ర మిచ్చెను. మరల నంతట నాయకుడు బొల్లని పరిపరివిధముల బ్రశ్నించి, లాభము లేక చెరసాలలో తిరిగి కఠినముగా బంధింపు డని భటుల కాజ్ఞాపించెను. ఆట్లావేశము నటించుట కతని నెవరు ప్రేరేపించిరో స్పష్టముగా తెలిసికొను నవకాశము ఆ మేచయకు లేకపోయెను.

"నాయకా, వా ని మాటలు విని నా కన్యాయము చేయవద్దు. నేను కొలువులో ఆవేశము పెరిగిఉండగా ఉత్తరప్రశ్నాన్యానికి వాడు నన్ను తన్నినాడు. ముందు

నన్ను వాడు రొమ్ములో తన్నినానని ఒప్పుకొన్నాడు కూడను గదా! నన్ను తన్నుటే కాదు. మైలారుదేవునికే అపచారము చేసినాడు వాడు! వానిని విడిపించి నన్ను శిక్షించుట ధర్మమా! నేను రాజద్రోహినా?"

ఇట్లనుచు బొల్లడు తన కొట్టులోనికి భటులవెంట నడచెను. గండడు నాయకునకు వందనము చేసి క్రొత్తయుద్యోగములో చేరుటకు ముఖ్యస్థానమునకు వెడలెను.

బొల్లడా చెరసాలలో నవయుచుండెను. ఆ గదిలోనికి మధ్యాహ్న కాలమున దప్ప వెలుతురు రాదు. అందుచే నెక్కువభాగ మది చీకటికోణమే. త్రావుటకు కావలసిన నీరు, రోజు కొకమారు తినుట కన్నమమాత్రము నతనికి ఇచ్చెడివారు. శీఘ్రముగా దృఢగాత్రుడగు నాతడు క్షీణింపసాగెను. మూడుపూటల నన్నము తిన నలవాటుపడిన మహామల్లుడు ఏకభుక్తము చేసి యుండగలడా? మధ్యాహ్న మగు నప్పటికి గాని యన్నము రాదు. ఆ యన్నము సాయంత్రము మూడుజాములకే జీర్ణమైపోవును. రాత్రికి కడుపులో ఆకలిమంట దహింప ప్రారంభించును. ఆకలితో రాత్రి నిద్దుర పట్టదు. నీరు మరల మరల త్రావి పొట్ట నింపుకొనును. తెల్లవారును. దేహము తేలి తేలి పోవును. మిక్కిలి నీరస మనిపించును. క్షణక్షణమును భోజనమునకై నిరీక్షించును. ప్రతిక్షణమును యుగముగా దోచును. తుదకు మధ్యాహ్న మగునప్పటికి ఒక్క బ్రహ్మకల్పమే యయిన ట్లతనికి తోచును. ఇట్లెన్నాళ్ళు భరింప గలడు?

ఆరుదినము లట్లుండునప్పటికి అతని మనస్సులో నాందోళన ప్రారంభించెను. మేచయనాయకునకు వీరభద్రేశ్వరుని రహస్యసభావిషయములు చెప్పివేసినచో?— ఆ మాట మనస్సులో వచ్చినంతనే యాతడు నాలుక కొరుకుకొనెను. ఆ సభారహస్యము దాచియుంతు నని తా నెట్టి ప్రతిజ్ఞ చేసెను? ఈ యాకలిబాధ ఈలోకమున మాత్రమే యుండునది. ప్రతిజ్ఞాభంగము చేసినవారు ఎంతకాలము రౌరవాదినరకములలో నింత కెన్నిరెట్లు బాధ పడవలెనో! నరకవర్ణనలు తాను విన్నవి జ్ఞప్తికి వచ్చెను.

ఆ బిగువుతో నా దినమెల్ల జరిగిపోయెను. మరునాడును బిగువు సడలలేదు. కాని తుదకు మహానవమినాడు ఆకస్మికముగా మరల నా యూహ గట్టిగా అతని మనస్సులో ప్రవేశించెను. ఒకసారి ప్రవేశించిన దౌర్బల్యము నెమ్మదిగా మనస్సును తిని వేయక మానదు.

"ఇంత పండుగునాడు నా భార్య ఎంత ఘోషించుచున్నదోకదా? నా పసిపిల్ల నన్ను చూడనిది ఉండలేదు. పాప మది ఎంత దిగులుపడ్డదోకదా! రుద్రమదేవికి నాకు చేసిన అపకార మేమి? వీరభద్రదేవులు నాకు ఒరగించిన దేమి? ఏ మాశించి నేనీ చిక్కులో నిరకినట్లు!—రాజభటులు నా భార్యను బిడ్డను గూడ ఎట్టి బాధలు పెట్టుచున్నారోగదా!—ఆ గండనికి పెద్ద యుద్యోగి మైనది. వాడు మొద లూడ కొనునా?—"

ఒక్కసారి గండనిపై కోపము తెరవలె ఉన్మాదరూపమున హృదయములో ఉబికి పొంగెను. బొల్లని భార్య మంగి ఒకనాడాతి డంటి కేగునప్పటికి గండనితో

మాట్లాడుచుండెను. ఆ మాటలలో విశేషము లేదు. అట్లు మాట్లాడుటలో తప్పేమియు లేదు. కాని మంగిముఖములో నొక ఆకర్షక మగు చిరునవ్వును, గండని కంఠములోని కొంత స్వాతంత్ర్యమును, ఆనా డాతనికి కోపము కలిగించెను. ఆ సాయంత్రము అన్న మాలస్యమయిన దను వంకతో మంగిని వాడు చితుకకొట్టెను. ఇప్పుడు మరల ఆనాడు మంగిముఖములోని చిరునవ్వు గండని స్వాతంత్ర్యకంఠము కన్నులకట్టినట్లు చెవుల బడినట్లు అయ్యెను. అంతవరకు ఆకలితో మండుచున్న యాతని కడుపులో ఒక్కసారి కలచివేసినట్లయ్యెను. ఆనా డిక అన్నము వచ్చినను ఆతడు తినునట్లు కూడ లేదు.

అంతలో నతనికి కూతురు పాటిముఖము జ్ఞప్తికి వచ్చెను. ఒక్క ముహూర్త కాలము దాని రూపము తలచుకొని ముగ్ధుడైనాడు. వారి కులములో ఆ చాయ అరుదు. తాను నల్లనివాడు. మంగి నల్లనిది. కుమార్తె పాటిమాత్రము చామనచాయ. గండనికూడ చామనచాయయే. ఇంతవర కెప్పుడును అతని కిట్టి యాలోచన పోలేదు. చెరసాలలో ఇన్నాళ్ళు గడపినతర్వాత మేచయనాయకులకు వీరభద్రేశ్వరుని రహస్యములు చెప్పివేయదలచిన సమయములో నీ యాలోచనలు ప్రారంభించెను. స్వామి ఘాతుకులకు పరలోకములలో కలుగు యమయాతన యతని కిప్పుడే ప్రారంభించెను.

అట్లు ఆలోచించుచుండగనే అన్నము వచ్చినది. అది భటు డొకచోట నుంచి వెడలిపోయెను. బొల్లనికి అనుదినము అన్నము రాగానే అది తినివేయుట తప్ప ఇంకొక యాలోచన లేదు. ఈనాడో? అతని కది తినవలెనను నిచ్ఛయే కలుగలేదు. మూడుజాము లైనది. అతని దేహము మిక్కిలి నీరసించిపోయినది. అప్పుడెట్లో ప్రయత్నపూర్వకముగా నత డా యన్నము తిని నీరు త్రాగెను. అందుపై గాఢమైన నిద్ర వచ్చినది. అది కలలులేని నిద్ర. కల లున్నచో గండడు మంగితో మాట్లాడుచున్నట్లే వచ్చియుండును.

మరునాడు జాముప్రొద్దెక్కువరకు నత డట్లే నిద్దురపోయెను. ఆ చీకటిగది లోనికి కొంచెము వెలుతురుసూచనలు వచ్చుచున్నందున జాముప్రొద్దెక్కియుండునని యతనికి తోచెను. ఆ క్రిందటిదినమున మంగిపై కలిగిన అస్పష్ట మగు ననుమానమంతయు మాసిపోయెను. ఈ పండుగనాడు భార్యను పిల్లను చూడవలెననియే యతనికి కోరిక! వేరు కోరిక లేదు.

మధ్యమధ్య ప్రహరకాచు భటుల నత డెన్నియోమారులు పలుకరించి చూచెను. వారు పలుకరు. అన్నము తెచ్చువానిని పలుకరించెను. అతడును పలుకడు. ఈనాడు మేచయనాయకులను స్వయముగా దర్శింప ననుజ్ఞ వేడితి నని కారాగృహాధికారికి బొల్ల డాతనిచే వర్తమాన మంపెను. అధికారి యొకడువచ్చి యాతని కారణ మడిగెను. పరమరహస్య మొకటి యున్న దనియు వారికే తప్ప యితరులకు చెప్ప వలనుపడ దనియు నాత డుత్తరమిచ్చెను. ఇట్టిది తరుచుగా జరుగును. నాయకులకు తెలుపుట కర్తవ్యము. కాని పట్టాభిషేకోత్సవములో ఈనాడు రాజధాని యంతయు నినుగ్నమైయున్నది. ఇక మేచయనాయకులకు తీరిక యుండునా? వారి వ్యవహార శాలకుమాత్ర మీ యంశము తెలియజేయ పత్రమాతడంపెను.

ఆవల శ్రీ రుద్రదేవమహారాజులు పట్టాభిషేకమంటపములో మంత్రిసామంత దండనాథులయొద్ద సేవాప్రతిజ్ఞ లందుకొనబోవుచుండిరి. పట్టణమంతయు నుత్సవముతో మహాకోలాహలముగా నుండెను. రాజపురుషులకు తీరిక లేదు. అత్యవసరమగు పరివారము తప్ప మిగిలినవా రందరు పట్టాభిషేకనిర్వహణమునకు అతిథులపూజలకు నియుక్తులైయుండిరి.

అంతలో పలువురు భటులు చెరసాలయధికారియొద్దకు వచ్చిరి. వారిలో ప్రముఖుడా యధికారి కొక పత్రము ఇచ్చెను. అందులో నిట్లున్నది:

"వెంటనే బొల్లని ఈ భటులవెంట పంపవలసినది!

మేచయనాయకుడు."

ఆ యాజ్ఞ చూచి చెరసాలయధికారి యాశ్చర్యపడెను. తాను వార్తపంపి ఎక్కువతడవు కాలేదు. అయినను ఇట్టి యుత్తరువు లాతనికి వచ్చుట యరుదు. సందేహముతో నత డా పత్రము మరల పరీక్షించెను. మేచయనాయకుని ముద్రిక స్పష్టముగా నందు గాన్పించెను. నాయకుని యాజ్ఞ లొక్కొక్కతరి చిత్రముగా నుండును. అయినను ఏకశిలాపురీపాలకు డగు నాతని యాజ్ఞ ధిక్కరించుటకు ఎవరికి ధైర్య ముండును? అందుచే నది శిరసావహింపక తప్పదు. వెంటనే ఆ వచ్చిన భటులవెంట బొల్లని బంపివేసి, యైనను అనుమానము తీరక ఒక యాశ్వికునిద్వారా ఆ సంగతి మేచయనాయకునకు తెలియబరచెను.

ఆ వేగరి సభామండపమున కేగునప్పటికి మేచయనాయకు డట లేడు. అతడు వీరభద్రేశ్వరాదులను తెచ్చుట కేగియుండెను. నాయకుడు వ్యర్థప్రయత్నుడై తిరిగి వచ్చుచుండగా నాతనికి వేగరి బొల్లని పంపిన వార్త ఎరిగించెను. నాయకు డదివిని, యా బొల్లని నతని గొంపోయిన భటులను వెంటనే వెదకి బంధింపజేయు మని కారాగారాధికారికి ఆజ్ఞ పంపి మరల సభామండపము చేరికొనెను.

బొల్లనికొరకు వచ్చిన భటు లాతని గఠినముగా తోలుకొనుచు చెరసాలయొద్ద నుండి బయలుదేరిరి. చెరసాల దూరమైనది. ఆశ్వికుడును దూరమయ్యెను. అంతట వా రాతని సభామండపమునకు గొంపోవుటకు మారుగా క్రంతమార్గమునకు బట్టించిరి. బొల్లనికి ప్రాణములు ప్రాణములలో లేవు. భార్యయు పిల్లయు దలపునకు వచ్చిరి. ఒక్క క్షణములో అతని నంటి వచ్చుచున్న భటుల కఠినవైఖరి మారిపోయినది. మరు క్షణములో వా రాతని బంధనములు ఛేదించివేసి, శుభ్ర మగు మడుగు వస్త్రములు కట్ట నిచ్చిరి. అతని మొదటి భయ మాశ్చర్యముగను ఆనందముగను మారిపోయెను. కలలో నడచుచున్నట్లే వారు చెప్పినట్లెల్ల చేసెను. వా రాతని కక్కడ నంతకుమున్న సిద్ధముగా నున్న యశ్వమును ఆయుధములు నిచ్చి హనుమకొండ మార్గమున చెరువుపడమరనుండి యాజ్ఞ లందు కొమ్మని, యా భటులుకూడ తమ వేషములు మార్చుకొని తమ వస్త్రములు బొల్లని వస్త్రములును సమీపమున గల బావిలో పారవేసి వేర్వేరు మార్గముల వెడలిపోయిరి.

అశ్వ మధిష్ఠింపగనే అతని కొక ధైర్యమువచ్చెను. చేత నున్న ఖడ్గము ప్రక్కనున్న శూలము నాతనికి మరింత ధైర్యము చేకూర్చెను. మహోత్సవమునకు రాకపోకలు పలువు

చున్న మహాజనములో నాతడు కలసిపోయెను. తన్నెవరు చూతురు? అయినను ఆతని నెరిగిన వా రెందరో కలరు. మధ్యమధ్య భయ మావేశించుచుండెను. కారాగారబాధ అప్పుడే వదలిన యతనికి మరల నచ్చటికిపోవుటన్న ప్రాణము వదలుటకంటె భయంకరముగా తోచెను. భార్యను కూతును చూడవలయు నని యతని కెంతేని కోరిక పుట్టెను. కేవలము ఆత్మరక్షణకై సమస్తమైన కోరికలు వదలివేసి గోపురద్వారము సమీపించెను. అక్కడ నతడు మిక్కిలి భయపడెను. కాని మహోత్సవములో వాడు సామాన్యనిర్బంధములు లేవు; గోపురముదాటి హనుమకొండమార్గముపట్టిపోయి అచ్చట గల చెరువుపడమటితీరము చేరికొనెను.

అచ్చట నతనికి ముందెవ్వరును కనిపింపలేదు. అత డేమి చేయుటకునుదోపక యిటు నటు చూచుచుండెను. ఆ మార్గమున దూరమునుండి రాజభటులు వచ్చుచున్నట్లు కనిపించిరి. అతని మనస్సులోని భయమకొలది వెంటనే యాతడు గుర్రము దిగి, నీటిని సమీపించి చెరువులో దాహము తీర్చుకొనుచున్న వానివలె నటించుచు, నోరకంట నా దారి జను రాజభటులవంక చూచుచుండెను. ఆ రాజభటులు తమ దారిన దాము ఉత్సవోత్సాహముతో పోవుచు నాతని, ననుమానింపనైన లేదు.

వారు దూరము దాటిపోయినంతనే ఆతడును నీటివద్దనుండి లేచి తడిసియైన చేతులను ముఖమును ఉత్తరీయమున అద్దుకొనుచు "ఏమి చేయుటా" యని యాలోచించుచుండెను. నీటిలోనుండి ఎవరో ఎవరినో పిలుచుచున్నట్లు ధ్వని వినవచ్చెను.

బొల్లడు భయభ్రాంతుడై ఉలిక్కిపడి యా శబ్దము వచ్చినవైపు చూచెను. అతడు తనకు కర్తవ్య మాదేశించు సాంకేతికుని కెదురు చూచుచుండియు, నా శబ్దము విని ఉలిక్కిపడుటలో నాశ్చర్య మేమున్నది!

ఆవైపున నొక కమలషండము కలదు. అందులోనుండి యొక కమలమే తన వైపుకు జరిగి జరిగి వచ్చుచుండుట బొల్లడు నిగ్రక్షించి విభ్రాంతి పొందెను. కమల మట్లు నడచివచ్చు టేమి? అంతలో నా కమలమే పలికినట్లు శబ్దము వినబడెను. ఆ శబ్దము గాలి నిట్టూర్చినట్లే వినవచ్చెను.

"బొల్లా!"

బొల్లని శరీర మాపాదమస్తకము జలదరించెను. రోమము లన్నియు నిట్టనిలిచిపోయెను. కన్నులు నిలువుగ్రుడ్లు పడిపోయెను.

ఇంతలో కమలములోనుండి చిన్న నవ్వు వినబడెను. ఆ నవ్వు కూడ రెండు గాలులు ఒకదానితో ఒకటి తాకి శబ్దించినట్లే యుండెను. ఆ నవ్విన దా కమలమే. నవ్వుచున్న వాని హృదయభాగము పై కెగిరిపడుచున్నట్లే, ఆ తామరపువ్వు కూడ నీటిపై లేచి పడుచుండెను.

దానితో బొల్లని గుండె లదిరిపోయెను. పారిపోవలె ననిపించెను గాని కాళ్ళు నేలపై పాదుకొనిపోయినట్లు స్తంభించినవి.

ఆ సరోవరములోనుండి తరచుగా నట్లే చిత్రచిత్రశబ్దములు వచ్చుచుండు నని జనశ్రుతి కలదు. ఒకానొకప్పుడు గీతవాదిత్రనిస్స్వనము వినిపించునట!

ఒక్కొక్కతరి నలౌకిక మగు యుద్ధఘోష వినిపించును. ఆ సరోవరము నెవరో గంధర్వు లాశ్రయించియున్నారు. వా రందు రాత్రుల జేయు చర్య లొక కొన్ని దారుణములును, మరికొన్ని యెడల బహుకారుణ్యోపేతము లయిన వనియు, ఎన్నియో సంఘటనలు జనులు కథలుగా చెప్పుకొనుచుండువారు. రాత్రులందు ఒంటరిగా సామాన్యజన మెవ్వరు నా సరోవరము చెంతకు బోవ సాహసించెడివారు కారు.

బొల్లనికి పారిపోవలె నను తీవ్రవాంఛ కలిగెను. పదములు ఇచ్ఛానుసారముగా కదలుటలేదు. ఐనను తా నిప్పు డెక్కడికి పోగలడు? భటులు గుర్తించినచో తన కీమారు మరణదండన వేయుదురు. అందును మేచయనాయకుని భటు లెక్కడ లే రనుకొన వీలున్నది!

అంతలో నా పద్మము బొల్లని సమీపించి నిశ్శబ్దముగా నాగిపోయెను. బొల్లడు బెదరుచు నందు చూడగా, దాని మధ్యమున నొక పత్రమును అనేక సువర్ణములును ఉండెను.

ఆ సువర్ణము లాతని నెంతయేని ఆకర్షించెను. కాని వానిని చేతులతో స్పృశించుటకు గూడ వాడు గడగడలాడుచుండెను. ఇంతలో దూరమునుండి స్వరము వినిపించెను. అది కొంచెము సంగీతమువలె కూడ నుండెను.

"భయపడకు! అవి తీసికొని గొంటూరు వెళ్ళుము. నీకు మా రక్ష కలదు. ఇక రెండుగడియలలో ఓరుగల్లుపరిసరము దాటిపోవనిచో నీప్రాణములపై నాశయుండదు!"

ఆ మాటలతో నాతనికి ధైర్యము కలిగెను. ఆ లేఖను సువర్ణములను అతడు పదిలపరచుకొనెను. ముచ్చెమటలు కారుచున్న శరీరముతో నాత డశ్వ మధిరోహించి శీఘ్రగతి బయలుదేరెను.

దూరమున గోపురద్వారమునుండి పలువు రాశ్వికులు అగుచు నాగుచు మరల మరల శీఘ్రగతి వచ్చుచున్నట్లాత డుపలక్షించెను. అది తన్ను వెంటాడు భటులని యాతనికి వెరపు కలిగెను.

ఉత్సవసమయ మైనందున ఆనాడు సర్వత్ర రథాశ్వగజశకటాదుల ప్రచారము విస్తారమై సమ్మర్దముగా నుండెను. ఐనను తన గుర్రపు డెక్కల గుర్తులు అనేక హయపదచిహ్నములతో కలిసిపోయి గుర్తింపరానట్లు చేయుచు నతడు నెమ్మదిగా నొక ప్రక్కదారికి పట్టించెను.

## ౧౪

అభిషేకమంటపమున పేరోలగము మహాప్రభావముతో జరుగుచునే యున్నది.
సూర్యభగవానుడు ఉదయాదిగా ఆ మహోత్సవమును చూచి చూచి అలసి విశ్రమింపబోవుచున్నాడా అనునట్లుచరమాద్రి కొరగుచుండెను. ఆకాశమున చెదరుచెద

రుగా గాఢిదమబ్బులు తిరుగుచు సంధ్యారంజితములై దిగంగనను అరుణారుణము గావించుచుండెను. అది అనురాగకృతమో కోపకృతమో ఊహింపశక్యమా ?

ఆ సమయమున ఓరుగంటి ప్రాచీద్వారముముందుగల విశాలప్రదేశమున చనుప యొక్కటి వచ్చి యాగెను. అందలి సార్థవాహులు ప్రాచీసముద్రతీరములనుండి యమూల్యము లగు పరకులు తెచ్చియుండిరి. ఆ వైపులనుండి సార్థములు వచ్చి యిప్పటికి రెండుమూడు నెలలు దాటిపోయినది. తూర్పుసముద్రప్రాంతము శాంతముగా లేదు. కొన్నియెడల జటావర్మసుందరపాండ్యుని సేనలును, మరికొన్నియెడల కొప్పెరుంజింగని పల్లవసేనలును, ఇంకను గొన్నియెడల చోళసేనలును, సంచరించుచు ప్రజాపీడ గావించుచుండెను. స్థానికు లగు వీరభద్రులును వీరముష్టులును ఆ యలజడి నరికట్టజాలకుండిరి. దారిదోపిడిగాండ్రు ప్రబలిపోయిరి. అట్టివారి కెల్ల గొంటూరుమాండలికు డగు నాగదేవరాజు ప్రాపుగా నుండి వారిని రెచ్చగొట్టుచుండెను.

ఇట్టి స్థితిగతులలో కృషీవలులు తమ క్షేత్రములు దున్నుటకుగాని అందితర వ్యవసాయ కార్యములు ప్రారంభించుటకుగాని వెనుకాడుచుండిరి. గ్రామములోని రచ్చచావడి కొకనా డొక భటషండము వచ్చెను. వారి నాయకు డొక యాజ్ఞాపత్రము గ్రామాధికారులకు చూపించును. రెడ్డియు కరణమును అది చూచి ఏమి చేయుటా యని యాలోచించుచుందురు. ఆ యాజ్ఞాపత్రములో ఇన్ని సజ్జలు ఇన్ని జొన్నలు ఇన్ని చోళ్ళు—అట్లే ఇతరవస్తువులు పంపు డని యుండును. దాని మూల్యము భటులతో పంపియుండలేదు. ఇంతమూల్యమునకు పంపు డని యైన నం దుండదు. మూల్య మెట్లు తా మప్పగింతురో తెలియరాదు. ఆ గ్రామాధికారులు తమ గ్రామములోని వెలిపొలములనుండి యా సంవత్సరము చెల్లింపవలసిన 'పుట్టిపహిండి' అంతకుమున్నె తమ పైవా రగు స్థలాధికారులకు పంపియుండిరి. మరి యెట్లు ఇది పంపుట ? ఈ పత్రము మొదలు పంపిన దెవరు ?

ఇట్లా గ్రామాధికారు లాలోచించుచుండగనే వచ్చిననాయకుడు తొందరించును. ఏమి చేయను దోపక, వారు తలవరులను గ్రామములోని సంపన్నులయొద్దకంపి, ఎట్లో కష్టపడి వారుకోరిన ద్రవ్యములు సేకరించి యప్పగింతురు. ఆ నాయకుడును తృప్తుడై ఇన్ని వస్తువులు తాను పుచ్చుకొంటి నని పత్రము లిఖింపజేసి యా గ్రామోద్యోగుల కీయగా, వారు కొంత తృప్తి నొందుదురు. కాని ఇది ఇట్లేల జరిగిన దని గ్రామాధికారులును గ్రామములోని పెద్దలును మథనపడుచుందురు.

ఆ మథన పూర్తి కాకముందె ఆ సాయంత్రమున చీకటిపడిన కొద్దిసేపటికి దివ్వెలు వేసికొని, మరి యొక సైనికతండ మా గ్రామముప్రవేశించును. దీని నాయకుడు తన యిచ్చవచ్చినచో తిష్ఠ వేసి తనయొద్దకే గ్రామోద్యోగులను పిలిపించుకొని, ఏ యాజ్ఞాపత్రముకూడ చూపకయే సజ్జలు జొన్నలు చోళ్ళే గాక వేయిమాడలుకూడ నిమ్మని యాజ్ఞాపించును. గ్రామోద్యోగుల కిమారు ఆలోచించుకొను నవకాశము కూడ నుండదు. ఏదైన చెప్పికొనబోయిన నా నాయకుడు కొట్టవచ్చువానివలె కేకలు వేయును. తుద కెట్లో ధైర్యముచే గ్రామకరణము ఆ నాయకునకు వంగివంగి దండములు పెట్టి, తా మా మధ్యాహ్న వేళ నాయకున కిచ్చి పొందిన ద్రవ్యముల పత్రము

చూపించును. ఈ నాయకుడదిచదివికొనగలుగునో లేదో గాని, యా పత్రముచూచి నంతనే మిన్నెత్తున లేచి మండిపడి, యసభ్యముగా ఆ మధ్యాహ్నము వచ్చిన నాయకుని దిట్టి, ఆ గ్రామోద్యోగులను గూడ నట్లే తిట్టుచు చేతికిచ్చిన పత్రము చింపి వేయును. తుదకు ప్రహరణములు సిద్ధము కానుండగా, నా గ్రామోద్యోగులు ఎట్లో ప్రయత్నించి సామాన్యగృహస్థులు ఇండ్లలో దాచుకొన్న ధాన్యమును వర్తకులయొద్దను గ్రామపంచాయితీలోనను నిలువయున్న వేయిమాడలును వానికి సమర్పించుకొందురు. ఈ నాయకుడవి చేకొని మరల పదితిట్లు గ్రామస్థులను తిట్టి స్వీకారపత్రమైన నీయక వచ్చినదారిం బోవును.

ఆరాత్రియే వేగరులచే నీవార్త స్థలాధికారులకు వారు నివేదించి కొందురు. ఇట్లే ఇతరగ్రామములనుండికూడ జరిగిన వార్తలు అప్పటికే స్థలాధికారులకు చేరి యుండును. స్థలాధికారులు తమకువచ్చిన యలజడివార్తలు అశ్వికులచే సీమాధికారులకును, సీమాధికారులు నాడియధికారులకును, వారు మండలాధిపతులకును దెలిపి కొందురు. వాని విచారణ ప్రారంభించునవకాశము కలుగకముందె, మరెన్నియో ఇతరగ్రామములను స్థలములందును సీమలలోనను కాక, మొదటిగ్రామమందే తిరిగి యట్టిది సంభవించును. ఒక్కొక్కచో గ్రామీణులు ధైర్యము వహించి కూడుకొని యా వచ్చిన భటులను పారద్రోలుదురు. ఒకానొకయెడ రాత్రులందు ఆయుధహస్తులై భటులు గ్రామముపై బడి గృహములు దహనము కావించి స్త్రీబాలవృద్ధుల గూడ నానాహింసలపాలు చేసి చిత్రవధ లొనర్తురు. అందులో పలువురు దద్దును కరణములును కాలుసేతులును నాలుకలును ప్రాణములును గోల్పోయిరి. పలువురు పారిపోయిరి. కొందరు ఈయదను కనిపెట్టి యలజడిమూకలలో చేరి సంచరించుచు లాభములు గడింపజొచ్చిరి. గ్రామములలో ప్రారంభించిన యలజడులు నెమ్మదిగా స్థలములకు సీమలకు నాడులకు ముఖ్యస్థానములకే ప్రాకినవి. గొంటూరు మండలాధిపతియే వీనికంతటికి మూలకారణుడను వార్తయు నెమ్మదిగా ప్రవర్తిల్లెను. దానితో భయ మావహిల్లెను.

ఇట్టి స్థితిలో జానపదుల యవస్థ లేమని వర్ణింపగలము? వారు తమ యిండ్లు వాకిండ్లు గొడ్డు గోద విడిచి పోలేరు. విడిచినను ఎక్కడి కేగుదురు? ఎట్లు పోదురు? పోయి యేమి చేయుదురు? ఎట్లు జీవింతురు? ఆ సంవత్సరము జీవనోపాధికై నిలువ యుంచుకొన్న ధాన్య మిట్లు దొరలపాలో దొంగలపాలో ఐనది. విత్తనములకై యేరి వేరుగా నుంచుకొన్నది కొంత భార్యాశిశువుల యాకలి తీర్చుటకు వ్యయపడినది. కష్టకాలముల నక్కరకువచ్చు నని నేలలో భద్రముగా దాచుకొన్న ధనము పైకి తీసినను దానితో ధాన్యము వచ్చుతా వేద నున్నది? ఇట్లే ఒకప్రక్క కడుపులో మాడుచున్నను, అలవాటుపడియున్నందున వదలలేక, తన భూమినంతయు గాకున్న నొక డొక మళ్లుభూమిని, మఱియొక డొక పుట్టిభూమిని, ఇంకొక డొక గడభూమిని దున్ని విత్తనము లు చల్లి పైరు పెంచుచుండును. దహించెడి యాకలిబాధను, ఇంకను సర్వసమృద్ధముగా నున్న గోవులక్షీరములు త్రావియో, మహిషీక్షీరము సేవించియో, కొంతకొంత చల్లార్చుకొనుచుండును. గొడ్డు మాంసములు తినుట కలవాటుపడనవారింకను ఆంధ్రభూమిలో స్థిరముగా ప్రవేశింపలేదు. గ్రామములం దల్లెడల పచ్చిక బీళ్లు

సమృద్ధముగా నున్నవి. వాన లున్నంతకాలము వానికి తరుగు లేదు. పశుసంపద యింకను క్షీణింపలేదు. దొరలుగాని దొంగలు తోడుబోతులు గాని గడ్డి తినరుగదా! వారివెంట వచ్చిన యశ్వములు గజములు ఉష్ట్రములు ఒకటిరెన్నాళ్ళెంత మేసినను గ్రామములోని గ్రాసమునకు కరవు రాదు.

కాని యిట్టి పశుసంపద యున్నను పశుపతులకు ఆ క్షీరములైనను పూర్తిగా త్రావగలుగుద మను నిశ్చయబుద్ధి లేదు. ఒకనికి గోష్ఠమునుండి కడవలలో పాలు వచ్చును. మరి యొకనికి గేదెలపాలు చేరును. ఇంకొక పేదవానిఇంటికి మేకపాలో గొఱ్ఱెపాలో వచ్చియుండును. ఇండ్లలోని స్త్రీలు కొందరు అవి కాచి తోడువేచి యుందురు. మరికొంద రింకను కాచుచుందురు. ఇంకొకచో నవి కాచు ప్రయత్నములో నుందురు. మరొక్కచో నాకుంభములు వాకిటనే యుండును. వేరొకయెడ పాలింకను తీయుచునే యుందురు.

అంతలో నొక భటతండ మా గ్రామము వచ్చును. వారి యాజ్ఞచే తోడుకొనుచున్న పాలును కాగిన పాలును కాగుచున్న పాలును కాగబోవుపాలును వాకిటనున్న పాలును తీయుచున్న పాలును అన్నియు కలసి యా వచ్చిన భటులపా లగును. ఆ పాలతోపాటు గ్రామములో గల కొన్ని వేటలుగూడ వారిపాలే యగును.

ఇట్లు సంక్షోభము పొందుచున్న ప్రాక్సముద్రతీరమండలములలో, చీకటిలో వెలుగువలె, గ్రుడ్డిలో మెల్లవలె, బ్రాహ్మణాగ్రహారములు అపవాదములై విరాజిల్లుచుండెను. దేవబ్రాహ్మణద్రవ్యము లన్న, నవి ముట్టుటకు జన మందరలో తీవ్రమగు భయము కలదు. బ్రాహ్మణులును విస్తారముగా స్వధర్మము విడువలేదు. వేదశాస్త్రాధ్యయనములు యజనములు నింకను వారు పుష్కలముగా సాగించుకొనుచుండిరి. వారి కెట్టి భయమును లేదు. విద్వాంసులైనవారికి జీవన మెట్లు గడుచు నను చింత లేదు. అగ్రహారములలో పాడిపంటలు సమృద్ధిగా కలవు. అవి ఎవరికి రావలసిన భాగము వారు న్యాయముగా తీసికొనుచుండిరి. ధన మున్న విద్వాంసుడు పరులను ధనమునకై యాచించుట నేర్చుకొనలేదు. యాచనమే నికృష్టమైనది. దరిద్రు డగు విద్వాంసుడు తనకు దాతగా నుండగల సంపన్ను డితడని నిర్ధారణ చేసికొని యతనియొద్ద కరిగి తన యవసర మెరిగించును. ఆ సంపన్ను డాయనకోరిక తీర్చుటచే తానును తన సంపదయు ధన్యమగు నను నిశ్చయబుద్ధితో నాతనికి కావలసినదానికంటె అధికముగా నీయబోవును. ఆ విద్వాంసు డందులో తన కవసరమైన దానికంటె నొక చిల్లిగవ్వయైన నెక్కువ ముట్టడు. ఇట్టి స్థితిలో బ్రాహ్మణాగ్రహారములలో పాడిపంటలకు తరుగేల యుండును?

మరియు నా యగ్రహారములోని స్త్రీపురుషాదులు కేవల కుక్షింభరులు కారు. అతిథులు అభ్యాగతులు ఆతురులు దీనులు ఆపన్నులు అనాథులు—ఎవరు వచ్చినను, అగ్రహారీకులు నిర్లక్ష్యభావమూనరు. వచ్చినట్టివారికి శుష్కవేదాంత వాక్కు లుపదేశించి పంపివేయరు. స్త్రీలు ఇండ్లలో పనులు చేసికొనుటకు గాని, వచ్చిన పైవారికి వండిపెట్టుటకుగాని ప్రాల్మాలరు.

'వండ నలయదు వేవురు వచ్చిరేని
అన్నపూర్ణకు నుద్దియౌ నతని గృహిణి'

అని వర్ణింపబడిన ప్రవరుని గృహిణివంటివారే బహుళముగా నా కాలమందలి ఇల్లాండ్రు. అగ్రహారములో ధాన్యగ్రాసము లున్నంతవరకు వచ్చినవా రక్కడనుండి క్షుధార్తులై వెనుదిరిగిపోరు. వేళ తప్పిపోయివచ్చిన దోపిడి మూకలకుకూడ అగ్రహారికు లన్నదానము చేయ వెనుకాడరు. మున్యాశ్రమములలో సహజశత్రువులగు మృగశార్దూలాదులు వైరములు దక్కియొక్కచో సంచరించెడివని పురాణములలో చదువువాక్యము లానాటికి మనుష్యరూపు లగు మృగశార్దూలములకు మాత్ర మైనను ఇంకను ఆ యగ్రహారములలో ననువర్తించుచుండెను. ఆ దోపిడిగాండ్రు తెల్లవారువేళ ఆ గ్రామము వదలి పోదురు. అట్లు పోవునప్పు డందులో నొక కొందరెవ్వరో అచ్చటి మేకనో గోవునో హరించి వెంట తీసికొనిపోవుదురు. ప్రొద్దు పొడిచిన తర్వాత ఆ గుంపులోని తక్కినవా రది గుర్తించి వెంటనే ఆ తస్కరుల శిక్షించి యా ద్రవ్యము మరల నగ్రహారమునకు చేర్పింతురు.

ఒక్కొక్కచో సాహసించి యొక నాయకుడు కతిపయభటులతో నగ్రహారము ప్రవేశించి యగ్రణిని సమీపించి నమస్కరించును. ఆ యగ్రణి యాతనికి తిరిగి నమస్కారమైన జేయడు; కూర్చుండు మనడు. దానితో నా నాయకునకు కొంత ధైర్యము సడలి తోడివారివంక చూచును. వారు మరొకవైపు చూతురు. కొంతవడికి వారు మరల కూడబలుకుకొందురు. మరల ధైర్యముచేసి యా నాయకుడు ఇంత ద్రవ్యము కావలె నని యగ్రణిని కోరును. ఆ యగ్రణి శాంతముగా లోని కేగి పదిలపరచి యుంచిన రాగిరేకుల శాసనము బయటికి తెచ్చి, యిది సర్వకరపరిహారముగా ఈ మహారాజు మా పెద్దల కిచ్చినా డని చెప్పి, దానిపై గల రాజముద్రిక చూపించును. అంతటితో సామాన్యముగా నా నాయకుడు తన భటతండముతో తరలి పోవును. కాక ఒకానొక డేరా జిచ్చె నని ప్రశ్నించును. అంతట నగ్రణి యి ట్లనును.

"ఏ రా జయితే నేమి నీకు ? ఇది విన్నావా ?

'యథా వ్యాసః :

'స్వదత్తాం పరదత్తాంవా యోహరేత వసుంధరామ్,
షష్టిర్వర్ష సహస్రాణి విష్ఠాయాం జాయతే క్రిమిః.

"బురదలో పురుగులుంటవే, అవి ఎన్నడైనా చూచే ఉందువుగా. అంతకంటె అసహ్యమైన, విష్ఠాయాం, అరవై వేల యేండ్లు పురుగువై పుట్టడము నీకు సమ్మతమయితే, మే మంతా మా అగ్నిహోత్రాలు మాత్రము తీసికొని పోతాము. మీరే ఈ అగ్రహారమంతా అనుభవించండిరా, కావలెనంటే, భటాచోరా !"

ఆ మాట లనుచుండగనే అగ్రణిముఖములో కోపముతో నొకానొక యగ్ని పుట్టును. ఇట్లన్నందుకు ప్రాణమానములు వదలవలసివచ్చు దినము లాసన్నమయినను, అప్పటి కింకను రాలేదు. ఆ వచ్చిన భటులకు వారినాయకునకు నొక్కసారిగా భయ మావహిల్లును. వారు వంగివంగి యా యగ్రణికి నమస్కరించి శాసనపు రేకులు కన్నుల కద్దుకొని క్షమాపణము చెప్పికొని క్రిక్కురుమిక్కురు మనకుండ ఆ గ్రామము దాటి బ్రతికితి మని యానందపడుదురు.

ఒక్కొక్కయెడ నట్టి నాయకుడు గ్రామములోనికి వచ్చి యచ్చట జరుగు సత్కథాకాలక్షేపము వినీతుడై విని, యా యగ్రహారమునకు తాను దోచుకొనివచ్చిన ద్రవ్యము కొంత యీయబోవును. అగ్రణి యది చిరునవ్వు నవ్వుచు నంగీకరింపక నిరాకరించును. నాయకుడు బలవంతము చేయగా తుద కా యగ్రణి దానినార్తులై తన యగ్రహారములో తలదాచుకొన వచ్చిన యాగంతుకుల కిప్పించును. అట్లు తమయొద్ద దోచుకోబడిన తమద్రవ్యమే తమకు మరల ప్రాప్తించుటయు కద్దు!

ఎక్కడనో కొన్నియెడల అగ్రహారములలో జొరబడి బాధించిన తండములును లేకపోలేదు. అట్టివారికి శీఘ్రకాలములో సంకటములు ప్రాప్తించును. అవి యందువల్లనే ప్రాప్తించినవని వారికి నిశ్చయభావము కలుగును. అట్టి శాస్తియే కలుగు నని యితరులకు వెరపుపుట్టును. ఈవిధముగా భయమువల్లనేమి, భక్తివల్లనేమి, అగ్రహారములు అలజడులు తప్పించుకొనుచుండును. ఇట్టిపుణ్యగౌరవ స్థానములలో నగ్రహారములుండకున్న నా కాలమున నప్పుడప్పుడు చెలరేగుచువచ్చిన రాచరికపు కల్లోలములతో తూర్పుతీరభూమి నిర్మానుష్యమై యుండెడిది.

ఈ చనుప యట్టి కల్లోలభూయిష్ఠ మగు ప్రాచీసముద్రతీరమునుండి ఓరుగల్లు చేరికొనెను. అసలు మోసలపురమునుండి యొకటియు మోటుపల్లి నుండి యొకటియు రెండు చనుపలు బయలుదేరి ఉపనదుల చేరికచే సంపుష్టములగు గంగాయమునానదులవలె పెద్దపెద్దవై అవి రెండును బెజవాడలో కలసికొని యొకటిగా నేర్పడి యీ రూపము పొందియుండెను.

అందులో మోటుపల్లిలో బయలుదేరిన చనుప ధనదుప్రోలు చేరునప్పటికే, అచ్చటికి కొప్పెరుంజింగని సైన్యములు దక్షిణమునుండి త్వరలో రానున్నవని యలజడిగా నుండెను. అప్పటికే శ్రీమల్లికార్జునపండితారాధ్యులవారి యాగ్రహము నకు గురియై, యాధనదుప్రోలు సిరిసంపదలు తూలి కళావిహీనమై యుండెను. దివ్యాయతనములు పాడఱియున్నవి. విశాలభవనములలో పెక్కింట అడవి పావురములును గబ్బిలములును నివాసము చేయుచున్నవి. ఉన్నతమండపములు పండితగోష్ఠులు లేక కేవలము శిలారూపములుగా నున్నవి. వీథులలో జనులు పలుచపలుచగా మాత్రముండిరి. శిథిలమైన కోట ఎంత బాగుచేసినను దృఢపడి యుండలేదు. అందున్న చోడరాజునకు కొప్పెరుంజింగని నెదుర్కొను శక్తిగాని ఉద్దేశము కాని లేదు. అతడు ఆ పల్లవరాజు సైన్యములు సమీపించినంతనే లొంగిపోయి పల్లవరాజునకు సాయపడునని జన శ్రుతి ప్రబలెను. సంపన్నులు తమ ధనధాన్యాదులే మగునో యను భయముతో, సాధ్యమైనంతవరకు ధాన్యము దూరమునకును ధనము భూగర్భమునకును చేర్చుచుండిరి. వీథిలో కనబడిన కొద్దిమందిముఖములలో నెత్తురు లేదు.

ఇది ఎఱిగి యా సార్థవాహాధ్యక్షుడు కలవరపాటుతో నితర సార్థవాహులతో రహస్యముగా సంప్రదించి తన చనుపను వడివడిగా గొంటూరుమార్గము పట్టించెను. ఆ సార్థము చేబ్రోలువరకు చేరునప్పటికి, ఆపైన గొంటూరువైపు పోవుట క్షేమము కాదని యందున్న జాయపనాయకుని బంధువులు వారికి చెప్పిరి. వెనుకనూయి, ముందు గోయి! ఆ సార్థవాహాధ్యక్షు డేమి చేయగలడు? వెంటనే అతడు తన సార్థమును

కొంచెము వెనుకకు త్రిప్పి సమీపముననే గల మంచాలాగ్రహారము చేర్చెను. ఆ యగ్రహారముప్రాపున సార్థమును విశ్రమింపజేసి యచ్చటి స్థలమార్గములను శోధించెను. తుద కాతడు చక్కగా విచారించి తన చనుసను మరియొక మార్గమున పట్టించి యచ్చట గల తుంగభద్ర యను చిన్ననదిని దాటించెను. అంతట వా రెట్లో నెమ్మదిగా తెనాలి చేరుకొనిరి. అచ్చటనుండి కొల్లూరు చేరి యక్కడ కృష్ణానది నుత్తరించి శ్రీకాకుళము చేరవలె నని వారి యూహ.

కాని యప్పటికే కొప్పెరుంజింగనికి ధనదుప్రోలులోని చోడరాజు దాసుడయ్యె ననియు, పల్లవసేన రెండుగా చీలి ఒకటి కొల్లూరువద్దను రెండవది వెల్లటూరువద్దను కృష్ణను త్తరింప నుంకించుచున్న వనియే గాక, తన సార్థముజాడలు చారులవలన నెప్పటికప్పు డాపల్లవులు తెలిసికొనుచున్నా రనికూడ సార్థవాహాధ్యక్షునికి తెలియవచ్చినది. మరియు పల్లవసేనలు గ్రామములను దోచుకొనుచున్నవనియు, వాని కెట్టి దయాదాక్షిణ్యములును లే వనియుగూడ తెలిసినది. సార్థవాహాధ్యక్షుడు కుప్పవ కూలిపోయెను. ఎడమప్రక్కను గొంటూరునాగదేవుని దొంగల గుంపులు; కుడిప్రక్కను కొప్పెరుంజింగని పల్లవసేనలు; వెనుక ధనదుప్రోలులోని పిరికిచోడరాజుబాధ! ఎట్లో ఒక రీతిని కృష్ణానది దాటి బెజవాడ చేరుకొన్న నేగాని తమ సరకులును ప్రాణములును దక్క వని స్పష్టమయ్యెను.

సార్థవాహాధ్యక్షుడు ముఖ్యు లగు నితరసార్థవాహులతో నాలోచించెను. వారు కూడబలుకుకొని ఉన్న అపాయస్థితి సార్థములోనివారి కందరకు తెలుప నిశ్చయించిరి. అది తెలియగానే సార్థములో పలువురు తమ సరకులతో తెనాలిలోను ఆ చుట్టుప్రక్కల గ్రామములను సద్దుకొనిరి. సాహసులైన తక్కినవారు ఏమైనను ప్రయాణము ముందుకు సాగింప నిశ్చయించిరి. వారు పుష్కలముగా ద్రవ్యము వెచ్చించి యా చుట్టుప్రక్కల గ్రామములనుండి పలువురు భటులను సంపాదించిరి. శీఘ్రగమనమునకై అశ్వములను ఉష్ట్రములను మరికొన్ని విలిచిరి. ముత్యములు పవడములు దంతము చందనము కస్తూరి పట్టు నూలు మంజిష్ఠము—ఇత్యాదులకు నమూల్యవస్తుసంచయముతో బేరము చేయు వారలకు ధనము కేమి కొదువ?

సార్థవాహు లాలోచించుకొని భటుల సమగ్రరక్షణతో శీఘ్రయానమున మధ్యేమార్గముగా, ఆ పల్లె చేరి, ఉండవల్లి చేరుకొనిరి. అక్కడ పర్వతపార్శ్వమున నొక గొప్ప జైనవసతి కలదు. దిగంబరులు తపస్సు చేసికొనుటకై యందు మూడంతస్థులుగా కొండ శిల్పులచే నద్భుతముగా తొలుచబడి గుహలు నిర్మింపబడియుండెను. ఆ ప్రధానవసతి నావరించి మరి యెన్నియో వసతులును గలవు. వానిలో మహావిద్వాంసు లని దిగంతప్రశస్తి గల దిగంబరభిక్షువులు జైనగ్రంథములు 'పారప్రవచనములు చేయుచు సిద్ధసాధనము లొనర్చుచుండిరి. జైనదిగంబరు లుండు నివాసములకు ఆకాలమున 'వసతు'లను నామము సామాన్యముగా ప్రవర్తిల్లుచుండెను.

ఈ సార్థవాహాధ్యక్షుడు గొప్ప జినభక్తుడు. అతడు తనవెంట దంతముతో నిర్మించిన గోమఠ విగ్రహమును సగౌరవముగా తెచ్చుకొనుచు నిత్యము పూజించుచుండెను. ఆ విగ్రహ మాతనికి ప్రాణపద మైనది.

అత డుండవల్లివసతి జేరగనే ముందుగ దందలి ప్రధానాచార్యుని సందర్శించెను. ఆచార్యుల కాతడు ప్రణమిల్లుచు తనవెంట తెచ్చిన యమూల్యము లగు రత్నములను కాంచనమును కానుకగా నర్పించెను. ఆచార్యు డవి గ్రహించి యన్నిటిని ఆ వసతి కిచ్చివేసి యాతని నాశీర్వదించెను. కుశలప్రశ్నాదికము జరుగుసందర్భమున సార్థవాహాధ్యక్షు డాయాచార్యులకు తన సార్థమునవస్థ వర్ణించి శరణార్థియై రక్షింపవేడుకొనెను. ఆ యాచార్యు డాలకించి జాలిపొందెను. జాలిపడి యూరకొనక యా రాత్రియే యా సార్థమును కృష్ణావేణ్ణానదిని దాటించుటకు నావికుల బిలిపించి సౌకర్యములు కలిగించెను. ఆ జైనవసతి యప్పటి కింకను గొంటూరునాగదేవుని బాధ పడలేదు కాని, శీఘ్రముగా నేమి యాపదయైనను రావచ్చు నని యచ్చటి యాచార్యులు భయపడు చుండిరి.

ముందుగా నిర్ణయించినప్రకారము అర్ధరాత్ర మగునప్పటికి సార్థములోనివారు కృష్ణవేణీతీరము చేరుకొని మొదటిజట్టువారు నావ లెక్కిరి. తెల్లవారువరకును ఆ నావలు సార్థము నావలికి దాటించుచుండెను.

తూర్పున తెల్లవారుచున్నది. సార్థములోని వాహనములును భారము లగు సామగ్రులును పడవ లెక్కినవి. ఈ తడవ నావలు దాటినచో సార్థ మంతయు దాటి పోయినట్లే!

పక్షుల కలకలముతోపాటు దక్షిణముగా నొక భయంకరనాదము వినవచ్చెను. తప్పెటలు, తాళములు, శంఖములు, సింహనాదములు! ఏదో సైన్యమే యటునుండి వచ్చుచుండెను. ఐదువందలమంది కల అశ్వికదళము శీఘ్రగతి కృష్ణాతీరము చేరికొనెను.

అప్పటికి చనుపలోని చివరిభాగమువారి నావలు కృష్ణవేణిలో సగము దూర మైనను బోలేదు. సేనానాయకు లా నావల వెనుకకు త్రిప్పుడని నావికులను కఠినముగా శాసించిరి. సంజ్ఞలు కేకలు భయంకరముగా నుండెను. నావికు లేమి చేయను దోపక వెనుకాడుచుండిరి. ఈ సార్థవాహులు రేపటి కావల నెంతదూరమో పోవుదురు. నావికులో, ఇక్కడనే కాపురములు చేయువారు. వారి భార్యలు బిడ్డలు ఇక్కడనే కలరు. వారి ఇళ్ళు గొడ్లు గోదలు నిచ్చటనే కలవు. సేనల యాజ్ఞలు ధిక్కరించి వారు బ్రదుకు టెట్లు? సార్థవాహు లెంత ధన మిచ్చినను దాని నేమిచేసి కొందురు తాము?

పడవలలోనివారు నావికులను బ్రతిమాలి భంగపడి విశేషబహుమానములు చేయుదు మని యాశపెట్టిరి. సేనలవంక చూడవలదని ప్రార్థించిరి. నావికులకుకూడ నొక భయ మున్నది. ఇప్పుడు వెనుకకు త్రిప్పినను సేనలచే తమకు ప్రహరణములు తప్పవు! ప్రస్తుత మావలియొడ్డు చేరి యందే కొన్నా ళ్ళున్నచో నవంతరకర్తవ్య మాలోచించుకొనవచ్చును. ఎట్లైన నేమి. సార్థమంతయు నుత్తరతీరము చేరుకొనెను. అందులోనివారికి మల్లికార్జుననియు కనకదుర్గయు ప్రాపు సంప్రాప్త మయ్యెను?

మరి యిక మోసలపురమున బయలుదేరిన చనుపమాత్ర మింత యవస్థ పడలేదు. ఆ చనుపలోని సార్థవాహులు విదేశములనుండి వచ్చిన సరకులనే కాక, యా చుట్టు

ప్రక్కల పద్మసాలెలు నేసిన సన్నని వలిపెములును చిత్రచిత్రవర్ణములతో నద్దిన మనోజ్ఞవస్త్రములును విశేషముగా తెచ్చుచుండిరి. ఆ వస్త్రములును వలిపములును భారతదేశమం దంతటనే కాక, దూరమున నున్న యవనరోమక తురుష్కదేశముల గూడ పేరుపడ్డవి. ఆ చనుప ఘంటసాల చేరువప్పటికే దూరమున నలజడులు జరుగుచున్న వార్తలు వచ్చెను. అందుచే వారు శీఘ్రగతి కోలనివీడు చేరుకొన దలంచిరి. అచ్చటికి చేరుకొన్నచో కోలనిరుద్రుని దుర్నిరీక్ష్యము లగు సేన లుండును. కాని యది వర్షాకాలము! కొల్లేటిలో కలియు బుడమేరు ఇత్యాది నదు లపాయకరములు. వారు సాహసించి శ్రీకాకుళము చేరుకొనిరి. అప్పటి కావలియొడ్డున గల కొల్లూరను నగ్రహారముసమీపమున కొప్పెరుంజింగని సైన్యములు విడిసియుండి కృష్ణవేణి నుత్తరించు ప్రయత్నములలో నుండె నని వారికి తెలిసిన వెంటనే ఆ సార్థవాహులు బయలుదేరి పులి వెంటబడుచున్న మృగములవలె రాత్రింబవళ్ళు విశ్రమింపక ఎడతెగని ప్రయాణములు చేసి బెజవాడ చేరుకొనిరి.

మోసలపట్టణమునుండి ఓరుగల్లు పోవుమార్గములో బెజవాడ పెద్దకూడలి! అక్కడగల బలమైన కాకతిరాజసేనలు ప్రజారక్షణ చేయగలవు. అక్కడి సేనలను కోలనివీడులోని సేనలను ఎదుర్కొన జంకియే కొప్పెరుంజింగడు తన పల్లవసేనలతో దూరదూరమున తూర్పుతీరప్రాంతములనుండి ఈశాన్యముగా దండుపోవుచుండెను.

ఈ రెండు చనుపలు నిప్పటికి ఇరువదిరోజులక్రిందట బెజవాడలో కలసికొనెను. వాని యధ్యక్షు లిరువురును కలసియే యాపైన పయనము సాగింప నిశ్చయించిరి. వా రిరువురిలో ఎక్కువ యనుభవశాలి యగు మోసలపురసార్థవాహాధ్యక్షుడే యాపైని సర్వసార్థాధ్యక్షు డయ్యెను.

వారు బెజవాడలో ధాన్యగ్రాసాదులు సంగ్రహించుకొనిరి. క్రయవిక్రయములు కొన్ని పూర్తిచేసిరి. అంతట వారు బయలుదేరిరి. అచ్చటనుండియైనను మార్గము శాంతముగా లేదు. సేనలబాధ లేకున్నను దోపిడిగాండ్ర బాధ తప్పలేదు. ఆ దోపిడిగాండ్రు సామాన్యులా? వారు సాయుధులు. వారికి వేళ లేదు. నిద్రించుచున్న సార్థజనములపై నొకపరి పడి కొందరిని చంపి ద్రవ్యము కొంత హరించి పారిపోదురు. ఇరుకుమార్గములగుండ వెళ్ళునెడల నెల్లవారి బాధ తప్పదు. అట్లే పర్వత మార్గములును వనమార్గములను అనుసరించి సార్థమేగునప్పుడెల్ల అపాయము లెదుర్కొనవలసినదే. ఎట్లో వారు జగ్గయ్యపేట చేరుకొనిరి.

అది యనాదిగా పట్టువస్త్రముల నేతకు పేరుపడ్డపేట. అచ్చటి వర్తకు లెందరో ఆ చనుపలో చేరి పయనము సాగించిరి.

అంతట కొన్నిదినములకు వారు పాకాల చేరుకొనిరి. అక్కడ కాకతిరాజన్యుల స్కంధావారము పెద్ద దొకటి కలదు. అక్కడ నున్న పెద్దచెరువు సౌఖ్యదాయకముగా ఉన్నది. ఆ వైపున నెట్టి యలజడియు లేదు. కాని యక్కడ వర్తకులు చెల్లించవలసిన సుంకము లెక్కువ. ఐన నేమి? ఇక్కడ నే భయము లేదని సార్థవాహులందరు దీర్ఘనిశ్వాసము వదలిరి. వారు సుంకములు సక్రమముగా నన్నియు

జెల్లించిరి. అక్కడనే తమ సరకు లెన్నిటినో పోకడపెట్టిరి. చెల్లించిన సుంకముల కంటె శతాధికముగా వారచ్చట లాభము సంపాదించిరి.

అగ్రహారములు వసతులు ఘంటాపథములకు సామాన్యముగా దూరముగా నుండెడివి. సార్థవాహులు రాజమార్గ మలజడిగా నున్నయెడలనెల్ల సమీపమున గల అగ్రహారముల నాశ్రయించెడివారు. ఇట్లెన్నో కడగండ్లు గడచి యా సార్థము తుదకు ఓరుగల్లు పట్టణము చేరికొని తూర్పుద్వారమునందు నిలిచెను. అచ్చట నప్పటికే సిద్ధముగా నున్న స్థలసుంకాధికారులు శీఘ్రగతి సుంకములు నిర్ణయించిరి. స్థలసుంకాధికారులకును వర్తకులకును భేదాభిప్రాయము రాకుండ, నచ్చట శ్రీగణపతిదేవుల శిలాశాసనమే యొకటున్నది.

"....................

చందనము—తులం ౧ కి ఫలము.

కర్పూరము—వీశ ౧ కి ౨ చిన్నాలు.

జవాది—మాడపరక.

కస్తూరి—౧౦౦ చిన్నాల ౧ కి చిన్నము.

....................... ... ........"

సూర్యు డస్తమించెను. చీకటి పడిపోయెను. సుంకనిర్ణయము బూర్తికావచ్చుచుండెను.

అంతట ఏకశిలాపురపాలకు డగు మేచయనాయకుడే స్వయముగా పలువురు భటుల సమూహముతో నా చనుపయెదుట ప్రత్యక్షమై, సార్థవాహాధ్యక్షుని బిలిపించి యాతని యధికారపత్రము లడిగెను.

ఆ యధ్యక్షునికి సాకాల చేరినప్పటినుండియు చనుప కెట్టి భయమును లే దని ధైర్యము నెలకొనెను. రాజధాని చేరుకొనునప్పటి కాధైర్యము శతగుణ మయ్యెను. అనుభవశాలి యగు నతనికి రాజపురుషు లన్న నెట్టి భయమును లేదు. అందుచే కొంత నిర్లక్ష్యము కలసిన గౌరవముతో నతడు తాను మోసలపురమునుండి తెచ్చిన యధికార పత్రాదులు మేచయ కీయబోయెను. మేచయ యవి స్వయముగా నందుకొనక వెంట నున్న గండని నిర్దేశింప నత డవి తీసికొని వెనుకనున్న లేఖకుని చేతి కిచ్చెను. ఆ లేఖకు డవి చదివి వినిపింపబోవుచుండ మేచయనాయకు డాతనిపై తీక్ష్ణదృష్టి ప్రసరింపజేయ నాత డట్టె చదువుట చాలించెను.

ముందుభాగమున నిది జరుగుచున్న సమయముననే యా చనుపవెనుకభాగములో కొంత యలజడి వినవయ్యెను. మరుక్షణమున నలుముఖములనుండి కరదీపికలు ధరించిన రాజభటు లాచనుపను ముట్టడించిరి. ఈ యవినయమునకు సార్థవాహాధ్యక్షుడు నివ్వెరపోయి చూచుచుండెను.

అంతలో రాజభటులు 'వీరు పారిపోవుటకు ప్రయత్నించుచుండిరి' అని చెప్పుచు వెనుకనున్న కొందరు బేహారులను బంధించి తెచ్చి మేచయనాయకునెదుట నిలిపిరి. మేచయ యా బంధితులను తన తర్జనితో నిర్దేశించుచు సార్థవాహాధ్యక్షుని బ్రశ్నించెను.

"వీ రెవరో ఎరుగుదువా ?"

అధ్యక్షుడు వెంటనే యుత్తర మిచ్చెను.

"ఎరుగను. వారితో మాకు సంబంధము లేదు."

మేచయ యా బంధితులవంక తీవ్రముగా తిలకించెను. వారు సార్థవాహాధ్యక్షునివంక ఆశ్చర్యము ప్రకటించు దృష్టులు పరపి మరల మేచయనాయకునివంక వీక్షించిరి.

మేచయ : "మీ రేల పారిపోవుచుంటిరి ?"

వారిలో నొకడు : "రాజభటు లిందరొక్కసారి రాగా చూచి, భయపడి పారిపోసాగితిమి."

మేచయ : "రాజశాసనములు సంరక్షించు భటులను జూచిన అనపరాధులు భయపడుదురా ?"

మరియొకడు : ప్రభూ, రాజభటు లందరు శాసనములు రక్షించువారేనా ?—
—మేము దారిలో ఎన్ని కడగండ్లపా లయినాము ? అందులో—"

ఇంకొకడు : "దొరా, రాజభటులను జూచి భయపడు నిరపరాధులును పలువురున్నారు."

మేచయ : "ఈ యధ్యక్షునికి తెలియకుండ మీ రీ చనుపలో నేల కలసితిరి ?"

మరల వారు బెదరుచు అధ్యక్షునివంక నొకమారు చూచి, నాయకునివంక నొకమారు చూచి, యొక్క త్రుటికాలము నిరుత్తరులైరి. అంతట నందులో నొకడి ట్లనెను.

"మా పేళ్ళు అధ్యక్షుడు లెక్కలలో ఎక్కించుట మరచెను కాబోలు!"

అధ్యక్షుడు ఆకస్మికముగా "దుర్మార్గుడా" యని యందుకొనెను. అంతవరకును ఆ వర్తకవర్యునకు తన స్థితి సందేహాస్పదమని గోచరింపలేదు.

మేచయ : "ఈ సరకు లేమి ?"

అధ్యక్షుడు : "ఒకటా ? ముత్యములు, పవడములు, దంతములు, మంజిష్ఠము, కప్పురము, జవ్వాది, కస్తూరి, వలిపములు, అద్దకములు, పట్టునూలు, పట్టువస్త్రములు—"

మేచయ : ఇంతవిలువగల సరకులయొద్దకు క్రొత్తవారినెట్లు రానిచ్చితివి ?"

అధ్యక్షుడు : "వా రెట్లు వచ్చిరో నాకును విచిత్రముగనే యున్నది—అయినచో మీ సరకు లేవి ?" ఈ చివర ప్రశ్న యాత డాబంధితుల నడిగెను.

బంధితులు పోయి కొన్ని శకటములు చూపి యివి మా వని చూపిరి. అందులో వలిపములును పట్టువస్త్రములును గలవు.

అధ్యక్షుడు నిర్ఘాంతపోయెను.

ఆ బంధితు లంతట నందలి సరకులను వివరముగా పర్కింపసాగిరి. దానితో నధ్యక్షుడు నోట మాట రాక నిర్విణ్ణుడై చూడసాగెను.

మేచయ సూక్ష్మముగా నిట్లు పలికెను.

"ఇట్టి సందర్భములలో కొంతకాలము మీ రందరును ఈ సరకులతో సహా రాజభటుల స్వాధీనములో నుండుట యందరకు శ్రేయస్కరము !"

ఆ వర్తకు లందరు నెవ్వెరపోయిరి. ఇన్ని గండములు గడచి బయటపడిన మనకు ఓరుగంట నీగతి పట్టిన దేమని వారు తమ విధిని దూరుచు బయలుదేరిన వేళను నిందిరిచు చుండిరి. కొందరు బిగ్గరగా నేడ్వసాగిరి. కాని వా రేమి చేయగలరు ?

రాజభటులు వారి నందర జుట్టుముట్టి మోటుతనము లేని దృఢమార్గమున గోపుర ద్వారము దాటించి జాగరూకులై చెరసాలకు నడిపించిరి. బంధితులు ప్రత్యేకముగా గండడి భటుల రక్షతో వేరొక ప్రదేశమునకు గొంపోబడిరి.

ఇది యపూర్వము! ఒక్క సార్థముసార్థమునే యిట్లు రాజభటులు కొంపోవుట యశ్రుతపూర్వము. ఇంతప్రొద్దువేళ వెన్నెలలో, అనవసరముగా ఇన్ని దివిటీలతో, మేచయనాయకుడే స్వయముగా చెరసాలకు నడిపించుట యూహింపగూడ నలవి కానిది. మేచయనాయకుడు భ్రమపడుటయు ఓరుగంటిపౌరులు భావింపరానిది. కాని ఇందరు వర్తకశ్రేష్ఠులు చెరసాలకు నడచుటకూడ దక్షిణదేశమున నే భావింపరానిది!

ఇది యిట్లు జరుగుచుండగనే యారాత్రి రుద్రదేవమహారాజు భద్రదంతావళముపై నధిరోహించి మహావైభవముతో పురవీధుల నూరేగుచు పురకాంత లర్పించు నారతు లందుకొనుచుండెను. చంద్రుడు వెన్నెలలు పూలజల్లువలె కురియుచుండెను. సహస్రాధికములగు రతనాల దివిటీల కాంతిలో నా మహోత్సవము చూడ ఏకశిలానగరము, మహేంద్రు డైరావతము నెక్కి పురమేగు నమరనగరిని దలపించుచుండెను.

## ౧౫

"వేశ్యాగృహేషు సురతోత్సవ జాతచేష్టాః
శబ్దానుకారి శుకశారి కలోరుశబ్దాః
సర్వాధశోముఖరయంతి దివా విటానామ్
కందర్పదర్పతరలార్ల్లవఘూర్ణచంద్రాః"         హనుమకొండశాసనము

ఏకశిలానగరమున నా రాత్రి పండువెన్నెల కాయుచుండెను. వెన్నెలకు తోడై నగరమం దంతట వెలుగుచున్న దివ్వెల కాంతితో ఆ రాత్రి పగలే యనిపించుచుండెను. నగరమం దంతట సమ్మర్దముగా జనులు సంచరించుచుండిరి. ఇనను అన్నివాడల కంటె ఆనాడు వేశ్యవాటిక యధికజాగృతమై విశిష్టమైన శోభతో నలరారుచుండెను.

ఆ పురమున రాచనగరితర్వాత ఎక్కువ విలాససంపదలు కలది వేశ్యలవాడయే. ఆనాటి వేశ్యల కళాకుశలత యిట్టిదని యూహింపదగినదే కాని వర్ణింప సాధ్యము

కాదు. అప్పటి జీవితములో గ్రామమునుండి రాజధానీనగరమువరకు ఎల్లెడల వేశ్యలు ప్రముఖస్థాన మలంకరించుచుండిరి. రాజగురువు లగు శ్రీవిశ్వేశ్వర శంభు దేశికు లొక యగ్రహారము కల్పించుచు, అందు పదిమంది నట్టువకత్తెలకును ఇరువురు ముఖరులతో గూడ ఎనిమిదిమంది మద్దలవాదకులకును— ఈ పదునెనిమిదిమందికి ఒక్కొక్కరికి ఒక్కొక్కపుట్టిన్నర భాగ మేర్పాటుచేసెను. ఆంధ్రకవులు ప్రాయికముగా పురవర్ణముచేర్చుటకు కారణము వారిభోగలాలసత యనదగదు. కర్మిష్ఠియగు తిక్కనామాత్యు అయోధ్యాపురములోని వారవనితల నీవిధముగా వర్ణించినాడు.

"సువ్వంపుమేనుల జవ్వనంబులకెంపుమిగిలిన చెయ్వుల మెఱుగువెట్ట
నల్లన మధురంపుసల్లాపరచనకు లేతనవ్వున నునుబూత పూయ
నిడునాలుగనుదోయి నునుపారుకాంతికి గలికి క్రేగన్నుల నలువుమిగుల
లలితంబు లగు చిత్తముల చతురతలకు సరసంపునడవడి దెరలువుచ్చ
వెరవు గల్గి మనోభవువీరరసము - నిరతముగ నేర్పు వాటించి కరువుగట్టి
పోసిచేసిన రూపులపోల్కి - వారవనిత - లొప్పుదు రప్పురవరమునందు"

ఇక యోగీశ్వరు డగు ఎఱ్ఱయ వైకుంఠపురములోగూడ స్త్రీలను వర్ణించుచు నక్కడ వారవనిత లుండుట యసంభావ్యము గనుక, వారి వర్ణనమే స్ఫురింపజేయుచు నేనున్నాడు?

"తమ వాడిచూడ్కి కందర్పున కేపని యైన సాధించు దివ్యాస్త్ర మనగ
దమ తియ్యపలుకులు ప్రమదరాగాంబుధి దనరారు వవ్వంపుదరగ లనగ
దమ వింత చెయ్వులు కమనీయకోమల శృంగారతరువు లేజిగురు లనగ
దమ ముద్దునవ్వులు తమకంబు జీకటి నిగిడించు నరిదివెన్నెల లనంగ
జొక్కమందు లనగ సోయగంబులగను - లనగ సుఖము నిక్క లనగ జాలి
యనుపమానమూర్తులై యుల్లసిల్లుదు - రంబుజాయతాక్షు లప్పురమున."

మరి భక్తాగ్రేసరు డగు పోతన భోగినిని,

"విద్యావినయోపేత సౌందర్యచాతుర్యవిఖ్యాత చంచద్గుణోపేత—" ఇత్యాదిగా వర్ణించినాడు.

సభాపూజ్యు డగు పెద్దన ప్రవరాఖ్యు డుండు పట్టణమునే వర్ణించుచు—

"అచటి వెలయాండ్రు రంభాదు లైన నొరయ
గాసెకొంగున వారించి కటపగలరు
నాట్యరేఖాకళాధురంధరనిరూఢి...."

అని వెలయాండ్ర నందు చొప్పించినాడు.

మహాభోగమునను మహాయోగమునను స్వానుభవము గల దూర్జటి భక్తు డగు ధూర్జటి శ్రీ కాళహస్తి పురమున కామినీజనుల నిట్లు వర్ణించినాడు.

"పరిచితబంధనైపుణి, నపారకళానుభవప్రసక్తి, నా
దరసవివేక సంపద, సదాశుకవాక్యసుధానుభూతి; మో
హరహితవృత్తి, బ్రస్ఫురదనంగరహస్యవిచారబుద్ధి, న
ప్పురమున గామినీజనులు పొల్తురు యోగజనంబు పోలికన్."

నిప్పాణుదేశమున భరతఖండాచారముల ననుకరించు నాచారము లనేకము కలవు. అందు సకలకలాకుశల లగు 'గెషా' స్త్రీలు అనాదిగా గౌరవస్థాన మలంకరించుచుండిరి. ఓరుగంటిలోని వేశ్యవాటిక లెట్టివి? "విద్వేషిభువనవిజిగీషారంభవిజృంభమాణఘుమధ్వజభుజపరాక్రమసముత్సాహనాటకప్రస్తావనా ప్రథమ నాందీశ్లోకంబు లగు వేశ్యవాటికానికటంబులు."

ఆనాటి వేశ్యలు పలువురు బహుకలాకుశలలు. వాత్స్యాయన ఋషి నాగరక ప్రకరణమున బేర్కొనిన గోష్ఠులు ప్రవర్తింపజేయుటకీ వేశ్యానివేశనములే ములు. శాస్త్రాభ్యాసము బుద్ధిపాటవము వాఙ్మాధురి సరసప్రవర్తనము ఏకత్ర కూడిన జనులు లేనిది యవి యెట్లు సాధ్యమగును? వేశ్యాభవనమునగాని సభా నములందుగాని సమానము లగు విద్య బుద్ధి శీలము విత్తము వయస్సుగల వేశ్య రూప మగు ఆలాపనములు ఆసనములు నొనర్చుట గోష్ఠి. ఆ సమయముల సమస్యల పూరింతురు. కావ్యసమస్యలు కళాసమస్యలు చర్చింతురు. ఆ చర్చ పిదప పరస్పరానురాగాదరప్రదర్శనమునకై వస్త్రాదిదానము లొనర్చుకొందురు. యు ఆపానకగోష్ఠులు ఒకమారొకరి యింటను, మరొక పర్యాయము మఱొకరి యింటను పరస్పరభవనములలో సాగుచుండెడివి. ఆ సమయముల మధుమైరేయములనే గాక వివిధ లవణములు ఫలములు తిక్తకటుకామ్లము లగు భక్ష్యములను వేశ్యలచే నారగింపజేసి యు మారగింతురు. మరియు నొక్కొక్కచో పూర్వాహ్ణముననే నాగరకుడు అశ్వముపై నెక్కి ముందువెనుకల వేశ్యల నిడికొని విభవానుసారముగా పరిచారకులను వెష్టింప బయలువెడలి వనవిహార మొనరించి, కోళ్ళ గొరువంకల మేషముల యుద్ధములు దర్శించి, ద్యూతముతోడను నాట్యకేళీవిలాసాదులతోడను ప్రొద్దుపుచ్చి, యపరాహ్ణవేళలందు తమ వనవిహారము ప్రదర్శించునట్లు శిరఃకర్ణకంఠ ప్రదేశములలో పూగుత్తులును కిసలయములును అలంకరించుకొని పరల గృహాభిముఖులై వచ్చుచుందురు. గ్రీష్మకాల మైనచో జలక్రీడల కిట్లే యేగుదురు. మరియు నాయా పర్వసయములలో యక్షరాత్రి కౌముదీజాగారము అశోకోత్తంసిక ఇక్షుభంజిక మొదలగు నెన్నియేని గోష్ఠీక్రీడలు ప్రవర్తింపజేయదగిన వున్నవి. ఈ గోష్ఠీ సమయములలో ధనవంతు లగు నాగరకులే కాక, ధనము కోల్పోయిన విదగ్ధులుకూడ ఉపనాగరకులై పాల్గొనవచ్చును. అంతేకాదు. గ్రామవాసులుగూడ నందు చేరదగుదురు. ఈ గోష్ఠీసందర్భములలో ప్రయోగించు భాషలోగూడ నియమము కలదు. అయెడ నత్యంతసంస్కృతము కాని అత్యంతము దేశభాషగాని అవలంబింపక మధ్యేమార్గమున ప్రవర్తింపవలెను. లోకవిద్విష్టములును స్వైరవిహారము గలవియు పరహింసాత్మకములును అగు గోష్ఠులను వాత్స్యాయనుడు నిషేధించినాడు. కాని లోకమునం దందరు బుద్ధిమంతులే యుందురా?

విద్యావతు లగు నంగనలు నాగరకుల భోగములకేగాక, రాజకీయవ్యవహారములకు గూడ వైభవముగల దేశములలో అవసరమై యుందురు. దూరదేశములలో రాయబారములు జరుపువారు స్వయముగా సమర్థు లగుటయే కాక వారి భార్యలను గూడ విద్యావతులును సుందరాంగులును చతురలును ఐయుండు టవసర మనునది రాజ్యతంత్రజ్ఞులకు క్రొత్త కాదు. పాశ్చాత్యదేశములలో సంపన్నులును విద్యావత్మతు

లును నగు యోషిద్రత్నములు విందు లను మిషతో, తమ భవనములకు కవులను గాయకులను చిత్రకారులను ప్రభువులను ఆకర్షించి, తా మానందించి వారి నానందింప జేయుటయు, అట్టి యోషలలో ఒకరి కొకరికి స్పర్థ లుండి ఒకరిని మించి యొకరుండవలె నని ప్రసిద్ధ స్త్రీపురుషాదుల నాకర్షించుమార్గము నన్వేషించుచుండుటయు లోకవిదులకు కొత్తకాదు. అట్టి గోష్ఠులే కవితాశిల్పప్రపంచమునకే కాక రాజకీయ ప్రపంచమునకుగూడ ఉత్సాహ మొనగూర్చు కేంద్రములుగా నుండును.

భరతదేశమున కులస్త్రీ లెంత విదుషీమణులైనను, వారిని ఇట్టి జనోపయోగ కార్యములకు ఉపయోగించు నాచారము లేదు. అందుచే ఈ ప్రయోజనములు సాధించుటకు వారవనిత లుపయోగపడెడువారు. వారకాంతలు వెలయాండ్రే కారు! వారే విదుషీమణులు, కలాకుశలలు. కవిత్వప్రవర్తకలు, విద్వజ్జనాభిమానలు. ఒక్కొక్కచో మహాభక్తురాండ్రు. గీతగోవిందకారు డగు జయదేవుడు భక్తాగ్రేసరు డైనచో ముద్దుపలని యాతనికి భక్తిలో తీసిపోవునా? వారవనితలలో మహాభక్తురాండ్రు కలరు; యోగినులు కలరు. ఆ యనుభవ మున్నందువనే ధూర్జటి కామినులకు యోగినులతో అభేదాధ్యవసాయము చేసినాడు. వారు మరియు రాజ్యతంత్రములలో కీలకప్రాయలు. నిర్వీర్య మగు కాలములందును రాజ్యములందును సంఘములందును పూర్వము పటుత్వ మొనగూర్చిన సంస్థలే హీనస్థితిని పొందును. ఆ హీనస్థితినిబట్టి ఉత్తమకాలములలో నున్న యా వ్యవస్థలను నిందింపరాదు. తిక్కనాది మహాకవులు వేశ్యాజనమున కింతటి ప్రధానస్థాన మిచ్చియుండుటకు వారి కా కాలమున గల యథోచితస్థానమే కారణము. కేవలము భోగలాలసులు శరీరకండూతి తీర్చుకొనుటకే ప్రధానముగా నుపయోగపడు పతితవృత్తి నుద్దేశించి వా రట్లు వర్ణింపలేదు. అందుచే ఏకశిలానగరమందలి వేశ్యవాటికలోనికి కవులు విదగ్ధులే కాక నీతివిదులును పండితులును శిష్టంమన్యులును ప్రవేశింప జంకరాదు. ఒక్కసారి యా వేశ్యలవాడలో లౌల్యములేకుండ బ్రవేశించి చూచివత్తము. అందులో ఇది మహాపర్వము!

## ౧౬

ఇది శరదుత్సవసమయము. విజయదశమి. అందులో నీనాడు శ్రీ రుద్రదేవమహారాజులకు యౌవరాజ్యపట్టాభిషేక మైనది. దానికై దేశదేశములనుండి ప్రభువులు ధనికులు విద్వాంసులు కవులు గాయకులు నటులు విదూషకులు కలాకుశలురు రాజధానీనగరమున సమావేశ మైరి.

చల్లగా వెన్నెల కాయుచున్నది. వెన్నెలసౌఖ్య మెరిగినవారు వెన్నెల అనుభవింపక నిమురింపగలరా? కాని ఈ వెన్నెలతీపి ఆస్వాదించు టెట్లు? వెన్నెలలో ఏకాంతముగ నెంత సంచరించిన దాని యనుభూతి సాధ్యమగునా? అదిగాక వెన్నెల కూడ ఉద్దీపకవస్తువేకాని స్వయముగా రసత్వము పొందదగినది కాదు. అందుచే

కౌముదీజాగర మను నుత్సవము ఆ వేళలో యుక్తమైనది. పూర్ణిమాదినములలో నా యుత్సవము సంపూర్ణశోభాయమానముగా నుండునుగాని శుద్ధదశమినాడుగూడ దాని కభ్యంతరము లేదు. ఈ రాత్రి వేశ్యవాటికలో విశేషముగా కౌముదీజాగరమహోత్స వమే ఇంటింట ప్రవర్తిల్లుచుండును.

ఆ వాడలో ఎన్నో ఉన్నతహర్మ్యములు గలవు. వానిముందు విశాలప్రాంగణము లున్నవి. వాని కనుబంధములుగా గృహోద్యానములు రమ్యమైనవి కలవు. అందులో జలవిహారములకు వాపీతటాకాదు లున్నవి. అందలి జలయంత్రములును జలనాళికలును అసంఖ్యాకములు. మరియు వనవిహారమునకును విశ్రమించుటకును గోష్ఠీవినోదములకును, సైకతములును, మండపములును రత్నవితర్దికలును పొదరిండ్లును అచ్చటచ్చట నలంకరింపబడి యున్నవి.

కొన్ని మేడలలో సౌధోపరితలములనే గోష్ఠీప్రసంగములు సాగుచుండెను. కొందరు హర్మ్యాంగణముల గల మండపముల నుపవిష్టులై సంగీతగోష్ఠి సాగించుచుండిరి. కొన్నియెడల నుద్యానములలో బహువితర్దికలపై స్త్రీపురుషు లాసీనులై మధ్యభాగమున ప్రవర్తమాన మగుచున్న నర్తనము తిలకించుచుండిరి. కొన్ని యిండ్ల ముందు ఇసుకతిన్నెలపై నాగరకులు సుఖోపవిష్టులై విటవిదూషకులతో శృంగారి హాస్యకాలక్షేపములు కావించుచుండిరి.

అర్ధరాత్ర మగుటకు ఇంకను రెండు గడియ లున్నది. స్వయంభూదేవాలయము లోని ఘంటికానాదములతో కలసి, రాజమందిరము మొగసాలపైనుండి గడియారమున పదునాలుగింటలు గణగణ మ్రోగినవి. శ్రీ రుద్రదేవమహారాజుల భద్రగజోత్సవము పూర్తి యైనది. మంత్రిసామంతదండనాథు లంతవరకు నా యుత్సవమున యువరాజును కొలిచియుండిరి. వారందరకు నిప్పుడు విడుదలకు బోవ సెల వైనది. జాబిల్లి పశ్చిమాకాశమధ్యమునకు చేరుకొన్నాడు. వేశ్యవాటికలో దీపకాంతి హెచ్చినది. అందు ప్రతియింటను పరిచారికల రాకపోక లెక్కువైనవి. గోష్ఠీమధ్యమునుండి వేశ్యలు మధ్యమధ్య లేచివచ్చి వారికి నూతనాజ్ఞ లిచ్చుచున్నారు. ఇంతకును ఉత్సవమువెంట నున్న మహారాజపురుషులు వినోదార్థము వేశ్యవాటికకు చేరువేళ యైనది. అక్కడ కవి గాయక నటవిటవిదూషకాదులతో వినోదముగా ప్రొద్దుపుచ్చి నాగరకానంద మనుభవింపవలెనను కుతూహలము పెక్కుర కుండును. తమతమ ప్రియ ప్రభువులను రంజింపజేయుట కా వారవనిత లెంతయేని యుత్సుకత ప్రకటించుచుండిరి.

ఆ వారవనితావాటికలోని గృహములలోనెల్ల నున్నతమైనది మాచల్దేవిసౌధము. ఒక్క రాచనగరు తప్ప ఓరుగల్లున నంత యున్నతసౌధ మింకొకటి లేదు. మాచల్దేవి ప్రౌఢవయస్సున నున్నది. దాని కుటుంబములోనివారు అనాదిగా కాకతీయ రాజకుటుంబముతో సంబంధము కలవారు. 'మాచల్దేవి' యనునది కుటుంబమున మూలనాయకురాలి నామము. ఆ నామము వారు పూజ్యతతో మఱలమఱల రెండుతరముల కొకసారి పెట్టుకొనుచువచ్చినారు.

ఈ మాచల్దేవితల్లి గణపతిదేవుల యనుగ్రహము సంపాదించినది. గణపతిదేవులకు కుమారుడు లేడు. మాచల్దేవిని రాజవంశములోనాదరింప సాహసించువారు లేరు.

అది సంస్కృతప్రాకృత కావ్యనాటకపురాణేతిహాసము లెన్నియో చదివినది. ఆలంకార శాస్త్రమునకు నాట్యశాస్త్రమునకు నిధి. చతుష్షష్టికళలలో దానికి అపరిచితమైనదిలేదు.

అది యువకులనే గాక వృద్ధులనుగూడ నాకర్షించును. ధనవంతులైనను పేద లైనను బుద్ధిమంతులైనచో దాని కిష్టులే. ఏశాస్త్రములోగాని కళలోగాని ప్రతిభకల వ్వాని నది తనగోష్ఠికి వచ్చునట్లు చేయును. అది చూచుటకు ప్రతివారికిని సులభ సాధ్యగా కనిపించును. అందుచే దాని గృహమున రాత్రి గడపినట్లు పలువురు సగర్వముగా చెప్పికొనుచుందురు. కాని అది ఎంత సర్వసామాన్యగా కనిపించునో అంత ఆత్మనిగ్రహము కలది. దానికి కామతృష్ణయే లేదను బుద్ధిమంతులును గలరు. మరి కొందరు తాము అడిగినమాత్రముననే యది మోహతృష్ణ తీర్చె నని చెప్పికొనువా రున్నారుగాని, యట్టివారు దానిచే నేకాంతమున నిరాకరింపబడి పరిభవింపబడిన వారే. అట్లు పరిభవింపబడినవారు మరల దానివద్దకు ఇంకొకనాడు వచ్చినను, వారి నది చురచుర చూచి పంపివేయును. ఏమియు జరుగనట్లే ఆదరముగా వినోదకథా కాలక్షేపము చేయును. దాని ఇంటికి మూపమునకు నాగరకుల కది యందినట్లే యుండియు నందరానిదై యుండును. దాన దాని యాకర్షణ శతగుణ మగుచుండెను.

మాచల్దేవి యీనాడు తన క్రీడోద్యానములో చలువరాతిమండపమున నుప విష్టయై యున్నది. పలువురు కవులు పండితులు నాగరకులు దానిని పరివేష్టించి యున్నారు. ప్రతివారును కూర్చుండుటకు నగిషీచేసిన పట్టుపరుపులు గల యాసనము లున్నవి. మండపమధ్యమున నొక దంతపీఠిపై నగరువాసించు నగ్నికరండ మున్నది. పరిచారికలు సభాసదులకరదరికు కస్తూరి పచ్చకర్పూరము కుంకుమము ఇత్యాదులు గుబా ళించు తాంబూలము లందీయ, వా రవి మరల మరల సేవించుచున్నారు. వారిలో నిష్ట మున్నవారికి మధుపాత్రలును వచ్చుచున్నవి.

కొంతతడవు ప్రతిమాల యను క్రీడ సాగినది. ఈ క్రీడలో చేరినవా రందరు మాలికారూపముగా మండపములో కూరుచుండిరి. అందులో మాచల్దేవి కొలికిపూస! అది శ్రీకారముతో ప్రారంభించిన యొక శ్లోక మెత్తుకొని చదివినది. దాని కంఠము నకు ముగ్ధులై యెల్లరు వినుచుండిరి. అంతలో నా శ్లోకము పూర్తి యైనది. దాని యంత్యాక్షరము 'భ'. ఆమెవామ పార్శ్వమునగల నాగరకుడు భ యను నక్షరముతో ప్రారంభించు శ్లోక మొకటి చదివెను. అతడు పూర్తిచేసిన పద్యము నంత్యాక్షరముతో ప్రారంభించు శ్లోక మాతని తర్వాతివాడు చదివెను. ఇట్లు మాలగా శ్లోకములు సాగిపోయినవి. కాని మధ్యమధ్య దుష్కరము లగు నక్షరములతో శ్లోకములు పూర్తి యగును. దానితో ప్రారంభించు శ్లోకము దొరకదు. తర్వాతవాని కట్టి దందుకొనుట చేతకాకపోవును. అట్టివా డోడిపోయినట్లు! ముందు నిర్ణయించుకొన్న విధముగా అపరాధము వెంటనే వాడు చెల్లించుకొనవలెను. ఆ చెల్లించు నపరాధమునకుకంటె మాలాభంగము చేసినందు కాతనిపై, సహృదయులకు కలిగిన యసహ్యమున కాత డెక్కువ పరితపించును. గోష్ఠిలో నందరును శ్లోకములు గాధలు బహుశ్రావ్యముగా పఠించుచుండిరి. ఆ పాఠ్యపద్ధతి గోష్ఠి కెంతయేనియు నానందము సమకూర్చెను. ఓడి

పోయినవానిపై మిగిలినవారందరు నొక్కమారు పరపు నవ్వుకలకలము మృదంగనాదముకంటె మనోజ్ఞమై మధ్యమధ్య వినిపించుచున్నది.

ఆ పిమ్మట వారు కొంతసేపు ప్రహేళికలు సాగించిరి. మాచల్దేవి యచ్చటివారికీ ప్రహేళిక యొసగెను.

"వనే జాతా వనే త్యక్తా వనే తిష్ఠతి నిత్యశః

పణ్యస్త్రీ నతు సా వేశ్యా యో జానాతి స పండితః"

ఈ విధానమునకే తెలుగునాట పొడుపుకథ లను పేరువచ్చినది. 'ఇంతముండ లేదు' ఇల్లంతా నెత్తురే!'

పై శ్లోకములోని వనశబ్దము ఇట్టిదే! నానార్థములు సువ్యక్తములైనందున పలువురది 'నౌక' అని చెప్పివేసిరి. 'మీరు పండితులే!' యనుచు మాచల్దేవి వారిలో ముందు చెప్పినవానిని కాశ్మీరసేలువతో నలంకరించెను.

ఒక రిట్లు దండ్యాచార్యుల కావ్యాదర్శమునుండి ప్రారంభించిరి.

"అత్రోద్యానే మయాదృష్టా వల్లరీ పంచపల్లవా

పల్లవే పల్లవే తామ్రా యస్యాం కుసుమమంజరీ."

ఆ ప్రారంభించినవాడు ఒక యువకవి. అత డెంతకాలమునుండియో మాచల్దేవి యాస్థానమందలి గోష్ఠుల కరుదెంచుచుండును. అత డెప్పుడు వచ్చినను సిగ్గుపడకుండ మాచల్దేవిముఖాబ్జముననే మాచల్దేవికరాబ్జములనే మాచల్దేవిపదాబ్జములనే దృష్టి నిలిపియుంచును. మాచల్దేవియు నతని చూపులకు కోపింపదు. అతని వెకిలిచూపును చూచి నవ్వుకొనుచుండును. ఈ శ్లోక మీనాడు చదువగానే మాచల్దేవి పెద్దగానే నవ్వెను.

"అభినవదండిగారూ, మీరు చూచిన యా వల్లరి యీ మాచల్దేవియే సుమండీ!" అని చెప్పి వేసెను. ఆమె పదపల్లవములు కరపల్లవములు అధరపల్లవము నిరంతరము ధ్యానించు నా కవి వెంటనే యొక ముత్యాలపేరు మాచల్దేవికంఠమున నలంకరించెను.

అంతలో ప్రతీహారిణి వచ్చి పెద్దలు వచ్చినా రని మాచల్దేవికి నివేదించెను. మాచల్దేవి స్వయముగా లేచి వారి నెదుర్కొన బోయెను. ఆవచ్చినది జాయపనాయకుడును బద్దెనయు. వారి నదియెంతయేని గౌరవాదరములతో నెదుర్కొని నమస్కరించి తోడితెచ్చెను. వారి నిరువుర మండపముపై నుచితస్థానముల నుపవిష్టుల కావించి శ్రీగంధమిప్పించి తాంబూలకరండములు స్వయముగా నది వారిముందుంచెను.

జాయప కుశలప్రశ్నాదిక మైనపిమ్మట గోష్ఠీవిశేషములు ప్రశ్నింప, వారానాడు కౌముదీజాగరోత్సవము చేయుచున్నా మని యంతవరకు జరిగినది తెలిపిరి. జాయప సంతోషము వ్యక్తపరచి యిట్లనెను:

"నేను మరొక వినోద మిప్పుడే యూహించితిని. మీలో ఇక్కడ నృత్యము తెలిసినవా రెందరు?"

జాయప యా ప్రశ్న వేయుగా నచ్చట నెవ్వరును తమకు వచ్చు ననలేకపోయిరి. మాచల్దేవికే సాహసములేక యిట నెను.

"ప్రభూ, మీఎదుట నాట్యము వచ్చునని ఎవరు చెప్ప సాహసింతురు ?"

జాయప : నే నేమీ పులిని గాను. వినోదమునకు వచ్చినాను. నీకు నాట్యము వచ్చునులే. మిగినలివారి కేమాత్రము వచ్చినను చూచి సంతోషింతును—"

ఆమాటలతో నచ్చటివారికి ధైర్యము కలిగెను. మాచల్దేవి చెలికత్తెలే కాక, యా గోష్ఠిలో పలువురు పురుషులుకూడ మాకు వచ్చునని ముందుకు వచ్చిరి. బద్దెనయు తనకు వచ్చు ననెను.

జాయప వారి నందర పురుషుడు స్త్రీ, మరల పురుషుడు తర్వాత స్త్రీ, ఇట్లు పర్యాయముగా నిలుచుండ నియమించెను. వారి యందరకాళ్ళకు గజ్జెలు శ్రుతికి తంబుర, మృదంగాదులు అరగడియలో సర్వసంపన్న మగు మాచల్దేవిసౌధమునుండి పరిచారికలు తెచ్చి సిద్ధముచేసిరి.

తంబుర ప్రణవనాదము సాగెను. జాయప పుష్పబాణవిలాసమునుండి యీ శ్లోక మందిచ్చెను.

"కాంతే యాస్యతి దూరదేశ మితి మే చింతా పరం జాయతే
లోకానందకరోపి చంద్రవదనే వైరాయతే చంద్రమాః
కిం చాయం వితనోతి కోకిలకలాలాపో విలాపోదయమ్
ప్రాణా నేవ హరంతి హంత నితరా మారామమందానిలాః."

"ఇది ముం దొకరు వచ్చి యభినయింపవలెను. ఇంకొకరీతిగా నదే తర్వాత వారు అభినయింపవలె. అట్లే పరిపరివిధముల నందరు!— ముందు బద్దన!"

బద్దెన మొం దభినయించెను. తర్వాత నదే యొక యువతి మార్పుతో నభినయించెను. పిమ్మట చిత్రకారు డొక డదే మరియొక విధమున నభినయించెను. ప్రౌఢ యంతట నింకొకతీరున నభినయించెను. గాయకు డంతట నందుకొనెను. లతాతన్వి యొకతె యాపిమ్మటను, పూర్వోక్తయువకని యంతటను, వరుసగా నెందరో పరిపరివిధముల నభినయించిరి. అందరిలో తుదకు మాచల్దేవి పరిపూర్ణమోహకముగా నభినయించి, మరల శ్లోకములో నొక పద మందుకొని యభినయించెను. తర్వాత వారందరు నొక్కొక్కశ్లోకభాగమే యభినయించిరి. తుదకు మాచల్దేవి నృత్యములో నందరుకలసి పూర్తి కావించిరి. అంతేయు పూర్తి యగునప్పటికి అందరు భరతతన్మయు లైరి.

జాయప : "ఇది నృత్తప్రతిమాల!"

మాచల్దేవి : "నృత్తరత్నావళికర్తలకే, ఇట్టి ప్రత్యగ్రప్రతిమాలలు భాసించు టొప్పును!

అది పూర్తియగుటకు ముందే యాప్రదేశమున కొక యజ్ఞాత పురుషుడు వచ్చి కూరుచుండెను. ఆ వచ్చిన వా డాక్రీడ నెంతో వ్యగ్రుడై తిలకించుచుండెను. అతని నచ్చట చూచినప్పటినుండియు జాయప కేమో మొళ్ళమీద కూరుచున్న ట్లుండెను. ఇత డెవరు? ఏ దేశస్థుడు? ముందు తెలుపకుండ లోనికి వచ్చు స్వాతంత్ర్య మెట్లు వచ్చినది? వచ్చినవాని నెట్టి యభ్యంతరము లేకుండ నెట్లుండ నిచ్చిరి? ఇక్కడికి

తరుచుగా వచ్చుచున్నవాడా? ప్రథమపర్యాయము నేడే వచ్చెనా? ఎంతకాలము నుండి వచ్చుచున్నాడు? ఈ యాలోచనాపరంపరలో చిక్కి జాయప క్రీడావిలోకన మున మధ్య మధ్య పరాకుపడసాగెను.

మాచల్దేవి యది గ్రహించెను. కాని యాతని యాందోళన మెంతమాత్రము నుపశమింపజేయ యత్నింపలేదు. తా నది గ్రహించినట్లుగూడ జాయపకు తెలియ కుండ ప్రవర్తించెను. నృత్యానంతరమున బద్దెన సిగ్గుపడుచు దిక్కులు తిలకించు చుండెను. అతని కక్కడి కామినుల మనోజ్ఞాకారములు ఆ వెన్నెలకాంతితో కలసి గంధర్వలోకములో నున్న విభ్రాంతి కలిగించెను. వారి నర్మవాక్కులు చెవుల బడి నప్పుడెల్ల ఆ యువకుని చిత్తము భ్రమింపసాగెను. ఉద్రేక మెక్కువైనకొలది యాతని సిగ్గును అతిశయించుచుండెను.

అతని సర్వచేష్టలను నూతనపురుషుని నాకర్షించెను. అతడు మాటిమాటికి బద్దెనవైపు చూడసాగెను. బద్దెనమాత్ర మాతని గమనించినట్లే లేదు.

ఆ నూతనపురుషుడును సర్వవిధముల జిత్రమైనవాడే! అతడు ధరించిన వస్త్రము లీవైపువివలె నున్నను, కట్టిన తొడిగిన విధానములు వేరు. అతని నవ్వు వేరు. అతని మాట వేరు. అతని తీరే వేరు! అతనికి స్త్రీపురుషభేద మున్నట్లే కాన్పింపదు. నడివయసువాడు. కాటుకకన్నులు. పసినిమ్మపండువంటి దేహచ్ఛాయ. కొనదేరిన యున్నతనాసము. విశాలమై మనోజ్ఞ మగు ఫాలము. అతడు మాచల్దేవివంక చూచినను దాని చెలికత్తెలవంక చూచినను, లౌల్యము కాని కొంకుకాని ద్యోతము కాదు. చిరపరిచితు డగు నాప్తమిత్రము వలెనే అతడు సంచరించుచుండెను.

చంద్రాస్తమయ మయ్యెను. ఆ వేళకు సరిగా నచ్చుటకి మేచయ నాయకుడు వచ్చెను. మాచల్దేవి యాదరముతో నెదురేగి గౌరవముతో నాతని తోడ్తెచ్చి కూర్చుండజేసెను. మరల నిష్టకథాగోష్ఠి సాగుచుండెను.

అంతలో కొంతవడికి పర్వతనాయకు డరుదెంచెను. ఆతని నూతనోద్యోగమున కందరు నాతని నభినందించిరి.

"మహారాజ్ఞి యంగరక్షకులకు ఇప్పటికి తీరిక యైనది కాబోలు!" మాచల్దేవి ప్రశ్నించెను.

అందరును పర్వతనాయకునివంక వీక్షింపసాగిరి. పర్వతనాయకుడు తన్ను కానట్లే మహారాజ్ఞి యంగరక్షకు డిక్కడ ఎవరా యని చూచుచున్నట్లు ఆ నూతన పురుషునివంక జూడసాగెను.

మరల మాచల్దేవికంఠము వినిపించెను.

"మహారాణుల యంగరక్షకులు పలుకకున్నా రేమి?"

అందరును పర్వతనాయకునివంక జూచిరి. అతడు తన్నుగాక యా నూతన పురుషుని నడిగినట్లే యాతనివంక చూచెను.

నూతనపురుషుడు పర్వతనాయకుడు మతిలేనివా డని భావించినట్లు నిరసనము మిశ్రమైన యొక నవ్వు నవ్వెను.

జాయపనాయకుడు సూక్ష్మముగా మాచల్దేవితో నిట్లనెను.

"మాచల్దేవీ, నీకు మతిభ్రమణ మెన్నాళ్ళనుండి కలిగినది?"

ఆ మాటలు మాచల్దేవి నుద్దేశించి యన్నట్లున్నను నిజముగా పర్వతనాయకుని వంక నిరసనదృష్టితో చూచుచు నవ్విన యా నూతనపురుషుని నుద్దేశించిన వని తజ్ఞులకు ధ్రువపడెను.

నూతనపురుషుడు: "స్త్రీలకు మతిభ్రమణము సహజముగదా!"

మాచల్దేవి తలయెత్తకుండ మాటాడెను.

"స్వామీ, భ్రమించుటకు నాకు ముందు మతి యున్న దందురా, మీ రుభయులును?"

చేరినవా రందరు పక్కున నవ్విరి. మరల మాచల్దేవి యందుకొనెను.

"మతిభ్రమణ మొందన నాకు జాయపనాయకులు సరిగా గుర్తు చేసిరి. శ్రీరుద్రదేవమహారాజుల యంగరక్షకుల కిప్పటికి తీరిక యైనదా?

పర్వతనాయకుడు చిరునవ్వుతో 'అవును!' అనెను.

ఈమారు సభ్యులందరు నూతనపురుషునివంక జూచి నవ్వసాగిరి. శ్రీరుద్రదేవ మహారాజులను మహారాజ్ఞి యన నొప్పునా?

కౌముదీజాగరణము సాగుచున్నది. వృద్ధుడగు జాయపనాయకునకు కొంచెము కునికిపాట్లు ప్రారంభించెను. పలుమారు లతడెట్లో దేహము సరిచేసికొని లేచుచుండెను. తుద కాతడు బద్దెనతో కలసి బయలుదేరిపోయెను. బద్దెనయు నాచోట నున్న తరుణుల సాహచర్యము వదలలేక వదలలేక, కలవరించుచున్నవానివలె జాయప వెంట విధిలేక సాగిపోయెను.

గోష్ఠిలోనివారు ఒకరిపై నొకరు సందేహముతో ప్రవర్తించుట మర్యాదకు భంగము. సరసుడగు నాగరకు డది చేయడు. ఆ నూతన పురుషునికిని పర్వతనాయకునికిని ఒకరిపై నొకరికి ద్వేషమో అనుమానమో మరియేదియో విరుద్ధభావము మనస్సులలో నంకురించెను. కాని గోష్ఠీమర్యాదకు భంగముకాకుండ ప్రయత్నపూర్వకముగా నా భావము ప్రత్యక్ష మొనరింపకుండిరి.

కొంతవడికి ప్రసంగములపై నందరకు విసువు జనించెను. తెల్లవారుట కింకను ఎనిమిదిగడియల ప్రొద్దున్నట్లు రాచనగరి మోసాలపై గడియారమునుండి గంటలు వినవచ్చెను. అప్పుడు ద్యూతమునకై పలక అక్షములు తెప్పించిరి. ఆపై సుహృద్ద్యూతము సాగెను. ఇందు ముఖ్యముగా పర్వతనాయకునకు నూతనపురుషునకు స్పర్ధ యతిశయించెను.

ఇం దెంత స్పర్ధ ప్రదర్శించుచున్నను నూతనపురుషుని మనస్సులో తొణకిక పందెము లొడ్డుచుండెను. అతడు పెద్దపందెము లొడ్డడు. పర్వతనాయకుడు పెద్ద పందెములు వేయును. ఆతని పందెము లెంత పెద్దవైనను నూతనపురుషుడు జంకడు. కాని స్వయముగా నాతడు పెద్దపందె మొడ్డడు.

జూదములో గెలుపోటములు సామాన్యముగా అదృష్టదురదృష్టములపై నాధారపడియుండునను ప్రథ కలదు. అది పూర్తిగా అపప్రథ కాకుకాని యందులో గూడ స్థిరబుద్ధి కలవారికి గెలుచుట కెక్కువ యవకాశ మున్నది. తొందరపడువారు ఒకానొకప్పుడు విపరీతముగా గెలిచినను సామాన్యముగా నోడిపోవుదురు. తొందర పాటుచే పర్వతనాయకునికి ద్యూతక్రీడలో ఓటమియే మరలమరల సంభవించెను. ఆతనివద్ద నున్న ధనమును అమూల్యాభరణములును ఆనాడతడోడిపోయెను. అవి ఒక్కొక్కటే నూతనపురుషుని హస్తగత మగుచున్న కొలదియు, నాతనికి గెలువవలె నను వాంఛ తీవ్రము కాజొచ్చెను. దానితోపాటు తొందర హెచ్చెను. అంతట మరల నోడిపోసాగెను. రిక్తహస్తుడై పర్వతనాయకుడు మాచల్దేవి నడిగి అప్పుచేసి, అదియు నొడ్డి యోడిపోయెను. మరల నాతడు మాచల్దేవి నప్పడిగెను.

మాచల్దేవి యాతని గాదనకుండ వారించి, తానే యా నూతనపురుషునితో సుహృద్ద్యూతమునకు గడంగెను. చిత్రముగా నాక్రీడలో మాటిమాటికి నూతనపురుషుడే విజితుడు కాసాగెను. మాచల్దేవి పర్వతనాయకు డోడిపోయిన సమస్తద్రవ్యమును ఆభరణములే కాక, ఆ నూతనాగతుని ద్రవ్యముకూడ విశేష మొందుచుకొనెను.

ఆసమయమున మరల పర్వతనాయకుడు మాచల్దేవిని తనకు ద్యూతమునకు కొంత యప్పిమ్మని యడిగెను. అది విని నూతనాగతుడు ఎకసక్కెముగా, "నీ నూతనోద్యోగము పణముగా పెట్టి నాతో నాడుము!" అనెను.

ఆమాటలు వినినంతనే పర్వతనాయకుడు కోపోద్దీపితుడై నిలువున లేచెను. కుబుసము కప్పిన కాలసర్పమువలె నాతని యొరలో నున్న ఖడ్గము నాతడు చివ్వున పెరికి, యా నూతనపురుషుని దానితో ప్రక్కను చరిచెను. అది యాతని ఖడ్గయుద్ధమునకు ఆహ్వానించుట! ఆపురుషుడును వెనుకాడక, నిలువున నిలుచుండి 'ఇదిగో శాస్తి చేసెదను, అనుచు తన యొరలోనుండి ఖడ్గము తీసెను.

మాచల్దేవియు నందు జేరిన నాగరికులును తీవ్రముగా అలజడి నొందిరి. ఉభయులను వారించుటకు వారెంతయు యత్నించిరి. కాని ఇద్దరును వినలేదు. నూతనపురుషుడు క్షమాపణము చెప్పికొనడు. పర్వతనాయకుడు ఆతని అవినయము క్షమింపడు. వారి యుత్తరములతో నొకరిపై నొకరికి రోషము పెరుగసాగెను. మేచయనాయకు డందులో నెట్టి జోక్యమును కలిగించుకొనలేదు.

చంద్రాస్తమయమై చాలసే పయినది. చీకటి ఏకశిలానగరవీథుల నెల్లెడ బర్వియుండెను. కాని దివిటీల వెలుగులో మాచల్దేవి వనమంతయు దేదీప్యమానముగా వెలుగుచుండెను. అందులో విశాలమై వర్తుల మగు నొక పచ్చికబయలు వారిరువురు చేరిరి. గోష్ఠిలోని సభ్యులుగూడ వారి ననుగమించిరి.

ఆ ప్రదేశము కౌముదీనృత్యమునకు అనువుగా నిర్మించిన విశాలప్రదేశము. చుట్టును ప్రేక్షకులకు చంద్రశిలానిర్మితము లగు శిలావేదిక లున్నవి. ఆ నాట్యరంగమున నీనాడు ఖడ్గనాట్యము సాగినది.

ఇదియును క్రీడాయుద్ధము కాదు. ఒకరి నొకరు జయింపవలె నను నిచ్చయేకాక, ఒకరినొక రంత మొందింపవలె నను నిచ్చలతో వారిరువురు ఆ రంగములో ప్రవేశించిరి. ముందుగా వా రుభయులును తమ స్వేచ్ఛచే ఆత్మగౌరవసంరక్షణార్థము ద్వంద్వ యుద్ధము చేయబోవుచున్నా మనియు, నందులో నోడినవారి పక్షమున గెలిచిన వారిపై నెట్టి చర్యయు తీసికొన నవసరము లేదనియు, పత్రములు వ్రాయించి మేచయ యొద్ద నుంచిరి. మేచయయే వారిరువురమధ్య మధ్యవర్తిత్వము నెరపెను. ఇద్దరి ఖడ్గములు విషదిగ్ధములు కానట్లు మధ్యవర్తి స్థిరపరచు నవకాశ మప్పుడు లేకున్నందున, నాత డిరువురఖడ్గములు ముందు దూరముగా పెట్టించెను. మాచల్దేవియింట పెద్ద యాయుధ శాల కలదు. అందుండి మేచయ యనేకఖడ్గములను పలకలను తెప్పించి, ఎవరికి కావల సినవానిని వారి నేరుకొండనెను. వారిరువురు ఎవరి కనుకూల మగు ఖడ్గము పలక వారు గ్రహించి రంగములో ప్రవేశించిరి. రంగము చుట్టును కరదీపికలు విశేషముగా పట్టించి రంగమున నెట్టి ఛాయలును పడకుండ కల్పింపబడెను.

పర్వతనాయకుడు జూదములో ప్రదర్శించిన తొందరపా టంతమాత్రమును ఖడ్గయుద్ధములో ప్రదర్శింపలేదు. అందుకు తోడై యాతని యున్నతకాయమును ఆజాను దీర్ఘబాహువులును బహువిధముల నాతని కుపకరింపసాగెను.

నూతనపురుషుడుకూడ ఖడ్గయుద్ధములో నేర్పరియే. అతని కన్నిరోా విద్యలతో పాటు ఇదికూడ నభ్యస్తమైనది. ద్యూతములో నున్న జాగరూకత ఖడ్గయుద్ధములో నేమాత్రము నతనియొద్ద గోచరింపలేదు. నేర్పుకంటెను నిలుకడకంటెను, అందు రోషమే మిక్కుట మయ్యెను. అదియుగాక ఆతనికి కొంచెము వయస్సు ముదిరినట్లున్నది. యుద్ధములో శరీరపాటవముకూడ తక్కువగా కనబడుచుండెను. పావుగడియకే అతడు రొప్పసాగెను.

ఖడ్గయుద్ధవిశారదు డగు పర్వతనాయకుని కాతనితో యుద్ధము క్రీడాప్రాయ ముగా నుండెను. యుద్ధవిద్యలో, నింతటి నీచుని తన ఖడ్గముతో తెగనేయుట తనకే యవమానకర మను భావ మతని కుదయించెను. అందుచే నతని నంత మొందించు యత్నము మాని, యరగడియకూడ జరుగకపూర్వమే పర్వతనాయకు డా నూతనపురుషుని హస్తము నందలి ఖడ్గము దూరమున బడిపోవున ట్లెగురవేసి, యొక్క దాటున పైకి లంఘించి, యాతని క్రింద పడవైచి రొమ్ముపై కాలుంచి, కోసివేయుటకు అతని శిరోజములు పట్టుకొనెను. చిత్రముగా నా నూతనపురుషుని శిరోజబంధమునకు పర్వతనాయకుని ఖడ్గస్పర్శ కాకముందే, ఆశిరోజము లొకకట్టగా నాయకుని ఎడమచేతిలోని కూడివచ్చెను. దానితో సర్వముండిత మగు నూతనపురుషుని శిరస్సు చూపరి కాశ్చర్యమును అసహ్య మును కొలిపెను.

పర్వతనాయకుడు అట్లు తన చేతిలోనికి వచ్చిన యాతని నిర్జీవకృత్రిమశిరోజ బంధమును వికృతాట్టహాసముతో దూరముగా వైచి, పండ్లు కొరుకుచు లేచి యవి తన కాలితో మట్టగించెను. అంతలో నూతనపురుషుడు చివ్వున లేచి దూరమున బడిన తన ఖడ్గమునకై రివ్వున పరుగిడెను.

వెంటనే మేచయ యిరువుర నాగు డని యాజ్ఞాపించెను. మాచల్దేవి యెంతయేని మెలకువ చూపె, యప్పటి కానూతనపురుషుని చేతి కందిన ఖడ్గము ఒడిసిపట్టుకొని తీసికొనెను. ఆ పట్టులో బల మున్నది. లాలిత్య మున్నది. మూర్ఛించినను నూతన పురుషు డది లాగికొనజాలడు. చూచువారి కామె యది యాతనియొద్దనుండి మర్యాదగా తీసికొన్న ట్లున్నదికాని బలవంతముగా పుచ్చుకొన్నట్లు లేదు. మాచల్దేవికి వాక్చాతురి నృత్యచాతురితోపాటు ఆయుధచాతురికూడ కలదా!

మేచయనాయకుడు ప్రశ్నించెను.

"మాచల్దేవీ, మా కీతనితో ముందుగా పరిచయము చేయలే దేమి?"

మాచల్దేవి బదులు చెప్పెను. "ఇతడు ఒకానొక మహానుభావుడు. మహాయోగి. భగవత్సాక్షాత్కారమే పొందె నందురు."

## ౧౭

విజయదశమినాడు రుద్రమదేవి ఎప్పుడో తెల్లవారుజామున నిదుర లేచినది. తదాదిగా భద్రగజోత్సవము పూర్తియగువరకు నామె కొక్క క్షణ మైనను తీరిక లేదు. అనుక్షణమును దేహమునే కాక మనస్సునుగూడ ఆత్మవశమున నుంచుకొనవలసి యుండెను. ఒక్క కదలికలోనేని పొరపాటు రాగూడదు. ఒక్కమాటలో ప్రమాదము పనికిరాదు. మహారాజు పరాకుపడిన ప్రజలకు విపరీత నష్టము సంభవింపవచ్చును. స్వయముగా నా మహారాజునకు ప్రజల్లలో గౌరవము తగ్గిపోవును. మహారాజు సజీవమగు నుత్సవవిగ్రహ మాయెను!

సామ్రాజ్యమంత్రములు భూదేవులు చెప్పుచుండ, గణపతిదేవులును గురుదేవులును మహామంత్రిదేవులును త న్నానాడు అభిషేకించిరి. అభిషేకప్రారంభమున మహానందతన్మయత యామెకు కలిగినది. కొంతసే పట్లే అభిషేకము చేయగా మొదటి యుత్సాహ మామెకు మందగించినది. తుదకు నది తాను నిత్యము సేయు స్నానముగానే తోచినది. దేహమునకు ఉదకస్పర్శయే!

ఆ సాయంకాలవేళ మహాసామంతదండనాథులు పేరోలగమున తనకు విధేయత ప్రకటించుచు ప్రతిజ్ఞలు చేయుచుండ, ముం దామెకు వీరోత్సాహము రేకెత్తినది. కాని తరువాత తరువాత ఒకేవిధముగా పలువురు ప్రమాణములు చేయుచుండ, నవి యంగీకరించుటకూడ విసుగైనది. మధ్యలో వీరభద్రేశ్వరులను బంధించుటకు పంపిన యాజ్ఞ రాకున్నచో, కునుకుపాటుకూడ వచ్చి యుండును. ఆ యాజ్ఞ తనకు నూతనముగా ప్రాప్తించిన రాజత్వము ఎంత కర్కశ మైనదో స్పష్టముగా ద్యోతమొనర్చినది. ఒక్కసారిగా ఆమెసర్వాంగములు సుద్బద్ధ మైనవి.

ఆ పిమ్మట పారువేట కొంత వినోదము కలిగించినది. ఆ రాత్రి తన్ను భద్రగజముపై మంత్రిసామంతాదులు పరివేష్టించి యూరేగించిరి. భద్రగజాధి

రోహణము చేయుచుండ తనకు హృదయములో నావేగము కలిగినది. క్రొత్తగౌరవము లభించువారి కెవరికి అట్టి యావేగము కలుగదు? చేరిన పెద్దలందరు 'జయ జయ రుద్రదేవ మహారాజ!' యని జయజయ నినాదములు చేయగా, తన హృదయములో నుండి పాదములకును పాదములనుండి శిరస్సునకును, అనంతకోటి జయజయ నినాదములు ప్రతిధ్వనించుచు, పైకిని క్రిందికిని సంచారములు చేయుచున్నట్లు తోచినవి. మరల జయనినాదములు వినవచ్చినవి. అవి విన్నప్పుడు మొదటి యానందము లేదు. మరల వినవచ్చినవి. మరల వినవచ్చినవి. మరల—మరల—ఇట్లనేక పర్యాయములు వినవచ్చినకొలదియు, ఆమాటల కర్థమే లేనట్లు భాసించినది. అవి కేవల మేవో ధ్వనిమాత్రములుగా భాసించినవి. తుదకీయుత్సవ మెప్పుడయిపోవునను తొందర యావహించినది. ఎట్లో ఉత్సవము పూర్తియైనది. మంత్రిసామంతాదులను సెల విచ్చి పంపివేసినది. అంతటితో నైన నామెకు స్వాతంత్ర్యము చిక్కలేదు.

ఇప్పుడు తాను మూర్ధాభిషిక్తరాజన్యమూర్తి. అంతఃపురములో భోజన నివాసములే కాక శయనీయముకూడ నియమబద్ధముగా గాని స్వీకరింపరాదు. అక్కడ రక్షణకు సర్వసంపన్న మొనర్చి గాని అంగరక్షకుడు సెలవు తీసికొనలేదు.

ఇన్నిటితో రుద్రమ యారాత్రి మిక్కిలి ప్రొద్దుపోయికాని నిదురింప వీలులేక పోయెను. రాజధర్మము ప్రకారము మహారాజు అభ్యంతరమందిరమున నేకాంతముగా నిదురింపవలెను. కడు విశ్వాసపాత్రు లగు రక్షకులే యపు డుండవలెను. వారును దూరమున నుండవలెను. అట్లు నిదురించుటయు స్వల్పకాలమే కర్తవ్యము. అదియును ఆదమరచి నిదురింపరాదు.

రుద్రదేవమహారాజును నిదురబుచ్చ పవళింపుపాటలు పాడిన వైణికులు పర్వతనాయకునివెంటనే సెలవు పుచ్చుకొని వెడలిపోయిరి. దూరమున రుయ్యమయు కామసానియు తమ మందిరములలో నిదురింపబోయిరి.

రుద్రమ శయ్యపై మేను వాల్చగనే నిదురపట్టలేదు. ఒక్కమారు గవాక్షము నుండి కనిపించు స్వయంభూదేవుల దేవాలయశిఖరములవంకను నాలుగుగోపురముల వంకను చూచి భగవద్ధ్యానము చేసినది. స్వయంభూలింగేశ్వరాలయమునకు ఆవల ఉన్నతమైన ఏకశిల కానవచ్చినది. ఆ శిలపై చిన్నజ్యోతి ఉన్నది. జ్యోతికి క్రిందుగా నా శిల బ్రహ్మరక్షస్సువలె భయంకరముగా తోచినది. అంతలో నామెకు నిద్రపట్టినది.

రుద్రమ కొంతవడి అట్లు సుఖనిద్ర వోయెను. ఆమెకు ఒంటబట్టిపోయిన కామందకనీతివాక్యములు చిత్రముగా సుషుప్తిలోగూడ నామె కొక మెలకువ కూర్చెనో! కాక స్వప్నావస్థ సంభవించెనో! ఏమోకాని యామె కిట్లు భాసించెను:

తాను విజన మగు నొక మహారణ్యమార్గమున బోవుచున్నది. అది మిక్కిలి సన్నని దారి. కంటకలతాగుల్మములు పైని కప్పుకొని పడుచుండగా, నెమ్మదిగా అది తప్పించుకొని తాను ముందుకు సాగిపోవుచున్నది. అంతలో నా వనమధ్యమున నిష్కుంజలతాతరు వగు విశాల ప్రదేశ మొండు చేరికొని యామె నిట్టూర్చుచు పరాకుగా నున్నది. ఆకస్మికముగా నలుగెలకులనుండి భైరవగర్జనములు వినవచ్చినవి.

తా నెన్నిమారులు వేట పోయినది? ఎన్ని రకముల కుక్కల దా నెరుగును? పొడుగుమూతివి గుండ్రని ముఖము కలవి పొడుగుకాళ్ళవి ఉన్నత మైనవి పొట్టివి పిక్కబలము కలవి సూక్ష్మముగా పసిపట్టగలవి పడిచేయునవి విలాసార్థమే ఉపయుక్త మగునవి—ఎన్ని జాతులో ఆమె ఎరుగును. వేటకాండ్రు వాని నెన్నోవిధముల ప్రయోగించి యాఖేటమున దనకు సాయ మొనర్చువారు. వేట కవి యవసరములు, అలంకారములు. మరి యవియే వేటాడబడు వన్యముల కతిభయంకరములు.

నే డీ కుక్కలు పూర్వ మట్లు కావు. నలుమూలలనుండి ఇవి తనపైకే కవియుచున్నవి. ఇప్పుడు తానే వేటాడబడు జంతు వైనట్లున్నది. సేనాధిపు నెదిరించు సైన్యములవలెనే యవి నీది తప్పినవి. అంతేకాదు. శునకలక్షణము లామెకు కరతలామలకములు. అదియు నామె యాచార్యులయొద్ద నృపవిద్యలతోపాటు క్షుణ్ణముగా నభ్యసించినది. ఇవియో? తా నెన్నడు కనిగాని వినిగాని యున్నవికావు. శాస్త్రములలో చదివినట్టివిగూడ కావు. ఇవి యసలు శ్వానములేనా?

శ్వానములే కాని యివి యీ లోకములో నెవ్వరు నెక్కడ నెన్నడు నెరిగినవి కావు! ఆ స్వర్గలోకమునుండి దిగివచ్చినవా? పాతాళగహ్వరములనుండి పైకెక్కియే వచ్చినవా, ఇవి మరి? పెద్ద పెద్ద దేహములు! ఆ దేహములను నిడుపులగు రోమములతో దట్టముగా నిండియున్నవి. అవి సమీపించుచున్నంతనే ఒకానొక ఏవగింపు పుట్టి ఒడలు జలదరించుచున్నది. దానితోపాటు ఒక చిత్రమగు భయమును కలిగించుచున్నవి. వీని ఝాంకారమే వేరు! కుక్క లిట్లెక్కడనేని మొరుగునా! ఇవి కుక్కలు కావు, పిశాచములై యుండును. కాక కాలభైరవుడే యీ యాకారములు దాల్చి వచ్చియుండునా?

"తీక్ష్ణదంష్ట్ర మహాకాయ కల్పాంతదహనోపమ
భైరవాయ నమ స్తుభ్యం—"

ఎట్టి యపాయములందైన భయపడకుండుట రుద్రమ చిన్ననాటనుండి యలవరచుకొన్నది. అన్ని భయములకు మూలకారణము ప్రాణభీతి! మృత్యుభయము లేనివారి కేభయము నుండదు. పవిత్రకార్యములు ఉన్నతకార్యములు సత్కీర్తికర కార్యములు చేయుట కుద్యమించుట యామె నేర్చుకొన్నది. అనృత మన్న హైన్యమన్న జుగుప్స నేర్చుకొన్నది. ఈ శరీరము ఉదాత్తకార్యకరణమున కంకిత మొనర్చుట యామె యలవరచుకొన్నది. రాజోత్తములు తమ సర్వస్వము ప్రజాక్షేమమునకు అర్పిత మొనర్పవలె ననువిధి యామె యాచరణలో నున్నది. ఇక నామెకు భయ మేల యుండును?

నిర్భయముగా నామె యా చుట్టిన శునకముల నదలించెను. ఐనను అవి వెనుకాడక పైపైని కవియుచున్నవి. కొన్ని యామెకాళ్ళు పీకుటకును మరికొన్ని పార్శ్వములను, ఇకకొన్ని బాహువులను, ఒకటి శిరస్సునే పట్టుకొనుటకును ఉంకించుచుండెను. రుద్రమ కత్తి దూసెను. దానితో నొకదాని తల నరకెను. ఇంకొకదాని ముందుకాళ్ళు తెగనేసెను. మరియొకదాని ప్రక్కలు గంటుచేసెను. వేరొకదాని

కంఠమున మాసికొనిపోవునట్లు పొడిచివేసెను. కొండొకదాని తలనుండి తోకవరకు చీల్చివైచెను.

కాని చిత్రము! తల తెగినదానికి మరల తల యదుకుకొన్నది. ముందుకాళ్ళు పోయినదానికి ముందుకాళ్ళదుకుకొన్నవి. బరులు చీలినదానికి బరులు యథాప్రకార మున్నవి. కంఠములో పోటువడినది స్వస్థమై యున్నది. నిలువున జీలినది నిలువున నిలిచియే యున్నది.

శ్రీరామచంద్రమూర్తి ఎన్నిమారులు తెగవేసినను రావణుని తల లిట్లే మొలచెనా? భీమసేను డెన్నిసారులు చీల్చిపారవేసినను జరాసంధుని దేహపుచిప్ప లిట్లే యదుకుకొనెనా? ఇవి నిజముగా పాంచభౌతికశరీరము లున్న సారమేయములేనా? కాక కేవల మంధకారమే యీ రూపముల నవతరించెనా?

రుద్రమ మరల వానిని చీల్చివేసెను. మరల నవి కలసికొనెను. మరల నవి యాటోపముతో నామెపై కవియసాగెను. అవి యామెదేహమును కోరలతో చీల్చియే వేసెను. కాని యంత తీక్ష్ణము లగుకోరలతో నవి తన శరీరమును జీల్చుచున్నను తనకు బాధ లేదేమి? తన కాయమునుండి కండలును నెత్తురును వాని నోటి కందుచునే యుండెను. అవి తాకినప్పుడెల్ల తనకు జుగుప్స కలుగుచున్నది. ఎంత జుగుప్స! ధర్మాత్మునకు అనృతముపై కలుగునంత జుగుప్సయే, అప్పు డామె కావహించుచున్నది!

ఇది కలయా? నిజమా? ఇంత ప్రత్యక్షముగా చూచుచున్నది, చెవులకు వినబడుచున్నది, కల యెట్లగును? కలలో నిట్టి యాలోచన లెన్నడైన గలుగునా? ఆమె ఏకాకిని. ఎంత ధీరయైనను, భయమువంటి యొకానొక వృత్తి యామె చిత్తాంచలముల నడుగిడసాగెను. ఆ కుక్కలను నరికినరికి నామెబాహువు లలసట నొందుచుండెను.

అంతలో నా వనాంచలమునం దొక పురుషమూర్తి గోచరించెను. ఒక్కక్షణకాల మామె యావైపు పేరాసతో చూచెను. మరుక్షణమున జూడగా ఆ పురుషుడే తనపై నా భైరవముల నుసికొలుపుచున్నట్లు ఆమెకు స్పష్టమయ్యెను. ప్రకృతిసిద్ధ మగు వీరావేశముతో నా సారమేయముల సరకుగొనక రుద్రమ ఖడ్గము త్రిప్పుచు నా పురుషునిపై కురికెను.

సమీపింపగా, నేమి యాశ్చర్యము, అది వీరభద్రేశ్వరుని మూర్తి. తన భర్త యాకారమే! ఆమె విజృంభణ మాకస్మికముగా నాగిపోయినది. అప్రయత్నముగా నామెకంఠమువెంట గంభీరమైన స్వరము వెలువడెను:

"మేచయనాయకా! ఇతని నింకను బంధింపలే దేమి?"

కాని కా వీరభద్రేశ్వరుడు వికటాట్టహాసముతో పెద్దపెట్టున నవ్వెను. అది నవ్వా? సకిలింపా?

రుద్రమ మాటలును వీరభద్రేశ్వరుని సకిలింపును అంతఃపుర మెల్లెడ ప్రతిధ్వనించెను!

* * *

ఇంతవరకును రుద్రమ తాను కన్నులతో చూచుచుంటి ననియు చెవులతో వినుచుంటి ననియునే భావించుచుండెను. కాని యిప్పుడు చూచుచున్న విధానమును వినుచున్న విధమును వేరు. ఇప్పుడు అంతఃపురమునం దంతట ప్రవృత్తమైన సందడియే వేరువిధముగా వినబడుచున్నది. ఇప్పుడు చూడగా తా నరణ్యములో లేదు. ఆ యరణ్యమధ్యమందలి విశాలప్రదేశము లేదు. తన శయనమందిరములో హంసతూలి కాతల్పమున శయనించి యున్నది. పర్యంకసాలభంజికలు యథాపూర్వముగనే దర్శన మిచ్చుచున్నవి. తన దేహమునుండి యా కుక్కలు కొరికి వేరుచేసిన మాంసభాగము లన్నియు సరిగనే యున్నవి. కుక్కలును లేవు! కాని యామెదృష్టి కెదురుగా వీరభద్రేశ్వరుడుమాత్రము సుఖాసనమున గూర్చుండి యున్నాడు!

అంతలో కామసానియు దయ్యాసయు ఖడ్గములు చేబూని అడావిడిగా నేతెంచిరి. ఉపచారములు చేయు కుబ్జ వారివెంట వారిని కలిసికొనవలె నను నావేగముతో ఒక ప్రక్క కొరగి రెండవ కాలు త్వరత్వరగా ఎగురవేయుచు వచ్చెను. అంతఃపురరక్షకు డగు క్లీబవిదల్లుడును శీఘ్రగమనమున వచ్చెను.

"ఎవరిని బంధింపవలె, తల్లీ?" యని యా విదల్లుడు ప్రశ్నించెను.

రుద్రమ : వీరభద్రేశ్వరునివైపు నిర్దేశించుచు చూచెను. రుద్రమ చూపుల నను సరించి యాతడు వీరభద్రేశ్వరుని నక్కడ జూచి యాతనికి నమస్కరించెను. వీరభద్రేశ్వరుడు బంధనార్హు డని యాత డెరుగడు.

కామసాని రోషావేశముతో వీరభద్రేశ్వరు నెన్నియో నిష్ఠురోక్తు లాడెను. వీరభద్రేశ్వరుడు ప్రత్యుత్తర మీయలేదు.

"దొంగవలె ఇక్కడికి వచ్చితి వేమి?— హంతకుడవా?— పిలువనిదే ఏల ఇట వచ్చితివి?— పలుకవు, చెవుడా?— నోరేమైనా పడిపోయినదా?— పిశాచమవా మనిషివా?—"

ఎన్ని యన్నను బదులు పలుకడు. మౌనము!

కామసాని ఖడ్గముతో నాతని పొడువ నుంకించి ఎడమచేతితో గొంతు పట్టు కొనెను. అతడు ఎదురుతిరుగ లేదు. వెనుదీయలేదు. కామసాని యాతని గొంతుపై చేయివేసినది. కాని గొంతు చేతికి పట్టుచిక్కదే! వీరభద్రేశ్వరుని గొంతులోనికే యామె వ్రేళ్ళును చేయియు పోయెను. కాని యామెచేతికి అది తాకిన స్పర్శ జ్ఞానమే లేదే!

"ఇది మనిషి కాదు, పిశాచము!" అని కామసాని కెవ్వున కేకవేయుచు వీరభద్రేశ్వరుని యుదరములో కత్తితో పొడిచెను. కత్తి లోపలికి పోయినది. కాని రక్తము చిమ్మలేదు. ఆ వీరభద్రేశ్వరుని శరీరము చెక్కుచెదర లేదు.

"చచ్చినవారు దయ్యము లగుట ఎరుగుదుము. నీవు బ్రదికియుండియే దయ్యమవైతివా!"— ఇట్లనుచు కుబ్జ తన చేతులతో వీరభద్రేశ్వరునిపై కిలియబడి నెట్టివేయ

యత్నించెను. కుబ్జ కది సాధ్యము కాలేదు.

ఇదియంతయు రుయ్యమ కొండకతడవు నిర్విణ్ణయై చూచుచుండెను. మరి యొకతడవు ధ్యానించెను. వీరభద్రేశ్వరు డిచ్చటికి వచ్చు మార్గము లేదు. ఇదియొక కల్పితమూర్తి. ఇంతమంది కిది యొక్కసారి భాసించుచుండుట చిత్రమే. ఇంద్రజాల విద్యే యుండు నందురుగదా!

మరుక్షణమున రుయ్యమకు ఒక ప్రతిక్రియ బుద్ధిలో భాసించెను.

"అమ్మా!"

రుద్రమ: "ఏమి తల్లీ?"

రుయ్యమ: "శ్రీవిశ్వేశ్వరశంభుదేశికులను ఒక్కసారి చిత్తములో దృఢముగా స్మరించుకోవే, అమ్మా!—వారు మొన్న నా కొక మహామంత్ర ముపదేశించి ఆపదలో రక్షార్థముమాత్రమే యుపయోగింపు మని యాదేశించినా రమ్మా!"

ఇట్లనుచు నామె రుద్రమ శయ్యాసమీపమున గల విభూతి చేనందుకొని యభిమంత్రించి రుద్రమదేవి దేహమున నలదెను. రుద్రమదేవి శ్రీ విశ్వేశ్వరశంభు దేశికుల పాదపద్మముల చిత్తములో ధ్యానించెను.

అంతట నట్లభిమంత్రిత మగు భూతిని ఒక్క చిటికెడు రుయ్యమ తీసికొని ఎదురుగా నాసనమున సంక్షోపవిష్టుడైన వీరభద్రేశ్వరమూర్తిపై చిలుకరించెను.

వెంటనే ఆ వీరభద్రేశ్వరమూర్తి యా గాలిలోనే కలసి పోయెను. ఆసనము వెనుక నున్న చీకటిలోనికే మాయమయిపోయెను.

## ౧౮

పూర్ణిమనాటికి ఏకశిలానగరమున కొంత సందడి తగ్గెను. జన్నిగదేవుడును త్రిపురాంతకుడును సోదరుడగు నంబదేవునికి తను మండలముల లెక్క లందజేయు భారము నప్పజెప్పి, మహాసైన్యములతో పల్లవపాండ్యచోళసేనల నెదుర్కొను వీరోత్సాహముతో కదలి చనిరి. పలువురు సామంతులు మండలేశ్వరులు రుద్రదేవ మహారాజుల సెలవుగైకొని తమతమ ముఖ్యస్థానముల కేగిరి. కొలని రుద్రుడు కొలనివీటి కేగెను. అన్నమంత్రియు నెడ వెడలిపోవ నుంకించెను గాని రాజధానీనగరము విడిచిపోవ నాతనికి రాజానుజ్ఞ రాలేదు.

ఆ మరునాడు శ్రీరుద్రదేవమహారాజు అంతరంగికమందిరమునకు తిక్కచమూపతిని అన్నమంత్రిని అంబదేవుని బిలిపించి యేకాంతమున వారితో మంత్రించుచుండెను. ఆ యేకాంతమందిరము బహుచిత్ర మైనది. అక్కడ కూరుచున్న నగర మంతయు గనబడుచుండును; కూరుచున్నవారును నగరమంతటనుండి కానరావచ్చును గాని గుర్తించుటరుదు.

ఏకశిలానగరమధ్యభాగమున స్వయంభూతేశ్వరస్వామి యాలయ మున్నది. ఆ దేవాలయము నాలుగు గోపురద్వారములును కోటనాలుగుద్వారముల కెదురుగా నున్నవి. ఈశ్వరుడు సర్వతోముఖు డైనను ఈశ్వరాయతనము దక్షిణముఖముగా నున్నది. ఆ మహాయతనము నావరణకు బాహ్యప్రదేశమున దక్షిణభాగమున ఈశ్వరుని మహాసరోవర మున్నది. సరోవరజలము లంటి స్వయంభూదేవాలయమునకు ఇన్నూరు విండ్ల దూరమున నాగ్నేయభాగమున నొక మహాశిల కలదు. కోటలో నీశాన్యభాగ మున మరియొక గండశిల కలదుకాని, యీ మహాశిలయే యందున్న ఏకైకశిలగా భాసిం చును. పూర్వ మీ నగరము చిన్న పల్లెగా నుండునప్పుడు బాటసారు లాసరస్సు చెంత గల తోటలో విడిసెడువారు. అప్పుడు అది ఎక్కడ నున్నదని క్రొత్తవా రడిగినప్పుడు సంస్కృతము వచ్చినవారికి, 'అదిగో ఏకశిల కనబడుచున్నదే యక్కడ!' అని నిర్దేశించువారు; ప్రాకృతులకు, 'అదుగో ఓరుగల్లు కనబడుచోటనే!' అని చూపెడి వారు. అదియే మహాపట్టణ మైనతర్వాత ఏకశిలానగర మైనది. కేవల మది నగరము నడిబొడ్డున లేకున్నను ఉన్నట్లే భాసించును.

ఆ మహైకశిలపైకి బోవుటకు తూర్పున గల చిన్న మార్గమున దప్ప మానవ సాధ్యము కాదు. మిగిలిన యన్నివైపుల నది చెక్కకుండగనే చెక్కివేసినట్లు నునుపుగా ప్రపాతమై ఒడుదుడుకుగా నుండును. అందుచే కోట కట్టునప్పుడే కాకతీయప్రభువులు దానిని ఉపలక్షించి క్రీడాశైలముగా చేసినారు. పైకి దారిగల ప్రాచీదిశను క్రిందిభాగమున క్రీడావనము వేయించి, యందు జక్కని లీలామందిర ములు నిర్మించి, చుట్టును ఉన్నతప్రాకారము నిర్మించిరి, ఆ దారికి వచ్చువరకు శిలపైగూడ రాతిగోడలు కట్టినారు.

కాకతీయుల క్రీడాశైల మగు నీ ఏకశిల యుపరిభాగమున గల మండపములే బహుళముగా వారి మహామంత్రశాలలు. అక్కడ నున్నవారికి కనబడకుండ నెవ్వరు వినగలుగు దూరమునకు వచ్చుట యసాధ్యము. అదినగరమధ్యమున నున్నను నగరోపరి గలదు. అందుచే నచ్చట బహుప్రశాంతిముగ నుండును. అచ్చట గూరుచున్నవారి దృష్టి యేకశిలానగరప్రాకారముకూడ దాటి వారికి దూరమున వాయవ్యముగా గోవిందరాజస్వామిగుట్ట కనిపించును. దానికి పడమరగా హనుమకొండ కొండలును, దాని సమీపముననే శాయంపేటకొండయు చూడనగును. ఇంకను దూరమున ఇనుప రాతిగట్టును, పూర్వము హిడింబాశ్రమ ముండెడి దని ఐతిహ్యము కల రెండు స్తంభముల యాకారము కల గుట్టయు నందుండి కానవచ్చును. అందున్నవారి మనస్సు లా కారణమున దూరములకును నభోవీథులకును బ్రసరింపగలిగియుండును.

"ఆంధ్రరాజ్యము సరిహద్దులందెల్లెడల శత్రుదండయాత్రలు చెలరేగినవి. ఇప్పటికి నాలుగైదు సంవత్సరములక్రిందటనే పరాభూతుడైన ఈ పల్లవకొప్పెరుంజింగనికి మరల పైకిరా ధైర్యము వచ్చినది. ఈమారు జటావర్మసుందరపాండ్యుడు కంచినుండి నెల్లూరువరకు గల భూభాగ మాక్రమించుట ప్రమాదకర మైనది. ఉత్తరమునుండి కళింగులు పిఠాపురమువరకు చొచ్చుకొని వచ్చి, దక్షిణమునుండి వచ్చుచున్న కొప్పె రుంజింగనితో కలసికొన నుంకించుచున్నారు. చోళసామంతు లందరు శత్రుసేనలతో

చేరుచున్నారు. గొంటూరువిభు డగు నాగదేవుడు శత్రువుల రాక యాధార మొనర్చుకొని, కాకతిరాజుల ధిక్కరించుటయే గాక మండలమునం దెల్లెడ నరాజకము చేయుచున్నాడు. ఇక యలజడి లేదన్నట్లు కనిపించునది పశ్చిమ భాగముననే. అందు దక్షిణభాగమున హొయిసలులును ఉత్తరభాగమున యాదవులును మనకు పరమశత్రువులు. అటునుండియే ఈ యంధ్రరాజ్యమునకు మహాప్రళయ మెన్నటికైన రావచ్చును. వారి కెక్కువ క్రోధకారణము లున్నవి. వారి కెక్కువ బలము లున్నవి. వారు పైకి శాంతులుగా కనుపడుచున్నను మనము ఏమరియుండుటకు వీలులేదు. మన రాష్ట్రములో పరిస్థితులు ఎక్కువ యల్లకల్లోల మైనపిమ్మట పెద్దఎత్తున వచ్చి మనలను ముంచివేయు నిశ్చయములతో వా రుండియుండవలె! రాజధానీనగరములో జైనకరణములు చేసిన సమ్మెతో మన కన్నులు తెరువబడినవి. శత్రుసైన్యము లాకస్మికముగా మనల ముట్టడించిన నీ మట్టికోట మనల గాపాడలేదు. అందును మట్టికోట నంటి కర్ణాటదేశమునుండి వచ్చిన జనులు పలువురు నివాస మేర్పరచుకొని యున్నారు. ఈ జైనకరణముల గృహములును ప్రాయికముగా నచ్చటనే కలవు!—"

ఈవిధముగా తిక్కచమూపతి నివేదించుచుండెను. అన్నమంత్రి యడ్డువచ్చెను.

"ఈ మట్టికోటలోపల నొక శిలాప్రాకారమును, మరల రాజమందిరములకు జుట్టు మరియొక శిలాప్రాకారమును, నిర్మించుటకు వివరములు సిద్ధముచేయ స్థపతులకు ఆజ్ఞలీయబడినవిగదా! అవి ఎంతవర కైనవి?"

తిక్కచమూపతి: "అవి మీ యుభయుల యెదుటగూడ నివేదించుటకే మిమ్ముల నిద్దర రాజధానీనగరమున మహారాజు లుంచినది!"

అన్నమంత్రి: "మంచిది? ఏవి?"

తిక్కచమూపతి సంకేతముగా చిన్నశంఖ మొకటి ప్రమోయించెను. కొలది సేపటిలో రుయ్యాను కొన్ని పటపత్రములతో నచ్చటికి వచ్చెను. అందులో భావిదుర్గ నిర్మాణచిత్రములు లెక్కలు వివరములు ఇత్యాదులు కలవు. అవి తెచ్చిన వ్యక్తి యవి యిచ్చి సెలవు తీసికొని వెళ్ళియుండవలసినది.

కాని చిత్రముగా రుయ్యామ యచ్చటనే కదలక యున్నది. రుద్రమదేవి యైనను వచ్చిన వ్యక్తిని వెళ్ళుమని సంజ్ఞ చేయలేదు. అందుచేత నాశ్చర్యముతో అన్నమంత్రి కన్నెత్తి రుయ్యామ్మవంక వీక్షించెను. రుయ్యామ యంతవరకు తనవంకనే ప్రీతిపూర్వకముగా తదేకదృష్టితో విలోకించుచున్నట్లు వెంటనే యాతడు గమనించెను. అతని చూపు తనపై బడినంతనే రుయ్యాము జంకుతో తల త్రిప్పుకొనెను. తా నంతవరకు అన్నమదేవునివంక తత్పరయై చూచుచున్న సంగతియే యామె కంతవరకు తెలియదు. అన్నయ గౌరకన్నులలో నపూర్వ మగు నొక కాంతి కలదు. రుయ్యామ సామాన్యముగా పురుషులు తనవంక జూచుచుండిన నేమాత్రమును తిరిగిచూచుటకు జంకెడి అభ్యాసము కలది కాదు. కాని య ట్లామె చూచుటలో నెట్టి యెడ్డెతనమును ప్రదర్శింపదు. ఆమెకు స్త్రీపురుషభేదము లేని నిర్లిప్తప్రకృతిగల దనునొక గౌరవభావమే యుదయించును,

కాని యీనాడన్నమంత్రి, "ఇంకను ఎందుకు వెడలి పోలేదు?" అని ప్రశ్నించు చున్నట్లుగా తనవంక జూచినంతనే, తనకు మున్నెన్నడు పురుషదృష్టి కలిగించి యుండని జంకు ఇతని దృష్టి కలిగించిన దేమి? తా నాతనివంక నంతసే పేల చూచినది? అతని శ్యామాయతదేహము ఉన్నతఘనతంత్రాలికములు నాసము గౌరకన్నులు చూచినచో నెవరికి మరలమరల చూడవలె ననిపింపదు? పూర్వమెప్పుడు నాతని దివ్యమూర్తి నంత సమీపమున నుండి రుయ్యమ చూచియుండలేదు. అతని చూచు చుండుట నేడు కన్నులకొక విందుగా ఉన్నది. కాని తా నాతని నంతసేపు చూచు చుండినందుకు ఎంతో సిగ్గుగా నున్నది. తాను చూచుచున్నది అతని దృష్టిలోగూడ బడినది. ఆ తలపుతో రుయ్యమ దేహమంతయు కుంచుకొనిపోయెను. ముఖ మామె వాల్చినను ఆ ఎర్రని ముఖము వికసించిన కోకనదమువలె మరింత ఎర్రనయ్యెను.

సిగ్గుపడుచున్న యా పదునారేండ్ల బాపనపడుచును అన్నమంత్రి తన గౌరకన్ను లతో మొదలు కోపము చిరాకుతోడ నేమాచెను. కాని యాత డామెసిగ్గు నుపలక్షించి నంతట నంతయు నాశ్చర్యముగా మారెను. అంతలో రుద్రమ యన్నమంత్రి సందేహము గమనించి స్పష్టపరచెను.

"అమ్మాయిని నేనే ఉండుమంటిని. ఆమె కీ పత్రాదికములు క్షుణ్ణముగా ముఖస్థమైనవి!"

ఆ మాటలతో అన్నమంత్రి తృప్తుడై యథాప్రకారము వ్యవహారకాండలో నిమగ్నుడయ్యెను. తిక్కచమూపతి అన్నమదేవునికిని అంబదేవునికిని రాతికోట నిర్మాణము వివరించుచుండెను. మధ్య మధ్య వారలకు గోపురద్వారములు దిడ్డి గవనులు బురుజులు ఎక్కడెక్కడ నుండునోకూడ, భూమిపై దూరమున వ్రేలితో చూపి విశదము చేయసాగెను. వా రిద్దరును అట్టె సూక్ష్మముగా సర్వము నవగాహన మొనర్చుకొనుచుండిరి.

పెద్దరాతికోట ఎంత యెత్తు? ఎంత లావు? మట్టికోట కెంత దూరము? అది యేయేవాడలమీదుగా వచ్చును? ఎన్నిమందిరములు ఇప్పు డున్నవి తీసివేయవలసి వచ్చును? దీనిని రక్షించుట కెక్కడెక్కడ ఎంతెంత సైన్యముంచవలెను? ఎట్టి నేపలు అవి? అగడ్తకు నీరుపెట్టుట యెట్లు? ఇన్ని శిలలు ఎక్కడినుండి వచ్చును? ఎట్లు? ఇట్లే ఎన్నియో ప్రశ్నలు వచ్చెను. వానికి సమాధానములును నిర్ణయమైనవి. ముందు రాజమందిరముల చుట్టును రెండు రాతిగోడలును, వానిమధ్య నీటిపైగూడ తేలునవై యుండి,బరువు లేకుండి బహుకఠినవగు నిటుకలతో దృఢమగు ప్రాకారము మహాశివరాత్రిలోపుగా పూర్తిచేయవలెను. ఈమధ్యనే పెద్దరాతిగోడకు రాళ్ళు ఇనుప రాతిగట్టునుండి తెప్పింపవలెను. మూడు సంవత్సరములు కాకముందె శిలాప్రాకారము పూర్తి యైతీరవలెను. స్థపతులను శిల్పులను ఎంత ద్రవ్యము వెచ్చించియైనను వేల కొలదిగా దీనికి నియమింపవలెను.

ఆ సంభాషణలో రుయ్యమ భ్రమియు కల్పించుకొనలేదు. కాని యానాటి కార్యాలోచనమంతయు ప్రత్యక్షరమును ఆమె యవగాహన మొనర్చుకొనుచు

హృదయకుహరములో పదిలమొనర్చుకొనుచున్నట్లు అన్నయకును అంబదేవునకును స్పష్ట మయ్యెను. ఈ పిల్ల ఎవరు ?

ఇది పటాదులం తెచ్చునవుడు రుద్రమను 'అమ్మా!' యని సంబోధించెను. అది మర్యాదపిలుపు కావచ్చును. కాని రుద్రమ దీనిని 'అమ్మాయి' యనియే కుమార్తెనట్లే నిర్దేశించి పలికినదే! ఈమె కూతు రైనచో మన మెరుగకుందుమా ? ఈమెకు రుద్రమతో నెట్టి పోలికయు లేదే ! పైగా బ్రాహ్మణయువతిగా కనిపించుచున్నదే !

రాతికోట మనోజ్ఞముగా నుండి చూచువారిని ఆంధ్రరాజుల మహైశ్వర్య మునకు విభ్రాంతులను జేయునట్లుకూడ చేయుట యవసరము! అందుపై గూడ గొంత విచారణ సాగినది. స్థపతులు గోపురద్వారములకు పలువిధములుగా రూపచిత్రము లిచ్చిరి. కొన్ని కేవలము బలముగా నుండి మోటుగా నున్నవి. కొన్ని కొంచెము తక్కువబలముగను మన్నితమైన శిల్పసంపదతోడను ఉన్నవి. అవి చూచినకొలదియు చూచువారి నాకర్షింపసాగెను. మరికొన్ని బలిష్ఠమై యుదాత్తశిల్పముతో విరాజిల్లు చున్నవి. అందందరు నేకగ్రీవముగా మూడవరకమువానిలో చిత్రములు ఉచితము లని నిశ్చయించిరి. ఆంధ్రవీరుల మనస్సులవలెనే ఈ కోటగూడ దృఢమును ఉదాత్త మునుగా నుండవలె. జిలుగుపనులు కోటగోడలకు ఉచితములు కావు. గోపురద్వార ములయొద్ద రెండువైపుల నోరు తెరచి మెడ మలచికొనియున్న సింహవిగ్రహములే పెట్టవలెను. అవి జేగురురాతితో నిర్మింపవలెను!

అంతలో రుద్రమకనుసన్న గైకొని రుయ్యమ యా యేకశిల ద్వారమునొద్దకు బోయెను. ఆమె వెంట కుబ్జ బాలప్రతాపరుద్రు నచ్చటికి తీసికొనివచ్చి వదలి సెలవు తీసికొని పోయెను. కొండపల్లిలో చేసిన కొయ్యగజ మొకటియు అశ్వ మొకటియు ప్రతాప రుద్రుని యాట కచ్చట వదలిపెట్టి పోబడెను. ఆ రెండును మిక్కిలి పెద్దవై బాలు డెక్కుట కనువుగా నుండెను. వానికి క్రింద నున్న చక్రములపై నెక్కినవారు నడిపింప వీలుకూడ కలదు.

తిక్కచమూపతి చిరునవ్వుతో ప్రతాపరుద్రదేవుని పలుకరించెను. "ప్రతాప రుద్రదేవా, శ్రీరుద్రదేవమహారాజులు మీ కే మగుదురు?"

ప్రతాప : "అమ్మగారు!"

ఆ మాటతో రుద్రమదేవిలోని మాతృత్వము బయలుపడ పురుషధీరత వదలి చిరునవ్వు నవ్వెను.

తిక్కచమూపతి : "మరి యీ రుయ్యమ?"

ప్రతాపరుద్రదేవుడు మాటాడక రుయ్యమవంక జూచెను. ఆ చూపులో నాతనికి రుయ్యమ యన్న నేమాత్ర మిష్టము లేదని స్పష్ట మయ్యెను. రుద్రమదేవి యందుకొనెను. "రుయ్యమ్మ ప్రతాపరుద్రదేవులకు ఒకకొంత శిక్షాగురువు!"

అంబదేవుడు ప్రశ్నించెను. "ప్రతాపరుద్రదేవులు ఈ గుఱ్ఱమెక్కి స్వారి చేయగలరా?"

"ఓ!" యనుచు ప్రతాపరుద్రు డా కొయ్యగుఱ్ఱ మెక్కి కాళ్ళతో త్రోసి కొనుచు నా కట్టిచుమున శీఘ్రగమనమున సంచరించెను. పిల్లవాని చురుకుదనమున కందరు మెచ్చుకొనిరి.

"మరి గజ మెదురైనచో నేమి చేయుదురు?" ఈ ప్రశ్న తిక్కచమూపతి యడిగెను.

ప్రతాప: "ఏదీ ఎదురు రానిండు!— చూపెదను!"

రుయ్యాను యా పెద్దఏనుగును ఆతనివైపుకు త్రోసెను. దానిని దగ్గరకు రానిచ్చి ప్రతాపరుద్రుడు మెరుపుమెరసినట్లు ఊపున తన గుఱ్ఱముముందుకు త్రోసి గజమును ఢీకొనజేసి దానిని వెనుకకు కొట్టివేసెను.

అన్నమదేవుడు: "అయితే ప్రతాపరుద్రులకు కత్తిసాము తెలియునా?"

రుద్రమ: "మీరే పరీక్ష చేయుడు!— ప్రతాపరుద్రా! ఏదీ?"

వెంటనే ప్రతాపరుద్రుడు అశ్వముప్రక్కను గజము ప్రక్కను గ్రుచ్చబడి యున్న రెండు కొయ్యకత్తులు తీసికొని, యందులో నొకటి యన్నమంత్రి నేరు కొమ్మనెను. అన్నమంత్రి యందులో కొంచెము గట్టి తక్కువగా నున్నది తీసికొను చుండగా, 'అది మంచిదికాదు. ఇది తీసికొండు, రండు!' అని ప్రతాపరుద్రుడు బలవంతముగా మంచిది అన్నమంత్రికిచ్చి, రెండవది తానుకొని కత్తిపోరుకు లెమ్మనెను.

అన్నమంత్రి నవ్వుచు 'డాలులేని కత్తిపో రేమిటి?' అనగా, 'ఇప్పుడు తప్పించుకొనక రండి! డాలు అక్కరలేదులెండి!' అని ప్రతాపరుద్రుడు తొందరచేసెను. అన్నయ యాకత్తి చేకొని చిరునవ్వునవ్వుచు నిలుచుండెను.

ప్రతాపరుద్రుడు తనకత్తితో దురుసుగా అన్నయపై విజృంభించెను. అన్నయ సంతోషముతో నా బాలుని కత్తిదెబ్బలు తన కత్తితో నెమ్మదిగా నడ్డుచుండెను. ఎంతటికిని అన్నమంత్రి నాతడు కొట్టలేక విసిగి, ఒక్కసారిగా అన్నమంత్రిమీదికి కవిసి,యాతని బట్టుకొన కుప్పించెను. మంత్రీశ్వరుడు ప్రేమాతిశయముతో వచ్చుచున్న యా బాలుని చేతులలో నెత్తుకొనెను. కాని బాలుడు పోరు చాలింపక కాలుచేతుల నన్నమంత్రిని గ్రుమ్మసాగెను.

అంబదేవుడును, అన్నమంత్రియు నొక్కసారిగా, "వీరికి మహాదేవరాజుల తొందర యంతయు వచ్చినది!" అనగానే, రుద్రమదేవి విరిసిన ముఖముతో, "అంతే కాదు!— మంత్రీశ్వరుల నట్లు పట్టుకొని కొట్టవచ్చునా? వారికి నమస్కరించు!" అనెను.

రుద్రమ యట్లనువరకు నాతడు అన్నమంత్రిని పట్టినపట్టు వదలలేదు. రుద్రమ మాటలు విన్నంతనే యా బాలుడు పోరు చాలించి, 'దెబ్బ తగిలినదా?' యని యన్నమంత్రిని పరామర్శ చేయుచు నాతనికి వినీతుడై నమస్కరించెను. ఆ నమస్కరించుటలో నాతడు చూపిన ఠీవికి అందరు ముగ్ధులైరి.

"చిరంజీవ! ఆయుష్మాన్" అనుచు అన్నమంత్రీశ్వరు డాబాలుని దీవించెను.

అంతట రుద్రమదేవి మెల్లమెల్లగా ప్రతాపరుద్రదేవులను పంపివేసి, మంత్రీశ్వరులతో నితరప్రసంగములలోనికి దిగి కొంతసేపు గడపెను. అంతట నామె వారి నిట్లు ప్రశ్నించెను.

"మేము మా సామంతులలో ఒకానొకరికి అశోకపుష్పములు పంపగా, అతడవి గ్రహించి కేతకీపుష్పములు పంపినాడు. అందులో నంతరార్థ మేమో మంత్రీశ్వరులు సెలవీయగలరా?"

తిక్కచమూపతియు అన్నమంత్రియు అంబదేవుడును ఒకరి ముఖము లొకరు చూచుకొనిరి.

'అట్లు చేసిన సామంతు డెవ డైయుండును?' అనియే వారి మనస్సులలోని ప్రశ్న. కాని ఎట్లడుగగలరు? ఇంచుకతడవు వారు మౌనము వహించిరి. రయ్యమ శరీరము కంపించుచున్నదా? ఎందుకు?

మరల రుద్రమయే నిష్కంపముగా ప్రశ్నించెను.

"కేతకీపుష్పము పూజకు వినియోగింపదగినదేనా?"

అన్నమంత్రి : "అది శివశాపదూషిత మైనదిగదా?"

తిక్కచమూపతి : "మీ కా సామంతు డంపిన కేతకీపుష్పములను మేము చూడవచ్చునా?"

"అవశ్యము!" అనుచు రుద్రమదేవి పలికెను. రయ్యమ ద్వారమునొద్దకు బోయి సంజ్ఞ చేయగా, నొక బంగారుపళ్ళెరము గొని కుబ్జ యచ్చటికి వచ్చెను. అందులో మహాలయామావాస్యనాడు వీరభద్రేశ్వరుడు పంపిన మొగలిపూవు లుండెను. ఆ మొగలిపూవులపై రంపములవలె నున్న యాచ్ఛాదనపత్రము లట్లే యున్నవి.

మొగలిపూవులు శీఘ్రముగా వాడిపోవు. ఐనను పదునారుదినములకు వాడు ముఖము చూపులే కాక ఎండుటకూడ ప్రారంభించును గదా! అవి క్రొత్తగా పంపినవి కావని యందరు ఎరిగికొనినంత వారికి మనస్సులలో కొంత బరువు తీరినట్లయ్యెను. ఆ పూవులపై గల రంపములవంటి పై రేకులే వారియందర దృష్టుల నాకర్షించెను.

"ఇవి పంపుట మహారాజులకు మిక్కిలి యవజ్ఞచేయుట! రంపమునే స్ఫురింప జేయుచున్నవిగదా ఇవి!" అని అంబదేవుడు నిష్కర్షగా వచించెను.

ఆ పుష్పములను అన్నమంత్రీశ్వరుడు కన్నులతో దూరము నుండి లెక్కించుచుండెను. కాని వానిలో నవి యడ్డుండుటచే సాధ్యము కాకుండెను. రయ్యమ తల వంచుకొనియే యుండి యది సూక్ష్మముగా గ్రహించి, యా పళ్ళెరమును సమీపించి, 'అమ్మా, ఇవి యెన్ని ఉన్నవి?" అని లెక్కింపసాగెను.

రయ్యమ కుశాగ్రబుద్ధికి అన్నమంత్రి రిచ్చవడి యామెవంక తేరిపారచూచు చుండునంతలోనసె, రయ్యమ లెక్కించుట పూర్తిచేసి 'పది!'యనెను.

"దశదిశలనుండి యీ రంపములు ప్రయోగింపబడు ననికూడ సంకేతార్థ ముండునా?" అని బిగ్గరగా అన్నమంత్రి యోచించుచున్న వానివలె పలికెను.

రుయ్యమయు రుద్రమయు నొకరివంక నొకరు చూచుకొనిరి. "మంత్రీశ్వరుల ముందు ఈవిషయము ప్రస్తావింపవలెనా యని ముందు మేము వెనుకాడితిమి. ఇప్పు డొక విశేషము స్ఫురించినది. దశ దిశలు, దశదిశలు!—" అనుచు రుద్రమ యాలోచనలో మునిగిపోయెను.

అంబదేవుడు : "శత్రువులు సేనలతో ఎనిమిదిదిక్కులనుండి రావచ్చును. భూగర్భమునుండి యాకాశమునుండి కూడ కృత్యాప్రయోగములచే వైరము సాధించుటకు ప్రయత్నింపవచ్చును."

అప్పటికే రుద్రమదేవి విజయదశమినాటి రాత్రి తనకు వచ్చిన పీడ కలయు, వీరభద్రేశ్వరుని యంధకారమయమూర్తి ప్రత్యక్ష మగుటయు, తలపున బార నడియే ధ్యానించుచుండెను.

"ఆ సామంతునకు అశోకములు మీ రేల పంపవలసివచ్చెనో అడుగవచ్చునా?"

ఇట్లు అన్నమంత్రి ప్రశ్నింపగా రుద్రమ ధ్యానభంగమై కలలోనుండి మేల్కాంచినట్లు, "అవును. మా సామంతులకు మేము అశోక వర్తింతుముగదా !— వారు మమ్ము రంపములతో దశ దిశలనుండి కోయ నుద్యమింతురు కాబోలును!"

అంబదేవుడు వీరావేశముతో పలికెను.

"అట్టి సామంతుని గృహ మంతయు నశోకపుష్పములతో నిండియున్నను అతనికి శోకము దూరము కానేరదు !!"

తిక్కచమూపతి మొదలనే యా సామంతుడు వీరభద్రేశ్వరు డని యూహించి యుండుటచే నాసంభాషణలో ఎక్కువ కలిగించుకొన వెనుకాడెను.

అట్టి సమయమున మేచయనాయకులు మహారాజదర్శన మపేక్షించుచున్నా రని కుబ్జ వచ్చి నివేదించెను. వెంటనే ప్రవేశ పెట్ట రుద్రమ యాజ్ఞాపించెను.

మేచయనాయకుడు వందనాదిక మైనపిమ్మట కొన్ని పత్రములు శ్రీ రుద్రదేవ మహారాజుల పాదపీఠమందున పళ్ళెరమున నుంచి వినీతుడై నిలుచుండెను.

ఆపత్రము లొకటొకటే రుద్రమదేవి చదువుకొనుచుండెను. చదివినకొలది యామెముఖము వివర్ణము కాజొచ్చెను. ముందు ఆశ్చర్యము, పిమ్మట కోపము, తర్వాత చెప్పలేని ఆందోళన, వరుసగా చూచినవారికి వ్యక్త మయ్యెను. హృదయ కుహరములో నెక్కడనో అణగియున్న పరస్పరవిరుద్ధభావము లెన్నియో దాగక ఆమె ముఖమున తాండవింపజొచ్చెను. మహారాజు హృదయగతభావము లట్లు ముఖమున బింబించుట యరుదు !

"నా విధులు తృప్తిగా నిర్వర్తించుటకు నాకువిశేషాధికారములు కావలె నని మనవిచేయుచున్నాను !" —రుద్రమ పత్రములు చూచుట పూర్తియైనంతనే మేచయ నాయకు డీ విన్నపము చేసికొనెను.

రుద్రమ దీర్ఘాలోచనము చేయుచు మాటాడలేదు. కొంతసేపు నిరీక్షించి మేచయ మరల నర్థించెను.

"రాజ్యములో నెంతటివారి నైనను బంధించు ననుజ్ఞ నాకు కావలెను. మహామంత్రుల నైనను బంధించు నధికారము దయ చేయవలె నని విన్నవింతును!"

రుద్రమ : "తగిన కారణములు నిరూపించినచో మే మట్టి యనుజ్ఞ యీయమని ఏల సందేహింపవలసి వచ్చినది?"

మేచయ : "అట్లయినచో, ఆ పత్రములు చూచితిరిగదా! అన్నమంత్రీశ్వరులను ఇప్పుడే బంధింప ననుజ్ఞ యర్థించుచున్నాను."

అంబదేవుడును తిక్కచమూపతియు నిర్ఘాంతపోయిరి. అన్నమంత్రీశ్వరుడు చలింపలేదు. ఆయన కది చమత్కారముగా తోచెను.

రుయ్యమ కాళ్ళు నిలువక కూరుచుండెను.

అంతలో రుద్రమదేవి యిట్లనెను.

"మేము మేచయనాయకుల నిశ్చయముతో నేకీభవింపలేకున్నాము. ఈపత్రములలో సంశయకారణములున్నవి. కాని నిస్సందేహముగా నేరము నిర్ధారణచేయ నాధారము కనపడదు. ఈ పత్రము లన్నియు శత్రుకల్పితములై యుండవచ్చును. మా కుటుంబమునందు వంశపారంపర్యముగా వారు చూపిన విశ్వాసమును ఇవి చలింపజేయలేవు!"

ఆ మాటలు విని ఎవరును మాటాడలేదు. అన్నమంత్రికూడ కొంచెము ఆశ్చర్య పడెనుగాని, తన్నుగూర్చిన సందేహముగాన అందులో జోక్యము కలిగించుకొనుట యుక్తము కాదని మిన్నకుండెను. మేచయనాయకుడు ఎంతమాత్రమును తన నిశ్చయము మార్చుకొన్నట్లు లేదు.

నెమ్మదిగా నాపత్రములు రుద్రమదేవి మేచయ కిచ్చి, అన్నమంత్రి కిమ్మనినాత డట్లొనర్చెను. ద్రోహికి ద్రోహనిరూపణజేయు పత్రములే మహారాజు లిమ్మన నత డేమి చేయగలడు?

అన్నమంత్రి యాపత్రములు పరిశీలించుచుండెను. అట్లాతడు చూచుచుండగా నాతని ముఖలక్షణముల రుద్రమ శ్రద్ధతో గమనించుచుండెను. మేచయ నిశ్చలుండై నిలుచుండి దోషిని చూచువిధముగా అన్నయవంక చూచుచుండెను.

అన్నమంత్రి పత్రములు కొన్ని మరలమరల పరిశీలించెను. కొన్ని వెనుకకు ముందుకు త్రిప్పి చూచెను. నిదానముగా యోచించెను. మరల నవి మేచయనాయకున కిచ్చివేసెను.

రుద్రమదేవి యడిగెను: "అన్నమంత్రీశ్వరులు అన్నియు చూచితిరిగదా. ఏమందురు?"

అన్నమంత్రి : "ఆ పత్రములు ఎక్కువభాగము కల్పితములు. సత్యమైన పత్రములును కొన్ని గలవు. వానికి అసత్యపత్రములతో కలిసి చదువనియెడల సద్భావమే యుండును. ఐనను నేనును మేచయనాయకుల యభిమతముతో నేకీభవింతును!"

ఆమాటలకు మేచయనాయకుడే యులికిపడెను. అతడు దూరమాలోచింపనిది నిశ్చయింపడు. ఆమాటలతో నాతనికే తన నిశ్చయములో పొరబడియుంటినా యను సంశయము ఉదయించెను.

తిక్కచమూపతియు అంబదేవుడును ఏమియు దోపక అయోమయస్థితిలో పడిపోవుచుండిరి.

రుయ్యాపు గుండెలు దడదడలాడుచుండెను. ఆమెకన్నులు తిరిగియే పోవుచున్నవి. రుద్రమవంకగాని అన్నదేవునివంకగాని యామె చూడలేక స్వయంభూతేశ్వరుని ఆలయశిఖరముపై నున్న కనకకలశమును తిలకించుచుండెను.

రుద్రమ యడిగెను. "అన్నమంత్రీశ్వరులు తమ యభిప్రాయము వివరింతురా?"

అన్నమంత్రి స్పష్టము చేసెను.

"నా కున్నంత యధికారము కలవానిపై నింత తీవ్రమగు సందేహ మున్నపుడు, అది తీరనిది అధికారపదవిలో నుంచుట రాజనీతివిరుద్ధము. ఒక ద్రోహి కారాగారమునుండి మోసముగా తప్పించుకొనిపోవుటకు, మా కార్యాలయమునుండి పత్రములు వెళ్ళినట్లు కనబడుచున్నది. మరియు మాకు నాగదేవునితోడను దేవగిరీశుని తోడను ఉత్తరప్రత్యుత్తరములు జరుగుచున్నట్లు కొంత యనుమానము తోచుచున్నది. ఇవిగాక సందేహాస్పద మగు స్థితిలో నున్న మనుమగండగోపాలుని పక్షమువారికి నేను బల మిచ్చుచున్నట్లును కనబడుచున్నది. ఇందులో చివరిదానిలో కొంత సత్యమును లేకపోలేదు.

"నా కీనాడు విశేషముగా రాజ్యతంత్రరహస్యములు తెలిపియున్నారు. అందుచే నన్ను స్వేచ్ఛగా నుండనిచ్చుట యుచితము కాదని నాకే తోచుచున్నది."

రుద్రమ ధీరగంభీరముగా పలికెను.

"మాకు భాసించిన భావమే అన్నమంత్రీశ్వరులును సెలవిచ్చినారు. ఈ విషయమునందే కాక ముందుగూడ ఎన్నో విషయములలో అన్నమంత్రీశ్వరుల సహాయ మర్థించుచుందుము—మేచయనాయకా! అన్నమంత్రీశ్వరుల కొరకు ఏకాంతమందిరము రాజప్రాసాదములో చూచి సిద్ధము చేయింపుము. ఎట్టి యవజ్ఞయు లేకుండ రాజబంధువులకువలెనే ఏకాంతమున వారికి మర్యాదలు జరుగునట్లు చూడుము!"

మేచయనాయకుడు సెలవుతీసికొని వెడలిపోయెను.

రుద్రమదేవి అన్నమంత్రీశ్వరుని సంబోధించి యడిగెను.

"మీ రచ్చట నెంతకాల ముండవలెనో! ప్రొద్దుపుచ్చుటకు మీ కెట్టి ఏర్పాట్లు కావలెను?"

అన్నమంత్రీశ్వరు డాలోచించుకొనలేదు. వెంటనే యుత్తర మిచ్చెను.

"నా కీ యధికారపదవిలో వేదవేదాంతచింత చేయు వ్యవధి లేకపోయినది. చతుర్వేదపారగు లగు నలుగురు విప్రులను నాయొద్దకు వచ్చుచు బోవుచుండ ననుజ్ఞ యిచ్చినచో కృతార్థుడ నగుదును!"

రుద్రమ : "మంచిది. తప్పక యట్లే చేసెదము. ఇంకేమైన నర్థింతురా?"

అన్నమంత్రి : "ఉన్నది. నామీద కలిగిన సందేహము తిక్కన సోమయాజుల కెట్టి స్వేచ్ఛాభంగమును కలిగింపకుండును గాక!"

రుద్రమదేవి యడిగెను. "తిక్కనసోమయాజుల సంగతి ఈ పత్రములలోఁ జూచినాము. వారి వివరము లెరిగింతురా?"

అన్నమంత్రి : "వారు మాకు దూరబంధువులు. మనుమగండ గోపాలునియొద్ద చాలకాలము మంత్రీశ్వరులుగా నుండిరి. మహాకవీశ్వరులు. నన్నయభట్టారకులు వ్రాయక వదలిన మహాభారతగ్రంథమును ఆంధ్రావనిమోదముం బొరయ జగద్ధితముగా నాంధ్రీకరించుచున్నారు. వారేదో కార్యసిద్ధి యర్థించి మనరాజధానికి దయచేసి యున్నారు. మనుమగండగోపాలునిపై రాజానుగ్రహము ప్రసరింపజేయు నిచ్ఛ వారికుండి యుండవచ్చును. వారికా చలచిత్తునిపై అపారవాత్సల్య మున్నది. వారే బ్రాహ్మణులకు కరణవిద్య నేర్పు పాఠశాల ప్రారంభించు నిచ్ఛకు మూలకారణులు!"

రుద్రమ : "అన్నమంత్రీశ్వరా, రాజధర్మ మెంత కఠినమైనదో, మాకు ఒకదానితర్వాత నొకటి యీ ఐదారుదినములలోననే నిరూపించుచున్నవి. అభిషేకమైన వెంటనే మేము పంపిన మొదటియాజ్ఞ శ్రీవీరభద్రేశ్వరుల బంధించుటకే. మరల మిమ్మీనాడు నిర్బంధములో నుంచవలసి వచ్చినది. మీ ఇచ్ఛానుసారము తిక్కన సోమయాజులకు ఈ నగరమున సర్వస్వాతంత్ర్య మీయ కట్టడిచేయుదుము."

అన్నమంత్రీశ్వరుడు "ధన్యోస్మి" యనెను. రుద్రమదేవి యయ్యమవైపు చూడలేకపోయెను. అంబదేవునివంకను తిక్కచమూపతివంకను గూడ చూడలేకపోయెను.

రుద్రమకన్నులు చెమ్మగిల్లుచున్నవో ఏమో, ముఖ మావలకు చప్పున త్రిప్పుకొనెను.

## ౧౯

"నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్."

శ్రీమహాభారతమ్.

తిక్కనసోమయాజులు అన్నమంత్రీశ్వరుల యింటి కతిథిగా వచ్చియుండెను గదా! ఆయన యిన్నాళ్ళు నేమి చేయుచున్నాడు? ఎక్కడ నున్నాడు? గురునాథు డేమయ్యెను? మారన కెట్లు ప్రొద్దుపోవుచున్నది?

తిక్కనసోమయాజులు తమ సోమిదేవమ్మతో కలసియే ఏకశిలానగరము వచ్చినారు. లేకున్న త్రేతాగ్నులసేవ సాగు టెట్లు? అన్నమంత్రీశ్వరుని భవనమున వారికొక శాల ప్రత్యేకింపబడి, అది సర్వసంపన్నముగా నమర్పబడినది. అందనేకభాగములు గలవు. కాని యందన్నిట నగ్నిహోత్రగృహము పవిత్రమనోజ్ఞము!

ఆనడుమ కొంతకాలము సోమయాజుల మహాభారతాంధ్రీకరణ మాగిపోయినది. నెల్లూర మహాయుద్ధము చెలరేగుచుండగా, ఆ పెన్నానదీతీరమునందలి మండపముపై గూర్చుండి శాంతముగా నాయన రచన సాగించుకొన సాధ్యమగునా? ఒకప్రక్కను వీరభటుల యలజడి. మరొకవంక రణభేరీభాంకారములు. ఆ శబ్దము లెన్ని చెవుల జొచ్చుచున్నను కొంతవరకు నిర్లిప్తుడై యుండగలుగునేమో కాని, మధ్యమధ్య దీనుల యార్తారవములు విని సోమయాజులు భరింపగలరా? అవి చెవులలో పడినంతనే దేహ మంతటను విద్యుద్వేగమున బ్రసరించును. కవిత్వ మాపై నెట్లు సాగును? అందుచే రచన ఆగిపోయినది.

అంతలో ఆయన నెల్లూరుపట్టణమే విడువవలసి వచ్చినది. ఆ పినాకినీనదీ పవిత్రవారిలో క్రుంకు లాడుటే దూరము కావలసివచ్చినది. మనుమగండగోపాలునిపై నున్న వాత్సల్యముతో నాతనికి సహాయ మర్థించుటకు ఓరుగల్లుకు కరణములతో ప్రయాణము కావలసివచ్చినది. ఆపిమ్మట కొద్దికాలమునకే మనుమసిద్ధి నెల్లూరు పట్టణమును పాండ్యపల్లవసేనలకు వదలివేసి,దేశాంతరగతు డయ్యె ననువార్తలు సోమ యాజులకు దెలిసెను. అయినను ఓరుగంటికి ప్రయాణ మాతడు ఆపక సాగించెను. అక్కడ అవకాశము చిక్కినంతనే, తనతో పరివారముగా వచ్చిన కరణములను అక్కడి ప్రభువులకు ఉపయోగపడునట్లు చేసియుండెను గదా! సమయము వచ్చి నప్పుడు మనుమసిద్ధి ఎక్కడ నున్నది యెరిగి, చేతనైన యుపకార మాతనికి చేయింప వచ్చును. అంతవరకు నిచ్చట శాంతముగా మహాభారతాంధ్రీకరణము సాగింపవచ్చును. కాని ఎక్కడ గూర్చుండి వ్రాయుట?

అగ్నిహోత్రశాలలో గూర్చుండి యది సాగింపవచ్చు నని ముందు సోమ యాజు లూహించెను. అగ్నిహోత్రునిలో సమస్తదేవతలను ప్రత్యక్షము చేసికొన వచ్చునుగదా! హరిహరనాథుడుమాత్ర మందు ఏల సన్నిహితుడు కాడు? నిజమే! అయినను ఆశ్వయుజశుద్ధములో అష్టమినాడు సోమయాజులు స్వయంభూదేవుల దర్శించుట కాయాలయమున కేగెను. ఆ యాలయావరణముననే శ్రీకేశవాలయ మున్నది. ఆ విశాల మగు ప్రాకారమున కంటి యెన్నియేని మనోహరమండపము లున్నవి. ప్రక్కనే స్వయంభూదేవుని సరోవర మున్నది. అక్కడనే ఎదురుగా హరి హరనాథు లేకమైన మూర్తివలె ఏకశిల బొడ్డురాయి భాసించుచు సమీపమున గనిపిం చుచుండును. తుదకు స్వయంభూదేవాలయప్రాంగణమున గల యొక మండపమున గూర్చుండి, విజయదశమినాటినుండి శ్రీమహాభారతరచన మరల సాగింప నాయన నిశ్చయించెను. సిద్ధసంకల్పులకు విఘ్నము లుండునా? అట్లే సాగుచున్నది.

తిక్కనసోమయాజులు ఉదయమున సంధ్యావందనాగ్నిహోత్రాదికము నిర్వ ర్తించుకొని, కుశపాణియై తనవెంట గురునాథుడును మారనయు కోశాదికములతో రా, పాదచారియై స్వయంభూనికేతనమునకు బయలుదేరి, యందు నిరృతిదిక్కున గల మహా మండపమున ప్రాచీముఖుడుగా కూర్చుండి రచన కుపక్రమించును. సమీపమున గురు నాథుడు ఉత్తరమునకు తిరిగి గూసీనుడై వ్రాయుచుండును, ఆతనిప్రక్కనే మారన

కూర్చుండి, ఎదురుగా వ్యాసపీఠమునందుంచి, శ్రీ మహాభారతమూలము పఠించు చుండును. అట్లువారు కూర్చుండుటచే వారికి కేశవ శ్రీస్వయంభూనికేతనములు ఎదురుగా నుండును. ఆ రెండు దేవాలయముల శిఖరములు హరిహరనాథుని రెండు మూర్తులుగను, ఆవల నున్న ఒంటిమిట్ట—ఓరుగల్లు, ఏకశిల—ఆ రెండుమూర్తుల నొకటైన రూపముగను అక్కడ నుండువారికి పొడగట్టును !

ప్రాతఃకాలమున నచ్చటికి వచ్చి, మాధ్యాహ్నికములకు వేళ యగువరకు శ్రీ మహాభారతరచనము నచ్చట సాగించి, యంతట తిరిగి భవనమున కేగి మాధ్యాహ్నికములు నిర్వర్తించి, భోజనానంతరము సోమయాజులు కొంచెము విశ్రమింతురు. మరల నంతట దేవాలయప్రాకారమున గల మండపమునకు ప్రొద్దుటివలెనె వచ్చి సంధ్యాకాల మగువరకు వారు రచన కావింతురు.

ఈనా డుదయమున అనుశాసనికపర్వమున పంచమాశ్వాసము ప్రారంభింపవలసి యుండెను. మండపమున నాసీనుడైన యనంతరము సోమయాజి కొంచెముతడవు ధ్యానమగ్నుడై యుండి పిమ్మట నిట్లు పలికెను.

'శ్రీకాళీత్వాదరము, శ్లోకాలోకనవిలాససుస్థిరభవనా
శోకముదాద్యవధూతి, వ్యాకోశవివేకభవన హరిహరనాథా !'

అట్లు సోమయాజి చెప్పుచుండ, నది శ్రద్ధగా చెవియొగ్గి చక్కగా ధారణ చేయుచు గురునాథుడు తాళపత్రముపై గంటములోని రత్నములు గణగణ లాడుచు శ్రావ్యనాదము చేయుచుండ లిఖించెను. అంతట సోమయాజులు శ్రీ కృష్ణద్వైపాయన వేదవ్యాసకృతమహాభారత కోశపూజ నిర్వర్తించి,

'నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్.'

అనుచు నరనారాయణులను సరస్వతిని వ్యాసునితో ధ్యానించెను. గురునాథుడును మారనయు సోమయాజుల ననుసరించిరి.

అంతట మారన వ్యాసమహాభారతకోశబంధము సడలించి పత్రములు వ్యాసపీఠమున రెండుచేతులతో విస్తరించి, కావలసినపత్రము దాని కున్న సూత్రముతోడనే పైకి తీసి కన్నుల కద్దుకొని పాఠము ప్రారంభించెను. ఆ కంఠమున నెంత మాధుర్యము! ఎంత శాంతము! ఎంత గాంభీర్యము! ఎంత మార్దవము! బ్రహ్మ తేజోనిధి యగు శుకయోగియే యీ రూపమున నవతరించి పఠించుచున్నాడా యని పించును. సోమయాజి తదేకచిత్తుడై యాలకించి కొంతవడికి ఆపు మన్నట్లు మారనకు సంజ్ఞ చేసెను.

ఆపై కొంతతడవు సోమయాజులు మౌనము వహించెను. అందరును మౌనమే ! విన్న యాభాగమును తిక్కన మననచేయుచుండెను. ఆ శ్లోకముల యర్థము ముందు ఆయనహృదయములో సుస్థిర మయ్యెను. సుస్థిరమైన యా యర్థ మాతడు మరల మరల నవలోడన మొనర్చెను; మరల మరల మథించెను. ఆ మథనముతో నగ్ని పుట్టెనో యేమో గాని, కొంతతడవున కా యర్థము సోమయాజుల హృదయములో

కరగిపోయి రసస్వరూప మందెను. సువర్ణకటక మొకటి మూసలో నుంచి దానిని కుంపటిలో పెట్టి అగ్ని ప్రజ్వలింపజేయగా ద్రవీభూతమై, యా సువర్ణకటకము కేవల సువర్ణాకృతినొందు విధముననే, వేదవ్యాసార్థము తిక్కనసోమయాజుల యంతరంగ మను మూసలో వేడెక్కి కరగిపోయి స్వచ్ఛసువర్ణాకారమై యొకానొక సామ్యావస్థ నందెను. ఆ స్థితిలో సువర్ణము స్వర్ణకారుని ఇచ్ఛచొప్పున నే యాకారము పొందుటకైన నను అనువుగా నుండునుగదా! అట్లే ఆయర్థమును కొంతతడవునకు సోమయాజుల ఇచ్ఛాశక్తిచే సత్త్వ ముద్రేకించి ఆంధ్రవాణిరూపముగా నది యాయన జిహ్వాగ్రము నుండి యుద్గమించెను. సోమయాజుల యమృతవాక్కు ఎప్పుడు బయలువెడలునా యను నుత్కంఠతో ఆ మహాత్ముని పెదవులవంక నేకాగ్రదృష్టితో నంతవరకు జూచు చున్న గురునాథు డొక్కమ్మడి జాగృతు డయ్యెను. సోమయాజులవాక్కు లిట్లు వెడలినవి.

'దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె!'

ఈ వచనముతోడనే ప్రతియాశ్వాసమును తిక్కనసోమయాజి ప్రారంభించును. కాని తిక్కననోట నాశబ్దము లుచ్చరింపబడుచుండగా వినుచున్న గురునాథునకును మారనకును ఆ ఐదుశబ్దములును పంచభూతాత్మక మగు సృష్టిగానే భాసించును. ఆకాశమునుండి వాయువు, వాయువునుండి యగ్ని, అగ్నినుండి యప్పులు, అప్పుల నుండి పృథివి!

దేవా, యని హరిహరనాథుని సంబోధించి పలుకుచున్న సోమయాజుల వాక్కు విన్నవారే ధన్యులు! రామాదిభగవన్నామములే విస్తరించి గానము చేయువా రెందరు లేరు? అట్లే ఆ శబ్దమును సోమయాజులును అనేకభంగుల నుచ్చరించును. ఒక్కొక్కమా రొక్కొక్క భంగిగా నది వచ్చును. ద్యోతనస్వభావము వ్యక్తీక రించు దేవశబ్దమే సోమయాజుల హృదయములో నిత్యస్ఫూర్తితో వెలుగుచు లీనమై ఆయన కభిమానపాత్ర మయ్యెను.

అంతట నా మిగిలిన నాలుగుశబ్దములలో ముందు వైశంపాయనుని నామమే యాతడు స్మరించును. గతానుగతికముగా చదువుకొనువారికి ఆ శబ్దము ఇతరపురుషుల నామములవలెనే ఒకానొకసంకేతమే. కాని వైశంపాయన శబ్దము తిక్కనసోమయాజు లకు పూర్వకాలమున నున్న యొకానొక మానవుని నిర్దేశించు సంకేత మగు నామము కాదు. వైశంపాయనుడు ద్వాపరాంతమున యజుశ్శాఖలు లోకమున ప్రవర్తింపజేసిన వ్యాసశిష్యు డగు నొక మహర్షి! తానును యజుశ్శాఖలం దొకా నొక డగు కృష్ణయజు శ్శాఖాధ్యాయి. వైశంపాయననామము స్మరించినంతనే తిక్కన సోమయాజుల హృదయములో యజుర్వేదము సాంగముగా భాసించును.

ఆ పిమ్మట నాతడు జనమేజయనామ ముచ్చరించును. ఆతడు కలియుగ మవత రించినపిమ్మట భరతసార్వభౌములలో రెండవవాడు. వేదవ్యాసు డీ మహాభారతకథ నేల కథన మొనర్చెను?కలియుగములో, ముఖ్యముగా సార్వభౌములు, దీని నాకర్ణించి

భారతధర్మము రక్షించుచు జయము పొందుచుండవలె నను మహాశయముతో నాతడు దీనిని చెప్పినాడు. అందుకే దీని కాతడు జయకావ్య మని పేరు పెట్టినది! ఈ మహా గ్రంథప్రథమోపదేశము జనమేజయచక్రవర్తికే వ్యాసుడు చేయించినాడు!

ఈ యూహాపరంపరలతో 'జనమేజయునకు' అనునప్పటికి సోమయాజుల హృదయములో తీవ్ర మగు బాధ యంకురించును. ఆ జయమునే నన్నయభట్టారకులు తెలుగువాణిలో రాజరాజును ఉపదేశింప ప్రారంభించెను. కానియది పొంతము చేయ లేకపోయెనే! నే నుపదేశింప ప్రారంభింత మన్నను ఇప్పుడు ఆ రాజరాజైన లేడే! అయ్యో, రాజరాజు లేడే, యని హరిహరనాథునకు నివేదించుకొనును. తిక్కన కన్నులలో నీరు క్రమ్ముచున్నట్లె గిర్రున తిరుగుచున్నట్లే యుండ 'ఇట్లు' అను పదము గద్గదస్వరమున వచ్చును.

ఆ పిమ్మట 'అనియె' అను పదము నిట్టూర్పు విడిచినట్లే ఆయననోట వెలువడెను!

ఆ రెండుపదములు విన్న గురునాథునకును మారనకును తిక్కన సోమయాజులు ఎంత హృదయభారముతో శ్రీమదాంధ్రమహాభారతరచన కుపక్రమించినారా యను భావ మావేశించును!

ఉత్తరక్షణములో సోమయాజి మనస్సు దిటవుచేసికొని యిట్లు సాగించెను.

'అట్లు గంగాత్మజుండు ధర్మాత్మజునకు జెప్పి యిట్లను గౌరవశ్రేష్ఠ పద్మ నాభుతో నవ్విధంబున నారదుండు పార్వతీదేవి ప్రశ్న ముపన్యసించి: ఇట్లనియె!'

ఆ చెప్పినది గురునాథుడు లిఖించుట పూర్తిచేసెను. అంతట మరల మారన వ్యాసభాగతపాఠమున కుపక్రమించెను. తిక్కన యథాపూర్వముగా ధ్యానమననము లొనర్చి హృదయములో నా యర్థము కరగించి యాంధ్రఛ్ఛందోరూపముచ వెలువ రించెను.

అట్లు మారన చదువుచుండగా నాపినభాగమున సామాన్యముగా నాంధ్ర ములో తిక్కనసోమయాజులకు వచనము వెలువడును. వచనమునకు గద్యయని పేరు. అది గద్దె; ఆసనము; నిలుచుచోటు! సంస్కృతపఠనము నిలిచినయెడల నెల్ల వచనము వచ్చుచుండుట ప్రకృతిసిద్ధము. ఇట్లు చేయవలె ననుకొని చేసినది కాదు. కవి మనస్సు విశ్రమించు నెడల వచనమే సాధారణముగా వచ్చుట స్వాభావికము!

'శివుండు పార్వతికి వర్ణాశ్రమాచారంబుల తెఱంగెఱిగించు' ఘట్టముతో నా యుదయమున ప్రారంభ మైనది. మధ్యాహ్నమగునప్పటికి ఆ ఘట్టము పూర్తియై 'శివుడు పార్వతికి దపస్స్వరూపంబు సెప్పు' ఘట్టము సగ మయ్యెను. విశ్రమించి మరల వచ్చినపిమ్మట ముందు సోమయాజి తా నాఉదయమున చెప్పిన భాగము గురునాథుడు వినిపింపగా నాలకించెను. అట్లు వినుచు మరల స్ఫురించిన సవరణలు చేయించెను. కాని యట్టి సవరణలు క్వాచిత్కములు. ఆపైని మరల యథాప్రకా రము రచన ప్రారంభించి యాఘట్టము పూర్తిచేసి 'శివుడు పార్వతికి రాజత్వమహి మాతిశయంబు సెప్పు' ఘట్ట మందుకొని చెప్పుచుండెను.

కేశవస్వయంభూనికేతనములు రెండును ఒకే ప్రాకారమధ్యమున గలవు. అందు దక్షిణముఖముగా స్వయంభూదేవాలయమును పశ్చిమముఖముగా కేశవాలయమును ఉన్నవి. ఆ యాలయములలో సాయంకాలపూజకు చాలతడవు ముందుగనే అర్చకులా యాలయముల ద్వారములు తెరచి యందలి యఖండదీపములలో తైల ముంచి వత్తులు సరిచేసి ఆగమోక్తులు పఠించుచుండిరి. మధ్యమధ్య భక్తులు స్వయంభూతేశ్వరునకును కేశవస్వామికిని కీర్తనమస్కారాదికము లర్పించి సేవలు చేయించి తీర్థప్రసాదములు గ్రహించి వెడలిపోవుచుండిరి.

అంతలో నాలయప్రాకారమునం దంతట నొక సందడి యారంభించెను. అది యలజడి కాదు. అప్రమత్తులై యుండ యత్నించు నర్చకుల సందడి! ఆలయావరణములో నున్న మండపాదులలో విశ్రమించియు సల్లాపములు చేయుచును పనసలు చెప్పుచును శాస్త్రార్థములు చేయుచును నవ్వుచును కేరుచును పలువిధముల నున్న బ్రాహ్మణులు తాము కట్టిన పుట్టములను పైనున్న యుత్తరీయములను సరిచేసికొనుచు స్వయంభూదేవాలయముఖమండపములోనికి శీఘ్రగతి నరుదెంచుచున్న సవ్వడి! శౌచహీను లావలకు తప్పుకొనుచున్న సంభ్రమము! సామాన్యజనులు గౌరవదృష్టులతో ప్రక్కల కొదిగి తొంగిచూచుచున్న కలకలము!

శ్రీరుద్రదేవమహారాజులు క్రీడాశైలమునుండి రాజప్రాసాదమునకు బోవుచు కేశవస్వయంభూనాథుల దర్శించు నిచ్ఛ యదృచ్ఛగా గలిగి. యిట్లు వచ్చుచున్నారను వార్త వచ్చినది. ఇట్లాకస్మికముగా వారు దేవదర్శనమునకు వచ్చుటయును కద్దు. కాని యది యసాధారణము. అందుచేతనే ఈ సంభ్రమము!

స్వయంభూదేవాలయప్రాకారమునకు దూరమున దండధరుల కేకలు వినవైనవి. వందిమాగధులు కైవారములు చేయుచు ప్రక్కలనుండి ఎదురగుచు దారి సాగుచున్నారు. అంతలో దూరముననే శ్రీరుద్రదేవమహారాజులు అశ్వమునుండి దిగి పాదరక్షలు వదలిరి. ముందు తిక్కచమూపతియు మధ్యను శ్రీరుద్రదేవమహారాజులును ఒకప్రక్కను అంబదేవుడు రెండవపార్శ్వమున పర్వతనాయకుడును వచ్చుచుండిరి. అందరు పాదచారులే! అందరును సరోవారితో పాణిపాదశౌచము పొంది దక్షిణ ద్వారము సమీపించిరి.

ఎత్తైన నాలుగు స్తంభములతో ఉదాత్తరమణీయ మగు నాగోపురద్వారము నొద్దకే, ఎదురుగా నున్న స్వయంభూదేవాలయమునుండి శివార్చకులును, ప్రక్కనున్న కేశవాలయమునుండి వైఖానసులును, ఎదురు వచ్చి శ్రీ రుద్రదేవమహారాజులకు రాజమర్యాదలు గావించి లోనికి తీసికొనివచ్చుచుండిరి. వేదవిదు లగు బ్రాహ్మణు లిరుగెలకుల రెండు బారులుగా తీరి స్వస్తివాచనము ప్రారంభించిరి.

శ్రీరుద్రదేవమహారాజు సపరివారముగా వారి కెల్లరకు దోసిలియొగ్గి నమస్కరించుచు నాలయములు రెండిటికిని ప్రదక్షిణము చేసి, ముందు స్వయంభూస్వామిని దర్శించి పూజ చేయించి మంత్రపుష్పముతో కానుక లర్పించి యాత్మప్రదక్షిణనమస్కారాదికములు కావించిరి. ఆ పిమ్మట కేశవస్వామియాలయములోని కరిగి యట్లే యర్చానమస్కారాదు లర్పించి తీర్థప్రసాదాదులు స్వీకరించిరి.

దేవదర్శనమునకు వచ్చినవారు పూజానంతరము ఆలయమున నించుకతడవు కూరుచుండవలసిన విధి యున్నది. స్వయంభూదేవాలయ ముఖమండపద్వారమున ఉన్నతము లగు రెండు గజవిగ్రహములు కలవు. అవి నిగనిగలాడు నల్ల రాతిలో తొలిచినవి. వాని కిరుప్రక్కలను దీర్ఘవితర్దికలు కలవు. అందులో నొకటి యాల యము పశ్చిమద్వారమునకును రెండవది ప్రాక్కుడ్యమునకును అంటియుండును. ఆ యరుగుల వెనుకను ప్రక్కలను శిల్పులు తీవెలు పూలు సింహములు ఏనుగులు రమణీయ ముగా తొలిచియుండిరి. వానిలో పడమటిగోడ నానియున్న యరుగుపై, శ్రీరుద్ర దేవమహారాజులకు మెత్తనై పట్టుకుచ్చులు కల రత్నకంబళి ఘుంచగా నం దామె యుపవిష్ట యయ్యెను. పరివారమును యథార్హముగా కూర్చుండదగువారు కూర్చుం డియు నిలుచుండువారు నిలుచుండియు నుండిరి. బ్రాహ్మణబృందము ఆశీర్వచనమున కాయత్త మగుచుండెను. అందుకు అర్చకులు వారికి పుష్పాక్షతాదులు పంచిపెట్టు చుండిరి.

ఆ ప్రదేశమునకు పదివిండ్లదూరముననే తిక్కనసోమయాజులు మహాభారత రచనము చేయుచున్న మండప మున్నది. ఆలయప్రాకారమధ్యమం దున్నవారెల్లరు మహారాజదర్శనమునకై సమీపమునకును దవ్వునకును మూగిరి. ఆ మండపములో నున్న యా ముప్వురు వ్యక్తులుమాత్రము ఎట్టి యంతరాయము లేకుండ వారపని వారు చేయుచునే యుండిరి. వారికి ఆలయమునకు అర్చకులు వచ్చినదిగాని, మహారాజులు వచ్చుచున్నదిగాని, వచ్చినసందడిగాని, పూజాదిక మొనర్చినప్పుడు కలిగిన సంచల నముగాని—ఏదియు పట్టినట్లే లేదు. అందును మహారాజులు ఆలయప్రదక్షిణము చేయునెడ వారికి నాలుగైదు విండ్ల దూరమునుండియే వెళ్ళియుండిరి అయినను ఆ ముప్వురు నది పట్టించుకొనలేదు. కేవలము శ్రీహరిహరనాథుని భావవీధిలో నిలుపు కొని శ్రీకృష్ణద్వైపాయన వేదవ్యాసవచనము లనువాదము చేయువారి కీలోకము కన్ను లకు కనబడుచున్నను నిజముగా నది భాసించునా?

ఆ ముప్వుర మూర్తులను శ్రీరుద్రదేవమహారాజులను ఆలయావరణమున ప్రవే శించినప్పటినుండియు నాకర్షించెను. ఎవరు వీరు? సాక్షాత్తు బ్రహ్మవిష్ణు మహేశ్వరులే యీ మండపములో గోష్ఠి తీరియున్నారా? వీరు చేయు ప్రసంగమేమి? వ్రాయుచున్న గ్రంథ మేమి? ప్రదక్షిణము చేయుచున్నతరి నధ్య నొకింత యాగి యది యేమో వినవలె నని మహారాజులకు ఉత్కంఠ కలిగెను. కాని అట్టిది రాజమర్యాదకు భంగకరము! సందడిలో ఏదియు స్పష్టముగా వినరాలేదు.

అప్పుడే అన్నమంత్రీశ్వరులను కారాగృహమునకు రుద్రమ పంపించియుండెను. ఎంత గౌరవముగా పంపినను తా నామహాత్ముని బంపినది కారాగారమునకే గదా! ఇందులో తా నేదో మహాపరాధము చేయుచున్నా నని యామెకు హృదయములో స్ఫురించుచుండెను. అన్నమంత్రీశ్వరుడు ద్రోహి యగుట యసాధ్యము! కాని యంత బల మగు సాక్ష్యసాధనములను త్రోసిపుచ్చుట ఎట్లు? రాజధర్మ మెంత కఠిన మైనది! ఈ యాలోచనలతో రుద్రమ మనస్సు వికల మయ్యెను. ఆ మనోవైక్లబ్యము నుపశమించుకొను నాశతోడనే ఆమె రాజప్రాసాదమునకు పోవుచుపోవుచు దేవ దర్శనార్థ మిప్పు డీర్ష్యాక స్మికముగా వచ్చినది!

పూజానంతరమున ఆ వితర్దికపై నిప్పుడు రుద్రమ యాసీనయైనది. బ్రాహ్మణా శీర్వాద మింకను ప్రారంభింపలేదు. దక్షిణగోపురద్వారబంధములపై గల హంసప్రతిమలపై నామె దృష్టి ప్రాలినది. ఇప్పు డా మండపములోని త్రిమూర్తు లేమి చేయుచున్నారో తెలిసికొనవలె నని కుతూహల మామెకు మరల కలిగినది. శ్రద్ధగా నటువైపుకు చెవు లొరజేసి మనస్సు నటు లగ్న మొనర్చినది. ఈ క్రిందిపద్యము లామెదక్షిణకర్ణ తాడనము గావించెను.

"భూసురుల కలంకవుట్టం జేసి నహుషముఖ్యనృపులు సెడుట ప్రసిద్ధం
బాసురపతి విప్రునలుక గానిబడడె తెలచి పడసెగాదె నయనముల్.
కావున విప్రారాధకు డై వెలయు విభుండు రాష్ట్రి సతని ధనము సై
న్యావలి బంధుత విప్రుల దీవనలం బొదలు నింత దల్లము దేవీ!'

రుద్రమ యొక్కమారుగా ఆపాదమస్తకము కంపించెను. స్ఫుటమై మధురమై మంజులమై ఉదాత్తమై ధీరమై తిక్కన సోమయాజుల కంఠము రుద్రమదేవి దక్షిణ కర్ణమును తాడనమే చేసెను. ఆ పద్యద్వయము నక్కడ నున్న యందర నెంతో ఆకర్షించెను. ఎవ్వరు మాట్లాడలేదు. అందర దృష్టులును శ్రవణములును అప్రయత్నముగా నా మండపమువంకకే తిరిగెను.

తిక్కన చెప్పిన పద్యములు వెంటనే గురునాథుడు వ్రాయునే గాని యప్పుడు చూవి వినిపింపడు. అట్లవి వినిపించుట ఉదయమో మధ్యాహ్నమో. మరల రచనకు దొరకొనునప్పుడే అది యభ్యాసము! ఐనను పద్యమధ్య నెన్నడైనను వ్రాసినవెంటనే గురునాథు డాపద్యములు సోమయాజులకు వినిపించుటయు కద్దు. ఇప్పు డా పద్యములు రెండును గురునాథుడు చదివి వినిపించెను.

రుద్రమ మరల ఉలిక్కిపడినట్లయి యటు తిరిగి చూచెను. అది యప్రయత్నముగా జరిగినది. ముందు చదివినది సోమయాజి. ఆతనిది ,రుద్రమకు ఈశ్వరమూర్తిగా పరమశాంతముగా కానిపించెను. ఈ రెండవమారు చదువుచున్నది స్థూలకర్కశకాయుడగు గురునాథుడు. అనేక రాక్షసులతో యుద్ధములు చేసిచేసి ఒడలు కాయలు కాచిన కేశవస్వామియా ఇతడు? ఇత డింత బిగ్గరగా చదువుచున్నాడేమి? కొట్టవచ్చువాని వలెనే చదువుచున్నాడే! కాని యీ కొట్టవచ్చుటలోగూడ నెంత కారుణ్యము, అంత గ్గతముగా కలదు! ఒక్క స్వయంభూతేశ్వరుడు తాను అన్నయదేవుని బంధించుట ప్రమాదకరమని యుపదేశించుట చాలక కాబోలు, కేశవదేవునిచేగూడ నాదేశింప జేయుచున్నాడు! నేను తప్పనిసరియై అన్నమంత్రీశ్వరుల నీనాడు బంధింపజేసితిని గాని అవజ్ఞ చేయ నుద్దేశించి కాదే!

'ఐనను ప్రత్యక్షముగా నా కన్వయించు వాక్యములు ఇట్లు పలుకుచున్నవా రెవరు వీరు ?'

ఇట్లామె తలంచుచునే యుండగా సోమయాజుల వచనవాక్యములు వినబడెను.

'అని నిర్దేశించి కపర్ది గౌరితో వెండియు.'

'అమ్మా! న న్నుద్దేశించి పల్కినవి కావు. వీ రేదో గ్రంథ కాలక్షేపము చేయుచున్నారు.' అని రుద్రమ యనుకొని యాశ్వాసించుకొనుచున్నంతలోనె మారిన

వ్యాసభారతపఠన మారంభించెను. ఏగ్రంథమో రుద్రమకు బోధపడక ప్రశ్నించు చున్న దానివలె ఆమె యా కూడిన విప్రులవంక తిలకించెను. అందులో వృద్ధ బ్రాహ్మణు డామెభావ మెరిగికొని యిట్లనెను.

"అమ్మా—దేవా, శ్రీ తిక్కనసోమయాజులు వ్యాసమహాభారతగ్రంథము ఆంధ్రీకరించుచున్నారు. వారిది నెల్లూరు. హరిహరనాథున కది అంకితము చేసినారు గనుక, చునవీట నీ కేశవ శ్రీస్వయంభూనికేతనము లున్న యీ యావరణమునకు వచ్చి నిత్యము గ్రంథరచన సాగించుచుందురు. వారు కేవలము బ్రహ్మణ్యామూర్తులే!"

అంతలో బ్రాహ్మణులు ఆశీర్వచనపనస లందుకొని మంత్రపుష్పాక్షతలు శ్రీరుద్రదేవమహారాజుల శిరస్సున నుంచిరి. మహారాజులును ఆ చేరిన బ్రాహ్మణుల కందరకు భక్తిపూర్వకముగా నమస్కరించుచు తాంబూలములలో ఒక్కొక్కరి కొక్కొక్క సువర్ణ ముంచి సత్కరించిరి.

అంత రుద్రదు తన వెంట వచ్చిన యొక లేఖకునియొద్దనుండి యొక భూర్జపత్ర మును, వ్రాయు తూలికయు నందుకొనెను. ఆ పత్రము నలు మొగముల చక్కని పూజలు రంగురంగులతో దిద్దియుండెను. ఆపత్రముపై నామె స్వయముగా ముత్యాలవంటి యక్కరములు వ్రాసి దానిక్రింద తనపేరు వ్రాసి రాజముద్రిక వేయించి పత్రము నావలివైపున అభయచిహ్నముగా తన దక్షిణహస్తముద్రను అద్దెను. ఆ పత్ర మంతట నామెపువ్వుల లలో పెట్టి యా మహాభారతము వ్రాయుచున్న సోమయాజుల కిమ్మని యచ్చటి వృద్ధబ్రాహ్మణున కప్పగించి సపరివారముగా వెడలిపోయెను.

ఆమె వెడలిపోయిన కొద్దిసేపటికే సోమయాజులు ఆ ఘట్టము ముగించి యా నాటికి రచనయే చాలించిరి.

"ఈనాడు డెబ్బదితొమ్మిది పద్యములైనవి" అని గురునాథుడు లెక్కవేసి సంతోషముగా చెప్పెను. సోమయాజుల కాశ్చర్య మయ్యెను. "ఆ హరిహరనాథుని కృప!ఎన్నియైనను బలికింపగలడు!" ఇట్లనుచు, "ఇప్పుడు పూజకు వచ్చివెళ్ళిన దెవరో ఎరుగుదురా ?" యని సోమయాజి మారనను గురునాథుని బ్రశ్నించుచుండెను.

ఆసమయమున వృద్ధబ్రాహ్మణుడు తిక్కనసోమయాజుల యొద్దకు వచ్చి, 'శ్రీరుద్రదేవమహారాజులు ఈపత్రము మీకు అనుగ్రహించినారు, అనుచు నదియం దిచ్చెను. సోమయాజి యా వృద్ధబ్రాహ్మణునికి నమస్కరించి యది యందుకొని కన్నుల కద్దుకొని ఇట్లు చదువుకొనెను.

"శ్రీరుద్రదేవమహారాజు లిచ్చిన యభయపత్రిక.

శ్రీ తిక్కనసోమయాజులకు ఏకశిలానగరమున నెందైనను ఏవేళనైను నిర్నిరోధ ముగా సంచరింప ననుజ్ఞయిచ్చుచున్నాము. వారి సర్వస్వాతంత్ర్యమునకు అభ్యంతర పెట్టినవారు మా చే శిక్షకు పాత్రు లగుదురు.

శ్రీరుద్రదేవమహారాజు"

(వరాహముద్రిక)

వెనుకవైపున అభయహస్తముద్రయు తిక్కనసోమయాజులు తిలకించెను.

"ఆ వచ్చినది రుద్రదేవమహారాజులే, మహారాజులేనా, గురునాథా?"

తిక్కనసోమయాజు లంత సరోవరము సమీపించి సాయంసంధ్యావందన మాచరించి కేశవశ్రీస్వయంభూదేవులకు మ్రొక్కిరి. అప్పటికే మహారాజులయాజ్ఞవృద్ధబ్రాహ్మణుని ముఖమున దెలిసిన యర్చకులు మునుపటికంటె నినుమడించిన యాదరగౌరవములతో సోమయాజులయెడ బ్రవర్తింపసాగిరి. అక్కడినుండి గృహాభిముఖులై యాయన వెడలుచుండ, ఆ వార్త ఎట్లు నగరమునం దంతట బ్రాకెనో, భటులు రాజపురుషులు—నందరు సోమయాజులను సగౌరవముగా నమస్కరించుచు తొలగువారే! ఇట్లు మును పెన్నడు లేనంత గౌరవ మానాడు ఏకశిలానగరమున సోమయాజులకు లభించెను.

ఆ మార్పు కించుక వింత నొందుచు సోమయాజులు ఇంటికి రాగానే అన్నమంత్రీశ్వరులను ఏకాంతవాసమునకు పంపిన వార్తయు వారికి తెలిసెను.

అన్నమంత్రిభార్యలు పార్వతియు లకుమాంబయు సోమయాజులకు చింతాక్రాంతహృదయములతో నమస్కరించి దీవన లందిరి. కాని యా యన్నమంత్రి సత్తమునితల్లి గౌరమమాత్రము సోమయాజుల యెదుటను రాలేకపోయెను. 'కారణజన్ముడగు మహాయోగికి ఈ దశ ప్రాప్తించు టేమిటి?' అని ఆమె మాటిమాటికి అనుకొనుచు కన్నీరు వదలును.

ఇంట నున్నవా రందరును చింతాక్రాంతహృదయులై యుండిరి. కాని యందొక్కరును ఆ విషయము ప్రస్తావింపరు. కారణ మేమని ప్రసంగించుకొనరు. ఇంటికి వచ్చినవారికి యథాపూర్వముగా గౌరవాదరములలో మార్పు చూపరు.

అన్నమంత్రీశ్వరుని ఆరేళ్ళ చిన్నకుమార్తెకు మాత్ర మావార్త తెలియదు. కాని అది యందరి ముఖభంగులు చూచుచు నేదో విశేష మున్న దని యూహించెను. కాని దాని కెవ్వరును రహస్యము చెప్పలేదు. ఆ పిల్ల దిగులుపడిపోవునని యట్లు పార్వతి శాసించెను.

ఆపిల్ల సోమయాజుల కెదురుగా వచ్చి యాయనచేయి ప్రేమతో పుచ్చుకొని 'తాతగారూ, మా నాన్నగారు ఇంకా రాలే దేమి?' అని ప్రశ్నింపసాగెను.

సోమయాజులు ఆదరముతో నా పిల్లదేహము నిమురుచు నేమి చెప్పవలెనో తోపక మిన్నకుండెను. ఆయన కలవరము గురునాథుడును మారనయు గ్రహించిరి;

బాలకు అప్పటికి మారన యన్న సిగ్గును గురునాథుడన్న భయమును బోయినవి. వారు ఆ పిల్లను నెమ్మదిగా మరిపించుచు మాటలలోనికి దింపిరి.

నిర్లిప్తు డగు సోమయాజులనుగూడ ఆపిల్ల మాటలు కలవరపరచసాగెను. తానే అన్నమంత్రీశ్వరుల నిర్బంధమునకు కారకుడ నేమో అను అనుమానమును సోమయాజుల కంకురించెను. బాల పసిమాటలు చెవులలో మాటిమాటికి దూరుచుండుటచే సోమయాజు లారాత్రి భోజనము చేయలేకపోయెను. రాత్రియంతయు నాపిల్ల 'తాతగారూ మా నాన్నగారు రాలే దేమి?' అని తన్ను ప్రశ్నించుచున్నట్లే తలపోయుచు సోమయాజులు జాగరణమే చేసెను.

## ౨౦

ద్రవము లట్లే గడచిపోవుచున్నవి. సోమయాజుల మహాభారతరచనమును అట్లే సాగిపోవుచుండెను. కరణపాఠశాలలో జేరిన బ్రాహ్మణులు ముందనుకున్నకంటె శీఘ్రముగా నా లెక్కల లోతుపాతులు గ్రహించుచుండిరి. వారికి రాత్రింబవళ్ళదే పని!

విజయదశమినాడు పట్టాభిషేకానంతరమున జరిగిన పేరోలగమున సమ్మె చేసిన జైనకరణముల నందరను క్షమించుచు శ్రీ రుద్రదేవమహారాజు చేసిన శాసనముతో ఆ కరణసంఘములో చీలిక లుదయించెను. అంతటితో నొక సంచలనము ఏర్పడెను.

తాము చేసినది అపూర్వ మగు నపరాధము. ఒకానొక యావేశమే తమ్మాదుకు ప్రేరేచినది. రాజధానీనగరమం దెల్లెడ నందర సామంతుల మంత్రుల దండనాథుల కార్యభరణుల వ్యవహారశాలలలో నిందరు నొక్కసారిగా పనికి పోకుండు టేమి? ఎవరైన తమ కవమాన మొనర్చిరా? భత్యములలో గాని వేతనములలో గాని తమ కేమైన లోటు చేసిరా? లేదే! అయినచో తమకు కోపకారణ మేమి!

'యువరాజుగా హరిహరదేవు డైన నేమి, రుద్రమ యైన నేమి, మనకు? ఇన్ని దినములను హరిహరదేవుడు గాని వీరభద్రేశ్వరుడు గాని మన కేమి యొరిగించిరి? రుద్రమ మనకు చేసిన యపకార మేమి? గణపతిదేవులకు తన కూతుసవతిపిల్లలపై కంటె కూతుపై ప్రేమయుండుటలో తప్పేమి? మరియు దన కుమార్తె దౌహిత్రునిపై మాత్రము ఆయనకు ప్రేమ యుండుటలో అసాధారణ మేమి?

అబద్ధము లగు వేదములు మన్వాదిస్మృతులు ప్రమాణములుగా భ్రాంతిపడు వైదికులకు, స్త్రీ రాజ్యము చేయుట కొంత వింత కావచ్చును. కాని మన జైనులలో స్త్రీలకు భర్తవలన నచ్చు నాస్తియందే సంపూర్ణ మగు అధికారము కలదే! అర్హ్యతనీతి ఏమనుచున్నది?

'అనపత్యే మృతే పత్యౌ సర్వస్య స్వామినీ వధూః'

'మరియు నదియే'

'విధవా హి విభక్తాచే ద్వ్యయం కుర్యా ద్యథేచ్ఛయా
ప్రతిషేద్ధా నకో ప్యత్ర దాయాదశ్చ కథంచన'.

అని శాసించుచున్నదే! అదియు గాక శ్రీ రుద్రమదేవులకు గణపతిదేవులవలన నీసామ్రాజ్యము సంక్రమించుచున్నది. అందుచే నది యామెకు సౌదాయికమగు స్త్రీ ధనము. అది రేపు ఆమె తన యిష్టమువచ్చినవారికి దానము చేయవచ్చును. అర్హ్యతనీతి యట్టిదానిగురించి ఇట్లు చెప్పుటలేదా?

'ఏతత్ స్త్రీధన మాదాతుం నశక్తః కోపి సర్వథా
భాగానర్హం యతః ప్రోక్తం సర్వై ర్నీతివిశారదైః'

'అందుచే మన నీతిప్రకారముగా స్త్రీలకు తమకు వచ్చు నాస్తియం దెల్ల, జీవితాంత మగు స్వత్వమే కాక సర్వస్వత్వము గలదు. మన కేల కష్టము, వారు మనధర్మమే యవలంబించినపుడు! ఉన్నచో వేదవాదుల కట్టి భ్రాంతు లుండ వచ్చునుగాక!'

'పూజ్యు లగు వీరభల్లటదేశికులకు రాజసభలో నేదో అవమానము జరిగిన దని ఘోషించినారు. కాని నిజముగా వారి కేమి యవమానము జరిగినది? వారికి తోచిన ధర్మము వారు ప్రవచనము చేసినారు. వారిది స్వభావసిద్ధముగా తొందరవాక్కు! కొంచెము కటువుగా పలికినారు. రాజసభలో మంత్రిసామంతాదు లాకాఠిన్యము సైరింతురా? వారుమాత్రము శ్రీవీరభల్లటదేశికుల నేమన్నారు? వారి వాక్పారుష్య మును కొంత విమర్శించినారు.

'అయినను యువరాజు కావలసినది మా కుమారుడన్న మాకుమారుడే యని వివదించుచున్నది మహాదేవరాజును, వీరభద్రేశ్వరులును. అందులో వీరభద్రేశ్వరుడే విశ్వేశ్వరశంభువును ధర్మము నిర్ధారణచేయు మని యర్థించెను. ఆయనకు దోచినది ఇరువురకు గాకుండ మధ్యమార్గము సూచించినారు. అది చక్రవర్తికి సమ్మతమైనది. మంత్రిసామంతదండనాథులు పలువురకును అది నచ్చినది. మధ్య మన కెందుకు? ఆ వీరభల్లటదేశికులే మరల పట్టాభిషేకసమయమున ఆ రుద్రమదేవుల నొక కలశము చేతగొని యభిషేకించెనే!

'మనము చేసిన యపరాధములకు శిక్షలు విధించుటలో ప్రభువుల తప్పేమియు లేదు. శ్రీరుద్రదేవమహారాజులు మనల నందర బంధవిముక్తుల గావించి పలువుర కంఠములే కాపాడినారు! అధికారులకు క్షమాపణము చెప్పికొని యథాప్రకారము మన వృత్తులు స్వీకరించుట యుత్తమపద్ధతి?'

జైనకరణములలో పలువురు పైవిధముగా తలంచి యనేకవిధముల నధికారుల క్షమాభిక్ష వేడికొని పూర్వపదవులలో జేరిరి. కాని అందులో నత్యున్నత పదము లందున్నవారికి పలువుర కొక చిక్కు వచ్చెను. వ్యవహారశాలకు తాము రాకున్నదినము లలో ఆ ప్రధానపదవులు నెల్లూరినుండి వచ్చిన యీ పాకనాటి బ్రాహ్మణకరణములకు అప్పటికే స్థిరపడిపోయెను. వారిని తొలగించి మరల వీరికి ప్రాతయున్నతోద్యోగము లిచ్చుటకు అధికారు లనుమతింపలేదు. అందుచే తాము పూర్వము ఉన్నతాధికారము నెరపినచోటనే ఇప్పుడు ద్వితీయస్థాన మాక్రమింపవలసివచ్చినది. అది యట్టివారికి చిన్నతన మనిపించెను. వారి తల కొట్టివేసినట్లే వారి కది భాసించెను. కొందరు స్వయం కృతాపరాధ మని యందుకు తల లొగ్గిరి. కాని పలువు రందు కియ్యకొనక పనులు చాలించికొనిరి.

అన్నమంత్రీశ్వరుని ప్రధానకరణ మగు నాగాచారికి కరణసంఘమున విశేష గౌరవమును పలుకుబడియు గలదు. కరణములు సమ్మె చేయవలె నను నపూర్వవిషయ మూహించినదియు నతడే. అతడు తన తల దక్కదని తెలిసి విజయదశమి వెళ్ళువరకును బయటపడలేదు. ఆ మరునా డతడు జంకుచు అన్నమంత్రిదివాణమునకు బోయెను. అతని కక్కడ స్థానము కనబడలేదు. అంతట నాతడు అన్నమంత్రిని దర్శించెను.

అతనిని గాంచినంతనే అన్నమంత్రి జీతబత్తెములు లెక్కలు వేయు కరణమును బిలిపించి వెంటనే నాగాచారికి రావలసియున్న వేతన మంతయు లెక్కకట్టించి యాతనిముందు పెట్టించెను. నాగాచారికి మాట్లాడుట కవకాశము కలుగలేదు. అన్నమంత్రి కింకను ఏదో మనవిచేయవలె నని యున్నట్లాత డించుక యనుమానించుచు అక్కడనే నిలువబడెను.

"లెక్కలో తప్పేమైన నున్నదా?—ఏదీ?" అని యా లెక్కవేసిన కరణము నొద్ద గల పత్రములు అన్నమంత్రి తీసికొని పరీక్షింపసాగెను.

అది చూచిన నాగాచారికి కోపము ఆగలేదు. ఉద్రేకమే కలిగెను.

"మంత్రీశ్వరా, మీరు పెద్దలు. ఇన్నాళ్ళు మీకును మాకును గల ఋణబంధము ఒక్కసారిగా కోసివేయుట శ్రేయస్కరమనియే ఎంతురా?" అని యాత డనివేసెను. అతని సర్వాంగము వడకుచుండెను.

అన్నమంత్రీశ్వరుడు ప్రత్యుత్తర మీయలేదు. చిరునవ్వు మాత్రము నవ్వెను.

ప్రత్యుత్తరమునకై నాగాచారి కొంతతడవు నిరీక్షించెను. అన్నమంత్రి యా గణితము పూర్తిచేసి యావల నుంచి మరుమాటాడక మొదలు తాను చేయుచుండిన పనిలో నిమగ్నుడయ్యెను. కొంతసేపక్కడనే నాగాచారి యట్లే నిరీక్షించెను. ఇంకను అట్లే యున్నచో బవిరినీడు వచ్చి తన్ను బయటికి బలవంతముగా తీసికొనిపోవును. అది తెలిసిన నాగాచారి 'సెలవు తీసికొందును!' అని నిర్లక్ష్యముగా పలుకుచు తన కిచ్చిన ద్రవ్య మచ్చటనే వదలి వెడలిపోయెను.

సర్వమును అన్నమంత్రి పరీక్షించుచునే యుండెను. నాగాచారి వెళ్ళినదే తడవుగా ఆతడు తన యాశ్రితభటు డగు బవిరినీని బిలిపించి, యా ద్రవ్యము నిర్దేశించి యది నాగాచారియింటియొద్ద నిచ్చి రమ్మని పంపెను. ఆత డా ద్రవ్యము నాగాచారి ఇంటికి చేరకముందే అక్కడ చేర్చి వచ్చి మంత్రీశ్వరునకు నివేదించెను.

నాగాచారివలెనే కొంచె మించుమించుగా ఎందరో ప్రధానకరణములును పెద్దకరణములును తమ యుద్యోగములు పోగొట్టుకొనిరి. వారితోపాటు వారి నాశ్రయించుకున్న చిల్లరవ్రాయసకాండ్రును బహువురు గల తమ పూర్వపు బనులలో జేరుట కిచ్చగింపలేదు.

తాటాకులపై గంటము చెక్కుకొనిపోయిననే గదా లేఖనము సిద్ధించునది! రాగిరేకులపై లేఖనముకూడ శాణము చిన్నసుత్తియ సహాయముతో కొంచెము హెచ్చు తగ్గుగా నట్లు ప్రసరించుటవలననే గదా సాధ్యపడునది! తాటాకులపైనను రేకులపైనను అక్షరములు లిఖింపబడును. మరి శిలలపై నక్షరము లగు రూపములే తొలువబడును. సుత్తెదెబ్బలతో టంకము శిలలపై రూపకల్పన చేసి శిలలను గండాగపు బొమ్మలనుగా మార్చివేయును. ఆ పనియే కొంచెము భేదముతో చేసిన దారువులును ఉలి చెబాడితల సహాయమున అనేక రూపాంతరము లొంది సజీవము లగును. స్వర్ణాదిలోహములను కరగించి అభేదిన విగ్రహాది స్వరూపములను పొందించుటకూడ పై కార్యములను తుల్యమైనదే. ఈ విద్యలన్నిటికి సారూప్యమున్నది. కాని యీయన్నివిద్యలలో ఒక్కొక్క

దానిలో ప్రత్యేకప్రావీణ్యము అభ్యాసముచే సంపాదింపవలెను. అంతే! వ్రాయస కాండ్రు వ్రాయసవృత్తితోపాటు దారు శిలాస్వర్ణాదులలో నొకటిగాని కొన్నిగాని యన్నియుగాని యభ్యసించుట యలవాటు. ఆ యన్నిటిలో వ్రాయసవృత్తి సులభ ముగా కనబడును. కాని కళాకుశలురగు నా జైనకరణముల హస్తములలో లిఖించు తాళపత్రములుగూడ నొక యపూర్వశోభతో విరాజిల్లుచుండెను.

మరియు నొక విశేషము కలదు. అప్పటికే చాలకాలమునుండి దక్షిణదేశమున భూర్జపత్రములమీద వ్రాయుటకూడ వాడుకలోనికి వచ్చినది. దానియందు జైనకరణ ములకు విశేష మభిమానము. భూర్జపత్రముపై గంటము సాగదు. దానిపై తూలికల తోడనే వ్రాయవలెను. వ్రాయుటకుముందు వారు ఆపత్రమును రంగురంగుల తీవలతో బొమ్మలతో నలంకరించి, వానిపై బంగారు వెండి హరిద్రా కుంకుమములు ఇత్యాదు లద్ది, వ్రాతకు ఆయత్తము చేయుదురు. అట్లు పత్రము శోభాయమానముగా దిద్ది గాని యందుపై వారు వ్రాయ దొరకొనరు. వ్రాత యనునది పత్రములపై చదువుటకుమాత్ర ముపయోగించు సంకేతము లగు కొన్ని రూపములను ఉంచుటకాదు. అవి సంకేతములే కాదు. అవి అక్షరములు! దేవసదనములో పూజామూర్తు లెట్లో పత్రముపై వ్రాసిన యక్షరము లట్లు! దేవసదనము లలంకరించినట్లే పత్రములును చూచువారికి ఆకర్షక ముగా నుండవలెను. జైనమతమున నీ సృష్టియు నిత్యమే. దానికి నాశము లేదు. సిద్ధి పొందదగిన జినులకు ఈ శరీరమే అందుకు సాధనము. అందుచే ఈ శరీరమును పరిశుభ్ర ముగా పవిత్రముగా ఉజ్జ్వలముగా నుంచవలెను. అందుచే వారు వ్రాయు పత్రములు అందలి యక్షరములు రమణీయోజ్జ్వలములుగా నుండవలెను. మరి యా పత్రములు గ్రథనముచేయు కోశములుగూడ చూచువారికి పూజ్యభావము సద్యస్స్ఫూర్తిగా కలిగింపవలెను. వ్రాయుటకూడ ఒక శిల్పమే, ఒక కళయే! ఆ విషయము జైనుల గ్రంథములు చూచినవారికే అవగత మగును.

ప్రధానకరణములు పలువురు మిక్కిలి ధనవంతులు. జీవనములకు వ్రాయస వృత్తిపై నాధారపడవలసిన యవసరము వారికి లేదు. వా రనేకశిల్పములందె కాక స్థాపత్యమునందుకూడ సమర్థులు. అందులో ఎవరి కభిమాన మున్న కార్యములు వారు చేయగలరు. ఆంధ్రరాజ్యమున గాకున్న వారు దేవగిరికి పోగలరు. కళింగమున వారికి బహుమానములు లభించును. హోయిసలబల్లాల రాజ్యమునను, చోళ పాండ్య కేర ళాది దేశములలోనను, వారిని నెత్తిన పెట్టకొందురు. అందుచే కొందరు నిర్లక్ష్యముగా నంధ్రదేశము వదలి నలుదిశలకు సద్దుకొనిరి. కొందరు స్వస్థానములు వదలలేక అచ్చ టనే నిలిచి స్వర్ణకారాదివృత్తులలో స్థిరపడసాగిరి.

అట్లు నిలిచిపోయినవారికి పలువురకు చిరకాలము వ్రాయసవృత్తిలో చేతులు మెలగినందున, కఠినము లగు స్వర్ణదారుశైలాదులలో నంత నిపుణముగా వారిహస్త ములు ప్రసరింపకుండెను. వ్రాయసవృత్తిలో నున్నపుడు సంపాదనము తక్కువైనను సంఘములో గౌరవ మెక్కువ యుండెను. ఆ గౌరవ మిప్పుడు వారికి పోయినది. తనకంటె తక్కువవా రని ఇన్నాళ్ళు తలచినవారితో సమానముగా నైన ఇప్పుడు ఆ కర్మలలో నైపుణి వీరికి కుదురలేదు. అట్టిసామాన్యకరణములకు తమ వ్రాయస

వృత్తితోపాటు జీవనాధారమే పోయినట్లయినది. వారికి ఆంధ్రరాజుమీదను వారి మంత్రిసామంతదండనాథులమీదను అంతరంగములలో తీవ్రమైన కోపము చెలరేగినది. కాని యేమి చేయగలరు? అట్టివారికి నాగాచారివంటి ప్రధాన కరణములు ప్రభువుపై ద్వేషము వృద్ధియగునట్లు ప్రేరేపుచుండిరి. అమాయకు లగునట్టి పేదలు ఉద్రేకపూరితులై సమయము చిక్కినప్పుడు అకార్యములు చేయసాగిరి. వారిలో పట్టుబడినవారికి రాజపురుషులు శిక్షలు విధించుచుండిరి. అట్లు వారు పొందు శిక్ష లతిశయించుచున్న కొలదియు వారికి ప్రభుత్వముపై ద్వేషమభివృద్ధి నొందసాగినది. అందుపై నల్లరులు పెరిగినవి. శిక్షలు పొందినవారు తాము చేసిన దోషములు తలపోయుట మాని, రాజపురుషులు విధించు శిక్షలే భావించుచు, వారికి పక్షపాత మారోపింపసాగిరి. మున్నెన్నడు లేనిది కాకతీయ ప్రభువులకు జైనులపై ద్వేషముజన్మించినదని యొక ప్రథ వారు ప్రవర్తింపజేసిరి. వినాశకాలే విపరీతబుద్ధిః!

ఇట్లు పురుషులే కాక స్త్రీలుకూడ ప్రభువులను ఆడిపోయసాగిరి. అట్టి యపప్రథ యొకసారి లోకములో ప్రవర్తమానమైనచో దాని నెవ్వ రాపగలరు. దొరలించిన చక్రమువలెనే అదియు సాగిపోయెను. చౌర్యము చేసినవారికి కరచ్ఛేదనము సామాన్యశిక్ష! ఆ శిక్ష పొందినది ఒరు డైనచో నెవ్వరు నేమియు ననుకొనరు. కాని అది జైనచోరునికే తటస్థించినచో, వారిలోవారు 'వరల వీని నొకనిని గూడ శిక్షించుచున్నారు. మన కిక తలలు నిలువవు. పాప మితడెంత మంచివాడు? ఇట్టివానినా రాజపురుషులు శిక్షించుట? వినాశకాలే విపరీతబుద్ధిః!'.—ఇట్లని యను కొందురు. అట్టి మాటలు వినిన జైనేతరులు గూడ, 'కాబోలు పాప' మని జాలినొందుదురు. ఇట్టి యపప్రథలు నాగాచారి సర్వవిధముల పట్టణమున పొక్కునట్లు చేయుచుండెను.

కాని యా వ్రాయసకాండ్ర రోషమంతయు ముఖ్యముగా బ్రాహ్మణకరణపాఠశాలలపై కేంద్రీకరించెను. "ఇది మహాప్రమాదము! వీరికి అబద్ధమగు వేదమును గంగిరెద్దులవలె తల లాడించుచు అప్పగించుట మాత్రమే వచ్చును. ఎంత వారితోనైనను, వారికంటె తామే అధికుల మైనట్లు వీరు ప్రవర్తింతురు. దౌర్భాగ్యవశమున నట్టిమూఢులకే ఈ రాజ్యమున విశేషగౌరవము కలదు. వీరేమి వ్రాయగలరు? వ్రాసినను అందముగా వ్రాయుట ఎన్ని జన్మముల నభ్యసించిన వీరికి రాగలదు? ఈ ఛాందసులకు లెక్క లేమి యవగతము కాగలవు? రాజ్యతంత్రము వీ రేమెరుగుదురు? దీని ఫలము ప్రభువులు త్వరలోనే తెలిసికొందురు. అప్పుడు వారే మనతో కాళ్ళ బేరమునకు వత్తురు. తొందర ఏమి?— "

ఇట్లు వారిలో వా రనుకొనుచుందురు. ఒక వంక 'తొందర యేమి?' యనుచునే యుందురు. మరియొకప్రక్కను వారి చిత్తములు అలజడి చెందుచునే యుండును. వారి మనస్సులలోని తొందర స్పష్టముగా వారి దేహములలో నాపాదమస్తకము ప్రతిబింబించుచునే యుండును. ప్రభువులను, బ్రాహ్మణకరణములను నోరారార తిట్టుదురు. తిట్టుచున్నకొలదియు వారికి వారిపై ద్వేష మతిశయించును.

కరణపాఠశాలలలో చేరిన బ్రాహ్మణులు వారికి వీథిలో కనబడినచో వారిని ఏదోవిధముగా వారు పరిహాసము చేయుదురు. వారికి వినిపించునట్లు తమలోతాము

తిట్టుదురు. వారు పెట్టుకొనిన బిళ్ళ గోచీలనో, శిరస్సులపై ప్రకాశించు శిఖలనో, పైయుత్తరీయపు చెంగులనో, ఎరుగనట్లే యుండి లాగుదురు. వారు వెనుకకు తిరిగి చూచుకొను లోపున దూరమై కిలకిల నవ్వుదురు. ఒంటరిగా వారు దొరకినయెడల, నట్టివారిని అటునిటు చూచి ప్రహరించి సందుగొందులలో దూరి పారిపోవుదురు. అందుచే ఈ క్రొత్తగా లెక్కలు నేర్చుకొనువారు ఒంటరిగా చీకటివేళల నగరవీథుల సంచరించుటయే ప్రమాదభూయిష్ఠమయ్యెను.

వారు చెప్పుకొను పాఠములు ప్రారంభించుట సామాన్యముగా మధ్యాహ్నము నుండియే. ప్రతిదినమును నాటికరణము లందరు నాపాఠశాలలకు వచ్చుచుండుటకు వారికి తీరుబడి లేదు. అందుచే కొందరే వచ్చుచుందురు. ఆ పాఠశాలలును ఒక్కచో లేవు. స్వయంభూదేవాలయావరణమునను, ఏకవీరాదేవి, చముడేశ్వరీశక్తి, భైరవస్వామి, ముసానమ్మ, కొమరసామి, పాండవుల గుడి, వీరభద్రేశ్వరుడు, మాహూరమ్మ, కామవల్లి, మహాలక్ష్మి, కాకితమ్మ — ఇత్యాదిదేవతల యాతనము లందును, కొన్ని కరణపాఠశాలలు పెట్టిరి. మరికొన్ని పెద్ద ధర్మసత్రముల మధ్యభాగమున గల మండువాల చుట్టును సాగుచున్నవి. అయినను అవి చాలవు. ఆరువేలమంది చదువుచుండిరాయె! కొన్ని కొన్ని పాఠశాలలు నగరములో మధ్యమధ్యగల విశాల ప్రదేశములలో, తాత్కాలికము లగు, వెదురు తాటియాకు కొబ్బరియాకు రెల్లు అడవి యాకు మొదలగు పరికరములతో నిర్మింపబడినవి. వాని కెల్లప్పుడును అవసర మగుచు వచ్చిన తడకలు సిద్ధముచేయుచు మేదరవాడ రాత్రింబవళ్ళుపని చేయుచుతీరిక లేకుండెను.

ఇట్లుతాత్కాలికము లగు సాధనములతో నిర్మింపబడిన పాఠశాలలు ఉద్యోగములు పోయిన చిల్లరకరణములకు కన్నులు కుట్టించుచుండెను. ఈ రాత్రి బ్రాహ్మణవాడలో నట్టి పాఠశాల యొకటి పరశురామప్రీతి యగును. ఇంకొకటి రేపు అక్కలవాడలో కూలిపోవును. మరునాడింకొకయెడ గల పాఠశాల కప్పు తెల్లవారునప్పటికి కనబడదు. ఇట్లు పరిపరివిధముల నా పాఠశాలలు సాగకుండ విఘ్నము లొనర్చుట కా దుండగులు ప్రయత్నించుచుండిరి.

అయినను రాజానుగ్రహమును ప్రధానుల యభిమానమును ఉన్నందున ఆ పాఠశాలలలో విద్యాబోధనమున కెట్టి దీర్ఘ నిరోధమును కలుగకుండ అవి సాగిపోవుచుండెను. దహనమైన పాఠశాలకంటె బలిష్ఠ మగు భవనము మరునాటికే అక్కడ సిద్ధమగును. కూలిపోయినది నిలుపబడును. తడకలు పోయిన దానికి ఆచ్ఛాదనము మరల సమయగును. పైపెచ్చు రాత్రిందివమును వానిని రక్షించుచుండుటకు భటులు నియమింపబడిరి. వారును ఆ శాలలపై దుర్మార్గుల యాగడ్రాలినను కఠినముగా పట్టి దండింపసాగిరి.

ఈ పాఠశాలల కన్నిటికి మూలకారణుడు అన్నమంత్రి. అన్నమంత్రిపై ముఖ్యముగా వారి ద్వేషము లగ్న మగుటలో ఆశ్చర్యము లేదు. అందును అతనిపై ప్రత్యేకము ద్వేష మూనిన నాగాచారి నిజముగా నాగావతారమే, ఆశీవిషమే, పన్నగమే, కర్కోటకస్వరూపమే, ద్విజిహ్వాకారమే! అతడు దీర్ఘక్రోధుడు. అత డూహించిన విధమున, తన్ను అన్నమంత్రి యవమానించినదిమొదలు వారము దినము లైన తిరుగకముందే, ఆ మంత్రి రాజమందిరము లో బంధితు డయ్యెను. ఇంకను

ఆ శిక్ష చాలదు. అతని నిర్బంధము ఎంత చిత్రముగా నున్నది! అతని కన్ని మర్యాదలును జరుగుచున్నవి. అయినను అతడు నగరమునందు నాయంతటివాడు లేడని రొమ్ము విరుచుకొని యిప్పుడు తిరుగాడుట లేదు. కాచనగరు వదలి బయటకు వచ్చుటలేదు. తన యింటికైనను వచ్చి చూచిపోవుట లేదు. అతని భార్య లిద్దరుగాని తల్లి గౌరీదేవి గాని ముద్దులకూతురగు బాలాంబగాని యాతని చూడబోవుట లేదు. ధాంవను లగు నలువురు బ్రాహ్మణులుమాత్రము రాకపోకలు సలుపుచున్నారు. ఇప్పు డన్నమంత్రి కూడ వారితోపాటు గంగిరెద్దువలె తల యాడించుట అభ్యసించుచున్నా డందురు. అది కారాగారమున నుంచుట కాదా? కాకున్న నాతనిపై నభిమానముచే నతనికి తగినట్లు శృంఖలములు తగిలింపలేదు. తల తరుగలేదు. బంగారు పంజరములో చిక్కుకొని నట్లయినాడు. మహారాజుల దక్షిణభుజము నని విర్రవీగిన యాతడు నేడు రాజద్రోహి గనే పరిగణింపబడుచున్నాడు!

కాని యీ ప్రభువుల బుద్ధు లర్థము కావు. చాంచల్యము, పక్షపాతము, దురభిమానము, ఆశ్రితవాత్సల్యము వారిని నాశామార్గముల లాగుచుండును. అన్నమంత్రి రాజద్రోహి యైనచో ఆ తిక్కన ఏల కాడు? అతనివెంట వచ్చిన యా పాకనాటికరణములు నూర్వురు నేల కారు? ఆ తిక్కన చెవులకు తగిలించుకొన్న కుండలములు, ముఖమున ప్రకటించు దొంగమార్గ్యమును, ఆ కరణములు మాటిమాటికి చేయు స్వస్తివాచనమంత్రములును ప్రభువులను దిగ్భ్రాంతుల గావించినవి. అన్నమంత్రికి వారి కాశ్రయ మిచ్చినందుకే శిక్షయు, ఆ యాతని యాశ్రితులకే ఈ ఆదరాభిమానములును! నూటిగా నాలోచింపగల మాబోంట్ల కిర్థ మగునా?

ఈ విధముగా నాగాచారియు నతని మిత్రులును సహచరులును ఆలోచించుకొనుచుండురు. కాని వారి యాలోచన తెగదు. తిక్కనపై ద్వేషము పెరుగును. అది వారివెంట నున్న చిల్లరకరణములకు ప్రాకును. ఏమీ యీధైర్యము ఈ తిక్కనకు! మహారాజుల యభయహస్తమే తన్నెల్లపుడు రక్షింప గలదని కాబోలు నాతని యతిశయము!

తిక్కనసోమయాజియు తన వెంట గురునాథుడును మారనయు ననుసరింపగా అన్నమంత్రి గృహమునుండి కేశవశ్రీస్వయంభూదేవాలయములయొద్దకు నిస్తంద్రులై నడచిపోవుచుండుట అనుదినము చూడచూడ వారిలో కొందర కంతకంతకు భరింపరాని దయ్యెను.

ఒకనాటి సాయంకాలమున సోమయాజి యానాటి శ్రీమహాభారతరచనము ముగించుకొని, స్వయంభూసరోవరములో వార్చి, దేవదర్శనము కావించుకొని తిరిగి యింటికి వచ్చుచుండెను. యథాప్రకారము మారనగురునాథులు మాత్ర మాయన వెంట నుండిరి. పైకరణములచే ప్రేరేపింపబడిన కొందరు కర్ణాటకులు మదిరాపాన మత్తులై వారి కెదురు వచ్చుచుండిరి. ఆ త్రిమూర్తులకును ఉన్న రాజానుగ్రహము నాగరకు లెల్లరు నెరిగియున్నందున, నంపరులును, పెద్దలుగాని పిన్నలుగాని, ఎట్టివారైనను ఎదుర్కొనయెడ గౌరవముతో వారికి దారివిడిచి ప్రక్కకు తొలగుచుండుట

పరిపాటి యైనది. ఆనాడు తిక్కనసోమయాజియు మిక్కిలి చింతాపరుడై యడుగులు వేయుచుండెను.

'అన్నమంత్రీశ్వరున కీ నిర్బంధ మేమి? నా కీ విశేషగౌరవ మేమి? ఈ నగరమున నెందు బోవుట కైనను సర్వస్వాతంత్ర్యము నాకు మహారాజులు దయచేసినారు. కాని నా కెం దేగవలసిన యవసర మున్నది? నా త్రేతాగ్నిశాలయు కేశవశ్రీస్వయంభూ నికేతనములును గాక నే నెందు బోవ పని యున్నది? అన్న మంత్రినిగూడ నేను చూచి రావచ్చును. కాని చూచి ఏమి చేయుదును? సామ్రాజ్యపట్టాభిషిక్త దగు మహారాజుచే శిక్షితుడైన యన్నమంత్రీశ్వరుల నైనను మాబోంట్లము దర్శింపవచ్చునా? దోషము కాదా? అతడు నిర్దోషియే. అట్లు నిర్దోషి యని మరల మహారాజులచే నిశ్చితమగువరకు నట్టివానిని మాబోంట్లము చూడరాదు! ఎంత కష్ట మగు వ్రతము! అదియును గాక అన్నమంత్రిని నేను చూచి వచ్చుచుండుట యుక్తమును గాదు. మహారాజుల యాజ్ఞలు చిత్రములై యగమ్యగోచరములుగా నుండును. నే నీ యనుమతి నాధారము చేసికొని అన్నమంత్రియొద్దకు రాకపోకలు సల్పుచుందునేమో పరీక్షించుటకుగూడ నిట్టి సర్వ స్వాతంత్ర్యము మహారాజులు నాకిచ్చియుండవచ్చును.—'

ఈ విధముగా సోమయాజి చింతించుచుండెను. కాళ్ళు మాత్రము సుపరిచిత మగు రాజమార్గమున సాగిపోవుచుండెను. కృష్ణపక్షము! చీకటిగా నున్నది. ప్రక్క నున్న మందిరములనుండి దీపముల వెలుగు రాజమార్గమును మధ్యమధ్య కనులు కనులుగా పడుచు భాసింపజేయుచుండెను.

వా రప్పు డొక చీకటి కనిలోనికి చొచ్చియుందురు. సోమయాజి యాలో చనలో నుండి బాహ్యప్రపంచ మెరుగ కుండెను. ఆకస్మికముగా తన చుట్టును గందరగోళముగా పెద్దధ్వని యగుచున్నట్లు తోచి నిద్రనుండి మేల్కాంచినట్లు సోమ యాజి చుట్టును పరికించెను.

ముందు త్రాగి వచ్చుచున్న కర్ణాటకులు పలువురు సోమయాజులను కొట్టుటకై అన్నిదిక్కులనుండి మూగుచు కేకలు వేయుచు చేతులు కఱ్ఱలు నెత్తుచుండిరి. ఆయనపై గురి చూచిన దెబ్బలన్నిటికి, మారన తన దేహ మడ్డుపెట్టి కాచుచుండెను. గురు నాథుడు సింహమువలె ఆ గుంపులోనికి జొరబడి, చేతి కందిన ట్లెల్ల త్రిమ్మరుచు త్రోయుచు బాదుచు వారిపై విజృంభించుచుండెను. గురునాథు డేటు పోయిన వా నైపునుండి యా త్రాగుబోతుల మూక తొలగి పారుచుండెను. భీమసేనుడు తేరు దిగి వచ్చి కౌరవసేనలు చెల్లాచెదరు చేయుటను, తాను వర్ణించిన దీనాడు గురునాథుడు తన చర్యతో ప్రత్యక్ష మొనర్చుచుండెను. గురునాథుడు త్రోయ త్రోపులకు ఒక్కొక్క సారి నలుగురు, ఐదుగురు, పదిమంది కట్టలు కట్టలుగా వెనుకకు ఒకరిపై నొకరు పడి నేల కరచుచుండిరి. ఆ గుంపులోని వారు గురునాథుని తాకులు తప్పుకొనుచు, ఎట్లో సుకుమార్యుడగు మారనపైకిని వృద్ధు డగు సోమయాజిపైకిని కవియ ప్రయత్నించు చుండిరి. వారు కొట్టుచున్న దెబ్బలతో మారనదేహ మంతయు కమలిపోయెను. అత డెంతసేపటికిని తిక్కనసోమయాజిపై దెబ్బలు పడకుండ కాచుకొనుటయేగాని, తన్ను రక్షించుకొనుటకుగాని యా త్రాగుబోతుల్ను శిక్షించుటకుగాని యత్నింపలేదు. సోమ యాజి నిస్తంద్రుడై నిలుచుండెను.

అంతలో గురునాథు డదిచూచి మహోగ్రు డయ్యెను. మారన సోమయాజుల నిక రక్షింపజాల డని స్పష్ట మయ్యెను. ఆగుంపులో నొకరియొద్దనుండి యొక దండమును గురునాథుడు బలవంతముగా లాగికొని అది మిక్కిలి చాకచక్యముతో త్రిప్పుచు సోమ యాజుల చుట్టు ప్రదక్షిణము చేయుసాగెను. ఆదండ మాతని చేతిలో కాలదండము వలెనే భయంకరమై తాండవింపసాగెను. ఆ యాటోపమునకు ఆ కర్ణాటకుల గుంపు తాళలేక చెదరిపోజొచ్చెను.

సరిగా ఆ సమయమున నొక్కసారిగా అన్నిదిక్కులనుండి శంఖారవములు మారుమ్రోగినవి. నూరుగురు వీరభద్రులతో గండ డాగుంపును చుట్టుముట్టెను. వీరభద్రు లను చూచినంతనే పారిపోవ దారిలేక, ఆ కర్ణాటకులు నిలువున నిలువబడిపోయిరి. త్రావిన మత్తు ఒక్కసారిగా వీరభద్రులు ప్రయోగించిన . కశాఘాతములతో వారికి వదలిపోయినది !

రౌద్రమూర్తియై ఇంకను కర్ర త్రిప్పుచునే యున్న గురునాథునకు గండడు వినీతుడై మ్రొక్కి శాంతింపు డని ప్రార్థించెను. అప్పటికిగాని రాజభటులు వచ్చినారని గురునాథునకు తెలియలేదు. అప్పుడు రోజుచు త్రిప్పుచున్న కర్ర యాపి యాతడు నిలువబడెను. గండ డాముప్పురను పరామర్శించి ఆ కర్ణాటకుల గుంపులో నున్న నలువదిమందిలో నొక్కరినిగూడ తప్పించుకొనిపోనీయక పాశములతో దృఢముగా బంధింప జేసి చెరసాలకు తీసికొనిపోయెను.

గురునాథుని కైదండసహాయముతో మారన ఎట్లో ఇల్లుచేరెను. తిక్కన సోమ యాజి మారనపై కరుణార్ద్రమగు దృక్కులు పరపుచు నతని దెబ్బలు తన యమృత హస్తముతో నిమురుచు తోడ నడచెను.

ఇంటికి చేరగనే మారన నిలువలేక తూలి పడిపోయెను. అన్నమంత్రి యింటి లోని వా రందరును మారనచుట్టు మూగి గురునాథునివలన జరిగిన వృత్తాంత మంతయు దెలిసికొనిరి. అందరును మారనకు సమస్తవిధము లగు నుపచారములు చేయసాగిరి.

కాలమున కెంత వైపరీత్యము వచ్చినది! రాజధానీనగరవీథులలో అన్నమంత్రీ శ్వరునికి పూజ్యు లగు నతిథులను త్రాగుబోతులు చుట్టుముట్టి కొట్ట సాహసించుటా!

అన్నమంత్రీశ్వరుని కుమార్తె బాలాంబ మారనను ఆ స్థితిలో చూచినంతనే బావురు మని యేడ్చుచు నతనియొద్దనే నిలిచిపోయెను. మారనకు శీఘ్రముగనే స్మృతి వచ్చినది. ఎంత చెప్పినను ఆ రాత్రి బాల అన్నము నీరు ముట్టలేదు. నిద్దుర పోలేదు. మారన యున్నచోటినుండి ఈవలకు రాలేదు. మారనబోధకంటె ఆ ఆడేళ్ళపిల్ల యావే దన చూచినవారికి కడుపు తరుగుకొనిపోవునట్లుగా జేసెను. అది మాటిమాటికి 'తాత గారూ, తాతగారూ,—' అని సోమయాజులను పిలుచుచు ఆ [illegible]యంత్రము జరిగిన వృత్తాంత మడుగును. వినుగు లేకుం[illegible]గురునాథు డాదరముతో నది య[illegible]దాని కిల్ల ప్రత్యుత్తర మొసగుచుండెను.

'మా నాన్నగారు చూచిన ఆ [illegible] ప్రాణములతో పోనిచ్చెడివారా?— తాతగారూ, నాన్నగారు ఎక్కడ నున్నారు?' బాల యట్లు ప్రశ్నింపగా గురునాథుని

కన్నుల నీరు గారెను. సోమరాజులకే కన్నులు ఆర్ద్రములై మొగ మావలకు త్రిప్పకొనెను.

## ౨౧

'ణమో అరిహంతాణం ణమో సిద్ధాణం ణమో ఆయరియాణం
ణమో ఉవజ్ఝాయాణం ణమో లోక సవ్వసాహూణం'[1]

పంచనమస్కారము.

కార్తికమాసము వచ్చినది. ఈ మాసము స్మార్తులును శైవులును వైష్ణవులును పరమపవిత్రముగా భావింతురు. జైనులకు గూడ దీపావళి మహాపర్వసమయము. అది వారి సంవత్సరాది. ఆనాడు మహావైభవముతో వారు లక్ష్మీపూజ గావించి, తదాది కార్తికమాసమున లక్ష్మీమహోత్సవములు వైభవముగా జేయుదురు. అందుచే వారికిని కార్తికమాసము మహాపర్వమే!

ఏకశిలానగరమున ఆగ్నేయదిశను మట్టికోట సమీపమున నొక చిన్నగుట్టవంటి గండశైలము కలదు కదా! రాజులు క్రీడాశైలముగా చేసికొన్న గండశిలకంటె నిది మిక్కిలి చిన్నది. అందుచే నిది చేరువకు బోయిన గాని ఉన్నట్లే కనిపింపదు. ఈ గండశిల నంటి జైనసిద్ధుల వసతి యొకటి పెద్దది గలదు. ఆ శిల నానుకొని దాని చుట్టును ఎన్నియో చిన్నచిన్న గదులు గల మందిరములు నిర్మింపబడినవి. ఒక్కొక్క గదిలో ఒక్కొక్క జైనశ్రావకుడు వాసము చేయుచు, నందు తపస్సు చేసికొనుచుండును.

అర్హాతస్థితి నధిగమించుట జైనులలో నుత్తమోత్తమస్థితి. అర్హాతులును రెండువిధములు. అందు మొదటివారు తీర్థంకరులు. అట్టివారింతవరకు ఇరువదినలుగురు మాత్రమే అవతరించిరి. జైనధర్మము క్షీణప్రాయమైనప్పుడెల్ల అట్టివారు దాని నుద్ధరించి చతుర్విధ మగు జైనసంఘమును స్థాపింతురు. ఆ తీర్థంకరులలో ప్రథముడు ఋషభనాథుడు. వారిని నాథశబ్దాంతముగా స్మరించుటయు కలదు. ఆ ప్రథమతీర్థంకరుని, నందుచే ఆదినాథు డని వ్యవహరించుటయు జైనసంప్రదాయము. ఇరువదినాల్గవ తీర్థంకరుడు వర్ధమానమహావీరుడు. ఈ రెండవవిధమగువారిని కేవలు లందురు. వీరును తీర్థంకరులవలెనే, ఆత్మకు గల నాలుగు కషాయములను నిర్జించి కర్మబంధమును త్రెంచివేసికొని ఆత్మను స్వస్వరూపమును బొందించుట యను మోక్షమును పొందినవారే. దగ్ధమైన బీజమునుండి ఎన్నడైన మొలక యంకురించునా? వారు కర్మబీజము దగ్ధము చేసినవారు. అందుచే వారికి భవాంకురము పుట్టదు. ఇట్లు కర్మక్షయము

1 అర్హాతులకు నమస్కారము. సిద్ధులకు నమస్కారము. ఆచార్యులకు నమస్కారము. ఉపాధ్యాయులకు నమస్కారము. లోకమునందు సర్వసాధువులకు నమస్కారము!

చేయుటచేతినే అట్టివాడీశ్వరుడగును. అంతియే కాని నిత్యముక్తుడును సనాతనుడును నగు నేకొక యీశ్వరుడున్నాడని జైను లంగీకరింపరు.

'కేవలం' డగుటకు రెండుమార్గము లున్నవి. అందులో నొకటి దగ్గర దారియే కాని బహుకష్టసాధ్య మైనది. ఇది జైనసన్యాసు లవలంబించు సాధుచరిత్రము. రెండవమార్గము సులభమైనదే కాని దానివలన బహుకాలమునకు గాని సిద్ధి లభింపదు. ఇది సామాన్యు లనుష్ఠించు గృహస్థధర్మము.

ఇప్పటికి సంవత్సరమునుండియు ఆ జైనవసతిలో నొక మూలనున్న గదిలో ఒక సాధువు వాసము చేయుచుండెనట. అత డిన్నినాళ్ళును తలుపులు తీయకుండు డని నియమము చేసి ఆ గదిలోనే ఉండెనట. ఇన్నినాళ్లును అతడు బయటికి వచ్చి యుండుటగాని లోపలి కేగుచుండుట గాని ఆ వసతిలో నెవ్వరును ఎరిగియుండలేదట. ఈ సంవత్సరకాలమునుండియు ఆగదిద్వారము ఎల్లప్పుడు లోపలను బయటను బంధింప బడియే యుండును. ఒక్కొక్కమారు అందులోనుండి ఘంటానాదము వినవచ్చును. మరియొకతరి దివ్యగాంధర్వము వినిపించును. ఇక కొన్ని సమయములలో అంతర్గర్భిత మైన ప్రణవనాదమే యందుండి వెలువడుచుండును. ఆ సాధువును సేవించుటకై ఇంద్రాదులును యక్షగంధర్వులును వచ్చుచుందు రని చెప్పికొందురు. ఆ వసతిలోని పరిచారకులు తా మా గదిలోనుండి వింత సంభాషణలు పలుమారు వింటిమని చెప్పుదురు. జైనశ్రావకులు పలువురు అర్ధరాత్రపూజ కావింతురు. అట్టి పూజ తాము చేయుచుండగా కొన్ని చీకటిరాత్రులందు ఆ గది దేదీప్యమాన మగు నక్షత్రరూపము పొంది యాకాశవీధిలోని కెగిరిపోయి కనరాకుండుట కన్నులార తాము చూచితి మని యక్కడి శ్రమణులు చెప్పుచుందురు. అట్లు చెప్పుచు, వారే తాము ప్రత్యక్షముగా చూచిన యీ యమానుషవిశేషము ఎట్లు సాధ్య మయ్యెనని పరస్పరము తర్కించు కొందురు. దీర్ఘముగా వారు సమస్త విషయములు సమన్వయించి, యీ గదిలో నున్న సాధువు పంచభూతములను తన వశము చేసికొని వాని కతీతుడైన యొక మహాసిద్ధ పురుషు డని నిశ్చయము చేసిరి.

ఈ మహాపురుషుని మహత్త్వవిశేషములు దినమున కొక క్రొత్త రీతిగా ఆశ్వ యుజమాస కృష్ణపక్షమునుండి ఏకశిలానగరమం దెల్లెడల వ్యాపించుచుండెను. జన సమూహమున నా సిద్ధుని దర్శింపవలె నను నుత్కంఠ విపరీత మయ్యెను. సిద్ధుని దర్శించి ఏమిచేయుదురో వా రాలోచింపరు. అదియొక వెర్రి. నగ్నతవివక్షత లేకుండ, పౌరులు ఆ సిద్ధుని దర్శనమునకై ఆ వసతికి మూగసాగిరి. కాని ఎప్పుడును ఆ సిద్ధు డుండు గదితలుపులు వేసియేయుండును. దాని సమీపమున కైనను ఎవ్వ రని రానీయరు. కాని ఎట్టి సాధనము లేకుండ మహాత్ముల దర్శనము చేసినంత మాత్రముననే కృతార్థత నొంద నుంకించు జనసమూహము లను ధన్యులు కాకుండ ఎవ రడ్డగలరు ? ఆ సిద్ధుని చూడకపోయినను, ఆ సిద్ధుని గదిసమీపమున కైనబోనీయ కున్నను, దూరమునుండియే వా రాత డుండు గది దర్శించియే, లోపల నున్న మహాసిద్ధు నికి నమస్కరించి చెంపలు వేసికొని కృతార్థుల మైతిమని వెడలిపోవుచుందురు. మరి కొందరికి ఆగదిలోనుండి ప్రణవనాదము వినిపించును. కొందరికా గోడలలోపల దివ్యతే

జన్ను స్పష్టముగా భాసించును. అట్టివారు ప్రక్కనున్నవారితో 'అదుగో, దివ్యకాంతి కనబడుటలేదా, ఎంత బాగున్నది!' యందురు. ఆ ప్రక్కనున్నవారికి అట్టి కాంతి యేమియు గోచరింపదు. వారికి వట్టి గోడలే కనిపించును. అందుచేవారు తమ పాపిష్ఠి జన్మములకు తమ్ము నిందించుకొందురు. అట్లు తలంచుచుండగనే వారిలో నొకడు, 'ఆ గదిలో గాజుగుప్పెలోని దీపమువలెనే ఒకానొక హిమావృతకాంతి కనిపించుచున్న'దనును. మరి యొకడు కన్నులు మూసికొనుచు; 'మంచు కప్పిన కాంతి యేమి, కోటిసూర్యుల కాంతి యదిగో, చూడలేకున్నాను. కనులు మిరుమిట్లు గొలుపుచున్నవి!' అని పలుకును. వేరొకని కందులో మహాగ్నియే మండుచున్నట్లు కనిపించును. ఇంకొకని కన్నులకంటె చెవులు సూక్ష్మమైనవి. అందుచే వానికి సంగీతము వినిపించును. ఒకరికి దివ్యధూపముల వాసన ఘ్రాణముల ప్రవేశించును. మరియొకరు, 'ఏమి యీ యామోదము! ఈ లోకములో ఏ పూవు కిట్టి సుగంధము కలదు?' అని ప్రశ్నింతురు. ఇంకొకడు, 'అయ్యో, అదిగో పులి!' అని పెద్దగా నార్చి మూర్ఛిల్లును. 'పాప మీతని కెట్టి పాపిష్ఠి యూహ వచ్చినదో, శిక్ష పొందినాడు!' అని ప్రక్కవా రందురు. ఆ పాపిష్ఠి మనుష్యుని జూచినందున తమ పుణ్య పురుషత్వము వారి కతిశయించును. వారా మూర్ఛితునిపై జాలినొంది యతని చెవులలో 'ణమో అరిహంతాణం....' ఇత్యాది పంచ నమస్కార ముచ్చరించి యతనిని తేర్చి నెమ్మదిగా నావలకు తీసికొనిపోవుదురు. ఇట్లు భయమును భక్తియు జనసమూహములో నా సిద్ధునియెడ దినదిన ప్రవర్ధమానము కాజొచ్చెను.

సిద్ధుని జూచు నవకాశము చిక్కనందున భక్తుల కా గదిపై గౌరవము ప్రారంభించెను. ముందు కొందరు ఆ గదిముందు దానికి శీతాతపములు తగులకుండ వెదురు తడకలతో ఆచ్ఛాదనము నిర్మింపజేసిరి. ఆ పిమ్మట రెండుమూడుదినములలో నచ్చటికి చూడవచ్చిన ధనవంతు డది చూచి, వెంటనే శిల్పుల నియమించి ధృఢ మగు శిలా ప్రాకారమును మండపమును నిర్మింపజేసెను. మరియొకడు దానిప్రక్కనే యారామ మొకటి వేయించెను. భక్తుల భక్తి యతిశయించినకొలదియు నా గదిలో నున్న సిద్ధ మూర్తిని దర్శించు నవకాశము దూరదూర మగుచుండెను.

ఇట్లుండ జైనసంవత్సరాది ప్రాంతమున ఆ సిద్ధమూర్తి భక్తులకు దర్శన మీయనున్నాడని యొక వార్త నగరమంతట వ్యాపించెను. దీపావళి అమావాస్యనాడు వసతిలో మహోత్సవము జరుగును. పద్మాక్షీ యాలయమున హనుమకొండలో గొప్ప పూజలు జరుగును. ఆనాడు ఈ వసతినుండి యావల రెండు క్రోశముల దూరమున నున్న పద్మాక్షీ యాలయమువరకు జైనభక్తులు బారులు తీరిపోవుచుండిరి. జైనులకు ఉష్ణీషబంధము పవిత్ర మగు సంస్కారమువంటిది. ఉష్ణీషబంధము చేసినపిమ్మట కుమారునికి గూడ నింటిలో పూర్వము లేని స్థాన మేర్పడును. నలుగురిలో నట్టివానికి గౌరవమును ఉండును. అందుచే వారికి ఉష్ణీషధారణము నియతము. వారును రంగురంగుల వస్త్రములు, పట్టువి, నూలువి, జరీవి, అద్దకములవి, తలల మనోహరాకారముల ధరించి, బారులు బారులుగా రాకపోకలు చేయుచుండ, ఓరుగల్లునుండి హనుమకొండ వరకు, ఒక్కసారిగా ఊర్ధ్వలోకములనుండి సాధుపురుషులు పద్మాక్షీదేవిని సేవించుటకును సిద్ధుని దర్శించుటకును దిగివచ్చిరా యనిపించుచుండెను.

ఆనాడు సిద్ధదర్శన మగునని పౌరజానపదులలో నొక సంచలన ముదయించెను. ఆత డుండు గది సమీపమున గల శిలాతలమున ధ్యానమగ్నుడై దర్శన మిచ్చుననియు వార్త ప్రాకెను. జన మానాడు విశేషముగా వసతిముందు కూడిరి. కాని యానాడు వారి కాతనిదర్శనము కాలేదు. కాని వారి కాశ పోలేదు. పాడ్యమి, విదియ, తదియ, చవితి—నాళ్ళ నర్ధరాత్రమువరకు భక్తులా భాగ్యమునకు వేచియుండిరి. కాని ఆ మహామహుని దర్శనము వారికి ప్రాప్తింపలేదు.

అట్లు దినదినము నిరాశాహతులై వెనుదిరిగి భక్తులు వెడలుచుండిరి. వారి యుత్సాహ మెన్నాళ్ళు నిలువగలదు? పంచమినాడు సాయంత్రము వచ్చినవారి జనసంఖ్య తగ్గిపోయినది. ఆ వచ్చినవారును తలలు పైకెత్తి ఆ గండశిలాతలమును చూచి చూచి హతాశులై అందులో పలువురు తమ యిండ్లకు వెళ్ళిపోయిరి. దూరమున ఉడువీథిని శిఖరావలంబి యగు అంధ్రరాజు మేసాలపై గడియారమున నుండి పన్నెండుమారులు ఘంటానాదము మ్రోగి స్పష్టముగా వినవచ్చెను.

అప్పు డాకస్మికముగా నా గండశిలాతలముపై ఒకమూర్తి కనబడినట్లయ్యెను. ఏదో యొక మూర్తి యేమి? యోగసమాధినిష్ఠు డగు నా మహాయోగి మూర్తియే ప్రత్యక్ష మయ్యెను. ఎన్నాళ్ళకు భక్తుల కోరిక సిద్ధించినది. ఆ దర్శనభాగ్యమునకు నోచుకొన్న యా కొలదిమందిలోనుండియే హర్షనాదము లుప్పతిల్లెను. కొందరు ఆ సిద్ధునికి మ్రొక్కువారైరి. కొందరు 'రక్షించు తండ్రీ, రక్షించు' అనువారును, 'ధన్యులము ధన్యులము!' అనుకొనువారును—ఇట్లు వివిధ భాష లాడుచు కోలాహలము చేయసాగిరి. కొందరు ధూపము లర్పించిరి. దీపదర్శనము జైనాచారము కాకపోయినను, ఆ వచ్చిన వారిలో కొందరు దీపములను సమర్పించిరి. కొందరు పుష్పాంజలు లర్పించిరి. కొందరు టెంకాయలు కొట్టిరి. కొందరు పచ్చకర్పూరముతో మంగళారార్తికము లిచ్చిరి. కొందరు పాటలు పాడిరి. కొందరు భజనలు సాగించిరి. కొందరు జయజయధ్వానము లొనర్చిరి. కొందరు బహుపరాకులు ప్రారంభించిరి.

అంతలో నా సిద్ధుడు వారి నందరి నాశీర్వదించుచున్నట్లు తన దక్షిణహస్తము నెత్తెను. దానితో నక్కడనున్న కొలదిజనమును పొంగిపోయి పరవశులే యైరి.

వా రట్లు చూచుచునే యుండిరి. వారు చూచుచుండగనే, అంతలో నా సిద్ధు డంతర్హితు డయ్యెను!

ఇత డెట్లు శిలపైకి వచ్చెను? మరల ఎట్లు పోయెను? ఎక్కడనుండి వచ్చెను? ఎందు బోయెను? ఇప్పు డేయెడ గలడు? ఏమి మహాత్మ్యము! ఏమి మహాత్మ్యము!— మర కీనాటికి మరల దర్శన మగునా?—కొంతసేపు ఆశ లేకుండ నిరీక్షించి యోగిని పరపరివిధముల గీర్తించుచు ఎవరి యిండ్లకు వారు వెడలిపోయిరి.

మరునాడు వసతికి జనులు పొరలబడి వచ్చిరి. కాని యానాడు వారికి సిద్ధుని దర్శనము కాలేదు. అట్లే మరికొన్నాళ్ళును కాలేదు. కాని దశమినాడు మరల పూర్వమువలెనే ఆ యోగి భక్తులకు దర్శన మొసగెను!

ఇట్లు రెండుమూడు లాతడు దర్శన మిచ్చెను. ఎందరో అతని జూచిరి. అయినను అతని రూపమునుగూర్చి ఒకరు చెప్పినట్లు మరియొకరు చెప్పరు. ఒకరు బాలునివలె నున్నా డందురు. ఒకరు ఒడ లంతయు సడలిపోయి పండువృద్ధువలె స్పష్టముగా గోచరించె నందురు. ఒకరు నిండుయౌవనములో నుండి సుస్ఫురద్రూపిగా కనబడె నందురు. ఒకరాతడు శ్వేతాంబరము ధరియించియుండె నందురు. ఒకడు, 'ఈదిగంబర జైనుల వసతిలోనికి శ్వేతాంబరభిక్షు వెట్లు వచ్చును, దిగంబరుడుగనే కనిపించె' నని వాదంచెను. ఒకడు 'శ్వేతాంబరుడు కాడు, దిగంబరుడు కాడు! అసలు భిక్షువే కాడు. శిరస్సుపై ధగధగలాడు నుష్ణీషమును, దాని క్రింద నల్లని శిరోజములును పెద్ద మీసమును స్పష్టముగా నేను చూచితి' నని నిష్కర్ష చేయును. ఒక రాతడు 'నల్లనివా' డనగా విని, 'అయ్యో, మీకు కన్ను లేమైనా జబ్బా? అంత ధగధగలాడుచు తెల్లగా నుండెనే!' అని ఇంకొక రందురు.

అందరును దూరమునుండి చూచినవారే! చీకటివేళ చూచినవారే! ఎవరి యూహప్రకారము వారికి ఆ మహాసిద్ధుని రూపము భాసించుటలో నాశ్చర్య మేమి!

అదియును గాక అర్హతులకు రూప మేమిటి? ఒక నిర్ణీతమైన రూపము సామాన్య మానవులకే గాని సిద్ధుల కట్టిదానితో నిమిత్త మేమి? అర్హతులు నిజముగా శరీరము లేనివారే! వారు నిర్జరులు! సామాన్యవ్యవహారదృష్టిచే మాత్రమే వారు శరీరము కలవారు. ఆశరీరము 'ఔదారిక మే'. అది వేయిసూర్యుల కాంతి కలది. మన బోంట్లకు ఎన్నిరూపములతో నైన నది భాసింపవచ్చును — ఇట్లచ్చట చేరిన జైనవిద్వాంసు డొకడు స్వరూపనిష్కర్ష చేసి యందరకు సంశయనివృత్తి కావించెను.

దీని ఆ జైనవసతిపై జనసమూహమున గౌరవాదరప్రపత్తులు విశేషమయ్యెను. అయితే దురదృష్టవశమున నాకాలముననే రాజపురుషుల దృష్టి యావసతిలో కొన్ని భాగములపై కఠినముగా ప్రసరించెను. అందుకు కారణము వారికి ఆ సిద్ధునిపై గాని వసతిలోని ఇతరయతులపై గాని ఏలాటి సందేహమును గలిగి కాదు సుమా!

మరి యది యెట్లు సంభవించెను?

## ౨౮

శ్రీ రుద్రదేవమహారాజు ఏకశిలానగరమునకు బలిష్ఠమగు శిలాప్రాకార మొకటి వెంటనే నిర్మింప నిశ్చయించెనుగదా! ఆ నిశ్చయమైన దాది సంభారములు చురుకుగా చేర్పింపబడుచుండెను. స్థపతులును మాపకులును సూత్రధారులును కరణములును ముందు ఆ శిలాప్రాకారమునకును దాని కందకమునకును కావలసిన ప్రదేశము నిర్ణయించి గుర్తులు వేయుచుండిరి. ఆగుర్తించిన ప్రదేశములలో పలువురు పేదలయు కొందరు ధనవంతులయు గృహారామక్షేత్రములు పడినందున అవి తీసివేయ వలసివచ్చెను. రాజపురుషులు పేదవారికి వేరు నివాసప్రదేశములు చూపి వారల నిండ్లు కట్టుకొనుటకు

వస్తురూపమునను సహాయము చేయ నేర్పాట్లు చేయుచుండిరి. ధనవంతులకును అట్లే యథోచితముగా నష్టపరిహారము గావించుచుండిరి. ఇవి యన్నియు లెక్కలు వేయుగా బహుద్రవ్యము కావలసివచ్చెను. ఐనను ఎంత వ్యయమునకైనను వెనుదీయక పనులు వెంటవెంటనే సాగింపవలసిన దని రాజాజ్ఞ యయ్యెను.

ముందనుకొన్న విధముగా ఓరుగల్లుకు దూరమున గల ఇనుపరాతిగుట్టనుండి గండశిలలు రేయింబవళ్ళు బండ్లమీదను యంత్రములమీదను యథోచితస్థానములకు చేరుచున్నవి.

కట్టదలచిన ప్రాకారకుడ్యమునకు ఈవైపున నావైపున రెండువైపుల రెండు రాతిగోడలు కట్టి, ఆ రెండురాతిగోడల మధ్యనున్న భాగ మంతయు మట్టితో పూరించి, అంతయు నొకటే శిలాప్రాకారముగా చేయుట దాని నిర్మాణపద్ధతి! ఈపద్ధతి యవలంబించుటచే నెన్నియో సౌలభ్యములు చేకూరెను. అంతయు శిలలతో నిర్మించినచో ఎన్నియో పర్వతములే కొట్టితెప్పించినగాని పని పూర్తి కాదు. అది ఎప్పటికి సాధ్య మగును? అదిగాక కోటగోడ మధ్యభాగమున మట్టియే యున్న రాకపోకలకు ఏకాలమునసైనను ఏవేళ నైనను ఎక్కువ సౌకర్య ముండును. అది యునుగాక కందకము త్రవ్వగా వచ్చిన మట్టి ఏమి చేయుట? అది దూరము చేర్చుట అధికవ్యయప్రయాసలతో కూడినపని. అట్లుకాక అది కందకముప్రక్కనే పోసినచో, నది యొక కొండవలె పెరిగి స్థల మాక్రమించుటయే కాక, దండెత్తివచ్చు శత్రువుల సైన్యములకు గోడగా నేర్పడి, వారికి రక్షణ కుపయోగపడవచ్చును. మరియు వర్షాదుల కా మట్టి కారి కందకములోనికి కొట్టుకొని వచ్చి పూడ్చివేయుచుండును. అందుచే కందకము తరుచుగా మరలమరల త్రవ్వింపవలసిన పని ఏర్పడగలదు. రెండు రాతి గోడల మధ్యప్రదేశమును ఆమట్టితోడనే పూడ్చివేసినచో అన్నివిధముల సులభమగును.

అందుచే నగర్తయు శిలాప్రాకారనిర్మాణమును ఒక్కపర్యాయమే ప్రారంభింపబడెను. అగర్త త్రవ్వించుటలో నా స్థలమున గండశిల లున్నట్లు కనుగొనబడెను. వెంటనే స్థపతు లాశిలలు పరీక్షించి దానినే శిలాప్రాకారనిర్మాణమునకు వాడుకొనవచ్చు నని నిర్ధారణచేసిరి. కందకప్రదేశము పొడుగునను త్రవ్వి పరీక్షింపగా నట్టి శిలలు దొరకెను. దానితో యోజనదూరమున నున్న ఇనుపరాతిగుట్టనుండి గండశిలలు తెప్పింపవలసిన యవసరము తప్పిపోయినది. కందక ప్రదేశములో దొరకిన శిలలే మహారాజుపాలిటికి రత్నముల గనిగా భాసించెను. ఎంతయో వ్యయప్రయాసలు తగ్గిపోయినవి. ఇది రుద్రదేవమహారాజులకు గొప్ప శుభసూచనముగా శాకునికులు నిర్ధారణచేసిరి. పనికూడ శీఘ్రముగా సాంతమగు నవకాశమును జిక్కినది.

శ్రీరుద్రదేవమహారాజుల యదృష్ట మంతటితో నాగలేదు. ఆ కందకము త్రవ్వుచుండగా అచ్చట నిజముగా బంగారు వెండి రత్నములు నున్న నిధులుగూడ ఎన్నియో దొరకినవి. అవియన్నియు రాజకోశమునకు చేరెను. ఈ నాడొక నిధి దొరికిన దని యందరు నాశ్చర్యపడుచుండ, నంతలో మరయొకయెడ ఇంకొక నిధి కనిపించును. శ్రీరుద్రదేవమహారాజుల యదృష్టమును జ్యోతిషికుల యద్భుతప్రజ్ఞను ప్రజలందరు శ్లాఘింపజొచ్చిరి. ఆవిధముగా విశేషధనము లభించుటచే శిలాప్రాకార

నిర్మాణ మంతయు నా దొరకిన నిధుల ద్రవ్యముతోడనే సరిపెట్టవచ్చు నని తోచెను. అట్లు విశేషధనము లభ్య మైనందున మహారాజు ద్రవ్య మంతయు తానే అనుభవింప దలంపలేదు. పరిఖాప్రాకారముల క్రింద తమ గృహారామాదులు కోల్పోయినవారి కందరకు ముందటికంటె ఇబ్బడిగా ధనము బహూకరించుటకును పనివారికి బత్తెము లెక్కువ చేయుటకును మహారాజు శాసించెను. దానితో ప్రజలందరు, పెద్దలును, పిన్నలును, శ్రీరుద్రదేవమహారాజుల వితరణము వేనోళ్ళ శ్లాఘించుచు, యథాధికార ముగా వారి కాశీర్వాదములును నమస్కారములును గావించుచుండిరి.

ఇట్లు అగడ్తక్రింద రావలసిన స్థలములో జైనవసతిలో నొక ప్రక్కను ఊరక పడియున్న కొంతస్థలముకూడ పడినది. అది మాసములు కొలతవేయగా, సూత్రధారుల సాయముతో స్థపతులు దాని వేరుచేసి గుర్తింపజేసిరి. కరణములు దానికి పరిహారముగా నెంతధనము చెల్లింపవలసియుండునోకూడ లెక్కలు కట్టి నిర్ధారణ చేసిరి. అట్లు కాక వసతియధికారులు అంత స్థలమే కావలె నని కోరికొన్నను, ఆవలివైపున నంత స్థలమును సంపాదించి వసతి కిప్పించుటకును రాజపురుషు లేర్పాట్లు కావించిరి.

రాజపురుషు లట్లు గుర్తించి మేకులు పాతిపోయిన మరుసటినాటి యుదయమున జూడ సరిగా నేమినాథతీర్థంకరుని విగ్రహ మాప్రదేశమున వెలసియుండెను. అదియును క్రొత్తగా పెట్టినట్లు లేదు. భూమిలోనుండియే పగులగొట్టుకొని పైకివచ్చినదా యన్నట్లు చూపరకు తోచుచుండెను. విగ్రహము వెలసినచో పూజించు భక్తుల కేమి కొదువ? రాజపురుషు లక్కడికి వచ్చునప్పటికి నేమినాథదేవుని పూజించుటకు భక్తులు తండోపతండములుగనే వచ్చుచుండిరి.

అది చూడ రాజపురుషుల కేమియు దోచలేదు. వెంటనే వారు ఆ వసతి ప్రధానాచార్యు డగు సిద్ధనందిని దర్శించి నమస్కరించి విషయము నివేదించిరి.

సిద్ధనంద్యాచార్యులు మిక్కిలి వృద్ధులు. ఆయన కీ లోకముతో నిజముగా సంబంధమే లేదు. చిరకాలము సిద్ధసాధన లొనర్చి, అర్హాతపదవి నొందుటకు అధికృతుడై, జైనపరిభాషలో సర్వకషాయములు వదలి నిర్జరు డైయున్నాడు. కర్మబంధము నాయన తూలించుకొనెను. వసతిలోని యాచార్యులం దెల్ల నాయన వృద్ధు డైనందునను పూజ్యు డైనందునను, తప్పనిసరిగా నా వసతికి ప్రధానియయ్యెను. కాని యా వసతి వ్యవహారములలో నాయన క్షోభ్యము కలిగించుకొనుట యెన్నడో చాలించెను. అందుచే ఇతర దిగంబరులే పూజ్యుడగు సిద్ధనంద్యాచార్యుల పత్రములును ముద్రికయు చేకొని వ్యవహరించుచుండిరి.

ఇట్టి స్థితిలో రాజపురుషులు సిద్ధనంద్యాచార్యులకు ఈ వ్యవహారము నివేదింపగా నాయన మాటాడలేదు. ఈ వ్యవహారవిషయము ఆయన మనస్సునకు పట్టినట్లే లేదు. ఆయన చేసిన సంజ్ఞలకు వసతివ్యవహర్తలతో సంప్రదింపు డని యర్థమైనట్లు ప్రక్కనున్నవారు చెప్పిరి. అంతట రాజపురుషులు ఆ ప్రధానాచార్యులకు మ్రొక్కి వ్యవహారశాలకు బోయిరి.

ఆ వసతివ్యవహారశాలలో పలువురు కరణములును ముప్వురు శ్రమణులును గలరు. ఆ ముప్వురు శ్రమణులే వసతి వ్యవహారములు ఇప్పుడు చూచుచున్నవారు.

రాజపురుషులు సగౌరవముగా వారికి మ్రొక్కి, అగడ్తకు గుర్తించిన ప్రదేశమును అప్పగించవలసినదిగా కోరిరి.

కాని యీ వ్యవహర్తల భంగి యపూర్వముగా నుండెను.

“ఏది ఎట్లున్నను అక్కడ వెలసిన నేమినాథస్వామిని ఎవరు తీయగలరు?”

“నిగ్రహానుగ్రహసమర్థులగు మీరే దాని కుపాయ మూహింపవలెను. ఇంతె రాజకార్యము ఆగిపోవు టెట్లు? —అదికాక గుర్తించిన తర్వాత అది అక్కడ క్రొత్తగా పెట్టినదేగదా!”

“మేము పెట్టిన దని యందురా? పాపచింతలు శమించుగాక!”

“మీరు పెట్టిన దనలేదు. ఎవరో తెల్లవారుసరికక్కడ పెట్టిరి. పరిఖకు విఘ్నము వచ్చినది!”

“ఒకరు పెట్టిన నట్టి మూర్తి నిలుచునా? అక్కడ పరిఖ త్రవ్వుట తీర్థంకరులకు సమ్మతము కాదేమో!”

ఎంత చెప్పినను ఇట్లు ఆవ్యవహర్తలు రాజపురుషులకు ఆటంకములు చెప్పిరి.

“ఇది దేవస్వము. మా వసతికి మహారాజుల పూర్వులు దీని నెన్నడో దానము చేసిరి. దానము చేసినదానిని మరల తీసికొనుట ధర్మమా? అదికాక తీర్థంకరులకు అంకిత మైన ప్రదేశములో, ఒక్క సూదిమోపుమేర యైనను వదలివేయుటకు గాని మార్చుటకుగాని మా కేమి యధికారము కలదు? మేము ధనము చేతులతో నైన స్పృశింపమే. అట్టిచో పరధనము లపేక్షింతుమా? ఇక మమ్మును తీర్థంకరుల ద్రవ్య మునే ముట్టుడని మీరు కోరుదురా? అట్లు చేసి జన్మజన్మలలో విధిగా వచ్చు బాధలు మేము పడజాలము!—”

ఈవిధముగా నున్న దా వ్యవహర్తల వైఖరి మొత్తముమీద! రాజపురుషు లెన్నివిధముల జెప్పినను వారు వినలేదు! ఆవల దానికి రెండింతలు స్థలము ఇప్పింతు మన్నను వా రంగీకరింపలేదు. విశేషధన మిప్పింతు మనిరి. వారు వినలేదు. తుదకు ఆ నేమినాథ విగ్రహమును అక్కడ తెల్లవారుసరికి పెట్టించినవారు కూడ వీరే యని రాజ పురుషులకు మనస్సులలో నిశ్చయభావ ముదయించెను.

ఆ రాతికోట నిర్మాణకార్యక్రమమునకు సర్వాధికారిగా అంబదేవుని శ్రీ రుద్ర దేవమహారాజు నియమించియుండెను. ఆ వసతితో వచ్చిన చిక్కు రాజపురుషులు వెంటనే సర్వాధికారి యగు నంబదేవునికి నివేదించిరి. అంబదేవుడు ఒక్క కొంత తడవు ఆలోచించెను. ముందు తనకు స్థపతులు చూపియుండిన కోట అగడ్త ఇత్యా దుల నిర్మాణచిత్రములలో నది యా వసతి నాని పోవుచున్నట్లే జ్ఞాపక మున్నదికాని వసతిప్రదేశముపైనుండి పోవుచున్నట్లు లేదు. ఆ జైనవసతియే కాదు. ఏదేవస్వదేశ మునుగూడ ఆక్రమింపవలసిన యగత్యము లేకుండగనే వా రది సిద్ధము చేసియుండిరి. అందుచే ముందు అంబదేవుడు మరల నా నిర్మాణపటములు తెప్పించి పరీక్షించెను. తన స్మృతిలో భ్రాంతి లేదు. పరిఖకు కొంచెము ఎడముగనే వసతి ప్రదేశ మున్నది.

అట్లయినచో ఆ స్థలములోనికి వసతిప్రదేశ మెట్లువచ్చినది? వ్రాయసకాండ్ర తప్పా? ఎక్కడ నున్న దా తప్పు?

ఆ వెంటనే అతడు జైనవసతి కిచ్చిన దానశాసనప్రతి తెప్పించి పరీక్షించెను. మరునాడే దాని ప్రకారము వసతిస్థలమును కొలిపించి దాని సీమలు నిర్ధారణచేసి గుర్తులు పెట్టించెను. ముందు స్థపతు లిచ్చిన పటముల స్వరూపములో తప్పు లేదు. ఇప్పుడు వసతిప్రదేశ మని వసతిపెద్దలు వివదించుచున్న ప్రదేశము వసతిది కాదని స్పష్టపడెను. ఊరక ఆ ప్రదేశ మున్న సమయమున వసతివారు ఆక్రమించినట్లు అక్కడ నొక మొక్క, ఇక్కడ నొక స్తంభము పాతి తమ దనుచుండిరి. ఇప్పుడు ప్రాకార నిర్మాణమునకు విఘ్నము కలిగించు దురుద్దేశముతో నేమినాథుని విగ్రహ మొకటి నిలువబెట్టిన ట్లున్నారు. ఒక్కసారిగా నంబదేవునకు రోషము ప్రకోపించెను.

వెంటనే అతడు వసతి యధికారులకు ఆ ప్రదేశమును అరువది గడియల లోపల ఖాళీచేయించి రాజపురుషులకు నిరాటంకముగా నప్పగింపవలసిన దని ఆజ్ఞాపత్ర మంపెను.

ఆ వసతియధికారు లది లక్ష్యము చేయలేదు. సిద్ధుని యాగమనాదిగా తమ వసతికి జనసామాన్యములో పెరుగుచున్న భక్తిప్రపత్తులు వారి కన్నులకు కొంచెము మైకము కలిగించినవి. అందులో వారి కాపత్రము కార్తిక శుద్ధైకాదశినా డందెను. ఆ క్రిందటిదినమువనే సిద్ధుకు జనులకు గుట్టపై దర్శన మిచ్చియుండెను. ఈనాడు భక్తులు తండోపతండములుగా అక్కడ మూగుచుండిరి. వారిలో కొందరు వసతిచుట్టును ప్రదక్షిణములు చేయుచుండిరి. మరికొందరు వివాదగ్రస్త మగు ప్రదేశమునగల నేమి నాథ విగ్రహమునకు కానుక లర్పించుచుండిరి. ఆ యుత్సవము ఉదయమున నుండి సాయంకాలమువరకే కాక రాత్రియందంతట సాగిపోయెను. వారిలో పలువురు ఏకాదశి ఉపవాసము చేసినవారే. ఆ రాత్రి వారికి జాగరణమును సిద్ధించెను. ఆ రాత్రి జనములో ఆవేశము పెరిగిపోయెను. భజనలు ప్రబలినవి. అక్కడ జనములు ఇసుక వేసిన రాలన ట్లుండిరి.

ఆ జనసమూహములను జూచుచున్న కొలదియు వసతియధికారులకు నిర్లక్ష్య మెక్కువయ్యెను. ఈ సందర్భములో వసతియధికారులు స్వయముగా నా నేమినాథ విగ్రహము తీసివేయుదురా? తీసివేయదలచినను తీసివేయగలరా? ఇదంతయు అంబ దేవుడు సూక్ష్మముగా గ్రహించెను. తీవ్రముగా నాలోచించెను; దృఢముగా నిశ్చ యించెను. కాలవ్యవధి గడచినపిమ్మట ఒక్క క్షణమైనను ఆలసింపక ఆ విగ్రహ మును తీసివేయింపవలెను! దేవతావిగ్రహమును తీసివేయుటకు సామాన్యముగా పని వారు వెనుకాడుదురు. వసతియధికారులు స్వయముగా తీసివేయరు. రాజపురుషులు తీసివేయింపనిచో రాజగౌరవము చులకన యగును. ఇందులో తాను అక్రమ మేమియు జేయుట లేదు. వసతిలోనివారి దుస్తంత్రమును పరిహరించుటే!

పనివారిలో ముఖ్యముగా రెండువిధములవారు కలరు. శిలలు చెక్కుటలో ఎక్కువ నేర్పుగలవారు చాలవరకు జినాభిమానులును జైనభక్తులును. కాని వారిలో కూడ కొందరు బసవమతము స్వీకరించిన లింగబలిజలుకూడ కలరు. ఖనకులు విస్తార

ముగా బసవమతము స్వీకరించిన వీరశైవులే. ఆ వసతితో వివాదకలిగిన ప్రదేశమున మరునాడు పనిచేయుటకు ప్రత్యేకముగ బసవమతస్థు లున్న తండములనే నియోగింప నారాత్రి అంబదేవుడు రహస్యముగా నాజ్ఞ లిచ్చెను.

ఆ మరునాడు సరిగా మధ్యాహ్న మగుసరికి స్వయముగా నంబదేవుడే భటులతో నా ప్రదేశమునకు వచ్చెను. సరిగా నప్పటికి వసతియధికారులకు ఆజ్ఞాపత్రము చేరి అరువదిగడియ లైనది. నేమినాథవిగ్రహ మట్లే యుండెను. అడ్డు లన్నియు దొలగించి యక్కడ సూత్రధారులు గుర్తించినప్రకారము కందకము త్రవ్వించి వేయుటకు అంబదేవుడు స్థపతుల కాజ్ఞాపించెను.

ఒక ప్రక్కను నేమినాథపూజలు జరుగుచునేయుండెను. సమీపమున బని చేయుచున్న లింగబలిజల మధ్యనుండి 'హరహర మహాదేవ!' అను సింహనాదము భూనభోంతరముల నిండిపోయెను. కొందరు నృత్యపరు లైరి. కొందరు పండితారాధ్య చరిత్రమునుండి పరుస లందుకొనిరి.

'నల్లవో! నల్లవో! నగరాజరాజ?
మల్లయా! మల్లయా! మహనీయ తేజ!
పరమపాతకకోట్లు భస్మమై తూలు
సిరిగిరిమల్లన్న శరణన్న జాలు!
శంకరదాసయ్య లెంకమంచయ్య
బంకయ్య శివరాత్రి సంకయ్య శరణు!
ఏలేశుకేతయ్య ఈడె శాంతయ్య
మోళిగమారయ్య మున్నయ్య శరణు!"

కన్నడభక్తుల పరుస యిట్లు సాగినది.

"అజగమదేవయ్య! బిజ మాడిరయ్య
నిజభావదేవయ్య! నీ విత్త బన్ని!

*　　*　　*

హాబ్బుత్త, కొబ్బుత్త, యుబ్బియాడుత్త,
పబ్బత దొడయంగె భక్తి మాడిర భో
హాడుత్త, యాడుత్త, నోడుత్త, బత్తి
మాడిభో! సిరగిరి! మల్లికార్జునగె

*　　*　　*

హరహర! శివశివ! శరణు నీ వెనుగె
సిరగిరిమల్లయ్య శర ణెన్నిరయ్య!"

*　　*　　*

ఆరెభాష మాటాడు మహారాష్ట్రభక్తులీపరుసను నడచిరి.

"ప్రబ్బసంతాపసంసారనాటకనె
ప్రబ్బతమల్లయ్య ప్రబ్బజ్ఞ గాతోఁ !
అమ్చా మగాపుణూ హరజాణచిత్త
అమ్చా మహాభక్త అఖిలసమ్మేళ !"

* * * *

అరువదేశము భక్తులీ పరుసను నడచిరి.

అఱువత్తుమూవరు క్కాత్మనాయకనె
మఱునాలం పరియాదమల్లి కార్జుననె
ఆలాలగండనే యాదియట్రవనె
చూలియే మల్లికార్జుననె యన్నవనె
యెల్ల యిల్లాదానె యెజ్జముళ్ళవనె
చొల్లవల్లానె మల్లిఖార్జునన్నె !

* * * *

వారిలో సంస్కృతము కొంచె మభ్యసించినవారు ఈపరుస యందుకొని పాడసాగిరి.

"మల్లికామాలికామస్తకాభరణ
మల్లికార్జునదేవ మామేవ పాహి !
మల్లికాఘనసార మందారదేహ
మల్లికార్జునదేవ మామేవ పాహి !
మల్లికార్జునయశో మండితశాంత
మల్లికార్జునదేవ మామేవ పాహి !

* * * *

ఈ విధముగా ఆంధ్రమునను కర్ణాటకమునను ఆరెభాషను అరువమునను సంస్కృతమందును పండితారాధ్యచరిత్రములోని పదములు కీర్తించుచు భక్తియు వీరమును ఆవేశించిన యా జంగమలింగమూర్తులు పలుగులు పారలు దూలములు మోకులు తీసికొని ఉద్భటాటోపముతో కుప్పించుచు అచ్చటికి వచ్చుచుండిరి.

అది చూచి నేమినాథు నర్చించుచున్న జినభక్తులుగూడ నానావిధ వీరాలాపము లాడుచు వారి నెదుర్కొన నుంకించుచుండిరి. అంతకు మున్న అక్కడ తన నూరుగురు వీరభద్రులతో సిద్ధముగా నున్న గండడు అంబదేవుని యాజ్ఞచే ఆ జినభక్తుల మంద లించి యంబదేవుల యాజ్ఞ యందరు వినునట్లు ప్రకటించెను. దానితో జినభక్తు లేమియు జేయ సాహసింపక పలువిధముల విలపించుచు తిట్టుచు తొలగిరి. లింగబలిజలు నిరాటంకముగా నా ప్రదేశమున ప్రవేశించి కందకభాగము త్రవ్వివేయుచుండిరి. కొందరా నేమినాథవిగ్రహమును ఎత్తివేయుటకు దూలములకు బుజము లానించి శివ భక్తులు 'హరహరమహాదేవ శంభో!' అని ఊపుగా ఎత్తుచుండిరి.

అప్పుడాదారిన బోవు వ్యక్తి యొకడిట్లుపాడెను.

"కృతకృత్య వరివళిగెను వైజకవ్వ
పతి ధిక్కరించి సద్భక్తిపెమ్క వను
జనుదెంచి చనుతెంచి చక్కన వసది
గని భవాలయ మని కరములు మొగువ
నట జినప్రతిమరూ పప్పుడ వ్రస్సి
పటపట వ్రక్కలై పడగ మధ్యమున
వైజనాథుం డుమావరు డుదయింప
వైజకవ్వయు వికస్వరభక్తిగుహిమ
వసుధ జైనుం డను వార్తయు నడప
నెసగునా డీజైను లెక్కడ సనిరి?"

ఆత డా ద్విపదలు పలుకుచుండగనే శివభక్తులు నేమినాథప్రతిమను ఎత్తివేసిరి. ఆ యావేశములో దాని రూపు లేకుండ ఛిన్నభిన్నము లగునట్లు దూరమున దాని బారవేసెడివారే! కాని రాజపురుషులు అనుక్షణమును వారివెంట నుండి జాగ్రత్తగా వసతిస్థలములో నుంచవలసిన దని ఖండితముగా నాజ్ఞాపించుటచే వారు రాజాజ్ఞలకు కట్టుబడి యట్లు చేసిరి. నేమినాథప్రతిమకు ప్రమాదము రాకుండ తప్పిపోయెను.

అంతలో నచ్చట నొక మహాద్భుతము జరిగెను. నేమినాథుని విగ్రహము తీసివేసినచోటనే ఒక మహాశివలింగము నూర్ధ్వభాగము ప్రత్యక్ష మయ్యెను!

## 23

"శ్రీకంఠాయ నమోనమో నతసురజ్యేష్ఠాయ రుద్రాయ లిం
గాకారాయ నమోనమో విగతసంసారాయ శాంతాయ చం
ద్రాకల్పాయ నమోనమో దురితసంహారాయ తే యంచు ని
న్నాకాంక్షం బ్రణుతించు మానవుడు నీవై యుండు సర్వేశ్వరా!"

(సర్వేశ్వరశతకము)

శివలింగ మచ్చట నట్లు తలవని తలంపుగా అద్భుతముగా నుద్భవించినంతనే భక్తుల కప్పుడు కలిగిన యావేశమునకు మేరయుండునా? ప్రక్కను పోవుచు పండితారాధ్యచరిత్రమునుండి వైజకవ్వగాథ స్మృతికి తెచ్చిన వ్యక్తి ఎవరోకూడ వారు పరికింపలేరు. పనివారు తమలో నొకడే యది చదివె నేమో యనియు తలంచియుండ వచ్చును.

ఆ లింగమూర్తిని జూచినంతనే భక్తులు పలుగులు పారలు దూరమున నుంచిరి. ఆ మూర్తిచుట్టు నున్న మట్టి ఆ సాధనములతో త్రవ్వినచో లింగమూర్తికి దెబ్బ

తగులదా? అందుచే వారు దాని చుట్టునున్న మట్టిని చేతులతోడను వ్రేళ్ళతోడనే పెకలింపసాగిరి. లింగమూర్తిరూపము ఎక్కువెక్కువగా ప్రత్యక్ష మగుచుండెను. అదియును తెల్లగా ప్రకాశించుచున్న జ్యోతిర్మయమగు స్ఫాటికలింగము! అందులో చుట్టు నున్నవారి మూర్తులు ప్రతిఫలించుచు సహస్రలింగమూర్తిగనే భాసించు చుండెను.

"ఈ మహాలింగమూర్తిని జైనహతకులు దొంగిలి తెచ్చి తమ నేమినాథవిగ్రహముక్రింద కుసిరాయిగా ఉపయోగించినారా?— వీరి నేమి చేసిన పాపము లేదు!—" ఇట్టి రోషవచనములు వారు సాగించిరి. కాని యా మహాలింగముచుట్టు నున్న మట్టి తొలగించుటలో వారి రోషావేశము నొందుటకుగూడ తీరిక లేకపోయెను.

ఆ శివలింగము చాలభాగము బయటపడినది. అట్లు లింగోద్భవమైన కాలముననే సరిగా ఒక నూతనపురుషుడువచ్చి, 'శ్రీకంఠాయ నమోనమో—' ఇత్యాదిక పద్యమును పఠించుచు ఆ స్ఫాటికలింగమున కతిభక్తితో ముమ్మారు ప్రదక్షిణ మొనర్చి సాష్టాంగ దండప్రణామ మాచరించెను. అతడు లింగబలిజలలోనివాడు కాడు. స్థపతులలోని వాడును గాడు. రాజపురుషులలోనివాడుగాని రాజభటులలోనివాడు గాని కాడు.! దారిన బోవుచు వైజకవ్యాకథ భక్తుల స్మృతికిదెచ్చిన వ్యక్తి యతడే! అతడు చూచి నంతనే ఆరాధ్యబ్రాహ్మణుడుగా కనిపించుచుండెను.

ఆతని యాకారమే చూపర నాకర్షించుచుండెను. ఎరుపుకలసిన పచ్చని శరీర చ్ఛాయ! విశాలము లగు నాతని కన్నులు అర్ధనిమీలితములై అనవరతశివధ్యానమును వ్యక్తముచేయుచున్నవి. అతని శిరస్సునను కంఠమునను బాహువులను కరములను రుద్రాక్షమాలలు భూషణములుగా విరాజిల్లుచుండెను. దేహమంతయు విభూతిరేఖలు తీర్చియున్నవి. అతని విశాలవక్షఃస్థలముపై బంగారుకవచమున ప్రాణలింగమూర్తి వ్రేలుచుప్రక్కనున్న బ్రహ్మసూత్రములతో నొరయుచున్నది. ఒకానొక విలక్షణ దివ్యతేజస్సు అతని దేహమున తొణికసలాడుచున్నది.

ఆ యారాధ్యదేవుని జూచినంతనే అక్కడిభక్తులకు జంగమరూపమున అవత రించిన సాక్షాత్తు శివుడే ఇతడనిపించెను. భక్తులందరు శివలింగమునకు మ్రొక్కు వారును ఆ యారాధ్యదేవునకు మ్రొక్కువారును మరల శివలింగమునకు మరల నారాధ్యదేవునకును మ్రొక్కువారునుగా నుండిరి. సమీపముననున్న కూపములనుండి భక్తులు కుంభములతో జలము తెచ్చి యా యారాధ్యదేవున కందీయ మొదలిడిరి. అతి డాఘటము లందుకొని శతరుద్రీయము మంద్రగంభీరస్వరమున జెప్పుచు లింగాభి షేకము కావింపసాగెను.

అట్లు భక్తు లెన్నిఘటములు తెచ్చినను అవి తీసికొని విసుగువిరామము లేక యా జలము లభిషేకించుచునే యుండె నాతడు. సహస్రాధికముగా ఘటములు తెచ్చి యాతని కిచ్చిరి. రెండుచేతుల రెండు ఘటము లందుకొని అందలి జలములతో నాత డాలింగము నభిషేకించుచునే యుండెను. అతనికి బడలికయే లేదు. ఘటములోని ని రైపోనిది ఎత్తినచేయి క్రిందికి దింపడు. నీరైపోయిన పిమ్మట ఒక్క క్షణమైనను ఆ కుంభము తన చేతిలో నుంచుకొనక ఇచ్చివేసి వేరొక టందుకొని యభిషేకించును.

ఇన్ని ఘటము లందుకొనుచున్నను అతని చేయి ఇంచుకంతయు కంపింపదు. అవి బాహువులా, ఇనుపకమ్ములా? దేహము సొలయదు. పై పెచ్చు క్షణక్షణమును బాహువులలో శక్తి యెక్కువగుచున్నట్లు తోచుచుండెను. తేజస్సును అతిశయించుచుండెను. సాక్షాత్తు శివసన్నిధానములో శివార్చనలో భక్తులకు దేహభాన ముండునా? అభిషేకజలము ప్రవాహములు కట్టి యీ క్రతువ్యమన్న యగడ్తను ఇప్పుడే నింపివేయునా యనిపించుచుండెను.

అంతలో భక్తులకు పూజచేయ నిచ్ఛ జనించినది. జనసమూహములలో నీ మార్పు లెట్లుదయించునో చెప్పలేము. అనేక కోట్ల సూక్ష్మజీవులు కలసి మనుష్య దేహమై ప్రత్యేకవ్యక్తిగా కనిపించుట లేదా? అట్లే అనేకజనులు కలసినప్పుడు ఆ సమూహమే ఒక మహాపురుషుడుగా వ్యక్తిత్వము నొందునేమో! ఆ సమూహపురుషునికి నూతనేచ్ఛలు జనించును. ఆ సమూహములోనివా రందరు ఆ సంఘపురుషేచ్ఛలు నిర్వర్తించు నంగములుగా మారిపోవుదురు.

పూజ చేయవలె నని యా సమూహపురుషునకు ఇచ్ఛ జనించినంతనే ఎక్కడనుండి తెచ్చిరోగాని వివిధగంధములు పసుపు కుంకుమము పుష్పములు అందీయ సాగిరి. వచ్చినవి వచ్చిన ట్లాయారాధ్యదేవుడు వానితో నా శివలింగము నలంకరింప సాగెను. ఆత డప్రయత్నముగనే అవి లింగమున కర్పించును. కాని యవి యొక మనోజ్ఞరూపమును దాల్చి లింగమూర్తి నలంకరించెను.

అంతలో భక్తులు ధూపములు దీపములు నందీయ సాగిరి. ఆ యారాధ్యుడు అవి యెల్ల శివున కర్పించెను. ఒక్కొక్క యర్చన జరుగుచున్నకొలది శివలింగమునకును ఆ యారాధ్యదేవునకును ఒక్కొక్క కళావిశేష ముదయించుచుండెను. అంతట నైవేద్యములు రాసాగెను. ఎన్ని విధముల ఫలములు? ఎన్ని పళ్ళు? లెక్కలేదు. వచ్చినవి వచ్చిన ట్లెల్ల ఆతడు అవి భవునకు నివేదించి ప్రసాదము భక్తులకు పంచిపెట్టసాగెను.

ఇట్లు కోలాహలముగా శివపూజ సాగెను. ఇన్నాళ్లు నెన్నడు నేమినాథవిగ్రహమున కింత వైభవముగా పూజలు సాగియుండలేదు!

కాని అంబదేవున కిప్పుడు మరియొక చిక్కు వచ్చెను. ఈ శివలింగ మిచ్చటనే ఉన్నచో రాజాజ్ఞప్రకారము అగడ్త పూర్తియగు టెట్లు? ఇందర కింత యావేశముగా ఉన్నపుడు దానిని తొలగించుట సాధ్యమా? అదియు గాక స్వయముగా నంబదేవుడును గొప్పశివభక్తుడు. వారివంశములో అనూచానముగా శ్రీశైల మల్లేశ్వరుడు కులదైవముగా నుండెను.

అంబదేవుడు కొంతతడవు చింతించెను. సదాశివుని హృదయములో ధ్యానించెను. ఒక్క యూహ అట్టె అతనికి స్ఫురించెను.

వెంటనే అంబదేవుడు తన పై యుత్తరీయమును తీసి నడుమునకు కట్టెను. ఆపై నాతడు వినీతుడై యా లింగమునకును ఆ పూజ్యపురుషునకును ప్రదక్షిణ మొనర్చి సాష్టాంగదండప్రణామ మాచరించెను. అందరును వినయవినమ్రులై దూరము తొలగి నిలుచుండిరి. అంబదేవుడు లేచి భక్తితో నా పుణ్యపురుషుని ప్రశ్నించెను..

"స్వామీ, మీరు నాకు జూడ ప్రత్యక్షమైన శివాకారమున గనిపించు చున్నారు. మీరు మానవు లయినచో మీ నామధేయము సెలవిత్తురా ?"

"అన్నమయ్య యందురు."

అంబదేవుడు : "మీ గ్రామము ?"

అన్నమయ్య : "ముందు గోదావరీతీరమున పట్టిసము. ప్రస్తుతము పల్నాట సత్రశాల నివాసము."

అంబదేవుడు ద్విగుణీకృత మగు గౌరవముతో, "సర్వేశ్వరశతకము చెప్పిన యథావాక్కుల అన్నమార్యులు మీరే యని యూహింపవచ్చునా?" అని యడిగెను.

ఆ పుణ్యపురుషుడు అవు నన్నట్లు చిరునవ్వు నవ్వుచు నిట్లనెను. "మొదలనుండి యథావాక్కుల అనునది మా ఇంటి పేరుగా లేదు!"

అంబదేవుడు : "ఏమైన నేమి ? మీరు యథావాక్కుల వారే! మీరు వైజకవ్వ కథాభాగము చదువగానే ఈ జైనవిగ్రహపీఠములోనుండి ఈశ్వరు డుద్భవించి నాడు. వైజకవ్వవాక్కుల నుద్భవించిన ఈశ్వరుడు వైజనాథు డయినట్లే మీ వాక్కులు సత్యముచేయ నవతరించిన ఈ లింగదేవుని అన్నమేశ్వరుడని పిలుచుటకు మా కనుజ్ఞ యిత్తురా ?"

అన్నమారాధ్యులవారి నామమును వారి సర్వేశ్వరశతకమహాత్మ్యమును అక్కడ నున్న భక్తులు పలువురువినియుండిరి. ఆతి డా శతకములో పద్యములు ఒక్కొక్క దాని నొకతాళపత్రముపై వ్రాసి కృష్ణాప్రవాహమున వేసి ఎదురీది వచ్చిన పత్ర ములు గ్రంథముగా గ్రుచ్చుచు, అట్లు పత్ర మేదేని ఎదురీది రాకున్న గండకత్తెర వైచుకొని కంఠము తెగవేసికొనుటకు కఠోరప్రతిజ్ఞ చేసి, చెప్పిన శతకము ఆ సర్వే శ్వరశతకము ! ఇప్పటి కాత డది వ్రాసి పదునారేళ్లయినది. ఆ ప్రతీతి యానాడు రాజ్యమంతట భక్తలోకములో మారుమ్రోగియుండెను. ఆయన యశస్సు ముందే దశదిశలు ప్రాకియుండుటచే నా మహానుభావుడే ఈ నా డిట్టిక్కడికి దయచేసినాడని తెలిసినంతనే భక్తులకు కలిగిన యద్భుతాశ్చర్యములు ఏమని వర్ణింపగలము ! ఆ మహా మహుని వా రెంతగా అర్చించిరో చెప్పవెట్లు ?

అంబదేవుడు: "తమ పాదవిన్యాసముచే ఈ ఏకశిలాపురము పవిత్రము చేయుటకు నిమిత్తము ప్రశ్నింపవచ్చునా ?"

అన్నమారాధ్యులు చిరునవ్వు నవ్వెను. "సర్వేశ్వరేచ్ఛ! ఈ మహాలింగమే నాకు కలలో కానుపించి నన్నిటు లాగికొనివచ్చెను. ! ఇటు వచ్చువరకు నాపై పెద్ద బరువు ఉన్నట్లు తోచినది!"

ఒక్కమారుగా ఆ మాటలకు భక్తులలో జయజయనినాదములు పిక్కటిల్లెను. అంబదేవు డిటు విన్నవించెను.

"ఆరాధ్యదేవా ? ఈ అన్నమేశ్వరునికి దివ్యాయతనము కట్టింప స్వయంభూదేవాలయసమీపమున వెంటనే సర్వసన్నాహములు గావింతును. అందు కనుజ్ఞ యిత్తురా?"

ఆ కూడిన జనములో కొందరికి ఆ శివలింగ మక్కడనుండి తరలించుట కిష్టము లేదు. ఇత డొక స్వయంభూ తేశ్వరుడు! ఇట్టి మహాలింగమును కదలించుటా! కదలింప దలచినను మనుష్యమాత్రుల కది సాధ్యపడునా ?

యథావాక్కుల అన్నమయ్యమాత్రము మాటాడలేదు. కరములు మోడ్చి ఆ శివలింగమునకు నమస్కరించుచు నాత డించుకతడవు ధ్యాననిమీలితలోచనుడై యుండెను. అందరును అన్నమయ్యవంక తిలకించుచు మౌనముగా నుండిరి. అంతటి జనసమూహమునను ఒక్కరును సడిచేయలేదు.

అంతలో అన్నమయ్యవాక్కున ఈ పద్యము నృత్యమే చేసెను.

'రారా, స్ఫాటికలింగ! నీకుదురునకా రత్నాలు సొన్నాలు పో
నీరా! నీ కవి యేల రయ్య ? పడికా పిల్లుండి యీ బస్తి ప్రా
కారం బూనుచు నారుబైల నిలువంగా కర్మ మేమయ్య ? అ
బ్బో! రారా, చలివేయురా యిట, స్వయంభూదేవపార్శ్వంబుకున్'

ఆ పద్యము విన్నదే తడవుగా అంబదేవుడు ఆనందాతిశయముతో, "అన్నమారాధ్యుల యాజ్ఞ యైనది! ఈ లింగమూర్తిని స్వయంభూదేవనికేతనము ప్రాకారమున కీశాన్యభాగమునకు చేర్పింపుడు!" అని యాజ్ఞ యిచ్చి ముందు వేగరుల బంపి యక్కడ మండప స్తంభములు నిల్పి వానిపై పలకలు వేసి యాయతనము జాములోపల సిద్ధము చేయ నాజ్ఞాపించెను.

ఒక్కసారిగా శివభక్తు లందరు జయజయనాదములు చేయుచు భక్తితో ప్రేమతో నా శివలింగము నక్కడనుండి పెకలింప ప్రయత్నించిరి. వారు తమ బాహువులతో, పలువురు పుత్రులు తండ్రిని ఆలింగనము చేసికొనునట్లే, ఆ లింగమూర్తిని పొదివి లేప జూచిరి. ఆ తాకిడికి ఊపుకు పాదునుండి కదలినది గాని అసలు లింగము ఎంతకును విడి రాలేదు. టెంకాయలు కొట్టిరి. నైవేద్యములు చెల్లించిరి. బహువిధముల తరలింపులు పాడిరి. లాభము లేకపోయినది.

అది చూచి అంబదేవుడు అన్నమయ్యను ప్రార్థించెను.

"ఆరాధ్యదేవా, అంతశ్శుద్ధి కల మీరు పట్టిననే గాని ఈ స్ఫాటికలింగమూర్తి కదలదు!"

యథావాక్కుల అన్నమయ్య స్ఫాటికలింగమునకు ప్రదక్షిణ మాచరించి మ్రొక్కెను. అంతట నాతడు లింగమును సమీపించి తన వామబాహువును ఆ లింగ శిరస్సుపైనుండి రానిచ్చి కుడిచేతితో గడ్డము పట్టుకొని, చెప్పినమాట వినక మారాము చేయు పిల్లవానిని బ్రతిమాలునట్లే, బ్రతిమాలసాగెను.

'లేవయ్యా, నను గన్నతండ్రి, వినరా, లెక్కింపరా యన్న ప
ల్కేవాక్యంబులు, లేదులే వసదిలో కీలింప బాణుండు, నీ

సేవాసక్తులుం గూడి రిందు గదలించేబుద్ధి, మారాముచే
నే వేయయ్య!—ఎరుంగివో యవల మా చేతల్ ప్రకోపించినన్?

అట్లు బ్రతిమాలి అన్నమయ్య యా స్ఫాటికలింగమును కదలించెను. లేవ ననుచున్నట్లుగా ఆ స్ఫాటికలింగము ఈ ప్రక్కకు నా ప్రక్కకు కదలాడెను. మరల నట్లే రెండుమూడు మారులు అతడు బ్రతిమాలుచు లింగమును కదలించెను. మరల నట్లే లేవ ననుచున్నట్లు లింగమూర్తి తల యాడించెను.

అంతవరకు పరమశాంతమూర్తిగా నున్న అన్నమయ్యకు ఏదో ఆవేశ మంకురించినది. ఓషధులు కనబడకపోగా సంజీవిపర్వతము పెరుక నుద్యోగించిన హనుమంతునివలెనే యాతడొక్కసారి పెరిగినట్లు విజృంభించినాడు. లేచిరమ్మని హుంకరించుచు అన్నమయ్య తన విశాలవక్షస్థలమును లింగమున కానించి సుదీర్ఘములగు తన రెండుబాహుశాఖలతో నా లింగమూర్తిని ప్రేమతో భక్తితో పూనికతో ఆవేశముతో రోషముతో దృఢముగా చుట్టి పట్టి బంధించినాడు! హుమ్మని యార్చినాడు! ఘీంకారము చేయుచు మహాగజము కరముతో లాగునట్లే ఆతడు దాని నొక్క లాగు లాగినాడు!

పాదు కదలి విచ్చిపోయినది. అల్లరిచేసిన పిల్లవాడు కోపించిన తండ్రిచేతుల లోనికి వచ్చినట్లుగానే, ఆ లింగమూర్తి అన్నమయ్య చేతులలోనికి వచ్చినాడు! మహానందావేశముతో బొటబొట నాతని కన్నులవెంట నీరు కారి యా స్ఫాటికలింగమునకు ఉష్ణోదకస్నాన మాచరించెను!

భక్తులు ఆవేశముతో శివనినాదములు చెలంగ ధూపదీపము లిచ్చి నానావిధ నైవేద్యము లర్పించిరి.

ఆ యథావాక్కుల అన్నమయ్య కన్నీరే రత్నములుగా సొన్నాలుగా మారి రూపొందినదో, కాక అక్కడ పుడమిలోనే అవి యున్నవో, కాని యా లింగ మెత్తిన పాదులో రత్నములు స్వర్ణములు నున్న రాశి కానవచ్చినది. చూచినవారి యాశ్చర్యమునకు మేర లేదు. లింగమూర్తి కదలకముందే అన్నమారాధ్యులు రత్నాలు సొన్నాలు ఉన్నవని ప్రస్తావించి యుండెనే? ఈయన నిజముగా దివ్యపురుషుడే, యథావాక్కే!

ఆ రత్న స్వర్ణముల రాశి వెంటనే అంబదేవుడు శ్రద్ధగా తీయించి వేరుగా నుంచినాడు.

అప్పటికే నవనందులు పూనిన శకట మొకటి సర్వాలంకృతమై సిద్ధమైనది. అందుపై నా స్ఫాటికలింగముతోపాటు అన్నమయ్య ఆరోహించినాడు. ఆ శకటముననే పాదులోనుండి తీసిన రత్నములు సొన్నాలు ఉంచి తరలించునట్లు అంబదేవుడాజ్ఞాపించెను.

అంతకుము న్నెన్నడు ఏకశిలానగరపౌరులు చూచిగాని విని గాని ఎరుగని యొక మహోత్సవము పురవీథుల నూరేగెను.

ఆ నాటి కిక అగడ్తపని యాగిపోయినది. ఆ పనిలో నున్న భక్తులే కాక నగరమున మూలమూలల వాడవాడల గల శివభక్తులెల్లరు స్త్రీలు పురుషులు ఆబాలగోపాలము నక్కడ చేరిరి. సన్నాయి వాద్యముల జట్టులు సిద్ధమై ఒకరిని మించవలె నని ఒకరై వాయించుచుండిరి. అందుల డోళ్ళ శబ్దములు వినువారి హృదయములలో ప్రమథగణముల పదవిన్యాసములనే యనుకరించు నొక యదరుతో కలసిన యానందము కలిగించుచుండెను. వాని కెదురై ఖడ్గములు చెప్పుచు కొందరు సాగుచుండిరి. బహు ప్రదేశముల నారసములు గ్రుచ్చుకొని నటించువారు మరికొందరు! భక్తుల కథలు పాడువా రింకను గొందరు. అందును ప్రాచీనభక్తులు జైనుల పరిభవించిన కథలు విశేషముగా సాగినవి. పొట్లచెరువులో దేవరదాసయ్య జైనతర్కమును కొట్టి వారి ఐదువందల వసదులు వ్రచ్చివేయించిన కథ! కోవూరిలో జైనులు తమ మంత్రమహిమచే మఱ్ఱిచెట్టును కాల్చగా గోవూరి బ్రహ్మయ్య వీరగణమును స్మరించి సర్వమంత్రమూల మగు మంత్రరాజ మనుష్ఠించి, భస్మమైన యామఱ్ఱిని మరల నిలిపి యా యూరిలోని వసదులు వ్రచ్చివేయించిన కథ! ఏకాంతరామయ్య అబ్బలూరిలో జైనుల నుక్కడగించి ఆ పురి వసది యా నాడే పడిపోవునట్లు కఠోర శాప మొసగిన కథ!—ఇట్లు కథకులు కథలు చెప్పుచుండగా తాళములు మ్రోగించుచు చప్పటులు కొట్టుచు భజనలు చేయువారు వేరొకకొందరు! మరియు గొందరు వేదసూక్తములు పఠించువారు! ఆవేశముతో వెర్రికేకలు వేయువారు మరికొందరు! అందరును స్ఫాటికలింగమును అన్నమారాధ్యులను పరమభక్తితో నర్చించువారే!

యథావాక్కుల అన్నమయ్య! యథావాక్కుల అన్నమయ్య! వీరిది సిద్ధవాక్కు! ఇట్టివారే యథావాక్కులవారు! ఇట్టి యథావాక్కులు అందరకు ఆరాధ్యులు కారా మరి? వీరు వైజకవ్వకథ పఠింపగానే జైనప్రతిమ పాదునుండి ఈ స్ఫాటికలింగము ఉద్భవించినది. ఆనాడు వైజనాథుడు పుట్టిన నీనాడు ఈ అన్నమేశ్వరుడే వెలసినాడు! ఈ కుదురులో రత్నాలు సొన్నాలు ఉన్నవని ముందే వీరు చెప్పుచు శివుని ప్రార్థించినారు. ఆ పద్యములో అన్నట్లే లింగము పాదులోనుండి రత్న స్వర్ణరాసులే పుట్టుకొని వచ్చినవి. ఎంత మహానుభావుడీ యథావాక్కు! అంతేనా? ఇందరము కలసి పెకలింపలేని మహాలింగము నీత డొక్కడే తన రెండు బాహువులతో పెకలించినాడు. స్థాణు వగు శివుడే ఈ భక్తుని కోపమునకు భయపడి అదరి బెదరి అల్లరిచేసిన పిల్లవానివలెనే అన్నమయ్యతండ్రి చేతిలోనికి వచ్చినాడు!

ఇట్లు పరిపరివిధముల నందరు పొగడువారే! ఆ చేరినవారికి నిజముగా లింగమూర్తియందు ఎక్కువ భక్తియో, అన్నమయ్యయం దెక్కువ భక్తియో రూపింప రాకుండెను.

ఆ మహోత్సవము ఏకశిలానగర వీథులం దెల్లెడ సాగెను. ఇంటింట నారతు లిచ్చువారే! ఆనాడు ఆ ఏకశిలానగరమే కైలాస మన్నట్లు ఆ ఉత్సవము చూచిన వారికి భాసించెను. ఆ యుత్సవములో నున్నవారును తాము కైలాసములో నున్న ప్రమథగణముల మనియే తలంచుచుండిరి.

సూర్యాస్తమయ మయ్యెను. దీపములు వెలిగించువేళ వచ్చెను. వెన్నెల రాత్రియే అది! ఐన నేమి? దివిటీలు లేనిది రాత్రి యుత్సవము శోభగా నుండునా? దివ్వెలు అసంఖ్యాకముగా కొనిరాబడినవి. కనబడిన కర్రలు దివిటీకర్రలుగా మారెను. ఎదురైన వస్త్రములు వానికి చుట్టు గుడ్డలయ్యెను. అందుకు ఇది విలువగలది ఇది చౌకది యను విచక్షణ లేదు. ఎన్నొ పట్టువస్త్రములే దివిటీలకు చుట్టిరి. మరి వానికి తైలమో! అన్నిరకముల తైలములు నేతులుగూడ ఉపయోగించిరి. ఆ దివిటీలు పట్టు వారికి గూడ కులవివక్ష లేదు. పెద్దలు చిన్నలు అను భేదము లేదు. సదాశివునికి ఏ సేవచేసిన నీచ మనిపించుకొనును! అంబదేవుడే యొక దివిటీ గొని శివునిముందు సాగుచు వీరభద్రావతారమట్లు ఆ శకటముముందు పాదచారియై నడచెను. ఎవరు నెట్టి ప్రయత్నము ముందుగా చేయ నవసరము లేకుండగనే సద్యస్ఫూర్తితో సర్వము మహావైభవముగా జరగిపోవుచుండెను.

నగరవీథుల తిరిగితిరిగి యా యుత్సవము మహారాజమందిరము మోసాలముందు 'శోభనాల బావికిఖీ' 'గడియారాల బావికి'ని మధ్య యొక్కింత నిలిచినది. అక్కడ వాద్యములు ఘోషించెను. నృత్యములు సాగెను. జయజయఘోషలు చెలరేగెను. సంగీతములు ప్రవర్తిల్లెను. రాజమందిరమునుండి రుయ్యమ కొందరు దాసదాసీజనులతో వచ్చెను. దాసదాసీజనము లింగమూర్తికి రాజసదనమునుండి వచ్చిన కానుక లర్పించిరి. రుయ్యమ స్వయముగా అన్నకులింగమునకు ఆరాత్రికము దర్శింపజేసి మంగళగీతము పాడెను.

రాజమందిరముప్రక్కనే స్వయంభూదేవాలయ ప్రాకారము! లింగోద్భవ కాలము సమీపించుచున్నది. ఆసమయమున నా యుత్సవము స్వయంభూనికేతనమును సమీపించెను.

ఆమహాప్రాకారమునకు నలువైపుల విశాల మగు వీథులును నాలుగుమూలల విశాలము లగు నాలుగు చత్వరములును గలవు. ఆ యాలయమునకు ఆ ఉత్సవము ముమ్మారు ప్రదక్షిణించి తిరిగెను. అప్పటికి దాని యీశాన్యభాగమున అన్నమ లింగమునకు చక్కని చిన్న యాలయము సిద్ధమై యున్నది. ఓరుగల్లు శిల్పులకు అవ్యవధి యేమిటి? ఆ యాలయముముందు ఆ ఊరేగింపు మహార్భాటముతో నాగినది.

అన్నమారాధ్యుడు బండిపైనుండి క్రిందికి దిగెను. ముందాత డొక దివ్వె గొని యా నూతనాలయమున నెల్లెడ దాని త్రిప్పెను. నూతనాలయమునకు ఈ సంస్కార మవసరము. దానితో ఆయాలయము నాశ్రయించి యున్న భూతప్రేతపిశాచాదులు వదలి వేరొక యాచ్ఛాదనము చూచుకొనును. అంతట అన్నమయ్య స్వయముగా స్వయంభూసరోవారి కనకకుంభములతో తెచ్చి యానూతనాలయ మెల్లెడ సమంత్రకముగా ప్రోక్షించెను. అంతట నక్కడ లింగమూర్తిని ప్రతిష్ఠించుటకు సిద్ధముచేసి యున్న గర్తములో వసది ప్రక్కనున్న లింగము పాదునుండి బండిలో లింగమువెంట తెచ్చిన రత్నములును స్వర్ణములును అంబదేవుని యనుజ్ఞతో నిక్షేపించి, యాతడు రత్నశిలాన్యాస మొనర్చెను. దారిలో కానుకలుగా వచ్చిన స్వర్ణాదు లన్నియుగూడ నందే యాత డుంచెను. అప్పుడు మరియును చేరిన భక్తులెల్లరు యథాశక్తిగా నాగర్తములో తమ కానుక లుంచిరి. ఇక లింగమూర్తిని ప్రతిష్ఠించుటే మిగిలియున్నది.

అన్నమారాధ్యులు ఇంచుకతడవు చింతించెను. ధాన్యస్వర్ణాద్యధివాసములు లింగమూర్తికి కాలేదే! మరియు ననేకసంస్కారములు కాలేదే! ఇట్టి సందేహములు అన్నమారాధ్యుల కంకురించియుండవచ్చును. పరక్షణములో నా సంశయములు పటాపంచలయ్యెను. సిద్ధలింగమూర్తికి మానవకృతసంస్కారములు కావలెనని తలంచుట ఎంత భ్రాంతి! అన్నమయ్యా, నీకెంత అజ్ఞానమయ్యా? మరల నింకొక సంశయ మాతనికుదయించియుండవచ్చును. ఈ లింగమూర్తి ఎంతకాలముగా ఆ జైనవసది నానియుండెనో గదా! ఆ నేమినాథప్రతిమ పృష్ఠముక్రింద నలిగిపోయియుండెనుగదా! అయ్యో, స్ఫాటికలింగమూర్తి మైలపడలేదా? అన్నమయ్యకు జైనులపై గల ద్వేషముచే నీ సందేహము పోవుటకు ఎక్కువ వ్యవధి కావలసివచ్చెను. నిత్యపవిత్రుడగు శంకరునికి మైల సోకు టేమి? మైల సోకినచో ఈ స్ఫాటికమూర్తి ఇట్లు దేదీప్యమానముగా ప్రకాశింపగలడా? ఏమి యజ్ఞానమయ్యా నీకు? భక్తులు తెచ్చిన సహస్రాధికఘటములతో నీవు స్వయముగా లింగమూర్తి నభిషేకించితివి. దానితోనైన నీ మనస్సులోని మాలిన్యము పోలేదటయ్యా? లింగోద్భవకాల మైనది! ఆకాశమువంక అన్నమయ్య చూచి లింగోద్భవకాల మైనట్లు నిశ్చయించినాడు. అన్ని సందేహములును దానితో విరిసిపోయినవి.

సరిగా లింగోద్భవకాలమున అన్నమయ్య స్వయముగా నాస్ఫాటికలింగమూర్తిని శకటముపైనుండి తెచ్చి యా యాలయమున ప్రతిష్ఠించి భక్తులందర యనుమతితో నా లింగనికి అన్నమేశ్వరు డని నామకరణము చేసి పూజించి తీర్థప్రసాదములు భక్తులకు పంచిపెట్టెను. ఆ యారాధ్యదేవుడు తన శతకములోనుండి యీ పద్యము స్పష్టముగా శ్రావ్యముగా నిట్లు పఠించెను.

"బలవంతుండును దుర్బలుండును మహాప్రౌఢుండు మూఢుండునుం
గులజుండున్ గులహీనజాతుడు ఘనక్రూరుండు శాంతాతిని
శ్చలచిత్తుండును నొక్కరూప మది నీ సద్భక్తి చిత్తంబులో
పల వర్ధిల్లినమీద నేవిధమునన్ భావింప సర్వేశ్వరా!"

## ౨౪

అనుకొనని విధముగా నిదియంతయు జరిగిపోయినది. దూర మాలోచించి గాని యే పనియు జేయ దొరకొనని యంబదేవునికి ఆనాడు జరిగినది చూడగా నద్భుతమయ్యెను. శ్రీరుద్రదేవమహారాజులకు దక్షిణభుజ మాత డని లోకులెల్ల దన్ను కీర్తించుచుండిరి. తనతో నా గౌరవము పంచుకొనుట కిప్పుడు అన్నమంత్రీశ్వరుడు గౌరవస్థానమున నైన లేడు. అట్టి తానుగూడ ఈనాడు ఈశ్వరేచ్ఛకు బద్ధుడై సూత్రధారుని చేతిలోని తోలుబొమ్మ వలెనే ఆడవలసి వచ్చినదిగదా! తలచుకొన్నకొలది అతనికే విభ్రమము కలుగసాగినది. ఈ విచిత్రసంఘటనచే నా ప్రదేశమున కోటకును అగడ్తకును అంతరాయము రాకుండ [illegible]సిపోయినది. ఈశ్వరకృప యుండవలెనుగదా! పాప

మన్న మంత్రీశ్వరుడు ఈశ్వరకృప యున్నచో నీస్థితిలో నుండునా? అంబదేవుడును అన్నమంత్రియు కొంచె మెచ్చుకొనగా ఒక యీడువారే. వారిరువురు మిత్రులే. ఐనను అంబదేవునకు రాజాదరమున నన్నిశ్వడు ప్రత్యర్థి లేకుండుటకు అంతరాంతరములలో సంతోషము లేకపోలేదు!

వసతిపక్షమున వ్యవహరించుచున్నవారు, మొదటినుండియు నిక్కడ యగద్ధత్రవ్యకుండ జేయుటకు చేసిన ప్రయత్న మాతనిహృదయమున నొక గట్టి పట్టుదల కలిగించెను. 'మర్యాదగా నెన్నివిధముల జెప్పినను మాట వినక నిర్లక్ష్యము చేసిరే వీరు! వీరి నెట్లైనను సాధించితీరవలెను!'

ఇట్లని నిశ్చయించి యా మరునాడే ఆ వసదికి సంబధించిన పత్రములును శాసనాదులును స్వయముగా పరిశీలించి దగ్గరనుండి కొలతలు వేయించెను. అట్లు సరిచూడగా తుదకు ఇన్నాళ్లును వసదిలోని భాగముగా పరిగణింపబడుచున్న ప్రదేశములో నాలుగవవంతు వసతికెన్నడు నీయబడియుండ లేదని ధ్రువపడెను. కరణములు వారికనుకూలు రైనందున నది బయట పెట్టకుండ కప్పిపెట్టి యుండిరి. అట్లు అనధికారముగా నాక్రమించిన ప్రదేశమున నై సాధువులకు తపస్సు కనువుగా ధ్యాశాలలుకూడ నిర్మింపబడియుండెను. అంబదేవుని కీ విషయము నిర్ధారణ మైన వెంటనే యాత డాయా ప్రదేశముల వర్ణించి యవి వెంటనే అప్పగింపవలె నని రాజాజ్ఞ యావసతిని యధికారుల కందజేసెను.

దానితో నా వసదిలో పెత్తనదారులకు కలవరమదయించెను. నేమినాథుని విగ్రహమునకైన యగౌరవమును కన్నులార తిలకించిన పిమ్మట మొండితనము ఇకసాగదని వారు నిశ్చయించిరి. అంబదేవునితో విరోధము పెట్టుకొని మనగలమా యను భయము వారి నావేశించెను. అచ్చటి వ్యవహారము లాలోచించి నాగాచారిని పిలిపించి సర్వ మాతనికి నివేదింప నిశ్చయించి యాతనికి రమ్మని వార్త నంపిరి.

నాగాచారి వచ్చి పత్రము లన్నియు వివరముగా పరీక్షించెను. వసతి కట్టుకొనుటకు ప్రాచీనప్రభువు లిచ్చిన శాసనములు అందులో వసది కిచ్చిన ఎల్లలు సీమలు మరల మరల సరిచూచెను. మిగిలిన గుర్తులు చాలవర కిప్పుడు మారిపోయియుండుటచే గుర్తింప సాధ్యపడకున్నవి. మరికొన్ని ఇవి కావు అవి యనియు, అవి కావివి యనియు వాదించుటకు వీలుగా నున్నవి. కాని యా రాతిగుట్ట సరిహద్దు కాదనుట ఎట్లు? అది మాత్రము సాధ్యముకాదు! గుట్ట మారిపోయిన దనవలెను. కాని అది ఎవ్వరు నమ్ముదురు? పైగా వానిలో నుదాహరించిన ఎనిమిది దిక్కులలో మూడుదిశల నాగుట్టయే సీమగా ఉన్నది. ఆ దానములో నాగుట్ట యిమిడియుండ లేదని శాసనములో స్పష్టమగు వాక్కులున్నవి. అందుచే నా శాసనాధారములపై వ్యవహరించుట సాధ్యముకానిపని. వ్యవహారజ్ఞులతో నాలోచింపక ఆ నేమినాథవిగ్రహమును రహస్యముగా నొకచోట పెట్టుట, ఆ పెట్టిన భూఖండము తమకు దాన మీయబడినదని ముందు మొండిగా వాదించుట, అధికారులను ధిక్కరించుట, వీనివలన నేమినాథ విగ్రహ మచ్చట తామే నిశీథమున ప్రతిష్ఠించితి మను సందేహము ధ్రువపరచుట— ఈకర్మకాండ యంతయు నా వసది వ్యవహర్తల మూర్ఖతను స్పష్టపరచుచున్నది.

అందును ఆవల ఇంకొకరు ఇంకొకరు కాదే! అది అంబదేవుడే! అతని కుశాగ్ర బుద్ధిని వ్యవహారదక్షతను కార్యపేక్షను ఎరుగకొనవలసి వచ్చినది! ముందే ఆతనితో మర్యాదగా 'మాక్రింద నిది చాలకాలముగా నున్నది. మీదయ వచ్చినట్లు చేయుడు' అని విన్నవించుకొన్నచో కార్య మింత మించెడిది కాదు. ఆతడు ఎదిరించినవారిపై మిక్కిలి పట్టుదలతో వ్యవహరించును. కార్యరంగమున ప్రవేశించినయెడల ఎట్టి పొర సందును రానీయక నవరంధ్రములు బిగించివేయును. నాగాచారి వివరించువరకు అంబ దేవుని యాజ్ఞలోని ఇతరసూక్ష్మవిషయములు ఆ వసది వ్యవహర్తలకు దెలియను గూడ తెలియలేదు. ఈయాజ్ఞలు నిర్వర్తింపబడిన వసతిలో చాల భూభాగము పోవుటే కాదు; అందులోని మందిరములు పోవుటే కాదు; ముందు ఈ వసతికి బయటనుండి రాకపోకలుగూడ స్తంభించిపోవును. అందుపై వసతిలోని సాధువులు వసతియే వదలి పోయి వేరొక నివాసము చూచుకొనవలసిన పరిస్థితు లేర్పడును.

నాగాచారి యట్లు వివరించినంతనే ఆ వసది వ్యవహర్తలు ముందు నమ్మలేక పోయిరి. అతడు చెప్పినది నిజమే యని వారి కర్థమైనమీదట కోపము ఒక్కసారిగా ముంచెత్తుకొని వచ్చినది. కాని యేమి చేయగలరు ? ఎంత కష్టపడి వ్యయపడి తరతర ములుగా నిర్మించుకొనివచ్చిన యీ భవనములు విశ్రాంతిశాలలు ధర్మసత్రములు విడిచి పోవలసినదేనా ? 'అంబదేవుని శాంతింపజేయు మార్గము లేదా ?'

నాగాచారి : అది మన మొదటి బిగువుతోడనే బిగిసికొనిపోయినది. లాభము లేదు !"

ఆ మాటలతో వారికి అధైర్యమే ఆవేశించినది. 'మరి యిప్పుడు చేయ దగిన దేమి ?'

అదియే నాగాచారి సుదీర్ఘముగా నాలోచించెను. కొంతవడికి నిశ్చయించి వసది కరణమును బిలిపించి శ్రీరుద్రదేవమహారాజులకు నైనవసదికధ్యక్షులగు సిద్ధనందుల వారు పంపుకొను విజ్ఞాపనపత్రమును లిఖింప నాజ్ఞాపించి తా నాతనికి అందుండవలసిన విషయములు చెప్ప నారంభించెను.

ఆ పత్రములో ముందు శ్రీరుద్రదేవమహారాజులయు వారి పూర్వులయు నిష్పక్ష పాతిబుద్ధియు ధర్మనిరతియు నుగ్గడించి ఈ వసతిసాధువులు ప్రభువుల యైశ్వర్యాభి వృద్ధులకై అనాదిగా చేయుచున్న తపస్సును వర్ణించెను.

అంతట వ్యవహారసందర్భములు వివరింప ప్రారంభించెను. ఆ వసదిపై కాకతీయ వంశప్రభువులకు ఉండుచు వచ్చిన భక్తిశ్రద్ధలచే, వా రెన్నియో దానములు చేసి యుండిరి. అందులో చాలవరకు సాక్ష్యముగా చూపుటకు ప్రభువుల శాసనములును పత్రములును ఉన్నవి. కాని కొన్ని ప్రదేశములు ప్రభువు లాతావునకు వచ్చి కన్ను లతో చూపి నిర్దేశించి యిచ్చినవే కాని లిఖిత మగు నాధారములు అట్టివానికి లేవు. ప్రభువులు స్వయముగా వాగ్రూపముగా దాన మొనర్చిన ప్రదేశములు వసది యనుభ వములో చిరకాలముగా నుండుటే గాని అందు కాధారముగా లిఖితశాసనములు లేవు.

అట్లు వసదికి దాన మీయబడి లిఖితాధారము లేని యొకానొక ప్రదేశమున చిరకాలముక్రిందట మా పూర్వాధ్యక్షులు నేమినాథవిగ్రహము ప్రతిష్ఠింపదలచి

యొక పాదు చేసి అందు రత్నములు సువర్ణములు నిక్షేపించి దానిపై చిహ్నముగా నొక స్ఫాటికశిల స్థాపించియుండిరి. అందుకు విగ్రహముకూడ నెన్నడో సిద్ధమయ్యెను. కాని ఇతరములగు చిక్కులచే నా ప్రతిష్ఠ యప్పటిలో నాగిపోయినది.

సరిగా నా స్థలమే ఇప్పుడు ప్రభువులు నిర్మించుచున్న శిలాప్రాకారము నగడ్తలోనికి కావలసివచ్చిన దట. ఆ పవిత్రప్రదేశముమాత్రము ఆ యగడ్తమధ్యముననే ఉండనిచ్చునట్లు విన్నవించుకొనిన సరిపోయెడిది. మే మప్పుడు మౌనదీక్షలో నుంటిమి. ఆ సమయమున విషయపరిజ్ఞానము లేని యితరులు తొందరపడి మూర్ఖించి యా స్థలము రాజపురుషుల కప్పగించుటకు నిరాకరించి యచ్చట పూర్వము మేము ప్రతిష్ఠింపదలచిన నేమినాథమూర్తిని అర్ధరాత్రమున ప్రతిష్ఠించినారు. అందుపై రాజపురుషు లాగ్రహించి బలవంతముగా నా పవిత్రమూర్తిని తొలగించి యాప్రదేశము త్రవ్వించిరి. అంతలో ఆ పనికై నియోగింపబడిన జినద్వేషులు మూర్తిక్రింద నున్న స్ఫాటికశిలను లింగమూర్తి యని యాఘోషించి దానిని దానితోపాటు అందుక్రింద స్థాపితమైన యా రత్నసువర్ణరాసులను ఎత్తించుకొని వేరుప్రదేశమునకు చేర్చినారు. దీనితో మా వసదికి తలకొట్టిన ట్లయినది.

ఈ అలుసు చూచుకొని రాజపురుషులు ఇప్పుడు అధికారపత్రములు లేకుండ అనాదిగా వసదిక్రింద నున్న ప్రదేశములను అందు మేము నిర్మించుకొన్న సమస్తభవనాదికములతోసహా స్వాధీనపరచవలసిన దని ఆజ్ఞాపించినారు. ఈ యాజ్ఞలను అంబదేవులయంత ప్రధానపురుషులు ప్రవర్తింపజేసినారు. ఈ యాజ్ఞలచే నికపై వసదికి రాకపోకలు గూడ జేయ నవకాశ ముండదు. సాధువుల తపస్సుకును తీర్థంకరమూర్తుల పూజాదికములకును భక్తుల సేవలకును భంగము వాటిల్లును.

వసది యిట్టి ప్రమాదావస్థలో నున్నది. ఎవరో అజ్ఞానులు చేసిన చిన్న పొరపాటుకు వసదిపై నింత యాగ్రహించుట ధర్మమా ? వెంటనే ప్రభువులు వసదిననుగ్రహించి యా యాజ్ఞలు సరిచేసి మా రత్నసువర్ణములును స్ఫాటికశిలయు మాకిప్పింప వేడుదుము. మీకు తీర్థంకరుల ప్రసాదముచే ఆయురారోగ్యైశ్వర్యములు వర్ధిల్లుగాక !

ఇది యా వినతి సారాంశము ! అంతయు ప్రభుభక్తితోడను గంభీరవాక్కులతోడను నిండియున్నది. దీనికి శుద్ధప్రతి ఎట్టి మనోజ్ఞమగు పత్రముపై నే రంగులతో వ్రాయవలెనో కూడ నాగాచారియే కరణమునకు స్పష్టముగా తెలిపెను. మరియు నా పత్రము పూజ్యులగు సిద్ధనంద్యాచార్యులవారిపేరనే పంపుటను గూడ నాతడు నిర్ణయించెను.

కాని యా పత్రము సిద్ధనంద్యాచార్యులయొద్దకు తీసికొనిపోగా దానిపై తన నామ ముంచుటకు వారు నిరాకరించిరి. నిర్జరుడగు తన కెందు కిది? ఇంతవరకు తా నేమి వ్యవహరించుచుండెను ? ఇది మాత్రము తనయొద్ద కేల తీసికొనిరావలెను ? ఆ పత్రమును కరణము వినిపించినను ఆయన యది వినిపించుకొనలేదు. వ్యవహర్తల కది సాధించుట కష్ట మయ్యెను. వారంద రాలోచించుకొని యారాత్రి సిద్ధనంద్యాచార్యులు నిదురపోయి లేచి కలతనిద్దురలో నున్నసమయము కనిపెట్టి, యేదో సాకు

చెప్పి ఆయనకు తెలిసియు తెలియకుండ నున్న సమయమున నందుపై నాయననామ మంకితము చేయించుకొని తనయొద్ద నున్న ఆయన ముద్రికతో ముద్రించిరి.

మరియు నా పత్రమును ఎవరు ఏవేళ ఏవిధముగా శ్రీ రుద్రదేవమహారాజులకు నివేదింపవలెనో కూడ నాగాచారియే నిర్దేశించెను. ఆ వసతి పెద్దలును అతని యుపదేశమును సర్వథా సంభావించి అక్షరశః పరిపాలించిరి.

ఆనాటి పూర్వాహ్ణసమయమున శ్రీ రుద్రదేవమహారాజు ధర్మాసన మధిష్ఠించి యుండెను. అప్పుడు ఆ వసది ప్రధానకరణము కొందరు శ్రేణీపతులను వెంట గొని పోయి వసది యధ్యక్షుని వినతిపత్రమును మహారాజులకు నివేదించెను. సిద్ధనంద్యాచార్యుల నామము చూచినంతనే యా పత్రమును మహారాజు కన్నుల కద్దుకొని యా పత్రమంతయు పరిశీలించెను. అందులోని రహస్య మంతయు నామె కవగత మయ్యెను. ఆ వినతిపత్రము దానితోపాటు నివేదించిన ఇతరపత్రములును ప్రక్కనున్న కార్యభరిణు డగు దామనామాత్యునకు చూడ నిచ్చెను. దామనామాత్యు డవి చూచి యిట్లనెను.

"మహారాజా, దేవరవారు ముందు అంబదేవులతో నీ విషయము సంప్రదించి రేపటి దినమున నాజ్ఞ లిచ్చుట మే లని నాబుద్ధికి దోచుచున్నది."

వసది ప్రధానకరణ మా మాటలు విని నిలువున నీరైపోయెను. అయినను రుద్రదేవు లే మందురో ?

శ్రీ రుద్రదేవమహారాజులు దామనామాత్యుల యుద్దేశముతో నేకీభవించిరి. 'మాకును నదే భాసించినది.' అనిరి.

అంతట కార్యభరిణుడు వసతిపక్షమున వచ్చినవారిని మరునాడు రావలసిన దనియు, ఇంకను దానికి సంబంధించిన పత్రములును సాక్ష్యములును ఉన్నచో తెచ్చి కొనవలసిన దనియు, వారికి రాజాజ్ఞ వినిపించెను. వినీతులై నమస్కరించుచు వారును సెలవుతీసికొనిరి.

వారి గుండెలలో రాయి పడినట్లే యైనది. అంబదేవునితో మహారాజు లాలోచించిన కార్య మనుకూలపడనిచ్చునా?

జరిగిన దంతయు వ్యవహర్తలు నాగాచారి కా సాయంత్రమే తెలిపిరి. అత డది విని వారివలె నధైర్యపడలేదు. అది మన కనుకూలించు సూచనయే అని నాగాచారి వారికి ధైర్యము చెప్పెను. అంబదేవుని యాజ్ఞలు మార్పుచేయ దలచియుండుటచేతనే, అతనితో చెప్పి యాతని తృప్తిపరచుటకే శ్రీ రుద్రమహారాజు లట్లు శాసించిరని యాతడు సూచించెను. ఐనను ఎటుపోయి ఎటువచ్చునో యని ఇంకను సంపాదింప దగిన పత్రములను సాక్ష్యమును అతడు వారికి చెప్పి సిద్ధము చేయించెను.

ఆ వసతిలోని సాధువు లందరు నా నా డుపవసించి యారాత్రి యంతయు దమ యిష్టనాథుల ప్రార్థించుచు జాగరములు సల్పిరి.

మొత్తముమీద నాగాచారి యూహించినట్లే అంతయు నడచెను. ఇట్లు వినీతులై వసది యధికారులు తన్ను అర్థించినపుడు కఠినముగా నుండుట యుక్తము కాదని మహారాజు తలంచెను. వసదివా రెన్నడో కట్టుకొన్న భవనములు కూడ వదలి వెళ్ళు డనుట అన్యాయముగా అందరకు తోపకమానదు. అదియునుగాక ఈ పత్రములు సిద్ధనంద్యాచార్యుల పుణ్యనామముతో నంకితము లైనవి. వారిమాటలు సులభముగా త్రోసివేయుట కూడనిపని. అయినను వసదివారు రాజకార్యమునకు నిర్లక్ష్యముగా విఘ్న మాచరింప నుద్యమించినపుడు అంబదేవుడు చేసిన ప్రతిక్రియకూడ శ్లాఘ్య మైనదే! రాజసేవలో నాతడు చూపిన నైపుణి ప్రత్యేకముగా ప్రశంసార్హ మైనది.

అట్టి విశ్వాసపాత్రులును సమర్థులును అగు రాజసేవకుల కెట్టి మనస్తాపమును కలిగించుట యుక్తముకాదు. అందుచే రుద్రమ యా సాయంత్రమే అంబదేవుని తన సన్నిధికి పిలిపించి విషయ మే మని యడిగెను. అతడు జరిగిన దంతయు వివరించెను. ఆమెకు స్వయముగా తెలియనివి ఆమె యూహించినట్లే జరిగిన వని అంబదేవుని ముఖమున దెలిసికొనెను. అంబదేవు డంతయు జెప్పినపిమ్మట రుద్రమ సిద్ధనంద్యాచార్యులు పంపిన వినతిపత్ర మాతని కిచ్చి చూడు మనెను.

అంబదేవు డది చూచి చిరునవ్వు నవ్వుకొనుచు, 'ఇందుపై మహారాజుల యాజ్ఞ యేమి?' అని ప్రశ్నించెను. అది యాలోచించుటకే ఆతని బిలిపించితి నని యామె యుత్తర మిచ్చెను.

అంబదేవుడు యోజించెను. తుద కాత డిట్లనెను.

"స్వామీ, తమరు వసదిపై నెంత కరుణనైన జూపవచ్చును. కాని యీ రత్నములును సువర్ణములును స్ఫాటికబాణమునుమాత్రము—"

శ్రీ రుద్రదేవమహారాజు మధ్యలో నడ్డుతగిలి యందుకొనెను. "అవి వేరుగా వైభవముగా ప్రతిష్ఠాపిత మైనవిగదా! వాని గదలింప వీలులేదు. ఆ విషయమే ఎట్లు చేయుటా యనియే ముఖ్యముగా మేము యోజించుచున్నాము. మీ యుద్దేశ మేమి?"

అంబదేవుడు : "స్వామీ, ఏమున్నది? ఆ ప్రదేశము వారి దని నిర్ధారణచేయ దగిన యాధార మేమియు లేదు. అగడ్త త్రవ్వించుటలో మన కింకను ఎన్నిరత్నములు సువర్ణములు దొరకియుండ లేదు? వాని నన్నిటిని జేసినట్లే ప్రభువుల చిత్తముప్రకారము వీనిని గూడ నుపయోగింపవచ్చును. ఈ వ్యవహారమునకు మూలకారణభూతమగు నాప్రదేశము మాత్రము వదలక తక్కిన ప్రదేశములును మార్గములును వసదివారికి స్థిరపరచుచు ప్రభువులు కరుణింపవచ్చునేమో!"

రుద్రమ : అంబదేవా, మీబోటి ప్రభుభక్తిపరాయణులు ప్రవర్తింపజేసిన యాజ్ఞలు న్యాయ మైనవై యుండగా అట్టివానిని మేము తారుమారు చేయుట సమంజసమా యని యాలోచించుచున్నాము."

అంబదేవుడు వినయముతో నిట్లు విన్నవించెను.

"మహారాజా, మాబోటి ప్రభుసేవకులు కఠినముగా రాజద్రవ్యమును గాపాడుచు నాజ్ఞలు ప్రవర్తింపజేయుచునే యుండవలెను. అయితే నిగ్రహాను

గ్రహసమర్థు లగు ప్రభువులం మా కఠినశాసనములను కారుణ్యముతో జతచేసి జనరంజకముగా ప్రవర్తింపజేయుటయు రాజధర్మము గదా!"

రుద్రదేవమహారాజు అంబదేవుని వ్యాఖ్యానమున కెంతయు నానందించెను. ఆ పిమ్మట నామె పరిఖాశిలాప్రాకారనిర్మాణాదుల సంగతులం ప్రస్తావించి యితర రాజకార్యములను మాట్లాడి యాతని బంపివేసెను.

మరునాడు ధర్మాసనమున శ్రీరుద్రదేవమహారాజు కూర్చుండి వసతి యధికారులం తెచ్చిన నూతనపత్రములను సాక్ష్యములను శ్రద్ధగా పరిశీలించెను. వానిచే నగర్త క్రిందికి వచ్చిన ప్రదేశము వసది కీయబడిన దని క్రొత్తగా నేమియు ఋజువు కాలేదు. అట్టి ప్రయత్నముకూడ చేయవలదనియు నాగాచారి సూచించియేయుండెను. ఎక్కువ సంపాదించుటకు కొంత వదలుకొనవలెను!

ఆనాడు శ్రీరుద్రదేవమహారాజు ఆవిషయమున నాజ్ఞ ప్రవర్తింపజేసి వసదివారి కది తెలియబరచెను. ఆ యాజ్ఞ మొదటినుండి తుదివరకు కేవలము మహారాజులకు వసదిపైగల యభిమానముచే కరుణచే నచ్చటి శ్రమణులపై భక్తిచే ప్రవర్తింపజేసినట్లే యున్నది. కాని వసదివారు చెప్పిన వాద మే విషయమునను అంగీకరించినట్లు లేదు. ఆ యాజ్ఞలో గర్భితముగా నొకానొక కాఠిన్యము కూడ నిమిడియున్నది. వసతి యాక్రమణలో ప్రస్తుత మున్న స్థలములకు అందున్న ధర్మశాలలకు భవనములకు మందిరములకు మార్గమునకు ఎట్టి యవరోధమును ఉండదు. కాని యికముందు అంగుళము మేరయైనను వారు రాజానుమతి లేకుండ నాక్రమింప వీలుండదు. కాని ఇప్పటికే ఆక్రమింపబడిన ప్రదేశములకు భయము లేకుండ నట్టి ప్రదేశము లిప్పుడే క్రొత్తగా ఇచ్చుచున్నట్లు అ శాసన ముండెను. ఇందువలన వసతిప్రక్క నున్న గుట్టలో ముప్పాతికభాగము వసతివారు వదలుకొనవలసివచ్చెను. మరి యిక నగర్త క్రింద పడిపోయిన దన్న ప్రదేశము!ఎన్నడును వసది దని వాదంచుటకైన వీలు లేనిది. అందుచే అక్కడ లభించిన రత్నములు సువర్ణములు లింగమూర్తియు వారు తమవని కోరుటకు ఆధారము లేనే లేదు. వానివిషయమున నంబదేవులం ప్రవర్తింపజేసిన యాజ్ఞలకు ఎట్టి మార్పును లేదు. అయితే ఆ తొలగించిన నేమినాథమూర్తిని యుక్తమగు ప్రదేశములో వసతివారు ముందు ప్రతిష్ఠింప దలచి శ్రీ రుద్రదేవమహారాజులకు మనవి చేసికొన్నచో నప్పుడు బొక్కసమునుండి యుక్త మని తోచిన ద్రవ్యము జినదేవులపై మహారాజుల కున్న గౌరవముచే కట్నముగా సమర్పించుకొనగలరు !

ఆ శాసనముతో వసతివారు బయటపడితి మని నీట్టూర్పు విడిచి నాగాచారి మంత్రమును శ్లాఘించి యాతని నాశీర్వదించి బహుమతు లొసంగిరి. కాని బయటికి మాత్రము మా రత్నసువర్ణరాసులు అన్యాయముగా జంగములు ఎత్తుకొనిపోయి రని వారు గోలచేయుచునే యుండిరి. వారి కిక్కడ నిజముగా రత్నములు సువర్ణములు నిక్షేపింపబడియున్నవని తెలిసియుండెనా ?

చిత్రముగా కార్తికపూర్ణిమనాటికి వసతిలో నింతకాలముగా నున్న మహాయోగి యదృశ్యు డయ్యె ననియు నాత డుండెడి గది తెరచి శూన్యముగా నున్న దనియు ప్రకటితె మయ్యెను. భక్తు లందరు నక్కడ జేరి 'ఇదిగో ఈ గదియే !— ఆ శిలాతలమే

యా మహానుభావుడు కూర్చున్న ప్రదేశము ! ఎక్కడికి వెళ్ళెనో కదా మహాత్ముడు!' ఇట్లనుచు తీర్థప్రజగా జనులు వచ్చి యా గది చూడసాగిరి. ఏ మున్నది ?— ఆ గది శూన్యము !

'నేమినాథవిగ్రహము తీసివేయించిన యవినయము భరింపలేక ఆ మహాయోగి సల్లేఖనము చేసికొన శ్రవణబెల్గోళాక్షేత్రమునకు గోమతీశ్వరవిగ్రహసన్నిధికి వెళ్ళియుండును.

ఇట్లొక భక్తుడూహించినాడు ! అన్ని యూహల కంటె నది యుక్తముగా తోచినది. తదాది అదియే అందరు అవలంబించి ప్రవర్తింపజేసిరి. అందుపై నాయన బయలుదేరి వెళ్ళుట చూచినామనువారుకూడ వచ్చిరి. ఒకరు పాదచారియై వెడలె ననిరి. మరియొకరు గగనమార్గముననే పోయె ననిరి. ఏది ఎట్లున్నను జైనులలో సల్లేఖనము తరుచుగా జరుగుచుండెను. అది వేదమార్గానుయాయుల ప్రాయోపవేశము ననుకరించును. సల్లేఖనముచేయుచు జైనులు ప్రాణాంతమువరకు ఆహారము ముట్టక స్థిరచిత్తముతో శుద్ధబుద్ధైకస్వభావ మగు నిజశుద్ధాత్మస్వరూపమునే ధ్యానించుచు దేహత్యాగము చేయుదురు. ఇది మోక్షమే ప్రాప్తింపజేయు నని జైనాగమములు తెలుపుచున్నవి.

## ౨౪

అర్ధరాత్రము దాటి యైదు గడియ లైనది. మూడవ యామము ఐపోయిన దని యామికు డింకను నగరమున ప్రచురించుచు తిరుగనారంభించుటకు తడవున్నది. ఓరుగంటి పురజను లందరును గాఢనిద్రలో దేలుచుండిరి.

ఆసమయమున మున్నెన్నడు నగరవాసులు వినియెరుగని యొకానొక శబ్దమానాడు నగరమున వినవచ్చెను. ఆనగరవాసులు శతాధికము లగు వాద్యవిశేషములెరుగుదురు. కాని ఇది వారెరిగిన యే వాద్యశబ్దమును గాదు. ఇనుప కడియములు ఇనుప గంటలు తగిలించియున్న యినుపబద్దలు కలిపి యాడించుటచే ఆ కడియములు గంటలు ఆ బద్దలకు తగిలి పుట్టెడు నొక వింత శబ్దము ! ఆ శబ్దములో నాదము లేదు. నిండుదనము లేదు. అది కేవలము ఒక చప్పిడి చప్పుడు ! చెవులలో కఠోరముగా ప్రవేశించి ఏవ కలిగించు ధ్వని! అట్టి చప్పుడు చేయగల సాధనమును ఎవరోగాయకమహాశత్రువు కనిపెట్టియుండును. ఆ చప్పుడీనాడు నిశ్శబ్దముగా నున్న యానగరమున మొదటిసారి వినవచ్చినది. ఆ ధ్వని చాలదో యన్నట్లు, మధ్యమధ్య జెట్లున్న మరియొక సాధనమును గిరగిర త్రిప్పుచుండగా పుట్టెడి కరకరశబ్దమును దానికి తోడగుచుండెను !

అది భయంకరమైన శబ్దము కాదు. గంభీర మైనది కాదు. శ్రావ్యమైనది కానే కాదు. అది యొక చవటశబ్దము. వట్టి చప్పిడి మ్రోత! అర్థసౌష్ఠవము గాని, శబ్దగాంభీర్యము గాని, ఔచితి గాని, లయగాని లేని వచనరచనవలెనే పేలవ మైనది. దాని పేలవ గుణమే ఒక్కసారిగా నా నగరమున గల యశేషజనులను ఆ అపర

రాత్రివేళ మేలుకొలిపెడి. అది ఎంత పేలవమైనను, చౌకకవుల కవిత్వమువలె నిరంతరముగా వచ్చుచున్నదా శబ్దము! ఆ శబ్ద మట్లు ఎడతెగక చెవులలో చొచ్చుచుండుటచే ఊపిరిసలుపనిచ్చుట లేదు. అది వినవలెనని యెవ్వరికి నిచ్చ లేదు. కాని దాని నెవ్వరును వినకుండ నుండలేరు. వినకుండ నుండదలచినకొలదియు నది బలవంతముగా వీనుల జొచ్చుచుండెను. నిదురపో దలచినవారిని నిదురపోనీయదది. ఆ శబ్ద మట్టిది! నిదురించువారిని లేపును; లేచినవారిని మరి నిదురపోనీయదు. మరి యే యన్యశబ్దమును లేని సమయము నగుటచే ఏకశిలానగరప్రాకారమధ్యభాగమంతటిని ఆ శబ్దమే బలవంతముగా నాక్రమించుకొనెను. అందులో మధ్యమధ్య వచ్చు నా కిరకిరశబ్దము ప్రాణులను కొరుకుచున్న రాక్షసుని దంతములు చేయు శబ్దమునే తలపించుచుండెను. సర్వము నాయసశబ్దము! ఈ వేళ ఇనుపగజ్జెలతల్లి ఎక్కడనుండి వచ్చెనదో ఏకశిలానగరములోనికి!

ఆ శబ్దముతోపాటు దానికంటె కటువైన కంఠ మొకటి మధ్య వినిపించును. ఆ యాయసశబ్దము ఒక్క శ్రుతిలో నైన మ్రోయదు. ఏ క్షణమున కా క్షణమునకు శ్రుతి మారుచుండును. మరి యా కంఠమో! ఆ ఇనుప మ్రోతలోని యపశ్రుతిభేదముల నైనను అనుగమింప దా కంఠము! ఆ కంఠమును ఆ వాదనమును పరస్పర శత్రువు లగు సేనాను లిద్దరు ఒకే సేనలోని భటులను నడుపుచున్నట్లే యుండెను.

ఆ రెండింటికి తోడుగా నా రెండిటితోగూడ కలియక తనతో తానుగూడ కలియక ఏక్షణమున కాక్షణము స్వతంత్రమై విజృంభించు అతినూతన మగు పాటకూడ ఒకటి సాగెను.

"అల్లా ఇల్లా చూపు తల్లీ పిల్లలు మీరు వంగల్లావలె చల్లాగా ఇల్లల్ల తల్లీ పిల్లా మీరు చల్లాగా వర్ధిల్లవల్లా ఇల్లా అల్లా ఎల్లా కాలము మీరు తల్లీ పిల్లా వంధల్లీ అల్లా మళ్ళీ మళ్ళీ తల్లీ పిల్లా ఇల్లా—!"

యీ సరికొత్తపాట ఆ అపశ్రుతుల నోటికి వచ్చినట్లెల్ల వర్ధిల్లిపోవుచుండెను. ఆ మాటల కూర్పునకు స్పష్టమైన యర్థము లేదు. ఆ పాటలోని మాటలుమాత్రము మంచి వనిపించును. కాని యీ మాటల మంచితనమే పాటకొక దుష్టార్థము కల్పించుచుండెను. ఆ కంఠమును ఆ యాయసశబ్దమును నిశాచరులు తిరుగు నా యపరరాత్రి సమయమును ఒకచో కూడుకున్నచో నా పాటలోని మాటల కా విపరీతార్థము స్ఫురింపజేమో!

ఆ శబ్దమును పాటయు ముందు ఏడుగంటి పశ్చిమోత్తరదిశను పుట్టినవి. వాయవ్యమునుండి యవి అట్లట్లు తిరిగి ఉత్తరపుదిక్కునకు వచ్చినవి. మధ్యమధ్య నవి యాగును. మరల ప్రారంభించును. ఆ శబ్దము ఒక దిక్కుగా పోవుట లేదు. ముందు వెనుకలకు పోవును, వచ్చును. ప్రక్కలకు జనును. ఇటు పోవును. అటు వచ్చును. కాని మొత్తముమీద వాయవ్యమునుండి ఉత్తరమునకు, ఉత్తరమునుండి తూర్పునకు, తూర్పునుండి దక్షిణమునకు, అక్కడనుండి పశ్చిమమునకు — తుదకు అవి పుట్టిన వాయవ్యమునకు బోయి యక్కడనే తెల్లవారకముందే అవి పోయినవి. అది నిశాచరుడు నొక వైరాగ్య ప్రదక్షిణాలనము!

ఆ శబ్దము వాయువ్యమున సముద్గత మైనవెంటనే తన యింటిలో నిదురపోవుచున్న గండనికి మెలకువ వచ్చినది. పట్టణమున నెవ్వనికి నిద్దరపట్టనిది అతని కసలు పట్టునా? అతడు ప్రయత్నపడుచు నిద్ర మేల్కాంచెను. అది కొంతసే పాతఁ డాలకించెను. మధ్యమధ్య నాసుల ఘణఘణలు పోవుట అతనికి అనుమానము కలిగించెను. క్షణక్షణము నాతని యనుమానము పెరిగిపోసాగినది. తుద కది యాతడు పట్టలేకపోయెను.

గండడు శయ్యనుండి లేచెను. దట్టి బిగించెను. ఒరలో చురకత్తి సరిచేసికొనెను. చేతిలో చిక్కని దండ మొకటి ధరించెను. రొమ్మునకు తగఁడును శిరస్సునకు శిరస్త్రాణమును తగిలించుకొనెను. ఒంటిపై నల్లని యంగీ యొకటి కప్పుకొని బయలుదేరెను.

ఈ ప్రయత్నము లన్నియు జూచుచున్న యాతని భార్య ఏమియు మాటాడదు. అతనికి పెద్ద యుద్యోగ మైనప్పటినుండియు నాతని చర్యలన్నియు దానికి వింతగానే ఉండుచున్నవి. పూర్వము తన ప్రతాపము ప్రగల్భముగా చెప్పుకొనుచుండువాడు. ఒకొక్కక్కతరి దానికి వినుటకు విసుగు పుట్టినను తన మల్లయుద్ధ విశేషములు వర్ణించుచునే యుండెడివాడు. అతని దేహమునకు కలిగిన దెబ్బలకు ఉపచారము చేయుటే గాని మల్లక్రీడ దాని కేమి పట్టును? ఈ యుద్యోగ మైనప్పటినుండి యాతని వాక్కు కట్టువడినది. వెనుకటికంటె నిప్పుడెక్కువసేపు తన పనిపై సంచరించును. ఇంటికి వచ్చినప్పుడు ఇంటి విషయములే కాని బయటి విషయములు మాటాడడు. పతిపైఁ బ్రేమగల యది భర్తనుగూర్చి సందేహించెను. కాని ఏమియు నడుగ సాహసింపదు. ఎదురు చెప్పదు. ముగ్ధమగు ముఖముతో ముగ్ధమగు చూపులతో నాతని ప్రశ్నించును. అతడు ప్రత్యుత్తర మీయడు. ఈ యపరరాత్రివేళ నాతడు చేయుచున్న సన్నాహము గమనించి యది యట్టే చూపులతోడనే ప్రశ్నించెను. అందుకు గండడు తలుపు వేసికొనుమని చెప్పవలె కాని మరుమాటాడక బయలుదేరెను.

వీధిలోనికి వచ్చి ఆ శబ్దము వచ్చుచున్న దిక్కెదో ఆలకించెను. అది నిర్ణయించి వెంటనే అటువైపు కాతడు నిశ్శబ్దముగా కదలెను. ఒకచోటికి చేరఁగా ఆ శబ్దము తన వైపుకే వచ్చుచున్నట్లాతనికి తోచెను. గండడు చప్పున ప్రక్కనున్న సందులోనికి పోయి యందొక యింటిచాటున దాగుకొని యా శబ్దము దాటిపోవు వరకు నచ్చటనే యుండెను.

ఇనుపకడియము లున్న ఇనుపకట్టె లాడించుచు మధ్యమధ్య నింకొకటి గిలగిల ద్రిప్పుచు ఒక భిక్షుకుఁ డా శబ్దములు చేయుచున్నాఁ డని గండడు నిర్ణయించెను. అతని తలపై నొక యుష్ణీషమున్నది. ఒంటిపై చింపిరియంగీ యున్నది. వెంట నొక భిక్షాపాత్ర మున్నది. అది మనుష్యకపాలమా? కాక టెంకాయచిప్పయా? అతడు నెమ్మదిగా నడుగులు వైచుచు నిర్భయముగా సాగిపోవుచుండెను.

ఆ భిక్షుకుని జూచినంతనే వ్యర్థముగా నింతదూర మేల వచ్చితి నని గండని కనిపించెను. భిక్షమెత్తువారు అనేకవిధములుగా నుందురు. ఎవరి పిచ్చి వారిది, ఎవరి వేషము వారిది! అందులో నిదియు నొక విధము. ఇక నింటికి పోవచ్చును పాప

మింటివద్ద తన భార్య తనకై దిగులుతో నెదురుచూచుచుండును. అందును ఈనాడది యెక్కువ దీనముగా జూచిన ట్లాతని కిప్పుడు స్ఫురించినది. అయినను ఇంతదూరము వచ్చి యాతని ననుగమింపక వెనుదిరిగిపోవు టేల? కొంత తడ వాతడు తటపటా యించెను. ఎట్టకేల కాతడా భిక్షుకు ననుగమించుటకే నిశ్చయించెను. అట్లు నిశ్చ యించిన పిమ్మట జాగరూకత వదలకయే వెంట నంటెను.

ఆ నగరమునం దెందరు సంపన్నులు లేరు? కాని యా భిక్షుకు డట్టి సంపన్ను లగువారి యిండ్లకడ నెక్కడను ఆగుట లేదు. అత డాగునది పేదల కుటీరముల వద్దనే. అతడు వచ్చుచున్న శబ్దము దవిసినంతనే ఆ యింటివారు లేచి భిక్షము పెట్టుటకు సిద్ధముగా నుందురు. శ్రద్ధగా వారు తాము తిను జొన్నలో, రాగులో, సజ్జలో అతనికి చెప్ప యర్పింతురు. అవి యన్నియు నాత డొక్క పాత్రమునందే స్వీకరించి దీవించును. దానికి తోడుగా దక్షిణగా వా రేదే నొక పణముగూడ నర్పింతురు.

అత డట్లు చేరుచున్న కుటీరములు సామాన్యముగా చిరకాల మక్కడ నివాస మున్నవారివి కావు. వారు చర్మములు ఇనుమువంటి పదార్థములతో వ్యాపారము చేయుటకు ఉత్తరభూములనుండి వచ్చిన చిల్లరవ్యాపారులును పనివారును ఐయుండిరి. అట్టివారి గృహములు ఏకశిలానగరమున నెన్నియో లేవు. ఉన్నవి కొంచెమును అక్కడక్కడ దూరదూరముల నున్నవి. అత డా యిండ్లయొద్దకే పోవుచుండెను. ఆ యిండ్లయొద్దగూడ నాత డెక్కడనో ఒకచోట తప్ప ఎక్కువసే పాగడు. భిక్ష గైకొని వారి నాశీర్వదించుటే తడవు సామాన్యముగా కొన్నియెడల మాత్రము ఇంటివా రేవో ప్రశ్న లడుగుచున్న ట్లుందురు. ఆ ప్రశ్నలుకూడ గండనికి వినబడ్డవరకు శాకునికులను జ్యోతిషికులను అడుగు ప్రశ్నలే. కొందరుమాత్రము తమ పిల్లలకో, పెద్దలకో జబ్బుగా నున్న దనియు, దానికి ప్రతిక్రియ కావలె ననియు నర్థించుచున్న ట్లుండెను. అతడు వారి కేదియో అభిమంత్రించి యిచ్చుచుండును. అవి వేరులు కాబోలు!

ఈతని వెన్నంటుట యనవసర మని ముం దాలోచించిన గండనికి ఇత డిన్ని గృహములకును చిరపరిచితునివలె పోవుట చూడ నాశ్చర్య మయ్యెను. దానితో సందేహమును బల మయ్యెను. అతడు సంచరించు తావులును ముఖ్యముగా వెలిపాలెము నను దాని సమీపప్రదేశములనే కలవు. అతడు జూదమాడు ప్రదేశములును త్రాగు బోతుల కూటములును కొమ్మరిసానుల యిండ్లును గూడ మధ్యమధ్య ప్రవేశించు చుండెను.

ఇట్లా బైరాగి వెళ్ళివెళ్ళి బొల్లని యింటియొద్ద నాగెను. అది చూడగానే గండ నికి కాళ్ళు స్తంభించినవి! ఏమిది?

నిశీథమున నగరమున నజ్ఞాతముగా సంచరించుట కథలలో సామాన్యముగా చదువునంత సులభము కాదు. ఆ బైరాగి కేమి? అతడు రహస్యముగా సంచరించుట లేదు. ఆ యినుపకడియముల చప్పుడుకు దారిలోనున్న పాములు జెర్రులు భయపడి పారిపోవును. ఆ చప్పుడు దూరమున విన్నంతనే ఊరిలోని కుక్కలు మొరుగుచు లేచి యాతని వెన్నంటును. గృహస్థులు తలుపులు తీసి ప్రశ్నింతురు. అతడు ఉత్తరము

పలుకకుండ వెడలిపోవును. కాని యాతడు పెద్దచప్పుడు జేయుచు అందరను ఆశీర్వదించుచు వెళ్ళుచున్నాడు. కనుక ఎవరో పిచ్చివాడో బిచ్చగాడో యనుకొని సరిపుచ్చుకొందురు.

కాని యాతని రహస్యముగా వెన్నంటి పోవు గండని దారియంత తేలికయా? బైరాగివెంట బడి పడి మొరిగి మొరిగి విసివినకుక్కలు వెనుకకు వచ్చును. ఇంతలో గండని నల్లని యంగీ కప్పుకొని చేత దండము ధరించిన యాకారము చూచినచో, ఆ కుక్కలు నూతనావేశముతో నాతనిపై కవియవా? దానితో బైరాగికితన్నెవరో అనుగమించుచున్నారని తెలిసిపోవదా? అట్లు తెలిసిపోయినచో తాను వెన్నంటి యేమి రహస్యము తెలిసికొనజాలును?

మరియు లేచిన గృహస్థులు బైరాగిని ప్రశ్నింతురుగదా! అతడు ప్రత్యుత్తర మీయకపోగా వారిటు నటు చూచుచు కొలది వ్యవధానములో నచ్చటికి వచ్చిన గండని వారు ప్రశ్నింపకుందురా? 'ఆ ముందు పోయిన దెవరు?—అతని వెంటబడుచున్నట్లున్నావే-అతడేమైన దొంగయా?—అసలు నీ వెవరవు?' ఆ ప్రశ్నలకు తాను ప్రత్యుత్తర మీయనిచో ఆ గృహస్థుడు ఊరుకొనడు; ప్రక్కయిండ్లవారిని లేపును. అందరు కలసి యాతని చుట్టుముట్టి తోచిన ప్రశ్నలెల్ల సాగింతురు. అల్లరి యౌను. అది బైరాగికి వినబడకుండునా? అట్టిది వినబడకుండు నంతదూరములో నుండి వెళ్ళుచున్న ఆ బైరాగి యాగు ప్రదేశములు గుర్తించు టెట్లు? అతని మాటలు విను టెట్లు? అదిగాక అతని నీ సందర్భమున సరిగా ననుగమించుటయే సాధ్యపడదు.

ఈ చిక్కు లన్నియు ముందుగ గండ దూహించియే తగు మెలకువతో సంచరించుచుండెను. రహస్యముగా నగరమున నిశాసంచార మొనర్చు నేర్పు మేచయనాయకుని వ్యవహారశాలలో తద్విదు లాతనికి కొంత ప్రశుతపరచియే యుండిరి. అది స్వానుభవముతో గట్టిచేసికొనవలెను. ఇప్పటికి పగి పన్నెండుమారు లాతడా పనియందు నియుక్తు డగుటచే కొంతవర కారితేరినాడు.

ముందు బైరాగివెంట బడి మొరుగుచున్న కుక్కలను జాగరూకుడై కనిపెట్టి వాని రాకపోకలు పరీక్షించుచు గండడు వానికళ్ళ బడకుండ నెమ్మదిగా దాటిపోవుచుండెను.

గృహయజమానులు తలుపుతీయుచున్న చప్పుడు ముందుగానే గమనించి, బయటికి వచ్చినవారి కెదురుపడకుండ తప్పుకొనుచుండెను. ఎంత జాగరూకుడై సంచరించినను ఏదో యొక కుక్కకంట బడకుండ నుండుట సాధ్యమా? అది మొఱుగకుండునా! ఒక యింటి యజమాని బయటికి వచ్చుచున్నాడని మరియొకయెడ దాగియున్న, నచ్చటగల యింటి యజమాని యాకస్మికముగా తలుపుతీసి బయటికి వచ్చును. ఈ రెండవవాని కాతడు కంటబడకుండ నుండు టెట్లు? ఆతడు ప్రశ్నింపక యూరకుండునా? జవాబు చెప్పక పోవు టెట్లు? అట్టివి మధ్యమధ్య తటస్థించెను. 'యామికుడను! వీరభద్రుడను! వైద్యునికొరకు పోవుచున్నాను. తెల్లవారిన దనుకొంటిని!' అని తడవకొక క్రొత్తవిధముగా అనుమానమునకు తావీయకుండ నెమ్మదిగా చెప్పి యాతడు దాటిపోవుచుండెను. బైరాగిని గూర్చి యెవ్వరైన నడిగిన 'ఎవరో తెలియదు. ముష్టి

వాడుగా నున్నాడు' అనును. కొన్నిమారులు యామికులును వీరభద్రులును కనబడిరి. వారికి సంకేతశబ్దము పలికి తప్పించుకొనవలెను. లేకున్న నతని శిరస్త్రాణము చూచి నిలువవేయుదురు. మేచయనామము తలక్రిందులు చేసి 'యచమే' యని నెమ్మదిగా చెప్పిన వారు మారాడక వెళ్ళిపోవుదురు.

పలుమారు గండడు తాను వెంటాడుచున్న ట్లా బైరాగికి తెలిసియుండు నని భయపడెను. కాని యా ముందుపోవువా డెట్టియనుమానమును చెందుచున్నట్లే కన పడలేదు. అతడు వెనుతిరిగి చూచుట గాని దిక్కులు చూచుట గాని ఏమియు చేయుట లేదు. అతనిని ఎవరైనను వెంటాడుచున్న ట్లాతనికి తెలిసినను లక్ష్యము చేయువానివలె గూడ లేడాతడు! అన్నిటికంటె గండనికొకటే ధైర్యము. అంతటి పిశాచశబ్దము చేసి కొనుచు పోవువానికి వెనుక తా నాడు సన్నమాటలు వినిపించునా?

బొల్లని భార్య యగు మంగిని గండ డీ మధ్య చూచియుండలేదు. గండనికి బొల్లనికి మల్ల యుద్ధమున స్పర్ధ ఏర్పడినది. కాని వారికి ఎట్టి విరోధమును పూర్వము లేదు. వారిద్దరికుటుంబములకును చిరకాలముగా మైత్రి కలదు. పూర్వము హనుమ కొండలో వా రుండునెడ వారియిండ్లు మిక్కిలి దగ్గర. అప్పు డా రెండుకుటుంబములకు సాహచర్య ముండెను. బొల్లని తల్లియు గండని తల్లియు అక్కచెల్లెండ్రవలె మైత్రితో మెలగుచుండెడివారు. గండడును బొల్లడునుగూడ మల్లయుద్ధము కఱ్ఱసాము ఒక జెట్టి గరిడీలోననే నేర్చియుండిరి. విద్య నేర్చునప్పుడే వారిరువురకు స్పర్ధయేర్పడెను గాని విరో ధము లేదు. ఇతరగరిడీవారితో పోరుటలో వారిద్దరు నొక్కటియే! మరియు మల్ల యుద్ధమునను కఱ్ఱసాములోననె గాని ఏ యితరవిషయమునను వారికి స్పర్ధకూడ నుండె డిదికాదు. అయితే వారికి వయస్సు ముదిరినకొలదియు ఒకరిపై నొకరికి గల ప్రేమాను బంధము తగ్గిపోయి స్పర్ధయే బలపడిపోవు చుండెను. అట్లయినను వారి కుటుంబముల మధ్య రాకపోకలు కట్టుపడ లేదు.

బొల్ల డెక్కువ మాటకారి కాడు. కారునలుపు. అతని దేహము వ్యాయామము చేసినకొలదియు కండలు పెరిగిపోసాగెను. పొట్టకూడ పెరిగిపోవుచున్నది. దేహముతో పాటుగా అతని మాటలుకూడ మోటువారిపోసాగినవి. అతడు మాట్లాడుట చూచినవా రా మాటలు నోటినుండివచ్చుచున్నట్లు కాక రొమ్ములోనుండియో కంఠమునుండియో సరాసరి బయటికి వెడలుచున్నట్లు తలంతురు.

గండడు వ్యాయామము చేసినకొలది యాతని దేహము గట్టిపడుచు రాగిశలాక వలె మారజొచ్చెను. అది సహముగా సమవిభక్తాంగముగా వర్ధిల్లుచున్నది. అస లతనిది చామనచాయ. వయస్సు మీరుచున్నకొలది అతని దేహచ్ఛాయ మారుచు ఇతడు పచ్చనివాడా, ఎఱ్ఱనివాడా యను సందేహము కలిగించుచు మిసమిసలాడుచు శరీరము పెరుగుచుండెను. వారి వాడలలో నాతి డెక్కువ యందగాడై యాకర్షకముగా నుండువాడు.

మరియు గండడు ప్రతివారితో మాటాడును. మాటాడినప్పుడు ఇతరులను నొప్పిం పని పరిహాస ముండును. అతడు మనసార నవ్వును. అతడు నవ్వినప్పు డాతని తెల్లని పెద్ద పండ్లు బయటపడును. ఇతరులను నవ్వించును. వారి కులములలో స్త్రీలు పరపుర

షులతో మాట్లాడుటలో ఎట్టి గ్రొత్తయు చూపరు. పురుషులకు ఇతర స్త్రీకులములలో నున్న దూరము వారి కులములలో లేదు. నలుగురిలో నున్నప్పుడు గాని ఒంటరిగా నున్నప్పుడుగాని వా రా భేదము పాటింపరు. అందుచే గండని కుటుంబమునకును బొల్లని కుటుంబమునకును చిరకాలమైత్రి కలదాయెను! గండడు స్వతంత్రముగా బొల్లని భార్యను పలుకరించును. దానితో పరియాచకము లాడును. దానికూతురు పాటియు గండడు వచ్చిన, నతనిపై కెగబ్రాకి నెత్తి కెక్కును. గండనికి ఇంకను పిల్లలు పుట్టలేదు. అందుచే పాటిచనవు అతనికి విశేషానందము కలిగించును.

కాని శరన్నవరాత్రములలో తా మిద్దరు వీధిలో పోరాడుకొన్నతరువాత గండనికి బొల్లని యింటివైపునకు వెళ్లుటకే ముఖము చెల్ల లేదు. ఆ పోట్లాట యంతయు నావేశములో జరిగిపోయినది కాని తర్వాత జరిగిన విషయములను బట్టి బొల్లడు రాజద్రోహులలో చేరినాడని స్పష్టమయ్యెను. విద్రోహులు కాక అతని నా కారాగారము నుండి యంత చాకచక్యముగా తప్పించువా రెవరు? ముందు బొల్లడు చెఱలో పడుటకును ఇప్పుడు దేశములు పట్టుటకును కారకు డెవరు? తానే గదా! పాపము, మంగి ఎంత దిగులు పడుచున్నదో గదా! ఆ పిల్ల పాటి అన్నపానములే మానివేసియుండును. వారి ముఖములు తా నే మొగము పెట్టుకొని చూడగలడు!

ఇప్పు డా బైరాగి బొల్లని యింటియొద్ద నాగుటయు అప్పటికే మంగి సిద్ధముగా నుండి బయటికి వచ్చుటయు గండని కాశ్చర్యమయ్యెను. అతని ప్రాణము లొక్కసారి యాగిపోయినట్లే యయ్యెను.

ఒక పంచచాటున నుండి గండడు వారి చర్యలు చూచుచు మాటలు వినుచుండెను. ధైర్యము చేసి యాతడు కొంచెము దగ్గరకే పోయెను.

పాటి బయటికి రాలేదు.! మంగి తల దువ్వుకొనలేదు. అది కొంతకాలముగా తిండికూడ సరిగా తినుచున్నట్లు లేదు. దాని మాటలు నీరస మగు కంఠమునుండి దీనముగా వచ్చుచున్నట్లు వినిపించెను.

“బాబా, నిన్న ఇంటిలో మేము తిండి తినలేదు. పిల్ల జ్వరముతో ఉన్నది. మీ కేమి పెట్టగలను, బాబా!”

గండని గుండె లామాటలకు తరుగుకొనిపోయెను. తన కిప్పుడు భత్యము వేతనము నెక్కువయినవి. పిల్లలు లేరు. ఈధనమంతయు దా నేమి చేసికొనును! మరునాడు పోయి మంగిని చూచి కొంత ధన సహాయము చేయ నాతడు నిశ్చయించెను. ఈ యాలోచన త్రుటిలో సాగిపోయెను. మనోవేగము గదా! అంతలో బాబా మాటలు వినబడెను.

“పిల్లా మీబోటి వారి యిండ్లకు మేము దీవించుటకు వత్తుముగాని మాకుడబ్బుతో పనిలేదు. గాలి తినియే జీవింపగలము!”

“బాబా, మా కష్టము లెప్పటికి గట్టెక్కగలవు?”

మంగి ప్రశ్నకు బైరాగి కొంతతడ వాలోచించెను. భగవంతుని నడుగుచున్న గానివలెనే అత డాకాశమువంక తల యెత్తెను. కొంతసేపటి కాతడిట్లనెను.

"నీవు నీపెనిమిటిసంగతి యడుగుచున్నావు. అతడిప్పుడు దూరమున గన బడుచున్నాడు. సుఖముగా సంతోషముగా నున్నాడు. అతని కిప్పుడే ఎన్నియో రత్నములు సువర్ణములు లభించినవి—"

మంగి నిట్టూర్పు విడిచినది.

"అయ్యో, ఎంత సంపాదించి ఏమి లాభము? మేమిట్లు మాడుచున్నాము—మరి ఎవరినైనా కట్టుకొనినాడా, బాబా !"

"లేదు, లేదు!"

నగల బైరాగియే మాట్లాడెను. "రోజూ అతడు భార్యకోసము పిల్లకోసము కలవరించును. దిగులుతో సగమైనాడు. ఇక్కడికి వచ్చినచో అతని ప్రాణములు దక్కవు!"

"అతడు చేసిన తప్పేమో నా కెవరూ చెప్పరు. కావలసినవారుకూడ నా దగ్గరకు వచ్చుటకే వెనుకాడుచున్నారు. ఏమి చేసినాడో మీరైనను చెప్పరా, బాబా!"

"ఏమైన నేమి ? కష్టములు గట్టెక్కుటకు చాలాకాలము పట్టును."

"ఇన్నాళ్ళు బ్రదుకుటమెట్లు, బాబా?"

"మాకు దీనులకు సహాయము చేయుటే పని ! భగవంతుడు మాకు కోరిన ద్రవ్యమిచ్చును!"

ఇట్లనుచు నా బైరాగి తన రెండుచేతులు పైకెత్తెను అతని దోసిలి నిండి బరువెక్కిన ట్లయ్యెను. "భగవంతు డిచ్చినది నీకే!" అని యతడు మంగిని ఒడి పట్టుమని తన దోసిలి ఒడిలో క్రుమ్మరించెను.

మంగి తెల్లవోయి చూచుచుండెను. గండనికి స్పష్టముగా ఇంటివాకిలినుండి వచ్చుచున్న లోపల కనికిపడు దీపపు వెలుతురులో సువర్ణములే కన్నులఎదుట మెరసెను. మరుసటిక్షణమున బైరాగి కనబడలేదు. అతని ఇనుపపట్టెల శబ్దమును వినబడుటలేదు. అతి డెటు వోయెనో గండనికి కనబడలేదు.

గండనికి భక్తియు భయమును ఏకకాలమున నుదయించెను. ఈ బైరాగి ఎవరో సర్వజ్ఞుడు! తాను వెన్నాడుచున్న సంగతియే అట్టివా డెరుగకుండునా? అప్పుడే అతనికి మంగిఎదుట బడి పాటిజ్వరముసంగతి విచారింపవలె నని ఎంతేని కోరిక అతిశయించినది. కాని యది సర్వవిధముల ననుచితము. ఇట్టి యపరాత్రసమయమున అసలే పనికిరాదు !

ఇట్లాత డాలోచించుచుండగనే దూరమున నా యినుపగజ్జెల చప్పుడును కిర్రుశబ్దమును వినవయ్యెను. కలలోనుండి లేచినవానివలె అత డా శబ్ద మాలకించెను. 'రా, చేతనైతే రా!' అని తన్నాశబ్దము ధిక్కరించి పిలుచుచున్నట్లే యాతని కది తోచెను. అభ్యాసవశమున నాతడు లేచి ఆ శబ్దము వచ్చుచున్న మార్గమంటి పోయెను. అది చిన్న రాతిగట్టుయొద్ద నున్న జైనవసదివైపునుండి వచ్చుచున్న దని యత డూహించెను. గండ డటు వెళ్ళుచుండ మరల నది యాగిపోయెను

ఎటు పోవలెనో పాలుపోక గండడు విచారించుచు ఆలకించుచు ఒకచో నిలుచుండెను. అంతలో నతనికి తన కుడిచెవి ప్రక్కగా దూసికొని యొక బాణము పోయినట్లయ్యెను. ఏదైన రెక్కలపురువా ఇది? అంతలో ఎడమచెవిప్రక్కగా మరల నట్టి శబ్దమే యయ్యెను! ఇక నిది యేమని యాలోచించుకొను తడవు లేదు. ఈమారది తన తలమీదనే పడును! వెనుకనుండి వచ్చుచున్నట్లున్నవవి! వెనుక తనకు ఆచ్ఛాదన మేమియు లేదు!

వెంటనే చురుకుగా నాతడు వెనుదిరిగి క్రత్రిప్పుటకు ఉద్యుక్తుడగుచుండెను. అంతలో నొక బాణము వచ్చి బలముగా నాతని రొమ్మున తాకెను. అదృష్టవశమున నాత డాదినమున రొమ్ముతగిడు వేసికొనియుండెను. లేనిచో నతని ప్రాణ మక్కడ ఆనాడు పోవలసినదే! అధికారుల యాజ్ఞలు చిన్నవిషయములలో కూడ పాలించుట ఎంత శ్రేయస్కరము!

ఇప్పుడేమి చేయవచ్చును! వెంటనే ఆతడు నేలపై పడిపోయినట్లె పడియుండి ప్రక్కను పడిపోయిన బాణమును పట్టుకొనెను. కొంచెముతడ వట్లే యాగి కిమ్మట లేచి పారిపోవలె నని యాతని యాలోచన. ఆపైని బాణములు పడుట యాగిపోయినవి. ఎవరో వచ్చుచున్న యలికిడి సమీపమున వినవయ్యెను.

చిత్రమైన భయ మాతని నావేశించెను. ఒక్కసారిగా నాతడు లేచి సందుగొందులదూరి పరుగుతీసెను. ఆచీకటిలో గురితప్పక మనుష్యమాత్రు లట్లు బాణ ప్రయోగము చేయగలరా? ఆ బాణములు వదలినదియు తన్ను పట్టవచ్చుచున్నదియు పిశాచము లనియే ఆతని నమ్మకము! మనుష్యు లని యనుకొన్న నంత భయపడువాడు కాడు!

అట్లు పరుగువారిన గండడు మేచనాయకుని వ్యవహారశాలకు బోయిగాని వెనుదిరిగి చూడలేదు. అంతవరకు నతడు అరవనైన అరవలేదు.

అత డక్కడికి చేరునప్పటికి ఇంకను తెల్లవారలేదు. ద్వారమున కాపున్న భటులు 'ఎవరు ఎవరు?' అని అరచుచున్నను మారాడక గండడు పిచ్చికేక వేయుచు భవనములోనికి జొరబడుచుండెను. కావలివారిలో నొకడు శూలమును రెండవవాడు ఖడ్గమును ఎత్తిరి. వారవి యాతనిపై ప్రయోగించెడివారే కాని అంతలో గండని గుర్తించి నిలిపిరి.

ఆ పిచ్చికేక విని మేచయనాయకుడే ప్రక్కనున్న యాత్మమందిరమునుండి బయటకి వచ్చెను.

గండని చేతిలో బాణ మట్లే యున్నది. ముందు మేచయ యాతని చేతిలోని బాణ మందుకొని పరీక్షించెను.

దానిపై సన్నగా స్పష్టముగా 'హ. హ.' యను నక్షరములు లిఖింపబడి యుండెను.

## ౨౬

శ్రీరుద్రదేవమహారాజులు పట్టాభిషిక్తులై రెండునెలలైనది. మార్గశీర్షమాసము నగపడుచున్నది. ఆ మహారాజు యౌవరాజ్యమునకు పట్టాభిషిక్తుడగునప్పటికి రాజ్యమంతయు నల్లకల్లోలముగా నున్నది గదా! కళింగసేనలు ఎంతవరకు వచ్చినవి? కొప్పెరుంజింగ డెవరు? జటావర్మసుందరపాండ్యు డెవరు? వారిసేన లెంతవరకు సాగినవి? చోళు లేమి చేయుచున్నారు? మనుమగండగోపాలు డేమయ్యెను? గొంటూరు నాగదేవుని యలజడి ఎట్లున్నది? బల్లాలరాజ్యపాలకు లేమి చేయుచున్నారు? దేవగిరి యాదవరాజ్యపరిస్థితు లేమి?

జన్నిగదేవుడును త్రిపురాంతకుడును ప్రతిజ్ఞలు చేసి వెడలిరిగదా! వారేమి చేసిరి? కోలనిరుద్రుడు సేనలతో వెడలెను గదా! అత డేమి చేసెను?

ఆంధ్రభాష మాటాడువారి దేశము పవిత్రస్వరూపము నొకమారు స్మరింతము! పూర్వము శ్రీ రుద్రదేవులయు, తరువాత నాతని తమ్మునికుమారుడగు గణపతిదేవులయు నేడు శ్రీ రుద్రదేవమహారాజులయు దృష్టి ఈమహాంధ్రప్రదేశముననే ప్రధానముగా ప్రసరించెను. వారు ఆంధ్రోర్వీశులు! వారలకు ఇతరుల భూభాగము లాక్రమింప వలె నను దురాశ లేదు. కాని యీ యాంధ్రభూభాగము నితరులేమాత్ర మాక్రమింప యత్నించినను దానిని వారు సైరింపకుండిరి.

ఈ తెలుగుభూమికి నడిబొడ్డు శ్రీశైలము! ఆ యమ్మ తూర్పుముఖముగా కూర్చుండి ఉదయభానునికై ఎల్లప్పుడు తన దీర్ఘబాహువులు రెండును చాచియుంచును. ప్రాచీసముద్రతీరభూమి నంటియున్న యా కఠినము లగు పర్వతశ్రేణులే యామె దీర్ఘబాహువులు. ఆమె దక్షిణబాహువు తిరుమలదాటి పాలారునదివరకు ప్రసరించును. వామబాహువు సింహగిరి దాటి మహానది నొరయుచున్నది. ఆమె పృష్ఠభాగమున మంగళాసనమై కళ్యాణకటక మున్నది.

హొయిసలులును యాదవులును కాకతీయరాజ్యమున ప్రస్తుత మెట్టి యాక్రమణమును చేయలేదు. అందుచే కొంత విశ్రాంతిగా రుద్రుడు కూర్చుండ గలిగెను.

ఇక దక్షిణదేశమునపరిస్థితు లిట్లున్నవి. చోళసింహాసనమును రాజరాజనరేంద్రుని కుమారుడగు రాజేంద్రదేవు డధిష్ఠించి కులోత్తుంగచోళచక్రవర్తినామము ధరించి ఆంధ్రచోళపాండ్యకేరళదేశములనే గాక సింహళము శ్రీవిషయము మలయము ఇత్యాది దేశములనుగూడ మహావైభవముతో పాలించియుండెను. కాని యాసమర్థత యతనితోడనే అంతరించెను. నేడు చోళసామ్రాజ్యసింహాసన మధిష్ఠించిన మూడవ రాజేంద్ర చోళుడు అసమర్థుడు. అందుచే నాతని సామంతులు పలువురు స్వతంత్రులై యితని తోడను తమలో తామును పోరుచు వచ్చిరి. అట్టివారిలో కాకతీయ రాజ్యముతోడను ఆంధ్రదేశముతోడను జోక్యము కలిగించుకొన్నవారిద్దరు మాత్రమే. వారు జటావర్మ సుందరపాండ్యుడును, కొప్పెరుంజింగడును!

కొప్పెరుంజింగ డనునది ద్రావిడపదము. దానికి పెద్దరాజు సింగడు అని యర్థము చెప్పవచ్చును. అతని సంస్కృతశాసనములలో నదియే మహారాజసింహు

డని రూపము పొందుచు వచ్చినది. అతడు చేదిమండలము * నేలుచుండిన కాడవ వంశజు డగు పల్లవరాజు. ఇతని తండ్రి పేరు కూడ కొప్పెరుంజింగదేవుడే. తండ్రి కాలముననే చోళసామ్రాజ్యము బలహీనము కాగా, నాతడు చోళరాజుపై నెదురు తిరిగి నిర్జించి యాతని బందీని జేసియుండెను. కాని శీఘ్రముగా చోళరాజునకు మిత్రుడగు కర్ణాటనరసింహరాజు ఆ కొప్పెరుంజింగదేవుని జయించి చోళరాజును బంధవిముక్తుని గావించెను. కాని యీ తండ్రి కొప్పెరుంజింగనితో ఆంధ్రచరిత్రతో సంబంధము లేదు.

ఆంధ్రదేశముతో సంబంధ మున్న యాతనికుమారు డగు కొప్పెరుంజింగడు చిదంబరేశ్వరుని భక్తుడు. అందుచే నాతడు తాను 'కనకసభాపతి సర్వకార్యసర్వ కాలనిర్వాహకుడ' నని బిరుదనామము సగర్వముగా వహించెను. 'ఖడ్గమల్ల' నిశ్శంకమల్ల వాల్ బలెప్పెరుమాళ్', మొదలగు ప్రతాపనామము లాతని పరాక్రమము తెలుపును. అతడు వీరు డగుటయే కాక భరతశాస్త్రమును సాహిత్యమును చక్కగా నభ్యసించి, 'భరతమల్ల సాహిత్యరత్నాకర,' ఇత్యాదిగా అన్వర్థబిరుదములం కూడ పొందెను. ఇతడు ముందు కాంచీపురమున ప్రతిష్ఠితుడై యున్న మనుమగండగోపాలనామాంకితు డగు మనుమసిద్ధిని, అటనుండి నెల్లూరుకు పారద్రోలి కంచిలో తానభిషిక్తు డయ్యెను. కాని యాతనిని గణపతి దేవచక్రవర్తి నిర్జించి తన సామంతునిగా నొనర్చుకొని యుండెను. అది జరిగి యిప్పటికి తొమ్మిది పది సంవత్సరములైనది.

గణపతిదేవునిచే పరాభూతుడైనపిమ్మట ఈ తొమ్మిదిపది సంవత్సరములును అతడూరకుండలేదు. అతడు నెమ్మది నెమ్మదిగా బలము సమకూర్చుకొనుచు స్వాతంత్ర్యము నవలంబించుచుండెను. అతని విజృంభణ నరికట్టుట వృద్ధుడైన గణపతిదేవునకు సాధ్యము కాకుండెను. కాని యంతలో కొప్పెరుంజింగని కొక యుపద్రవము సంభవించినది. ఇప్పటికి రెండేండ్లక్రిందట మధుర ప్రభువగు జటావర్మ సుందరపాండ్యుడు తన ప్రభువగు మూడవ రాజేంద్రచోళుని ధిక్కరించి యుత్తరముగా దండెత్తి వచ్చి, కంచిని ముట్టడించి, కొప్పెరుంజింగని జయించి, యాతని వలన హేమరాసులను అనేకమత్తగజములను హయరత్నములను గొని పుష్కలముగా ధాన్యము పండు విశాలరాజ్యమును హరించెను. కొంతకాల మింకను పెనగులాడుటకు కొప్పెరుంజింగని శక్తి కలదు. కాని యాతడు జటావర్మసుందరపాండ్యునితో సంధి చేసికొనుటయే నీతిగా దలచెను. అందుచే వారికి సంధి యయ్యెను. దాన కొప్పెరుంజింగనికి పోయిన తన రాజ్యమును హేమరాసులును గజాశ్వాదులును తిరిగి సంప్రాప్తమయ్యెను. ఆ సంధితోపాటు ఆంధ్రరాజ్యమునకు మహోపద్రవమే సంభవ మయ్యెను. ఆ సంధివలన ఆ పల్లవపాండ్య ప్రభువు లిరువురు నేకీభవించి ముందు ప్రాచ్యాంధ్ర సముద్రతీరభూమినాక్రమింప నిశ్చయించిరి.

అది సాధించుటకు వారియిరువురకు కావలసినంత భూసైన్య మున్నది. కాని దానికి తోడుగా విస్తారమగు నౌకాబల మున్న గాని వారిప్రయత్నము సిద్ధింపనేరదు అట్టి నౌకాబలము వారికి లేదు. అదిలేనందున కాకతీయుల ప్రచండనౌకాబలము వారి

* ఇప్పటి ఉత్తరార్కాటు మండలమునకు సరిపోవును.

కెన్నదేనియు నిక్కట్లు కలిగింపగలరు. ముందుకు తమ సేనలు సాగిపోవుచున్న యెడ ఆ బలముల వెనుకనుండి కాకతీయసేనానులు దారు లరికట్టవచ్చును. అట్టి విషయమున తమసేనలకు సహాయము అందుట కష్టసాధ్య మగును. ఆ కారణమున వారు ముందు తాము కూడ కొంత నౌకాసైన్యము శ్రద్ధగా కూర్చుకొన నారంభించిరి. ఆ ప్రయత్నము వారి కంత కష్టము లేకుండనే సాధ్య మయ్యెను.

చోళసామ్రాజ్యబలము క్షీణించుచున్నప్పటినుండియు తూర్పు సముద్రతీరమున సముద్రదస్యులు బలసిపోయిరి. విదేశములనుండి వచ్చు నావలను ఈ ఓడదొంగలు పట్టుకొని వారి ద్రవ్యమును సరకులను దోచుకొనసాగిరి. ఇక ఒడ్డు పట్టినప్పటికిని తుపానుచే దెబ్బ తిన్నట్టియు నావలలోని సరకులకు దిక్కుదివాణమే లేకుండెను. ఇట్లు అల్లకల్లోలముగా నున్న సమయమున గణపతిదేవచక్రవర్తి తూర్పు సముద్రతీరమును జయించియుండెను. అప్పు డార్తరక్షణుడగు నా మహారాజు దస్యుల నందర తరిమి తరిమి, వారి రహస్యస్థానము లెల్ల గాలించి యాక్రమించి, వారి నెల్ల నేమించి యుండెను. అంతట నాతడు ముఖ్యములగు రేవుపట్టణములలో తన జలసుంకాధికారుల నిలిపి పరిపాలనము చక్కజేసెను. క్రమముగా నాతడు కూపశుల్క మొక్కటి తక్క మిగిలిన శుల్కము లన్నియు తీసివేసి, సరిగా సుంకము చెల్లునట్లు కట్టడి చేసియుండెను. ఈ శాసనములు పరిపాలించి దస్యుబాధ నరికట్టుటకు ఆతడు రాజ నౌకాబలము నయ్యెడల నిలిపి తీరభూమిని రక్షించుచుండ నియమించెను. ఉత్తరమున కోరంగి నుండి గోదావరీముఖద్వారములం దెల్లెడల గణపతినావలు ప్రత్యేకముగా నొకనావధ్యక్షునిక్రింద నుండి సముద్రయానము చేయువారిని సంరక్షించుచుండెను. మరల మోసలపట్టణము మొదలు కృష్ణానదీముఖద్వారములం దెల్లెడల తిరుగుచు గణపతి నావలుకొన్ని మరియొక నావధ్యక్షుని వశమున నుండెను. మరియు నొక నావధ్యక్షుడు మోటుపల్లి వాడరేవు మొదలుకొని కొత్తపట్టణము రామపట్టణములమీదుగా నెల్లూరు సమీపమందలి కృష్ణాపట్టణమువరకు గల తీరభూమిని రక్షించుచుండెను. ఈ నావధ్యక్షుని ముఖ్యస్థానము మోటుపల్లి. కోరంగి, మోసలపట్టణము, మోటుపల్లి ఈ మూడు రేవుపట్టణములందును ప్రధానమగునది మోటుపల్లి. మోటుపల్లిలో నుండు నావధ్యక్షుడు సిద్ధయదేవచోడడు !

ఇట్లు తీరభూమి సరిచేసి రేవుపట్టణములం దెల్లెడ విదేశవర్తకులకు తన యభయ శాసనములు శిలాస్తంభములపై గణపతిదేవుడు చెక్కింపజేసెను. అందుచే దూరమున నున్న మలయము సువర్ణద్వీపము యవద్వీపము సింహళద్వీపము తోడనేగాక అరబ్బుదేశము ఐగుప్తు దేశములతోడను వెనిసు జెనీవాలతోడ గూడ మోటుపల్లిలో వ్యాపారము సాగుచుండెను. ఈ శిక్షణచే సముద్రదస్యుల యాటలు కట్టువడిపోయెను. అది యా ఓడదొంగల కిష్ట మగునా?

ఆ దొంగలలో లొంగినవారు లొంగగా మిగిలినవారు చోళచక్రవర్తి బలహీనత కనిపెట్టి చోరసముద్రతీరమునకు చేరి యా మండలమునకు బహుకాలమునుండి కల నామము సార్థకము చేయజొచ్చిరి. వారట్లు పులికాటు సరస్సునుండి నాగపట్టణము రేవువరకు స్వేచ్ఛావిహారములు చేయసాగిరి. ఆ చోరులును సామాన్యులా? ఒక్కొక్కడు ఒక్కొక్క ప్రభువే!

# రుద్రమ దేవి

ఆ సముద్రచోరప్రభువులతో జటావర్మసుందరపాండ్యునికిని కొప్పెరుంజింగనికిని ఇప్పుడు పని కలిగినది. వా రాచోరుల రావించి మంతనము లొనర్చి వారి సాయముతో నౌకాబలము కొంత సమకూర్చుకొనిరి. ఆంధ్రసముద్రతీరమున పాడి పంటలు సమృద్ధము గల భూభాగ మున్నది. ఆ ప్రదేశములను విలువగల సరకులు గొని విదేశములనుండి నౌకలు రాకపోకలు తరచుగా సలుపుచుండెను. ఆ భూభాగములను ఆ నౌకలను కొల్లగొట్టుకొను నవకాశము వారు వృథ గావింతురా?

ఇట్లొకవైపున నా పాండ్యపల్లవులు చోరనావికులతో రాయబారములు సాగించుచు, తూర్పుసముద్రతీరమండలముల గల మండలాధిపతులతో గూడ రాయబారములు సాగించిరి. పూర్వము రాజరాజనరేంద్రుని కుమారుడగు రాజేంద్రదేవుడు వేంగీమండలముతోపాటు చోళరాజ్యమునకు చక్రవర్తియై కులోత్తుంగచోడనామము ధరించి చోళులలో నొకడైనప్పటినుండియు, చోళనామధారు లగు పలువురు తెలుగు మాండలికులు ఆంధ్రతీరభూమికి పాలకులుగా నుండిరి. వీరిని తెలుగుచోడు లనియు వ్యవహరించుట కద్దు. వీరికి చోళచక్రవర్తులతో సంబంధములు తెగియు తెగకుండినవి. కాకతీయుల మహాసైన్యములు వచ్చినప్పుడు వా రా ప్రభువుల దాసులగుదురు. ఆ సైన్యము లటునుండి పోయినపిదప దక్షిణమునుండి మహాబలశాలు లెవరైన వచ్చినచో వారికి మరల లొంగిపోదురు. ఎవరి యొత్తిడియు లేకున్నతరి మేమే స్వతంత్రుల మందురు. మధ్యమధ్య వీలయినచో చొరవ చేసికొని దక్షిణమున కాంచీమండలమును తొండమండలమును నాక్రమింతురు. ఈ తెలుగుచోడులలో ప్రముఖులు నెల్లూరు ప్రభువులు. అందులో మనుమసిద్ధి తండ్రియగు తిక్కరాజునుగూర్చి తిక్కనామాత్యు డిట్లు వర్ణించియుండెను.

"శంభురాజాదిప్రశస్తారిమండలికము జేర్చి యేలడె కంచిపురము
జేదిమండలము గాసిగ జేసి కాళవపతి నియ్యకొలుపడే పలచనునకు
రాయగండగోపాలు నరాతిభయదరాయమొండారబిరుదాభిరామ నుభయ
రాయగండాంకు ఖండియరాయ దిక్కధరణివిభుబోల రాజుల కరిది కాదె.

"కమలాప్తప్రతిమానమూర్తి యగు నా కర్ణాటసోమేశు దు
ర్గమదోర్గర్వము రూపుమాపి నిజదర్పంబుం బ్రతిష్ఠించి లీ
లమెయిన్ జోళుని భూమిపై నిలిపి చోళస్థాపనాచార్యనా
మము దక్కంగొని తిక్కభూవిభుడు సామర్థ్యంబు చెల్లింపడే!"

ఈ పద్యములలో తిక్కనామాత్యుడు వర్ణించినది ఈ కొప్పెరుంజింగని తండ్రియగు పూర్వోక్తు డగు కొప్పెరుంజింగని కాలమున జరిగిన చోళరాజ్యకల్లోలమే. ఆ కొప్పెరుంజింగడే ఇందు వర్ణించిన కాళవపతి! తిక్కభూపతిపిమ్మట అతని కుమారు డగు మనుమసిద్ధి నెల్లూరు పాలకు డయ్యెను. అతడు చిన్నతనముననే పరాక్రమము చూపినాడు.

"ద్రవిడక్ష్మాపతిగర్వమున్ దునిమి శౌర్యం బొప్ప గర్ణాటద
ర్పవిఘాతంబు నొనర్చి వైరిమనుజేంద్రశ్రేణికిన్ గొంగనా

నవనిం జేర్కొని యున్నయట్టి విజయశ్మాధీశ్వరుం గాసిగా
నెవిచెం జోళనమన్మసిద్ధి యని బ్రాయేటం బ్రగాఢోద్ధతిన్."

మరియు పొత్తపినాడు, కోణిదెన, మోటుపల్లి, కందుకూరు వెలనాడులో ఎక్కువభాగము ఇట్టి తెలుగుచోడుల పాలనముననే కలదు.

ఈ స్థితిలో పల్లవపాండ్యు లిద్దరు ముందు మనుమసిద్ధితో రాయబారములు సాగించిరి. అత డటు రాజేంద్రచోళరాజును సమర్థింపవలెనో, ఇటు గణపతిదేవుల మైత్రి యర్థింపవలెనో నిశ్చయింపలేని స్థితిలో నప్పు డుండెను. ఎటు చేయుటకును పాలుపోక మానము వహించి యత డుండగా అది కనిపెట్టి పల్లవపాండ్యసేనలు ఒక్కుమ్మడిగా వచ్చి నెల్లూరు ముట్టడించెను. మనుమసిద్ధి తాను స్వయముగా నా సైన్యములను ప్రతిఘటింప శక్తుడు కాడు. అతని కా యాపత్సమయమున నేమి చేయను దోపలేదు. ముందు గణపతిదేవుల సహాయ మర్థింప నాతడు నిశ్చయించెను; అందుకై తిక్కనసోమయాజుల సాహాయ్యము వేడెను. అప్పుడు సోమయాజులు అమాత్యవ్యవహారములు చూచుట చాలించుకొని యనుదినము పినాకినీనదీస్నానము చేయుచు హరిహరనాథుని సమక్షమున మహాభారతరచన సాగించుచుండెను. ఆ మహానుభావునికి రాజ్యతంత్రములలో నిప్పుడు సంబంధము కలిగించుకొను నిచ్ఛ లేదు. అయినను మనుమసిద్ధిపై గల వాత్సల్యముచే కాదనలేక నూరుగురు కరణములను దీసికొని అతడు ఓరుగల్లుకు ప్రయాణ మయ్యెను. త్రేతాగ్నులు వెంటగొని సోమయాజి బ్రాహ్మణబృందముతో పురి వెడలిపోవుచుండ ముట్టడించిన యా సైన్యములు నిరోధింపలేదు. యుద్ధసమయముల నట్లు వైదికనిష్ఠ గల బ్రాహ్మణులు ప్రశాంతప్రదేశములకు వెడలిపోవుటయు, వారి నిరుపక్షములవారును బాధింపకుండుటయు యుద్ధధర్మమున పరిపాటిగా నా కాలమున నుండెను. అందును కొప్పెరుంజింగడు పండితపక్షపాతి.

సోమయాజుల నిట్లు కోటమోటపెట్టి ఓరుగల్లుకు పంపియుండెను. కాని అచటనుండి వెంటనే సహాయము తనకు వచ్చు నను నాశ మనుమసిద్ధికి లేదు. ఓరుగల్లు ప్రభువులకు కొంతకాలముగా శక్తి క్షీణించినది. రాజధానిలోననే అలజడులు జరుగ వచ్చు నని జనశ్రుతి ప్రాకియుండెను. ఒకనా డాకస్మికముగా మనుమసిద్ధి హృదయమున భయ మావేశించెను. వెంటనే యాతడు కోట విడిచి రహస్యమార్గమున ఎక్కడికో వెడలిపోయెను. ఈ వార్తయు నెల్లూరుమండలము దాటిపోయిన కొలది దినములకే సోమయాజులకు చేరెను. అయినను సోమయాజులు తన ప్రయాణము ఆపలేదు.

మనుమసిద్ధి కోట విడిచిపోయి నంతనే అక్కడి సేనలు పల్లవపాండ్యసేనలకు లొంగిపోయెను. కొప్పెరుంజింగడును జటావర్మ సుందరపాండ్యుడును నెల్లూరు ఆక్రమించి దోచుకొని తమ సైనికులకును నాయకులకును ధనము పంచిపెట్టిరి. ఆ పిమ్మట కొంతకాలమువరకు తమ సేనలకు సంపన్నమగు నెల్లూరు పరిసరములు కొల్లగొట్టుటకు వా రనుజ్ఞ యిచ్చిరి. అట్లు దోపిడి పూర్తయైన పిమ్మట వారు క్రమపరిపాలన మారంభించిరి.

నెల్లూరుమండలముతో వారి యాశ తీరలేదు. తూర్పుసముద్ర ప్రాంతమండలి మాండలికు లందరితో వారు శీఘ్రముగా సంబంధము లేర్పరచుకొనిరి. గొంటూరు నాగదేవుడు వారి కనుకూలుం డయ్యెను. కందుకూరు, పొత్తపినాడు, కోణిదేన, మోటుపల్లి, వెలనాడులలోని చోడులు వారికి సహాయులు కా నంగీకరించిరి. అందులో మోటుపల్లిలో నానఖ్యాతు డగు సిద్దయదేవచోడుడు స్వతంత్రు డైనట్లు ప్రకటించి యక్కడి సుంకము లెక్కువ చేసి కప్పయి రాజకోశమున కంపుటే మాని వేసెను.

ఆ సమయముననే పల్లవపాండ్యులు కాళింగులతో గూడ మంతనములు చేసిరి. కాళింగులకు అనాదిగా మంచి నౌకాబలము కలదు. వారి నౌకాబలము పల్లవ పాండ్యులు సేకరించిన చోరసుండలనౌకాబలములతో గోదావరీముఖద్వారమున కలసికొనుటకును, ఆ బలములతోపాటు ఉభయుల భూసైన్యములను ద్రాక్షారామ భీమేశ్వరమున గలసికొనుటకును వారు నిర్ణయించుకొనిరి. ఈ విధమున సముద్రతీర మంతయు కాకతీయుల పాలనమునుండి తప్పింపవలెనని వారల ప్రయత్నము! ఆపిమ్మట పరిస్థితులనుబట్టి కర్తవ్య మాలోచించుకొనవచ్చునని వారు నిర్ధారణ చేసిరి. కాళింగులు పల్లవ పాండ్యుల దోపిడిమూకల సాయముతో నా భూభాగము తామే ఆక్రమింపవచ్చు ననియు, పల్లవపాండ్యులు దోపిడిచేసిన యనంతర మందు ఉండబోరనియు తలంచిరి. పల్లవపాండ్యులకు జిగీషయు ధనాశయునే గాని వేరు చింతలు లేవు.

జటావర్మ సుందరపాండ్యుడు తన సేనలతో నెల్లూరనే నిలిచి, కొప్పెరుంజింగని మహాసైన్యములతో ద్రాక్షారామమువరకు దండు సాగింప బంపెను. అంతలో ఏకశిలా నగరవార్తలు వారికి శీఘ్రముగా తెలియవచ్చెను. 'ఇప్పు డొక యబల కాకతీయ సింహాసన మధిష్ఠించినది! ఆమె భర్తయు పలువురు బలవంతు లగు సామంతులును నామెను ప్రతిఘటించుచున్నారు.' ఇది తెలిసినవెంటనే అందరకు ఏకశిలానగరమునే ముట్టడింపగల మను ధైర్యము కలిగినది.

నెల్లూరునుండి బయలుదేరిన కొప్పెరుంజింగడు రణనీతివిశారదుడు. ఎక్కువ ప్రతిష్టంభనము రాదని యాతడు తలంచినమార్గముననే తన దండు సాగించెను. అతడు ముందుకు సాగుచున్న కొలదియు నౌకాసేనలు గూడ ముందుకు సాగుచుండెను. వారు నెల్లూరునుండి కొంతదవ్వు ఉత్తరముగా ప్రయాణము సాగించిరి. ఆ పిమ్మట సముద్ర తీరము తూర్పుకు తిరుగును. అందుచే నా సేనలును తూర్పునకే తిరిగెను.

ముం దాతడు కందుకూరు చేరెను. అంతట మోటుపల్లిలో తన కిష్టు డగు సిద్ధయదేవచోడుని వదలి, యాతడు వెలనాటికి రాజధాని యగు సనవవోలు అను నామాంతరము గల ధనదుప్రోలికి వచ్చెను. అక్కడి చోళప్రభువు పూర్వనిర్ణీతసంకేత మనుసరించి కొప్పెరుంజింగని సేనలు వచ్చినంతనే వశు డయ్యెను. పిమ్మట వేగముగా నాతడు తన సేనల రెండుగా జీల్చి, గొంటూరి నాగదేవుని మండలము నాక్రమించి, కృష్ణానదిని కొల్లూరునొద్ద నొక సేనయు వెల్లటూరువద్ద రెండవ సేనయు దాటింప నాజ్ఞాపించెను.

ఆ రెండుదళములు నట్లు కృష్ణను దాటి, విజయవాటికను కొలనివీడుమార్గమును, అక్కడ బలమైన సేన లుండు నని పరిహరించి, మోసలపట్టణముపై కేగెను. రెండు వైపులనుండి ఈరెండు వాహినులే కాక సముద్రమునుండి నౌకాబలముకూడ వచ్చి మోసలపురమును ముట్టడించెను. దానికి తాళజాలక అచ్చటి నావధ్యక్షుడుపలాయితుడై కొలనివీడు చేరుకొనెను. మోసలపురము పల్లవరాజుకు హస్తగత మయ్యెను.

కొప్పెరుంజింగ డంత తన పల్లవసేనలతో సంపన్న మగు నా భూభాగమును దోచుకొనుచు గోదావరీముఖద్వారమువైపునకు తన సేనల గదలించుచుండెను.

సరిగా నిట్టిసమయమున కాకతీయసేనాను లగు కొలనిరుద్రు డొకవైపునను జన్నిగదేవుడు త్రిపురాంతకుడు మరియొకవైపునను మహాసేనలతో నీ బహిశ్శత్రువులను అంతరశత్రువులను అడచు ప్రయత్నముతో బయలు వెడలిరి. అంబదేవుడును అన్న మంత్రియు నింకను రాజధానీనగరముననే ఉండిరిగదా!

ఆ మువ్వురుసేనానులును తమలో తాము ను ఇతర కాకతీయసేనానులతోడను రుద్రదేవమహారాజుతోడను సంప్రదించియే బయలుదేరియుండిరి. కొలనిరుద్రుడు కొలనివీడు చేరి, యా చుట్టుపట్టుల గల దుర్గముల నన్నిటిని బలపరచి యటువైపులకు కొప్పెరుంజింగని కాడవసేనలు రాకుండ నరికట్టవలెను. అంతియే కాదు. తూర్పునుండి వచ్చుచున్న కాళింగబలములనుగూడ గోదావరిదరికి రాకుండ నాతడు అడ్డగింపవలెను. ఈవిధముగా నాతడు కాళింగకాడవసేనలు జోడుకాకుండ చీల్పవలెను.

కాని యది చాలదు. అత డిట్లు వారల భూసైన్యములు ఏకము కాకుండ జేసినను, కాళింగకాడవనౌకాబలములు కలసినచో కాకతీయసేనానుల శ్రమ యంతయు వృథ యగును. అందుచే దానితోపాటు వారి నౌకాసేనలకుకూడ చీకాకు కలిగింపవలెను. కోరంగిమొదలు గోదావరీముఖద్వారమున నున్న కాకతీయనౌకాబలములకు ధైర్యము కలిగించి వానికి ఆ యుభయబలముల నెదిరించు శక్తి చేకూర్పవలెను. మోసలపట్టణమును మోటుపల్లియు శత్రువుల స్వాధీనముననే యున్నచో నది సాధ్యము కాదు. ఆ రెండురేవులలో నొక్కటినైనను కాకతీయసేనానులు మరల వశము చేసికొనవలెను. అట్లు చేసినచో పల్లవపాండ్యబలముల బలహీన మగును; కాకతీయబలములకు జయము సులభసాధ్య మగును.

ముందు పట్టవలసినది మోసలపురియా, మోటుపల్లియా? ఏదియైనను ఈసాహసకార్యమునకు పూనుకొన గలుగున దెవరు? అది సాధించు దారి ఏది?

అప్పటికి కొప్పెరుంజింగని కాడవసేనలు కృష్ణానది యుత్తరతీరమునకు దాటియున్నందున అందు గల మోసలపురిని పట్టుటకంటె కిస్తానదికి దక్షిణమున నున్న మోటుపల్లి పట్టుట సుఖతరము. అందును మోటుపల్లి వేలానగరము మిక్కిలి గొప్పది. మోటుపల్లి చేజిక్కించుకొనినవారికే ఆంధ్రసముద్రతీరప్రభుత్వము! అందుచే మోటుపల్లిపై దండెత్తుటకే వారు తుదకు నిశ్చయించిరి.

ఈ సాహసకార్యమునకు త్రిపురాంతకుడు పూనుకొనెను. వారి కుటుంబములో గంగయసాహిణినాటినుండియే బ్రహ్మరాక్షసబిరుదము కలదు. రక్కసగంగనితరువాత

త్రిపురాంతకునికే ఈ రాక్షసబిరుదము వచ్చినది. రాక్షసైకసాధ్య మగు ఈ మహా కార్యము త్రిపురాంతకునిపైననే పడినది.

త్రిపురాంతకు డీ దుష్కరచర్య కుపక్రమింప బోవుచుండు అతడు తన సోదరు డగు జన్నిగదేవునితో కలిసి శ్రీశైలము చేరి యచ్చట మల్లికార్జునస్వామిని భ్రమరాం బను సేవించి వెనుకటి మ్రొక్కులు తీర్చుకొని మరల క్రొత్త మ్రొక్కులు మ్రొక్కు కొనెను. భ్రమరాంబామల్లికార్జునుల ప్రసాదము వడసి యాతడు ప్రచండసైన్యము లతో బయలు వెడలెను.

జన్నిగదేవుడు నెల్లూరినుండి పాండ్యసేనలు బయలుదేరనచో, వానిని నిరోధించు టకు మాత్రమే సిద్ధముగా నుండెను. అత డిప్పుడు ముందుగా నెట్టి పోరునకును తానుగా దిగకుండునట్లు నిర్ణయము చేసికొనెను.

త్రిపురాంతకుడు మోటుపల్లిపై బడుటకు అద్దంకిమీదుగా ప్రయాణమయ్యెను. అద్దంకిలో కాకతీయులకు సారంగు దను మహారాష్ట్రసామంతు డొక డుండెను. అతనికిని నెల్లూరుచోడులకును విరోధము. పూర్వ మీ సారంగునికిని మనుమసిద్ధికిని పోరు కలిగెను. అందులో మనుమసిద్ధిసేనలు జయించెను.

"శృంగారంబు నలంగ దేమియును బ్రస్వేదాంకురశ్రేణి లే
దంగంబుల్ మెలుగేద వించుకయు మహారాష్ట్రసామంతు సా
రంగుం దోలి తురంగముం గొనిన సంగ్రామంబునం దృప్తస
ప్తాంగస్ఫారయశుండు మన్మవిభుపంపై చన్న సైన్యంబులన్."

తెలుగుచోడులు పలువురు పాండ్యపల్లవులతో మైత్రి నెరపినందున, ఈ మహా రాష్ట్రసామంతుడు కాకతీయప్రభువులకు నమ్మినబంటుగా నుండెను. అందుచే త్రిపురాంతకుడు అద్దంకిమండలముమీదుగా మెరుపుమెరసినట్లే మోటుపల్లిపై బడెను.

పూర్వనిర్ణీత మగు సంకేతముప్రకారము గోదావరీముఖద్వారమునుండి కాకతీయ నౌకాసేన యొకటి త్రిపురాంతకుడు మోటుపల్లి చేరునాటి క్రిందటిరాత్రికే అక్కడికి చేరి యా రేవును ముట్టడించెను.

అప్పుడు మోటుపల్లిలో ఎట్టి యుద్ధప్రయత్నమును లేదు. అవల నెల్లూర పాండ్యసేన లున్నవి. ఇటు కొప్పెరుంజింగడు నిరాటంకముగా గోదావరివైపునకు సాగిపోవుచుండెను. ఓరుగల్లులో అబల సింహాసన మెక్కినది. మరి భయ మేమి? సిద్ధయశివచోడ దండుచే నిర్భయముగా ప్రమత్తుడై యుండెను. అతని సేనలుగూడ క్రమశిక్షణ లేక దోపిడీమూక లై పోయినవి. చోరమండలములోని నావికుల దుర్వృ త్తులు మోటుపల్లికి గూడ ప్రాకినవి.

మోటుపల్లిలోనివారు తెల్లవారి చూచునప్పటికి దూరమున వరాహధ్వజములు గాలిక ఉత్సాహముతో నాడుచుండ కాకతీయ నౌకలు తెరచాప లెత్తి దివ్యవిహంగ ములవలె నడయాడుచు కనిపించెను. వాయువుగూడ ముట్టడించిన యా నౌకలకు అనుకూలముగను, రేవులోని నావలకు వ్యతిరేకముగను ఉన్నది.

మోటుపల్లిరేవులోని నావికులు తత్తరముతో తమ నావలు సిద్దము చేయసాగిరి. కాని యీమధ్య ఆ నావలలోని నావికులును సైనికులును దోపిడీకిని భోగములకున

అలవాటు పడియున్నందున, వారు తమ నిర్ణీతస్థానములు వదలి దూరస్థలముల కేగి యుండిరి. వారిలో కొందరు పానశాలలలోనను,—కొందరు యవనభోగగృహములందును, తాము అన్యాయముగా సంపాదించిన ద్రవ్యము వెచ్చించుచుండిరి. అందుచే కొన్ని నావలకు పనివారు లేరు. ఒక నావకు కూపక స్తంభమే కనబడదు. మఱియొకదాని కది విరిగియే యుండును. ఒకదాని తెడ్లు కనబడవు. మరియొకదానికి తెడ్లు దూర్చు మేకులు విరిగియుండును. అవి బాగుచేయు దారుశిల్పులు కనబడరు. రేవులో ఇట్లు గందరగోళముగా నున్నది. దూరమున నడయాడుచున్న కాకతీయనౌకలు చేరువకు వచ్చుచున్నట్లుండెను. అంతకంతకు రేవులో అలజడి యెక్కు వయ్యెను. అచ్చటనున్న ఏబది నౌకలలో నొక్కటియు పోరుకు సిద్ధము కాలేకపోయెను.

ఆ సమయముననే సరిగా త్రిపురాంతకుని సేనలు మోటుపల్లి పట్టణకుడ్యములను ముట్టడించి భయంకరముగా రణదుందుభులు మ్రోయించెను. ఆ రణదుందుభులను 'త్రిపురాంతక, త్రిపురాంతక, త్రిపురాంతక'యని యాతని నామమును ఘోషించు చున్నట్లే వినవయ్యెను. సేనల యట్టహాసములకంటె ఆ రణదుందుభిధ్వానములే తీవ్రతరముగా నుండెను. కోటలో నున్నవారికి గుండెలు దడదడలాడిపోయెను.

ఆ దుర్గమును దుర్గమువలెనే లేదు. కందకములలో నీరు సరిగా లేదు. కోట గోడలపై భటులు యథాస్థానములలో కాపు లేరు. ఉన్న కొలదిమందియు త్రావి మత్తిల్లినవారును నిద్రించువారును నై యుండిరి. వరుసగా కొన్నిదినములుగా పట్టువడిన యలవాటులు ఒక్కనాటిలో పోవునా?

త్రిపురాంతకుని కాశ్చర్య మయ్యెను. అతనికి మోటుపల్లిలోని అశ్రద్ధ కొంత వరకు చారులవలన తెలిసియే యుండెను. కాని యాతడుగూడ నింత ప్రమత్తముగా నుండు నని యూహించి యుండలేదు. ఏమైన నేమి? ఆతని భటులను ప్రతిఘటించువారే లేనట్లుండెను. అందుచే అపరాహ్ణముననే మోటుపల్లికోటను త్రిపురాంతకుని సేన లాక్రమించెను. వెంటనే కోటపై నితగధ్వజము లన్నియు విరుగగొట్టించి కాకతీయప్రభువుల వరాహధ్వజమును, అంతకంటె కొంచెము క్రిందుగా తన ఖట్వాంగధ్వజమును త్రిపురాంతకుడు ఎత్తించెను.

సిద్ధయదేవచోడుడు తప్పించుకొని పారిపోవుటకుగూడ నవకాశము లేకపోయినది. కతిపయభటులతో త్రిపురాంతకుడే రాజభవన మెల్లెడల వెదకి వెదకి సిద్ధయదేవచోడుని పట్టుకొని, కేశములు గ్రహించి నేలకు దిగలాగి, శిరస్సుపై కాలూని భయంకరమూర్తియై యాతని తల తెగనరకెను. వెంటనే త్రిపురాంతకుని యాజ్ఞలు పాలించి సైనికులు రక్తమోడుచున్న సిద్ధయదేవచోడని శిరస్సును మొండెమును రెండిటిని రెండు పొడుగుపాటి శూలములకు గ్రుచ్చి, వేలానగరము గోపురద్వారమునకు ఇరుప్రక్కల నెత్తుగా నిలిపిరి. అది చూచి వేలానగరములోని సేనలు గూడ భయభ్రాంతము లై లొంగిపోయెను.

గోదావరీముఖద్వారమునుండి వచ్చిన కాకతీయనౌకలు ముప్పదియే! మోటుపల్లి వేలానగరమున ఏబది నౌకలు కలవు. అందుచే కాకతీయనౌకలకు వేలానగరములోని నౌకలను జయింపగల శక్తి లేదు. అవి వెదకించి త్రిపురాంతకుని ముట్టడికె

సాయము చేయుటకు మాత్రమే ఉద్దేశింపబడినవి. అవి స్వయముగా పోరుటకు కవియుట లేదు. వేలానగరములోని నౌకలు తీవ్రముగా విజృంభించినచో నవి పారిపోవుటకుతగు ప్రయత్నమునందే యుండెను.

కాని యిప్పటి స్థితిగతులు మారిపోయినవి. ఆకస్మికముగా వరాహధ్వజము కోటపై ఖట్వాంగధ్వజముతో పాటు గాలికి ఉత్సాహముతో నాడుచున్నది. కాకతీయనౌకలకు గమ్మని సంజ్ఞలు కోటనుండి స్పష్టముగా సంకేతితిమార్గమున కానవచ్చెను. కాకతీయనౌకలకు వాయు వింకను అనుకూలముగనే వీచుచున్నది. పోటు కూడ ప్రారంభించినది. ఉత్సాహముతో నా నౌక లొక్కపరుగున వేలానగరములోని ఉప్పుటేరులో జొరబడెను. అక్కడ నున్న ఏబది నౌకలును ఎదురాడకుండ కాకతీయనౌకలకు లొంగిపోయెను. త్రిపురాంతకుని తాత్కాలసాహసము ఫలించెను.

వెంటనే అతడు మోటుపల్లి పట్టుకొన్న వార్త శ్రీరుద్రదేవమహారాజునకును జన్నిగదేవునకును అంచెలమీద వేగరులచే తెలియజేసెను. కోటలో నామమాత్రముగనే అతడు విజయోత్సవము చేసెను. మోటుపల్లిస్థితి అయోమయముగా నున్నది. పాండ్యసేనలు గాని కాడవసేనలు కాని ఎప్పుడైన రావచ్చును. చుట్టుప్రక్కల నున్న మాండలికు లెవ్వరైనను దండెత్తవచ్చును. చోరనావికుల నావలును ఊరకొనునా! వేలానగరమును మోటుపల్లిదుర్గమును ఎట్టిశత్రువుల నైన నెదుర్కొనగలుగు సన్నాహము లొనర్పవలసి యున్నది. అవసరమైన చర్యలు అతడు కఠినముగా తీసికొని, స్వయముగా నచ్చటి స్థలదుర్గమును జలదుర్గమును బలపరిచెను. సైనికులును నావికులును రాత్రింబవళ్ళు జాగరూకులై వేయికళ్ళతో జలమార్గములను భూమార్గములను గాచుచుండిరి. వేలానగరమున గణపతిదేవుల యభయశాసనము పునఃప్రతిష్ఠితమయ్యెను. త్రిపురాంతకు డామండలమునం దెల్లెడ నలజడులు లేకుండ శీఘ్రముగా నిరోధించెను.

ఇకముం దాతడు చేయవలసిన పని నిశ్చితము కాలేదు. జన్నిగదేవుడు ముందు పాండ్యసేనల నెదుర్కొనుటా, కొప్పెరుంజింగని వెన్నాడుటా, నిర్ధారింప లేకుండెను. అంబదేవుడు రాజధానినుండి మహాసేనతో ఇంకను రావలసియుండెను. కోలనిరుద్రుడు కాళింగసేన నెంతవరకు ప్రతిఘటింపగలడు? వానిపైన త్రిపురాంతకుని భావిచర్యలాధారపడియుండును.

కాకతీయసైన్యములు నిర్భయముగా దాటిపోయి మోటుపల్లి పట్టుకొనిన వార్త మెరుపుమెరిసినట్లు తీరభూముల నెల్లెడ ప్రాకిపోయెను. అది విన్నవారు ముందు నమ్మలేకపోయిరి. మరల మరల నా వార్తయే వచ్చి ధ్రువపడినపిమ్మట అక్కడి నాగరికులును జానపదులును బ్రదికితి మని నిట్టూర్పులు విడిచిరి.

ఈవిధముగా రుద్రదేవమహారాజునొద్ద ఆమెసేనానాయకులు విజయదశమినాడు చేకొన్న ప్రతిజ్ఞలలో నెల్ల ముందుగా త్రిపురాంతకుడే తన ప్రతిన అక్షరశః సిద్ధయదేవచోడని తల నరకి పాలించెను. ఆతడు మహారాజునకు పంపిన విజయపత్రముతో పాటు, ఆనాడు తెనకు వచ్చిన జమ్మిపత్రమును, సూత్రముతో కట్టిన సిద్ధయదేవనామాంకితపట్టమును గూడ పంపుట మరవలేదు.

## ౨౮

వోరాటుపల్లి విజయవార్త చేరినవెంటనే శ్రీరుద్రదేవమహారాజు స్వయముగా శ్రీ గణపతిదేవుల దర్శించి వారి కా శుభవార్త ముందుగా నెఱిగించెను. విజయదశమినాడు రాజ్యభారము కుమార్తె కప్పగించిన దాది గణపతిదేవుల యారోగ్యము బాగుపడ జొచ్చెను. శరీరదార్ఢ్యము క్షీణించిపోయిన దినములలోగూడ ఆయన బుద్ధిలోనిచురుకు దనముమాత్రము ఏమాత్రము క్షీణించి యుండలేదు. శ్రీ రుద్రమదేవుల యభిషేకము నిశ్చిత మగువరకు భావిప్రభువును గూర్చిన చింత నిరంతర మాతని వేధించుచుండెను. ఆ విచార మంతయు రాజగురువులగు శ్రీ విశ్వేశ్వరశంభువుల ధర్మనిర్ణయముతో అట్లె విరిసిపోయెను. శ్రీగురువుల యాదేశానుసారము తాను చేసిన నిర్ణయము ప్రకృతు లంగీకరించిరి. దానితో చక్రవర్తి మనస్సు స్వస్థ మయ్యెను. మనస్స్వాస్థ్యముతోపాటు శరీరమునకు ఓజస్సు ప్రారంభించెను. పట్టాభిషేకానంతర మది మరింతస్థిరపడసాగెను.

కాని తదాది గణపతిదేవులు రాజ్యకార్యములలో జోక్యము కలిగించుకొనుట లేదు. కొంతకాలము రుద్రదు ప్రధానకార్యములలో తానే స్వయముగా పితృదేవుల దర్శించి వారిని కర్తవ్య మేమో ఉపదేశింప నర్థించుచుండెను. అట్లు కుమార్తె చెప్పు చున్న విషయము లన్నియు శాంతముగా నాత డాలకించును. తుదకు ఉపదేశ మర్థించి నప్పుడు వేరేమియు పలుకక ‘శివేచ్ఛ నిర్వర్తింపుము’ అని మాత్రమే ఉపదేశించును. ఎన్నిమారు లడిగినను ఆతడు, ‘శివేచ్ఛ చేయుము’ ‘శివాజ్ఞ పాలింపుము’ ఇత్యాదిగా ఒకే యర్థ మిచ్చు నుపదేశము చేయుచుండెను.

అనాదిగా భరతఖండములో రాజపుత్రులు ఆన్వీక్షికితోపాటు వేదవేదాంగముల సారమును సాహిత్యరహస్యములను చతుష్షష్టికళలను సూక్ష్మముగా నభ్యసించుచుండిరి. అవియు ఋషితుల్యులును అనుభవశాలురు నగు మహానుభావులే వారి కుపదేశించు చుండుటచే, ఆ రాజపుత్రులకు భారతీయధర్మము దృఢముగా నబ్బుచుండెను. అందుచే వారు తమకు సులభసాధ్యములగు భోగములందు లౌల్యమును, అధికారమునందు దుర్మదమును, పరిహరించి ప్రవర్తింపజాలుచుండిరి. వారు నిర్లిప్తులు. వారికి జనకమహారాజు ఆదర్శ ప్రభువుగా భాసించుచుండెను. దాన వారును రాజర్షులే. ఆంతరంగిక కార్యములలో నిష్పక్షపాతముతో గూడిన ధర్మవిచక్షణయు, వైదేశిక వ్యవహారములలో దక్షతయు, వారికి సులభముగా నలవడుచుండెను. రాజ్యతంత్రనిర్వహణము వా రొకవిధిగా తలంచి పాల్గొనుచుండిరి.

ఇట్టి విద్య నేర్చినవారిలో కొందరు విద్యానంతరముననే విరక్తు లగుచు, రాజ్యతంత్రము నిర్వహించు నిచ్ఛ లేనివారై తమ తమ్ములకో మరియొకరికో రాజ్య భార మప్పగించి మునివృత్తి కాలముగడుప వనము కేగుటయు కద్దు. అట్టిది అరుదు. కాని వార్ధకము వచ్చిన పిమ్మట సమర్థు డగు తమ్ముడో కుమారుడో ఉన్నచో, అట్టి వానికి రాజ్యభార మప్పగించి తాము వనప్రస్థు లగుటమాత్రము సర్వసామాన్యమే. అట్లు పరులకు రాజ్యభార మప్పగించిన పిమ్మట వారు సకల రాజ్యతంత్రములో

జోక్యము పూర్తిగా మానుకొనుచుండిరి. వారికి బ్రహ్మచర్యముననే ఉపదిష్టమై, రాజ్యభారము వహించిన దినములలో విస్మృతము కాకున్న, అధ్యాత్మవిద్య నిప్పుడు వారు సాధింప నిరంతరసాధన చేయుచుండిరి. రాత్రిందివమును భగవద్ధ్యానము, సత్కథాకాలక్షేపములు, అధ్యాత్మచింతనములతో వారు కాలము గడపుచుండిరి. వనమునకు వెళ్ళినను, పురమున నున్నను వారు వనప్రస్థులే. అట్టి వనప్రస్థవృత్తినే గణపతిదేవచక్రవర్తి విజయదశమినాటినుండి సాగించుచుండెను.

ఆకారణముననే రుద్రమ ముందు ఎన్నిమారులు రాజకార్యములు నివేదించినను, అతడు విని ‘శివాజ్ఞ నెరవేర్పు’ మనియే ఉపదేశించుచుండెను. కొన్ని పర్యాయములు మరలమరల నట్లే జరిగిన పిమ్మట రుద్రమయు వారికి రాజకార్యములు నివేదించుటయే మానెను. భగవత్కాలక్షేపముతో ప్రొద్దుపుచ్చు పితృదేవులను వారు సన్యసించిన రాజ్యపు చింతలతో మరల బాధించుటేల? కాని వారు శివేచ్ఛ నెరవేర్పు మని పలుమారులు ఉపదేశించినదిమాత్రము ఆమె హృదయములో దృఢముగా నాటుకొనిపోయెను. ఏ ముఖ్యకార్యమున నిశ్చయము చేయవలసివచ్చినను ఆమె శాంతముగా ‘ఇందులో శివేచ్ఛ ఎట్లుండును?’ అనియే విచారణ చేసి మరి నిశ్చయించును.

త్రిపురాంతకుడు మోటుపల్లి గొనిన వార్త సామాన్యవార్త కాదు. అది మహాసాహసకార్యము. ఇప్పటికి ఐదారుసంవత్సరములుగా కాకతీయదండనాథులు తలపెట్టలేకుండిన గండకార్యము! ముందు రుద్రమసేనానులు సాగింపబోవు వీరవిహార నాటకమునకు ఇది నాంది. అదియును ఇంత శీఘ్రముగా నిర్వహింపబడుట యద్భుతములలో నెల్ల అద్భుతము. అన్నిటికంటె ప్రధానమైనది—ఇది శ్రీరుద్రదేవమహారాజుల ప్రథమవిజయము!

అందుచే వార్త విన్నంతనే రుద్రమ యానందతన్మయత నొంది ముందుగా పోయి పితృదేవుల కది ఎరిగించెను. ఈమధ్య రాజకార్యములు ఆమె గణపతిదేవుల కెరిగింపకుండెను గాని ఈ శుభవార్త ఎరిగింపకుండ గలదా? వారికీవార్త ఎరిగించి వారి యాశీర్వచనము పొందవలె ననియే, ముందామెకు స్ఫురించెను. వెంటనే యామె స్వయముగా పితృదేవుల దర్శించి శుభవార్త నివేదించెను.

గణపతిదేవు లావార్త పరమశాంతముగా నాలకించి, తన ప్రసన్నదృష్టి రుద్రమపై నాపాదమస్తకము ప్రసరింపజేసి, మ్రొక్కియున్న యామెను ఆశీర్వదించి లేవదీసెను. ఆపిమ్మట నతడొకపరి గవాక్షమునుండి తన దృష్టిని ఏకశిలానగరవీధులపై ప్రసరింపజేసెను. అందెక్కడను మహోత్సవచిహ్నము లాతనికి గోచరింపలేదు. ఈమారు ‘శివాజ్ఞ నెరవేర్పు’మను వాక్కులు ఆయన నోట రాలేదు. అట్లు వచ్చునని రుద్రమ కూడ భావింపలేదు.

‘నగరమున విజయోత్సవము ప్రకటించితిరా?’

గణపతిదేవు లాదేశింపలేదు; ప్రశ్నించిరి. అంతవరకు రుద్రమ యేమియు నను కొనియుండలేదు. ఎవరిని ఆలోచింపలేదు. వార్త తెలిసిన వెంటనే, శుభవార్త తండ్రి కెరిగింపవలె నని పరుగెత్తుకొనిపోవు పిల్లవానివలెనే, రుద్రమయు వచ్చి

ఇట్లాతని కీవార్త యెరిగించి యుండెను. గణపతిదేవు లిప్పు డీ ప్రశ్న వేయగా రుద్రమకు వెంటనే కర్తవ్యము స్ఫురించినది. వారు ప్రశ్నయే వేసినను అదియును ఒక ఆదేశమే. గణపతిదేవు లట్లాదేశింపకున్నచో నామె యాప్తమంత్రులతో నాలోచించి గాని యీ వార్త నగరములో ప్రకటించుటో మానుటోకూడ నిశ్చయించి యుండదు. కాని యిప్పు డట్టిది అవసరము లేదు. ఆ ప్రశ్నయే ఆదేశముగా గ్రహించి యామె వెంటనే మహాప్రధాను లగు గోవిందనాయకుని బయ్యనవాయకుని తిక్కచమూపతిని అంబదేవుని బిలిపించి, వారెల్లర కీ శుభవార్త గణపతిదేవుల సముఖముననే ఎరిగించి మూడుదినములు విజయోత్సవములు రాజధానీనగరమునను చుట్టుప్రక్కలను ప్రధాన నగరములను మహావైభవముతో జరుప నాజ్ఞాపించెను. వారందరు శ్రీరుద్రదేవ మహారాజులకు జయాభినందనములు చేయుచుండ గణపతిదేవులు ప్రమోదభరితులై తిలకించుచుండిరి. వారంతట సెలవు తీసికొని యుత్సవసన్నాహములు చేయ బయలు వెడలిరి.

ఆపిమ్మట కొద్దిసేపటిలో గజమందురమునుండి గజఘటలు ఘంటానాదములతో బయలుదేరినవి. 'వీటం బీథుల నెల్ల నేనుగులపై విస్ఫారఘంటాధ్వనిం జాటం బంపిరి పేర్మి' త్రిపురాంతకుని 'జయాశ్చర్యంబు!'

ఆ యుత్సవములో వీరప్రదర్శనకార్యక్రమ మెల్ల అంబదేవుని కప్పగింపబడెను. ఏకశిలానగరమున నుత్తరపార్శ్వమున హనుమకొండవరకు నొక పెద్ద సరోవరము కలదు. దానిని 'భద్రిచెరువు' అని పిలుచుటయు కద్దు. దాని తూర్పుతీరమున పొడుగునను రాచవారి బాహ్యోద్యానము కలదు. అందు పటకుటీరాదులు నిర్మించుకొనిన రాజసైన్యముల స్కంధావార మున్నది. ఇప్పు డాస్కంధావార మంతయు నంబదేవుని యాజ్ఞలచే నొక్కుమ్మడిగా యాతాయాతజనవ్రాతముతోడను, గజాశ్వ రథములతోడను సందడించుచు నుద్బుద్ధమైన ట్లుండెను.

ఆ సాయంత్రమున నందుండి వీరభటసహస్రములు బారులుతీరి యూరేగ సాగిరి. ముందు స్వలంకృతము లగు గజఘటలు, ఆ పిమ్మట చిత్రవర్ణములు గలిగి కనులు మిరుమిట్లు గొలిపించు గౌసెనలతో నలంకరింపబడిన యశ్వము లధిరోహించిన యాశ్వికదళములును, వానికి మధ్యమధ్య ప్రధానసేనాపతుల యాందోళికలును రథములును సాగుచుండెను. అందరికిని మధ్యగా సమున్నతగజముపై ముత్యాలు కూర్చిన అంబారీలో త్రిపురాంతకుని రూపము గంభీరమనోజ్ఞముగా చిత్రించిన పటమును, దాని ప్రక్కనే అంబదేవుడును ఉండి ఊరేగుచుండిరి. ఆ వెనుక మరల రథములు ఆందోళికలు ఆశ్వికదళములు గజఘటలు వచ్చుచుండెను. ఉత్సవము బారునను పదాతులు, ఖడ్గశూలాద్యాయుధధరులు ధనుర్ధరులు వరాహధ్వజహస్తులు, నై సాగుచుండిరి. మరియు వీణావేణువాద్యములును సన్నాయిలును మ్రోయించుచు నడుమ నడుమ పలువురు వెడలుచుండిరి. నట్టువకత్తెలు మోటుపల్లి జయము వీరరస ముట్టిపడునట్లు అభినయించుచు చూపర నాకర్షించుచుండిరి.

చప్పరములం దల్ల చలువచప్పరము లున్నవి. అందు త్రిపురాంతకుని పట మున్న భద్రగజముపై పుష్పవృష్టి కురియుచుండెను. నగరమంతయు ముత్యాల రంగవల్లులు

ప్పబడియుండెను. వీథులెల్ల మంగళపత్రములతో పుష్పములతో తోరణములతో ంకృతములై యున్నవి. ఆ యూరేగింపు పట్టణ మెల్లెడల సాగి జయజయ నినాద ఁబు మిన్నుముట్టుచుండ, రాజప్రాసాదము ముందున్న విశాల ప్రదేశమున నాగెను.

అచ్చట రాజమందిరములోనుండి సువాసినులు పూర్ణకుంభములతో నెదురువచ్చి ంగళారార్తికము లిచ్చిరి. అంతలో రాజభవనాట్టాలకి ములనుండి ఉన్నతాసనమున ్న శ్రీ రుద్రదేవమహారాజులు దర్శన మిచ్చిరి.

వెంటనే ఆందోళికలు దింపబడెను. ఒక్కసారిగా నాందోళికలనుండియు రథ లనుండియు ప్రథానదండనాథులు దిగి, రుద్రదేవమహారాజులకు నతు లొనర్చిరి. పురాంతకుని పటముతో నంబడేవు డున్న భద్రగజము మావటీని చే ప్రేరితమై రుద్ర వమహారాజుల కెదురై మోకరించెను అంతట నొక్కసారి నిశ్శబ్ద మయ్యెను. అంబ ప్రజ మహారాజులకు గొంతెత్తి జయజయనాదము లొనర్చెను. ఒక్కసారిగా నలు క్కుల ఘంటానాదములు పిక్కటిల్లెను.

ఆరాత్రి మిక్కిలి ప్రొద్దుపోవువరకు వీర వినోదము లచ్చట సాగెను. అశ్వ డలు, గజక్రీడలు, ఖడ్గయుద్ధములు, బాణప్రయోగములు, శూలకుంతాదిసాధనలు నువిధముల ప్రదర్శింపబడెను. మల్లయుద్ధములు జరిగినవి. గండడీనాడు సులభముగా తిమల్లుర నెల్లర నోడించెను. అతడు విచిత్రభిక్షుకుని వెన్నంటి పోయిననాటి రాత్రి నుభవముతో నాతనికి రెండుమూడునాళ్ళు ఆందోళనముకలిగి మనస్స్థిమితము ండెను. కాని యిప్పటి కాతడు స్వస్థుడైనాడు. బొల్లడు దేశాంతరగతుడైన రి గండని నెదిరించు ప్రతిమల్లుడే లేడు. పలువురు బొల్లనిగూర్చి యానాడు మనస్సు లో స్మరించిరి.

ఆ మరునాడు మధ్యాహ్నమునుండి యపూర్వ మగు నాటకప్రదర్శన మొకటి గెను. స్వయంభూదేవుని సరోవరమున క్రీడార్థము కొన్ని నావ లుండును. అం కదాసని చక్కగా అలంకరించి, అందులో స్వయంభూదేవుని యుత్సవసమయము ఉత్సవవిగ్రహముల నుంచి సరోవరవిహారము చేయించు నాచారమును గలదు. సరోవరమున గల క్రీడానౌకలను నేడు యుద్ధనౌకల ననుకరించున ట్లలంక రి. అంతట మోటుపల్లిలో జరిగిన సముద్రయుద్ధమును, నేలపై యుదమును, ప్రేక్షక హము సమక్షమున అద్భుతముగా ప్రదర్శింపబడెను.

ఆ చెరువు దక్షిణపుచివరను తీరము నాని చాలనావలు నిద్దురపోవు ట్లే నిలిచియున్నవి. వానికట్టి యలంకారములును లేవు. అందలి నావికులును లును అశ్రద్ధగా నృత్యములతో గానవినోదములతో క్రీడలతో లోకాభిరామా ములతో ప్రొద్దుపుచ్చుచుండిరి.

ఇక నీవలి యొడ్డున, స్వయంభూదేవాలయదక్షిణద్వారసమీపమునుండి అల్ప ్యాకము లగు నావలు బయలుదేరినవి. ఇవి సర్వాలంకృతములై ధనుర్ధరు లగు తో నిండియుండి వీరోల్లాసముతో కలకలలాడుచున్నవి. వరాహ ధ్వజములు కల్లాడు చుండగా ఇవి బయలుదేరుటలోనే ఒక ఉత్సాహము ద్యోతమయ్యెను.

ఈస్వయంభూదేవుని నావలు సమీపించువరకు నావలియొడ్డున గల నా
లన్నియు కదలక మెదలకున్నవి. కాని యివి సమీపించుచున్నంతనే ఆవలి నావలలో
కలవరము ప్రారంభించినది. సంభ్రమముతో నవి యుద్ధమున కాయితము కాజొచ్చి
నవి. కాని ఒకదానికి చుక్కాని లేదు; మరియొకదానికి చాపకట్టు కంబము లేదు
కొన్నిటికి తెడ్లులేవు; కొన్నిటికి తెడ్లుదూర్చు మేకులు లేవు; మరికొన్నిటికి తె
చాపలే కనబడవు. నావికులు కొన్నిటి తెగచాపలు పరుచుకొని వానిపై నిదురించుచు
చుండిరి. వారు నిద్రలోనుండి తత్తరముతో లేచి చాపలు కొడికి తగిలింపబో
చుండ నవి జారి నీటిలోబడి తడిసిపోవుచున్నవి. భటుల వద్ద విల్లున్న నంబులుండవు
అంబులున్న విండ్లుండవు. ఇట్టి గందరగోళములో నున్న యా శత్రునౌకలను
స్వయంభూనౌకలు చుట్టుముట్టెను.

ఆసమయముననే త్రిపురాంతకుని పటమున్న భద్రగజముపై నంబదేవు డుండి
సేనతో నావలి యొడ్డునగల పటకుటీరములపై పడెను. వానినెల్ల నాతడు శీఘ్రముగ
చుట్టుముట్టి స్వాధీన మొనర్చుకొని యందున్న సిద్ధయ దేవుని బంధించెను.

ఆసిద్ధయదేవుని ప్రదర్శించుటకు, ఆతని యాకారము ఎరిగినవారు నిజముగ
నాతడే ప్రత్యక్షముగా కనబడుచున్నా డని భ్రాంతిపడునంత చక్కగా, నాతని
బొమ్మ యొకటి చేయబడెను. ఆ క్రిందటిరాత్రి యంతయు మేలుకొనియుండి ఓ.౧
గంటి మోహరివాడలోని వస్త్రపుపనివారు పలువురు కలసి గడ్డితో నా బొమ్మ చేసి
దానిపై మట్టి పూసి రంగులు చిత్రించిరి.

అట్లు చేయబడిన సిద్ధయదేవుని ప్రతికృతిని అంబదేవుడు శిరశ్ఛేదము చేయించి
దాని మొండెమును తలయు చెరియొక ప్రక్కను ఆవలి రేవుమొగను ఎత్తుగా నిలు
నట్లు చేసెను.

అంతట స్వయంభూనౌకలు అవలి యొడ్డున గల శత్రునౌకల నెల్ల స్వాధీ
మొనర్చుకొని యందలి నావికులను భటులను బంధించెను.

మోటుపల్లి విజయయుద్ధనాటక మీ విధముగా ప్రదర్శింపబడుచుండ దాని
విలోకించుటకై శ్రీరుద్రదేవమహారాజు ఆ సరోవరము నానియున్న ఏకశిలాక్రీడ
నగరమున పేరోలగము తీరియుండెను. ఆమె ప్రక్కనే మహాధ్వజస్తంభము వలె నం
రక్షకుడగు పర్వతనాయకుడు సర్వాయుధోపేతుడై నిశ్చలముగా నిలిచియుండెను
ప్రక్కనే బాలప్రతాపరుద్రదేవు లధివసించియుండిరి. శ్రీరన్ గోవిందనాయకుడు
బయ్యననాయకుడు, తిక్కచమూపతి, జాయప, బద్దెన, మహాదేవరాజు, స్థలసుంకా
కారి యగు గోనగన్నారెడ్డి, ఆయసగాండ్ల యధికారి యగు నాగదేవుడు, రేచ
కామయ, నామయ, మల్లయ, గణపిరెడ్డి, వర్రెడ్డి, కోటకేతరాజును మరియును పెక్కు
రున్నతాధికారులు నందు యథోచితస్థానము లలంకరించి యుత్సవము తిలకించుచుండి
నాగరికు లగు జనులందరు నా సరోవరపశ్చిమతీరమున గుంపులు గుంపులుగా కూ
యా వినోదము నుత్సాహముతో తిలకించుచుండిరి.

మోటుపల్లి స్థలజలదుర్గములను పట్టుకొనుట ప్రదర్శించిన పిమ్మట అంబదేవు
ఏనుగుపైనుండి దిగివచ్చి, త్రిపురాంతకుని ప్రతికృతిని, ఆతడు పంపిన జమ్మిరెమ్మ

సిద్ధయదేవనామాంకితపత్రమును, వినీతుడై మహారాజులకు అర్పించెను. ఒక్కసారిగా జయజయనినాదములు క్రీడాపర్వతమున నుప్పతిల్లి సరోవరము నుత్తరతీరమున గల రాజభటసందోహమునను, దక్షిణతీరమునగల నావలయందును అచ్చటి వీరులందును, పశ్చిమమున గల ప్రేక్షకనాగరలోకమునందును ప్రతిధ్వనించెను.

అప్పుడు శ్రీ రుద్రదేవమహారాజు లేచి స్వయముగా త్రిపురాంతకుని పటము శిరస్త్రాణముపై నా జమ్మిరెమ్మయు సిద్ధయదేవనామాంకితపత్రమును అలంకరించెను. మరియు త్రిపురాంతకునికి పూర్వముండ్న బిరుదావళికి తోడుగా ఈనాడు, 'సిద్ధయ దేవచోడ తలగొండుగండ' అను బిరుదము సభాసమక్షమున మహారాజు ప్రసాదించెను.

మూడవనాటి యుత్సవములు బహుమతులు పంచిపెట్టుటతో ఎక్కువభాగము సరిపోయెను. ఆ రాత్రి వీధినాటకములు బొమ్మలాటలు చత్వరమున కొక్కటిగా ప్రవర్తిల్లుచుండెను.

ఈ మూడునాళ్ళును నగరమంతయు మహోల్లాసముతో నుండెను. కాని ప్రతి దినమును అపరరాత్రవేళ సంగీతములో నపశ్రుతివలె నొక భిక్షుకుని కంఠస్వరము వీధి వీధుల వాడవాడల ప్రసరించుచుండెను.

"అల్లో జ్యేష్ఠం శ్రేష్ఠం పరమం పూర్ణం బ్రహ్మాణ మల్లాః
అల్లో రసుల మహామదరకం వరస్య అల్లో!"

* * * *

ఇల్లా కబర ఇల్లా కబర ఇల్లల్లేతి
ఇల్లల్లాః ఇల్లా ఇల్లల్లా!"

ఈవిధముగా తెగని తీగవలె నా నూతనోపనిషత్తు సాగిపోవుచునే యుండెను.

మరియు నొకవంక విజయోత్సవములు సాగుచునే యున్నవి. భద్రసరోవరతీరమున గల స్కంధావారమునను పాఖాల సరోవరతీరమున గల స్కంధావారమునను కదలిక యతిశయించెను. కాకతీయవీరభటు లందరును వారివారి స్కంధావారములకు చేరికొని సర్వసన్నద్ధులైయుండ నాజ్ఞ లయ్యెను. పడవాండ్లు చేయు సన్నాహములు వృద్ధినొందుచుండెను. ఉత్సవము లయిపోయిన మరునాడు ఓరుగల్లు వీధు లన్నియు శాంతము లయ్యెను.

ఆనాటి తెల్లవారుజామున భద్రసరోవరతీరమున దివిటీలు అసంఖ్యాకముగా కాన నయ్యెను. దేవత లప్పుడప్పుడు ఆ సరోవరజలములలోనికి చిత్రవిచిత్రమార్గముల నవతరించుచుందు రను జనప్రథ కలదు. ఈనా డక్కడనుండి యనేకసహస్రసంఖ్యలగు సేనలు కదలెను. అట్లు వారము దినములలో నటనుండి రెండులక్షల సేన కదలెను. దానికి అంబదేవుడు సర్వాధికారి. మరి రెండులక్షల సేన పాఖాలనుండి బయలుదేరెను. దానికి ఆనిదమ్మ యధికారి.

ఆ సేనలు కదలిపోయిన పిమ్మట ఓరుగల్లునగరము నిర్మానుష్యమే యైనదా యనునట్లుండెను. కోటగోడలు కట్టుట సాగుచునే యుండెను. ఇప్పు డందులో అంబ

దేవుని స్థానమున గోనగన్నారెడ్డి నియమితుడై యా వ్యవహారములు నిర్వహించు చుండెను.

గండనికి సైన్యములో చేరవలె నను నుత్సాహము కలిగినది. మేచయ యాతని క్షేమ మర్థించి దూర మంపివేయ దలంచికూడ నుండెను. గండని నూరుమంది యుద్ధ వీరుల కధికారిని జేసి తన స్కంధావారరక్షకభటులలో నుండ నియమించి యంబ దేవుడు వెంట గొంపోయెను.



## ౨౮

రుయ్యమ ఇప్పటికి కొంతకాలముగా మనస్స్వాస్థ్యము లేనిదానివలె కనబడుచున్నది. రుద్రాంబ పిలిపించినంతనే ఆ పిల్ల యామెయొద్దకు శీఘ్రముగా బోవును. ఆమె చెప్పిన సర్వకార్యములు సక్రమముగా నిర్వహించును. అడిగిన ప్రశ్నల కన్నిటికి నాదరముతో గౌరవముతో నుత్తరము లిచ్చును. కాని తాను స్వయముగా నేవిషయ మునను పూర్వమువలె చొరవ కలిగించుకొని మాటాడదు. అది గమనించిన రుద్రమ, వయస్సులోని మార్పువల్ల నట్లు ప్రవర్తించుచున్నదేమో, యని సరిపెట్టుకొనుచుండెను.

కాని ఆ సరిపెట్టుకొనుట అంతకంతకు సాధ్యపడుట లేదు. రుయ్యమ మాటలలో వెనుకటి యుత్సాహమే ఇప్పుడు లేదు. ఒక్కొక్కమారు మాటలమధ్యలో ముఖ మావలకు త్రిప్పుకొనును. ఏల? మరల నిటు తనకు సమ్ముఖముగా త్రిప్పుకొను లోపల నామె చీరచెరగు ముఖమున ప్రసరించియుండును. ముఖమున కలిగిన స్వేదము తుడిచికొనినదా? అంత తాపముగా లేదే! అటుగాక ముఖమున చెరిగిన తిలకము గాని, కన్నుల చెదరిన కాటుక గాని, చెక్కుల కేగిన కురులుగాని సవరించుకొన్నదా? లేదే! మరి యేమి? కన్నీరు కార్చినదా? అప్రయత్నముగా ఆగక వచ్చిన కన్నీరు అద్దుకొని, మరి రాకుండ ముఖము బిగించుకొని, ఇటువైపునకు తిరిగినదా? పాప మీ పిల్లకు దుఃఖకారణ మేమై యుండును?

రుద్రమ పలుమారు సూచనగా నడిగి చూచెను. కాని యాబ్రాహ్మణబాల చిరునవ్వుతో హాస్యవచనములతో తప్పించుకొనుచుండెను. రుద్రమ నిజమే కావచ్చునని యనుకొనును. కాని కాదేమో యని సంశయమును ఆమెకు వదలదు.

రుద్రమకు యౌవరాజ్యాభిషేకమే చేసినను గణపతిదేవులు సర్వరాజ్య భారము నామెపై నుంచుటచే నామెకు మహారాజ్యప్రాప్తియే యైనది. రాజ్యప్రాప్తితోపాటు భర్తృవియోగమును భర్తతో విరోధమునుగూడ నామెకు సంభవించినవి. అది తాను వాంఛింప లేదు. మీదుమిక్కిలి యట్టి యవస్థరాకుండ నివారించుటకును ఆమెహృదయ పూర్వకముగా ప్రయత్నించినది. కాని యా ప్రయత్నము విఫలమైనది. రాజధర్మము పాలించుటకు తా నిప్పుడు భర్తను విడువవలసివచ్చినది. ఇట్టి దురవస్థపా లయినవారు పూర్వ మెవరైన గలరా?

శ్రీరఘురాముడు ఆత్మాధికప్రియ యగు ధర్మపత్నిని ప్రజాభిప్రాయముకొరకు విడనాడవలసివచ్చెనుగదా! పాప మాత ఆ బాధ యెట్లు భరింపగలిగెనో! తనభర్త యధర్మ మాచరింప డను నఖండవిశ్వాసము గల సీతామహాదేవి శ్రీరామాజ్ఞనుగూర్చి యేమని తలంచినదో గదా! విధికృతము! విధికృత మిట్లే ఏల సంభవింపవలెను?

ప్రజారంజనార్థము శ్రీరామచంద్రుడు నిరపరాధ యగు ధర్మపత్నిని వివాసమున కంపినాడు. కాని నే నిప్పుడు ప్రజాక్షేమము నిమిత్తము అపరాధ యగు వీరభద్రేశ్వరుల శిక్షింపవలసివచ్చినది. భార్యయు భర్తయు వివాహసంస్కారముచే నేకదేహముకలవా రగుదు రని శాస్త్రవిదు లందురుగదా! వీరభద్రేశ్వరులను శిక్షించుట యన్న వారియం దున్న నాయర్ధభాగమును వారి యర్ధభాగమును శిక్షించుట యగును! శ్రీరాములు చేసినట్లు తమ్ముని బిల్చి రథ మెక్కించి విజనారణ్యమున విడిచి రమ్మని పంపుటవంటిది కాదే ఇది! రణరంగమున వారి నెదిర్చియో, దాగుడు కయ్యమున రహస్యమార్గముననో, నా యుద్యోగులు గాని, నే గాని వారిని భంజించి శిక్షింపవలెనే! అట్టి సమయముల నెవరి ప్రాణము లేమగునో ఎవరు చెప్పగలరు? వారి ప్రాణములకే యాపద వచ్చిన నా మాంగల్యమునకుగూడ నాపద వాటిల్లునే!

ఇట్లు కొంతవడి తలంచును. అంతలో తన స్వయంవరమున దనతో నాతనికి ప్రవృత్తమైన ఖడ్గయుద్ధము స్మృతిలో బారును. అందు తా నెట్లోడెనో ఆమె కిప్పటికిని అవగతము కాదు. అట్లే ధనుర్విద్యా ప్రదర్శనమున గూడ నాతనికి తా నెట్లు తీసిపోయెనో ఆమె కింతవరకు నర్థము కాలేదు. తాను వీరభద్రేశ్వరులచే విజితురాలయ్యె నని మధ్యవర్తులు ప్రకటించిరి. వారు పక్షపాతము చూపిరా? పెద్దల నంత మాట యను టెట్లు? ఎట్లైన నేమి? తాను వీరభద్రేశ్వరవిజితయే! విజితయే!

స్వయంవరమున నా యుద్ధమున దా నెట్టి యప్రమత్తతయు జూపలేదు. జయింపవలె ననియే తా నాతనితో పోరినది. ఆతడు జయింపవలెనను నిచ్ఛ తన కొంతమాత్రము నప్పుడు లేదే! ఆతనియందు తన కెట్టి మోహమును గలిగియుండలేదు. పైపెచ్చు ఇతడు నాతో సమానముగా నెదిరించి నిలువగలడా యను దీమసమే తనావేశించియుండెనే! లేకుంటె విద్యలలో గాని ప్రావీణ్యములో గాని అభ్యాసములో గాని వీరభద్రేశ్వరు డెక్కుడు కాడు. కాని మరి యాతడే మున్ను జయశాలి యయ్యెనే! ఆతడే వీర్యపణమున తన్ను ఒడుచుకొని హక్కుగా పొందగలిగెనే! విధికృతము! విధి వీరభద్రేశ్వరులకే ఆనాడు తోడైనది. మరి యీనాడు విధి మాలో నెవరికి తోడగునో గదా! ఈనాడు ధర్మము నాపక్షమున నున్నది. నేను శివేచ్ఛ నిర్వర్తింప బూనియున్నాను. మరి విధి మాత్రము శివేచ్ఛల ననుసరింపదా!

ఇప్పుడు వా రెక్కడ నున్నారు? ఏమైరి? ఇప్పటికి ఇంకను రాజధానీ నగరము విడిచిపోయినట్లు తోచదు. ఒకచోట నొక మారువేషమున నున్నా రని చారులు జాడలు తీయునప్పటికి వా రా రూపమును స్థలమును మార్చుచున్నారు. నూరుకన్నులతో కనిపెట్టియుండు వేచయనాయకుని భటులనే వారు కనుబ్రామూ చున్నారు. ఆ భటులలో గూడ కొందరు వారి కంతరంగములలో వశులై యుందురా?

ఏది యేమైనను తాను వీరభద్రేశ్వరుల పత్ని. వారికిరువురకు వివాహ మాదిగా నొండొరులపై దంపతులకు సామాన్యముగానుండు ననుబంధమే ఏర్పడెను గాని కథలలో చెప్పుకొనునట్లు ఎవరికిని విపరీతవ్యామోహము ఎన్నడును కలుగలేదు. వారి కొకరి కొకరిపై నొక గౌరవభావము కలదు. అంతే!

కొంతవడికి వీరభద్రేశ్వరునితో తాను సుఖముగా గడపిన దినములు జ్ఞప్తికి వచ్చును. వారన్న పలుకులు, చేసిన చేతలు స్మృతిలో బారును. అవి యేమియు నంత ప్రధానమైనవి కావు. ఇంతకాలము జ్ఞప్తియం దుంచుకొన నవసర మున్నవికావు. ఒక చిన్నమాట, ఒక సన్నని చూపు, ఒక చిరునవ్వు, ముఖములో నొకమారు కలిగిన వైవర్ణ్యము, మరియొకమారు అకారణముగా వారు ధరించిన మౌనము!— ముప్పది సంవత్సరముల సంసారములో నిట్టి వెన్ని యుండును! వీరభద్రేశ్వరుల కెప్పుడు సౌమ్యత లేదు. ఎప్పుడును కర్కశులే. వారి సహవాసమును మొదటినుండియు కటకు వారితోడనే.

ఉత్తరదేశములలో సంచరించినవాళ్లలో తాము కావించిన క్రూరకృత్యము లెన్నియో వారు ఉత్సాహముతో తనకు వర్ణించిన దెన్నిమారులు! అవి విన్నంతనే తన హృదయమున శూలములతో పొడిచినట్లుండెడిది. వారు తాము తలంచిన కార్యము సాధించుటకు ఎట్టి కఠినకృత్యము చేయుటకును వెనుకాడరు. వారికి దయాదాక్షిణ్యములు లేవు. ధర్మాధర్మవిచక్షణలేదు. అట్టివారు ఆ సహాసభలో ధర్మనిర్ణయము చేయు డని ధర్మస్వరూపులకు శ్రీ విశ్వేశ్వరశంభుదేశికుల నర్థించుట తన కెంతయో వెగటుగా దోచినది! ధర్మనిష్ఠు లగువారి నోట ధర్మవాక్యములు శోభాయమానములుగా నుండును. పాపము, వీరభల్లటదేశికు లెంత మోటుగా చెప్పినను వారిమాటలు పూర్తిగా ధర్మబాహ్యము లన జెల్లదు. కాని యెట్టి ధర్మనిష్ఠయు లేని వీరభద్రేశ్వరులు ఆ యవకాశము పురస్కరించుకొని, ధర్మపన్నములు పలుకుచు, నంతవరకు మౌనము దాల్చియున్న శ్రీరాజగురువులను ధర్మనిర్ణయము చేయ నర్థించుట సభలో నందరికిను కష్ట మనిపించినది. తనకు ఒడలే మండిపోయినది. అయ్యో, ఇట్టి వానికి పత్ని నైతినే యనిపించినది. పత్నికి భర్తపై నెంతకోపము రా దగునో అంత కోపమును దనకు వచ్చినది.

తుద కా సాహసప్రశ్నము గుహాంతరమున సుఖముగా నిద్రపోవుచున్న సింహమును కదలించుటయే యైనది. ఆ సహాసభలో మహాప్రభువులు ప్రధానులు పండితులు అనేకు లుండిరి. వా రెవ్వరికిని స్ఫురింపని ధర్మసూక్ష్మము శ్రీవిశ్వేశ్వరశంభుదేశికులకు స్ఫురించినది. అది వారి యాత్మవాణి, శివవాక్కు! ఈ మారైన, విధి నాకనుకూలింప కుండునా?

శ్రీ గురువుల యాదేశముచే నీ రాజ్యభారము భరింప నీనాడు నేను తల యొగ్గినాను. నాకు ప్రభుత్వము నెరపవలెనని యెట్టి బులబాటమును లేదు. రాజ్యాంతమున నరకము ధ్రువ మందురు. ఇప్పుడే నేను నరకయాతన కొంత చవిచూచుచున్నాను.

పాప మా యన్నమంత్రిని నే నెందుకు బంధింప ననుజ్ఞ యిచ్చినట్లు! సాక్ష్యమున్నదనియే కదా! అది యంతయు మిథ్యాకల్పితసాక్ష్య మని నా విశ్వాసము. ఆ

మంత్రీశ్వరుడే తన్ను బంధించుట యుక్తమని శాంతముగా నియోగించెనే! ఆయన ముఖము చూచినంతనే నిర్దోషి యని ముఖమున వ్రాసియున్నట్లు కనబడుచుండెనే! అట్టివానిని నిర్బంధములో నుంచిన నా పాపమునకు నిష్కృతి యేముండును? ఆయన నిర్దోషి యని యెప్పుడు నిర్ధారితమగును? ఎట్లు?

వీరభద్రేశ్వరులకు మొండిపట్టుగాని యిప్పటికిమాత్రము మించిపోయిన దేమి? ఈ దాగుడుమూత లాడి యీ సామ్రాజ్యమును, తన్ను తన కుమారులను అపాయములపాలు చేయక ఎదుటబడినచో వారికి కఠినముగా శిక్ష విధింప దనకు సాధ్యమగునా? మహారణము చేసి విజితుడైన శత్రువునే, సాదాక్రాంతు డైనచో క్షమించి వాని పదవి మరల వానికిచ్చి విడచిపుచ్చుట క్షత్రియాచారమే! ఇక తాను తన భర్త విషయమున వేరుధర్మ మవలంబించుట సాధ్యమా? అదితెలిసియున్నందుననే వీరభద్రు లింత నిష్కారుణముగా ప్రవర్తించుచుండవలెను.

వారితో నాకు గలిగిన యీ ఎడబాటు రుయ్యమ్మ కెంతో కష్టముగా నున్నది. కన్నకూతురగు ముమ్మడయ్యకే అట్లులేదు. ఇదియు నొక విచిత్రవిషయము! నేను పదిమాసములు మోసి కన్న ముమ్మడయ్యకన్న రుయ్యమ్మకు మాపై నింత స్నేహ మేల? నాకును ముమ్మడయ్యపైని గన్న, దృఢతర మగు ననుబంధము రుయ్యమ్మపై గలుగు టేల? కన్నమోహముకన్న పెంచినమోహ మెక్కువ యందు రట్టిదే కాబోలును!

వీరభద్రేశ్వరులతో వియోగము ప్రాప్తించిననాటినుండియు నెమ్మది నెమ్మదిగా నాకు రుయ్యమ్మ మనస్సును దూరమగుచున్నది. ప్రతాపరుద్రకుమారుని సాహచర్యము కూడ రుయ్యమ లోటు తీర్పలేకున్నది. ఆ పిల్లకు హృదయాంతరమున నేదో బాధ యున్నది!

ఈ విధముగా నాలోచించుకొనుచు, రుద్రమ యొకనాటి ప్రాతఃకాలమున దనమందిరములో గూర్చుండియుండి, వాతాయనములనుండి స్వయంభూదేవాలయ శిఖరమును పరధ్యానముగా తిలకించుచుండెను. అన్నిశబ్దములను పరిహరించి యామె చెవులలో సన్నగా నొక వీణానాదము వినబడిన ట్లయినది. అంతలో దీన మగు నొక కంఠస్వరముకూడ దానితో సమ్మిళితమై వినవచ్చెను.

'దఇఅ రహిఓ అహిఅం దుహిఓ విరహాణుగఓ పరిమంథరఓ
గిరి కాణణఏ కుసుముజ్జలఏ గఅజూహవఈ ఉఅ ఝీణగఈ.'*

దానితర్వాత ఎన్నియో దీనము లగు గీతములు వినవచ్చెను. తుదకు మరల నిట్లు వినవచ్చెను.

"త్వం జీవితం త్వ మసి మే హృదయం ద్వితీయమ్
త్వం కౌముదీ నయనయో రమృతం త్వ మంగే—"

---

*కాళిదాసుని విక్రమోర్వశీయము. సంస్కృతచ్ఛాయ :
'దయితారహితో౽ధికం దుఃఖితో, విరహానుగతః పరిమంథరకః
గిరకాననకే కుసుమోజ్జ్వలకే, గజయూథపతిః పశ్య క్షీణగతిః.'

ఆ పద్యము పూర్తికాదు. మరల మరల నా పద్యార్థమే యాకంఠమునుండి వినవచ్చుచున్నది.

రుద్రమ యాలకించెను. అది యెవరి కంఠ మగునో యనునూహ యామెకు ముందు కలుగలేదు. అందుచే నూరక వినుచుండెను. అంతలో నాకస్మికముగా నది రుయ్యమ కంఠ మని యామెకు స్ఫురించినది. రుద్రమ కాశ్చర్య మయ్యెను. ఎన్నడో దీనిని తగినవరున కిచ్చి వివాహము చేసియుండవలసిన యీ బ్రాహ్మణకన్యకు ఇంతవరకు వివాహము చేయవలె ననియైన నేను తలపెట్టి యుండలేదు. కన్న తల్లిదండ్రులు లేనిలోటు నేను తీర్చితి ననుకొంటిని. కాని ఎంత భ్రమ! నా కాపిల్లపై గల మమకారముచే వదలలేక దాని పసిమనస్సు రాజకార్యములలోనికి దింపి ప్రకృతిసిద్ధమగు భర్తసమాగమేచ్ఛకు దూరురాలినిగా నొనర్చితిని!

ఇప్పు డీ పిల్ల ఊరకే యిట్లు నోటికి వచ్చిన పద్యములు పాటలు పాడుచున్నదా? కాక ఎవరియం దైనను దీని మనస్సు లగ్న మైనదా? ఈ మధ్య దీని ప్రవర్తనలో మిక్కిలి మార్పు కనిపించుచున్నదే!—

ఇట్లనుకొనుచు రుద్రమ యప్రయత్నముగా సమీపముననే కల రుయ్యమ్మ మందిరమునకు బయలుదేరెను.

## ౨౯

ఆనాడు క్రీడాశైలశిఖరమున ఓరుగల్లుకోట శిలాప్రాకారనిర్మాణవిషయమును ప్రసంగించుటకయి రుద్రమదేవితో మాటాడుచున్న యన్నమంత్రిని సమీపమున నుండి చూచినదాని, అతని రూపము రుయ్యమ చిత్తమున హత్తుకొనిపోయెను. అతడామెపై మందుగా నాదరపూర్వకమగు దృష్టి యేమాత్రము బరపియుండలేదు. పైగా ముందు ఒకానొక తీవ్రమైన దృష్టియే పరపియుండెను.

"ఇంకను ఇక్కడనే ఉన్నా వేమి? వెళ్ళిపోలే దేమి?" అను నర్థముతో నొక పరిచారికవైపు పరపు దృష్టియే యది! కాని యాతడు పరపిన యా తీవ్రదృష్టియే, చిత్రమేమో కాని, రుయ్యమ హృదయములో నవమల్లి కాకోరకము బలవంతముగా ప్రవేశించినట్లు ప్రవేశించి కలవరపెట్టినది. ఆపై నా యువతి కచ్చట నిలుచుటే కొంతవడి కష్టమయినది. కాని ప్రయత్నపూర్వకముగా నెట్లో నిలువరించుకొనగలిగినది. అన్నమంత్రి శ్యామాయిత దేహమును ఆయన గౌరవకన్నులలోని యపూర్వకాంతియు మాటిమాటి కానాడు రుయ్యమ దృష్టిని బలముగా నాకర్షించెను.

ఆనాడే అన్నమంత్రీశ్వరుని తప్పనిసరియై నిర్బంధములో నుంచుటకు రుద్రమ యాజ్ఞ లిచ్చుచున్న సందర్భమున రుయ్యమ నిర్ఘాంతపడిపోయెను. సుఖస్వప్నమునుండి బలవంతముగా మేలుకొనినట్లే యైనది. తుదకు తుదకు అన్నమంత్రికిని రుద్రమకును జరుగుచున్న సంభాషణమే ఆమె వినజాలకపోయినది. ఆమాటల ధ్వనియు నామె

చెవుల బడినట్లే లేదు. ఎదుట నున్న యా యన్నమంత్రీశ్వరుడు ఒక గంధర్వమూర్తి గానే ఆమెకప్పుడు భాసించెను.

"ఇతడు బ్రహ్మదేవుడు. ఇతడే హరి. ఇతడే హరుడు ఇతడే అగ్ని. ఇతడే సూర్యుడు—ఇతడే సర్వదేవతామూర్తి! పరమదైవము!"

ఇట్లనుచు రుయ్యమ తలంచుచునే యుండెను. అన్నమంత్రి యటనుండి నిష్క్రమించెను. నిర్బంధము నను తీసికొనిపోబడెను.

అంతట రుద్రమ రాజమందిరమునకు గదలినది. రుయ్యమ చిత్తరువులోని బొమ్మ వలెనే కదలలేకపోయెను. రుద్రమయు తనవెంట నామెను గమ్మనకుండనే తన మనస్సులోని యాందోళనతో తాను కదలిపోయినది.

ఆనాటినుండి రుయ్యమ మనస్సు మనస్సులో లేదు. తనమనస్సులోని బాధ ఎవ్వరితో చెప్పుకొనగలదు? పురుషమూర్తియందు పురుషభావ మానాడే తనకు మొదటి పర్యాయ ముదయించినది. అన్నమంత్రి దూరమైన దారి యాతనిరూపమామెకు నిత్య సన్నిహిత మయ్యెను.

ఆమూర్తి తనయెదుట కూర్చుండి తన్ను కొంతవడి తీవ్రముగా చూచుచున్నట్లుండును. కొంతవడి యాశ్చర్యముతో కొంతచులకనగా చూచిన ట్లుండును. ఆ మూర్తియెట్లు చూచిన ట్లున్నను, 'నీవు యువతివి! నీవుచిన్నదానవు!' అని మాటి మాటికి నిష్కర్ష చేసి చెప్పుచున్నట్లే యుండును.

రాత్రింబవళ్ళు నన్నమంత్రి ధీరమూర్తి యామె చిత్తమున హత్తుకొని విడువదయ్యెను. అదియు నామూర్తిని తన మనస్సున బాగుకుండ నుంచవలె నని యెట్టి ప్రయత్నమును జేయదు. ఆ మూర్తినే రుయ్యమ తన సర్వాంగముతో సర్వాత్మనా పొదివి ధ్యానింపసాగినది.

"అట్టి పురుషమూర్తిని మా యమ్మయే నిర్బంధమున కంపినది. అమ్మ నేమన గలను? ఆమె కెంత బాధ కలిగినదో! నాకుకూడ కలిగెడి బాధ యామెకు తెలియ జేసి అమ్మను మరింత వ్యధపెట్టరాదు. మరి ఎవరితో నాబాధ చెప్పికొందును?"

ఇట్లు రెన్నాళ్ళు గడచిపోయినవి. రుయ్యమ తన మందిరమున నేకాంతముగా నొక గదిలో కూర్చుండి ఏకశిలపై నానాడు శిలాప్రాకారనిర్మాణాముల విషయమున జరిగిన చర్చలనే మననముచేయుచు మధ్యమధ్య అన్నమంత్రి యన్న మాటలు జ్ఞాపకము తెచ్చుకొనుచుండెను. ఆ సమయమున ఒక ప్రక్కనుండి శ్రావ్యమైనొందరు కంఠములు కలిపి వేదమంత్రములు పఠించుచున్న శబ్దము వినవచ్చెను. ఆనాదము ఆమెకొక అనిర్వాచ్యమగు మనశ్శాంతిని గలిగింపగా దానియందే తన చిత్తము లీన మొనర్చి వినుచున్నది. సంస్కృతకావ్యభాష యామెకు బాగుగా నలవడినది కాని వేదభాష రాదు. ఆ మంత్రము లాకారణమున నర్థమైన ట్లుండియు నామెకు సరిగా నర్థమగుట లేదు. ఐనను అర్థమైన భాగము కానిభాగమునుగూడ ఆమెకు సమానముగనే హృదయావేగమును శాంతింపజేయుచుండెను.

కొంతవడికి వేదపాఠ మాగిపోయినది. రుయ్యమ గుండెలే యాకస్మికముగా నాగిన ట్లయ్యెను!

అంతలో వేదమంత్రములే విద్యార్థికి పాఠము చెప్పుచున్న శబ్దమా పైపున నుండియే వచ్చుచుండెను. అధ్యాపకుడు మంత్రములో కొన్ని పదములు కలిపియొకసారి పలుకును. అది వెంటనే విద్యార్థి రెండుమారు లుచ్చరించును. పిమ్మట గురువు పైభాగ మందుకొని ఒకమా రనును. అదియే విద్యార్థి రెండుమారు లనును. అట్లు మంత్రములో కొంత భాగ మైనపిమ్మట నదియంతయు కలిపి అధ్యాపకు డొకసారి చెప్పును. అదియంతయు కలిపి విద్యార్థి రెండుమారులు చెప్పును. ఆపిమ్మట మరల పైపదములు కొన్ని కలిపి గురువు పలుకుట, విద్యార్థి యవి రెండుమారులు తిరిగి పలుకుట— ఇదే విధముగా పాఠము సాగిపోవుచుండెను. ఎవరో వేదవిద్యార్థి పాఠము చెప్పుకొను చున్నాడని యాదరభావముతో రుయ్యమ యాపాఠ మాలాపించుచుండెను.

వేదవిద్యార్థుల కంఠములలో సామాన్యముగా నొక యవ్యక్తమగు మాధుర్య ముండును. గురువు కంఠములో గాంభీర్య ముండును. అది వయస్సులోని భేదము. బాలురియు వయస్సుముదురని యువకులయు కంఠములు యువతుల కంఠములవలెనే హెచ్చుస్థాయిలో సులభముగా ప్రసరించును. అట్లు ప్రసరించు విద్యార్థికంఠమువలె లేదీ చెప్పుకొను విద్యార్థికంఠము! స్వాధ్యాయము చెప్పుచున్న గురుని కంఠమువలెనే యా విద్యార్థికంఠమును సంద్రగంభీరముగా నుండి నిండుతనము గలిగి, పరిణతు డగు వాని కంఠధ్వనివలెనే వినవచ్చుచుండెను. సింహగర్జనము రెండు గిరిగహ్వరములనుండి మారుమ్రోగుచున్నట్లే ఉదాత్తతరమై యా విద్యార్థికంఠము వినవచ్చుచున్నది.

అందుకు రుయ్యమ యాశ్చర్యపడుచుండు నంతలోననె ఆవిద్యార్థి కంఠముతాను ము న్నెన్నన్నడో విన్నదానివలె తోచెను. ఎక్కడ విన్నది? ఎక్కడ విన్నది? ఎప్పుడు? ఆ పరమేశ్వరమూర్తిది కాదా ఇది?

అంతవరకు తాను విశ్రమించి యుండిన యాసనమునుండి రుయ్యమ చివాలున లేచి గవాక్షమునొద్దకు బోయి యా స్వరము వచ్చుచున్న దిక్కునకు దృష్టి సారించెను. ఆమె కన్నులే పండినవి. ఆమె వీనులే ధన్యమైనవి.

అటు సమీపమున నున్న యుద్యానమున నొక మర్రిచెట్టు నీడను అధ్యాపకుడు తూర్పుముఖముగా కూర్చుండి వేదపాఠము చెప్పుచుండెను. ఆవిద్యార్థి పశ్చిమమై ఉత్తరాభిముఖముగా వాసిపెట్టు వేసికొనికూర్చుండి రెండు హస్తములు కట్టుకొని తన ముందు తెరకనిస్థూలతో చూచుచు దేహము నిశ్చలముగా నుంచుకొని పాఠము సంత చెప్పు కొనుచుండెను. ఆ చెప్పుకొనుచున్న విద్యార్థి నిజముగా నన్నమంత్రీశ్వరుడే! అన్న మంత్రీశ్వరుడే! అతనికి గాక లోకమున మరొకరికి అంత శక్తి యుండునా? స్పష్టముగా నా మహానుభవుని కంఠమే యది! అనుమానము లేదు. అతడానాడు వేదవేదాంత చింతనమునకు నలుగురు వేదవిదులను పంపు మని యర్థించియుండెను గదా! ఇట్టి మహానుభావులు కారణజన్ములు! వారికి నిర్బంధ ముండునా? శ్రీ దేవీభాగవతమున జీవన్ముక్తు డగు జనకమహారాజు శ్రీ శుకుల కేమని నివేదించినాడు?

'బంధనము బంధన మటందు బ్రాహ్మణేంద్ర,
యాత్మ సంకల్ప దోషము నిరంజనంబు?'

అన్నమంత్రి సరిగా రుయ్యమ కెదురుగనే తిరిగి కూర్చుండియుండెను. ఆ గవాక్షమునొద్ద నిలుచున్న రుయ్యమ్మ కదలలేకపోయినది. తదేకదృష్టితో నది యన్నమంత్రి వంకనే చూడసాగినది.

రుయ్యమ్మ యాలోచించుకొనెను. తన హృదయములో పదిలము చేసికొన్న అన్నమంత్రీశ్వరుని మూర్తి యుజ్జ్వలముగా నున్నదా? లేక యీ ప్రత్యక్షమూర్తి యుజ్జ్వలముగా నున్నదా? సామాన్యముగా ప్రేమచే భక్తిచే మనము మన ప్రియులయు పూజ్యులయు మూర్తులు మనస్సులలో కల్పించుకొనుచో అట్టివారి ప్రత్యక్షమూర్తులకంటె నుత్తమములుగా నుండును. కాని రుయ్యమ పోల్చుకొనగా, తాను మనస్సులో కల్పించుకొనిన యా మంత్రిమూర్తికంటె ప్రత్యక్షమైన యాయన దివ్యమూర్తి ఉజ్జ్వలతరముగా నున్నట్లున్నది! ఈ మహానుభావుడు మహామంత్రిపదవినుండి తొలగింపబడెను. పూజ్యురాలగు గౌరమ్మతల్లినుండి వేరుచేయబడినాడు. భక్తురాండ్రగు సతు లిద్దరకు దూరమయినాడు. ప్రాణపదమగు కుమారి బాలనుగూడ చూచుటలే దిప్పుడు. ఇట్లిక్కడ నిర్బంధములో నున్నను ఈతని నిర్లిప్తభావ మేమి? రాజ్యతంత్రము నిర్వహించునెడ నీతడెంత శ్రద్ధ చూపుచుండెనో, అట్టి శ్రద్ధయే యీతడిప్పుడు వేదాధ్యయనము చేయుటలో చూపుచున్నాడు. శ్రీకృష్ణుడు సాందీపనియొద్ద నిట్లే వేద మభ్యసించి యుండెనా?

ఆతనివంక చూచుచున్న కొలదియు నామె తనచూపు నటనుండి మరల్పలేక పోయినది. తన కాతడెదురుగనే కూర్చుండియున్నాడు. తాను నిలిచియున్న గవాక్షము విశాలమైనది. అయినను అతడామెవంక చూడనే లేదు. అంతఃపురమువైపునకు తల యెత్తి చూచుట యనుచితము. అందుచే నాతడటువంక చూడడు. పాఠమైన పిమ్మట గూడ నాతడామె యున్నవైపు చూడనే లేదు.

ఆనాటినుండియు నప్రయత్నముగా రుయ్యమ యా గవాక్షమునొద్దకు బోయి అన్నమంత్రి చర్యలు తరచుగా విలోకింపసాగినది. ఏపని చేయుచున్నను అన్నమంత్రి తన యుదాత్తభంగి విడనాడడు. వేదవిదు లగు నా నలుగురు బ్రాహ్మణులతోడనే నాతడు రాత్రింబవలు కాలక్షేపము చేయును. కొంతతడవు వేదపాఠము చెప్పుకొని పిమ్మట నాతడు వేదాంతపాఠమున కుపక్రమించును. వేదపాఠము చెప్పు నధ్యాపకు డొకడు, వేదాంతము చెప్పునది వేరొకడు. మధ్యాహ్నభోజనమైనంతట కొం[illegible] నాతడు విశ్రమించి వేదశ్రవణము చేయుచు వేదమంత్రార్థము వినును. ఇది చెప్పునది మూడవ యధ్యాపకుడు. నాల్గవ యధ్యాపకుడు శ్రౌతప్రయోగము చెప్పుచు దర్శపౌర్ణమాస్యలు ప్రారంభించెను. మేధావి యగు నా మంత్రీశ్వరుని కొకమారు చెప్పినది మరచుట యున్నట్లు లేదు. అధ్యాపకులతో లేని సమయములందు నాతడు చెప్పుకొన్న వేదపాఠము వల్లెవేయుచునో, వేదాంతపాఠము చింతనచేయుచునో గడపుచుండెను. ఆ నలుగు రధ్యాపకులకును వేదవేదాంతవిద్యాసాధన తప్ప వేరు చింతలు లేనట్లే యుండెను. చూచుచున్న రుయ్యమ్మకు అక్కడ ఋష్యాశ్రమము వెలసినదా యనిపించుచుండెను.

మధ్యమధ్య వచ్చు ననధ్యయనదినములలో మాత్రము కొంచెము భేదము రుయ్యమ దృష్టిని పడక పోలేదు. ఆ దినములు వేదవేదాంత పాఠములు గాని దర్శపౌర్ణమాస్యల

పాఠముగాని యుండదు, కొంతసేపు తక్కినరోజులలో చెప్పుకొనిన పాఠములు వల్లె వేసి చింతనచేయును. కాని యాదినములలో నాతనికి కొంత వ్యవధి చిక్కును. అట్టి సమయములలో నాతడు తరచుగా నా చిన్నవనములో నటు నిటు పచారుచేయుచు ప్రొద్దుపుచ్చును. మధ్యమధ్య నత డేదో దీర్ఘముగా నాలోచించుచున్నాడా యని పించును. పాపము, పార్వతియు లకుమాంబయు నాతని మనస్సున బారిరా యని రుయ్యమ తలంచును. కాక, బాలయే తలపున వచ్చినదా యని యనుమానించును. కాని యాతడు మాత్రము అంతఃపురమువంక తలయెత్తి చూడడు.

కాని యటువైపు తలయెత్తి చూడదగ దని యెంత యనుకొన్నను, తనవైపే గౌరవాదరములతో నొక సుకుమార కన్యక నిరంతరము చూచుచున్నచో, నది యాతని కెన్నటికిని తెలియకుండుట సాధ్యపడునా? రుయ్యమ్మ చూచుచుండకపోయినను రుయ్యమ్మ యాత్మయంతయు నన్నమంత్రిపైననే ప్రాలియుండ నాతని కది తెలియ కుండు టెట్లు? భావములుకూడ స్పర్శకంటె నెక్కువ గట్టిగా స్పష్టముగా నవతలి వారిపైకి ప్రసరించి తాకి ఉద్బుద్ధుల నొనర్చును. చేతులతో చేయు స్పర్శకంటెను భావస్పర్శయే తీవ్రమైనది, గాఢమైనది. తీక్ష్ణమైనది. స్థూలశరీరమునకుకంటె సూక్ష్మ శరీరమునకు వ్యాప్తి యెక్కువగదా! సూక్ష్మమునకుకంటె కారణశరీరమునకు వ్యాప్తి విస్తారము ; అది అనంతమే !

రుయ్యమ్మ స్థూలశరీరము దాని గదిలోని కిటికీవద్దనే నిలుచుండి యున్నది. మరి దాని సూక్ష్మశరీరమే పోయెనో. కారణశరీరమే పోయెనో గాని, యది పరధ్యాన ముగా నున్న యన్నమంత్రీశ్వరుని గాఢముగా తట్టినట్లు స్పృశించినది. అత డప్ర యత్నముగా తల యెత్తినాడు. రుయ్యమ్మ కనబడినది.

రుయ్యమ్మకు ఒక్కసారిగా సిగ్గు వచ్చినది; భయము వేసినది. కాని చింతాపరు డై యున్నట్లున్న యన్నమంత్రీశ్వరుని దృష్టిపథములోనుండి యావలకు బోలేక పోయినది. అతని దృష్టి దాని రెండుకాళ్ళను కదలకుండ బంధించిన ట్లయ్యెను. ఆమె కేమి చేయను తోపలేదు; రెండుచేతులు భక్తిభావముతో జోడించి యాతనికి నమస్క రించినది. ఆమె కన్నీళ్ళే ఏకధారగా కార్చినది.

అన్నమంత్రి యామె నమస్కృతిని చూచి తన దక్షిణహస్త మెత్తి యాశీర్వదిం చెను, పిమ్మట, దాని కన్నీళ్ళాతని కంతదూరమునుండి కూడ కనబడినవేమో, అతడు తల వంచుకొని మరల చింతాపరు డయ్యెను. కొంతసేపటి కాతెడు ఆవలికే పోయెను.

రుయ్యమ్మ తన ధైర్యమునకు తానే యాశ్చర్యపడెను. కాని తాను అన్న మంత్రికి నమస్కరించినందుకు తా నొక తప్పు చేసినా నను భావము దానికి కలుగ లేదు. తా నందుచే ధన్య నైతి ననియే యని తలంచెను. తాను చేసినదానిలో ననుచిత మే మున్నది? పూజ్యు డగు మంత్రీశ్వరు డతడు. తనకు పూర్వము ఏకశిల మంత్రాలోచనలో కొంత పరిచితు డైనవాడు. అట్టివాడు కనబడినపు డది నమస్క రింపక యె ట్లుండగలదు? అనుచిత మేమియు లేదు. పైగా నమస్కరింపకుండుట యనుచితము! మరి తాను కన్నీళ్ళు కార్చెనే? అవును, అంతటివాడు నిర్బంధములో నుండ చూచిన నెవరికి కన్నీరు రాదు?

అనా డాతడు తనవంక జూచెను. తన్ను ఆదరముతో సేవించెను. కాని మరునాడు మరల నట్లే యతడు తనవంక కటాక్షించునా? రుయ్యామ గవాక్షముచెంత నుండి నిరీక్షించెను. మరల తన కెదురుగానే కూర్చుండి యన్నమంత్రి యధ్యయనము చేయుచుండెను. ఆ యోగీశ్వరుని కీ నాడు రుయ్యమ్మ కనబడలేదు. మరునాడును నట్లే ఐనది. ఆ మరునాడును నట్లే ఐనది. తర్వాతినాడును అంతే!

మరల ననధ్యయనము వచ్చిననాడుగాని రుయ్యామ్మకు మరల నన్నమంత్రీశ్వరుని యాశీర్వచనభాగ్యము లభింపలేదు. ఈమా రనధ్యయనములు మూడు! చతుర్దశి, అమావాస్య, పాడ్యమి, అనధ్యయనములు మూడైనను ఒక్కనాడే ఆమె కాభాగ్యము! ఆమహానుభావునికి లౌల్యము లేదు. తన భక్తికి తుష్టుడై తన్ను అప్పుడప్పుడు అనుగ్రహించుచున్నాడు! ఇట్లు పక్షములు గడచిపోయినవి!

ఈనాడు అనధ్యయనము! ఈ ఉదయమున జూడగా అన్న మంత్రీశ్వరుడు ఆ వనములో సంచరించుచున్నాడు. చూడగానే ఆత డీ నాడు చింతాక్రాంతహృదయుడై భారముతో నున్నాడని రుయ్యామకు తోచినది. వెంటనే వీణ తీసికొన్నది. అప్రయత్నముగా ఆమె విక్రమోర్వశీయనాటకమునుండి పూర్వోక్తభిన్నకము గానము చేసినది.

"దఇఆ రహిఓ అహిఅం దుహిఓ విరహాణుగఓ పరిమంథరఓ
గిరికాణణఏ కుసుముజ్జలఏ గఅ జూహవఈ ఉఅ ఝీణగఈ"

ఆపెమ్మట దీనముగా మరియు కొన్నిగీతములు పాడెను. తుదకు—

'త్వం జీవితం త్వమసి మే హృదయం ద్వితీయమ్
త్వం కౌముదీ నయనయో రమృతం త్వ మంగే—'

ఆ రెండుపాదములే మరలమరల పాడుచు నది వీణ వాయించుచుండెను. కిటికీ తెరచియే యున్నది. ఆవల వనములో అన్న మంత్రి దీర్ఘాలోచనలతో బోనులోనున్న సింహమువలెనే వడివడి నిటునటు తిరుగుచుండెను.

ఆ గదితలుపు రుయ్యామ్మ బంధించి యుండలేదు. ఆ గదిలోని కెవ్వరును దాని యనుజ్ఞ లేనిది రారు. అయినను తా నేమి తప్పుచేయుచున్నది, తలుపు బంధించుటకు? అందుచే నా గవాక్షమునొద్ద నది నిలుచుండు వేళలగూడ ముందుగా నా గది తలుపు గడియవేయు నభ్యాసము లేదు. ఈనాడును తలుపు దగ్గరకు లాగియే యుండెనుగాని, గడియ వేసియుండలేదు.

అది య ట్లెంతసేపు పాడినదో! దాని కన్నులవెంట నేకధారగా నీరు కారుచున్నది! కంఠము గద్గద మగుచున్నది! నోట పాట యాడుటలేదు. నాలుక తిరుగక తడబడుచున్నది. తొడపైనుండి వీణ నేలకు జారిపోవుచున్నది.

* * * *

ఎప్పుడు రుద్రమ తలుపు త్రోసికొని వచ్చినదోగూడ రుయ్యామ గమనింపలేదు. రుద్రమకూడ ముందు తెలుపనిది యాలోపలి కెన్నడు రాదు. సరిగా రుయ్యామ్మ

నోట పాట యాగిపోవుచున్న సమయముననే రుద్రమ్మ యా పిల్ల శిరస్సు తన యొడిలోనికి చేర్చికొని యాదరముతో నాలింగనము చేసికొనెను.

రుయ్యమ్మ మాట్లాడక యప్రయత్నముగా వెక్కి వెక్కి యేడువసాగెను.

రుద్రమ్మ గదిలోనికి వచ్చుచుండగనే, ఆమెదృష్టి యావల వనములో చింతాక్రాంతుడై తిరుగుచున్న యన్నమంత్రిపై బడినది. మెరపు మెరసినట్లామెకు ఏకశిలపై జరిగిన స్వల్పవిషయములు భాసించినవి. ఇన్నాళ్ళు రుయ్యమ చిత్రప్రవర్తనమునకు కారణమును, ఇప్పటివరకు నగి పాడుచున్న పాటల యర్థమును, ఈ పట్టరాని దుఃఖము స్వభావమును, రుద్రమ్మకొక్కసారిగా తట్టె !

"అమ్మాయీ, నిన్నెంత వ్యథపెట్టినానే, తల్లీ!" ఇట్లనుచున్న రుద్రమకే కన్నీటి బొట్లు విశాలనేత్రములలో మిలమిలలాడెను.

"నీవేమి చేసినా వమ్మా!" అనుచు మరల రుయ్యమ్మ వెక్కి వెక్కి యేడువసాగినది.

ఆ తల్లికి బిడ్డకు ఎక్కువ సంభాషణ జరుగలేదు. వారికి ఒండొరులకు, ఒండొరుల భావములు ఒకరిచూపులతోడనే ఒకరికి, నోటితో చెప్పినకంటె స్పష్టముగా వ్యక్తము లయ్యెను. ఎన్నాళ్లు చెప్ప కొనిన వారి హృదయాంతరభావములు వ్యక్తము లగును ?

కొంతతడవునకు రుద్రమ్మ లేచి సమీపమునగల భూర్జరపత్రమును తూలికయు దీసికొని యందిట్లు వ్రాసెను.

మా ప్రియతనయ రుయ్యమ్మకు అనుగ్రహించిన యనుజ్ఞాపత్రిక.

'నీ యిచ్చ వచ్చినప్పుడు ఈ పత్రిక గొని ఇందులూరి అన్న మంత్రీశ్వరులకు సర్వస్వాతంత్ర్యము కలిగించి పూర్వపదవిలో ప్రతిష్ఠాపించుటకు ఇందుమూలముగా నీకు సర్వాధికారము నొసంగుచున్నాను.

(ముద్రిక) రుద్రదేవమహారాజు'

ఆ పత్రమొకమారు చదువుకొని రుద్రమ్మ యది రుయ్యమ్మకొసంగెను.

రుయ్యమ్మ కన్నీటి జాలులలోనుండి యది చదువుకొని నిర్ఘాంతపోయి పత్రికను కన్నుల కద్దుకొనెను.

రుయ్యమ్మ : "అమ్మా!—"

రుద్రమ్మ : "ఏమే, తల్లీ ?"

రుయ్యమ్మ : "నన్నిట్లు పరీక్ష చేసెద వేమమ్మా?"

రుద్రమ్మ : "పరీక్ష యేమిటమ్మా ?— నీకు అన్నమంత్రీశ్వరులు బంధవిముక్తులై పూర్వపదవిలో నుండుట సమ్మతము గాదటమ్మా?"

రుయ్యమ్మ : "మరినీకో?"

రుద్రమ్మ : "నాకును సమ్మతమే ! లేకున్న నీపత్రిక నీ కేల యిత్తును ?"

రుయ్యమ్మ : "ఐతే ఈ భారము నాపై నేల పెట్టవలె ?"

రుద్రమ్మ : "నీభాధ చూడలేక అదితీర్చుటకు ఈ యనుమతి యిచ్చినాను."

రుయ్యమ్మ : "ఈ యనుమతితో నా బాధ తీరునా? — నీవు బంధించుట యవసరమని తోచి బంధించినవారిని నేను విడిపించుదాననా, అమ్మా!".

రుద్రమ్మ : "నాకుమాత్ర మా మహానుభావుని బంధించుట సమ్మత మటమ్మా ? నా పదవిచే నాచేతులు కట్టుబడినవి. అందుచే నీ కీ యధికార మిచ్చితిని. ఇది శివాజ్ఞ యని నిశ్చయించియే చేసితిని."

రుయ్యమ్మ : "అమ్మా నీ అనుగ్రహమునకు నేను ధన్యురాల నయితిని. అది శివేచ్ఛయు నగుగాక! అయినను అన్నమంత్రీశ్వరులపై గల సర్వసంశయములు తీరి పోవువరకు, నేనుకూడ నీపత్రము నుపయోగింప నిచ్ఛగింపను. నాపై నీ కున్న యను రాగముచే నిది యిచ్చినను, మన ప్రేమానుబంధములు రాజకార్యముల కడ్డురానిచ్చు టకు నేను సమ్మతింపను."

రుద్రమ్మ రుయ్యమను గాఢాలింగనమే చేసికొన్నది.

"నీవంటి తల్లిని ఎవరైనా కనియుండరమ్మా ? నిన్ను కూతు రనుచున్నందుకే నేను ధన్యురాలనే!"

రుయ్యమ్మ : "ఎంతమాటమ్మా ? అన్నమంత్రీశ్వరులపై సందేహము కలిగించిన పత్రములు నన్నొకమారు పరిశీలింపనిత్తువా తల్లీ ?"

రుద్రమ్మ : "అవశ్యముగా ! ఇప్పుడే పంపు నేర్పాటు గావించెదను."

కొంతవడి వారు మౌనము వహించి యొకరి నొకరు ప్రేమాతిశయముతో చూచు కొనుచుండిరి. రుద్రమ్మ ముందు మాట్లాడినది.

"అమ్మాయీ, అన్నమంత్రీశ్వరుల గృహమునకు బోయి వారి కుటుంబమును ఓదార్చిరావలె నని యన్నది. నీవు కూడ వత్తువా ?—వారి పిల్ల బాల పుట్టినరోజు పండుగయట రేపు !"

రుయ్యమ్మ : "అవశ్యముగా !"

## 30

బాల కారేండ్లు నిండినవి. ఏడవ యేడు ప్రవేశించినది. ప్రతి సంవత్సరమును దాని పుట్టినరోజు పండుగ మహోత్సవముగా చేయు నలవాటు. ఈ సంవత్సరము పండుగ చేయుటా మానుటా యను శంక పార్వతికిని లకుమమ్మకును ముందు కలిగినది. గౌరీదేవిని వా రడిగిరి. ఆ తల్లి నిష్కర్ష చేసినది.

"మా తండ్రి అన్నయ్యకు ఇష్టమైన యీ యుత్సవము మాన వీలులేదు. వా డెక్కడ నున్నను వానికి భేదము లేదు. ఇంతకును మనకే అజ్ఞానముచేత భేదము !"

గౌరీదేవి యప్పుడే అక్కడికి వచ్చిన తిక్కనసోమయాజుల కీ విషయము చెప్పి, "పెద్దదానను, ఇందులో అవ్యక్త మేమైన నున్నదా?" యని ప్రశ్నించెను. సోమయాజులు పరమానందముతో నామె నిశ్చయమును శ్లాఘించిరి.

పూర్వ మేవిధముగా నా పండుగ చేయువారో ఇప్పుడును అదేవిధముగా నన్ని యేర్పాట్లును సాగినవి. పూర్వము ఎవ రెవరికి ఏఏవిధముగా పిలుపులు పంపు చుండిరో, అట్లే యీమారును పిలుపులు వెళ్ళినవి. రాజమందిరమునకూడ యథా పూర్వముగా రెండురోజులు ముందుగా లకుమమ్మ స్వయముగా వెళ్ళి తగువారి నందర నాహ్వానించి వచ్చినది.

అన్నమంత్రిదివాణమున పూర్వపు మర్యాద లన్నియు ఇన్నాళ్లును జరుగు చునే యుండెను. అన్నమంత్రీశ్వరుడు పట్టణము విడిచియున్న రోజులలో సమస్తము నెట్లుండెడిదో, ఇప్పు డట్లున్నది. వ్యవహారశాలలో మాత్ర మొక చిన్న మార్పు వచ్చినది. అక్కడ అన్నమంత్రిస్థానము శూన్యముగ నుండును. దాని సమీపమున తిక్కచమూపతి కూర్చుండి వ్యవహారములు చూచుచుండును.

అన్నమంత్రి దివాణమున నిత్యమును మ్రోయు మంగళతూర్యములే కాక ఈనాడు మరియు కొన్ని మంగళవాద్యములు మ్రోయుచున్నవి. రెండుగడియల ప్రొద్దెక్కి నప్పటినుండియు సువాసినులు కుమారికలు సర్వాలంకృతులై ఫలపుష్ప వస్త్రాభరణాది బహుమానములతో దివాణమునకు వచ్చుచున్నారు. పలువురు పల్లకు లలో మేనాలలో వచ్చుచుండిరి. అవియు ముత్యాల పల్లకులు, రత్నాలపల్లకులు పచ్చల పల్లకులు! కొందరు కాలినడకనే వచ్చుచుండిరి. వచ్చినవారి నందరను అన్న మంత్రి రెండవభార్య లకుమమ్మ స్వయముగా నెదుర్కొని యాదరముతో లోనికి తీసికొనిపోవుచున్నది.

మరియు వేదవిదు లగు బ్రాహ్మణులు వందలకొలదియు నచ్చటి కాహూతులై వచ్చుచున్నారు. వారి నందరను గురునాథుడును, దెబ్బల బాధనుండి బాగుగా తేరు కొనిన మారనయు నెదురువోయి సగౌరవముగా లోనికి వెంటతీసుకొని వచ్చి యుచిత స్థానముల గూర్చుండ జేయుచున్నారు. ఆ సభలో తిక్కనసోమయాజులు పవిత్రాసన మున నుపవిష్టులై యుండిరి.

కొంతసేపైనది. నగరమందలి ప్రధానులును దండనాథులును శ్రేణీపతులును బహువిధములగు వాహనములపై నక్కడి కంతట రాజొచ్చిరి. అన్నమంత్రి మేనమరది యగు పర్వతమల్లు వారి నందర యథోచితమర్యాదలతో లోనికి తీసికొనిపోవుచుం డెను. రాజమహేంద్రపాలకు డగు నీపర్వతమలు ఈ యుత్సవము నిమిత్తము ప్రత్యే కముగా పిలిపింపబడెను.

ఈ మహోత్సవమునకై గృహోపవనభూమి మధ్యమున నొక విశాలమగు మండ పము నిర్మించి దానిని తోరణములతో పల్లవములతో పుష్పములతో ఫలములతో పటములతో ధ్వజములతో నానావిధముల నలంకరించిరి. అందుకు మోహరివాడ నుండి నూర్గురు కుట్రపుపనివారు నియుక్తులై వారముదినములుగా రాత్రింబవళ్ళు విరా మము లేక పని చేయుచుండిరి.

ఆ మండపపశ్చిమోభాగమున నొక యున్నతవేది కలదు. అందు మనోజ్ఞమగు పీఠమున చీనాంశుకమున వివిధవర్ణములతో ఉజ్జ్వలముగా బాలయంత్రము లిఖింపబడి యున్నది. దాని వెనుక పంచలోహములతో నిర్మించిన ఆరేళ్ళ బాలకుమారి విగ్రహము నిలిపిరి. వానిముందు సర్వాలంకృతయైన పార్వతీదేవి, అన్నమంత్రి జ్యేష్ఠపత్ని, ఉపవిష్టయై బాలాచక్రార్చనము చేయుచుండెను. ఆమెకు దక్షిణభాగమున వంశగురువగు పురోహితుడు అర్చనకలాపము నామెకు నందించుచు జరిపించుచుండెను. ఆ సమీపమున బాల కూర్చుండి శ్రద్ధగా పూజ తిలకించుచున్నది.

బాల కానాడు అభ్యంగనము చేయించి దాని కురులు ధూపాధికములతో నార్చినను బాగుగా నారలేదు. అందుచే దానికి జడ వదులు వదులుగా నల్లి పూలు పలుచనగా తురిమిరి. దాని పాపటలో చిందురు రేఖయు, చెవులకు పచ్చల పోగులును, ముక్కున కెంపు పొదిగి ముత్యము వ్రేలాడు బులాకియు, మెడలో సువర్ణరత్నహారమును దాని చివర వ్రేలుచు పచ్చలపదకమును, నడుమును రవ్వల యొడ్డాణమును, చేతులకు కంకణములును, దండలకు పురులును అలంకరించిరి. దాని కాళ్ళకు వెండి కడియములును హంసల అందెలును ఉన్నవి. దాని కటియందొక పట్టుపావడయు పైన నొక చొక్కాయియు ధరించి, యాపై నద్దకముల జిలుగు వస్త్రము ఉత్తరీయముగా వేసికొన్నది. పాదములకు పసుపు లత్తుక లలదియున్నవి. ముఖమున కల్యాణపు తిలక మున్నది. కన్నుల కాటుకరేఖలు తీరియున్నవి. చేతులకును మెడను గందపు బూత లున్నవి. దానిమ్మపూవువంటి దాని దేహకాంతి యాకాశావకాశముల నరుణకిరణములు పరపుచున్నట్లు భాసించుచున్నది. చూడగా ప్రత్యక్షముగా నవతరించిన బాలాదేవతయా యిది యనిపించుచు, చూపరనది మంత్రముగ్ధుల గావించుచుండెను.

ఆ యుత్సవము చూడవచ్చిన స్త్రీపురుషులకును బాలబాలికలకును తామే కార్యమునకై యక్కడ కూడితిమో విదితమే. వారెట్టి సడియు జేయుట లేదు. బాలాదేవత కా పీఠమున నావాహితయై యున్నదని వారందరెరుగుదురు. ఎదురుగా పరదేవత నిలచియున్న విధముననే వారెల్లరు భక్తివినమ్రులై యుండిరి.

అన్నమంత్రి దివాణము తోరణమునెదుట రెండు పల్లకు లాగినవి! ముందున్నది ముత్యాల పల్లకి. అందుండి రుయ్యమ్మ సర్వభూషణవిభూషితయై సదాషోడశవార్షికయగు శ్రీదేవివలెనే యవతరించినది. ఆ వెనుక నున్నది బంగారు పొదిగిన పచ్చల పల్లకి. అందుండి రుద్రాంబయే దిగినది. శ్రీ రుద్రదేవమహారాజు కాదా దిగినది! స్త్రీవేషమున నున్న రుద్రాంబయే ఈమె! పురుషవేషమున నున్నప్పు డీమెకు ఎంత వీరవిలాసమో, స్త్రీవేషమున నున్నయెడ నంత లాలిత్య మున్నది యీమెలో. ఈశ్వరునివలెనే స్త్రీపుంభేదములకు నతీతయగు నొక మహాశక్తియా యీమె!

బాల పుట్టినరోజు పండుగలకు రుద్రమ్మ వెళ్ళుచుండు నాచారము కలదు!

అయితే యిప్పు డామెకు యౌవరాజ్యాభిషేక మైనది. అదియునుగాక అన్నమంత్రీశ్వరులయం దామె కిప్పు డనుగ్రహము తప్పికూడ నున్నదాయెను. రుద్రమ్మ యీనాడు వచ్చునని యక్కడివా రనుకొనలేదు. ఐనను వచ్చునెడ నామెను యథార్హముగా గౌరవించుటకు సర్వసన్నాహములును చేసియుంచిరి. వారిని లకుమాంబ ఎదు

ర్కాని లోనికి దీసికొనిపోయెను. వెంట వచ్చిన భటులను వాకిటనే యుంచి పర్వత నాయకునితోడను దాసీజనులతోమాత్రము రుయ్యమతోఁగలసి రుద్రమ లోనికివచ్చెను. అంగరక్షకు డగు పర్వతనాయకునిగూడ మండపద్వారమునొద్ద నిలిపి వా రాభ్యంతర మందిరములోని కేగిరి. రుద్రమకు రాజమర్యాద లన్నియు నడచినవి. ఆమెకు గౌరమ్మ ఎదుటబడి నంతనే పూజ్యురాలగు నామెకు కుమారితయుబోలె నమస్కరింపగా నామె రుద్రమను దీవించెను.

"మహారాజు వైతివి నీవు, వత్తువో రావో అనుకొంటినమ్మా! వచ్చినను ఎట్లు వత్తువో అనుకొంటిని. ఎప్పటివలెనే వచ్చినావే! పరమానంద మైనదే, తల్లీ!— ఇట్టి దానికి శీఘ్రముగానే సర్వశత్రువులు వశు లయ్యెదరులే!— మరి యీ యమ్మాయి ఎవరు?"

ఇట్లనుచు గౌరమ రుయ్యమను నిర్దేశించెను.

రుద్రాంబ: "నా పుత్రిక రుయ్యమ్మ!— మిమ్ము నందర జూచిపోవుటకు వచ్చినది."

రుయ్యమ్మ గౌరమ్మకు పాదాభివందనము చేసెను. ఆ వృద్ధురాలు ఈడువచ్చిన యీ పిల్ల యింకను కన్యయే యని వెంటనే గమనించి, "శీఘ్రమేవ కల్యాణ ప్రాప్తి రస్తు!" అని దీవించుచు, "సాక్షాత్తు శ్రీదేవివలె కళకళలాడుచున్నది యీ పిల్ల! నీ అల్లు డెవరో మహాఅదృష్టశాలి కావలె, తల్లీ" అనెను.

'మా యల్లుని నిప్పుడే చూతువులే యమ్మా;' యని రుద్రమ మౌనము దాల్చెను. అంతట పూజామండపమున వేదిక సమీపమున దనకు ప్రత్యేకముగా నిర్దిష్టమయిన భద్రాసనమున రుద్రమ యుపవేశించెను. ఆమెసమీపముననే రుయ్యమయు నాసీన యయ్యెను.

రుద్రమ యచ్చటికి వచ్చుటయు, ఆ వేషమున వచ్చుటయు, నక్కడ కూడిన ప్రధాన మంత్రి మండలమున కంతయు నాశ్చర్య మయ్యెను. వారిలో పలువురు ఈ ఉత్సవమున కీనాడు అన్నమంత్రి యింటికి పోవుటా మానుటా యని వితర్కించుకొని ఎట్లో సరిపెట్టుకొని వచ్చినవారే. రాజద్రోహిగా బంధితు డైనవాని యింటికి రాజ పురుషు లతిథులుగా పోవుట సమంజసమా? ఐనను అన్నమంత్రి బంధములో కొన్ని చిత్రము లున్నవి. అతని యింటియొద్ద మంత్రిలాంఛనములు పోలేదు. అతనికి నిర్బంధ ములోగూడ వేదాధ్యయనమునకు సౌకర్యము లేర్పరుపబడినవి. కేవలము శిక్షితు డైన వానికి శిక్ష తీరనిది వేదాధ్యయనము నిషిద్ధముగదా! సంకేతములను బట్టి యన్న మంత్రిపై రాజానుగ్రహము తొలగియుండలే దని వారు తుదకు నిశ్చయించి యీ యుత్సవమునకు వచ్చియుండిరి. అందుచే రుద్రాంబ యీ యపూర్వ వేషముతో నచ్చ టికి వచ్చుట వారి నందర దిగ్భ్రాంతులగా జేసెను. చిరుగాలి ప్రసరించినట్లు మండప మంతట గుసగుసలు ప్రసరించి యడగిపోయినవి.

అంతలో మేనా మోసికొని వచ్చు బోయీల మ్రోత వినిపించినది. అది యన్న మంత్రి తోరణముముం దాగినది. వచ్చినది స్త్రీజన మని లకుమమ్మయు, ఎవరో యని

గురునాథమారనలును పర్వతమల్లును ఒక్కమారే ఎదురుపోయిరి. ఆ మేనాలోనుండి యన్నమంత్రీశ్వరుడే దిగెను.

ఎదురువోయిన యానలువురును తెల్లవోయిరి. లకుమమ్మ మరుక్షణముననే తేరుకొని యాతని పాదము లంటి నమస్కరించి ఆనందబాష్పములు కార్చుచు పాదములు కడిగి యా మహాత్ముని పాదోదకము శిరస్సున జల్లుకొనెను. మారనకును గురునాథునకును ఏమిచేయవలెనో తోచలేదు. అన్నమంత్రియే వా రిరువురను తన రెండు పార్శ్వములకు బిలిచి, వారి కైదండతో నడచుచు, పర్వతమల్లుపై ప్రసన్నదృష్టి బరపుచు మండపము ప్రవేశించెను.

అన్నమంత్రి చూడగా నప్పుడే నగరాంతరము పనిమీద పోయి యింటికి తిరిగి వచ్చినవానివలెనే కనబడుచుండెను. ముఖమున నెట్టి దైన్యముగాని చింతగాని లేదు. కోప మసలే లేదు. అప్పుడే బంధవిముక్తు డైనవాని కుండు విస్రబ్ధభావమును ముఖమున నేమాత్రము దోచుటలేదు. మండపములో నున్న సదస్యు లందరు తమ కన్నులు తాము నమ్మలేకపోయిరి. అతడు సరాసరి పూజావేదికయొద్దకు వచ్చి యావాహిత యగు పరదేవతకు నమస్కరించెను.

పూజ కావించుచున్న పార్వతీదేవి తన దృష్టి ప్రసారముననే భర్తృపాదాభివందనము చేసెను. బాల పరుగెత్తుకొని వచ్చి తండ్రి పాదములు పట్టుకొని కాళ్ళు చుట్టవేసికొన్నది. అన్నమంత్రియు దాని శిరస్సును చుబుకమును పుణుకుచు నాదరించి సౌమ్యముగా దానిని యథాస్థానమున గూర్చుండజేసెను. అంతట నాతడు సూక్ష్మముగా లోనికి బోయి తల్లికి పాదాభివందనము చేసి వెంటనే తిరిగి పూజా మండపమునకు వచ్చి, తానును ఆ యింటికి పిలువగా వచ్చిన యతిథివలెనే అం దుపవిష్టుడాయెను. అత డెవ్వరిని పలుకరింపలేదు. తల వంచుకొని ధ్యానవ్యగ్రుడై యుండెను.

అంతట నచ్చట కుమారీపూజ యను మహోత్సవము ప్రారంభించెను. ఈ పూజ సంవత్సరము దాటి పదిసంవత్సరములు దాటకున్న కన్యకలకు చేయుదురు. సంవత్సరము దాటనివారు పూజాదులవిశేష మేమాత్ర మెరుగరు గనుక పూజకు యోగ్యలు కారు. పదిసంవత్సరములు దాటిన కన్యలును ఏపూజకును అర్హలు కారని శాసింపబడినది. అందుచే నక్కడ చేరియున్న కన్యకలలో కుమారీపూజకు యోగ్యులైనవారి నందరిని ఆ విశాలవేదికపై నున్న ప్రత్యేకాసనములమీదికి రావించి బాలతోపాటు కూర్చుండజేసిరి. అంతట వారి నందరిను నానావతారములు పొందిన పరదేవతనుగా భావించి, యమూల్యము లగు బంగారుపట్టువస్త్రములతో నలంకరించి, పూజలొనర్చి అమృతపాత్ర లిచ్చి నివేదించి, యథాశాస్త్రీయముగా పార్వతీదేవి స్వయముగా కుమారీపూజ నిర్వర్తించెను. ఆ కుమారీపూజ చూచుచున్న సదస్యులెల్లరు తాము ధన్యుల మైతి మని వ్యగ్రచిత్తులై యామహోత్సవము తిలకించుచుండిరి.

కుమారికల నందరను పూజించిన పిమ్మట వారిని యథాస్థానములకు బంపియామె బాలాచక్రార్చనము పూర్తి చేయుచుండెను. అర్చనావసానమున పార్వతీదేవి పురోహితుని నిర్దేశమున అమృతపాత్రముందుగా అన్నమంత్రీశ్వరున కర్పించి పిమ్మట తాను గ్రహించెను. సదస్యుల కందరికు తీర్థప్రసాదములు పంచిపెట్టిరి. భూసురు లందరు

బహువిధముల నాశీర్వచనము లొనర్చిరి. వారు వేదమంత్రము లుచ్చరించుచుండ వారితో నన్నమంత్రీశ్వరుడును తన కంఠము కలిపి పార్వతీదేవిని బాలను ఆశీర్వదించెను.

నృత్యగీతాదిసమర్పణము వచ్చెను. ఆసమయమున మదాలస మాచల్దేవి సాయముతో పవిత్రమనోజ్ఞమగు విధముగా లలితోపాఖ్యానమునుండి కామసంజీవనము నభినయించి పరదేవత కర్పించెను.

ఆ మహోత్సవమున కానాడు రుద్రమ్మ రాకయు అన్నమంత్రి రాకయు నపూర్వశోభ చేకూర్చెను. వచ్చిన యతిథుల కందరకునాపూట మహావైభవముగా విందు జరిగెను. అన్నమంత్రి మహాభవనము అంతమంది యతిథుల నర్చించుటచే ధన్యమయినదని తలంచుచున్నట్లే కనిపించెను. అతిథులును పరదేవతాప్రసాదము తమ కానాడు ప్రాప్తించినందునే కృతార్థుల మైతి మనుకొనిరి.

ఆనాడు బాలకు రుద్రమ్మ తెచ్చి యర్పించిన కట్నములు అమూల్యములైనవి. మరియు నితరులు తెచ్చిన బహుమానములతో నన్న మంత్రీశ్వరుని గృహమంతయు బంగారు వెండి వస్త్రములతోడను అమూల్యవస్త్రాభిధానములతోడనునిండియేపోయెను. ఆ సాయంత్రమున ఉత్సవము పూర్తియగునప్పటికి అతిథుల కర్పించిన గౌరవపు కానుకలతో రెండంతలు బంగారు వెండి వస్త్రాదులు వెచ్చింపబడెను.

చిత్రముగా రుయ్యాన్మ యానా డాయింటిలోని పిల్లవలెనే కలసిపోయినది. అది చూచుచున్న అన్నమంత్రికి ఆశ్చర్యముతోపాటు చిత్రవిచిత్రమైన యూహలు హృదయములో నాట్యమాడ జొచ్చెను. మానసపై బాలకు కలుగుచున్న అవ్యాజానురాగమును అన్నమంత్రి హృదయమునకు ఎక్కినది.

భోజనతాంబూలాదికము లైనంతట అతిథులలో పురుషులందరు నొక్కరొక్కరే బయలుదేరి తమతమ నివాసముల కరిగిరి. స్త్రీలును కన్యకలును మాత్రము ఆసాయంకాలము పేరంటమునకై యందే నిలిచిపోయిరి. అట్లు నిలిచినవారిలో రుద్రమయు రుయ్యాంబయు గలరు.

ఆ నాడచ్చట నన్నమంత్రియు నతిథులలోనొకనివలెనే సంచరించెను. భోజనాదిక మైనపిమ్మట నతిథు లందరును బయలుదేరి వెళ్ళుచుండగా వారితో నాతడును బయలుదేరెను. వెళ్ళుటకు ముందు అతడు లోపలికి పోయి సూక్ష్మముగా తల్లికి నమస్కరించెను. గౌరమ యాతని లేవదీసి కౌగిలించికొని దీవించెను. ఆసమయమున రుద్రమ్మ సమీపముననే యుండెను. తల్లియొద్దను రుద్రమహారాజులయొద్దను సెలవు తీసికొని, నమస్కరించిన పార్వతిని లకుమమ్మను దీవించి, బాలను ముద్దాడి, యన్నమంత్రి బయలుదేరెను.

బాల సుమన్సు చిన్నపుచ్చుకొనకుండుటకును దానిని తండ్రి దీవించు నవకాశమిచ్చుటకును అతనికి రుద్రమ స్వేచ్ఛానుజ్ఞాపత్రముతో మేనా యిచ్చి పంపియుండెను. దాని ననుసరించి యాత డీనా డిక్కడికి వచ్చియుండెను. ఇప్పుడు ఉత్సవము ఐపోయినది. తన కిక నిక్కడ పనిలేదు. కాన మరల సిద్ధముగా నున్న మేనాపై ప్రత్యేకముగా తనకు నిర్మితమై యుండిన కారాగారమున కాతడు బయలుదేరి వచ్చెను.

ఇక్కడ నున్నంతసేపును అతడు చింతతో లేడు. ఉత్సాహముగనే యుండెను. ఇప్పుడు కారాగారమునకు తిరిగి వెళ్ళునప్పుడును అతని కట్టి చింతయు లేదు. ఇక్కడనున్నంత సేపును అతడు సామాన్యపుగౌరవప్రీతివచనములు తప్ప విశేష మెవరితోడను మాటాడలేదు.

వచ్చిన యతిథులకును అన్నమంత్రి యింటిలోనివారికిని అది యొక యింద్రజాలముగనే తోచినది. నిజముగా నా వచ్చినది యన్నమంత్రీశ్వరుడేనా? అత డిన్నాళ్ళ కింటికి వచ్చియు పూజ్యురాలగు తల్లితో నేకాంతమున మాటాడలేదు. పత్నులతో మాటాడలేదు. బాలతోనైన నెక్కువ మాటాడలేదు. పర్వతమల్లుతో గాని యితర బంధువులతో గాని సంభాషింపలేదు. యజమాని యాదరించునట్లు అతిథులను గూడ పలుకరింపలేదు. తిక్కనసోమయాజులను గూడ ముక్తసరిగా తప్ప పలుకరింపలేదే! వచ్చినది నిజముగా నన్నమంత్రియేనా? ఇంద్రజాలమా?

ఇన్నాళ్ళను అన్నమంత్రివ్యవహారశాలలో వ్యవహారములు చూచుచున్న తిక్కచమూపతికి మాత్రము ఏలనో ఆనాడు మనశ్శాంతియే లేదు. వ్యవహారశాలలో నతని కానాడు అందిన పత్రములు కలవరము కలిగించెను. దానికి తోడుగా మారన్న గారి యింటి కుమారునివలెనే ప్రవర్తించుచుండుట యాతనికి సంక్షోభమే కలిగించెను.

ఇప్పటికి పదియేండ్లక్రిందట తిక్కచమూపతి యేకపుత్రుడు ఆరేండ్లవాడు, కనబడకుండ బోయెను. ఇప్పుడాతడు జీవించియున్నచో మారనయీ డుండును! ఇంతవాడే యైయుండును! నా కా భాగ్య మేది?

ఆనా డాతడు చూచిన పత్రములు అన్నమంత్రిపైనను మారనపైనను గూడ సందేహములు దృఢపరచునవే! ఏమి చేయగలడు? ఆరాత్రి రుద్రమ నిజభవనమునకు పోవుచున్నట్టు, తిక్కచమూపతి రాజసేవకు బద్ధుడై యా పత్రములన్నియు రుద్రదేవ మహారాజులకు నివేదించెను.

## 3౧

అట్లు సాహసించి త్రిపురాంతకు డాకస్మికముగా మోటుపల్లి పట్టుకొనినంతనే, నెల్లూర నున్న జటావర్మసుందరపాండ్యునకును గోదావరి దరియుచున్న కొప్పెరుంజింగనికిని ఆశ్చర్యమయ్యెను. ఒకరివార్తలొకరికి ఇన్నాళ్ళు నిరంతరముగా వచ్చుచున్న విప్పుడు నెమ్మదిగా నెమ్మదిగా లేకుండ బంధించిపోవుచుండెను. దానితో వారిరువురకు సమగ్రముగా సంప్రదించుకొను నవకాశము లేకుండ తప్పిపోయినది.

ఈ విధముగా శత్రువులకు చికాకు కలిగించినను, త్రిపురాంతకునకు గాని జన్నిగదేవునకు గాని మనస్స్వాస్థ్యము కలుగలేదు. వారిరువుర చుట్టును శత్రువుల మండలములే కలవు. అటు నెల్లూరునుండి సుందరపాండ్యు డెత్తిరావచ్చును. ఇటు గోదావరీసీమ దరియుచున్న కొప్పెరుంజింగని సేనలు నెమ్మదిగ రావచ్చును.

ఉత్తరమున మోసలపట్టణము రేవు కొప్పెరుంజింగని సేనల యధీనమున నున్నది. దక్షిణమున నెల్లూరు సమీపమున కృష్ణాపట్టణము రేవు సుందరపాండ్యుని స్వాధీనమున నున్నది. ఇట్లు రెండు వైపులనుండి నౌకాసైన్యములను కాదవపాండ్య సేనలును ఒక్కసారిగా మోటుపల్లిపై విజృంభించిన త్రిపురాంతకుడు నిలువలేడు; జన్నిగదేవుని సేనలును ఆ నాలుగు సేనాప్రవాహములను అరికట్టి నిలువలేవు. అదియును గాక గొంటూరుమాండలికు డగు నాగదేవుడును, ధనదుపోలులోని చోడపతియు కోణిదెన చోళులును—అందరును శత్రుపక్షములోనివారుగనే ఉండిరి. వీని యన్నిటికి తోడుగా ఈశాన్యమునుండి కాళింగసేనలు కోలనిరుద్రుని ధిక్కరించి రావచ్చును. అందుచే త్రిపురాంతకుడును జన్నిగయు సంకటావస్థలో లేకపోలేదు.

ఈ స్థితిగతులు వారిద్దరు పరికించినారు. కాని వారిద్దరికిని గుండెనిబ్బర మెక్కువ. జన్నిగదేవుడు తన మూలబలమును వినుకొండలో నుంచి, శీఘ్రగాములగు నాశ్విక దళములను ఉత్తరమున గొంటూరు మండలముపైకిని కోణిదెనపైకిని, దక్షిణమున కనిగిరి కందుకూరులపైకిని పంపుచు, నిరంతరసంచాలనము చేయించుచుండెను. అందుచే నెవరికిని అతనియొద్ద నెంతబల మున్నదో నిశ్చయింప రాకుండెను. అతని సేనలకు శత్రుసేనల బలాబలములు ఈ దళములద్వారా తెలియవచ్చుచుండెను.

త్రిపురాంతకుడు అద్దంకిమీదుగా వినుకొండతో తనకు సంబధము తెగిపోకుండుటకు సమస్తప్రయత్నములు చేయుచు, ఆమార్గమున నున్న కోటలను పట్టణము లందును సేన లుంచి, గోడలు కట్టించియు, కందకములు త్రవ్వించియు బలపరచుచుండెను. మరియు తన చేజిక్కిన మోటుపల్లి నౌకలను యుద్ధమునకు అయితము చేయించి వానిని నావికులతోడను ధనుర్ధరులతోడను పూరించి వీలు చిక్కినప్పుడు గోదావరి సేనలతో కలసి మోసలపట్టణము రేవు పట్టుకొనుట కుంకించుచుండెను.

కాని ఆ సోదరు లిద్దరును వారి ప్రాణము లరచేతులలో బిగబట్టుకొని మేకపోతు గాంభీర్యముతోడనే చరించుచుండిరి.

ఆ సమయమున సరిగా ఓరుగల్లునుండి రెండు మహాసేనలు బయలుదేరి శీఘ్ర ప్రయాణముల సాగుచున్న వను వార్త జన్నిగకు తెలిసినది. ఆ మహావాహినులలో నొకటి యంబదేవుని యాధిపత్యమున తమ సహాయమునకే వచ్చుచున్నది. జన్నిగ యీ వార్త వెంటనే త్రిపురాంతకున కెరిగించి సేనాచలనమునకు నిశ్చయించెను. ఆ చలనము శీఘ్రముగా చేయవలెను! కాని ఎటు పోవలెను ?

ముందు నెల్లూరుపై బడిన లాభము లేదు. అక్కడ నున్న సుందరపాండ్య సేనలు బలవత్తర మైనవి. అదియును దూరము. అటు తాను ప్రయాణము సాగించినచో తన్ను ఎలయించుటకు పాండ్య సేనలు కొంచెము వెనుదీసినను ఎన్నాళ్ళకోగాని యది తేలదు.

అందుచే రాజ్యమధ్యమునకు చొచ్చుకొని వచ్చిన కొప్పెరుంజింగని ముందు సాధింపవలెను. ఇది సుఖతరము. అత్యావసరము! రాజ్యగర్భములో ప్రవేశించిన శత్రువు నచ్చట దీర్ఘకాల ముండనిచ్చుట క్షేమము కాదు. మరియు వసిష్ఠగోదావరి నాతని దాటనిచ్చి, సప్తగోదావరములమధ్య చేరనిచ్చిన నాతనికి స్థైర్యము చేకూరును.

గోదావరిపాయలు దాటి యాతని నిర్జించుట కష్టము. అతనికి ఆహారపదార్థములు బయటినుండి రాకుండ నరికట్టినను, సస్యశ్యామలమై ఫలవంతమగు నా ప్రదేశమున నాతనికి ఆహారాదిసమస్తపదార్థములను సులభముగా లభ్యము లగును. బంగారువంటి యచ్చటి క్షేత్రములు ఈ పల్లవసింహము నలజడి కాగలేవు! కావున ముందు కొప్పెరుంజింగనివైపుకే తన మూలబలము మరల్ప జన్నిగ నిశ్చయించెను.

తన యుద్ధయాత్రకు అవసరమైన ప్రయత్నము లన్నియు నతడు ముందుగా పూర్తికావించెను. దాని నడకను, తిరుగులతోసహా చలనకార్యక్రమము నిర్ధారణచేసెను. ఇవి యన్నియు త్రిపురాంతకుననుండు వచ్చుచున్న అంబదేవునకును ముందుగ రహస్యముగా శీఘ్రగాములగు దూతలచే తెలియజేసి వారి సమ్మతి పొందెను. దక్షిణమునుండి పాండ్యసేన లేకవేళ కదలి వచ్చినచో, వానిని ఎట్లెదుర్కొనవలెనో, ఎక్కడ నెదుర్కొనవలెనోకూడ, ముందుగా నిర్ధరించి తమ్ముడగు నంబదేవునకు తన శాసనము తెలియజేసెను.

శీఘ్రముగా తాను గోదావరి దరియుటకు కోణిదెన గొంటూరులమీదుగా సీతానగరము చేరి కృష్ణ నుత్తరించి బెజవాడ చేరుకొనవలెను. కాని యా రెండు మండలములును శత్రువుల చేతులలో నున్నవి. అందుచే నించుక దూరపు మార్గమైనను, పల్నాడుమీదుగా నమరావతిచేరి, యక్కడ కృష్ణ నుత్తరించి యాత్ర సాగింప నాతడు నిశ్చయించెను. ఈ దారిన బోయినచో నతని సేనలకు వామపార్శ్వమున నెట్టి భయము నుండదు. కాని కుడివైపున కోణిదెన చోళులును గొంటూరు నాగదేవుని మూకలును గలవు. వానివలన తన సేనాచలనములకు కొంత యాటంకము కలుగవచ్చును. అందుచే నాతడు తనసేనలో చిన్నభాగములు రెండు వేరుచేసి, యందులో నొకటి కోణిదెనపైకిని, రెండవది గొంటూరుపైకిని పంపెను. ఆ సేనలు కోణిదెనగాని గొంటూరుగాని పట్ట నుద్దేశించినవికావు. అక్కడి సేనలు జన్నిగ మూలబలములపై రాకుండ నరికట్టుటకు ఉద్దేశింపబడినవే. ఈ జాగ్రత్తతో జన్నిగదేవుడు తన మహాసేన కదలించెను.

అంబదేవుని సేన తన్ను కలియకముందే ఇట్లు యాత్ర సాగింప జన్నిగదేవుడు సాహసించుటకు మరియొక ధైర్యకారణమును చేకూరియున్నది. ఆవల కొలనిరుద్రుడు అప్పటికి కొలనివీడు దుర్భేద్యముగా దృఢపరచి, తన మహాసేనతో నిడుదవోలు మీదుగా రాజమహేంద్రవరము చేరి, యక్కడినుండి సాహసించి పీఠికాపురము ప్రవేశించి యచ్చట విడిసెను. తాను వచ్చిన దారిని నూతన సైన్యము లాయత్తము లొనర్చి, దుర్గములు సర్వసంపన్నములు చేసి, అప్రమత్తు లగు వాహినీపతుల నాయా యెడల స్థాపించి, కొప్పెరుంజింగ డటువైపుకు కదలకుండునట్లు బలపరచెను. ఆతని ప్రయత్నములు సఫల మగుటవలననే కొప్పెరుంజింగని సేన లెంతకును తమ నౌకలను దూరమున సముద్రములో జూచుకొనుచు, తీరమువెంట ఈశాన్యాభిముఖముగా సాగుచుండెను.

ఇట్లు మార్గము నిష్కంటకమొనర్చి కొలనిరుద్రుడు పీఠికాపురము చేరి కళింగ సేనలు దండెత్తినచో నెదుర్కొనుటకు సిద్ధపడుచుండెను. అందుచే ప్రస్తుతము కాక

తీయుల కోరంగిరేవు సురక్షిత మయ్యెను. కాని రుద్రుని సేనలపై నొక్కసారిగా కళింగసేనలును కాడవసేనలును రెండువైపులనుండి వచ్చి పడినచో నిలువలేవు. ముందు నిర్ధారించిన ప్రకారముగా నాతనికి అన్నమంత్రీశ్వరుని ప్రాపు రావలసియుండెను. కాని యది రాలేదు. పైపెచ్చు ఆతడు నిర్బంధములో నున్న వార్తయు కోలని రుద్రునికి చేరెను.

ఎందువల్ల అన్నమంత్రిని బంధించినారు? రాజద్రోహు లాతనిపై కొండెములు చెప్పియుందురు. దోషము లంటని యీ మహానుభావునిపై వేసిన దోషములు ఎన్నాళ్లు నిలుచును? కాని యది తనపైగూడ ప్రసరించునా? అందుచే దనకు గావలసిన సహాయ సేనలు రాకుండబోవునా? ఏమైన నేమి? ముందుగా నిర్ణీతమైన కార్యక్రమ మనుసరించి తాను తనవిధి నిర్వర్తింపవలెను! అట్లు నిశ్చయించి యాతడు తన విధి నిర్వహించెను.

ఇట్లుండ మోటుపల్లి త్రిపురాంతకుని స్వాధీనమగుటయు, ఓరుగల్లునుండి రెండు మహాసేనలు బయలుదేరుటయు నాతనికి తెలియవచ్చెను. అందులో అదిదమ్మ యధీనమున పాకాలనుండి కదలిన సేన తన సహాయమునకే వచ్చుచున్నది. భేద మొక్కటే! పరమేశ్వరమూర్తి యగు అన్నమంత్రీశ్వరుడు ఆ సేనవెంట వచ్చుచుండలేదు. అతని స్థానమున ఆదిదమ్మ వచ్చుచున్నాడు. అతడును మంచివాడే, సమర్థుడే! కాని అన్నమంత్రీశ్వరునకు త్రిభువనములలో ఎవరీడు!

ఆదిదమ్మ వచ్చుచున్న వార్తతో కోలనిరుద్రుని మనస్సుకు నెమ్మది కలిగినది. వెంటనే యాతడు కోరంగి వెళ్ళి యక్కడి కాకతీయ నావధ్యక్షుని గలిసికొని యవసరము లగు సర్వసన్నాహములు చేయ నుత్తరువు లిచ్చెను. ఆ నావధ్యక్షుడు ముఖ్యముగా సముద్రముమీదినుండి కొప్పెరుంజింగనికి కాళింగుల సహాయముగాని పాండ్యుల సహాయముగాని రాకుండ నరికట్టుచుండవలెను.

ఈ ఏర్పాట్లు చేసి రుద్రుడు తిరిగి పిఠాపురము వచ్చి ఆదిదమ్మ సేనల రాకకై నిరీక్షించుచుండెను. ఆ సేనలు వచ్చినవెంటనే ఆతని స్వాధీనమున పిఠాపురప్రాంత మంచి యవసరమైన సేనలతో సాగి తాను కాళింగసేనల నెదుర్కొనుటకు కోలని రుద్రుడు నిశ్చయించెను.

## ౩౨

భారతఖండముమీదికి పలుమారులు విదేశీయులు దండయాత్రలు సలిపిరి. ఆ వచ్చిన వారు విదేశీయులే గాక విజాతీయులును విరుద్ధధర్ములును! అట్లగుటచే భరత భూమిలోని జనమందరును వారి కొక్కటియే. తురీయాశ్రమము లేమి, వనప్రస్థు లేమి యోగు లేమి, విద్వాంసు లేమి, తస్కరు లేమి, ధనవంతులేమి, పేదవా రేమి,

పెద్ద లేమి, పిన్న లేమి—అందరు నొక్కటియే! భరతభూమిలోని జనమును తమ కష్టముల కొరచేయుట వారి కొక యాట. పిల్లలు గండుచీమలను పట్టుకొని నలిపివేయుదురు; తూనీగల రెండురెక్కలు పట్టుకొని తోకను దారములు కట్టి ఎగురవేయుదురు; పక్షులు చెట్లపైని గూళ్ళలో పెట్టిన గ్రుడ్లను, పదలిపోయిన చిన్నపిల్లలను అపహరించి, పెద్దపక్షులు వచ్చి యని చూచుకొని ఆ చెట్టుచుట్టును అల్లాడుచు ఎగురులాడుచుండగా చూచి ఆనందముతో గంతులు వేయుచు, ఆ యల్లాడు పక్షులపై రాళ్లు రువ్వుచుందురు. సరిగా నట్లే, విదేశములనుండి వచ్చిన శత్రువులను ఈ దేశప్రజలను బాధించుటకూడ నొక క్రీడయే!

కాని భరతఖండములో నొక రాజు పరియొక రాజుపై దండెత్తి పోయినప్పుడు అట్లు కాదు. ఈ దండయాత్రలు రాజులను రాజులను సంబంధించినవియే; యుద్ధముచేయుట యెదుర్కొనిన సేనలతోడనే! ప్రజలతో విరోధము లేదు. మహాయుద్ధము జరుగుచున్న చోటికి సమీపప్రదేశములనే కృషీవలులు శాంతముగా తమ పొలములు దున్నుకొనుచునో, అందు విత్తులు చల్లుకొనుచునో, అందుండి నూర్చిన పంట తెచ్చుకొనుచునో శాంతముగా నుందురు; వివాహములు జరుగుచుండును; యజ్వలు నిరాటంకముగా తమ చేయు యజ్ఞములు కొనసాగించుకొనుచుందురు.

అంతే కాదు. యాత్ర చేయు మహాసేనలతోకూడ పండితులు కవులు గాయకులు నటులు విదూషకులు బహువిధవినోదకులు కలసి నడచుచుందురు. వారికిని ఆ సేన నడచుచున్న యాయాప్రదేశముల నున్న విద్వాంసులతోడను వినోదకులతోడను చర్చలు, గోష్ఠులు, వివాదములు ప్రవర్తమానము లగును. వారును ఎవరున్న అధికారులకొలది వారి సేనాజనము నాకర్షించి బహుమానము లందుచుందురు. ఈ విధముగా సేనాచలన మూలమున నొక ప్రాంత సుందరలిక వినటగాయకాదు ఇతర ప్రాంతములలోని రీతులు అనుకరించుట అభ్యసించుట సాధ్యపడుచుండెను. ఈ విధముగా వివిధప్రాంతీయసంస్కృతులను ఏకభావము సమకూరుచుండెను. మధ్య మధ్య వారిలో వారికి స్పర్ధలు పెరుగును. సభలు జరుగును. విద్యాప్రదర్శన మొనర్చి మెప్పించి గెలిచినవారు జయపత్రము లందుటయు కద్దు.

అందును కొప్పెరుంజింగని యాంధ్రదేశదండయాత్ర విశిష్టమైనది. అతనిలో చిత్రముగా రెండు విరుద్ధప్రకృతులు మిశ్రమై యున్నవి. అతని సైనికులు బహుక్రూరులు. అతడు వారు చేయు ఘాతుకకృత్యములు వారింపడు. అయితే అతడు గాత్రము బహుసౌమ్యుడు; సరసుడు; దయాస్వభావము కలవాడు; లలితకళలందు విశేషాదరము కలవాడు. ఇంతియ కాదు. అతడు స్వయముగా కర్మిష్ఠి. అందుచే నాతడు అగ్నిహోత్రుడై దండయాత్రలకు వెళ్లుచుండువాడు. ఆ యగ్ని తర్పణమునకును, మధ్య మధ్య వచ్చు నైమిత్తికములకును, శాంతిపౌష్టికాదికములకును, పురోహితుడును పలువురు ఋత్విక్కులను ఆ సేనవెంట నేగెడువారు. మరియు నాతడు స్వయముగా విద్వాంసుడు అతడు 'ఖడ్గ మల్లుడే' కాక 'భరత మల్లుడు' కూడను! 'నిశ్శంక మల్లుడే' కాక 'సాహిత్య రత్నాకరుడు'కూడను. అతనికి విశేషముగా నాటకములం దభిమానము. 'కావ్యేషు నాటకం రమ్యం' అని 'ఏకాంతంసాహిత్య' మందురు గదా! అతనివెంట నెల్లప్పుడును 'యక్షగాన' విదు లగు కర్ణాటకులయు, 'తెరుక్కూత్తు' నేర్చిన తమిళులయు, సంస్కృతనాటక

ప్రయోగకుశలు లగు కేరళులయు నటబృందములు వచ్చుచుండెడివి. పర్వసమయము లందును వేడుక కలిగినప్పుడును ఆతడు వారి నాటకములు ప్రదర్శింపజేసి తన సామంతమంత్రిదండనాథులతో కలసి చూచుచుండువాడు. వానిని చూచుటకు ఆ యా ప్రదేశములం దున్న విద్వాంసులను రసికులనుగూడ నాహ్వానించు చుండువాడు. మధుర మైన పదార్థము ఒంటరిగా భుజింప గూడదుగదా !

ఆంధ్రదేశ ప్రజలకు కన్నడభాషలో నున్న 'యక్షగాన' ములును తమిళములో నున్న 'తెరుక్కూత్తు' లను బాగుగా నర్థము కావు గనుక అవి వారి కంత నచ్చవు. అందుచే ఆ ప్రదర్శనములకు ఇతరులకు నెక్కువ యాహ్వానించువాడు కాదు. కాని కేరళబ్రాహ్మణులు ప్రదర్శించు సంస్కృతనాటకములు తిలకించుటకుమాత్రము విరివిగా ఆంధ్రదేశమందలి కవులను పండితులను అత డాహ్వానించుచుండెను. తెలుగు దేశములో ప్రవేశించి నప్పటినుండియు ఈ సంస్కృతనాటక ప్రదర్శనములే ఎక్కువ చేయింపసాగెను.

అందుచే నిప్పుడు తిరువనంతపురమునుండి వచ్చి తన్నాశ్రయించి వచ్చుచున్న మళయాళబ్రాహ్మణ నటబృందమునకు పనియెక్కువ పడినది. వారు ప్రదర్శించు సంస్కృతనాటకముల కర్త ఎవరో ఎవరికిని తెలియదు. కర్త మొద లొకడో పలువురో కూడ తెలియదు. ఆ నాటకములో కొన్ని పెద్దవి, కొన్ని మిక్కిలి చిన్నవి. సమయాను కూలముగా ఉన్న వ్యవధినిబట్టి యందులో నేదో నొకటి ప్రదర్శింప నను వుగా నుండెను. వాని భరితవాక్యము లన్నింట రాజసింహు డను బిరుదనామము గల రాజు వృద్ధిని ఆశించుచుండును.

"హన్త సర్వే ప్రసన్నాః స్మః ప్రవృద్ధకులసంగ్రహాః,
ఇమాం మహీం మహీం కృత్స్నాం రాజసింహః ప్రశాస్తు నః ?"

ఇత్యాదివిధముగా నవి యుండును. కొప్పెరుంజింగడుకూడ రాజసింహబిరుదాంకితుడే కదా? తన ప్రతాపనామమున కర్థము పెద్దరాజ సింహు డనియే కదా! ఈకారణముచే నా నాటకములయం దతనికి విశేషపక్షపాతము కలదు. అదియుగాక ఆ నాటకములును మనోజ్ఞ మైనవి. అందలి కవిత్వము అర్థవాక్కునకు దగ్గరగా నుండును. రంగస్థలమున ప్రదర్శించుట కవి యెంతయు తగియుండి సామాజికుల కానందము కలిగించును. అందులో 'అభిషేకము', 'ప్రతిమ' ఇత్యాదులు రామాయణకథానాటకములు. 'పంచరాత్రము' 'మధ్యమ వ్యాయోగము,' 'కర్ణ భారము,' 'దూత వాక్యము,' 'దూత ఘటోత్కచము' 'ఊరు భంగము '!— ఇత్యాదులు భారత కథానాటకములు. ఈ నాటకములు దక్షిణదేశమునం దెల్లెడ వ్యాప్తిలో నుండి పండిత పామరులకును ఆదరపాత్రములుగా నుండెను. అందుచే నీ నాటకప్రదర్శనము లాతడు సగర్వముగా తిలకించువాడు ; ప్రదర్శనాంతమున వానినిగూర్చి యా హూతులైన పండితులను ప్రశ్నించుచుండువాడు. వారు నాటకమును తత్ప్రదర్శనమును పొగడిన చో నాతడు పొంగుచుండును.

అయితే ఆంధ్రదేశము ప్రవేశించిన దరిగా నాతని యనుభవము విచిత్రముగా నుండెను. అది యాతని కాశ్చర్యము కలిగించినది. ఆ సంస్కృతనాటక

చక్ర మిక్కడి విద్వజ్జనమునకు అభిమానపాత్ర మగుట లేదు. ఆ నాటకములలో బహువిషయముల లక్షణవిరుద్ధాంశములు కలవు. భాషలో అపాణినీయప్రయోగములు అనేకములు కలవు. అది తనకును తెలియును. ద్రావిడ పండితులకును ఎరుకయే. ఐనను అవి తనకును తా నెరిగిన ద్రావిడ విద్వాంసులకును రసభంగము కలిగించుటకు మారుగా, ఒక యపూర్వమగు రుచియే కలిగించుచుండెను. నిత్యకర్మ లాచరించు వారికి జాతాశౌచము వచ్చినప్పుడు తత్కర్మలనుండి విశ్రాంతి కలిగి వారిలో నలసులగు కర్మిష్ఠులకు కలుగు సంతుష్టిమువంటి సుఖ మది. ధర్మిష్ఠుడు స్వల్పవిషయములలో మధ్య మధ్య ధర్మాతిక్రమణము చేయుటవలెనే, అంత గర్హ్యముగా నవి కనపడియుండలేదు. పైపెచ్చు ఆదర పాత్రము లగుచుండెను.

కాని యీ ఆంధ్రదేశములో నట్లుకాదు! వారి దృష్టి యా దోషముల పైననే ప్రసరింపసాగినది. వారు దోషైకదృక్కులా? కారే! అందులో వారికి మొగమోటము లేదు. మహారాజు లన్న వారికి భయములేదు. రాజాస్థానములలో వారికట్టి గౌరవము లుండెను. వారి వృత్తులు కూడ నంత పూజార్హములు!

కొప్పెరుంజింగడు, పూర్వము నెల్లూర విజయాభిషేకము చేయించుకొనెను. ఆ సమయమున కేరళ నటబృందమువారు కొప్పెరుంజింగని యాస్థానమున నతనితో వచ్చిన కవిపండితులయు నెల్లూరు ప్రాంతములనుండి యాహూతులై వచ్చిన కవిపండిత ఋత్విక్కులయు సమక్షమున రంగనాయకస్వామి యాలయప్రాంగణమున 'అభిషేక' నాటకము ప్రదర్శించుచుండిరి

ప్రథమాంకము పూర్తి కాబోవుచుండెను. వాలికోరకపై ఆచమనార్థము హనుమంతుడు నిష్క్రమించి జలము గొని తెచ్చెను. వెంటనే సామాజికులలో నాంధ్ర పండితులు ఆశ్చర్య పడుచు లేచి నిలుచుండి యసహ్యము వ్యక్త మొనర్చిరి. ఆ వెంటనే వాలిమరణము రంగముపై ప్రదర్శింపబడెను. గంగాది సమస్తపుణ్యనదులను అక్కడ ఆవాహనచేసినను వారికి తృప్తి కలిగింపలేదు. అదిచూచి ఒక్క క్షణమైనను అక్కడ నిలువక ఒక్కుమ్మడిగా హాహాకారములు చేయుచు నా యాంధ్ర పండితులు సభనుండి వెడలియే పోయిరి.

అది చూచిన కొప్పెరుంజింగనికి రోషావేశము కలిగినది. ఆ లేచిపోవుచున్న పండితమూర్తుల నతడు తిలకించెను. వారు అగ్నులవలె తేజోమూర్తులు, నిర్భయులు. వారి స్ఫూర్తులు చూచి యత డేమియు ననలేక పోయెను. తాను 'సాహిత్యరత్నాకరుడ'ని బిరుదము ధరించెనే! లక్షణవిరుద్ధాంశము ప్రదర్శింపబడినప్పుడు పండితులు ఏవగించుకొన్న తా నేమన గలడు!

ఆంధ్రదేశమునం దెచ్చటనైనను లక్షణభ్రంశము కలిగినయెడల నిటువంటి సంఘటనలే సంభవించుచు వచ్చెను. రంగస్థలముపై యుద్ధము చూపిన చోట్లను, క్రీడానిద్రాదులు ప్రదర్శించినపుడును, ఆంధ్రసామాజికులలో నిట్లే కలవరము బయలుదేరుచుండెను. ఓరుగల్లులో నిత్యాగ్నిహోత్రు లగు కోటిమంది బ్రాహ్మణుల కుటుంబము లుండెను. అందులో వేదవేదాంగవిదులు బహుశతములుగా నుండిరి. ఆనాటి

సభ దేవేంద్రసభవలెనే శోభాయమానముగా నుండెను. ఆ నాటకములో అపాణినీయ ప్రయోగములు వచ్చినవి. అవి విన్నప్పుడెల్ల ఆ యూరి పండితులు చెవులు మూసి కొని యావలికి వెళ్ళి యాచమనము చేసి వచ్చిరి. కొప్పెరుంజింగ డేమియు ననలేక పోయెను.

కృష్ణానది నుత్తరింపబోవుచు కొప్పెరుంజింగడు కొల్లూరులో విడిసెను. అంత మంది పండితప్రకాండు లున్న గ్రామము కృష్ణాతీరమున లేదు. అక్కడ కేరళనటులు ప్రతిమానాటకము ప్రదర్శించిరి. కొప్పెరుంజింగని యాహ్వాన మంగీకరించి యా యగ్రహారమువందలి పండితు లా నాటకము చూడవచ్చిరి. ముందు సూత్రధార ప్రవేశమునకే వారించుక యాక్షేపించిరి. స్థాపన పూర్తియైనది. అందులో నాటక ప్రస్తావములలో నుండునట్లు కవిపేరు లేదు. 'ఇతడు అనామకుడా?' అని పరిహా సము వచ్చునట్లు హేళనగా నచ్చటివారు ప్రశ్నించిరి. ఆ పిమ్మట రామాయణ కథాసందర్భము నంతగా మార్పుచేసి ప్రదర్శించుట యా పండితులకు రుచింపలేదు. 'రామకథ ఇంత మార్పు చేసియుండుటచే ఈ కవి స్వనామగోపనము చేసికొన్న ట్లున్నాడు!' అని వేసిరి.

కొప్పెరుంజింగనికి కోపమువచ్చినది. 'ఆంధ్రులు శుష్కమీమాంసకులు!' అని సభలో నాత డని కెకిలిగా నవ్వెను.

కొల్లూరులో నీ యనుభవ మైనతర్వాత కొంతకాలముపాటు అతడు సంస్కృత నాటకప్రదర్శనమునే చాలించెను. ప్రదర్శింపజేసినను, ఆంధ్రపండితుల నందు కాహ్వా నించుట మానుకొనెను.

ఇప్పు డాతడు గోదావరీతీరము సమీపించుచున్నాడు. ఇక్కడ వేదవిదులు శాస్త్రకోవిదులు పండితులు మహాకవులు సహస్రాధికముగా నున్నారని యాతడు విని యుండెను. మరల సంస్కృతనాటక మొకటి యీ ప్రాంతముల ప్రదర్శింపజేసి, తన నాటకసమాజమువారికి ఇక్కడి పండితుల మెప్పు సంపాదింపవలెనని యత డెంతేనియు గాంక్షించెను. "పెన్నాతీర వాసులకు తొందర ఎక్కువ! కృష్ణాతీర పండితులకు తల లలో కృష్ణమృత్తిక హత్తుకొనిపోయినది! ఈ సప్తగోదావరిపవిత్రతీరమునందలి పండితు లట్లు కారు! ఈ వారి కావేరీవారివలెనే శుద్ధమైనది. ఈ వీరు శ్రావువారు రసజ్ఞులు. ఇక్కడి పండితుల మెప్పుతో, నాభరతిమల్ల సాహిత్యరత్నాకర బిరుదములు స్థిరపరచు కొనవలెను"— ఈ విధముగా నాతనికి ఉబలాటము అతిశయించినది.

పుష్యమాస ప్రవేశమునకు అతడు గోదావరిశాఖలలో నొకటియగు వసిష్ఠ యిద్ద రికి చేరుకొనెను. అప్పటికే త్రిపురాంతకుడు మోటుపల్లి పట్టుకొనిన వార్త యాతనికి తెలిసినది. కొలనిరుద్రుడు పిఠాపురమున విడిసిన వార్తయు తెలిసినది. ఇప్పుడు జన్నిగదేవుని సేనలు కదలుచున్న వార్తయు తెలిసినది. కాని యాతడు బహుభాగ్య శాలి. అతనికి తన సేనపై నచంచల మగు విశ్వాసము కలదు. పైగా తనకు తోడుగా నెల్లూర సుందరపాండ్యుని సేనలును, ఉత్తరమున కళింగసేనలును కలవు; వాని కన్ని టికి తోడుగా చోళనౌకాబలము లున్నవి. ఇవి యేవియు లేకున్నను, తా నొక్కడే ఒకవంక జన్నిగను రెండవవంక కొలనిరుద్రుని ప్రతిఘటింపగలడు. ఆంధ్రసేన లన్ని

నొక లెక్క కాదు. తాను ముందు ఆంధ్రదేశపండితులను నిర్జింపవలెను. ఈ గోదావరీతీరవాసు లగు పండితులకు తన యాస్థానవిద్వదతిశయము ప్రదర్శించి తన మహిమ ప్రకటింపవలెను. అప్పుడుగాని తన విజయయాత్ర సార్థకము కాదు!

అతడు వైకుంఠైకాదశి నరసాపురములో గడప దలచెను. అందు కాతడు ముందుగనే తన యాస్థానపండితు లందరను ఆనాటి సభకు జాగరూకులుగా నుండ నాజ్ఞాపించెను. ఆ ముక్కోటి ఏకాదశినాటి రాత్రి కేరళనటబృందము 'ఊరు భంగి' నాటకము ప్రదర్శింప సిద్ధముగా నుండ బంచెను.

ఆ నా డాత డుపవసించి పూజాదులతో గడపును. ఆ రాత్రికి నాటక ప్రదర్శనము జరుగును. మరునాడు ద్వాదశిపారణ చేసి, మహాసభ చేసి, విద్వాంసుల మహాదాశీర్వచనము పొంది, వారిని వైభవముగా సత్కరించి, తాను గోదావరి నుత్తరింప ప్రారంభించును. అందుకై యా చుట్టుపట్టుల నున్న వేదవిదులను పండితులను కవులను అందరను దశమినాటికే తన స్కంధావారమునకు రావలసిన దని యాహ్వాన మంపెను.

ఆ యాహ్వానములును చిత్ర మైనవి. అందులో గౌరవము కలదు. కాని వాని ననుసరించి పోకున్నచో శిక్షించు నేమో యను భయముకూడ నందరకు కలదు. ఈ కొప్పెరుంజింగడు రావణాసురునివంటివా డని ప్రథ యొకటి ప్రాకిపోయెను. అందు చేతనే ప్రతినాయకుల గుణాతిశయములు వర్ణనముచేయు నాటకము లాతని కభిమానములట-యను వాడుకయు వారిలో ప్రబలినది. ఏమైనను అతడు పండితపక్షపాతి! పండితుల నాతడు సమ్మానించినట్లు ఇంకొకడు చేయలేడు. కాని కోపము వచ్చినచో నత డేమి చేయునో!—రావణాసురుడు!

భయమున నేమి, భక్తి నేమి, గోదావరీతీరమున గల వేదవిదులు, పండితులు, కవులు దశమినాటి సాయంత్రమునకే నరసాపురము సమీపమున కొప్పెరుంజింగని స్కంధావారమునకు జేరిరి. తణుకు, ఆచంట, పాలకొల్లు, అకివీడు, భీమవరము — ఇత్యాది ప్రదేశములనుండి పండితు లనేకులు వచ్చిరి.

ఆ వచ్చినవారిలో వెల్రిరాలను నగ్రహారమున కగ్రణి యగు కేతన యను ఛాందసకవియు నొకడు!

ఆ విద్వాంసుల కందరకు ఆనాటిరాత్రి పంచభక్ష్య పరమాన్నములతో కొప్పెరుంజింగడు మహావైభవముగా విందు చేయించెను.

## 33

వైకుంఠ ఏకాదశినాడు పూజాదిక దీక్షలు నిర్వర్తించి, మరునాడు మహాసభ చేసి కొప్పెరుంజింగడు వసిష్ఠగోదావరి నుత్తరింప నిశ్చయించి యుండెనుగదా తా! నొకటి తలచిన దైవము నదే యెల్లప్పుడును తలచునా?

పుష్యశుద్ధ దశమినాటికే అతని వాహినులు మొగలితుర్రు కీవల నున్న స్కంధావారములనుండికదలి గోదావరీనదీతీరము చేరుకొని,నది నుత్తరించుటకు సర్వసన్నాహములు చేయ నాయితమగుచుండుటకు నిశ్చిత మయినది. అందుకుగాను వారు యుగోజులు నుండియు ముందుగా చుట్టుపట్టుల రేవులనుండి దొరకిన పడవ లన్నిటిని బలవంతముగా సేకరించి యావలి యొడ్డున నిలుపసాగిరి.

ఇట్లుండ నవమినాటి సాయంత్రమునకే జన్నిగ మహావాహిని సమీపించుచున్నదని కొప్పెరుంజింగని శిబిరమునకు శీఘ్రవార్తాహరులు వార్తలు తెచ్చిరి. ఆపైని గంటగంటకు కాకతీయాశ్వికదళముల యలజడి యెక్కువ కాజొచ్చెను. ఇది తన్ను వసిష్ఠగోదావరి తరింపకుండ నాటంకపరచుటకుమాత్రము ముద్దేశింపబడినదా? లేక యీ జన్నిగదేవుడు మహాయుద్ధము చేయుటకే సంకల్పించినాడా? అతని కింత సాహసముండునా? ఏమైన నేమి? జన్నిగను శిక్షింపకుండ వశిష్ఠ గోదావరి నుత్తరించుటకు కొప్పెరుంజింగడు ఇచ్చగింప లేదు. ఒకవేళ నట్లు చేయ నిచ్చగించినను అది సాధ్యపడదు. జన్నిగమహాయుద్ధమున కుపక్రమింపక దోబూచు లాడుచు కాలయాపన చేయ యత్నించినను, తానే తన సేనలతో జన్నిగను తాక నాతడు నిశ్చయించెను. అదియు శీఘ్రముగా జరిగిపోవలెను. ఈ ప్రయత్న మంతటిలోనను తాను ముందు చేయ సంకల్పించిన నైకుంఠఏకాదశీ వ్రతోత్సవముల కాటంక ముండగూడదు.వీలైనచో ద్వాదశీ పారణ మైన వెంటనే మహాసభ చేసి, మొదల ననుకొన్నట్లు తాను గోదావరి నుత్తరింపలెను. అది తన మహత్త్వమును ప్రకటించును.

ఇట్లాతడు నిశ్చయించుచుండు నంతలోనె ఆ నవమినాటి రాత్రికే మరియొక వార్తయు నాతనికి జేరెను. అతని ప్రధానసేనలు ఎక్కువగా మొగలితుర్రు సమీపమున గలవు. అతనితోపాటు సమీపమున సముద్రముపై చోళనౌకాబలముకూడ సాగుచున్నదిగదా! ఆ నౌకలు చిన్న చిన్న కూటములుగా నెప్పుడి సముద్రమున ముందును వెనుకను ఆవలరిక్షణకై తిరుగుచుండెను. ఆ నావల కన్నిటికి,దూరమున క్రొత్తనావలు కానవచ్చినవి. మొగలితుర్రు వాడరేవును మూడువైపులను ఆ మహానావలు క్రమిస్త్రి వేయుచున్న ట్లున్నవి. అట్లు దూరమున కనబడిన నావలు వర్తకుల వగుటకు వీలు లేదు. అన్ని నౌకాకూటములును తమకు నావ లెన్నో కనబడిన వని వార్తలు తెచ్చినవి. అందుచే నవి యుద్ధకాంక్షతో వచ్చిన కాకతీయ నావలే యెయుండవలెను. ఈ వార్త యానాటి యర్ధరాత్రమునకు స్థిరపడెను.

అటు సముద్రముమీదను ఇటు భూమిమీదను ఒకే సమయమున తానిప్పుడు రణమునకు సంసిద్ధుడుకావలెనని కొప్పెరుంజింగనికి స్పష్టపడినది.అతని సేనలుఉభయత్ర సుశిక్షితములే! కానున్న చోళనౌకాబలముల నెల్లప్పుడు నమ్మి యుండరాదు.

ఇంతవరకు గోదావరీతరణమునకై సర్వసన్నాహములు జరిగియుండెను. అందుచే శిబిరములోని సామాగ్రి చాలభాగము కట్టివేయబడి బండ్ల కెత్తుటకు సిద్ధముగా నుండియుండెను. శత్రుభూభాగమున మహాసైన్య మొకటి మహానదీతరణము చేయుట సులభ సాధ్యమా? స్వల్పసేన మాత్రమే అవసరమైన చిన్నపోరులకు సిద్ధముగా నున్నది. మిగిలిన దంతయు ప్రయాణసన్నాహముతో నున్నది.

నవమి యపరరాత్రమున నాకస్మికముగా కొప్పెరుంజింగడు తన వాహినీపతుల నందర బిలిపించి యాంతరంగికసభ చేసెను. దానికి చోళనాకాధిపతులును వచ్చిరి. అందరు నాలోచించిరి. ప్రయాణప్రయత్నములు వెంటనే నిలిపివేసి మహాయుద్ధమునకు శీఘ్రగతి సర్వసేనల నాయితముచేయ నిశ్చయమైనది.

శత్రుబలములను తృణీకరింపరాదు. అందును జన్నిగదేవుడు సామాన్యుడుకాడు. అతని నెదిరించుటకు జంకరాదు; ప్రమత్తులమై యుండను రాదు. తెలుగు భూమిపై దండు సాగించినప్పటినుండియు ఎప్పుడో ఒకమారు మహాయుద్ధముతప్పదని కొప్పెరుంజింగనికి మొదటనుండియు తెలియును. కాని యాతడు చేతనైనంతవరకు నాంధ్రభూభాగమున చొచ్చుకొనిపోయిన పిమ్మటగాని, యట్టి మహాయుద్ధము చేయ నెంచలేదు. అందుచేనింతవరకు నతడెట్టి చిల్లరయుద్ధములందును చిక్కుకొనకుండ, ఆటంకములేని మార్గముల సాగిపోవుచుండెను. దక్షారామభీమేశ్వరుడాతని ప్రధానగమ్యస్థానము. అనాదిగా చాళుక్యప్రభువుల కులదైవ మాతడు! చాళుక్యులనాటినుండి వచ్చిన పూజ్యత కాకతీయుల కాలమునగూడ నాదైవతమునకు పోలేదు. అందుచే ఆంధ్రభూమిపై దండెత్తినకాళింగులు కాని చోళులు గాని పల్లవులు గాని తమదృష్టిని దక్షారామముపై ముందుగా నిలుపుచుండువారు.

దాక్షారామ మిప్పుడు చేరువయైనది. సప్తగోదావరము దాటినచో దాక్షారామము చేరినట్లే! గోదావరీ మహానదియే యడ్డు! ఇంతవరకు తనసేన కెట్టి తీవ్రప్రతిఘటనయు లేనందున నాతని కాడవసేనలకు కాకతీయబలములపై నిర్లక్ష్య భావమేర్పడినది. అట్టిభావము సైనికుల కుత్సాహము కలిగించుటకు ఉపయోగపడును గాని దానిలో ప్రమాద మున్నది కొప్పెరుంజింగడు తనసేనాపతులకు సర్వము వివరించెను. ఇప్పుడు మహాయుద్ధము తటస్థించినది. తమసేనల యతిశయము ప్రదర్శింపవలసిన తరుణ మిదియే!

చిత్రముగా తెల్లవారు నప్పటికే కొప్పెరుంజింగని సేన ప్రయాణసన్నాహములు కట్టిపెట్టి యుద్ధమునకు సిద్ధ మగుచుండెను. తూర్యారవములు మనోజ్ఞభయంకరముగా మొరయసాగినవి. సైనికులు దళాధిపతులు ధ్వజము లాకాశము నిండున నెగుర వేసిరి. ఖడ్గములు, శూలములు, పరిఘములు, గదలు, ధనుర్బాణములు కట్టాయితమొనర్చిరి. ఆ కాడనసేనలలో ఏనుగులు తక్కువ అశ్వము లెక్కువ. ఉన్న యా కొద్దిపాటి గజములను దళమునకును దళమునకును మధ్యమధ్య యుద్ధసన్నద్ధములుగా తీర్చిరి. పోరుకు సిద్ధమై దళములుగా నున్న యా సైనికులే కాక సేవారక్షణకును వార్తాహరణమునకును అశ్వికులే యెల్లెడ సంచరించుచుండిరి. ఇట్లు దశమినాటి మధ్యాహ్నమునకే కొప్పెరుంజింగని సేనలు యుద్ధమునకు సిద్ధమయ్యెను.

ఆ మహారాజసింహుడు అన్ని యాజ్ఞలును తన సేనాపతులకు ముందుగనే ఇచ్చియుంచెను. ఇక నాతడు తనశిబిరమున నేకాంతముగా నుండవచ్చును.; శాంతముగా తాను సంకల్పించి నట్లుగా నేకాదశీవ్రతము పూర్తి చేసికొనవచ్చును. ఇంతమంది గోదావరీతీరపండితులను పిలిపించి, యిప్పుడు యుద్ధము వచ్చిన దని వారిని పొమ్మనునా? ఇక్కడి పండితులకు తనతో వచ్చిన పండితుల యతిశయము చూపవలెననిగదా

యాతని యుత్సాహము! విద్వానేవ విజానాతి విద్వజ్జనపరిశ్రమమ్!' తనకెంత యదృష్టము! తనసేనలు కాకతీయసేనాబలమును భూమిమీదను సముద్రము మీదను ఎదిరించి నిర్జించుసమయముననే సరిగా, తాను పండితసభ చేసి, యాంధ్రపండిత వరేణ్యులకు తన ప్రతిభను ప్రదర్శించు నవకాశము చేకూరినది. యుద్ధములో విజయమునకంటెనుగూడ ఆంధ్రపండితమహాజయమునకై కొప్పెరుంజింగడు పసివానివలెనే ఉబలాటపడుచుండెను!

## ౩౮

అంబదేవుడు మహాసేనతో వచ్చుచున్నాడను నిశ్చయవార్త తెలియగనే జన్నిగ తన మహాసేనతో కొప్పెరుంజింగని వెంట నంటి యాతడు గోదావరి దాటక మున్న తలపడవలె నని బయలుదేరెను గదా! అతడనుకొన్నట్లు పల్నాడుమీదుగా సులభముగా నమరావతియొద్ద కృష్ణానది నాతని సేన యుత్తరించెను. అక్కడ నతని సేనలో నొక పెద్దభాగము నాతడు మోసలపురముపై కంపి మిగిలిన సేనతో కొప్పెరుంజింగనివెంట నేగెను. అట్లాతడు తనసేనను విభజించుటలో గజఘటల నెక్కువ భాగము తన తోడనే యుంచుకొనెను. నదీతీరముల జరుగు యుద్ధములలో గజఘట లెక్కువ యుపకరించును. అదియును గాక ఆంధ్రసేనలో కెల్ల బలిష్ఠమగు నంగమే గజబలము! రుద్రదేవుని కాలమునను, గణపతిదేవుల కాలమునను, కాకతిప్రభువుల గజబలములే సందిగ్ధసమయములలో వారికి విజయములు సమకూర్చి యుండెను. అందుచే నాంధ్రప్రభువులు గజసేనలు వృద్ధిచేయుచు, వానివిషయమైన విశేషశ్రద్ధ తీసికొనుచుండిరి. ఆంధ్రసేనలలోనే గజఘట లెక్కువ. ఆ బలమును జన్నిగదేవుడును ఆంధ్ర సైనికాచారప్రకారము సుశిక్షితముగా నుంచి,సర్వబలములకును బలముగను, రక్షగను, సహాయముగను ఉండునట్లు ఏర్పాట్లు చేసెను.

అతడు గోదావరీతీరము దరియునప్పటికి అతనితో నరువదివేల సైన్యమే కలదు. కొప్పెరుంజింగని సేన లన్నియు గలసి పదునెనిమిది లక్ష లుండు నను ప్రవాదము ప్రబలియుండెను; కాని నిజముగా నాతని భూసేనలో యుద్ధము చేయు యోధులు లక్షవరకు మాత్రమే యుండవచ్చు నని యాతనికి విశ్వాసపాత్రమగు వార్తలు వచ్చి యుండెను. జన్నిగ బయలువెడలు నప్పుడు కొప్పెరుంజింగని సేనలు దోపిడిమూక లనియే యాతడు తలచిన మాట నిజము. కాని తర్వాత [illegible]నవార్తలవలన నవియట్లు కాక సుశిక్షితము లని రూఢి యైనది. అందుచే నాతనికి జాగరూకత ఎక్కువయ్యెను. సరిగా నది దాటుప్రయత్నములో నున్నప్పుడే కాడవసేనలను తాను తాక నిశ్చయించి నదియు నందువల్లనే! నదీసంతరణప్రయత్నములో నున్న సేనలు యుద్ధసన్నద్ధము లుగా నుండవు అట్టి సమయమున సులభముగా వానిని కలవరపరచవచ్చును. ఎక్కువ సేన లున్న కొప్పెరుంజింగని సేనలలో కొన్ని యుద్ధమునకు సన్నద్ధము కాలేవు. ఈవిధముగా చేసిన తన సేనలు సంఖ్యాబలమున దక్కువైనను ప్రయోగబలమున దీసి

పోవు. అదియుగాక, తన గజఘటలను సక్రమముగా ప్రయోగించినచో తాను జయింప గలడు !

ఏమైనను, బలవంతుడైన శత్రువుతో, తక్కువ సంఖ్యగల సేనలతో, నాతడు తలపడ నుంకించుట సాహసమే ! కాని జన్నిగమాత్రము 'బ్రహ్మరాక్షస' బిరుద ధారులైనవారి వంశములోని వాడేగదా !

ఈ ప్రయత్నమునకు తోడు, జన్నిగ తన జయమునకు, అనుకూలపడుటకు ఇతర సన్నాహము లెన్నియో చేయబంచి యుండెను! ఆసమయమునకే యావల మోసల పట్టణమును, తాను పంపిన సేన భూమార్గమునను, తన సోదరుడగు త్రిపురాంతకుడు మోటుపల్లినుండి ప్రచండనౌకాబలముతో దాని వాడరేవును రోధించును.

మరియును ఆసమయముననే, కొప్పెరుంజింగని వెంట వచ్చుచున్న సముద్ర నౌకాబలమును కోరంగి రేవునుండి బలీయము లగు కాకతీయనౌకాబలములు తాకును. కోరంగినౌకలు పెద్దవియు బలిష్ఠము లైనవియు ; చోళనౌకలు చిన్నవియు చురుకైనవియు ! కోరంగినౌకలు సంఖ్యలో తక్కువ ; చోళనౌకల సంఖ్య యధికము. అందుచే చోళనౌకలు గెలువలేనిచో తేలికగా పారిపోగలవు. ఆంధ్రనౌకలు గెలిచిన గెలువవలెను ; లేనిచో పారిపోలేవు. అందుచే నవి యెట్లైనను సాహసించి గెలువనేవలెను.

ఇవి యన్నియు గాక, అతడు ముందుగనే తాను కొప్పెరుంజింగనితో తలపడ నిశ్చయించినరోజు నిర్ధారణచేసి యప్పటి కెట్లైనను కొన్ని యాశ్వికదళములను వసిష్ఠ గోదావరి పడమటి యొడ్డునకు పంపవలసిన దని యంబదేవునకును ఆనిదమ్మనకును వార్త లంపియుండెను. అట్లే శ్రీలనిరుద్రునికి వసిష్ఠగోదావరి యావలితీరమున దూరముగా కొన్ని సేనలను సిద్ధముచేసి యుంచగోరెను. మరియు రాజమహేంద్రవరము నుండి గోదావరమీదుగా ఐదువందల నదీతరణులు ధనుర్ధరులగు నారువేల సైనికులతో నరసాపురప్రాంతమున కా సమయమునకేవచ్చునట్లు ఏర్పాట్లు జరిగియుండెను.

ఈవిధముగా కొప్పెరుంజింగని సేనలను దిగ్బంధముచేసి సర్వనాశనము చేయవలె నని యాంధ్రసేనాను లూహించిరి. ఎన్ని సన్నాహములు చేసినను,సర్వమును కాదవమూలబలమును జన్నిగసేనలు నిర్జించుటపై నాధారపడియున్నది. అది తాము సాధింపగలిగినచో మిగిలిన ప్రయత్నము లన్నియు వ్యర్థ కాగలవు. అది జన్నిగ మనస్సునద్భుతముగా నాటినది, అతడందుచే మిక్కిలి యప్రమత్తుడై ప్రతిచిన్న విషయమునుగూడ ముందుగనే యాలోచించి నిర్ధరించి యుంచెను.

కొప్పెరుంజింగని సేనలు మొగలితుర్రునకును నరసాపురమునకును మధ్యసంచార మార్గములలో నున్నవి. పుష్యశుద్ధనవమినాటి సాయంకాలమునకే ఆ సేనలపశ్చిమభాగమునకు జన్నిగసేన చేరుకొనెను. కాని యాతడు వెంటనే కాదవ సేనలతో తలపడ దలప లేదు. దశమినాడు తన సేనల కాతడు పూర్తిగా విశ్రాంతి యొసంగెను. అవి దీర్ఘప్రయాణములతో నలిసి యున్నవి. మహాయుద్ధమునకు ముందు ఒక్కరోజు విశ్రాంతి యొసగినచో సైనికులకు నూతన శక్తి యుదయించును. కాని తానానాడు సైనికులకు విశ్రాంతి యొసగిచినవానివలె శత్రువులకు తోపనీయరాదు. అందుకై యాతడు

కొన్ని యశ్వసైన్యముల కదలికలతో నవమినాటి రాత్రియు దశమినాడెల్లను శత్రు సేనల నలజడి చేయించుచునే యుండెను. కొప్పెరుంజింగనికి సేనలును యుద్ధమున కానాడు సర్వసిద్ధముగా లేవు.

వైకుంఠ ఏకాదశి వచ్చినది! ఇంకను సూర్యోదయమునకై దుఘడియల వ్యవధి యున్నది. సరిగా పవిత్రతమమగు బ్రాహ్మముహూర్తము! జన్నిగ స్కంధావారమున గడియారమున ఇరువదియైదు ఘంటలు మ్రోగినవి. పూర్వనిశ్చితవిధమున సేనలు యథాస్థానముల నిలిచినవి. అర్ధచంద్రవ్యూహమున నా సేన లున్నవి. రెండు శృంగములను బలిష్ఠములగు నాశ్వికదళములు కలవు. వెన్నుదన్ని యాంధ్రధానుష్కు లున్నారు. సేనల కెల్ల మధ్యభాగమున ముందుప్రక్కను పర్వతపంక్తివలెనే గజఘటలు పన్నియున్నవి. ప్రతిఏనుగుపైనను పలువురు ధనుర్ధరులు కలరు. ఒక గజమునకు ఒక గజమునకు మధ్య వాని రక్షకై శూలఖడ్గాద్యాయుధధారులగు యోధులు బారులు తీరి యున్నారు.

జన్నిగ తన పటకుటీరమునకు ప్రధానదండనాథులను పిలిపించెను. అచ్చట నంతకుమున్న జన్నిగ గురువరులగు శాంతశివదేశికులు శివపూజ నిర్వర్తించి యుండిరి. జన్నిగయు నతని దండనాథులును శివతీర్థప్రసాదములు భక్తితో గ్రహించి శివగురువులకు మ్రొక్కి వారి యాశీర్వాదములు పడసిరి. శివగురువుల సన్నిధానమున జన్నిగ తన దండనాథులతో నిట్లనెను :

"నేడు మహాపర్వము. వైకుంఠ ఏకాదశి! మన భాగ్యవశముననే ఈనాడు మనకీ మహాయుద్ధము సంప్రాప్తమైనది. ఈనాడు జయించి తిరిగి వచ్చినవారికి శ్రీశివగురువుల శ్రీపాదదర్శనసౌభాగ్యము ప్రాప్తించును. రణభూమిలో ప్రాణము లర్పించినవారికి వీరస్వర్గసౌఖ్యము లభించును. అందును వైకుంఠఏకాదశినాడు శ్రీరుద్రదేవ మహారాజుల సేనలో నది ప్రాపించినవారి పుణ్యము అగణ్యము! జయ రుద్రదేవ మహారాజ!"

దండనాథు లందరు జయజయనినాదములు చేసి స్వస్థానములకు బయలువెడలి తమ తమ క్రిందివారి నట్లే యుద్బోధించిరి. వీరోత్సాహములతో నందరును, ఎవరి వివాహమహోత్సవమునకు వారు కదలుచున్నట్లేయుండిరి. వరాహధ్వజములును ఖట్వాంగధ్వజములును ప్రభాతకాలపు చిరుగాలుల కల్లల లాడుచుండెను.

జన్నిగ స్కంధావారమున రణదుందుభి ముమ్మారు మ్రోసెను. జన్నిగ తన పరిచరులతో శ్రవణము లొగ్గి యాలకించెను. పరునిమిషమున దూరమున వార్ధిపై నుండి, దీని ప్రతిధ్వనియో యన్నట్లు, ముమ్మారు దుందుభినాదము వినవచ్చెను. అది యావల నౌకాసేనలు పర్యాయితమై యున్నట్లు సంకేతము!

అది వినవచ్చిన వెంటనే జన్నిగ సేనాచలనమున కుత్తరువు లిచ్చి, గజారోహణమునకు పూర్వము పఠింపవలసిన మంత్రముల నాతని పురోహితుడు పఠించిన తర్వాత, ఆతడు తన భద్రగజము నధిరోహించెను. ఒక్కపెట్టున శంఖములు భేరులు పణవములు ఆనకములు గోముఖములు ఇత్యాదివాద్యముల ధ్వనులు దిక్కుల భోరుకలెను. ఆవల

నావలపైనుండియు నట్టి ధ్వనులే మారుమ్రోసెను. గజబృంహితములు, హయహేషలు, వీరుల సింహనాదములు మిన్నుముట్టెను.

జన్నిగసేన కదలెను. అది యొక నిబ్బరమైన కదలిక! తొందరలేదు, బాగులేదు. ధృఢసంకల్పములతోకూడిన యుత్సాహమే యావాహిని నావేశించెను. ఆసేనలో ప్రధానబల మగు గజముల గమనమునే దాని ధీరగంభీరగమన మనుకరించుచుండెను.

ఆవల కాకతీయనౌకలును అర్ధచంద్రవ్యూహమునే పన్ని మొగలితుర్రు వాడ రేవుపైకి మహోత్సాహముతో సాగినవి.

## 3౫

జన్నిగసేనలు కొప్పెరుంజింగని సేనలను తాకెను. ధీరగంభీర మైన యా యాంధ్ర సేనల తాకునకు కాడవసేనలు దడదడలాడెను. "ఏమిది? దురుసుదనము లేని యీ వాహిని తాపు మన సేనల నింత యలజడిపరచిన దేమి? అశ్వములు బెదరిపోయి నవి. గజములు చెదరినవి. పదాతులు చిందర వందర యయినారు. ఏమిది"? — ఇట్ల నుచు కాడవ సేనానులు చీకాకుపడిరి.

కాని యుద్ధానుభవముగల యాసేనానులకు వెంటనే కారణము తత్ప్రతి క్రియయు స్ఫురించినవి. 'ఇది పర్వతములవంటి గజముల తాపు! దీనికి ఎదురు నిలి చిన లాభము లేదు. చురుకుగ తప్పించుకొనుచు ప్రక్కవేటులు సాగింపవలెను'. ఇట్లాలోచించి సుశిక్షితులగు వారి సైనికులకు జన్నిగ సేనల నెదురొడ్డు నుపాయము లతో నూతనాజ్ఞలు ప్రవర్తింపజేసిరి.

ఆ సేనలును జాము ప్రొద్దెక్కు నప్పటికి నిలువద్రొక్కుకొనెను. మరికొంతసేప టికి ఎదురుదెబ్బ తీయ నేర్పలనరచుకొనెను. ఈవిధముగా రెండుమూడు క్రోశముల వెడల్పుగల మేరను ఆ రెండుసేనలును తలపడి పోరుచుండెను.

ఆ సమయముననే ఆవల సముద్రముపై యుద్ధము సాగుచుండెను. కోరంగినుండి వచ్చిన కాకతీయనౌకలును బలమున గజములనే యనుకరించుచుండెను. గజయూథము వలెనే అవియు ధీరగంభీరగమనముతో మొగలితుర్రు వాడరేవుపైకి సాగుచుండెను. చిన్న వగు చోళనౌకలు ఆ నావల సందులనుండి తప్పించుకొని వెనుకకు చేరవలె నని ప్రయత్నింపసాగెను. కాకతీయనౌకల మొదటివరుసలో పెద్ద సందులు గలవు. ఆ సందుల మధ్యనుండి చోళనౌకలు వానిని దాటిపోవ బయలుదేరెను.

ఎదురుగా నున్నంతవరకు వానిని కాకతీయనౌక లేమియు జేయక యూరక కొనెను. దానితో చోళనౌకలకు ధైర్య మెక్కువయ్యెను. ముందుకు సాగి యవి నెమ్మదిగా కాకతీయనౌకల మొదటి శ్రేణి మధ్యకు చేరుకొనెను.

అంతవరకు నిదురపోవుచున్న ట్లున్న కాకతీయనౌకలు ఒక్కసారిగా సుప్ర ద్ధము లయిన ట్లయినవి. పెద్దనావలు కదలునప్పుడు జలములో 'సుటు' లేచును. అది

పెద్ద వడివల్ల కలుగు ప్రవాహవేగము. ఆ ఓటులో చిన్ననావలు నిలువలేవు. తమ నావల కదలికచే పుట్టు శత్రునౌకలను ముంచివేయువిధముగా కాకతీయనౌకలు దగ్గరకు చేరకొన సాగినవి. ఆ కదలికతో సముద్రములో లేచిన ఓటుకు చోళనౌకలు కొన్ని గిరగిర తిరిగి మునిగినవి. కొన్ని నిలువలేక యిటునటు కొట్టుకొనుచున్నవి. వానిని నిలువబట్టుకొనుట చోళనావికులకు సాధ్యమగుట లేదు. అంతలో కాకతీయ నౌకల నుండి ధనుర్ధరులు శరప్రయోగము చేసి యా నావికులను అందలియోధులను నొప్పింప సాగిరి. చోళనౌకలలోని ధానుష్కులు బాణమోచనము చేయుట కనువుగా వారికి నావల కదలికచే కాలూనుటలేదు !

ఇట్లు పలునావలు బాధపడినను ఏవో కొన్ని చోళనౌకలు మొదటి శ్రేణిలోని కాకతీయనౌకల సందులనుండి యావల బడినవి. కాని చిత్రముగా ఆ సందులకు ఎదురుగా సూటిగా కాకతీయుల రెండవశ్రేణి నావలున్నవి. అవి యీ చోళనౌకలను తాక నవసరమే లేకపోయినది. వానిదగ్గరకు వచ్చినంతనే, లేచిన సముద్రపు ఓటుకు చోళనౌకలు తలక్రిందు లైనవి. ఇట్లానాడు చోళనౌకలు చేసిన మొదటి ప్రయత్నము వ్యర్థమైనది.

పాటుసమయము చోళనౌకల కనుకూలము. అట్టి పాటువేళ చేసిన ప్రయత్నమే యిట్లు వ్యర్థమైనది. ఈనాడు ఏకాదశిగనుక జాము ప్రొద్దెక్కినపిమ్మట పోటు ప్రారంభించును. ఆ సమయమున దమప్రయత్న మసలే ఫలింపదు. మూడుజాములవరకు మరల పాటుకు తిరగదు. అంతవరకును చోళనౌకలు ఆత్మరక్షణకు తప్ప తాముగా పోరు సాగించుటకు మరి యెట్టి ప్రయత్నమును చేయక మానుకొనెను. అవియు కాకతీయ నౌకాయుద్ధవిధాన మవగతము చేసికొనెను. అందుచే నప్పటినుండి యవి కాకతీయనౌకల సందులకుమాత్రముపోక, ఎదురువచ్చుచున్నట్లే యుండి, ప్రక్కలకును వెనుకకును జరుగుచు, చురుకుగా సంచార మొనర్చుచు కాకతీయనౌకలను, అక్కడ నొకవ్రేటు ఇక్కడ నొకవ్రేటు, వేయుటకు ప్రయత్నించుచుండెను !

ఇట్లు కాడవసేనలును ఆంధ్రసేనలును నేలమీదను సముద్రముమీదను మహాయుద్ధము చేయుచున్నవి. అట్టి సమయమున కొప్పెరుంజింగడు తన శిబిరములో శ్రద్ధగా ఏకాదశీ మహోత్సవము సాగించుచుండెను. ఆ శిబిరమునకు తూర్పున వసిష్ఠ గోదావరియే యగడ్తగా నున్నది. మిగిలిన మూడుదిక్కులను తాత్కాలికముగా చిన్న కోటవలె కట్టి బలిష్ఠమగు సేనలు కాపున్నవి. పూజాదికములకు ప్రత్యేకముగా నాహ్వానింపబడినవారు తప్ప దానిలోని కెవ్వరికిని చోర ననుమతి లేదు. ఆ శిబిరము కూడను మనోజ్ఞములగు చిత్రచిత్రవర్ణములు గల పటకుటీరములతో చిన్న నగరమునే యనుకరించుచుండెను.

మహారాజసింహాపరనాముడగు నా కొప్పెరుంజింగడును, ఆనాడు బ్రాహ్మ ముహూర్తముననే మేల్కాంచెను. అతని పూర్తిపేరు, 'అవనియాళప్పిరంద కొప్పెరుంజింగదేవుడు.' దీనికి అర్థము 'అవని నేల బుట్టిన రాజు పెదసింగదేవుడు.' ఇతని సంస్కృతశాసనములలో నది 'అవన్యవనోద్భవ మహారాజసింహ' యను రూపము ధరించినది. ఆశాసనములలో "సకలభువనచక్రవర్తి, క్షీరాపగాదక్షిణనాయక

'పెన్నానదీనాథ, కావేరీ కాముక' ఇత్యాదిబిరుదములు గలవు. మరియు నాత నికి చిదంబరేశ్వరునియందు భక్తి మిక్కుటము. అక్కడి ముగ్గురు నటరాజులలో నాతనికి కనకసభాపతి యిష్టదైవము. అందుచే నాతడు 'కనకసభాపతి సర్వకార్య సర్వకాల నిర్వాహక' అను బిరుదమును సగర్వముగా వహించెను. అతడు మరియు 'ఖడ్గమల్ల, నిశ్శంక మల్ల, వాల్ బలప్పెరుమాళ్, భరతమల్ల, సాహిత్యరత్నాకర' ఇత్యాది బిరుదనామములుగూడ ధరించెను. ఈ బిరుదములే యాతని స్వభావములోని సర్వతోముఖత ద్యోతక మొనర్చును.

ఆవల, తనకు సమీపముననే, తన సేనానులు నేలమీదను నీటిమీదను రెండు మహాయుద్ధములు సాగించుచుండిరి. తాను స్వయముగా శత్రుభూగర్భమునకు చొచ్చు కొని వచ్చియున్నాడు. ఎక్కడ నే యుపాయను దాగుకొని యున్నదో! అయిన నేమి? తాను తన సేనానులకు సర్వవిధములగు నాజ్ఞలును ప్రవర్తింపజేసి యుండెను. ఆవల నెట్టి యలజడియు లేని సమయమున నుండెడి మనశ్శాంతితోడనే, ఆ మహా రాజసింహు డీనాడు ముక్కోటి ఏకాదశి మహోత్సవము తన శిబిరములో జరుపు చుండెను. సాహిత్యవ్యసనితయు కళావ్యసనితయు గలవారికే అట్టిది సాధ్యమగును. మహాయోగు లెట్టి సందడియందును శాంతము వహింపగలుగుదురు.

సామాన్యముగా కొప్పెరుంజింగని పురోహితుడే యాతని యిష్టదైవమునకు నిత్యపూజ చేయును. ఈనాడు మహాపర్వ మైనందున, నాతడు పురోహితుని బ్రహ్మ స్థానమున గూర్చుండ జేసి, తానే స్వయముగా కనకసభాపతి నటరాజపూజ నిర్వ ర్తించుచుండెను. అప్పు డాతనిని ద్రావిడ కేరళ కర్ణాట దేశాగత విద్వాంసు లెందరో పరివేష్టించి యుండిరి. మరియు గోదావరీతీర వాసు లగు నాంధ్రపండితు లెందరో ఆ పరి షత్తుకు ఆహూతులై వచ్చి సభ నలంకరించి యుండిరి. ఆ యుదయమున పూజావైభవము శ్రోత్రియాతిశయముతో నొప్పారెను. రుద్రాభిషేకము సర్వసంపన్నముగా జరిగెను. సంత్రపుష్పసమయమున ద్రావిడాంధ్ర కేరళ కర్ణాట పండితులు ఒకరితో నొకరి స్వర ములు కలిపి శ్రావ్యముగా వేదమంత్రములు పఠించిరి. అచ్చట నందరకు నభేదభావమే గోచరమయ్యెను. పూజావసానమునకు ముందుగా అక్కడ మంటపమున నావాహితు లైన చిదంబరేశ్వరుని సముఖమున, ప్రాతఃకాలపూజాంగముగా వేదవేదాంగశ్రవణము ప్రవర్తిల్లెను. అందును అందరును నొకే విధమున నన్యోన్యసహకారముతో మెలగిరి. ఇంత దూరదూర దేశములనుండి సమాగతులై ఏకత్ర సమావిష్టులైన యా పండిత బాహుళ్యము వేదవేదాంగములలో ఒకేవిధముగ ప్రవర్తించెను. అపస్మృత శాస్త్రార్థ ములు సాగినవి.

వేదార్థప్రవచనమును వేదాంతచర్చయు సాగినవి. ఆ వెంటనే యక్కడి పండి తులు ముత్తెరుగులైరి. ఆ భేదమును ఆంధ్రద్రావిడాది దేశభేదమున వచ్చినది కాదు. ఆసేతుహిమాచలము పవిత్రకర్మభూమిగా నెంచువారికి, ఈమధ్య నవాంతరదేశాభి మాన మేమి? వారి కట్టి భేదము లేనే లేదు. వారి కున్నది మతభేద మొక్కటే.

రాజసింహునితో వచ్చిన పండితులలో కొలదిమంది శ్రీవైష్ణవులు, కొందరు శైవులు, పెక్కురు స్మార్తులు. గోదావరీతీరపండితు లెక్కువభాగము స్మార్తులే.

వైష్ణవమును శైవమును అక్కడికింకను ఎక్కువగా ప్రాకియుండ లేదు. కాని వారిలో గూడ శ్రీవైష్ణవులును శైవులును గలరు. కాని యా ప్రాంతముల ప్రబలులగు ఆంధ్ర స్మార్తపండితులతో వారు సామాన్యముగా వివాదమునకు సాహసించువారు కారు. వివాదగ్రస్తము కాని భాగముల వ్యాఖ్యానములతోడనే సభలలో సరిపెట్టుకొని, వారి యంతేవాసులకు పాఠప్రవచనములలోమాత్రమే వివాదభాగములు వివరించెడి వారు.

కాని యీనాడు దక్షిణదేశాగతులైన నూతన శ్రీవైష్ణవ పండితుల యండ చూచుకొని, యీనాటి సభలో సాంధ్రశ్రీవైష్ణవులు విజృంభించిరి. ఆ సభలో వివాదము ముందు ఎత్తుకొన్నదే ఆంధ్రశ్రీవైష్ణవపండితులు! వారి వాదమును ద్రావిడ శైవ పండితులు ఖండించిరి. వెంటనే ద్రావిడ శ్రీవైష్ణవపండితు లందుకొని, శైవులను నిందించుచు, మధ్య స్మార్తులపై గూడ కొన్ని విసరులు విసరిరి. ఒక్కసారిగా సాంధ్రకేరళ ద్రావిడ కర్ణాటస్మార్తపండితులు వా రుభయులమీద నేకధాటిని విజృంభించిరి. అది యొక రణరంగమే యయ్యెను. ఈ రణము రెండు ముఖములుగా గాక మూడు ముఖములుగాను, మధ్య ద్వైతులు కూడిన నాలుగు ముఖములుగాను సాగిపోవుచుండెను.

ఏ పక్షమున వాదించువారైనను వేదవేదాంగవిదులే. వానియందు పరమ ప్రామాణ్య మున్నవారే; అందరును కుశాగ్రబుద్ధులే! బహుసభల వాదించిన యనుభవ మున్నవారే! ఒకరి యుక్తికంటె నొకరి యుక్తి బలవత్తర మనిపించుచుండెను. స్థూలబుద్ధితో విచారింప శ్రుతివాక్యములకు పరస్పరవైరుధ్య మున్నట్లు భాసించును. వారందరకు నన్నియు పరమప్రమాణములే. ఆ వాక్యములన్నిటిని సమన్వయము చేసి, వానికి ఏకవాక్యత కూర్చుటలో, ఈ మతభేదములు వచ్చినవి. ఒక్కొక్కరికి ఒక్కొక్క శ్రుతియందు గాఢాభిమానము. దానినిబట్టి వారు మిగిలిన శ్రుతివాక్యముల యర్థము సమన్వయింతురు. ద్వాపర యుగాంతముననే భేదభావము లుదయించెను. అట్టివాని నెల్ల వారించుచు, జైమినియు బాదరాయణుడును, ధర్మసూత్రములను బ్రహ్మసూత్రములను నిబంధించిరి. ఆ సూత్రముల నూతగొని వచ్చుచుండగా, మరల మతభేదము లంకురించినవి. బ్రహ్మసూత్రములకు సంబంధించినంతవరకు, నట్టి వెల్ల మరల వారించి, శ్రీవిద్యాశంకరుల ప్రస్థానత్రయభాష్యములు నిబంధించిరి. ఖరిల నిప్పటికి నూటయేబది రెండువందల సంవత్సరముల క్రిందటినుండియు విశిష్టాద్వైత భాష్యములు, శివాద్వైతభాష్యములు, ద్వైతభాష్యములు వెలసి శాంకరభాష్యములను ఖండింపసాగినవి. అట్లు ఖండించువారికి, శంకరులకు పూర్వులగు వృత్తికారులను, వ్యాసజైమినులకంటె ప్రాచీను లగు కపిలగౌతమాదులును, ఆధారభూతు లగుచుండిరి. కాని యొక చిత్రము! శాంకరమతానుయాయుల సంఖ్యాబల మెక్కువ. ఇతర మతస్థులను ప్రధానముగా శాంకరమతమునే ఖండించుచుండిరి. శ్రీమద్రామానుజుల శ్రీభాష్యములో శాంకరమతము ఖండించుటకు ముందు శాంకరమతనిర్వచనముననే చాలగ్రంథము నడచినది. ఇట్లు పండితసభలలో మహాయుద్ధములే యా కాలమున ప్రవర్తిల్లుచుండెను.

అట్టి మహాయుద్ధమే, యీనాడు కొప్పెరుంజింగని పూజావసానసమయమున, కనకసభాపతి నటరాజస్వామి యాస్థానమున గూడిన పరిషత్తులో, ప్రస్ఫుత్తి మైనది,

వాదప్రతివాదము లన్నియు దేవవాణిలోననే సాగుచున్నవి. కొప్పెరుంజింగనికి సంస్కృతము బాగుగా వచ్చును. నిత్యనైమిత్తికములకు కావలసినంతవరకు మాత్రమే వేదమంత్రము లాతడు చెప్పికొని వల్లించెను. మంచి సాహిత్యవేత్త! సాహిత్యమునకు సన్నిహితమగు భరతశాస్త్ర మతడు క్షుణ్ణముగా నభ్యసించెను. కాని యాతని కితర శాస్త్రములలో గాఢప్రవేశము లేదు. కాని యా పండితులు చేసికొనుచున్న వాద క్రమమును చక్కగా నవగాహనము చేసికొని, సూక్ష్మముగా ననుసరింపగల డతడు. అందుచే నాతడు తన్మయుడై యావాదము లాలకించుచుండెను.

ఈ గోదావరి పండితులు కేవల విద్వాంసులే కాక స్వయముగా ననుష్ఠాత లగు మహాయజ్వలు. వారు నిత్యము నర్చించు నగ్నిభట్టారకుడు వారి శరీరములం దెల్ల ఆవేశించియుండి, వారి మూర్తులకు తేజస్సు నావహింపజేసెను. వారి బుద్ధులు సూక్ష్మమైనవి; వాక్కులలో మాధుర్యముతోపాటు అచంచల మగు దార్ఢ్య మున్నది. ఎదిరి వాదము నొప్పుకొనుచు న్లైక్లే దూరము సాగించి, యక్కడ మొగ్గవేయింతురు. ఎదిరి వారు మోటుగను దురుసుగను మాటాడుచున్నకొలదియు, వారు పరమ శాంతముగా నుండి, ఎదిరిమాట తడబాటు పట్టుకొని సాగదీయుదురు. తాము తడబడరు. వెర్రిరాలను నగ్రహారమున కగ్రణి యగు కేతనయు మధ్యమధ్య అందు పాల్గొనుచుండెను.

అంతలో కేతన కొక యూహ తోచినది. అతని కిట్లు కొప్పెరుంజింగడు ఈ పండితచర్చను శ్రద్ధతో నాలకించుచుండుట యెంతయేని ఆనందము కలిగించెను. అందరకు ఆవల రెండు మహాయుద్ధములు జరుగుచున్న వని తెలియును. అంత మహాయుద్ధములకు మూల కారణు డగు నీ రాజసింహున కింత నిబ్బర మేమి? ఏమియు నంటని వానివలెనే ఈ పండితపరిషత్తులోని శాస్త్రార్థములు వినుచున్నా డితడు!

"పూర్వము జనక మహారాజు మిథిలాపట్టణ మంతయు దగ్ధమగుచున్నను నిర్లిప్తుడై యుండెనట! ఇప్పుడు మరల నీ నాడు ఆ విదేహుని నిర్లిప్తత ఈ రాజసింహునిలో చూచుచున్నాము!"

ఇట్లు కేతన యనెను. దానితో సభ యంతయు వికసించెను. రాజసింహుని ముఖ వికసనము అతిశయించెను. అది చూచి గోదావరిపండితు లందరు నదియే యంగుకొనిరి. వారు ప్రత్యక్షముగా నది ముఖస్తుతిరూపముగా విస్తరింపక, వాదములలో సందర్భవశమున కొప్పెరుంజింగని జనకునితో పోల్చినట్లు ధ్వనింపజేయుచుండిరి. కొప్పెరుంజింగనికి ఆనందము క్షణక్షణ మతిశయింపసాగెను. వీరిని రేపెట్లు గౌరవించుటా యని పరిపరివిధముల నాలోచించుచుండెను.

మధ్యాహ్న మైనది! ఆవల యుద్ధములును, రాజసింహునకును జన్నిగకును కొంతవడి గెలుపుగా కొంతవడి ఓటమిగా నుండెను. ఆ యుద్ధములను గజముల స్థైర్యమునకును హయముల తీక్ష్ణతకును మధ్య జరుగుచున్న యుద్ధముగనే ఉండెను. ఏవి గెలుచును, గజములా, అశ్వములా?

రాజసింహుని సేనానుల కంతవరకు నాత్మవిశ్వాసము పోలేదు. సముద్రముపైని గాని భూమిమీద గాని, తా మోడిపోదు మేమో యను నాలోచనయే, వారి కంత

వరకు లేదు. రాజసింహుని యాజ్ఞ లంతవరకు వారు పాలించుచుండిరి. కాని యిప్పుడు వారికి యుద్ధక్రమము రాజసింహునకు నివేదించుట మంచి దని తోచినది. ముఖ్య సేనాపతులు తమలో తా మాలోచించుకొనిరి. యుద్ధస్థితి సమగ్రముగా రాజసింహునకు తెలిపి, యవసర మగుచో, నూతనాజ్ఞలు పడయుట మంచి దని వారందరు నేకగ్రీవముగా నిశ్చయించిరి. రాజసింహుని నిర్ణయములందు వారికి గాఢవిశ్వాసము కలదు. అట్లే వా రాతనికి యుద్ధరంగమునుండి వార్త యంపిరి.

సేనాపతులు పంపిన వార్తాహరుడు రాజసింహుని శిబిరమునకు వచ్చెను. ఆతనికి లోనికి రా ననుజ్ఞ రాలేదు. జనకమహారాజువలె నున్న కొప్పెరుంజింగనికి, మధ్యలో యుద్ధవార్తలు నివేదింప వార్తాహరుడు వచ్చె నని యేని చెప్పుట కెవరు సాహసింతురు? కాళ్ళు కాలిన పిల్లులవలె పరిచారకులు కొంద రాతని యెదుట తారటలాడిరి. కాని లాభము లేకపోయెను. అవకాశము కలుగలేదు.

తుదకు వా రాలోచించుకొని, ప్రమాదసమయమున మ్రోయించుటకు పూర్వమే నిర్ణీతమైన యొకానొక శంఖనాదము వా రప్పుడు నగరి వాకిట గావించిరి. అప్పుడు మూడుజాములు కావచ్చుచున్నది. రాజసింహు డది యాలకించెను. గోదావరి వందితులు తన్ను జనకునివలె నిర్లిప్తుడని వర్ణించియుండిరే! ఇప్పుడు సంభ్రమము ప్రదర్శించు టెట్లు?

వ్యవహారదక్షు డగు నాతడు నెమ్మదిగా, అకాల మయినదను నెపమున, నాపూటకు శాస్త్రార్థములు చాలింపజేసి పూజాపరిసమాప్తి గావించెను. మరల సాయంకాలపూజ జరుగు ననియు నాసమయమున 'ఊరుభంగ' మను రూపకము కేరళనటులు ప్రదర్శింతు రనియు, నాపిమ్మట నా రాత్రి జాగరణము చేయుచు శాస్త్రార్థములు సాగింప నగు ననియు, పండితుల నందరి రావలసినదనియు నాదరగౌరవములతో నాహ్వానించి వారలను విడుదలకు పంపజేసెను.

కొప్పెరుంజింగ డంత చీనాంశుకనిర్మిత మగు తన యేకాంతమందిరమున జేరి సేనాపతులు పంపిన వార్తాహరుని బిలిపించి విషయము తెలిసికొనెను. అంతలో శీఘ్రగతి మరి యిద్దరు వేగరులు వచ్చి నూతనవార్తలు నివేదించిరి.

రణరంగములనుండి వచ్చిన వార్తలు కొప్పెరుంజింగనికి ఒక్కసారిగా నావేగమే కలిగించెను. ఆతడు నిజముగా నావార్తలు నమ్మలేకపోయెను.

పాటు ప్రారంభము చూచుకొని అప్పుడే చోళనాశలు కోరంగినాకలపైకి బయలు దేరినవి. ఈ మాటు ప్రయత్నము ముమ్మరముగా సాగుచున్నది. కాని వాయువు మాత్రము చోళనాకల కనుకూలముగా లేదు. ఈ ప్రయత్నము విఫలమైనచో చోళనాకలు వెనుకకు తిరిగివచ్చు నని విశ్వాసములేదు.

ఇక భూసేనల యుద్ధము మాత్ర మిప్పటికి సమముగా నున్నది. ఆంధ్రగజముల తాకుకు మాందు కాడవసేనలు కలగినను, తెప్పరిల్లుకొని సూక్ష్మమార్గములు గ్రహించి యాంధ్రసేనలను చీకాకుపరచుచుండెను. మరియు వారొక ప్రయత్నము చేసిరి. ఒక పెద్ద యశ్వదళమును చుట్టుమార్గమున పంపి జన్నిగసేనలను వెనుకవైపునుండి

ఢీకొన బ్రయత్నించిరి. కాని యట్టి ప్రయత్నము జరుగవచ్చు నని ముందుగనే జన్నిగ యూహించి; ప్రతిఘటించుటకు వేరుగా నాత డాశ్వికదళముల నుంచెను. అందుచే కాడవసేనలు ఎన్నిమారులు వెనుకనైపుకు రావలె నని యత్నించినను, ఆ యత్నము లన్నియు నరికట్టబడెను.

కాడవ హయదళములు ఒకటి మారి మరియొకటి యుద్ధనాసీరమునకు దూకు చుండెను. ఐనను సాయంత్రము మూడుజాము లగునప్పటికి, మొత్తముమీద నవి యన్నియు నలసిన ట్లున్నవి. అశ్వములు సుకుమారప్రాణులు. గజము లట్లు కావు. అందును ఆంధ్రగజములు ఈ నాడు కడుపునిండ మద్యము సేవించినవి. అలసినప్పుడెల్ల వానికి సురల మద్యము పుష్కలముగా పోయించి యుద్ధముఖమునకు దెచ్చుచుండిరి. మద్యసేవనమువలన కొంతవడికి వచ్చు నీరసభావము, ఈ ఏనుగుల నెప్పటి కావేశించును ? సాయంకాల మగులోపల నది వచ్చునెడల, కాడవసేనలు జయించుట సాధ్యము. లేనిచో కొప్పెరుంజింగడు ఆత్మరక్షణప్రయత్నములో నుండవలెను !

కొప్పెరుంజింగ డా వార్త కాశ్చర్యపడెను. హృదయములో నధైర్య మావేశించెను. పూర్వ మాతడు గణపతిదేవచక్రవర్తులచే జితుడయ్యెను. సురల నిప్పటికి రెండేళ్ళ క్రిందట పాండ్యసేనలచే నిర్జితుడయ్యెను. కాని యాత డెన్నడును తన రాజసింహత గోల్పోయి యుండలేదు; దర్పము గోల్పోలేదు.

వెంటనే యాతడు తీక్ష్ణముగా నాలోచించెను. వెంటనే యాతడు వసిష్ఠగోదావరి యావలకు, తన రక్షణకై కొన్ని సేనల దాటియుండ నాజ్ఞాపించి, యావల సముద్ర తీరమున సంకేతస్థలమున తన్ను తీసికొని పోవుటకు కొన్ని చోళనౌకలను వేచియుండ నియమించెను. అంతట నాత డెన్నియో విషయము లాలోచించి తన సేనానుల కుత్తరువులు పంపెను. అందులో శతఘ్నులను ప్రయోగించుట యొకటి ! ఈ ప్రయత్నము లన్నియు విఫలములై, తన భూసేనల కీనాడు అపజయము సంభవించున ట్లున్న యెడల వెనుదగ్గి, సేనలను విచ్చిపోనీయక, వసిష్ఠగోదావరి ననుసరించి యుత్తరముగా ప్రయాణము చేసి శీఘ్రగమనమున మోసలపురము చేరికొనవలసిన దని యాజ్ఞాపించి, తానుగూడ సముద్రమార్గమున మోసలపురమే చేరికొందు నని తెలియజేసెను.

నూర్యాస్తమయము కాబోవుచున్నది ! సముద్రముపై యుద్ధ మే విధముగా సాగుచున్నదో నమ్మకమైన వార్త రాలేదు. ఇటు నటుగా నున్నది ! ఈవల గజములు గాత్రము నిస్సార మగుచున్న వనియు, రాజసింహుని యాజ్ఞలు పాలించినపిమ్మట హయదళములు తేరుకొనుచున్న వనియు, భయపడ నవసరము లేదనియు, కాడవసేనానులు తమ ప్రభువునకు సంతోషవార్త లంపిరి.

అది విని కొప్పెరుంజింగడు చిదంబరేశ్వరుడగు కనకసభాపతి నటరాజ స్వామికి మనసా వందన మాచరించెను.

ఇక నాంధ్రపండితులకు తాను నిజముగా జనకమహారాజునకు తుల్యుడ ననియే ప్రదర్శింప నాతడు నిశ్చయించెను. అప్పటికే పండితు లాతని పూజాస్థానమునకు ఒక్క—

రొక్కరె చేరికొనుచుండిరి కేరళనటులు ఊరుభంగ రూపక ప్రదర్శనమునకు సిద్ధముగా నుండిరి.

సంధ్యావేళ కాగానే కొప్పెరుంజింగడుశుచియై సంధ్యావంద నొపాసనాదికము నిర్వర్తించి సాయంకాలపూజ ప్రారంభించెను. అదియు నాతడు లఘువుగా చేసి సాయంకాల పూజాంగముగా వేదవేదాంగాదిశ్రవణమును సూక్ష్మముగా కానిచ్చెను శ్రీమద్రామాయణ మహాభారత భాగవతశ్రవణ మైనది. ఆపిమ్మట పురోహితు డిట్లనెను.

"శ్రీమదఖండభూమండల బ్రహ్మాండనాయక, సచ్చిదానంద విగ్రహ, ఆశ్రిత సంరక్షణార్థకృతావతారదివ్యమంగళవిగ్రహ, చిదంబరమహాక్షేత్రనిజాధివాస, సర్వ పుణ్యక్షేత్రాధివాస, శ్రీకనకసభాపతిమహాస్వామిన్, శ్రీమద్రాజసింహపరమస్వా మిన్, సంధ్యాతాండవకుశల, నటరాజశేఖర, సాయంకాలపూజాంగత్వేన శ్రీదేవీభాగ వత శ్రవణానంతరం ఊరుభంగరూపక భరతప్రయోగ మవధారయ!"

గోదావరీ పండితులలో ఊరుభంగము! ఊరుభంగము ఊరుభంగము! అని యా రూపకనామము పలుమా రుచ్చరింపబడుచున్నది. అట్లని వారు ముఖములు చిట్లించి చప్పరింతురు. "ఆవల మహాయుద్ధములు జరుగుచుండగా నీ యమంగళనామము గల రూపకమే ప్రదర్శనమునకు వీరికి దొరికినదా!"

కేరళనటులు రగస్థలము సర్వసన్నద్ధము చేసియుండిరి. నేపథ్యమున దివ్యజ్యోతి వెలిగెను. నటులు "జాతవేదసే" ఇత్యాదిమంత్రములు తెరచాటున సుస్వరముగా పఠించిరి. ఆ నాంద్యంతమున సూత్రధారుడు ప్రవేశించెను.

## ౩౬

* "భీష్మద్రోణతటాం జయద్రథజలాం గాంధారరాజహ్రదాం
కర్ణద్రౌణికృపోర్మినక్రమకరాం దుర్యోధనస్రోతసమ్
తీర్ణః శత్రునదీం శరాసిసికతాం యేన ప్లవేనార్జునః
శత్రూణాం తరణేషు వః సభగవా నస్తు ప్లవః కేశవః"

సూత్రధారుడు ప్రవేశించుచునే యీ మంగళశ్లోకము పఠించెను. అది చదువు చుండగనే గోదావరిపండితు లొకరి మొగము లొకరు ఒక్కక్షణమాత్రము చూచు కొనిరి.

---

* ఈ ప్రకరణమున ఊరుభంగ రూపక ప్రదర్శనము విశేషముగా కలదు. అందు అంతటను సంస్కృతమూలమే వాడుట ఉచితము. అయినను పాఠకుల సౌలభ్యము నిమిత్తము ఈ మంగళశ్లోకమును చివర కొంచెమును తప్ప మిగిలిన భాగములు తెలుగు లోనికి కనువదించి గ్రహింపబడినవి.

'నాంద్యంతమున సూత్రధారుడు ప్రవేశింపవలసినది ; సూత్రధారుడే నాందీ శ్లోకము చదువుచున్నా డేమి ?'

'ఇది కేరళదేశాచారము కావచ్చును.'

'అక్కడ నెన్నియో విపరీతాచారములు కలవని జనప్రథ కలదుగదా ! ఇదియు నట్టివానిలో నొకటి కావచ్చును.'

ఇట్లనుచు వారు సరిపెట్టుకొనుచుండిరి.

అంతలో నాశ్లోకము సమాప్త మైనది. దానితో వారికి ముందు కలిగిన సందేహము లన్నియు తీరిపోయినవి. సభ యంతయు నొక్కమారుగా వికసించినది. అంతవరకును ఈ సమయమున అమంగళనామము గల ఊరుభంగము ప్రదర్శించుట యేమి యని యందరు శంకించినవారే ! ఇప్పుడా సభలోనే ఆ మంగళశ్లోకార్థము అవగతము కాగానే, సాధు సాధుస్వనములు వెలువడినవి. 'సాహిత్యరత్నాకరుడు గనుకనే రాజసింహుడు డీనాడు ఈ రూపక ప్రదర్శనము చేయ నాజ్ఞాపించెను. వసిష్ఠగోదావరి నీత దుత్తరింపవలసియున్నాడు. రెండు శత్రువాహినులను త్తరింప వలసి యున్నాడు, పాపము!

వా రా మంగళశ్లోకములోని యాశీర్వచనముతో నేకీభవింపనూ లేదు; దానిని కాదననూ లేదు.

సూత్రధారుడు, 'ఆర్యమహాశయులకు ఒక మనవి........అరే' ఏమి టిది. ఏదో కోలాహలముగా వినబడుచున్నది!' అనెను.

ఇట్లాత డనుచుండగనే నిజముగా ఆవల రణరంగమునుండి యుద్ధకోలాహలమే విననయ్యెను. ఇట్లావల నిజముగా యుద్ధము జరుగుచున్న సమయముననే ఈ నాటక ప్రదర్శనము చేయుటచే నాట్యవస్తువు సత్యముగా నప్పుడు జరుగుచున్నదా యన్నట్లు, గట్టిగా భాసింప జేసెను. సూత్రధారుడును పారిపార్శ్వకుడును తమ సంభాషణలో కురుపాండవుల మహాయుద్ధము నంత్యదశను వర్ణించిరి.

"ఈ వీరపురుషులందరు ఎందు కిలా సంభ్రమముతో పరిభ్రమించుచున్నారు ? ........అన్యోన్యాన్యాయుధ ప్రహారములతో మత్తదంతావళదంతాభిఘాతములతో గాయ పడి, నెత్తురోడుచున్న తమ బలిష్ఠశరీరములను స్వర్గసంపాదనకై సమరముఖాగ్ని కుండములో నిట్టనిలువున హోమముచేయ సంకల్పించి సాగిన ట్లున్నారు....సమంత పంచకము రాచపీనుగులతో నిండి భయంకరముగా నున్నది. భీమదుర్యోధనులు తలపడి హోరాహోరి పోరుచున్నారు. దెబ్బలు తగిలి, తొండములు తలలు కాళ్లు తెగిపడిన యేనుగులతో గుర్రములతో రాజులతో యోధులతో చిందరవందరై, యుద్ధభూమి యంతయు, చినిగిపోయిన సంకీర్ణచిత్రపటములాగున కనిపించుచున్నది !"

దానికి గోదావరీ పండితు లెంతయు ప్రీతులై యిట్లు మెచ్చుకొనసాగిరి. 'ఏమి యద్భుత రమణీయ మైన యుపమానము ! ఈ రాజసింహుడు నిజముగా భరతమల్లుడే, సాహిత్య రత్నాకరుడే !'

ఆ నాటిక స్థాపనతో నా సభ సంపూర్ణముగ వికసించెను. అది చూచిన కొప్పెరుంజింగని మోమును వికసించెను. 'ఈ గోదావరి పండితులు రసజ్ఞులు! కృష్ణా తీరమునందలి నల్లని ఒండుమట్టివారు కారు, పెన్నా ప్రవాహతీరపు దుడుకుబోతులును గారు!'

అంతట రంగస్థలముపై ముగ్గురు భటులు ప్రవేశించి వరుసంగ్రామ రంగము వర్ణింపసాగిరి.

"ఈ సమరాశ్రమము పగ ప్రజ్వలింప జేయుకటాహము శౌర్యము. ప్రకటించి అసువులు వాసిన మహాయోధులను అప్సరసలు వరించు స్వయంవరమంటపము!"

ఏమి యీ కవి యూహలు! భటుడు వర్ణన సాగించుచుండెను.

"అంతకాలములో రాజసింహులు సుఖముగా దీర్ఘనిద్ర చెందు వీరశయ్య!"

ఆ వర్ణనము సభకు కటువుగా తోచినది. కాని తక్కిన వర్ణనములో నది పరిసి పోయినది. భటుడు సాగించెను.

"ఈ యజ్ఞములో కొండలవంటి యేనుగుల తొండములే యూపస్తంభములు; బాణములే పరిస్తరింపబడిన దర్భలు; కూలిన యేనుగులే యజ్ఞవేదికలు; భగభగమండు పగలే అగ్నులు; రథకేతనములే విమానవితానములు; సింహనాదములే ఉచ్చైస్స్వనముతో చదువబడుచున్న మంత్రములు!"

ఈ వర్ణనముతో నా కవియార్ద్రవాక్కులకు సభయంతయు పులకరించెను. రాజసింహుడు ఆనందతన్మయుడయ్యెను.

"అదిగో మదపుటేనుగు, యుద్ధభూమిలోనికి ఐరావతములాగున పరుగిడి వచ్చి నిలిచినది, చూచినారా? అది నానావిధ యుద్ధసామాగ్రితో సజ్జితమై, రాజసింహుల యాయుధాగారమువలె గోచరించుచున్నది. అయ్యో, చూచుచుండగనే ఆ యేనుగు శత్రువుల బాణముల దెబ్బలకు తల తిరిగి, కవచము బ్రద్దలై, యుద్ధసామగ్రితోసహా మహావీరుడువలె, కన్నులు మూసి వ్రణములోనుండి నెత్తురు ధారలుగా కారుచుండగా, నేల గూలినది!"

ఏమిది? ఈ నాటకమున పాత్రలు వర్ణించుచున్నది ప్రదర్శించుచున్న రూపకము నుండియా? ఆవల ప్రవృత్తి యగుచున్న యీ మహాయుద్ధమునే వర్ణించుచున్నారా, రాజసింహులకు? భటుడు సాగించుచుండెను.

"హాహా! భయంకరము! ఘోరము! తెగిపడిన ఏనుగుల గుర్రముల భటుల రక్త ప్రవాహములతో నిండిపోయి చెల్లాచెదరుగా పడిన చర్మములతో చామరములతో తోమరములతో శరములతో కుంతములతో కవచకబంధాదులతో అల్లకల్లోలమై శక్తి ప్రాసహాటక భిండిపాల శూల ముసల ముద్గర వరాహకర్ణ కణప కర్పణత్రాసి గదాది నానావిధయోధాయుధసమూహములతో సమాకీర్ణమై యున్న యీ సమంతపంచకము, అబ్బ, చూడలేము! ఘోరము! భయంకరము!"

* * * *

"ఇట్టి దారుణస్థితిలోకూడ రాజులు తమ స్వాభావికశోభావైభవము పోగొట్టుకొనకుండగనే శోభిల్లుచున్నారు, గమనించినారా ?"

ఆ మాటలు వినుచున్న సదస్యులకు ప్రత్యక్షముగా నెదుట రాజసింహుని పూజావైభవము పొడగట్టుచున్నందున వారెంతయు మెచ్చుకొనసాగిరి. అతిశయోక్తిగా కనపించు కవుల వర్ణనలుకూడ తెలుచుగా స్వభావోక్తులే !

"వీరాధివీరులైన యిట్టి క్షత్రియవీరులనుగూడ మృత్యువు లోగొనుచున్నదే !

* * * *

"అయ్యో, మృత్యుదేవత క్షత్రియులనుగూడ మ్రింగివేయునా ?"

ఆ మాట్లాడు రంగముపై భటునితోపాటు, సదస్యులగు గోదావరీపండితులును, జాలి నొందుచు నిట్టూర్పులు విడిచిరి. వారు చూపుచున్న శ్రద్ధను కొల్పెరుంజింగదు ఉప్పొంగియేపోవుచుండెను.

"ఏమీ యీచప్పుడు ?....ఉరుములా ? పిడుగులు పడి కొండలను పిండి పిండి చేసివేయుచున్నవా ? ప్రచండవాయువు వీచి భూమి బ్రద్దలైపోవుచున్నదా ? ప్రచండమైన వాయువుతో కల్లోలమై లేచి ఉప్పొంగి, సముద్రము మందరగిరి కందరాంతరస్థలములను పగులబొడిచి, ఉల్లోలమై భయంకరముగా హోరుపెట్టుచున్నదా? ఏదో పోయి తెలిసికొందుము!"

పైవాక్యము లనుచు నాముగ్గురు భటులును రంగస్థలమున పరిక్రమించుచుండిరి. సరిగా నాసమయముననే నక్కడ సమీపభూమిలో రణకోలాహలము భయంకరముగా వినవచ్చెను. సముద్రముపైనుండి కూడ భీష మగు నొకానొక యపూర్వరవము విననయ్యెను. ఉప్పెన వచ్చినట్లే వసిష్ఠగోదావరిలోగూడ మహాతరంగ మొకటి లేచెను.

ఏమిటని, రూపక ప్రదర్శనమేనా ? నిజముగా రూపకములో వర్ణించినట్లుగానే చుట్టును జరుగుచున్నదే ! ఈరూపకకర్త సాక్షాత్తుగా ఋషి, సత్యవాక్కు !

అంతట నాభటులు భీమదుర్యోధనుల గదాయుద్ధమును, అప్పుడు జరుగుచున్నది చూచుచున్నట్లే, వర్ణించిరి. అందులో భీమసేనుని బలాతిశయము, దుర్యోధనుని కౌశలాతిశయము, అద్భుతముగా వర్ణింపబడుచుండెను. సరిగా గజమునకు అశ్వమునకు యుద్ధమే! ఒకదానికి బల మెక్కువ. ఒకదానికి చురుకుదన మెక్కువ! ఆవల జన్నిగ గజసేనలకు కొల్పెరుంజింగని యశ్వసేనలకు జరుగుచున్న యుద్ధమువంటిదే ! అల్లావల కోరంగి కాకతి పెద్ద నావలకు చోళుల చిన్ననావలకు జరుగుచున్న నౌకాయుద్ధము వంటిదే, యిదియు!

"అదుగో, రాజరాజు రత్నకిరీటము కదలునట్లు తల పంకించి, క్రోధవిస్ఫారితరక్తనేత్రయుగళముతో చూచి, భీమసేనుని పదసంధిబంధములో కొట్టుటకు శరీరము వంచి, జాగ్రత్తగా భీమసేనుని చుట్టుముట్టుచున్నాడు. ఉత్క్షిప్తమైన అతని చేతిలోని గద, ఎఱ్ఱ నెత్తురుతో తడిసియున్నది. చూచినారా, అది కైలాసపర్వతశిఖరాగ్రమునుండి లేచిన ఇంద్రధనుస్సువలె మెఱయుచున్నది !"

ఆ వర్ణనమధ్యములో నా యుపమానము గోదావరి పండితులను ముగ్ధులనే చేసెనది.

"రాజరాజు భీమసేనుని కొట్టనే కొట్టినాడు. చూడండి ! అతని నుదురు బ్రద్దలై రక్తము చింది పారుచున్నది. రెండు బుజాలూ విరిగిపోయినట్లే! దెబ్బలతో బ్రద్దలై భీముని యెమరొమ్ము నెత్తురుముద్ద యైనది."

ఆ సభలో ఒక్కసారిగా భీమసేనుని దీనావస్థకు జాలి ఎక్కువైనది. కొందరు కన్నీళ్ళు కార్చినారు. గోదావరి పండితులు పలువురు తమవెంట నున్న లక్కవరపు కోట తెల్లని కంచు కొమ్ము చెంబులనుండి, జలము గ్రహించి చెమ్మగిల్లిన తమకన్నులు తుడిచికొనిరి.

"వృకోదరుడును మగల భయంకరమైన తన గద గిరగిర త్రిప్పుచు, సింహనాదము చేయుచు, వల్గగతితో దుర్యోధనునిపై తలపడినాడు. దుర్యోధనుడో, భీముని భుజములు తన గదతో చితుకగొట్టి, యతని ప్రయత్నము విఫలముచేసి, చాతురీగతితో భీమునకు అందకుండగా చిత్రచిత్రగతులతో తిరుగుచు, గదాఘాతములతో నాతని నొప్పించుచున్నాడు. గదాయుద్ధములో సుశిక్షితుడును అద్వితీయుడునుగదా రాజరాజు ! అయినా, భీమసేనుడు మహాబలశాలి. అతని కా దెబ్బలు లెక్కా ?

"అదుగో, రాజరాజు భీమసేనుని తలమీద తనగదతో కొట్టినాడు. తల పగిలి, రక్తప్రవాహములో తడిసిపోయిన శరీరముతో సత్తువ కూలి, పాండవ మధ్యముడు పిడుగు పడి, పగిలి తగులబడి, స్రవించుచున్న ధాతువులతో మేరు పర్వతమువలె గుభాలున నేల గూలుచున్నాడు."

"అదిచూచి వ్యాసుడు ముక్కున వ్రేలు వేసికొని దిగాలుపడి చూచుచు అలా నిలబడిపోయినాడు !"

మరి యీ గోదావరిపండితసామాజికులకుమాత్రము కన్నీ రాగునా ? ఆ పిమ్మట శ్రీకృష్ణుని సంజ్ఞగొని, భీమసేనుడు లేచి యోపిక తెచ్చుకొని తలపడుట వర్ణింపబడినది.

"భీమదుర్యోధనులకు మళ్ళీ గదాయుద్ధము ప్రారంభ మయినది. అదుగో, భీమసేనుడు, అరచేతులు నేలపై రాచి తుడిచికొని, భుజము లప్పళించి, అవుడు గరచి క్రోధోద్రేకముతో, బలమునొలది ప్రలయకాలాంబుదమువలె గర్జించి, దుర్యోధనునితో తలపడినాడు. — ఆఁ ఆఁ, చూచినారా ! అతడు ధర్మము విచారింపక, యుద్ధనీతి గోతిలో త్రోసివేసి, కృష్ణుని సంజ్ఞానుసారముగా గురిచూచి, గదతో రాజరాజు తొడలమీద కొట్టుచున్నాడు.

"అయ్యో ! అయ్యో ! కురురాజు తొడలు విరిగి నేల గూలినాడు !"

* * * *

"కృష్ణద్వైపాయనుడు అదరి ఎగిరిపడినాడు !"

ఆపిమ్మట హలాయుధుని కోపమును, పాండవులు భీమసేనుని పాదివి యానలికి తీసికొనిపోవుటయు వర్ణింపబడినవి. ఇట్లుకిష్కింధము పూర్తి యగునప్పటికి సామాజికుల కందరకు ఒక్కసారిగా అభిమానము దుర్యోధనుని పక్షమునకు మరలినది.

మరల ప్రదర్శనము ప్రారంభించినది. భీముని వక్షఃస్థలము తనవాగలితో మన్ని వేయ నుంకించు బలరాముని రాజరాజే, "పూజ్యుడా, హలాయుధుడా! శాంతించు శాంతించు!" మనుటతో నా యభిమానము బలమైనది. ఆపిమ్మట దుర్యోధన బలరాముల సంభాషణము సాగుటతో నది యతిశయించినది. ఆ తర్వాత దుర్యోధనుని రణరంగములో వెదకికొనుచు ధృతరాష్ట్రుడును, గాంధారియు రాజమహిషులగు పౌరవియు మాలవియు, కుమారుడగు దుర్జయుడును ప్రవేశించి, నాటకము సాగునప్పటికి సామాజికుల కందరకు నిర్వేద మావహించినది. వారికీనాటకమున రస మేమో ఆలోచన లేదు. ఇందు నాయకు డెవరో ప్రతినాయకు డెవరో ఆలోచన లేదు.

"ధృతరాష్ట్రుడు : కుమారా, రా! కన్నతండ్రిని. ఒక్కమారు నాకు అభివాదనము చేయి!"

"దుర్యోధనుడు : ఇదిగో వచ్చుచున్నాను. [లేవబోయి లేవలేక పడిపోవును] అక్కటా! ఇది నాకు మరియొక దెబ్బ! దుర్భర దుర్గతి! భీమసేనుడు తన ఇనుప గదతో చితుక గొట్టి, నేలపై పడవేసి, జుట్టు పట్టుకొని యీడ్చినప్పుడే తొడలతో పాటు, లేచి పితృపాదాభివందనముకూడా నాకు కానిదై పోయినది!"

ఆ మాటలతో సామాజికులు దుర్యోధనుని యకార్యము లన్నియు మరచి, యతని ధర్మిష్ఠతయందే బుద్ధి నిలుపసాగిరి. ఎంత పితృభక్తి ఇతనికి!

అంతట కుమారుడగు దుర్జయుడే, యా యంధకారములో దుర్యోధనుని గనుగొని, ఇంటికి రమ్మని కోరుచు, తొడలు విరిగినవని తెలియక ఆ పసివాడు ఆప్యాయముగా తండ్రిని తొడలమీద తన్ను కూర్చుండ నిమ్మని తొడలపై నెక్కబోవును. ఈ సన్నివేశముతో సభలో నందరు నేకధారగా కన్నీరు కార్చిరి.

ధృతరాష్ట్రాదులతో సంభాషణలో దుర్యోధనుడు తల్లి నిట్లు ప్రార్థించును.

"వీరమాతా, నమస్కారపూర్వకముగా, నిన్నుప్రార్థించుచున్నా నమ్మా!— ఏ లవలేశమైనా నేను పుణ్యము చేసికొని ఉన్నచో, జన్మాంతరములోగూడ నీవే నా జననివి అగుదువుగాక!"

ఏమి యితని మాతృభక్తి! సభ్యులందరు దుర్యోధనుని పక్షమే యైరి. ఈ రూపకమునకు నాయకుడే దుర్యోధనుడా? భీమసేనుడే ప్రతినాయకుడా? శ్రీకృష్ణుడే ప్రతినాయకుడా? మన మెరిగిన నాటకలక్షణము లన్నియు తారు మారగుచున్నవి. ఏమైనను ఈప్రయోగము హృదయస్పర్శిగా నున్నది!

తుదకు అశ్వత్థామ ప్రవేశించెను. ప్రవేశించుచునే అత డిట్లనెను :

"సజ్జమైన కార్ముకముతో దుర్యోధన మహారాజు ప్రారంభించిన యుద్ధ యజ్ఞమును, అధ్వర్యుడు అశ్వమేధమునువలె కరల నే నుపక్రమించి, తుదముట్టింపబోవుచున్నాను."

♦ ♦ ♦ ♦

"మా పితృపాదులకు తిలతర్పణ మిచ్చుకొనుచు, నేను దూరముగా నున్న సమయములో, శత్రువులు కురుకులతిలకుడైన దుర్యోధనుని వంచించి కూల్చి వేసినారు—"

"ఇప్పు డీ దుర్యోధన మహారాజు అస్తగిరిశిఖరాగ్రభాగముమీదనుండి క్రమ్ము కొన్న సంధ్యారాగముతో పశ్చిమసూర్యునివలె నస్తమింప బోవుచున్నాడు!"

చివర కాత డిట్లనెను :

"దుర్జయ ఇతస్తావత్.

"పితృవిక్రమదాయాద్యే రాజ్యే భుజబలార్జితే
వినాభిషేకం రాజా త్వం విప్రోక్త్యైవచనై ర్భవ!"

ఇంతవరకును గోదావరీపండితులు రూపకరసాకృష్టులై, మహాప్రవాహములో వలె కొట్టుకొనిపోవుచుండిరి. కాని యీయశ్వత్థామ వాక్యములతో నందరికి ఆశ్చర్య మైనది. తట్టి లేపినట్లు ఒక్కసారిగా వారి చిత్తము లుద్బుద్ధము లైనవి.

ఎవడీ దుర్జయుడు ? అభిషేకము లేకుండ బ్రాహ్మణవాక్యము ప్రసరించు టేమి? దురభిమాన మోహితులైన యశ్వత్థామవంటి బ్రాహ్మణుల వాక్యములకు పటుత్వ ముండునా ?

ఇట్లు వారు ఆలోచించుచుండగనే సరిగా, దుర్యోధనుడు చివరి వాక్యములు ప్రారంభించి సాగించుచుండెను.

"....ఊర్వశ్యాదయోఽప్సరసో మా మభిగతాః ఇమే మహా
ర్ణవా మూర్తిమంతః ఏతా గంగాప్రభృతయో మహానద్యః
ఏష సహస్రహంసప్రయుక్తో మాం నేతుం వీరవాహీ విమానః
కాలేన ప్రేషితః అయ మయ మాగచ్ఛామి !"

రాజరాజు స్వర్గతు డయ్యెను !

ఈ మాటలు సాగుచుండగనే, గోదావరిపండితులలో క్షణక్షణమునుకలవరపాటు వృద్ధిపొందసాగెను. 'రంగముమీదనే మరణము ప్రదర్శించెదరా, ఏమి !— అయ్యో ! రంగముమీదనే ?—' అనుచు వారు తత్తరముతో తమ కొమ్ము చెంబులు చేతులతో నందుకొనుచు, లేచుచుండిరి.

దుర్యోధనుని స్వర్గప్రయాణము ప్రదర్శింపనే ప్రదర్శింపబడెను. గోదావరి పండితులలో హాహాకారములే ఒక్కసారిగా పుట్టి నేల గ్రుక్కిమినట్లు ఆ సభామధ్య మును దదదదలాడించెను.

## 32

క్షణక్షణము పెరుగుచున్న ఆనందముతో నిప్పటికి, పరవశతయే పొందియున్న ముక్తాంబ్పెరుంజింగడు తా, నిప్పుడు చూచుచున్నది, నమ్మలేకపోయెను. కోపముతో

నాపండితులవంక నాతడు ప్రశ్నార్థకమగు చూపు చూచుచుండెను. తెర పడినది. రూపక ప్రదర్శనము పూర్తి కాలేదు !

గోదావరి పండితులు సంభ్రమముతో వెడలిపోవుచుండిరి. ఒకరితో చెప్పరు. అగరు. అందరును కూడబలుకుకొన్నవారివలెనే ఒక్కసారి బయలుదేరిరి. కాని యీ ఛాందసులు అట్లు ముందుగా కూడబలుకుకొని యుండుట కవకాశము లేదు. వారికి కోపమే వచ్చినది ! కొప్పెరుంజింగనికి కోపము వచ్చినది. అతడు రావణాసురునివంటి వాడు గదా! ఆతనికిని రావణుని కోపమువలెనే వచ్చినది. వాల్మీకి రావణునికి కోపము వచ్చినప్పుడు 'రేజు ర్వింశతి దృష్టయః' అని వర్ణించెను. కొప్పెరుంజింగనికి రెండు కన్నులే యున్నను, అవియే ఇరువదికన్నులవలె మండినవి ! అట్టి రావణుని కోపమును గూడ ఈ గోదావరిపండితుల కోపము అతిశయించినది. వారు కొప్పెరుంజింగని కోపమును లెక్కచేయలేదు ! బయలు దేరిరి !

ఎక్కడికి వెళ్ళగలరు? ద్వారపాలురు వారిని బయటికి పోనీయక యడ్డగించిరి !

వెర్రిరాలను వగ్రహారమున కగ్రణి యగు ఛాందసకవి కేతన కొప్పెరుంజింగని దిక్కు తిరిగి యిట్లనెను :

"మహాసంతోష మైనది, రాజసింహా, మహాసంతోషము ! రంగస్థలమున మరణ ప్రదర్శనము చేయుటచే నీకూడినసభ కంతయు నాశౌచము వచ్చినది. మమ్మును గోదావరిలో స్నానము చేయ బోనిండు ! ఇంత మహాపర్వమున నెంత పని జరిగినది ! అయ్యో, యేమి యీ యాగడము ! ఎంతసేపు ఈ మైలగుడ్డలతో నిట్లు పడియుందుము !"

పుష్యమాసపు చలి ! బ్రాహ్మణులు ఉపవాసముచేసిన శ్రమతోనున్నారు. ఉత్తరపుగాలి ప్రారంభమైనది. ఇట్టి చలిలో ఈ రాత్రివేళ నిందరు గోదావరిలో స్నానమున కుపక్రమించుచున్నారు ! కొప్పెరుంజింగని రాక్షసప్రకృతి ప్రకోపించినది. కోపము పట్టలేకపోయెను. అద్భుతమైన భరతవాక్య మంగళము తనకు ప్రాప్తము కాకుండ విఘ్నము కావించినారు. ఈ రూపకమున భరతవాక్యముగా బలదేవుడీ శ్లోకపాదమును చదువును.

"గాం పాతు నో నరపతిః శమితారిపక్షః"

మరియు దానికి తోడుగా పంచరాత్రమను మరియొక రూపకమునుండి యీ క్రింది శ్లోకార్థమును చదివింప కొప్పెరుంజింగడు సూత్రధారుని శాసించియుండెను.

"ఇమామపి మహీం కృత్స్నాం రాజసింహః ప్రశాస్తు నః !"

దాని కాతడక్కడి సామాజికుల యంగీకారము పొందదలచి యుండెను. అతని మహోత్సాహమును వీరిప్పుడు భంగపరచియుండిరి. రూపకము త్వరలో పూర్తి కానున్నది. పావుగడియకూడ పట్టదు. భరతవాక్యపాద మంతముగా గల యొక్క శ్లోకమే మిగులు. ఈ బ్రాహ్మణులు తనకు సిద్ధముగా నున్న మంగళమును కాకుండ పాడుచేసినారు !

'ఈ రసహీను లగు నాంధ్రబ్రాహ్మణుల నందరిని ముక్కలుముక్కలుగా నరికివేయింప నాజ్ఞాపింతును !'

ఈ విధముగా నాజ్ఞాపింప నాలుకలో పలుకులు కదలుచుండెను. ఆ కోపావేశముతోపాటు చిత్రముగా నొక భయావేశమును అతనిని పూనెను. స్నానము చేసి శౌచము నొందగోరుచు తొందరపడుచున్న యా బ్రాహ్మణోత్తముల చాదస్తము చూచెను. వారందరు నప్పటికే తమ జన్నిదములు తావళముగా వేసికొనిరి. అతని కంతలో పట్టరాని నవ్వే వచ్చెను. వారి ముఖములలో వ్యక్తమగు స్నానవ్యగ్రతకు అతడు వికృతముగా నవ్వెను.

"వెళ్ళండి!"

రాజసింహుని నోట నరకివేయుడని యాజ్ఞ వచ్చునను నూహతోడనే ద్వారపాలురు ఖడ్గము లెత్తి సిద్ధముగా నుండిరి. రెండు రెప్పపాట్ల కాలములో నా బ్రాహ్మణు లందరు నరుకబడి నరకలోకమునకు వెళ్ళియుండెడివారే! రాజసింహుని యాజ్ఞ రాగానే క్షత్త లందరు నొక్కసారిగా ఖడ్గములు దింపి దారి విడిచిరి.

బందె విడిచిన వృషభసమూహమువలెనే ఆ గోదావరిపండితు లందరు ఒక్కపెట్టున వసిష్ఠ గోదావరికి ఆశౌచనివృత్తి స్నానమునకు సంభ్రమమున బయలువెడలిరి!

ఇక రూపకప్రదర్శనము సాగించుటా? తెరలోనుండి నటులు వచ్చుటకు సిద్ధముగా నుండిరి. సూత్రధారుడు కొప్పెరుంజింగని యనుజ్ఞకై యెదురుచూచు చుండెను.

అట్టి సైగ చేయబోవుచు, కొప్పెరుంజింగడు లనతో వచ్చిన కన్నడ ద్రావిడ పండితులవంక చూచెను. వారి మనస్సులును ఆందోళన చెందుచున్నవి. వారక్కడ ముళ్ళమీద కూర్చున్నట్లే యుండిరి. గోదావరి బ్రాహ్మణుల ధర్మనిర్ణయము వారికిని ఎక్కినది. వారు నిర్వచించిన యాశౌచము వారి మనస్సులను పట్టినది. వారి యజ్ఞోపవీతములును నివీతము లైనవి. కొప్పెరుంజింగ డిట్టిది జరుగునని కలలోకూడ తలపలేదు. అతని చూపు చూచి యా ద్రావిడపండితులలో నొక డామాట ధైర్యము చేసి యనివేసెను.

కొప్పెరుంజింగనికి కాళ్ళాడలేదు. ఇట్టిది జరుగునని యాత డూహింపలేదు. అతనికి ధర్మమం దభిమాన మున్నది. దైవభక్తి యున్నది. యథాశాస్త్రీయముగా పూజ నిర్వర్తింపవలె నను నాస్థ యున్నది. అతనికే అనుమానము కలిగినది! "అయ్యో, కనకసభాపతిపూజ పూర్తి కాలేదే! అయ్యో! – మధ్యలో నాశౌచము వచ్చినది. కర్తవ్య మేమి?...."

పూజామధ్యములో వచ్చిన యాశౌచము పూజ పూర్తిగావించుటకు అడ్డు వచ్చునా? ఇది యదాంతముగా వచ్చినది కాదు; ఛలతప్రయోగముచే చేతుల తెచ్చి పెట్టికొన్నది. ఇది చూచిన నటరాజస్వామి ప్రీతుడై యుండునా? ఆ సహదేవునికి, నితాంతశ్మశానసంచారికికూడ వసతోపాటు ఆశౌచము రాదా? కొప్పెరుంజింగడు ఈ సందేహములతో చూడగా ఎదుర నున్న నటరాజస్వామి కళావిహీను డైనట్లు కన్పించెను. గోదావరి బ్రాహ్మణుల ధర్మనిర్ణయమును నటరాజస్వామియే శిరసావహించినట్లు కనబడెను.

"అయ్యో! ప్రదర్శనము పూర్తికాలేదు. నటరాజస్వామిని భరతప్రయోగ మువఁదరింపు మని అది పూర్తిచేయకుండ లేమటా? పూజపూర్తిచేయుటా! పూజ పూర్తి కాకుండ లేచుటా ?"

ఇట్లాలోచించుచు తన పురోహితునివంకను ద్రావిడాది పండితులవంకను తిరిగెను. ద్రావిడపండితులును తానము లాడ వ్యగ్రులై తమ యాసనములనుండి కదలుచుండిరి. అతని మాటలు నోటిలోనే నిలిచిపోయెను.

అతని శిబిరముబయట భయంకతనాదము లుప్పతిల్లెను. పరమప్రమాదము సూచించు ఘంటానాదములును శంఖనాదములును భేరీనాదములును కొట్టవచ్చినట్లు వినఁనైనవి. ఆవల సముద్రయుద్ధమును ఈవల నేలపై యుద్ధమును తన చుట్టు శిబిర రక్షణమును—మూడును తనకు ప్రతికూలము కానిచో ఆ ఘోషలు వినరావు!

మహాధైర్యశాలి యగు కొప్పెరుంజింగనికి భయమే ఆవేశించినది. తాను ఉదయమునుండియు జనకమహారాజునంతవాడ ననుకొనెను. అట్లందరు ననుకొనన వలె నని ప్రవర్తించెను. ఈ క్షణములో నది యంతయు ఒక్కసారిగా నతడు మరచిపోయెను.

నాటకము పూర్తికాలేదు. భరతవాక్యము చెప్పలేదు. ఇష్టదైవతమునకు సాయంకాల పూజ పూర్తికాలేదు. వ్రత సమాప్తి కాలేదు. తాను ఆహ్వానించిన భూసురుల పూజ కాలేదు. ఆ పూజామందిరము వెలుపల కవచితమై సర్వాయుధసజ్జితమై యున్న తన మత్తగజము నాతఁ డధిరోహించెను. అత డేమి చేయునో తెలియక యాతని పురోహితుడు వెంట నడచి యుండెను. అతడు గజారోహణ మంత్రము ప్రారంభింపక మున్నె, కొప్పెరుంజింగడు దానిపైని తత్తరముతో నెక్కివేసెను.

నడిమింట చంద్రుడు చల్లని వెన్నెలలు గాయుచు చలిని మరింత తీవ్రము చేయుచున్నాడు. ఉత్తరపుగాలి జనులను వడకెంచి వేయుచున్నది.

కొప్పెరుంజింగని శిబిరమంతయు నల్లకల్లోలముగా నున్నది. అత డేకాంతముగా నున్న శిబిరమునే పెద్ద యశ్వదళ మొకటి తాకినది. దాని నాతని సైనికులు ప్రతిఘటించుచున్నారు. కాని శత్రుపోద్ధతిని వారాపలేకున్నారు. ఏమి చేయుటో ఎటు పోవుటో తోచక ఆతడాలోచించుచు నొక్కక్షణ మాగెను.

అశ్వికవార్తాహరుడు ఒక్కడు యుద్ధవార్త తెచ్చెను. "ఆంధ్రగజముల కెట్లో నూతనశక్తి వచ్చినది. మన యశ్వదళములు విచ్చిపోయినవి. మన సేనానాయకులు వాని నాపలేకున్నారు!"

ఆ వార్తాహరుని వెంటనే మరియొక వేగరి వచ్చి, సముద్రయుద్ధములో చోళనౌకలు కాకతీయనౌకలను తాళలేక మునిగిపోయినవి పోగా, తక్కినవి పారిపోయిన వనియు, మరియొక వార్త తెలిపెను.

తన శిబిరమును ముట్టడించిన యశ్వదళముకూడ, అన్ని యాటంకములను అతిక్రమించి, లోనికి త్రోసికొని వచ్చుచుండెను. వెంటనే రాజసింహుడు తన ప్రధాన పరివారమును తరులపై వసిష్ఠగోదావరి నుత్తరింప నాజ్ఞాపించి, యతడు తన

మత్తగజమును ఏకాంతస్థలమున గోదావరిలో దింపెను. పాతికగజములు ప్రవాహ మధ్యమునకు పోయి యాతడించుక వెనుదిరిగి చూచెను. అతని పరివారమును రాణి వాసజనమును పడవలలో బయలుదేరవలసియుండెను. కాని పడవలు బయలుదేరు చున్న జాడయే లేదు. చూడగా నీవలియొడ్డున పడవలే లేవు! ఐదువందలకు పైగా అత డటువైపున నదీతరణమునకు పడవలు సమకూర్చి యుండెను. అందొకటియు నిప్పు డటువైపున లేదు! ఏమైనవి? తన పరిజనము ఎట్లు రాగలదు?

చూచుచుండ నాతని పరిజనులు కాని పడవలు కాని యాతనికి కనిపింప లేదు. కాని, ఆతడు వదలిన యొడ్డుపై నొక యాశ్వికుడు చూడనయ్యెను. అత డెక్కినది సామాన్యాశ్వము కాదు. ఆ యెక్కినవా డెవరో మహారాజై యుండ వలెను. అతడును నీటిలో ఎవరికొరకో వెదకుచున్నట్లు కనిపించెను. తన్నే వెదకు చున్నాడేమో! ఇటు నటు నొడ్డుపై నాత డా యశ్వమును కొంత త్రిప్పెను. అంతలో నాతడు కొప్పెరుంజింగని గజమును నీటిలో నుపలక్షించిన ట్లున్నాడు! ఆ యాశ్వికుడు వెంటనే నోట నురుగులు గార్చుచున్న తన యాజానేయమును వసిష్ఠగోదావరిలోనికి దింపెను. అదియు చురుకుగా నీదుకొని వచ్చుచున్నది.

అది చూచి కొప్పెరుంజింగడు తన మత్తగజమును వెనుకకు త్రిప్పెను. ఆ యోధుని తురగమును సమీపించినది. అప్పుడా వసిష్ఠ గోదావరీప్రవాహమధ్యమున గజ మధిష్ఠించియున్న కొప్పెరుంజింగనికిని, ఆ యాశ్వికునికిని ద్వంద్వయుద్ధము ప్రవర్తిల్లెను.

ఆ యేనుగు పెద్దగా ఘీంకరించి, తొండ మెత్తి యాహయమును దానిపై నాశ్వికుని నొక్క బలమైన మోదు మోదబోయెను. ఆ గుర్రము హేషచేయుచు మెలకువగా ప్రక్కకు తొలగినది. సూదిమోపుమేర నా దెబ్బ తప్పెను. అప్పుడే ఆ యాశ్వికుడు, ఆ గజమును కవచముచే ననావృతమగు భాగము వెదకి గురిచూచి పొడిచి నొప్పించెను. ఆ సమయమున కొప్పెరుంజింగడు నిడివి యగు తన శూలముతో నా యాశ్వికుని రొమ్ముపై పొడిచెను. కాని యక్కడ కవచ మున్నందున శూలము ఖంగు మని మ్రోగెను. గుర్రముపైనుండి యా తాపునకు కొంచెము వెనుకకు తగ్గియు నాతడు మరల తన యాసనమున కుదురుకొనెను. అట్లు కుదురుకొని, వెంటనే ఉసురు బుసలుకొట్టుచు రోషావేశముతో, కొప్పెరుంజింగని తన శూలముతో పొడువ జూచెను. కాని యాతని కొకచేత గుర్రపుకళ్ళె మున్నది. ఒంటిచేతితో శూలప్రయోగము బల ముగా చేయలేడు. ఏనుగుపై నున్న కొప్పెరుంజింగనికి రెండుచేతులును ప్రయోగమునకు అనువుగనే యుండెను. కాని యాతడు ఆనాటి యుపవాస శ్రమతో బడలి యున్నాడు. దానికి తోడు తన సేనలు పరాజయము నొందిన వను వార్తతో నిరుత్సా హుడై యున్నాడు. పైపెచ్చు అతని రాణివాస స్త్రీలుకూడ శత్రువశ మైన ట్లున్నారు. పైగా కవచావృత మైన దేహముతో నాతని గజము నీటిలో సుఖముగా కదలుట లేదు. అందులో దానికి కలిగిన శూలఘాతముచే మర్మస్థానము నొచ్చిన ట్లున్నది.





"ఎవడీ గూశ్వికుడు ? నాకు పూర్వపరిచితుడుగా కనబడుచున్నాడే ? ఎక్కడి పరిచయము ?"

వారిద్దరికిని ఆ నీటిలో జరుగుచున్న ద్వంద్వయుద్ధము గందరగోళముగా నున్నది. అంతలో వారిద్దరు పరస్పరశూలఘాతములతో తమ వాహనములనుండి పడిపోయిరి. నీటిలో నట్లు పడిపోయినను వారిద్దరు పోరు చాలింపలేదు.

ఇద్దరును కవచాచ్ఛాదితగాత్రులే ! నిరాయుధు లయ్యు వారిద్దరు నొకరి నొకరు చంపివేసికొను నుత్కంఠతో నీటిలో కలసికొనిరి. కాని వారి దేహము లాడుటలేదు. కాలుచేతులు కదలుట లేదు. కవచముల బరువుతో నీటిలో తేలనేలేకున్నారు ! ఇద్దరను పోటును తిరిగిన వసిష్ఠగోదావరీ జలప్రవాహము మహాసముద్రమువైపునకు లాగివేయుచున్నది ! ఒకరినొకరు చంపుకొన కలసినవా రిద్దరు, నొకరు మునిగిపోకుండ నొకరని అప్రయత్నముగా ఊతగొన కౌగలించుకొనుచుండిరి. ఆ యాలింగనము మృత్యుదేవతా యాలింగనమువలెనే యిరువురికి నున్నది. దానిచే నిరువురు నీటిలోనికి పోవుచు, నీరు గ్రుటకలు వేయసాగిరి. ఆ మహాప్రవాహమున వారేమి యుద్ధము చేయగలరు ?

సృష్టికి పూర్వము శ్రీమహావిష్ణువు అసహాయుడై నిరామయమైన సముద్రజల మధ్యమున మధుకైటభులతో ఐదువేల సంవత్సరములు ఒకే బిగువున మల్లయుద్ధము చేసెనట ! కాని యీ వీరు లీ వసిష్ఠగోదావరిలో నైదునిముషములు గూడ యుద్ధము చేయ లేకపోయిరి.

వా రిద్దరి కాయములును చలికి బిగిసికొనిపోయినవి. అవయవము లాడుట లేదు! పవిత్రమగు వాసిష్ఠగోదావరీజలములలో నా వైకుంఠ ఏకాదశీ మహాపర్వమున వారిద్ద రికి నొక్కసారిగా స్మృతిపోయినది !

## ౩౮

ఏకశిలానగరమున శిలాప్రాకార నిర్మాణము చురుకుగా సాగిపోవుచున్నది.

కేశవశ్రీస్వయంభూనికేతనములలో వైకుంఠ ఏకాదశి మహోత్సవముగా జరుగును. అక్కడ కేశవభక్తులకును స్వయంభూదేవభక్తులకును విరోధము లేదు. పలువురు ఉభయభక్తులు. అక్కడ నేపర్వమందును ఉభయదేవాలయములలో పూజలు విశేషముగా జరుగును. ఒక్కటే భేదము ! ఆ పర్వము, విష్ణుదేవప్రీతికర మైనచో కేశవాలయమున పూజ ప్రధానము, శివప్రీతికరమైనచో స్వయంభూదేవా లయమున పూజ ప్రధానము. కేశవాలయమున నర్చకులు వైఖానసులు; స్వయంభూ దేవాలయమున నర్చకులు శివార్చకులు. అనాదిగా స్మార్తులు అభిమానించు దేవాలయ ములలో నిదే యాచారము !

గణపతిదేవులు చిన్నతనమున దేవగిరిలో చెరసాలలో నున్న దినములందు ఓరుగల్లును కాకతీయసామ్రాజ్యమును మిక్కిలి యలజడిగా నుండెను. అప్పుడు దానికి పొరుగున నున్న హొయిసల బల్లాలరాజ్యము మట్లు కాక శాంతముగా నుండెను. అందుచే కాకతీయరాజ్యములోని చాతుర్వర్ణ్యప్రజలు పలువురు హొయిసల రాజ్యములో తలదాచుకొన బోయిరి. అక్కడ నప్పుడు శ్రీవైష్ణవమతము ప్రబలముగా నుండెను. శ్రీరామానుజులను స్వయముగా చూచినవారును, వారి కైంకర్యముచే ధన్యులైన వారును, వారి యుపదేశములు ఆలకించినవారును, వృద్ధవైష్ణవు లప్పుడు సహస్రాధికముగా నక్కడ నుండిరి. అట్టివారి భక్తిప్రపత్తులచే ముగ్ధులై, వారి తేజఃప్రభావములకు మురిసి, వారి వాదపటిమచే నాకృష్టులై, యక్కడి చాతుర్వర్ణ్యజనమును రామానుజమతము విరివిగా నవలంబింపసాగెను. అక్కడివారితోపాటు కాకతీయరాజ్యము నుండి వెళ్ళిన ప్రజలును పలువు రామత మవలంబించి వైష్ణవు లైరి.

శ్రీవైష్ణవుల బల మతిశయించినయెడల నెల్ల, అనాదిగా వైఖానసు లర్చకులుగా నున్న దేవాలయములలో, ఈ నూతనవైష్ణవుల ప్రాబల్యము నెమ్మది నెమ్మదిగా నెక్కువ కాజొచ్చెను. దానితోపాటు పన్నిద్దరాళ్వారుల ప్రతిష్ఠలు ప్రారంభించెను. పూర్వము ద్రావిడవేదపారాయణము భక్తులైనవారు కొంద రభిమానముతో నా దేవాలయములలోగూడ జేసెడివారు. కాని యప్పు డది యితరస్తోత్రములు చదువుచున్నట్లే అందులో నొకటిగా నుండెడిది. తర్వాత తర్వాత నది నియతముగా చేయవలె నను విధి నెమ్మదిగా కొన్ని దేవాలయములలోని కెక్కసాగెను. కైంకర్యాదులలో వైదిక మంత్రములను వదలి ద్రావిడపాశురములు ప్రయోగించుటకు వైఖానసు లిష్టపడు చుండుట లేదు.

వైఖానసులకును ఈ నూతనవైష్ణవులకును నిలువుబొట్టును విష్ణుభక్తియు సమానమే యైనను ఎన్నియో అవాంతరభేదములు కలవు. ఆ బొట్టులోకూడ వైఖానసులకు క్రింద పాద ముండదు. నూతనవైష్ణవులలో పలువురికి పాద ముండును. కొందర కుండదు. తిరుచూర్ణము రంగులోకూడ భేదము లుండును. వితంతువులు జుట్టు తీయించుటలోనను, భగవదారాధనలో ఘంటావాదనము చేయుటయందును ఆచారభేదములు కలవు. వడగలై శాఖ ఇంకను బాగుగా వృద్ధికానందున నూతనవైష్ణవుల యాచారములు మొత్తముమీద వైఖానసుల పద్ధతులకు విరుద్ధముగనే ఉన్నవి. ఈ నూతనులు ఏకాదశీశ్రాద్ధవర్జనము చేయుట, దేవతారాధనములో ఘంటావాదనము చేయకుండుట, సహగమనము చేయని వితంతువులు కేశము లుంచుకొనుట — యిట్టి యాచారముల నవలంబించుచుండుటచే, వైఖానసుల కెక్కువ కష్టముగానుండసాగెను.

ఈ చిన్నచిన్న యాచారము లెట్లున్నను, వారి భేదములలో ముఖ్యమైనది చక్రాంకణము ! వైఖానసులు గర్భచక్రాంకణము చేసికొందురు. అనగా వైఖానస స్త్రీ గర్భవతిగా నుండగానే, అష్టమమాసమున కొన్ని హోమాదికములు చేసి శంఖచక్రాంకితమై సంస్కృతమైన పాయసమును ఆమెచే ప్రాశనము చేయింతురు. ఈవిధముగా గర్భమునందలి శిశువునకు చక్రాంకణమగును. అటుకానివారు దేవాలయాదులలో దారాధనకు అనర్హు లని వారి సిద్ధాంతము !

ఈ విధముగా నాగన్నవైష్ణవులు, కాక, నూతనముగా వైష్ణవము పుచ్చుకొన్న వారికి గన్నచక్రాంకణము లేదుగదా! మొదలు చక్రాంకణమే లేకుండెను. శ్రీరామానుజులు తప్తచక్రాంకణము నంగీకరించె ననియు నంగీకరింపనే లేదనియు రెండువాదములు ప్రబలియుండెను. కాని మొత్తముమీద కొంతకాలమునుండి ఈ నూతనవైష్ణవులు తప్తచక్రాంకణ మనగా, తప్తమైన వస్తువుతో రెండుభుజములమీదను శంఖుచక్రచిహ్నములు శాశ్వతముగా నుండునట్లు వేయించుకొనుట. ఇది యొకానొక మంత్రసంస్కారముతో జరుగును. ముఖ్యముగా ఈ సంస్కారమే యీనూతన వైష్ణవుల వైఖానసుల నుండి వేరుచేసి గుర్తించుటకు అనువైన బాహ్యచిహ్నముగా నుండెను.

కాకతీయసామ్రాజ్యమున గణపతిదేవులు శాంతి నెలకొల్పిన దాదిగా, బల్లాల కర్ణాటకరాజ్యమున పూర్వము తలదాచుకొనబోయిన కాకతీయప్రజలు పలువురు మరల స్వస్థానములకు నెమ్మదిగా చేరికొనసాగిరి. వారివెంట నీ రామానుజమతమును కాకతీయరాజ్యమున బలపడజొచ్చెను. అక్కడ వైష్ణవమత మవలంబించిన బ్రాహ్మణులు శ్రీవైష్ణవసంజ్ఞతో తిరిగి వచ్చిరి. వారిలో పలువురు వేదవేదాంగవిదులుండిరి. ఎన్నియో సంబంధముల పురస్కరించుకొని కర్ణాటులగు శ్రీవైష్ణవులును, ఉద్దండులగు వారు, కొంద రిచ్చటికి వచ్చిరి. వారితోపాటు శ్రీవైష్ణవుల ప్రాభవమును కాకతీయ సామ్రాజ్యమున నతిశయింపజొచ్చినది. వారికిక్కడి స్మార్త పండితులతోడను శైవులతోడను వివాదములు పెరుగజొచ్చినవి. వైఖానసులు ఎక్కువభాగము భగవత్కైంకర్యములలో నియుక్తులై యుండుటచే వారిలో నితరవిద్వత్పరిశ్రమ బహుకాలముగా క్షీణించియుండెను. కాని యిప్పుడు విష్ణుపారమ్యమును సమర్థించు శ్రీవైష్ణవపండితుల యండ వారికి కొంత నూతనచైతన్యము కలిగించెను. దానితోపాటు వారిపై శ్రీవైష్ణవుల యొత్తిడియు ప్రారంభించినది.

కేశవస్వామి యాలయమునకుగూడ శ్రీవైష్ణవులు వచ్చుచుండిరి; గాని యచ్చటి యాచారములను మార్చుటకు ఇంతవరకు నెప్పుడును వారు ప్రయత్నించియుండ లేదు. వారచ్చటికి వచ్చి మహాభక్తితో ద్రావిడపాశురములు పఠింతురు. దాని కెవరి కేమి యభ్యంతరము ?

వైకుంఠఏకాదశి ధనుర్మాసమున పుష్యశుద్ధైకాదశినాడు వచ్చును. ఆ పర్వ నిర్ణయములో స్మార్తులకు శ్రీవైష్ణవులకు వైఖానసులకు నీషద్భేదము లున్నవి. ఒక్కొక్కరోజు హెచ్చుతగ్గులు వచ్చును. శ్రీవైష్ణవులు సందేహము కలిగినచో శ్రీ రంగక్షేత్రమునందలి నిర్ణయమును పాటింతురు. ఈ సంవత్సర మట్టి భేదము వచ్చినది. స్మార్తులకైన మరునాడు శ్రీవైష్ణవుల కైనది. ఇప్పటికే వారము దినములనుండియు నా కాలనిర్ణయములో వాదప్రతివాదములు సాగుచుండెను. వైఖానసులు మొత్తము మీద స్మార్తపక్షమే యవలంబించిరి. ఈ సందడిలో తిక్కనసోమయాజుల మహా భాగవతరచన సరిగా సాగుచుండుటలేదు.

కేశవస్వామి యాలయములోని యర్చకులు వైఖానసులైనందునను, వారందరు స్మార్తనిర్ణయము ననుసరించువారైనందున, యీనాడే వైకుంఠఏకాదశీమహో

నను వారు జరుపుచుండిరి. శ్రీ వైష్ణవుల కది కంటకముగా నున్నదిగాని యేమి చేయ గలరు ?

త్వరలో నుత్తరాయణ పుణ్యకాలము రానున్నది ! దానికై ముందుగనే యీనాడు విశ్వమూర్తియగు శ్రీమహావిష్ణువు ఉత్తరద్వారము తెరపించి భక్తులకు దర్శన మిచ్చును. ఇక నారాయణునితోపాటు భక్తులును ఉత్తరాయణము తిలకింప సిద్ధముగా నుందురు. దానినే స్మార్తులు ముక్కోటి ఏకాదశి యందురు. దాని కాపేరెట్లు వచ్చెనో, ఆపదముల కూర్పు ఎట్లు సాధ్యమో, చెప్పలేము; కాని ఆ పేరును అశేష మగు నాంధ్రలోకమే సాక్ష్యము. ఎన్నియర్థములైనను దాని కూహింపవచ్చును.

మనోజ్ఞముగా మంగళతూర్యారవములు మ్రోగుచుండ బ్రహ్మరథ మెక్కి, శ్రీ కేశవస్వామి తెల్లవారుజామునునే భక్తులకు ఉత్తరద్వారదర్శన మిచ్చి, మహావైభవ ముతో విశాలమగుదేవాల యావరణమునను రేగుచుండెను. భక్తులు తండోపతండములుగ మూగి యాయుత్సవవిగ్రహములకు కానుక లర్పించుచుండిరి. భూచక్రగొడుగులు సాగు చుండ, అర్చకులు వింజామరలు వీచుచుండ చలువచప్పరములో సర్వాభరణభూషితుడై యున్న యా కేశవస్వామిని ఆనాడు చూచిన వారివే కన్నులు !

ఆ సమయమున స్వయంభూదేవాలయమునగూడ విశేషముగా నభిషేకార్చనలు జరుగుచుండెను. ఆ సమీపముననే నూతన ప్రతిష్ఠితుడగు నన్నమేశ్వరుని యాలయమున యథావాక్కుల అన్నమయ్యయు రుద్రాభిషేకము నిర్వర్తించుచుండెను. ఆ యాలయ ముఖమండపమున శివభక్తులు గుంపులుగా మూగి భక్తివినమ్రులై ప్రమథగణముల వలెనే యలరారుచుండిరి.

అట్టి సమయమున నూతనవైష్ణవుల తండ మొకటి భజనచేయుచు నాలయ ప్రదక్షిణము చేయుచుండెను. కేశవశ్రీస్వయంభూదేవాలయము నావరణము నలుచదరముగా నుండి ఒక్కొక్క ప్రక్క సుమారమి రెండువందల విండ్ల ప్రమాణముండును. సరోవర మున్నవైపున గాక మిగిలిన మూడువైపులను రాజవీథి కావల జనసంకులము లగు గృహ ముల శ్రేణులు కలవు. ఆ ప్రాకారము భజనచేయుచు చుట్టి వచ్చునప్పటికి నాలుగు గడియలు పట్టును.

ఆ శ్రీవైష్ణవుల కానాడు వైకుంఠ ఏకాదశి కానందున లోపల నూరేగుచున్న కేశవస్వామిని దర్శింపవలె నను నుత్సుకత లేదు. ఆ నూతనవైష్ణవ తండమునకు అగ్రేస రుడై శ్రీవైష్ణవు డొక్కడు నడచుచుండెను. ఎరుపు కలసిన పచ్చని దేహముపై దీర్చిన ద్వాదశోర్ధ్వపుండ్రములును అతని దేహశోభను మరింత నతిశయింపజేయుచుండెను. అంసను రెండుభుజములందును తేలియున్న తప్తచక్రాంకణములు చూడ శ్రీమహా విష్ణువే యీ రూపమున నవతరించెనా యన్పించుచుండెను. అతడు చూడగా నీదేశపు వాడుగా లేడు. కర్ణాటదేశమునుండి క్రొత్తగా వచ్చినవానివలె నున్నాడు. కర్ణాట దేశమున వైష్ణవులును శైవులును ఒకరి నొకరు దూషించుకొనుట పరిపాటి. శివాతి శయము చెప్పవలె నన్న విష్ణువును దూషించుటయు, విష్ణ్వతిశయము చెప్పుటకు శివ నింద చేయుటయు నచ్చటి యాచారము. వారికి పగపట్టుల పైనుండు ద్వేషము, ఎదిరి యిష్టదైవములను తెగడుచుండుటతో శాంతించుచుండెను.

ఆ కర్ణాట శ్రీవైష్ణవు డీ క్రిందివిధముగా నంపుకొని పాడుచుండ సాగుంపు లోనివా రాతనివెంట నది యట్లే ఉచ్చరింపసాగిరి.

"నీ పాదోద్భవనీరము శిరమున
నిత్యము దాల్చుట నీలకంఠుని
పులకల పేరులు పూసిన బూదియు
పూనిన పుర్రెయు పూతము లయినవి;
కౌలంతుము కేశవ, కులిశధ్వజహల
కలితభవచ్ఛిద్రి కమపదద్వయి !

*   *

"భద్రప్రద నీ పదములు పాడుట
రుద్రాక్షాంచిత రుద్రభూచరుం
డష్టైశ్వర్యము లంది మానుకొనె
నడుగుచు తిరిపెం బవని జరించుట;
నారాయణ నీ నామసహస్రము
శ్రీరాజితముగ జిహ్వాభజింతుము !

*   *   *

"కమలనయన నీ కారుణ్యావృత
విమలకటాక్షము విరిసి పర్వుటను
సుకృతి యగుచు నాసురసేవ్యుం డగు
వికృతాంబరు డౌ వికట నయనుడును,
సారసపత్రవిశాలవిలోకము
నీ రమ్యాకృతి నిరతము చూపుము !

ఈ భజనపరులు అన్నమేశ్వరుని యాలయము ముందుకు వచ్చి యీ పాట యావేశముతో పాడుచుండిరి. అందును చివరిభాగము ముమ్మారు పాడిరి. 'అసుర సేవ్యుడు' 'అసుర సేవ్యుడు' 'అసుర సేవ్యుడు!'

అన్నమేశ్వరుని యాలయము ముందర నున్న శివభక్తులు అది మొదటిమారు వినియే హుంకరించిరి. లోపల నభిషేక మొనరించుచున్న అన్నమయ్యకు గూడ ఆపాట వినబడినది. వాకిట ప్రమథులు చేసిన హుంకారమును ఆయనకు వినబడినది.

రెండవమారు విని వారు మరల హుంకరించిరి. రెండవమారును ఆ పాటయు, వాకిట ప్రమథుల హుంకారమును, యథావాక్కుల అన్నమయ్యకు వినబడినవి. అసుర సేవ్యుని దలపించుటలో నాతనికి అసురప్రకృతి ప్రకోపించినది. రోషము పిచ్చలించినది. కాని యది యాతడు నిగ్రహించుకొనుచుండెను.

మూడవమారు ఆ పాట వారు పాడిరి. మూడవమారు అది విని ప్రమథులు హుంకరించిరి. మూడవమారును అన్నమయ్య కవి వినబడినవి !

రుద్రాభిషేకము చేయుచున్న యథావాక్కుల అన్నమయ్యకు అభిషేకభంగ మైనది. ఒక్కసారిగా నాతడు క్రోధదుర్నిరీక్ష్యు డయినాడు. అతని దేహమే పొంగి యా చిన్న దేవాలయ మంతయు నిండిన ట్లయ్యెను. ఒక్కమా రాతడు వెనుదిరిగి చూచెను! చూచెను, అంతే!

అతడు తన ఫాలభాగమున మూడు విభూతిరేఖలు తీర్చియుండెను. వాని మధ్యభాగమున నాత డంతవరకు కుంకుమము పెట్టుకొని యుండలేదు. లోపలి నుండి రక్తమే స్రవించెనో, మరి యేమయ్యెనోగాని, ఆ మూడు విభూతిరేఖల మధ్య భాగమున ముందు ఎఱ్ఱగా చెమర్చిన ట్లయ్యెను; ఉత్తరక్షణమున నచ్చట కుంకు మాంకిత మయ్యెను; అంతలో నందుండి రక్తమే స్రవించుచున్నట్లుండెను.

రక్తము కాదది! రక్తము గంగుగా నున్నను అది క్రిందికి పారుటలేదు. గొట్టముతో చిమ్మినట్లు ముందుకు ప్రసరించు చున్నది. అదియొక కాంతిప్రసారము! అగ్నిప్రసారమే! సాంబసదాశివుని వికటాంబకము శ్రీవైష్ణవులు తలపించుటచే నది యా భక్తాగ్రేసరుని నొసట ప్రత్యక్ష మైనది.

అక్కడ మూగియుండిన శివభక్తులకే భయ మైనది. వారు రెండుచేతులు శిరోగ్రముల జోడించి "హర హర మహాదేవ శంభో!" యని మాటిమాటికి గొంతెత్తి యరచుచు మ్రొక్కుచు ఆ కాంతిపుంజమునకు తొలగి దారి యిచ్చిరి. ఆ కాంతి పుంజముకూడ గంగాయమునానదీప్రవాహములవలె రెండై, సూటిగా పోయి వాకిట శివనింద చేయుచున్న శ్రీవైష్ణవాగ్రేసరుని రెండుకన్నులలోకే ప్రవేశించెను! ఏమైనదో! ఆ శ్రీవైష్ణవుడు రెండుకన్నులు మూసెను! అత డంతట నిలువలేకనే పోయి కన్నులు తిరిగి నారాయణస్మరణము చేయుచు క్రిందబడిపోయెను.

అన్నమయ్య యట్లే వెనుదిరిగి చూచుచుండెను. అతని భ్రూమధ్యముననుండి పొంగి స్రవించుచున్న యా తేజోధార యా వైష్ణవతండముపైనెల్ల ప్రసరించు చుండెను. అది ప్రసరించినచోట నెల్ల అది కాల్చివేయుచుండెను. దానితో నా నూతనవైష్ణవతండమున గల వా రెల్లరు వీపులు కాలినవారును బుజములు చూడిన వారును రొమ్ము లంటుకొనినవారును నైరి.

'హరి హరీ!—నారాయణ, నారాయణ!—రంగనాథా! రంగనాథా! రంగనాథా!'

ఏమన్న నేమి? గజేంద్రుని కుయ్యాలించిన యా వైకుంఠధాముడు, లక్ష్మీ దేవితోకూడ యాడుచున్న చతురంగక్రీడ చాలింపలేదు. అతని నయనములే సూర్య చంద్రులు! అందులో నొకటగు చంద్రనయనమున నేదో నలుసుపడినట్లయి యాత డిప్పు డా కన్ను శ్రీ[illegible]లాంచలముతో తుడిచికొనుచుండబోలును!

లంకలో అగ్ని ముట్టకొన్న హను[illegible]కవలెనే అన్నమయ్య ఫాలాగ్నియు ప్రసరింపసాగెను. [illegible] రై వైష్ణవులు భజన చాలించి పారిపోయిరి.

వాంకగ్రేసరు దగ్గ[illegible]

## ౩౮

ఆనాటి గొంటూరు చిన్న పట్టణము ఆ పట్టణమంతయు ఎఱ్ఱచెరువను నొక పెద్ద చెరువునకు తూర్పుననే ఉన్నది. అందులో నొక కోట కలదు. అది మట్టికోటయే కాని రాతికంటెను కఠినమైన మట్టి. ఆ మట్టిలో కలిపిన పాళ్లు, దానితో సిద్ధముచేసిన పాకము ఆ కోట కట్టిన ప్రధానశిల్పులకు వంశానుక్రమముగా వచ్చుచుండిన రహస్యము! పనివారిచేతనే వారా పనియంతయు చేయింతురు గాని యా రహస్యమితరులకు తెలియనీయరు. ఆ కోట గోడలకు ఆ ఎఱ్ఱచెరువు నీరేగాని, ఒక్క చుక్కయైనను వేరునీరు వాడలేదు. ఆ కోట యగడ్తకు గూడ నీ యెఱ్ఱచెరువు నీరే పెట్టుచుండెడివారు! కోటలో నున్న జలాశయములకు గూడ నీ యెఱ్ఱచెరువు నీరే నిల్చుచుండబోలును! గొంటూరుకు వాయవ్యభాగమున నంతయు నెఱ్ఱనేల. ఆ ఎఱ్ఱనేలకుండ ప్రక్కలగల కొండలపై వర్షించిన నీరు ప్రవహించి వచ్చుటచే రాగివలె నెఱ్ఱనై అందులో కలియుటచే దానికి ఎఱ్ఱచెరువను పేరు వచ్చినది. రాగివంటి ఎఱ్ఱనేలనుండి ప్రవహించు నీటిప్రభావము ఎఱిగియున్నందుననే కావచ్చు, రాజమహేంద్రవరము ఇత్యాదిప్రదేశములలో గూడ, నిట్టి పుట్టకోటలే గట్టియుండిరి.

ఎఱ్ఱచెరువునకు పశ్చిమమున పెద్ద యరణ్యము కలదు. అందులో ననాదిగా ఇతరవృక్షములతోపాటు పెద్ద టేకుమ్రానులుకూడ పెరుగుచుండెను. టేకు నెల్ల యాకులు నలిపినచో చేతు లెఱ్ఱపడును. అది గ్రహించిన శిల్పులు ఆ యాకులు సేకరించి చిత్రకారుల కవసరమగు వర్ణము లెన్నియో కల్పించెడివారు. ఆ టేకుకలప కూడ శ్రేష్ఠమై యెన్నియో విధముల దారుశిల్పాదులకు వారి కుపయోగపడుచుండెను. అందుచే గొంటూరు శిల్పులకును చిత్రకారులకును ఆవాసమయ్యెను. టేకుశబ్దమును రూపాంతరమగు తేకునుండియే తేకువశబ్దము కూడ బుట్టినది. గొంటూరి శిల్పులకు తేకువకూడ విశేషము!

ఎఱ్ఱచెరువునకు నీరువచ్చు కొండకాలువ నానుకొని, యా యడవిలో కొంత కాలముగా బాబాజీల మఠమొకటి వెలసెను. గౌడదేశమునుండి వచ్చిన వైష్ణవ బ్రాహ్మణులకు బాబాజీలనియు, వారిమఠములకు బాబాజీ మఠములనియు నాంధ్రదేశములో పేరు వెలసినది. ఆ మఠములలోని పెద్దలను శిష్యులు 'బాబాజి' యని వారి భాషలో గౌరవార్థముగా సంబోధించుటచేతను నిర్దేశించుటచేతనే ఆ పేర్లు కలిగినవని తోచును. గణపతిదేవులయు రుద్రమదేవులయు రాజగురువులగు విశ్వేశ్వర శంభుదేవులు గూడ గౌడులే. వారు గౌడరాఠమఠాధ్యక్షులు. వారు శైవాభిమానము గల స్మార్తులు. గొంటూరులో [illegible] బాబాజీలు వైష్ణవాభిమానముగల స్మార్తులు. ఈ గౌడవైష్ణవులకును గౌడ [illegible] ద్రావిడ కర్ణాటములందలి శైవవైష్ణవులతో నెట్టి పొత్తును లేదు!

ఈ [illegible] అర్ధక్రోశము దూరమున గలదు. ఆ [illegible] నా మఠము [illegible]

గౌడదేశీయులకు జగన్నాథస్వామి ఇష్టదైవము, ఆ మఠ మక్కడ స్థాపించిన మొదటిబాబాజీ యగు శ్యామలదాసు, అందులో జగన్నాథస్వామికి చిన్నయాలయ మొకటి ప్రతిష్ఠించియుండెను. ఆ గ్రామమఠముక్రిందికి ఆక్రమణలోనికి వచ్చిన ప్రదేశము నాతడు గొంటూరుప్రభువులచే నగ్రహారముగా పొందుటవలన, దానికి శ్యామలదాసు అగ్రహారమని పేరు వచ్చెను. ఆ మఠమున కానుకొని ఉత్తరమున నొక చిన్న చెరువు నాతడు త్రవ్వించెను. దానిలోనికి ఎర్రచెరువులోనికి పోవు కొండ కాలువనుండియే చిన్నతూము పెట్టి నీరు పెట్టుచుండిరి. ఆ యగ్రహారప్రజల కది నీటి వసతికై యుపయోగపడుచుండెను. ఆ చెరువుకు బాబాజీమఠము చెరువను పేరు వెలసెను.

ఆ మఠమునకు తూర్పుద్వారమునొద్ద నొకటియు, పశ్చిమద్వారమునొద్ద నొకటియు ఆచ్ఛాదనము లేని హనుమద్విగ్రహములు ప్రతిష్ఠింపబడినవి. ఇవిగాక అక్కడ ననాదిగా జగన్నాథస్వామి యాలయమునకు పశ్చిమమున ఏబదివిండ్ల దూరమున, ఆకాశమే యాచ్ఛాదనముగా గల యొకగణపతి విగ్రహము కలదు. ఆవిగ్రహముక్రింద పెద్ద నిక్షేపము లున్నవనికూడ నొక ప్రతీతి యుండెను.

ఆ మఠము స్థాపించిన శ్యామలదాసుబాబాజీకి, అక్కడనుండి యా గణపతి విగ్రహమును మరియొకచోటికి మార్పింప జూచుచుండగా, నాతని కిష్టదైవ మగు జగన్నాథుడు స్వప్నములో కనబడి యాతని వల దని వారించె నట. తదాదిగా దాని నెవ్వరును కదలింపగూడ దని యాతడు కట్టడిచేసెను.

ఐనను ఆయనతర్వాత మఠాధిపతియైన బాబాజీకి ఆ విగ్రహముక్రింద నున్న నిధి తీయించ నిచ్ఛ కలిగినది. అతడును మంత్రతంత్రదక్షుడు. ఆ పని కాతడు తలపెట్టి పెద్దతంతు చేయించి, యచ్చట నొకరాత్రివేళ మహిషాదుల బలి యిప్పించెనట. ఆ పిమ్మట నా విగ్రహము పెకలింప నాత డాజ్ఞ యిచ్చెను.

ఆ విగ్రహము కదలింప భూమిపై మొదటి పలుగు దెబ్బ పడినది. ఆ పలుగు వేసిన పరిచారకుడు ఆపాదమస్తకము కంపించుచు పడిపోయెను. అచ్చటనే యున్న బాబాజీయును వెంటనే స్మృతి తప్పి పడిపోయెనట ! అతని నోటివెంట కొంచెము రక్తముకూడ వచ్చెనట ! అతడు జీవించెను. పరిచారకుడును బ్రదికెనుగాని వానికి పిచ్చియెత్తెను. ఆ పిచ్చివాని మాటలే యీ రహస్యము లోకములో పొక్కుటకు కారణము ! ఆ పిమ్మట గణపతిని కదలించు ప్రయత్న మాగిపోయినది. బాబాజీ యక్కడ నిత్యపూజ చేయ నొక పూజారిని నియమించెను. తదాదిగా చుట్టుపట్టుల జనములకు ఆ గణపతిపై భక్తిగౌరవము లతిశయించెను. ఆ మహాలక్ష్మీగణపతికి పూజ లతిశయించెను.

ఈ బాబాజీ లందరును గోసాయీలు. వారికి వివాహములు లేవు. కాని ద్రవిడ సన్యాసులకును వీరికిని భేదములు కలవు. వీరు శిరస్సులు ముండనము చేయించుకొనరు. శిరోజములు దీర్ఘముగా పెరిగిపోయి జడలుకట్టి యుండుటచే వీరు జడదారులు. వారి గడ్డములును మీసములును పొడుగుగా పెరిగియుండును. ఆ పరంపరలో తరుచుగా స్థాపకు డగు శ్యామలదాసునామము వచ్చుచుండెను. ఇప్పు డున్న బాబాజీ నామమును

శ్యామలదాసే. అతడు మిక్కిలి సత్త్వసంపన్నుడనియు మహత్త్వము కలవాడనియు ప్రతీతి కలదు.

ధనుర్మాసములో నా బాబాజీమఠమున జగన్నాథార్చనము మహావైభవముగా జరుగును. అది చిన్నపల్లెయే యైనను ఆ యుత్సవమునకు దగ్గర నున్న గొంటూరి పౌరులును, ఆవల నల్లచెరువు నానియున్న గ్రామప్రజలును, చుట్టుపట్టుల గ్రామముల జనములును విశేషముగా నక్కడ చేరుచుందురు.

ఈ నాడక్కడ వైకుంఠ ఏకాదశీపర్వము మహోత్సవముగా జరుగుచున్నది. గొంటూరు నాగదేవుడు బాబాజీమఠములో నున్న మహాలక్ష్మీగణపతికి భక్తుడు. ఆతనికి జగన్నాథస్వామియందును శ్యామలదాసునందునుగూడ విశేషముగా భక్తిశ్రద్ధలు కలవు. ఆ బాబాజీ కతడు సర్వవిధముల సౌకర్యములు కలిగించుచు విరివిగా కానుక లర్పించుచుండెను.

గొంటూరు నాగదేవుడు కొంతకాలమునుండి గణపతిదేవుల ధిక్కరించెను. అది యా బాబాజీ పట్టించుకొనలేదు. కాని యిప్పుడాతడు దోపిడులు చేయించుచుండెననియు తెలియవచ్చుచున్నది. అది తెలిసినప్పటినుండియు పూజ్యుడగు నా బాబాజీకి కష్టముగా తోచుచుండెను. కాని ఏమని చెప్పగలడు?

ఈ మఠములో పెద్ద యతిథిశాలలు కలవు. గోసాయీలు ఎవరు వచ్చినను వారి కందులో భోజనాది సర్వసౌకర్యములు నా మఠమువారు నియతముగా చేయుచుండిరి. ఆ యతిథిశాలలును మహాభవనములు. అవి పెక్కులు గొంటూరివిభు డర్పించిన ధనముతోడనే కట్టబడినవి. ఒక్కొక్కసారి గొంటూరి నాగదేవునికి అతిథులెక్కువయినచో వారిలో కొందర నాతడు బాబాజీమఠములోని యతిథిభవనములలో నుంచుటయు కద్దు. ఆ భవనములను మఠమునకు వెనుకవైపున పశ్చిమపు చివర నున్నందున, అక్కడ రాజాతిథులుండి వారును వారి పరివారములును రాకపోకలు చేయుచున్నను, మఠములోని నిత్యకర్మకలాపముల కెట్టి యాటంకము నుండెడిది కాదు.

ఈ మధ్య గొంటూరు నాగదేవుని యతిథిశాల లన్నియు నాతని గౌరవాతిథులతో నిండిపోయినవి. నాగదేవుని మిత్రు లెందరో అక్కడికి వచ్చియుండిరి. ఎఱువ మల్లిచోడుడు, కేశవదేవుడు, సోమిదేవుడు, అల్లుగంగు, మల్లికార్జునుడు, దామోదరుడు— మరియు నెందరో గొప్పపరివారములతో వచ్చియుండిరి. వారందరు మండలాధిపతులే. అందరును గణపతిదేవులను ధిక్కరించుచున్నవారే! గొంటూరునకు సమీపమున నుండు కొణిదెన మొదలగు ప్రదేశములకు పాలకులే యందరును!

వారి కిందరికిని జన్నిగసేనల కదలికలు తెలిసినవి. అంబదేవుని మహాసైన్యము వచ్చుచున్నట్లు బాగుగా తెలిసినట్లు తోచదు. ఆవల నెల్లూరులోనున్న జటావర్మ సుందరపాండ్యునియొద్దనుండి వారిల కందరికి రాయబారములు వచ్చినవి. వారిప్పుడేమి చేయుట?

వారిలోనొక్కరు ప్రత్యేకముగా అటు జటావర్మసుందరపాండ్యుని గాని, ఇటు కాకతీయమహాసేనలనుగాని, ప్రతిఘటింపలేరు. వారందరు ఏకముఖముగా నున్నను, ఆ పనులు సాధించలేరు. కాని వారేకముఖముగా నున్న, నెవ్వరైనను

వారితో జాగరూకులై సంచరింపవలసి యుండును. వారొకరితో కలసిన రెండవ వారికి జయము కష్ట మగును.

అట్టివారు సామాన్యముగా తమకు దగ్గరవారితోకంటె దూరమునారితో కలియుట కిచ్ఛగింతురు. కాకతీయులతో గలసినచో వారికి చిన్నమండలేశ్వర పదవులే స్థిరము లగును. కాని దక్షిణమునుండి దండెత్తి వచ్చుచున్న పాండ్య కాదవులతో కలసి కాకతీయులను ధిక్కారించిన వారికి లాభము. ఈ పాండ్య కాదవులిందుల నెక్కువకాలముండబోరు. వారితో కలిసి జయించినచో అచిర కాలమున తమకు స్వతంత్ర మగు పెద్ద మండలాధిపత్యములు ప్రాప్తించును. ఎవరిని తామిప్పుడు చేరవలె ? ఎట్లు చేరవలె?

కాకతీయులతో వారి సంబంధము ఇప్పటికే శ్రుతి మించిపోయినది. కాని పాండ్యులను నమ్మదగునా ? నమ్మకుండి చేయునదేమి ? పాండ్యుడు వారలను తొందరపెట్టుచున్నాడు. వెంటనే నిశ్చయము చేయకున్నచో నాతని వాహిని ముందు తమ్మునే ముంచివేయవచ్చును. ఇటు కాకతీయులకు అటు పాండ్యకాదవులకు, కానివా రగుదురు!

మొత్తనుమీద వారు సుందరపాండ్యుని జేరుటకే నిశ్చయించిరి కాని యాతడు ఈమధ్య పంపుచున్న వార్తలు వారికి అలజడి కలిగించుచున్నవి. అవి మిత్రరాజులకు పంపుచున్నట్లుగా లేవు. చక్రవర్తి తన సామంతులకు పంపుచున్న యాజ్ఞలవలె కనబడుచున్నవి. ఈ పాండ్యుని దాసుల మగుటకేనా, మనము కాకతీయ చక్రవర్తులను ధిక్కరించినది!

అదికాక కాడవసేనలనుగూర్చియు, పాండ్యసేనలనుగూర్చియు అతిశయోక్తులతో కూడిన వార్తలు వచ్చుచుండెను. కాడవసేనలే పదు నెనిమిదిలక్ష లని వారు వినిరి. కొప్పెరుంజింగని సేనాచలనములను వారి వార్తాహరులు చూచియుండిరి. కొందరు ఒకటిరెండులక్షలకంటె పరివార ముండదని వారికి చెప్పిరి. వారు నమ్మదగినవారే కాని పలువురు వేగరులు పదునెనిమిది లక్షలే యనిరి. కొప్పెరుంజింగని సేనలు దారిలో వేయుచు పోయిన ప్రథలే అట్టివారు స్వీకరించి చెప్పుచుండిరి.

మరి యిక నాతని జయించిన పాండ్యసేనల సంఖ్య ఎంత ? అది యసంఖ్యాకమే యనియు శ్రీరాముని వానరసేనలవలెనే కోట్ల సంఖ్యలతో నున్నదనియు వాదుకలు ప్రబలెను. వాని నిజానిజములు తెలిసికొను టెట్లు?

ఇంతమహాసైన్యములను నవలక్షధనుర్ధరులు మాత్రమే కల కాకతీయసేన లెదుర్కొనగలవా ? అందుపైనిప్పుడు గణపతిదేవులు వృద్ధులైనారు. వారి దుహిత రుద్రమ రాజ్యభారము వహించినది. పురుషనామము వహించినంతమాత్రమున స్త్రీకి పౌరుషము వచ్చునా ? అదియు గాక ఆమెభర్తయే యామెను ప్రతిఘటించుచున్నాడు. ఆమెకుమామలే వ్యతిరేకమయిరి. సమర్థు లగు పలువురు మండలేశ్వరు లెదురుతిరిగిరి. పైనుండి ఒకవైపున కళింగ సేనలు. మరియొకవైపున కాదవపాండ్యసేనలు రాజ్యములోనికి చొచ్చుకొని వచ్చినవి. తమకు చేరిన రహస్యవార్తలను బట్టి యొకవైపునుండి హొయి

పల బల్లాలసేనలును మరియొకవైపునుండి దేవగిరియాదవసేనలు కాకతీయసామ్రాజ్యముపై శీఘ్రముగా దండెత్తనున్నవి. కాకతీయసామ్రాజ్యము మునుగుటకు సిద్ధముగానున్న నౌకవలె నున్నదిప్పుడు! ఆత్మరక్షణ చేసికొనగోరువారు దానిని ఎంత శీఘ్రముగా త్యజించిన నంత మేలు! ఈ విధముగా వారు మంతనములు చేయుచుండిరి.

ఈ మధ్య చాలాకాలముగా బొల్లడు గొంటూరులోననే ఉన్నాడు. అతడిప్పుడు గొంటూరు నాగదేవుని దక్షిణహస్తము! అతని దేహమునకు వెనుక నుండెడి స్థౌల్యము కొంత తగ్గినది. ఇప్పు డాతడు ఖడ్గసాధనమునను బాణప్రయోగమునను శూలాద్యాయుధ విద్యలను చతురుడు; ఆరితేరిన యాశ్వికుడు. శతములను సహస్రములను యోధులను చాకచక్యముతో నడిపింపగల సమర్థుడు. నాగదేవునిమూకలతోగూడి యాతడు విశేషధన మార్జించియుండెను. ఎందరో స్త్రీ లాతని నాకర్షించి తమ వలలో వేసికొన జూచిరి. కాని యాతడు స్త్రీలవంక కన్నెత్తి చూడడు. స్త్రీముఖము ప్రమాదవశమున నాతనికంట బడినచో నాతడు భయపడి పారిపోవ యత్నించువానివలెనే యుండును.

ఇదియేకాక అతనిలో కొన్నివిపరీతమైన గుణములు కలవు. జనమధ్యమున నందరు నుల్లాసముగా నున్నప్పుడా తనికి నడుమ నడుమ గుబులువలె ఆవేశించును. అప్పు డత డెవ్వరితోడను మాట్లాడడు. ఎవరైన పలుకరించిన చీదరించుకొనును. అంతలో నాతడు భయపడుచున్న వానివలె బెదురుచూపులు చూచును పారిపోవును. అతని కున్మాదమా?

వైకుంఠ ఏకాదశిసాయంకాలమున జగన్నాథస్వామి యాలయమునందు కర్ణాటదేశమునుండి వచ్చిన వేశ్యల మేళము నాట్యము చేయుచుండెను. దానికి నాగదేవుడును అతని మిత్రులును ఆహూతులై వచ్చియుండిరి. నాగదేవునితో బొల్లడును వచ్చి గౌరవాసనమున నాసీను డయ్యెను.

ఆ మేళమునుండి యిద్దరు వేశ్యలు ముందుకువచ్చి గొండ్లి సలుపుచుండిరి. వారిలో నొకతె మాటిమాటికి బొల్లనిపై తన కటాక్షములు పరపసాగినది. అది చూచిన యచ్చటి సామాజికులు ముసిముసి నవ్వులు నవ్వసాగిరి.

బొల్లని ముఖము పాలిపోయెను. ఆకస్మికముగా నాతని దేహము బిగిసికొనిపోవుచున్నట్లయ్యెను. అత డా నట్టువకత్తెలవంక తదేకదృష్టితో చూడసాగెను.

మఱల నంతలో నాతనిలో పెద్ద మార్పు వచ్చెను. లాగిపట్టిన కళ్లెము వదలినచో పరుగువారు నశ్వమువలెను, అడ్డుకట్ట తెగిపోయిన నదీప్రవాహమువలెనే అతడు చూతురయ్యెను. సభలోనుండి యాతడు డాస్మికముగా లేచి, శీఘ్రముగా నాగదేవునికి నమస్కరించి సెలవు తీసికొని ఆ చీకటిలో నొంటరిగా వెడలిపోయెను. అతని యున్మాద మందరు నెరిగినదియే గనుక ఎవ్వరు నేమియు ననలేదు.

అత డొంటరిగా నరణ్యమధ్యముగుండ పోయి పోయి యక్కడికి క్రోశము దూరమున నున్న నల్లచెరువు కట్టకు పోయి, దాని మరుగొమ్మున నాతడు చేరికొనెను. ఆ చెరువునకు దూరముననున్న కొండలపై కురిసిన వర్షపునీరు నల్లనేలగుండ పారుచువచ్చి ఆ చెరువులో కలియును. ఆ నీటిరంగుచే దానికి నల్లచెరువని పేరు వచ్చినది. ఇదిచాల

పెద్దచెరువు. దీని నీటిక్రింద కొంతభూమి దక్షిణభాగమున పల్లపుసాగు చేయబడు చున్నది. అక్కడ పండు వరి మిక్కిలి శ్రేష్ఠమైనది. ఈ చెరువునిండగా మిగిలిన నీరు, ఆ మరుగొమ్మగుండా అవల నొక క్రోశముదూరమున నున్న బుడంపాడు చెరువులోనికి చేరుకొనును.

బొల్లడు తరుచుగా చేరికొనునది ఆ మరుగొమ్మ సమీపముననే! అక్కడికెవ్వరును రాత్రులందు రారు. అక్కడ పెద్ద చింతలును, మర్రిచెట్లును, టేకుమ్రానులును క్రమ్ముకొని భయంకరముగా నుండును. రాత్రు లక్కడ కీచురాళ్ళ ధ్వని చెవుల గింగురు మనును. గొంటూరిలో ననాదిగా కబోదిపక్షు లెక్కువ. ఈ పక్షులు అన్నిగ్రామములను ఉండవు. అవి ఎక్కడ నున్నను గుంపులుగా కలసి నివసించును. అవి గబ్బిలములవలె చెట్లకు వ్రేలాడును. కాని గబ్బిలములకంటె మిక్కిలి పెద్దవి. వానికి ఎత్తుగా పెరిగిన చింతచెట్లెక్కువ యభిమానమగు స్థావరములు. ఆ చెట్లపై చూచిన పగ లెక్కువ కనిపింపవు. కాని సాయంత్ర మగునప్పటికి ఒక చిత్రమగు కీచునాదము చేయుచు నవి చెట్లకు వచ్చి వ్రేలాడును. అవి యప్పుడు చూచినచో ఆకున కొక్కటి చొప్పున నున్నట్లు కనబడును. ప్రొద్దుపోవువరకు వాని భయంకరసంగీతము సాగుచునే యుండును. తుద కవి నిద్రించును. రాత్రు లెప్పుడో తప్ప యవి యరవవు. మరల తెల్లవారుజామున ఆ నాదము ప్రారంభించును. చుట్టుప్రక్కల నరక్రోశమువరకు దానితో మతిగలవారికి మతులు చెడిపోవును. వర్షమునకు భూమిలోనుండి పగులబడి వచ్చి నాదముచేయు కప్పల బెకబెకలనే అది మించిపోవును. ఆ చెట్లచుట్టును వందలు వేలుగా నవి సంచరించు చుండును. దీని కంతటికి తాళమువలె నెదుర నల్లచెరువులో మధ్యమధ్య నెగిరిపడు పెనుమీల శబ్దము వినవచ్చును.

మతిగలవారికి మతిపోగొట్టు నీ మ్రోతలు మతిపోయిన బొల్లని కొక వింత శాంతము నొనగూర్చును. అతని పదము లీనాడును అప్రయత్నముగా నాతని నీ మరుగొమ్మ నొద్దకే తీసికొని వచ్చినవి.

అతడు మరుగొమ్మకు పడమర దిమ్మెపై కూర్చుండెను. దానికి సమీపముననే ఉన్న యొక చిన్న పుల్లరేగు పొదపై నాతని దృష్టి వ్రాలినది.

ఆపొదక్రిందనే గొంటూరులో నాతనికి గల సర్వము నిక్షిప్తమై యున్నది. అందులో బంగారము వెండియే కాదున్నది, అమూల్యములగు రత్నములు కూడ గలవు. స్త్రీల ముఖము చూచినప్పు డెల్ల ఆతనికి తనభార్య జ్ఞాపకమువచ్చును. దాని వెంటనే కుమార్తె జ్ఞాపకము వచ్చును. వారితో చెప్పకుండ గూడ తా నిట్లు పారిపోయి వచ్చెను. వారు దారిద్ర్యముతో బాధపడుచున్నా రను వార్తమాత్రము పూర్వము వచ్చియుండెను. వెంటనే తాను వారికి చేర్పగలందులకు సువర్ణము లెన్నియో పంపి యుండెను. కాని యవి చేరినవార్త రాలేదు. భార్యయు పిల్లయు తలపున బారినప్పు డెల్ల ఈ ధనరాశి తలపున బారును. అతని కిప్పు డదియే భార్య, అదియే పిల్ల! అది చూచుకొని కొంత మనశ్శాంతి తెచ్చుకొనును.

కాని ఈనా డాతని కట్టి మనశ్శాంతి కలుగలేదు. గొండ్లిలో తనవైపు చూపులు మాటిమాటికి పరపిన యా యువతి తా నెప్పుడో హనుమకొండలోనో ఓరుగల్లులోనో

చూచినదానివలె నున్నది. ఎంత ప్రయత్నించినను అతని కది ఎవరో జ్ఞప్తికి వచ్చుట లేదు. కాని యది తనవైపు కటాక్షము పరపినప్పు డెల్ల ఏకశిలానగర మాతని మనస్సున స్పష్టముగా పొడజొచ్చినది. ఏకశిలానగర మంతయు హృదయములో చిత్తరువు వలె అంకితమైనది. ఆ నగరవీథులు తన హృదయములో గీతలు గీతలుగా పడి కోసి వేయుచుండెను. ఆ గీతలు పోయిపోయి యాతని గృహాంగణము ముందు ఆగిపోవు చున్నవి. ఆ రేఖల కోతల కాతని హృదయములో రక్తము స్రవించుచున్నట్లే యున్న దతనికి!

అందులో నాత డప్పు డున్నది పాటిప్రదేశము. అక్కడ పూర్వ మేదో పల్లె యుండి పాడువడియుండును. అక్కడ నట్టి పాటికి తిరిగియున్నది. పాటిమట్టి ప్రదేశములు గొంటూరు చుట్టు నెన్నియేని గలవు—బుడంపాడు, బొంతపాడు, అనంతారపు పాడు, లేమల్లెపాడు, కొరిటెపాడు—!

ఈ పాటిప్రదేశములలో పూర్వ మెట్టి గ్రామము లుండెడివో! ఎట్టి మనుష్యు లుండినారో! ఎట్టి కష్టసుఖము లనుభవించియుండిరో? ఎవరైనను తనవలె కష్ట మనుభవించి యుండిరో?

తన కుమార్తె పేరు పాటి! సజీవమై కలకలలాడుచు తన్ను ప్రేమాతిశయముతో పిలుచుచు కేరిసలాడు కూతురు 'పాటి'ని వదలి ఈ పాటిగడ్డను చూచి సంతోషించవలెనా? ఈ పాడు పాటినేల, నా ముద్దులపాటికి ప్రతియా? ఛీ!

అతనికి కన్నీరు ఏకధారగా కారసాగెను. అప్రయత్నముగా నాతడు బిగ్గరగా నేడ్వసాగెను. ఎగయు టూర్పులతో మాటిమాటికి నాతడు 'పాటీ, పాటీ,' యనుచును మధ్యమధ్య భార్యను తలచుకొని 'మంగీ' యనుచును తన ధనమెల్ల నిక్షేపించిన పాటిగడ్డను కౌగిలించుకొని రోదింపసాగెను.

"ఎందు కీ కర్మము నాకు పట్టినది?"

ఇట్లాతడు మనస్సున అనుకొనెనో, బిగ్గరగా ననుకొనెనో అతనికి తెలియదు. కాని దానికి ప్రత్యుత్తరమువలె ఈ రెండు మాటలును స్పష్టముగా వినవచ్చెను.

'ఆడసోకు!'

వ్రేటువడిన పులివలెనే, కుబుసము విడిచిన త్రాచువలెనే, అతడొక్కుమ్మడి లేచెను. నలుదిక్కులు చూచెను. ఎవ్వరును లేరు. తన మనస్సులోని భ్రాంతియే!

వెంటనే అతనికి నవరాత్రోత్సవప్రారంభదినమున తాను 'ఆడసోకు సోకినది' అని గణము పూనినట్లు నటించుట యంతయు జ్ఞప్తికి వచ్చినది. ఆనాడు గండనితో పోరాటమును జ్ఞప్తికి వచ్చినది. ఈ పల్కినది అశరీరవాక్కు. నిజమే పలికినది. 'నాకీ కర్మ పట్టినందుకు కారణము ఆడసోకు గొడవయే!'

కాని తా నిప్పుడు వెనుకంజ వేయ వీలులేదు. ఎప్పటి కైనను మంగిని పాటిని ఇక్కడికి పిలిపించుకొనవలెను. కాని ఎన్నాళ్ళకు?

'ఎన్నాళ్ళకు?' అని ప్రతిశబ్దమే వినవచ్చెను. మరల మొదట విన్న కంఠధ్వనియే! ఈ యశరీరవాణి సర్వజ్ఞముగా కనబడుచున్నదే! మరల ననుమానములో

దిక్కుల గలయ జూచెను. ఎవరును గనపడలేదు. గుబురుగా కప్పియున్న చెట్ల సందులలోనుండి మధ్య మధ్య చంద్రకాంతి పడుచు, ఆ ప్రదేశము తన్ను వెక్కిరించుచున్నట్లుండెను.

చింతచెట్లపై కబోదిపక్షులుకూడ నిశ్శబ్దమైనవి. అత డింకను విచారపరుడై యాలోచించుచుండెను. ఏకశిలాగనరమే అతని హృదయములో పరివర్తన మగుచుండెను. ఇంటివైపు బుద్ధి మరలినది. ఈమారు మరల ఆకాశవాణి వినబడినది

"బొల్లా !"

బొల్లనికి భయము లేదు. అత డిట్లు ప్రశ్నించెను :

"ఎవ రది ?"

వెంటనే జవాబు వచ్చెను.

"నీ నేస్తము !"

బొల్లని కా కంఠ మిప్పుడు స్పష్టముగా గుర్తుకు వచ్చినది. అది గండని కంఠము. తన ప్రాణశత్రువు కంఠము !

బొల్లడు తన యొరనుండి ఖడ్గము పెరికి యా శబ్దము వచ్చినవైపుకు పోయెను. ఈమారు ఆవల దిక్కునుండి ధ్వని వినవచ్చెను.

"లాభము లేదు. నూరుగురు భటులుం ఈ ప్రదేశమును చుట్టుముట్టి యున్నారు. తప్పించుకొనలేవు !"

బొల్లడు నమ్మలేదు. వెంటనే ఒక ఈల వినబడెను. అనేక బాణము లొక్కసారి ఆకాశములోనికి పోయిన ధ్వని యయ్యెను. కబోదిపక్షు లన్నియు లేచి చెట్లను ప్రదక్షిణము చేయుచు నగవసాగినవి. బొల్లడు కుప్పన కూలిపోయెను.

"న న్నొక్కసారిగా చంపివేయరాదా ?"

స్వర మిట్లు వినబడెను.

"నీతో పని యున్నది. దారిద్ర్యముతో బాధపడుచున్న మంగిని, ఆకలి నలసి యున్న పాటిని, చూచిన నేను నీపై కరుకుదనము చూపలేకున్నాను !"

బొల్లనికి కన్నీరు ఏకధారగా కారెను. ఒకప్రక్కను కోపము వచ్చుచుండెను.

"న న్నేమి చేయుమందువు ?"

"ముందా కత్తి విరిచి దూరముగా పారవేయుము !"

ఆ యాజ్ఞలు కుమార్తె పాటియు భార్య మంగియు చేయుచున్నట్లే యాతనికి తోచెను. వెంటనే అత డా పని చేసెను. మరల గండని వాక్కు వినవచ్చెను.

"దీనితో నా యర్ధరాత్రమున రహస్యమందిరములో ఖడ్గసాక్షిగా చేసిన ప్రతిజ్ఞవలన విడివడినావు !"

ఈ మాట లనుచునే గండ డాలని కెదురుపడెను. అప్రయత్నముగా నాతడు గండనిపైకి లంఘింప కాలు కదల్చెను. కాని గండని యాకారము పరమశాంతముగా

ధైర్యముతో నచలముగా నున్నది. అది చూడగనే లేచుచున్న బొల్లని కాళ్ళు భూమిలోనికి దిగబడిపోయెను.

గండడు ఆదరముతో నాతని గౌగలించుకొనెను. బొల్లనికిని చిన్ననాటి ప్రేమ యొక్కసారిగ నుద్బుద్ధమైనది. ఆతడు పిల్లివలె గండని ప్రేమను లొంగిపోయి బావురుమని ఏడ్వసాగెను. ఏడుపు తగ్గినతర్వాత పాటిసంగతియు మంగిసంగతియు ఎన్నియో ప్రశ్న లాతడు వేసెను. నిశాచరయోగి వెంటనంటిన రాత్రి వారి యింటి యొద్ద జరిగినది గండడు కొంత యాతనికి చెప్పెను. అప్పుడు పాటికి వచ్చిన జ్వరము నెమ్మదించినదని తాను ఆతర్వాత తెలిసికొనిన వార్తకూడ ఆతడు చెప్పెను.

బొల్లనికి గండని సర్వజ్ఞత ఎరిగినంతనే యాశ్చర్య మయ్యెను. పరమరహస్య ముగా తాము చేసికొనిన ప్రతిజ్ఞ లెట్లు తెలిసినవి? తమలో నెవ్వైన తిరిగిపోయిరా?

ఆ పిమ్మట గండడు బొల్లని తనవెంట బయలుదేరు మని చెప్పి తన పరివారము నను గూడ వెంటరమ్మని యాజ్ఞాపించెను.

ఆనాటి యర్ధరాత్రసమయమునను గండడు బొల్లని వెంట గొనిపోయి సమీప మున నే కల కాకతీయస్కంధావారమున అంబదేవుని ముందు నిలువబెట్టెను.

అంబదేవుని సేనలు నిద్రించుచున్నవి. కాని యాత డుమ్మత్తుడై యుండెను. ఆతనిముం దెన్నియో పత్రము లున్నవి. పెద్దపటమును ఉన్నది.

బొల్లడు నమస్కరించి నిలుచుండగనే, అంబదేవుడు ఆ పటమును బొల్లనికి చూపి యెన్నియో ప్రశ్నలు వేసెను. త న్నాతడు బంధితునిగా గాక నిజసేవకునివలె చూచుచుండుట బొల్లని కాశ్చర్య మైనది. ఆతడును తడవుకొనకుండగ నా పరిసరము లన్నియు వివరించి చెప్పసాగెను.

"ఎలువపల్లి చోడ డెక్కడ? అతని పరివార మెంత? కేశవదేవుడు? అతని పరివారము? సోమిదేవుడు? అల్లుగంగు? మల్లికార్జునుడు? దామోదరుడు? నాగ దేవుడు?"

ప్రశ్నల కన్నిటికి బొల్లడు ప్రత్యుత్తరము లిచ్చెను. కొంతవడికి అంబదేవుడు గండని సంబోధించెను:

"బొల్ల డిచ్చిన యుత్తరములు నిజము లని రేపు ధ్రువమైనచో నీమనవి విచా రింతుము. అంతవఱకు నీతని దృఢముగా బంధింపుడు!"

## ౪౦

కొప్పెరుంజింగడు కన్నులు తెరచి చూచునప్పటికి తా నొక చక్కని పటకుటీరమున సుఖశయ్యపై నున్నట్లు తెలిసికొనెను. అతని యిద్దరు రాణులును ఎదుట సుఖాసన ములపై నుపవిష్టలై యుండిరి. ఆతడు తన కన్నులే నమ్మలేకపోయెను.

"నేను ఏలోకములో నున్నాను ? వశిష్ఠగోదావరిలో చివర గుటక వేయుచునే పైకి లేచి, ప్రాణములు నిలుపుకొనుటకు అప్రయత్నముగా, అంతవరకు నాతో యుద్ధము చేయుచున్న యాశ్వికయోధుని కంఠమునే ఊతగా కౌగలించుకొంటిని. ఆ యోధు డిప్పు డేమైనాడు ?— నే నిప్పుడు వీరస్వర్గములోనే ఉన్నానా ? అయ్యో ! నీటిలో మునిగి దుర్మరణము పొందిన నాకు వీరస్వర్గముకూడ ప్రాప్తించునా ?— కాక నేను కలగనుచున్నానా ?— లేక జన్నిగతో యుద్ధమును, ఏకాదశీవ్రతమహోత్సవములు, ఊరుభంగ ప్రదర్శనము, కనకసభాపతి పూజాభంగము, అవియే స్వప్నములా? వీరు నిజముగా నా రాణులే ! ఎవరో పుణ్యాత్ములు గోదావరిలో మునిగిపోవుచున్న నన్ను ఒడ్డుకు చేర్చియుందురా ?— కాని,— కాని,— కాని,—"

ఈ తలపు లన్నియు నాతడు కన్నులు తెరచిన యుత్తరక్షణముననే ఒక్క త్రుటికాలములో అతని మనస్సున విద్యుద్వేగముతో ప్రసరించినవి. అతడు కన్నులు తెరచుట చూచి, అంతవరకును మిక్కిలి భయాందోళనములు పడుచున్న యాతని రాణు లిద్దరు లేచి దగ్గరకు వచ్చి ఏమి కావలె నని ప్రశ్నించిరి.

తన కేమి కావలెను ? మిక్కిలి నీరసముగా నున్నాడు. అతనికా క్రిందటిదిన మంతయు నాహారము లేదు. ఆపైన గాఢపరిశ్రమతో నలసిపోయెను. నోటివెంట మాటకూడ వచ్చుట లేదు. కాని అతని మనస్సుమాత్రము చక్కగ పనిచేయు చున్నది. అప్పటికి సూర్యోదయమై చాలసే పయిన ట్లున్నది. ద్వాదశిపారణకు వేళ యతిక్రమించుచున్న దని యాతనికి తోచినది. కనకసభాపతి ప్రసాద మాతడు ఇప్పుడు పారణ చేయవలె. అతికష్టముమీద నాతడు నోరు పెకల్చుకొని 'ప్రసాదము' అనగలిగెను.

వెంటనే అతని రాణులు ఇద్దరు నాతనిచే ముఖశౌచము చేయించి, పాణిపాదములు జలముతో తుడిచి అద్ది, ముఖమున విభూతిరేఖలు తీర్చి, ఒక కొమ్ము చెంబుతో గోక్షీరము నాతని యంగిట నుంచిరి. దానితో నాతనికి కొంచెము సత్తువ వచ్చినది.

మరుక్షణమున నాతనికి సర్వము నవగతమైనది. అతని రాణులు తనయందు ఎంత ప్రేమగలవారైనను, స్వయముగా నెన్నడు నుపచారములు చేసినవారు కారు. అన్నియు దాసదాసీజనములచేతనే చేయించువారు. అట్టివా రీనాడు ఉపచారములు చేసిరి. ఆ చేసినవి స్వల్పమైనవే. అయినను వా రవి సరిగా చేయుట చేతకాక చేసిరి. వారు పనిచేయుట నేర్చినవారు కారు. తాను తన పత్నులతో కూడ శత్రువుల చేజిక్కినమాట ధ్రువము. అయితే ఆశత్రువు అంతఃపురగౌరవము దూషించు దుర్మార్గుడు మాత్రము కాదు !

విషయము తెలిసి పోయినది. ఇక తన పరాజయవార్త ప్రత్యక్షముగా అడిగి తెలిసికొను టేల ? అందుకాతనికి ధైర్యము చాలలేదు. అంతలో నాతడు త్రావిన పాలవలన వచ్చిన శక్తితోపాటు అతనికొక విధమగు మత్తువచ్చినది. మరల నాతడు కన్నులు మూసెను. మరల రాణులు భయవిహ్వలులై యాతని కనిపెట్టియుండిరి.

*　　*　　*　　*　　*

కొంచెము హెచ్చుతగ్గుగా ఆసమయముననే, కొప్పెరుజింగనితో జలయుద్ధము చేసిన ఆశ్వికయోధుడును మరియొక పటకుటీరములో శయ్యపై పవ్వళించు,

యుండి కన్నులం దెరచెను. ఆ పటకుటీరము చిత్రవర్ణపటచిత్రితమై స్వావిధముల కళకళలాడుచుండెను. నలుగురు పరిచారకులు దీనమైన చూపులతో ఆతని కెప్పుడు స్మృతివచ్చునో యని వ్యాకులులై నిరీక్షించుచుండిరి. ఆతడు కనులు తెరచినదే తడవుగా వారు సూక్ష్మముగా నాతనికి సుఖశౌచము చేయించి, తేనెతో కలిపిన గోక్షీరము త్రావించిరి! ఆతడు తన పరిచారకులను గుర్తించినంతనే తన్ను గోదావరిలో మునిగి పోవుచుండ తన మిత్రు లుద్ధరించిరని తెలిసికొనెను.

అంతలో తాను గోదావరిలో మునిగిపోవుచు చివరిక్షణమున అప్రయత్నముగ తన శత్రువగు కొప్పెరుంజింగని కంఠాశ్లేషము చేసికొన్నమాట ఆతని మనస్సున కప్పుడు స్ఫురించినది. ఆ యోధుని కా తలపుతో పెదవులపై చిరునవ్వు చిందులాడెను. అది చూచి యాతని పరిజనుల ముఖములును విప్పారినవి. ఆ యోధుడు మరల కన్నులం మూసెను.

* * * * *

ఈ వార్త శీఘ్రముగనే పరిజనులు జన్నిగకు తెలియజేసిరి. ఆయోధు లిద్దరు నిప్పు డున్నది వాసిష్ఠగోదావరికి తూర్పుతీరముననే. మొత్తముమీద కొప్పెరుంజింగడు సిద్ధ సంకల్పుడే యనవలెను. అతడు రెండు రంగములలో సంపూర్ణముగా పరాభూతు డయ్యెను. ఐననేమి? ఆత డానాడు వసిష్ఠగోదావరిని తరింప సంకల్పించినాడు. ద్వాదశి గడియలు రాగానే ఆతడు నిజముగా గోదావరీ తరణము చేసినాడు. ఎట్లైననేమి! నీటిలో మునిగి ప్రాణావశిష్టుడైయుండ నాత డావలియొడ్డు కారాత్రియే చేర్చబడి యుండెను.

ఆ యోధు లున్న ప్రదేశము అక్రిందటిదినమున నిర్జనముగా నుండెను. ఆ సమీ పమున చేపలుపట్టి జీవించు కైవర్తుల పల్లెపాలెములు తప్ప మరేమియు లేవు. ఇప్పు డక్కడ పటకుటీరములతో నొక మహాపట్టణమే తీరియున్నది. అదియునొక పద్మాకార మున నున్నది. పద్మవ్యూహమున నిట్లే యుండబోలు! ఆశిబిర మంతటను వరాహధ్వజ ములు మోయుచు ఉల్లాసముతో చిరుగాలి కెగురులాడు చున్నవి. ఆ పద్మాకార స్కంధావారమున కర్ణికాస్థానములో విశాలమై మనోజ్ఞ చిత్రపటచిత్రితమై చీనాం శుక వినిర్మితమగు నొక పటమందిర మున్నది. అందులో నిప్పుడు శ్రీరుద్రదేవమహారాజు కొలువుండెను. శ్రీరుద్రదేవ మహారాజే! అవును. శ్రీరుద్రదేవ మహారాజే! శ్రీ రుద్ర దేవ మహారాజునకే ఆ పద్మవ్యూహమం దెల్లెడ జయజయనివాదములు చెలరేగు చుండెను.

అప్పు డక్కడికి శ్రీరుద్రదేవమహారాజులు వేంచేసియుండుట జన్నిగదేవునకే ఆశ్చర్యమైనది. వారు వత్తురను వార్త యాతనికి రాలేదు. "మహారాజు లెంతసాహ సము చేసిరి! ఈవల రెండు మహాయుద్ధములం గెలుపోటములతో సాగుచున్న సమయము ననే మహారాజులు స్వయముగా ఆ రణరంగముల కంత సమీపభూమిలోనికి వచ్చుట ఎంత ప్రమాదకరము! ఆయుద్ధములలో ఓటమి సంభవించి యుండినచో మహారాజుల కెట్టి యపాయము దాపురించి యుండెడిదో కదా! అయితే శ్రీశైలమల్లికార్జునుని

ప్రసాదముచే సర్వము ననుకూలమైనది. శ్రీగిరికి యాత్రకేయు భక్తులకు అనువుగా సోపానములు కట్టింతును!" ఇట్లు జన్నిగ తలంచి మ్రొక్కుకొనెను.

శ్రీరుద్రదేవ మహారాజులు దక్షవాటి భీమేశ్వరుని దర్శించి ఎంతకాలమోయినది. వివాహమైన క్రొత్తలో వీరభద్రేశ్వరునితో గలసి యామె యా మహాలింగమును దర్శించి యుండెను. అపిమ్మట కొద్ది కాలమునకే ఆమె గర్భమున ముమ్మడమ్మ పడెను. ఇప్పుడామెకు తన్ను వీరభద్రేశ్వరులు చేసిన మోసమే యా దేవునకు నివేదింప నిచ్ఛ జనించెనో, కాక ఆ గోదావరీపావనపరిపూతములైన యా ప్రాంతపు పుణ్యక్షేత్రములు దర్శించి రావలెనను కాంక్ష జనించెనో! కుబ్జవిష్ణువర్ధనచాళుక్యుడు వేంగిరాజ్యమునకు స్వతంత్రప్రభువైన కాలమునకు కొంచెము తర్వాతి కాలమునుండియే ఆంధ్రరాజులకు దాక్షారామభీమేశ్వరుడు కులదైవమైనాడు. ఆంధ్రరాజ్యము పరిపాలించువారును, ఆంధ్రరాజ్యము జయింపదలచిన యన్యరాజులును తమ దృష్టి భీమేశ్వరునిపై పారించుచుండిరి. ఆంధ్రయావద్రాజ్యమునకు నూతనముగా నభిషిక్తులైన శ్రీరుద్రదేవ మహారాజులకుకూడ నందుచే భీమేశ్వరుని జేరవలెనను సంకల్పము కలిగినదేమో! ఏమైననేమి? ఆమె గణపతిదేవుల యనుజ్ఞయు నాశీర్వచనమును పొంది బయలుదేరినది. అట్లు కదలుటకు ముందు ఆమె రుయ్యమ్మకు విశేషాధికారము లిచ్చి యిటు కదలినది. దాని ఫలితముల నామె దూరమాలోచించినట్లు తోచదు.

జన్నిగసేనలు కొప్పెరుంజింగని సేనలను తాకి యుద్ధము చేయునప్పుడే రాజమహేంద్రవరమునుండి నైదువందల నావలతో నొక సైన్యము వచ్చుటకు నిశ్చితమైనది గదా! ఆ నావలకును సేనకును శ్రీరుద్రదేవమహారాజే యాధిపత్యము వహించెను. ఏకాదశినాడు పగలెల్ల ఆ నావలన్నియు నరసాపురమునకు కొంచెము ఎగువనుగల గోదావరి మలుపులో దాగుకొని యుండెను. సాధారణముగా నాదారిన వచ్చుచు బోవుచుండు నావల రాకపోకలను వారా వెంటనే కట్టుపడ జేసిరి. ఆవల యుద్ధము సాగుచున్నందున వాని రాకపోకలు కట్టుపడుట ఎట్టి సంశయమును కలిగింపలేదు. మహారాజులతో నిన్ని నావలు తమకింత సమీపమునకు వచ్చియున్న వార్త రహస్యముగా నుండిపోయెను. అది కాడవసేనలకు పొక్కలేదు. ఎప్పటికప్పుడు యుద్ధగతిమాత్రము శ్రీరుద్రదేవ మహారాజులకు తెలియవచ్చుచున్నది.

ఏకాదశినాడు సూర్యాస్తమయ మగుచుండగా నా దాగిననావ లొక్కసారిగా నరసాపురమువైపుకు బయలుదేరినవి. సరిగా వానికి వాయుసంచార మనుకూలముగా నున్నది.

వానితో పాటుగనే, అంబదేవుడు పంపియుండిన పదివేల యాశ్వికదళ మొకటి కూడ సంకేతితప్రకారమున భూమిమీద బయలుదేరినది. ఈ దళము ముఖ్యముగా మూడు పనులు నిర్వర్తింపవలసి యుండెను. జన్నిగసేనలు చిక్కులోనున్నచో వానికి సహాయ మగుటకు మూలబలమువలె నుండవలెను! జన్నిగసేనలు జయించుచున్నచో పారిపోవుచున్న శత్రుబలములను అడ్డగట్టి దిగ్బంధము చేయవలెను! మరియు ప్రక్కనున్న నదిపై వచ్చుచున్న నావలను అందలి సేనలను తోడునీడగా నుండి కనిపెట్టుచు, వానికి సర్వసహాయములు చేయవలెను.

కొప్పెరుంజింగడు తన సేనలను గోదావరి దాటించుటకై బలవంతముగా నైదు వందల తరులను సేకరించి నరసాపురము రేవున నిలిపియుండెనుగదా! చీకటి పడునప్పటికి ఆ నదీతరులను వానికి కాపున్న సేనలను ఆకస్మికముగా రుద్రమ నౌకలును, నేలపై వచ్చుచున్న ఆశ్వికదళమును కలసి ఒక్కసారి చుట్టుముట్టెను. రక్షకభటులందరు నరికివేయబడిరి. ఆ నదీతరులం నడపువారు యుద్ధవీరులు కారు. వారు నదిపై నిద్దరికుండి యద్దరికి మనుష్యులను దాటించు పేద పల్లె కాపులు. వారిని ఎవరు భయపెట్టిన వారికి వినయవిధేయతలు చూపి దాసులగు భీరువులు. కాడవసేనలను పూర్వము భయపడి యక్కడికి వచ్చియుండిరి. ఇప్పుడు రుద్రదేవు సేనలను చూచి వానికి లొంగిపోయి వాని యాజ్ఞలకు బద్ధులైరి. పగలెల్ల కాకతీయనదీనౌకలు దాగియున్న మలుపులోనికి ఇప్పుడవి యన్నియు తరలింపబడెను. ఈ పను లన్నియు జరుగుటకు రెండు గడియలుకూడ పట్టలేదు.

ఆవల జన్నిగ సేనలు జయోన్ముఖముగా నున్నవి. కాడవసేనలు సేకరించిన తరులన్నియు రుద్రదేవు వశమైనవి. ఇక భయములేదు. ఆ ధైర్యముతో నా యాశ్వికదళము సాహసించి కొప్పెరుంజింగడు పూజాదికములు నిర్వర్తించుచున్న శిబిరము నెదురుగా తాకెను.

ఆ కాలమున పుష్యమాసచంద్రుడు వెన్నెలలు కాయుచు చలిగాలిని మరింత చలువచేయుచున్నాడు. యుద్ధపరిశ్రమలో నున్న యా యాశ్వికదళమున కది సుఖమే కలిగించుచుండెను.

అట్లు వచ్చిన యాశ్వికదళముల కధిపతియే శిబిరమును పట్టుకొని, కొప్పెరుంజింగని వాసిష్ఠగోదావరిలోనికి వెంబడించి యుద్ధముచేయుచు నాతనితోపాటు గోదావరిలోనికి కొట్టుకొనిపోయెను. అది యుపలక్షించిన యా యోధుని పరివారము ఏనుగుల సహాయముతో ఆవీరుల నిదరిని కొనయూపిరితో నుండ నీటిలో నుండి పైకిలాగి చికిత్సలు చేయించిరి.

వారిని తీసి వారి ముక్కులయొద్ద వ్రేళ్ళుపెట్టి చూడగా శ్వాస లాడుటలేదు. వారి రొమ్ములుగాని ప్రక్కలుగాని ఏమాత్రము నెగురుట లేదు. వారు సామాన్యభటులైనచో నంతటితో నాశలువదలి చనిపోయిరని విడిచిపెట్టి యుండెడివారే. కాని వారు సామాన్యులా? ఒకడు సాహిత్యరత్నాకరుడు, భరతమల్లుడు, ఖడ్గమల్లుడు, నిశ్శంకమల్లుడు, వాల్ బలప్పెరుమాళ్, సాక్షాత్తు రాజసింహుడే! మరి రెండవయోధుడెవరో? అతని పే రెవరు నెరిగినట్లు లేదు. అతడు ఎక్కిన గుర్రపు రంగును బట్టి 'పాలయోధు'డని పేరుపడినాడు. ఆ గుర్రము నిగనిగలాడెడి పాలరంగు గలది. అది మాటలాడ లేకున్నను మనుష్యుల కున్న బుద్ధిబలము ఉన్నదానివలె నున్నది?

సేనావైద్యులు వచ్చిరి. నాడి చూచిరి. నాడు లేమాత్రము కదలుట లేదు. చలికి వారి దేహములు బిగిసికొనిపోయినవి. అట్లున్న యా దేహములకుగూడ మృత్యులక్షణమైన చలువ—నీరు కారుచున్న ట్లుండు నసహ్యకర మగు చలువ—యావేశింపలేదు. దానితో వారికి కొంచె మాశ కలిగినది. వెంటనే వారు ఆశవాకృతుల కాలు చేతులు పైకి క్రిందికి నెమ్మదిగా నొత్తసాగిరి. దానితో వారి కుక్షులలో పేరుకొన్న

గోదావరినీరు నెమ్మదిగా బయటికి రాసాగెను. కొంతసేపు పట్లు సాధన చేయగా, నాడు లాడుచున్నట్లు తోచెను. పిమ్మట రొమ్ము ప్రక్కలు లేచి పడసాగెను. ముక్కునొద్ద శ్వాస యాడుచున్నట్లు గుర్తు తగిలెను.

ఆ వెంటనే వైద్యులు వారి దేహములు వెచ్చగా నుండునట్లు చేసి, రెండు ప్రత్యేకపటకుటీరములకు చేర్పించియుండిరి. జన్నిగ కా వార్తలు తెలిసి స్వయముగా వచ్చి వారి నిద్రకు భద్రమగు నేర్పాటు లన్నియు జేయించి, మిగిలియున్న రణకార్యములు నిర్వర్తింప బోయెను. యుద్ధము గెలిచిన పిమ్మట చేయవలసిన పనులు యుద్ధాత్పూర్వము చేయు సన్నాహములనుగూడ నొకవిధముగా మించియుండును. తెల్లవారు వరకు జన్నిగ యా పనులయందే నిమగ్నుడై యుండెను. తెల్లవారిన తర్వాతనే గాని, జన్నిగకు శ్రీరుద్రదేవమహారాజులే స్వయముగా నదీనావలతో వచ్చినట్లు తెలియలేదు.

కొప్పెరుంజింగని సేనలో ఆనాడు యుద్ధనిహతులైనవారే ముప్పదివేలమంది వీరు లుండిరి. మిగిలిన సేనలో పారిపోగలిగినవారు బహుస్వల్పసంఖ్యాకులు. ఆ సేనలు కొప్పెరుంజింగని యాజ్ఞల ప్రకారము వాసిష్ఠగోదావరి నంటి యుత్తరదిక్కుగా వెనుదీసిపోవుట సాధ్యపడలేదు. ఒక కొంత వైపున జన్నిగసేనలును, మిగిలిన భాగమున 'పాలవీరుని' సేనలును వారి నవరోధించెను. ఆ సేనల నాయకులకు కొప్పెరుంజింగని యంతఃపురజనముకూడ శత్రువశమైన దని తెలిసినది. దానితో వారికి ధైర్యము సడలినది. కొప్పెరుంజింగడే సంకేతప్రకారము గోదావరి దాటలేక పోయె ననియు ఆ కాడవసేనానులకు తెలిసినది. కొప్పెరుంజింగదేవుడు పూజామధ్యమున ఆడావిడిగా లేచి గజముపై వసిష్ఠగోదావరి దాటుట కుంకించినట్లు వారికి తెలియవచ్చినది. ఈ స్థితిగతులలో తమ ప్రభువు సురక్షితముగా నుండుట యసాధ్యము. కాడవసేనానులకు నిస్పృహ యావేశించెను. ఎదిరించి లాభములేదు. అందులో కానిదూరదేశము! వారు ముప్పదివేల సేనతో జన్నిగకు లొంగిపోయి శస్త్రములు విసర్జించిరి.

యోధులు కాక, ఆ సేనతో పరిచారకులుగను, వినోదకులుగను, కవులుగను, పండితులుగను, నటులుగను, ఋత్విక్కులుగను ముప్పదివేలమంది వచ్చియుండిరి. వారును నిస్తబ్ధులై యందరు లొంగిపోయిరి.

ఇంతటి సేనను నిరాయుధ మొనర్చుట సామాన్యపు పని కాదు. అయితే ఒక దిక్కున వసిష్ఠగోదావరీప్రవాహ ముండుటచే కాకతీయసేనలకు నాల్గవవంతు పని తగ్గెను. మిగిలిన మూడు దిక్కులే ప్రధానముగా కాపు కాయవలసియుండెను.

*   *   *   *

ఇప్పుడు శ్రీ రుద్రదేవ మహారాజులు పేరోలగ ముండి ముందు జన్నిగదేవుని వలన యుద్ధక్రమము నివేదిక యాలకించిరి. ఆ నివేదికతోపాటు అతడు విజయదశమినాడు పొందిన జమ్మితో కొప్పెరుంజింగనామాంకితపత్రముకూడ మహారాజులకు సమర్పించుకొనెను.

ఆ పిమ్మట కోరంగి నావధ్యక్షుడు నౌకాయుద్ధవిశేషములు నివేదించుకొనెను. చోళనౌకలు సర్వనాశన మైనవి. ఏవో పాతికముప్పదిమాత్రము తప్పించుకొనినవి. అవికూడ యుద్ధము చేయ నాంధ్రతీరమునకు మరల జన్మకు రాలేవు.

అంతట శ్రీ రుద్రదేవమహారాజు ఆ యుద్ధములలో ధైర్యసాహసములు ప్రదర్శించి ఆంధ్రప్రభువునకు జయము చేకూర్చిన యోధుల కెల్లరకు విరివిగా బహుమానములు పంచిపెట్టెను.

ఆ సాయంత్రమునకు రెండు పనులు మిగిలిపోయెను. కొప్పెరుంజింగని విచారించి యాతని శిక్షింపవలెను. ఇక నాతని శిబిరము పట్టుకొని, గజముతో గోదావరిలో చొరబారిన కొప్పెరుంజింగని తన యశ్వముతో గోదావరీజలములోనికి వెంటనంటి, సాహసముతో జలయుద్ధ మొనర్చిన యాశ్వికయోధుని బహూకరింపవలెను. ఆతని పేరు తెలియనేలేదు. ఆతడు తరులను చుట్టుముట్టుటలోను శిబిరము శోధించుటలోను చూపిన నేర్పు అమోఘము! కాని కొప్పెరుంజింగని గాని, యా యాశ్వికయోధుని గాని, మహారాజులముందు పెట్టుట కింకను యోగ్యమైన స్థితిలో వారిద్దరును లేరు. ఇద్దరికిని ప్రాణాపాయము తప్పిపోలేదు.

ఆ యాశ్వికయోధుడు ఎక్కిన పొలగుర్రమునుగూర్చి పరిజనము లెన్నియో విశేషములు చెప్పిరి. దాని రంగు, దాని తీరు, దాని ఠీవి దాని సులక్షణములు నెన్నియైన వారు వర్ణించిరి. అంతేకాదు! ఆ మహాప్రవాహములో తనపైనుండి యోధుడు పడిపోయినను అది యొడ్డుకు పారిపోయి రాలేదు. పెద్దగా హేష చేయుచు నీటిలో మునిగిపోవుచున్న తన ప్రభువు చుట్టు నది ప్రదక్షిణ మొనర్చుచుండెనట! దాని హేషాశబ్దమును వినియే పరిజనము ఆ సమీపమునకు వచ్చి యా యోధుల నిద్దర నీటిలోనుండి యుద్ధరించిరట. ఆ యాశ్వికుని తీరమునకు చేర్చుచుండ నదియు తీరము చేరెను. అప్పటి కదియు సొమ్మసిల్లిన ట్లయ్యెను. తెల్లవారిన తర్వాత నది తేరుకొనినది గాని, లాయములో నిలుచుట లేదు. తన ప్రభువును చూపింపుమని కోరుచున్నది కాబోలు! పరిజనుల కా యపరాహ్ణము వరకు నా యూహ తట్టలేదు. అప్పుడు దానిని యజమానుని గుడారముముందు నిలువబెట్టి నిద్రించుచున్న యాతని జూపించిరి. దాని కాతడు జీవించి యున్నట్లు నిశ్చయము కాలేదు. హేష చేయదు. మేత ముట్టుట లేదు. ఆ గుడారమునొద్దనుండి ఎంత లాగినను అది కదలుట లేదు. దాని నచ్చటనే వదలిరి. దాని దిగులు చూచినవారికి కన్నుల నీరు వచ్చుచున్నది.

ఈ వృత్తాంతము వినినంతనే శ్రీ రుద్రదేవమహారాజులు ఆ యాజానేయమును చూడవలెనని కోరిక కలిగినదని సెలవిచ్చిరి. భూసురాశీర్వాదములతో నంతట నా సభ ముగిసెను. శ్రీ రుద్రదేవమహారాజు సపరివారముగా నా యోధుని పటకుటీరము నొద్దకు బయలుదేరెను. కొందరు బ్రాహ్మణులుకూడ వెంట నంటిరి. అందులో వెర్రిగాలను నగ్రహారమున కగ్రణి యగు కేతన యను ఛాందసకవియు బయలుదేరెను.

ఆ యశ్వము మహారాజుల రాక చూడగనే వినయవిధేయతలు కనబరచెను. దాని ముఖభంగి చూడగా రుద్రమకు తనతో నది మాటలాడుచున్నట్లే పొడకట్టెను.

పరిజనులు చెప్పినదానికంటె ప్రత్యక్షముగా చూడగా నా యశ్వాచార్య లామెకు అద్భుతములుగా కనిపించెను.

చేరన బ్రాహ్మణులు చెప్పిరి. 'మహారాజా, ఇది పూర్వజన్మలో నా యోధునికి ఆప్తమిత్రమై యుండవలెను. దీనికి తాను పూర్వజన్మమున మనుష్యుడనై యుంటినను జ్ఞానముకూడ ఉండి యుండవలెను!'

శ్రీ రుద్రదేవ మహారాజులు చిరునవ్వు నవ్వుచు నందరను ప్రశ్నించిరి.

"ఇట్టి యశ్వమునకు పూర్వచరిత్ర యుండవలెను. అది ఎరిగినవారొక్కరును ఇక్కడ లేరా?"

వెర్రిరాలను నగ్రహారమున కగ్రణి మహారాజుల నాశీర్వదించి మాట్లాడెను.

'మహారాజా, ఈ యశ్వము సర్వవిధముల విశిష్టమైనది. ఇది నిర్వచనోత్తర రామాయణమున గ్రంథస్థమైన యశ్వము!'

'ఎట్లెట్లు?'

కేతన మాగాడక యీ పద్యము వినిపించెను. అత డాపద్యము చదువుచుండగా వేదసూక్తము చదువుచున్నట్లే రుద్రమకు తోచెను. ఏమి యీ కంఠ వైచిత్రి!

"శృంగారంబు నలంగ దేమియును బ్రస్వేదాంబురశ్రేణి లే,
దంగంబుల్ మెఱుగేద వించుకయు, మాహారాష్ట్రసామంతు సా
రంగుం దోలి తురంగముం గొనిన సంగ్రామంబునం దృప్తస
ప్తాంగస్ఫారయశుండు మన్మవిభుపంపై చన్న సైన్యంబునకా."

పద్యము పూర్తి యయ్యెను. ఒక్కసారిగా శ్రీరుద్రదేవమహారాజులో మార్పువచ్చెను. మహారాజు సంతోషించినట్లు లేదు! ఆ యశ్వము నాపై పరీక్షింప లేదు. పటకుటీరమున ప్రమాదావస్థలో నున్న యాయోధుని బరామర్శింప లేదు. ఆ కావ్యకర్త యొవరిని నైన నడుగలేదు.

సపరివారముగా శ్రీరుద్రదేవమహారాజులు గిర్రున తమ శిబిరమునకు తిరిగి వెడలిపోయిరి.

:

౪౧

"శ్రీగాస్తాం మనుమక్షితీశ్వరభుజాస్తంభే జగన్మండల
ప్రాసాదస్థిరభారభాజి దధతీ సా సాలభంజీశ్రియమ్
శుండాలోత్తమగండభిత్తిషు మద వ్యాసంగవశ్యాత్మనామ్
యా ముక్తేజయతేతరాం మధులిహామానందసాంద్రా స్థితిః

తిక్కనామాత్యుడు.

వసిష్ఠగోదావరీతీరమున శ్రీరుద్రదేవమహారాజు ఐదు దినము లుండెను. ప్రతి దినమును గొంటూరునుండియు మోసలపురమునుండియు రావలసిన వార్తల కామె నిరీక్షించుచుండెను గాని యవి రాలేదు.

మహారాజు లక్కడ విడిసియున్న వార్త చుట్టుపట్టుల శీఘ్రముగా వ్యాపించెను. పలువురు సామంతులును పెద్దలును ప్రజలును రాజదర్శనమునకై శిబిరమున మూగసాగిరి. వారు చెప్పుకొనుచున్న కష్టసుఖములన్నియు మహారాజాలకించెను. దుష్టులగు పలువురు ప్రభువుల నామె తొలగించి యా యధికారములు క్రొత్తవారి కిచ్చెను. కాలువలు చెరువులు బాటలు వనములు రేవులు ఇత్యాదులగు నెన్నియో విషయములు విచారించి యుక్తమగు నాజ్ఞలు ప్రవర్తింపజేసెను. మహారాజులను ప్రజలు వేనోళ్ళ పొగుడుచు సెలవు తీసికొనుచుండిరి.

అన్నిటికంటె నెక్కువగా నా చుట్టుపట్టుల గ్రామకరణములు ప్రజానీకమును పెట్టుచున్న బాధలు మహారాజుల కవగతము లయ్యెను. ప్రజానీకమే కాదు. జన్నిగదేవ సేనాచలనమునకు గొంటూరువైపులనుండి నరసాపురమునకు వచ్చుచుండ వారు కల్పించిన యిక్కట్లు నివేదించుకొనెను. ఎదురుగా వా రేమియు జేయరు; వినయ విధేయతలతో ప్రవర్తింతురు. చాటునకు పోయి గ్రామీణుల బెదరింతురు. ఎప్పుడో వచ్చి వెంటనే పోవు మహాప్రభువులపైకంటె నిత్యసన్నిహితులైన గ్రామాధికారులన్న ప్రజల కెక్కువ భయము!

కాని యింతమంది కరణములను ఒక్కసారి తొలగించు టెట్లు? తొలగించిన వ్యవహారము సాగు టెట్లు? రుద్రమ తీవ్రముగా నాలోచించెను. గ్రామవ్యవహార పత్రములన్నియు నికముందు గ్రామపాలకు లగు రెడ్ల గృహములందే ఉండునట్లు కట్టడిచేసి, ప్రతిగ్రామమునకును వెనుక నున్న కరణమునకు తోడుగా త్వరలో మరియొక కరణమునుగూడ నియమింతుమని సెలవిచ్చిరి. రెడ్లును కరణములతో నెన్నియో బాధలు పడుచున్నందున దీనికి వారును సంతోషముతో నంగీకరించిరి. ఓరుగల్లు చేరినవెంటనే కరణపాఠశాలలో నేర్చుకొన్నవారిలో నిక్కడికి వచ్చుటకు ఇష్టమున్న వారిని, తోడి కరణములుగా నియమింపవలెనని రుద్రమహారాజు లుద్దేశించిరి. ఈ యాజ్ఞలు గొంటూరునుండి దక్షవాటివరకును ప్రవర్తింపజేయ నుద్దేశించిరి.

ఆ పుష్యమాసపు వెన్నెలరాత్రు లామె యచ్చట గడపెను. కాని యవి యేమాత్రమును ఆమె హృదయతాపము నుపశమింపజేయలేకపోయెను.

కృష్ణపక్షమున విదియనాడు ఆమె దక్షారామమునకు బయలుదేరెను. దారిపొడుగునను, మహారాజులయొద్దకు వచ్చి కష్టసుఖములు నివేదించుకొను పెద్దలను పిన్నలను చూచుచు వారితో సంభాషించుచుండుటతో రుద్రమ్మకు రాత్రింబవళ్లు తీరిక లేదు. మహారాజులకును ప్రజలకును పరస్పరానుబంధము దృఢమయ్యెను. ఈ నూతనానుబంధములు ఆమె హృదయమున కొక విచిత్రమగు తృప్తిని శాంతిని కలిగించుచుండెను.

అట్లు పది దినములు ప్రయాణములు చేసి, యామె దక్షవాటి చేరుకొనెను. ఆనాటి సాయంకాలమే రుద్రమ భీమేశ్వరుని సందర్శించెను. ఆ మహాలింగమును చూచినవెంటనే రుద్రమకు తన తండ్రిని దర్శించినట్లే యానందము కలిగెను. అతడు

ఆంధ్రరాజులకు ఇష్టదైవము. చాళుక్యులకు ఇలువేల్పు. తాను కాకతి రుద్రమ్మ యయ్యు, చాళుక్యుల ఇల్లు మెట్టినది. చాళుక్యుల ఇలువేల్పు తనకును ఇలువేల్పే!

ఆమె యా మహాదేవున కేమి నివేదించుకొన నెంచెనో! పూర్వము తా నక్కడికి వచ్చినప్పుడు తన ప్రక్కను వీరభద్రేశ్వరు లుండిరి. అక్కడ పూజచేయు శివద్విజుడు పూజాసంకల్పమున సపత్నీకు డగు వీరభద్రేశ్వరుల నామమే చెప్పి పూజ చేసెను. ఇప్పు డెట్లు జరుగవలెను?

స్థానికుడగు శివద్విజునకు ఈ సందేహమే కలిగెను. కాబట్టి పూజాసంకల్పము ప్రారంభించి దేశకాల సంకీర్తన మొనరించి యజమాననామము చెప్పబోవుచు తల యెత్తెను. వెంటనే అచ్చట నున్న రాజపురోహితుడు శ్రీరుద్రదేవమహారాజ నామ మందిచ్చెను. పూజ సాగిపోయినదిగాని రుద్రమ మన స్సెక్కడికో పోయిన ట్లున్నది. ఆమె కన్నులు చెమ్మగిల్లినవా? సమీపవర్తుల కనుమానము కలిగినది. భక్తిచే కలిగిన సాత్త్వికభావ మని సరిపెట్టుకొనిరి. వా రేమియు ననలేదు. ఏమందురు? పూజావసానమున మహారాజు తీర్థప్రసాదముల గ్రహించి పుష్కలదక్షిణ లొసంగి భూసు రాశీర్వాదము లొంది పరధ్యానముగా తన శిబిరమునకు వెడలిపోయెను.

అక్కడికి చేరునప్పటికి ఆమెకు రెండు శుభవార్తలు చేరినవి.

జన్నిగ పంపిన భూసేనలు మోసలపుర మైదుదినములు ముట్టడించినవి. మోటుపల్లినుండి త్రిపురాంతకుడు పంపిన నావలును మోసలపట్టణము రేవును అవరోధించెను. ఐదవనాటి కక్కడికి కొప్పెరుంజింగడు నరసాపురమునొద్ద పరాజయము నొంది జన్నిగకు పట్టుబడినవార్త చేరెను. అందుపై ద్విగుణోత్సాహముతో కాకతీయ సేనలు రెండును మోసలపట్టణముపై విజృంభించెను. అక్కడ నున్న కొప్పెరుంజింగని సేనాని లొంగిపోయెను. చోళనావలు చిక్కినవి చిక్కియు, మునిగినవి మునిగియు, పోగా మిగిలినవి శిథిలావస్థలో పారిపోయెను. మరల నవి యంధ్రసముద్రతీరభూమిని అలజడి చేయలేవు!

రెండవశుభవార్త గొంటూరునుండి వచ్చిన విజయవార్త! ఎంతకాలమో యుద్ధము చేసినగాని సాధింపరాని దుష్కర కార్యమును అంబదేవుడు తన సూక్ష్మ బుద్ధితో సులభముగను శీఘ్రముగను సాధించెను. అతనికి అదృష్టముకూడ కలసి వచ్చినది. పరస్పరసమాలోచనములకు పలువురు రహస్యముగా గొంటూరులో సమావేశమై యున్నతరి నిర్లక్షించి, సరిగా నప్పు డాకస్మికముగా నంబదేవుడు గొంటూరుపై మహాసేనతో పడెను. ఎక్కువ ప్రయాస లేకుండ గొంటూరు నతడు పట్టుకొనగల్గెను. అచ్చటి ప్రభువగు నాగదేవుడు యుద్ధములో ప్రాణములు గోల్పోయెను. ఆ చుట్టుపట్టులనుండి యచ్చట సమావిష్టులై యున్న తెలుగుచోడప్రభువు లందరు పట్టువడిరి. ఎఱువమల్లిచోడుడు, కేశవదేవుడు, సోమిదేవుడు, అల్లుగంగు, మల్లికార్జునుడు, దామోదరుడు—వీరందరును చిక్కిరి. వారి నామాంకితము లగు జమ్మిపత్రములుగూడ అంబదేవు డావార్తతో పంపెను. విజయదశమినాడు ఓరుగల్లు చెరసాలనుండి తప్పించుకొనిపోయిన బొల్లడను మైలారుభటుడును చిక్కిపోయెను.

ఈ శుభవార్తలు తెలిసిన వెంటనే వానిని రుద్రమ్మ తన శిబిరమునను దక్షారామమునను ఆ చుట్టుపట్టులను చాటింప బంచి, ఐదురోజు లుత్సవము ప్రకటించెను. దక్షారామపరిసరప్రజ లారాత్రి నిదురింపబోవుసమయమున సరిగా, శ్రీరుద్రదేవమహారాజులు గొంటూరు మోసలపట్టణముల జయించిన ఘోష ఆలకించిరి.

ఆ చాటింపు అవల జరుగుచునే యుండెను. ఆ శబ్ద మొకప్రక్కనుండి చెవుల బడుచునే యుండెను. ఆ సమయముననే ఓరుగల్లునుండి వేగరులు వచ్చి వార్తాపత్రములు మహారాజుల కందిచ్చిరి. విప్పి చూచుకొన నందు ముఖ్యమైనది రుయ్యమ్మ స్వహస్తలిఖితమై యుండెను. ఆ వార్తల సార మిట్లుండెను :

“వృద్ధులును పూజ్యులు నగు మహాప్రధానులు శ్రీమన్ గోవిందనాయకుడును బయ్యనాయకుడును వారి పదవులనుండి విరమించుకొనిరి. మహారాజులు రాజధానిని వదలియున్న తరుణమున రుయ్యమ నచ్చట రాజప్రతినిధిగా నిలిపి పోవుట వారికి సమ్మతముగా నున్నట్లు తోచదు. మరియు పట్టణములో అలజడు లెక్కువగా నున్నవి. భిన్నమతస్థుల పరస్పర కలహములు వారించుట కష్టతరముగా నున్నది. అందులో నొకరిది న్యాయమని నిర్ణయించినచో, ఎదిరివా రది పక్షపాత మని నిందించుచున్నారు. జైనవసతిలో మహాశివరాత్రికి నేమినాథప్రతిష్ఠ చేయ సంకల్పించి రాజకోశమునుండి లక్షసువర్ణము లిప్పింప నర్థించినారు. ఆగ్నేయమునుండి చోళప్రభువును నైరృతినుండి హొయిసల బల్లాలరాజును మన రాజ్యముపై దండెత్తిరా నున్నా రని వార్తపై వార్త వచ్చుచున్నది. దేవగిరివైపున మాత్రము పరమశాంతముగా నున్నది. ఆ యాదవప్రభువు తనపై నెత్తిరా నున్న దేహళిప్రభువుల నెదుర్కొన నుత్తరముగా సేనలతో సాగి పోయెను. కరణపాఠశాలలలో చేరిన యారువేలమంది బ్రాహ్మణులను వ్రాయస వృత్తిలో నారి తేరిరి.”

రుద్రమ్మకు చివరివార్తకు చిరునవ్వు వచ్చెను. తన పెంపుడుకూతు రగు నీ బ్రాహ్మణకన్యకు ఎంత బ్రాహ్మణాభిమానము! ఐనను దీనికి ప్రియుడును పూజ్యుడును సాక్షాద్భగవత్తుల్యుడును, అగు అన్న మంత్రిని ఏమి చేసినదియు నిది వ్రాయలేదు. ఆని యాతని విడిపించియుండదు. ఆ మహామాత్యుడు నిర్దోషి యని మనుమసిద్ధివలననైన నిరూపింపబడునో, లేదో! కాకతి సామ్రాజ్యమును ధ్వంసము చేయబూనిన మనుమసిద్ధి చెప్పునది నమ్మ టెట్లు? అతనికి కొప్పెరుంజింగనిపై నున్న ద్వేషముచే నీయుద్ధములో పాల్గొన్నంతమాత్రమున నాతని నమ్మవచ్చునా? ఇతెడు అంబదేవుని సేనలో చేరి, ఇంత యున్నతపదవి, తన పేరు చెప్పకొనకుండ ఎట్లు సాధించెను? కేతన మాటలచే నా ‘పాలవీరుడు, మనుమసిద్ధి యనుసందేహము తోచిన వెంటనే, రుద్రమ యాయోధుని స్వాతంత్ర్యమును నిరోధించి సేనాపతిత్వము తొలగించి, భటుల కాపులో నుంచెను. తాను చేసినపని నిస్సందేహముగా నుచితమైనది.

అంతలో నేదో యాశాకిరణము రుద్రమ తలపులో భాసించి నట్లయినది. వెంటనే భటుని బిలిచి పాలవీరుని తన సన్నిధికి తెమ్మని యాజ్ఞాపించెను. భటులు పాలవీరుని బంధించి రుద్రమ ఎదుట నిలిపిరి.

'పాలవీరుడు' స్ఫురద్రూపుడై యుండెను. కాని యాతని కింకను బలము పట్టలేదు. అతనికి ముప్పదియైదేండ్లకంటె వయసున్నట్లు లేదు. ఆతని దేహమునం దెల్ల బాహువులు ఒక విశిష్టసంపదతో నలరారుచున్నవి. అవి రెండు కోడెత్రాచులవలె బలమై శక్తిసంపన్నములై యుండి, ఇతడు మహాబాహువు అని చూడగనే అనిపించుచుండెను. అతని యాకారమును ముఖమును మిక్కిలి మనోజ్ఞమైనవి. కన్నులు బహువిశాలమైనవి. కాని యాతని చూపులో కొంచెము జంకో, లౌల్యమో, చాపల్యమో,—ఏదో లోప మున్నది, దాని నిదియని వర్ణింప శక్యముకాదు!

రుద్రదమ్మ యెదుట నిలువబెట్టగనే పాలవీరుడు తల వంచుకొనెను. అతడు రుద్రదేవమహారాజును కన్నెత్తి చూడకయే తన యాజానుబాహువులు రెండును ఒక్కమారు పైకెత్తి శిరమున గదియించి నమస్కరించెను. ఆ బాహువులు రెండు కరికరములవలెనే కలసికొని శోభ కూర్చెను. రక్షకులను పొండని మహారాజు సంజ్ఞచేయగా నావలికి వెళ్ళిపోయిరి. రుద్రమహారాజు ప్రశ్నించుచుండగా నాతడు వినీతుడై యుత్తరము లిచ్చుచుండెను.

"నీ పే రేమి?"

"పాలవీరుడు మహారాజా!"

"ఊరు?"

"విక్రమసింహు అగు తరు శేమని విన్నవించుకొనగలను?"

"నీ వీ సేన కెట్లధిపతి వైతివి?"

"అంబదేవుని యనుగ్రహముచే, మహారాజా!"

"నిన్ను చెరలో నుంచుటకు కారణ మేమో ఎరుగుదువు గదా!"

"తమ అనుగ్రహము, మహారాజా!"

"నీవు అన్నమంత్రికి ఉత్తరములు వ్రాసితివిగదా!"

"లేదు, మహారాజా!"

"తిక్కన సోమయాజులను?"

"వా రెక్కడ నున్నారోకూడ నాకు తెలియదు మహారాజా! ఆ పూజ్యపురుషుడు క్షేమముగా నున్నాడా?"

"మారనకు నీవు వ్రాసిన యుత్తరము జ్ఞాపక మున్నదా?"

"మారన ఎవరు, మహారాజా?"

"మంచిది. నీవు సార్థవాహులద్వారా ఏకశిలానగరములో నెందరు మంత్రీశ్వరుల కుత్తరములు వ్రాసితివో గుర్తున్నదా?"

"ఎప్పుడు మహారాజా?"

"చెప్పెదము. అవి యన్నియు నీకు చూపియే చెప్పెదము. ఏకశిలానగరమున న్న పూర్తిగా... ...!"

"మహాప్రసాదము, మహారాజా !"

"నీవు మున్నెన్నడు చేసినను ఏకాదశినాటి యుద్ధములో చేసిన రాజసేవచే ప్రీతుల మైతిమి. అందుచే నిన్ను కొంత కరుణతో చూడదలంచితిమి. నీవు వర మేమైన కోరు కొన్న నాలోచింతుము !"

"మహారాజులు సంపూర్ణముగా నన్ను విచారించుటయే నేను కోరికొను వరము ! అయినను నేను కోరుకొనున దొకటి యున్నది. ఆ పాలగుఱ్ఱము నాతో బాటు చెరలో నుంచవేడెదను."

రుద్రమ యాశ్చర్యపడెను.

"తిర్యగ్జంతు వగు నా గుఱ్ఱముపై నీకంత యభిమాన మేల?"

"పూర్వజన్మాను బంధము! అదినాకు తల్లి! నేను దాని బిడ్డను—"

పాలవీరుని కంఠము గద్గద మయ్యెను. కన్నుల నీరు గిఱ్ఱున తిరిగెను.

"నీ కోరిక తీర్చెదము!"

ఇట్లనుచు నాతని దీసికొనిపోవ భటుల కాజ్ఞాపింప వా రట్లే చేసిరి!

* * * * * *

కొప్పెరుంజింగడును స్వస్థు డయ్యెను. అతని విచారణ మరియొకవిధముగా నా మరునాడే జరిగెను.

రుద్రదేవమహారాజు దక్షారామభీమేశ్వరుని యాలయావరణమున పేరోలగ ముండెను. జన్నిగయు పలువురు సేనానులు మంత్రులును సామంతులును మహారాజు లను కొలిచియుండిరి. విద్వాంసులగు భూసురులును ఆశీర్వచనార్థ మచ్చట నుండిరి. వారిలో కేతనయు గలడు.

ఆ మహాసభలోనికి భటులు బంధితులైన కొప్పెరుంజింగని, నాతని ప్రధాన కాడవసేనానులను దెచ్చి నిలువబెట్టిరి. వారి కందరకు శిరస్సులపై దీర్ఘము లగు కేశ ములు గలవు.

వారిని విచారించుట ఎక్కువసేపు పట్టలేదు. వారు కేవలము శత్రువులై ఆంధ్ర భూభాగముపై నకారణముగా దండెత్తి వచ్చిరి. వారి సాహసముచే నంధ్రవీరులు పలువురు వీరస్వర్గము నందిరి. రాజకోశమునుండి ధనము విశేషముగా వెచ్చింపబడెను. వారి కేమి శిక్ష విధింపవలె ననునదియే ప్రశ్న !

శ్రీ రుద్రదేవమహారాజు కొప్పెరుంజింగనే ప్రశ్నించెను :

"నీకు మే మెట్టి శిక్ష విధింపవలెనో ఎరుగుదువా ?"

కొప్పెరుంజింగడు నిర్భయముగా ప్రత్యుత్తర మిచ్చెను. అతని నిలకడలోని శీవి యా సభ నెల్ల నాకర్షించెను.

"మహారాజా, మీచే మేము విజితుల మైతిమి. అంతకంటె వేరు శిక్ష మా కే ముండగలదు ? మా ప్రాణములు మీ యధీనములు !"

సభ యంతయు నిశ్శబ్ద మయ్యెను. ఇట్టివాని కేమి శిక్ష వేయ నగును? శిక్షించ కున్న నితరులకు భయముండు టెట్లు?

శ్రీ రుద్రదేవమహారాజుల యాజ్ఞచే వారందరికి నప్పుడ శిరస్సులు ముండనములు చేయించి స్నానములు చేయించి భటులు మరల సభలోనికి తెచ్చి వారిని నిలువబెట్టిరి. మహారాజు కొప్పెరుంజింగనితో నిట్లనెను :

"కాకతిరాజేంద్రులకు యావజ్జీవము సామంతుడనుగా నుందునని భగవత్సాక్షిగా నీవు ప్రమాణము చేసినచో నిన్ను నీ సేనానులను ప్రాణములతో వదలెదము!"

"చిత్తము. మహాప్రభూ!"

వెంటనే కొప్పెరుంజింగని ఇష్టదైవ మగు కనకసభాపతి విగ్రహమును కొప్పెరుంజింగని పురోహితుని చేతనే తెప్పించి దక్షారామభీమేశ్వరలింగము పాదసన్నిధి పెట్టించిరి.

కొప్పెరుంజింగడు ముమ్మారు మహాదేవునికి ప్రదక్షిణము చేసి, ఈశ్వరసమక్షమునను, భూసురుల సమక్షమునను, మహాసభాసమక్షమునను, కాకతిగణపతిదేవ పాదారవిందదాసుడనై యుందు నని ప్రతిజ్ఞ చేయుచు శ్రీ రుద్రదేవమహారాజుల పాద పీఠమునందు శిరము గదియించి మ్రొక్కెను. మరియు నా సభాసమయమున భీమేశ్వర స్వామి కాత డొక కనకప్రభ దానము చేసి, యాలయమున నాచంద్రతారార్కముగా 'కాకతిగణపతి పాదారవింద మధుకరాయమాన మానసేన రాజసింహేన——' ఇత్యాదిగా నొక శాసనము వేయించెను.

ఇందరు కాడవసేనానులును పట్టువడిన భటులును ఏ మగుదురు? వారి నందరి నొక్కసారిగా వారి స్వదేశమునకు పోనిచ్చుట క్షేమముకాదు. వారిని దారిలో పట్టి శక్యము కాదు. అందరను రాజ్యపు సరిహద్దులు దాటిపోవువరకు కాపుండి పంపుట బహు వ్యయప్రయాసలతో కూడిన పని. ఆ పట్టువడిన సైనికులలో కొందరు వంశ పారంపర్యముగా యుద్ధమున కలవాటుపడినవారు. అట్టివారిని రుద్రమ తన సేనలలో చేర్చుకొనుటకు సమ్మతింపగా, వారును దానికి సంతోషముతో నంగీకరించిరి. మిగిలినవారు పలువురు యుద్ధముల కలవాటుపడినవారు కారు. వారు ప్రధానముగా కర్షకులు. ధనాశచే వారు రాజసింహుని సేనలో చేరి యుద్ధకౌశల మభ్యసింపవారిరి. కాని వారి చేతులలో, ఖడ్గములును ఖడ్గములవలె గాక, హలములవలెనే కదలుచు డెను. అట్టివారికి గోదావరీతీరమునను కృష్ణాతీరమునను దున్ని పండించుకొనుటకు చిన్న చిన్న భూఖండము లిచ్చుటకు శ్రీ రుద్రదేవమహారాజు ఏర్పాటుచేసిరి. వారి ఆంధ్రభూమిలో అరవపల్లెలు స్థాపించిరి. వారి యింటిపేరు అరవవారని స్థిరపడినది వారిక్కడి కాపులలో కలసిపోయిరి.

కొప్పెరుంజింగడు తనవెంట నెందరో ద్రావిడ ఋత్విక్కులను తెచ్చియు డెను. వారందరును తమ కుటుంబములతో సాగ్నులై వచ్చినవారే! రమారమి రెండ వందలవరకు ఆ కుటుంబము లున్నవి. కొప్పెరుంజింగని శిబిరమును పట్టుకొనినప్పుడు ఆ ఋత్విక్కులను జన్నిగసేనలు నిర్బంధింపలేదు. కాని వారికి ఆశ్రయము పోయినది ద్వాదశినాటినుండియు నరసాపురమునకు సమీపమున గల యగ్రహారముల బయట

నున్న యారామక్షేత్రములలో వారు నివసించుచు, నెల్లెట్లో కాలము గడుపుచుండిరి. శ్రౌతస్మార్తవిదులగు నందరు బ్రాహ్మణులు తమ కుటుంబములతో నిక్కట్లు పడుచుండుట గోదావరీతీరబ్రాహ్మణులకు బాగుండలేదు. వారు ఎన్ని కుటుంబముల నెంతకాలము పోషింపగలరు? విజయోత్సవములు సాగుచున్న సమయమున, ఆ ద్రావిడులలో పెద్దలను వెంటతీసికొని గోదావరిపండితులు పలువురు శ్రీ రుద్రదేవ మహారాజును దర్శించిరి. వారిలో కేతనయు గలడు. కేతనయే దాని కంతకును గారకుడు. కేతన యా ద్రావిడబ్రాహ్మణులు ఆరామక్షేత్రములలో నల్లాడుచుండుట మహారాజులకు నివేదించెను.

"విద్వాంసులును, తపస్సంపన్నులును, అగు నందరు బ్రాహ్మణులు నిలువ నీడ లేక బాధపడుచుండుట ఈ దేశమునకును తత్పరిపాలకులకు క్షేమము కాదు!"

ఆ ఛాందసకవి యంతమాటయు ననివేసెను. శ్రీ రుద్రదేవమహారాజులు కోపింతు రని మిగిలినవారు భయపడిరి.

కాని మహారాజులు కోపింపలేదు. స్థానికులగు నధికారులను వారికి వసతి యెక్కడ కల్పింపదగునో యని వెంటనే విచారించిరి. తుదకు సర్వవిధముల ననుకూలముగా నుండుటచే, ఆ ద్రావిడబ్రాహ్మణులకు శ్రీ రుద్రదేవమహారాజులు తమ విజయయాత్రకు చిహ్నముగా కాకరపర్రు అగ్రహార మొనర్చి దానముచేసిరి. వచ్చిన ద్రావిడ బ్రాహ్మణులును కేతన మొదలుగా నితర గోదావరిబ్రాహ్మణులును శ్రీ రుద్రదేవమహారాజులకు విజయపరంపరలు కలుగుగాత మని యాశీర్వదించి సెలవు గైకొనిరి. అంతటితో నా ద్రావిడబ్రాహ్మణులకు ఆరామక్షేత్రములలో నలమటించవలసిన దురవస్థ తప్పిపోయినది. స్థిరవసతి యేర్పడినది. కాని గోదావరీబ్రాహ్మణుల హృదయములలో మాత్రము వారికి ఆరామద్రావిడు లను నామము శాశ్వత మయ్యెను.

* * *

ఆపిమ్మట రెండురాత్రులు చాల ప్రొద్దుపోవువరకు శ్రీ రుద్రదేవమహారాజులు తన ప్రధానదండనాథులతో నేకాంతమున మంత్రించిరి. అందులో జన్నిగదేవు ఆదిదమ్మయు నుండిరి. కోలని రుద్రుడుకూడ పిఠాపురమునుండి ప్రత్యేకముగా నాహ్వానింపబడి యుండెను.

ఆ ఏకాంతసభలో ఏకశిలానగరమునుండి వచ్చిన వార్తలను, గొంటూరునుండి అంబదేవునును, మోటుపల్లినుండి త్రిపురాంతకుడును పంపిన వార్తలను చర్చించిరి. వానిలో పరస్పరవిరోధము కొంచెము భాసించెను. కావున ఆ వార్తలు నిజములై యుండుటకు వీలులేదు. సభాంతమున రుద్రప్రియ యీవిధముగా నిశ్చయించెను.

"జన్నిగ వెంటనే మహాసైన్యమును కదలించుకొనిపోయి సుందరపాండ్యుని బలములపై విజృంభింపవలెను. కోలనిరుద్రుడు వెంటనే కాళింగసేనలను తాకవలెను. అప్పుడే ఓరంగినుండి మహానౌకాబలము బయలుదేరి కాళింగుల నౌకాబలములను ...ని రేవుపట్టణములందే ముట్టుకొనవలెను. తిక్కచమూపతి ఆగ్నేయమునుండి వచ్చుచున్న చోళసైన్యములను, గోన గన్నారెడ్డి నైఋతినుండి వచ్చుచున్న బల్లాల

కర్ణాట సేనలను, రెండు మహాసైన్యములతో వెంటనే పోయి ఎదుర్కొనుటకు ఆజ్ఞలు ఏకశిలానగరమునకు శీఘ్రచరులచే పంపవలెను !"

ఈ నిర్ణయములకు కొంత సందేహము సూచించినది ఒక్క కోలనిరుద్రుడే! ఓరుగల్లునుండి ప్రధానసేన లన్నియు వెడలిపోయిన పురరక్ష యేది? దేవగిరినుండి యాదవప్రభువు దండెత్తివచ్చిన నేమి యుపాయము?

ఆ భయము లేదు. యాదవులు తమ రాజ్యముపై నెత్తివచ్చుచున్న ముసల్మాను సేనలకు తమ రాజ్యము వదలివేసి ఓరుగల్లుపైకి రాగలరా? ఓరుగల్లునందే ఈ నూతనమతస్థులు నెమ్మదిగా ప్రవేశించుచున్నారు. జీవనోపాధి లేని పేదలవలెను, నికృష్టజీవనములు జరుపు నల్పులవలెను, ఇప్పటికి ఎందరో ఏకశిలానగరమున వారున్నారు. వారిని చారులు కనిపెట్టుచుండవలసినదే కాని, మహారాజులు తమ దేశములో ప్రవేశింపకుండ నెట్లు నిషేధింపగలరు? అట్టివారు ఇంకను సమీపమున నున్న దేవగిరిపై తమ దృష్టి సారించియుండుట సహజము. దేవగిరియు ఏకశిలయు ఏకమై యున్నగాని, ఎప్పటికైన ఆ భయము ఉభయులకును తప్పదు!

ఇట్టి విధముగా నున్నకోలనిరుద్రుని సందేహములను తక్కినవారు వా... చుండిరి. ఏమైన నేమి? నిశ్చయము లైపోయినవి! రాజాజ్ఞలు ప్రవర్తింపబడి...

*　　*　　*　　*　　*

కోలనిరుద్రుడు ప్రస్థానభేరి వేయించి యా మరునాడు సాయంత్రము లగ్నమున మహాసేనతో కాళింగులపైకి శీఘ్రయానమున సాగెను. బ్రహ్మ యగు నాతని రణభేరియు చిత్రముగా ధ్వనించి చుట్టుపట్టుల నున్న... ముల నానందపరవశుల గావించెను.

"అఇఉణ్ || ఋఌక్ || ఏఓఙ్ || ఐఔచ్ || హయవరట్ || లణ్ || ఞమఙణనమ్ || ఝభఞ్ || ఘఢధష్ || జబగడదశ్ || ఖఫఛఠథ చటతవ్ || కపయ్ || శషసర్ || హల్ ||"

రుద్రుని రణభేరియు, సంధ్యానాట్యము చేయుచు మహారుద్రుడు తన ఢక్కపై పదునాలుగుమారులు నినదింపజేసిన యక్షరములే చిత్రముగా ధ్వనించెను.

కోరంగి నావలును మనోజ్ఞగతితో కదలెను.

జన్నిగసేనలును మరునాడు ఉదయమున సాగిపోయెను.

విజయోత్సవములు పూర్తిచేసి శ్రీ రుద్రదేవమహారాజులును సపరివారముగా దారిలో ప్రజల క్షేమ మరయుచు ఓరుగల్లుకు తిరుగు ప్రయాణము సాగించిరి.

## ౪౨

యథావాక్కుల అన్నమయ్య కోపాగ్నికి గురియైన శ్రీవైష్ణవాగ్రేసరుడు కన్నులు పోయి యున్న మేశ్వరుని యాలయము ముందు పడిపోయెనుగదా! ఆలని వెంట



వచ్చిన వైష్ణవతెండము పారిపోయినది. ఆ పడిపోయినవానియొద్దకు పోవుటకు అన్న మేశ్వరుని యాలయము ముందున్న శివభక్తులుకూడ సాహసింపలేరు. అన్నమయ్య కొంతవడికి రోజుచు తన రెండుకన్నులం గట్టిగా మూసికొని, వెనుకకు శివనిందకుని దిక్కై ఇంతవరకు తిరిగియున్నవాడు, మరల ఈశ్వరునివంకకు తిరిగి భక్తి వినమ్రుడై నమస్కరించి శివపూజ సాగించెను.

ఈ కథ పట్టణమంతట ప్రాకిపోయినది. ఎందరో ఆ వింత చూచుటకు వచ్చిరి. జనసమ్మర్దము నిరంతరముగా నుండు నా ప్రదేశమున, మరియు విశేషముగా జనులు మూగిరి. అంత జనము మూగినను అందులో నెవ్వరును కన్నులం బోయి పడిపోయిన యా శ్రీవైష్ణవుని సమీపింపరు. వారి కటు పోవుటకె భయము. భయము సంగతి యెటు లున్నను, కన్నులం బోయి పడిపోయినాడే యని జాలినందువారైన నక్కడ లేరు. పైగా శివనింద చేసినవానికి ప్రాయశ్చిత్త మైన దనువారే అందరును! అపరాధులు శిక్ష యనుభవించుచుండ వారిపై జాలినొందు నిర్వ్యాజ్యస్థితిలో లేరు ఏకశిలానగర వాసులు! శ్రీవైష్ణవులకు ఆ చాయకు వచ్చుటకుగూడ ముఖము చెల్లలేదు.

మరి యాతనివెంట నందరు వైష్ణవులు వచ్చియుండిరే! అతడును శ్రీవైష్ణవుని వుండెనే! ఈ వార్త ఏకశిలానగరములో వీథివీథుల వాడ వాడల ప్రాకిపోయి వరును అతనివారు రారేమి? అతనికి భార్యగాని బిడ్డలుగాని లేరా? తల్లిగాని ని లేరా? అన్నలు దమ్ములు అక్కలు చెల్లెండ్రునుగూడ లేరా? ఎవరును గా? ఇత డసలు శ్రీవైష్ణవుడే యగునా?

* * * *

ఆనాడు రెండు జాములకు కొంచెము ముందుగా మాచల్దేవి తన చేటికతోడను కొంత పరివారముతోడను కేశవస్వామిని దర్శించుటకు అరుదెంచెను. అది స్వామిసేవ చేసికొన్నది; ఆనందపారవశ్యముతో నొకగీతము నృత్యము స్వామికి ప్రదర్శించి, కానుక లర్పించుకొన్నది. పిమ్మట నది స్వయంభూదేవులను గూడ దర్శించి కానుక లర్పించి యాలయప్రాంగణమున నించుక విశ్రమించినది.

అంతలో మండపమునుండి తిక్కనసోమయాజులు మహాభాగతరచనము ఆ పూటకు చాలించి మారన గురునాథులతో కలసి వెళ్ళుట చూచి యది సంభ్రమమున లేచి వారికి మ్రొక్కి సోమయాజుల దయావలోకనప్రసాదము పొందినది.

అట్లది యక్కడనుండి గృహోన్ముఖముగా మరలిపో నుండగా, నావల అన్న మేశ్వరుని యాలయమునందు శివనింద చేసిన శ్రీవైష్ణవు డొకడు కన్నులుపోయి పడిపోయె నను వార్త విన్నది. పోయి చూడవలె నను వేడుక మాచల్దేవికి కలిగినది.

అది తన చేటికతో పోయి చూచునుగదా, వెంటనే యాతడు శ్రీవైష్ణవుడు కాడని యది నిర్ధారించెను. వెనుక విజయదశమినాడు కౌముదీజాగరణోత్సవమువేళ తన యింట కొంతవడి జూదమాడి తుదకు పర్వతనాయకునితో ఖడ్గయుద్ధము చేసిన అజ్ఞాతయోగియే యీత డని దానికి తెలిసిపోయినది. చేటికగూడ గుర్తించిన ట్లున్నది. దాని కన్నులు ఆ గుర్తించుటలో నాశ్చర్యసంభ్రమముతో రెండింతలు కాగా,



మాచల్దేవివంక తిరిగి 'అక్కా!—' అని యేమో అనబోవుచుండెను. కాని వెంటనే మాచల్దేవి మాటాడవద్దని చేసిన కనుసన్న నందుకొని యది నోరు కట్టివేసికొనెను.

ఏమిది? ఇతని కీ వేషమేమి? మహాయోగి యైనచో ఈ శివనింద యేమి, ఈ శిక్ష యేమి? ఈమనుష్యుని వేషభాషలతో, నింత లోకజ్ఞానముగలదానే మోసపోయినదా? ఇతని కేమి లోపమున్నను కామమోహితు డగుట యను లోపము లేదు. ఎట్టి మహానుభావులును కామమోహితు లగుట దాని కనుభవము. కామము నిర్జించిన యీ యోగియందు తన కందుచే విశేషగౌరవము కలిగినది!

ఆ రాత్రి గోషావేశముతో పర్వతనాయకుడు పట్టుకొనగా నాతని చేతిలోనికి వచ్చిన జుట్టు కృత్రిమ మైనది. ఆ కృత్రిమకేశపాశము అనేకవిధముగా నుండెను. సరి యీనాడీతడు ధరించినది కర్ణాట శ్రీవైష్ణవుల కేశబంధమువలెనే యున్నది. కేశబంధమే యేమి? అతని వేషమంతయు నట్లే యున్నది. ఏమి యీ ద్వాదశోర్ధ్వపుండ్రములు? శ్రీవైష్ణవులనుగూడ తన వేషముతో వారిలో నొకడ నని నమ్మించునట్లున్న దీ వేషము! ఇత డెవరో గూఢాచారు డై యుండవలెను. ఇతని నెరిగినట్లు కనబడుట ప్రమాదకరము!

ఈ యూహలన్నియు మాచల్దేవి మనస్సులో ప్రసరించెను. వెంటనే చేటివంకకు తిరిగి, 'చెల్లీ! భగవద్దూషణఫలము చూచినావటే!' అనుచు దానిని తోడుకొని మాచల్దేవి వెడలిపోయినది.

* * * *

సాయంకాలము మూడుజాము లైనది. అక్కడికి చూడవచ్చు జనసమ్మర్దము తగ్గిపోయినది. బొల్లని భార్య మంగి తనకూతురు పాటితో కలసి యక్కడికి వచ్చినది. అప్పటికిని ఆ కన్నులు పోయిన గూఢచరుడు ఏకాకియై యక్కడనే పడియుండెను. ఆప్తు లెవ్వరును అక్కడికి వచ్చినట్లే లేదు.

పడియున్న యాతని జూడగనే మంగికి దుఃఖము ముంచుకొనివచ్చినది. దాని కాతనిపై తండ్రియందువలెనే ప్రేమ గౌరవము వినయము భక్తియు కలవు.

పూర్వ మొకమారు దానియింట నదివరుసగా మూనాళ్ళు ఆహారము లేకుండెను. దాని బంధువులే దానియొద్దకు వచ్చుటకు వెరచుచుండిరి. అది సహాయ మర్థింప బోయిన దాని దగ్గరవారే పెడమొగములు పెట్టిరి. భిక్షమునకుపోవుటకు దానికి మనసొప్పలేదు. అందులో కూతురు పాటికి జ్వరముకూడ వచ్చినది. పిచ్చిమాటలు వెర్రిమాటలు! అది ముఖ్యముగా తండ్రికై దిగులుపడినది. తండ్రినే ఆ సంధిలోకూడ పలవరించును. మంగికి కాళ్ళాడలేదు.

మూడవనాటి సాయంకాలమున కది యొక నిశ్చయమునకు వచ్చుచుండెను. మరునాడది కూలికో భిక్షమునకో పోవలెను. భిక్షమా? కూలికి పోవుటా? రాతికోట కట్టుటకు కూలీలు ఎవ్వరైనను ఎందరైనను కావలెను. కాని స్త్రీలు ఆ పనిలో ఎక్కువమంది లేరు. ఒక్కమారు ఆపనిలోనికి దిగినచో రాజభటులు పని పూర్తియగువరకు పని చాలించుకొననీయరు. కోట పూర్తియగువరకు నొకవిధమగు నిర్బంధమే. మరి యది

ఎన్నాళ్ళకు పూర్తి యగునో ! అంతవరకు తా నా పనిలో నిలుకుకొనిం డెట్లు? మరి యీ యాకలిబాధ భరించుట ఎట్లు ? తన్ను తన కుమార్తెను పోషించుకొనుట ఎట్లు ?

ఆట్లాలోచించుకొనుచుండగా ప్రొద్దు క్రుంకినతర్వాత ఎవరో ఎరుగని మనుష్యుడు వచ్చి, 'నీ వీ రాత్రి నిద్దుర పోకుము. శుభమగును !' అని మాత్రము చెప్పి మరి మాటాడక కనబడకుండ పోయెను.

ఏమిది ? ఎవ రది ? ఒకప్రక్కను పాటికి సంధించిన జ్యాక మట్లే యున్నది. మంగి మనస్సు ప్రపంచమంతయు సంచరింపసాగినది. బొల్లు డెక్కడ నున్నాడు ? ఈ విశాలప్రపంచములో నెక్కడ నున్నాడో? తన్ను తన కూతును మఱచినాడేమో? రాజభటులచే జిక్కి ఏమి బాధలు పడుచున్నాడో ! ఆతడు చెరసాలకు గొంపోబడినదియు నాతని నెవ్వరో తప్పించినదియు మాత్రమే దానికి తెలియును. ఆపై నేమియు నెరుగదు. ఆ తప్పించినవారు తనవైపైన చూచుట లేదే ? వారికే తనపైగూడ కరుణ కలిగినదేమో కాక తన విభుడు బొల్లడే రహస్యముగ వచ్చునా ?

ఆరాత్రి కంటిపై కునుకు రాకుండ నిద్ర కాచి మేలుకొనియున్నది. అర్ధరాత్రము దాటినది. ఏమియు లేదు. ఆశ సన్నగిల్లినది. ఎంత యాపినను ఆగకుండ నిదుర వచ్చుచున్నది. ప్రయత్నపూర్వకముగా మేలుకొని యున్నది.

కూర్చుండి యుండగనే ఒక కల వచ్చినది. మేలుకొన్నవారికి కలలు వచ్చునా ? దానికి నిద్దుర పట్టియుండవచ్చును. ఒక్క రెప్పపాటుకాలము కునుకు పట్టిన చాలును. ఆ కొంచెము కాలములో నరుడొక జీవితకాలము కలలో గడచిపోవచ్చును. కాని మంగికి వచ్చినది చిన్నకలయే ! పెనుభూతమువలె జడలు విరియబోసికొనియున్న యొక యాకారము కన్నులముందు కనబడినది. దాని కెన్నో చేతులు. ఆ చేతులం దన్నిట ఖడ్గము లున్నవి. అవి యన్నియు నొకచో కలసినవి. కలసియున్న యా ఖడ్గములు చూడగా ఒక భుశుండి యాకారము ధరించినవి. అంతలో ఒక పెద్ద చప్పుడైనది. అది యా కత్తు లన్నియు విఱిగిన చప్పుడా ?

కొట్టినట్లు మంగికి తెలివి వచ్చినది. పూర్వవర్ణితుడైన నిశాచరయోగి యాయన దండము కొట్టుచు చేసిన చప్పుడు, అది ! అతడా ధ్వని చేయుచు చేసిన సంచార మెల్ల మంగి శ్రద్ధగా నాలకించెను. ఈ భయంకరధ్వనిరూపముగా తన కానాడు శుభము రాబోవుచున్నదా ? ఏమో !

తిరిగితిరిగి యా శబ్దము తన కుటీరమునైపునకే వచ్చి యాగినది. అప్పటికే పేరాసతో మంగి తలుపు తీసినది. ఆ భిక్షువును చూడగానే మంగికి నిరాశ నిస్పృహ కలిగినవి. ఈ భిక్షువువలన తన కేమి లాభ ముండును ? అతని యాశీర్వాదము పొందుట కైనను, భిక్షము పెట్టను గింజకూడ తన యింటిలో లేదు. ఏమి చేయును ?

తుద కా భిక్షువే దానికి శుభవార్తలు చెప్పెను. చెప్పి యంతటితో నూరకొనక దోసెడు సువర్ణము లిచ్చియుండెను. ఆ సువర్ణములును అతని కెట్లు వచ్చినవి ? ఆకాశములోనుండి యాతడు పిలిచినంతనే ఎవరో యక్షు లాతని దోసిలిలో పోసిన ట్లున్నాను. అవి యాతడు తన కీయుగా నది నిజ మని దానికి ముందు నమ్మకము

కలుగలేదు. తీసికొన్నది. నిజముగానే శుభము దాని కా రాత్రి వచ్చినది. ఆ పిమ్మట మనస్సు ఆందోళనముతో దానికి నిదురపట్టలేదు.

ఆపిమ్మట దానికి దారిద్ర్యము పోయినది. తదాది పొదుపుగా ఆ సువర్ణములు వాడుకొనుచు జీవించుచున్నది. పాటికి మరిరెండురోజులకు జ్వరము నయ మైనది.

తన్నొల్లి ఉద్ధరించిన మహానుభావుడు ఈనాడు ఇట్లు నడివీధిలో దిక్కులేక కన్నులు పోయి పడియున్నాడు. తనవలెనే ఈతడు మరి యెందరు బీదలకు ఉపకారము చేసి యుండెనో? వారిలో ఒక్కరును ఇప్పుడిక్కడకు రాలేదు. అతనిని వదలక సమీపముననే కూర్చుండి మంగి పెద్దపెట్టున నేడువసాగెను. దానికి కారణము తెలిసి పోయినది. పాటి దానిని పైటకొంగు లాగుచు ఇంటికి పోవుద మని తొందరపెట్టుచున్నది.

సాయంకాల మైనది. దీపములు దేవాలయములలో వెలిగించిరి. తిక్కనసోమయాజి మారన గురునాథులతో కలసి స్వయంభూదేవాలయమండపమునుండి యన్నమంత్రి యింటికి చేరుటకు బయలుదేరి యా మార్గమున బోవుచుండెను. మంగికి దూరమున సోమయాజులను చూడగనే ఆ మహానుభావుని రక్షింపు మని వేడుకొనవలెనను నిచ్ఛ జనించెను. అది ఎదురుపోయి సోమయాజుల రెండు కాళ్లు గట్టిగ పట్టుకొని విడువక వెక్కివెక్కి ఏడువసాగినది.

సోమయాజులకు ఆశ్చర్యముతోపాటు జాలి కలిగెను. దీనముగా నవదగ్నై యేడ్చు మంగిస్థితిని చూచిన ఎవరికి జాలి కలుగదు? అందులో కరుణాళువు లగువారికి జాలి కలుగదా?

తిక్కనసోమయాజుల కా ఉదయమున జరిగిన కథ చూచాయగా తెలిసినదే గాని సరిగా తెలియలేదు. ఏమని విచారింపగా అక్కడి జనము ఉదయము జరిగినది చెప్పివేసిరి. అంతయు విని సోమయాజులు "న న్నేమి చేయుమందువు?" అని మంగిని ప్రశ్నించెను.

"రక్షించు, స్వామీ, ఆయన కళ్లు తెప్పించు, స్వామీ! మీకు పుణ్యముండును!"

"అతడు నీ కే మగును?"—సోమయాజి ప్రశ్న.

"అతడు నాతండ్రి, స్వామీ! నాబోటి దిక్కులేని పక్షుల కందరికీ తండ్రివంటి వాడు స్వామీ!"

సోమయాజులు ఇంచుక ధ్యానించెను.

"అమ్మాయీ! ఇతడు శివనిందచేసి ఈ స్థితికి వచ్చినాడు. అన్నమేశ్వరునికి మ్రొక్కుకొని ఆ యాలయములో నున్న యథావాక్కుల అన్నమయ్యను క్షమాభిక్ష యర్థింపుము. సర్వము శుభమగును!"

వెంటనే మంగి యాతని పాదములు వదలి అన్నమేశ్వరుని యాలయము ముందు నిలుచుండియున్న యన్నమారాధ్యుల పాద ములపై బడి పరిపరివిధముల ప్రార్థించెను. కొంతవడికి అన్నమారాధ్యులకును జాలి కలిగినది. శివలింగార్పిత మైన దివ్యజ్యోతిని

ఆ పడియున్నవాని కన్నులపై ప్రసరింపజేసెను. ఆ పడియున్నవాడు కన్నులం నులుముకొనుచు లేచెను.

మంగి యన్నమాచార్యులకు మ్రొక్కి 'బాబా, లేచితివా?' యని యా శ్రీవైష్ణవవేషధారిని పమీపించెను. అతడు కన్నులు తెరచినాడు. లేచినాడు. మంగిని గుర్తుపట్టినట్లు లేదు. అది ఎవరోకూడ ఎరుగనట్లే యాతడు ప్రవర్తించెను. నగరములో నామాల నీమాల ఇనుపపనిముట్లు చేయు పనివారు 'బాబా, బాబా, బాబా' యనుచు నాకస్మికముగా వచ్చి యాతని నెక్కడికో తీసికొనిపోయిరి.

అంతవరకును మేచనునాయకుడు తన భటులతో నా చుట్టుపట్టుల వీథులన్నియు నిరోధించి స్వయముగా నక్కడ కాపుండెను. ఆ భటు లందరును కనుబ్రామి మేచ యనుగూడ కనుబ్రామి యావచ్చిన మనుష్యు లాతని తప్పించుకొని తీసికొనిపోయిరి. మంగి తన కూతురు పాటితో నక్కడ మిగిలిపోయెను.

మేచయ కాశ్చర్య మయ్యెను. అతడు మంగిని పాటిని ఏమియు జేయ దలపలేదు. భయముతో వడకిపోవుచున్న మంగికి ఇంటికి పోవుటకు మేచయ యనుజ్ఞ యిచ్చెను.

*　　　*　　　*　　　*

మరి యాత డెవరు? రంగనాథరామాయణము రచించుచున్న రంగనాథుడా? కానే కాదు! రంగనాథరామాయణకర్త రంగనాథు డైనచో నాతడు శివనింద చేయుట యసంభవము. ఆ రంగనాథుడు శివభక్తాగ్రేసరుడు!

మరి ఎవ రీ శ్రీవైష్ణవుడు? అతడు శ్రీవైష్ణవుడే కాడు. అతడు ఇస్లాము మత ప్రచారకుడు! చాతుర్వర్ణ్యజనములోనివాడు కాడు!

అది తెలిసిన శ్రీవైష్ణవులలో గుసగుసలు ప్రారంభించెను.

"అయ్యో! ఇతడు నాకు తీర్థప్రసాదము లిచ్చెనే!"

"అయ్యో! ఇతడు నా సహపంక్తిని భుజించెనే!"

"ఎంత మోసపోతిమి!"

"మా పెరుమాళ్ళు అపవిత్ర మైనాడు. పులికాపు చేయవలెను!"

"ప్రాయశ్చిత్తము చేయించుకొనవలెను."

## ౪౩

అదిగో, యెత్తినవారు పట్టణము మధ్యక్షోణి సింహధ్వజం
బదిగో, కట్టినవారు నింబదళమాల్యాతోరణ వ్రాతముల్
విదితం బయ్యె మహోత్సవంబు నెఱియన్ వీథీవిటంకంబులం
దదిగో, నిల్పినవారు పూర్ణకలశం బాబాలగోపాలమున్!'

క్రీడాభిరామము

శ్రీరుద్రదేవమహారాజులు దక్షారామభీమేశ్వరమునుండి పంపిన యాజ్ఞల ననుసరించు ఏకశిలానగరమున విజయోత్సవములు మహావైభవముతో సాగుచుండెను. ఇది మోటుపల్లిని త్రిపురాంతకుడు జయించినప్పుడు జరిపిన యుత్సవము నెన్నియో రెట్లు మించియుండెను. ఇప్పుడు కొప్పెరుంజింగడు సంపూర్ణముగా విజితు డయ్యెను. గొంటూరుమాండలికు డగు నాగదేవుడు హతు డయ్యెను. అతని మిత్రులందరు పట్టు వడిరి. మోసలపట్టణము వశమయ్యెను. చోళనౌకలన్నియు పలాయితము లైనవి. మహోత్సవము జరుగకుండు టెట్లు ?

మరియు మహారాజు లాజ్ఞాపించినప్రకారము ఓరుగల్లునుండి యొక మహాసేనను తీసికొని తిక్కచమూపతి ఆగ్నేయమునుండి వచ్చుచున్నారని తెలిసిన చోళుల నెదిరింప బోయెను; గోనగన్నారెడ్డి నైరృతినుండి వచ్చుచున్నట్లు తెలిసిన కర్ణాటసేనల నెదుర్కొన మరియొక మహాసేనతో కదలిపోయెను. ఇప్పుడు చూడ ఓరుగల్లు కేవల మరక్షితముగా నున్న ట్లున్నది !

రాజప్రతినిధిగా రాజకార్యము లన్నియు మొదటినుండి చూచుచున్న రుయ్యమ్మయే యీ రాజాజ్ఞ లన్నియు ప్రవర్తింపజేసెను. ఆ యాజ్ఞలును రుయ్యమ్మ పంపిన వార్తల ననుసరించియే రుద్రమ పంపినట్లు స్పష్టమయ్యెను. అందుకు రుయ్యమ్మకు ముందెంతో సంతోష మయ్యెను. ఎంత ప్రేమగల తల్లిగ్గైనను, తాను సూచించిన కార్యము తల్లికిని సమ్మతమై, తన సూచనప్రకారము ఆజ్ఞలు ప్రవర్తింపజేయ బడిన నేపిల్లకు సంతోషము కలుగదు ? తిక్కచమూపతియు గోనగన్నారెడ్డియు సేనలతో కదలుచుండగా రుయ్యమ్మను ఆనందమే ఆవేశించెను.

కాని ఆ సేనలు కదలిపోయి మూడుదినములైనది. అంతలో నాకస్మికముగా రుయ్యమ్మ హృదయములో పెద్ద బరువు వచ్చి పడినట్లయ్యెను. మనస్సు అంతయుశూన్యమైనట్లు తోచెను. ఇప్పుడు ఏకశిలానగరమునకు బలమగు రక్ష లేదు. శిలాప్రాకారము సంపూర్ణముగా లేవలేదు. పుట్టకోట గక్షణ చాలదు. అయినను భయ మేమున్నది ? రాదగిన శత్రు వెవరు ? దేవగిరిరాజు ఉత్తరదిశాభిముఖుడై దేహళీప్రభువుల సేనల నెదిరింప బోయెనుగదా ! భయ మేమి ?

"అది మోస మైనచో ?"

రుయ్యమ్మ గుండెలలో రాయిపడిన ట్లయ్యెను. ఇప్పుడు తా నెవ్వరితో నాలోచింపగలదు ? మహాప్రధానులగు గోవిందనాయకుడును బయ్యనాయకుడును పనిచాలించుకొనిరి. ఇన్నాళ్ళును తిక్కచమూపతి తన కెంతయేని సహాయము చేయుచుండెను. ఇప్ప డెవ్వరి నడుగగలదు ? తనకు విశ్వాసయోగ్యమగు మంత్ర ముపదేశించు పెద లెవరు ?

అర్ధరాత్ర మైనది. కాని విజయోత్సవచిహ్నములు చెవుల దూరమునుండి పడుచునే యున్నవి.

"అకలంకస్థితి శీధుపానమత్తులై యాసాదు లుప్పొంగి యో
యకటో యమ్మకటో యమక్కరో యదీయట్టట్టటో యంచు బా

యక తప్పెట్లును దళ్ళితాళములం నింపై సొంపు రంజిల్లగా
జకజుంజుం జకజుంజు జుమ్మ మనుచుణ్ సొగుం గడుణ్ వాద్యముల్"

అని యొక కవి వర్ణించినవిధముగా తప్పెట్లు తళ్ళితాళములు వినవచ్చుచున్నవి. ఆ శబ్దములం వినవచ్చుచున్నకొలదియు రుయ్యమ్మకు ఆవేగ మెక్కువయ్యెను. ప్రశాంతమగు నిశాసమయమున దూరమునుండి వినవచ్చుచున్న యా వాద్యములం వింతయగు దడ కల్గించును. అవి యీనాడు రుయ్యమ్మ గుండెలను దడదడలాడించి వేయుచుండెను.

వెంటనే యామె దేవగిరివంకనుండి తనకు వార్తాహరు లంపిన వార్త లన్నియు తీసి పరిశీలించెను. అందులో సందేహింపవలసినపని లేదని గుండె దిటవుచేసికొని శయ్యపై పరుండి రుయ్యమ్మ నిదురింప బ్రయత్నించెను. నిదుర రాదు. దూరమునుండి, జుకజుంజుం 'జుకజుంజుం, జుకజుంజుం' అని తప్పెట్లు చేయు చప్పుడు హృదయమును కలచివేయసాగెను. నిద్దుర రాదు.

"నాకిప్పుడు తగిన మంత్ర ముపదేశించువా రెవరు?"

రుయ్యమ్మ యాలోచన పరిపరివిధముల బ్రసరించెను. వృద్ధులగు గణపతిదేవు లేమియు రాజకార్యములం పట్టించుకొనుట లేదు. రుద్రమ వచ్చినవెంటనే తీర్థయాత్రలకు బయలుదేర గణపతిదేవులం ఉద్దేశించుచుండిరి. వారి నడిగి లాభము లేదు. జాయపనాయకుడు చేబ్రోలు వెళ్ళియుండెను. మహాదేవరాజు అసలే తొందరపాటు మానిసి? కామసాని అంతఃపురవిషయములం తప్ప యితర మెరుగదు. ఎవ రిప్పుడు తనకు తగిన మంత్ర ముపదేశించువారు?

రుయ్యమ్మకు ప్రపంచమే శూన్యముగా కనిపించెను. ఈ లోకములో నెవ్వరును లేనట్లే కొంతవడి దానికి తోచెను. అంతలో నాకస్మికముగా దాని హృదయములోనికి బలవంతముగా నొక పురుషమూర్తి ప్రవేశించెను. అతని యున్నత మగు ఫాలము, నాసము, శ్యామాయిత మగు చాయగల యాతని యాకారము, గొరకన్నులతో రుయ్యమ్మ మనస్సులో నిండిపోయెను. కారణజన్ముడైన అన్నమంత్రీశ్వరుడు రుయ్యమ్మకు స్ఫురించెను.

"అన్నమంత్రీశ్వరు లేమందురో ఈ సమయమున సహాయ మర్థించిన?"

తాను మొదలం అన్నమంత్రితో మాట్లాడగలదా? ఇతర పురుషుల నెవరిని జూచినను రుయ్యమ్మకు జంకు లేదు. కాని అన్నమంత్రిని చూచినంతనే ఆమె నోరు కట్టుపడును. బుద్ధిలో నొకానొక దీనభావ మావేశించును. కన్నులం చెమరించును. ఏమని యాతని తా నడుగును? అందులో నాతడు రాజద్రోహి యని సందేహింపబడి నిర్బంధమున నున్నవా డాయెను! అట్టివానినే తాను ఈ కష్టవిషయమున మంత్ర మర్థించుటా? ఆత డొకవేళ దుర్మంత్ర ముపదేశించిన ఈ రాజ్య మేమి కావలె? అన్నమంత్రి దుర్మంత్ర ముపదేశించునా?

"ఏవీ యాతనికి సంబంధించిన పత్రములం?"

ఇట్లనుకొనుచు శయ్యపైనుండి లేచి తన సమీపముననే యా పత్రసంచయమున్న దస్త్రము విప్పి చూచెను. ఆ పత్రము లామె మున్నెన్నియో మారులం పరీక్షించి

యుండెను. ఏమైనను వానిలో లోపము కనిపెట్టి అన్నమంత్రి నిర్దోషి యని నిర్ధారణ చేయ నిశ్చయించి ఎంతయో ప్రయత్నించియుండెను. కాని ఏమియు లాభము లేకపోయినది! ఈనాడు మరల నవి పరీక్షించెను. మరల లాభము లేకపోయెను. అన్నమంత్రి ద్రోహి కాదన సాధ్యము కాదు!

"ఎంతమాట! అన్నమంత్రి ద్రోహియా? కాదు! కాదు!"

ఇట్లని రుయ్యమ్మ హృదయము చెప్పుచున్నది. తన యమ్మ రుద్రమ్మకుగూడ నదియే నిశ్చయము!

"అన్నమంత్రిని విడిపించి యీవిషయమున నాతనితో మంత్రాలోచనము చేయుదునా?"

అంతలో రుయ్యమ్మకు సందేహము కలిగెను. తన కున్న యభిమానముచే రాజద్రోహిని విడిపించి యాతని యుపదేశప్రకారము రాజ్యతంత్రము నిర్వహింప జూచుటా?

"ఛీ! ఎంత ప్రమాదము!"

దూరమున మ్రోయుచున్న తప్పెట్లు రుయ్యమ్మ హృదయమున ఝుక ఝుం ఝుం ఝుక ఝుం ఝుం ఝుక ఝుం ఝుమ్మని ప్రతిధ్వనింపసాగెను.

## ౪౪

కరణపాఠశాలలో నూరువేలమంది బ్రాహ్మణులును సంపూర్ణముగా కరణవిద్య నభ్యసించిరి. వారి యధ్యాపకులు వారి కెన్నో విధముల పరీక్షించి తృప్తిపడిరి. కాని యొక మహాసభలో వారు పరీక్ష యిచ్చి పట్టాలు పొందనిచో విద్యలో నుత్తీర్ణులైనట్లు నిశ్చయమేమి? అందుచే నధ్యాపకులు శ్రీ రుద్రదేవమహారాజుల సమక్షమున పరిషత్తు సమకూర్ప నిశ్చయించిరి. కాని మహారాజులు గోదావరీతీరమునకు వెళ్ళియుండిరి. వారు తిరిగివచ్చునప్పటి కెంతకాలము పట్టునో! తుదకు విద్యార్థులును అధ్యాపకులును సంప్రదించి తిక్కనసోమయాజులను పరీక్షానిర్ణాయకులనుగా నుంచుకొని కరణవిద్యాపరిషత్తు సమావేశపరుప నిశ్చయించిరి. అందుకు తిథివారములు లగ్నమును నిశ్చితము లయినవి. తిక్కనసోమయాజులును ఆ సభానిర్వాహణమున కంగీకరించిరి.

తెల్లవారినచో నా సభ జరుగవలసియుండెను. అందుకు రాజభవనమునకు ముందున్న విశాలస్థలములో మహాసభామండప మొకటి నిర్మింపబడెను. అది చక్కగా కదళీ స్తంభములతో పచ్చని యాకులతో తోరణములతో నలంకరింపబడి యుండెను. అన్ని ప్రయత్నములను ఎంత ముందునుండి చేయుచున్నను చివరిక్షణము వరకు నేదో యొకటి కొదువగానే యున్నట్లుండును. ఇందును అట్లే యున్నవి. విద్యార్థులును అధ్యాపకులును అర్ధరాత్రము దాటువరకును ఆ తాటియాకుల మహామండ

పమును నలంకరించుచు నక్కడనే యుండిరి. తుదకు పలువురు తమ తమ నివాసము లకు పోక యచ్చటనే కునికిరి.

కరణశాలలు ప్రారంభించిన క్రొత్తరోజులలో వానికి ఎన్నో విఘ్నములు చేయ జైనకరణములు ప్రయత్నించియుండిరి. అవి యన్నియు రాజభటుల తీవ్రరక్షణచే నరికట్టబడెను. అంతకంతకు రాజభటుల రక్షణమే అవసరము లేకపోయెను. ఆ పాఠశాలలకుగాని అందలి విద్యార్థులకు గాని ఇప్పుడెట్టి యలజడియు కలుగుట లేదు.

తెల్లవార వచ్చుచున్నది. ఆ మండపమునకు పశ్చిమ భాగమున సూర్యోదయ మైనట్లు కాంతి కనబడినది. కన్నులు నులుముకొనుచు నొక విద్యార్థి లేచి సూర్యో దయ మైనదని యందరను లేపి లేపెను. పశ్చిమదిశను సూర్యోదయ మేమని భీతిని బదరుచు వారు లేచి చూచిరి. చూడగా నిజముగా పశ్చిమ దిక్కుగా నరుణోదయప్రభలు కనిపించెను. అది చూచి నిద్రాకళ్ళతో వారు నిశ్చేష్టులై పోవు చుండిరి.

అంతలో నుత్తరదిక్కున గూడ నరుణకాంతులు పర్వెను. వారు ఆశ్చర్య పడునంతలోననె దక్షిణమునను తూర్పునను గూడ నరుణకాంతులు ప్రసరించెను. చూచుచుండగానే ఆ యరుణకాంతులు ఆ మండపమును మ్రింగివేయుచుండెను. ఆ మండపమును మహాగ్నియే దగ్ధము చేయుచున్నది. అందులో నిద్రించుచున్న విద్యా ర్థులును అధ్యాపకులును మాత్రము ప్రాణములతో బయటపడిరి. తెల్లవారునప్పటికి ఆ మహామండపములో నొక్క పూరిపుల్లయు మిగులలేదు.

రాజభటులు వచ్చిరి. వారేమి చేయగలరు? జనములు గుంపులు కూడిరి. వారీ చోద్యమును చూచుచు విస్తుపోవుచుండిరి. ఎవరు దీనికి కారకులు? జైనకరణ ములు!— కాదు. ఈ వైదికకరణములే జైనులపై తప్పువేసి వారని శిక్షింపజేసి యా యుద్యోగములు తాము సంపాదించుటకు వేసిన యెత్తుగడ ఇది! ఇందరు విద్యార్థులు అధ్యాపకులు ఇక్కడనే తెల్లవారులు నుండిరి గదా! వారికి తెలియకుండ నింత ప్రమాద మెట్లు సంభవింపగలదు?— కాదు కాదు! ఇది జైనుల ప్రయోగము! జైనసిద్ధుడు శ్రావణబెళ్గోళనుండి తిరిగి వచ్చుచు తన తీవ్రదృష్టి యిట్లు పరపెనట! అతని కోపాగ్నికి దగ్ధమైనది ఈ మండపము! యథావాక్కుల అన్నమయ్య చూపులో నా యముని కన్నులు పోలేదా? ఎవరికి తోచినట్లు వారనుచుండిరి.

అన్నమంత్రి యింటికి వెళ్ళి పెద్దలందరును తిక్కనసోమయాజులతో కర్తవ్య మాలోచించిరి. అనుకొన్న లగ్నమునకు ఆ ప్రదేశముననే ఆ మహాసభ చేయవలసిన దని తిక్కన సోమయాజులు నిర్ణయించిరి! తాను మాట తప్పుటకు వీలులేదనియు అపృతదోషము వచ్చుననియు వారు పైపెచ్చు సెలవిచ్చిరి.

ఆ నాటి మధ్యాహ్నవేళ నా సభ ప్రారంభ మయ్యెను. దుష్టులు పెట్టిన చిచ్చుకు కాలి భస్మమై కొంత యు, రియు కొంత యూరకున్న యా మహామండపముననే అనుకొన్నవేళ కా సభ ఉపక్రమింపబడెను.

యజ్ఞాంతమందు యజ్ఞశాల యగ్నిహోత్రుని కర్పించుట విధ కాదా? ఈ బ్రాహ్మణులు ప్రారంభించిన కరణవిద్యాయజ్ఞము సంపూర్తి యైనది. మరి యిక నీ మహామంటపము నాది కదా యని యగ్నిహోత్రుడే తన యధికారము నిట్లు ప్రదర్శించి యాహుతి కోరెనా యన్నట్లున్న దా మహాశాల!

తిక్కనసోమయాజులకు దగ్ధమైన యా మహామండపము చూచినంతనే ఏమని తోచెనో! ఆ మహానుభావుడు రత్నశలాకవంటి తన దేహయష్టిని వంచి యా భస్మము చేతులతో గ్రహించి విభూతిధారణ చేయువిధమున నే అభిమంత్రించి దేహమున ధరించెను. అది చూచిన వెంటనే ప్రక్కనున్న గురునాథుడును మారనయు అట్లే యొనర్చిరి. వారిని చూచి సభయంతయు మహోత్సాహముతో న ట్లొనర్చెను. త్ర్యంబకమంత్రము ఉద్ఘోషింపబడెను!

రుద్రుని కంటి మంట కగ్గమైన కాముడు శ్రీమాతృసంబోధనచే సంజీవితుడై యీ రూపముతోడనే భావించెనా యనునట్లు ఆ మహాసభ విలసిల్లెను.

ఆ పరీక్షాసభ ఎక్కువసేపు పట్టలేదు. మూడుజాముల వేళకు అంతయు పూర్తి యయ్యెను. ఎవరిని ఏ ప్రశ్న యడిగినను వారు వేదపన్నములు అప్పగించినట్లే వెంటనే ఉత్తరము లీయసాగిరి. మరి వారికి విజయపట్టికలు ఈయవలదా? పత్రము లన్నియు నప్పటికే వ్రాసి సిద్ధముగా నున్నవి. తిక్కనసోమయాజులు చేవ్రాలు చేయుటయే మిగులు!

కాని తిక్కనసోమయాజులు చేవ్రాలు చేయ నిరాకరించిరి. సోమయాజులకు తృప్తి కాలేదు!

"మీరందరును ఖడ్గము శూలము ధనుస్సు—ఇందులో ఒక్క రణసాధనము ప్రయోగించుటలో నైన ప్రవీణులు కావలెను!"

సోమయాజుల యాజ్ఞ యది! పిలిచిన పెద్దల నిర్ణయమును ధిక్కరించుటకు అలవాటు పడలేదానాటి జనములు! ఆ బ్రాహ్మణు లందరును సోమయాజుల యాజ్ఞకు తలయొగ్గిరి. ఒక్క మాసము దినములు వ్యవధి కోరిరి. గురునాథుడును నెల్లూరినుండి వచ్చిన కిరణములు నే, యా విద్యలు నేర్పుటకుగూడ పూనుకొనిరి!

ఒక్కసారిగా వారి విద్యాశాలలు గరిడి నేర్పు శాలలుగా మారిపోయినవి!

## ౪౫

మహాశివరాత్రి దగ్గరకు వచ్చినది!

ఒక నాటి యర్ధరాత్రసమయమున దూరమునుండి బిగ్గరగా నిట్టూర్పు చున్నట్లు చిత్రమైన ధ్వని ఓరుగల్లు పౌరులకు వినబడెను. ఓరుగల్లు పౌరులకే గాదు ఓరుగంటికి చుట్టును చాలదూరమున నున్న పల్లెలను పట్టణములను ఆ ధ్వని విన

నయ్యెను! ఏమిటీ ధ్వని! మనుష్యు లందరు నిద్రపోవుచున్నవారు ప్రక్కలపై నున్నవారు ప్రక్కలపైలేచి కూర్చుండి భయవిహ్వలులై యాశబ్ద మాలకింపసాగిరి. మనుష్యులే కాదు. పశువులుగూడ చెవులు రిక్కించి మోరలెత్తి భయభ్రాంతములై దాని నాలకించుచుండెను. పక్షులు తమ కులాయములనుండి అరచుచు బయటికి వచ్చి వృక్షములపై నల్లాడసాగెను. కీటకములుగూడ తమ కులాయములనుండియు చాటుమాటు నివాసస్థానములనుండియు బయటికి వచ్చి ప్రాకులాడుచుండ నేల యీనినదా యనిపించుచుండెను.

ఆ శబ్ద మేమి? పిశాచములు దండు వచ్చుచున్నవా? ఆకాశము విరిగి మీద పడనున్నదా? సముద్రము చెలియలికట్టను త్రెంపుకొని భూమండలమును కబళింప దొరకొనినదా? ఆదిశేషుని ఫూత్కారమా?

అల్పకాలముననే దాని స్వరూపము స్థిరపడినది. వాయుదేవుడు స్వేచ్ఛావిహారము ప్రారంభించినాడు! అతడు జగత్ప్రాణుడే, కాని కోపించినయెడల లోకము నంతటిని మ్రింగివేయు మారుతుడుగూడ నతడే; సర్వమును పునీత మొనర్చునా పవమానుడే మధ్య మధ్య ప్రభంజనుడును! సర్వమును గ్రహింపగల శక్తి తనకున్నదని యాతని గర్వము!

అట్టి మరుత్వాను డిప్పుడు ప్రకోపించినాడు! ముందు నిట్టూర్పులుగా వినబడిన శబ్దము హోరుగా మారిపోయినది. కాని గాలి యెటునుండి వీచుచున్నదియో మాత్రము స్పష్టము కాలేదు. ఒకకొంతవడి తూర్పునుండియు, కొంతవట్టు పశ్చిమము నుండియు, మరికొన్ని యెడల దక్షిణమునుండియు, ఇంకొకతరి యుత్తరము నుండియు వచ్చుచున్నట్లున్నది. అది యొక భయంకరమగు సుడిగాలి! గాలిగుండము!

ఆ ప్రభంజనముతో పాటు నలువైపులనుండి కాలమేఘములు క్రమ్ముకొని వచ్చినవి. ఆ మేఘములను గాలితాకు పింజెలు పింజెలుగా ఏకివేయుచున్నది. ఏమైనను తెల్లవారుజామున వర్షము ప్రారంభించినది. అదియును కుండపోత!

ఆగాలికిని ఆవర్షమునకును ఓరుగంటి పరిసరము లన్నియు గడగడలాడిపోయెను. తలదాచుకొన నిరవులు కలవారే నిలువలేకపోయిరి. ఇక నట్టి యాచ్ఛాదనలు లేనివారు తాళలేకనేపోయిరి. దేవకార్యములును రాజకార్యములును మనుష్యకార్యములును సర్వము కట్టువడిపోయినవి. నిముష మొక యామముగా, యామ మొకదినముగా, దిన మొక సంవత్సరముగా గడచిపోవుచున్నది.

ఈ మాఘమాసములో నీ యకాలవర్షము!

అట్లు మూడు రాత్రులు మూడు పవళ్ళు, గాలియు వానయు ఓరుగల్లు పరిసరములను దడదడ లాడించెను. వృద్ధు లింతటి గాలి వాన తమ జన్మలలో చూడలేదనిరి. పెద్ద పెద్ద భవనములే కొన్ని కూలెను; పూరియిళ్ళెగిరిపోయెను. పడిపోయిన చెట్లకు లెక్క లేదు. దేశమంతయు జలమయముగా కనిపించెను. పశుపక్ష్యాదు లల్లాడిపోయెను.

రేపు మహాశివరాత్రి యనగా తెరపి యిచ్చెను! సూర్యభగవానుడు దర్శన మిచ్చెను. ప్రజలు ఒకరి మొగము లొకరు చూచుకొన బయలు వెడలిరి. ప్రమాదములు కలిగిన జనులను గుర్తించి యుపచారాదులు చేయుట, పారిపోయిన పశువులను వెదకి

తెచ్చుకొనుట, పడిపోయిన గోడలను ఇళ్ళను సరిచేసికొనుట జనములు ప్రారంభించిరి. తన దొడ్డిలో చెట్టుపై కాకులు గూళ్లు పెట్టి చికాకుపరచుచుండగా, ఆ యింటి గృహస్థు కోపించి యా గూళ్ళను తీసిపారవేయగా, ఆ కాకులు అరచుచు తీసివేసిన పుల్లలను మరల ఒక్కొక్కటే ఏరి ముక్కులతో కరచి తెచ్చి చెట్టుపైపెట్టువిధమునే వారి చర్య లనుకరించెను. చిమ్మివేసిన చీమలపుట్టనుండి వెడలి బారులు తీరి వేలకు వేలుగా కూడి మరల తమ పనికి ఉపక్రమించు చీమల సంరంభమునే ఆ ఓరుగంటి ప్రజల ఆత్రము స్మృతికి తెచ్చెను.

* * * * * *

ముందు వచ్చిన వార్తల ననుసరించి శ్రీ రుద్రదేవమహారాజులు మహాశివరాత్రి నాడుదయమున పురప్రవేశము చేయవలసియుండెను. కాని యీ గాలివాన యన్ని ప్రయత్నములను తలక్రిందులు చేసివేసినది. మహారాజు లెంతవరకు వచ్చినదియు గూడ వార్త రాలేదు.

వార్తాహరులు మాత్రము మనుష్యమాత్రులే కదా! వారు రాలేదని కోపించిన లాభము లేదు. రుయ్యాము వెంటనే మహారాజుల క్షేమవార్తకై వేగరుల బంపి ఏకశిలానగరమున పరిస్థితులు చక్కజేయు ప్రయత్నమున నిమగ్న యయ్యెను.

ముఖ్యముగా శిలాప్రాకారనిర్మాణమున నియుక్తులైన శిల్పులును పనివారును ఈమూనాళ్ళను యమయాతనయే యనుభవించిరి. గోన గన్నారెడ్డి మహాసైన్యముతో బల్లాలకర్ణాటసేనల నెదుర్కొన బోయిన దాది శిలాప్రాకారనిర్మాణకార్యక్రమ మంతయు మేచయనాయకుని యల్లుడగు నాగదేవనాయకునిపై బడినది. అతడు వెంటనే పనివారిని కూర్చుకొని, పని కడ్డముగా కందకములలో నిలిచిన నీరు వెడల గొట్టించుచు, వారికి కావలసిన సమస్తసదుపాయములు కల్పింపసాగెను.

మేచయనాయకుడు స్వయముగా నగరమునం దెల్లెడ సంచారము చేయుచు పౌరులకు తన భటు లెల్లవిధముల సహాయముగా నుండునట్లు శాసించుచుండెను.

జైనవసదిలో మహాశివరాత్రికి నేమినాథప్రతిష్ఠ జరుగవలసియుండెనుగదా! గాలివానకు ముందే దాని ప్రయత్నము లన్నియు బూర్తియైనవి. కాని యచ్చటికి ఉత్సవము చూడవచ్చు నశేషజనమునకు అచ్ఛాదనకును నివాసమునకును నిర్మించిన పందిళ్లు పాకలు ఎగిరిపోయినవి. సమర్థు లగు శిల్పులు వెంటనే వాని నన్నిటిని సరి చేయుటకు ప్రారంభించిరి. అప్పటికే ప్రతిష్ఠకు పూర్వాంగములగు మాంత్రిక తాంత్రికములు నిర్విఘ్నముగా సాగిపోవుచున్నవి.

రాజకోశమునుండి వసది పెద్దలు అర్థించిన లక్ష సువర్ణములును ముందుగనే వారికి పంపబడియుండెను. ధనవంతులగు జినభక్తు లెందరో విరివిగా నా ప్రతిష్ఠకు ద్రవ్య సహాయ మొనర్చిరి. నగరములో పెద్దల కందరకు వసదినుండి యాహ్వానములు వచ్చినవి. రాజమందిరమునకు ప్రత్యేకముగా నాహ్వానము విశేషగౌరవముతో పోయి యుండెను. శ్రీ రుద్రదేవమహారాజులు స్వయముగా ప్రతాపరుద్రకుమారులతో గూడ వచ్చి యా మహోత్సవము దర్శించిపోవలెనని వారు మరిమరి యర్థించిరి. కాని శ్రీ రుద్రదేవమహారాజులు గాలివాన[illegible] నిలువవలసివచ్చిన దని యా

పెద్దలు విని నిరుత్సాహపడిపోయిరి. "లక్ష సువర్ణము లిప్పించి యనుగ్రహించిన మహారాజులు వచ్చు భాగ్యము మాకు ప్రాప్తము కాలేదు. మహాదేవరాజులు శ్రీ ప్రతాపరుద్రకుమారులతో నక్కడికి దయచేసిన కొంత కృతార్థుల మగుదుము." ఇట్లు వసది పెద్దలు అర్థించిరి. మహాదేవరాజు మిక్కిలి ప్రీతుడై యంగీకరించెను. ప్రతాపరుద్రకుమారుడును పోయి చూడ నుబలాటపడసాగెను.

మహాశివరాత్రి వచ్చినది. స్వయంభూదేవాలయమున వైదిక శైవవైభవముతో అభిషేకార్చనలు సాగిపోవుచుండెను. కరణపాఠశాలలో శస్త్రవిద్య నిప్పుడభ్యసించుచున్న బ్రాహ్మణు లందరును తమ తమ క్రొత్త శస్త్రములతో నాలయప్రాంగణమున కరుదెంచిరి. వారు శతరుద్రీయమును మహారుద్రసంఖ్యగా జపింప సంకల్పించి మహాదేవుని పురుషసూక్తముతో ముందు ధ్యానించిరి. మహాదేవుడు విశ్వరూపుడై వారి హృదయములలో నాట్యమాడించెను. వారంతట నామూర్తిని శతరుద్రీయముతో మరల మరల స్తోత్రము చేయ నారంభించిరి. ఉదయముననే వారందు నుపక్రమించిరి. శతరుద్రీయము నూట యిరువదయొక్క మారులు జపించుట వారి కెప్పటికి పూర్తి యగును? అందులో మధ్యవచ్చు మాధ్యాహ్నికములు సాయాహ్నికములు గూడ నిర్వర్తించుకొనవలెను. లింగోద్భవకాలమునకు గాని వారి సంకల్పించిన జపము పూర్ణత నొందదు! విశ్వమూర్తిని ధ్యానించువారికి సర్వసంకల్పసిద్ధి సాధ్యమగుచో శస్త్రసాధనసిద్ధి యొకటని ప్రత్యేకము చెప్పనేల?

మరియు శివభక్తులు అనేకవిధముల నీశ్వరు నారాధించుచుండిరి.

జైనవసదిలో తెల్లవారుజాముననుండియు ఒకేతీరున ఘంటానాదములు మ్రోయుచున్నవి. పెద్ద పెద్ద యుష్ణీషములు ధరించి జినభక్తులు వేలకు వేలుగా వసదికి వచ్చుచుండిరి. రాత్రి ఎనిమిదిగడియలకు గాని గర్భగుడిలో ప్రతిష్ఠాకలాపము పూర్తి కాదు. అంతవరకు మధ్య మధ్య ప్రతిష్ఠాంగముగా తీసికొనిపోబడు ద్రవ్యములే ఆ మహాజనము దర్శించి జయజయనాదములు చేయుచుండిరి. గర్భగుడికి ముందు చిన్న ముఖమండపము కలదు. అందులో జైనసాధువులు పలువు రుపవిష్టులైరి. దానికి బయట మహామండపమొకటి తాత్కాలికముగా నిర్మింపబడినది. ఉత్సవము దర్శించుటకు వచ్చిన పెద్దల కందరికి నచ్చట ఆసనాద్యుపచారములు జరుగుచుండెను. ప్రతిష్ఠ పూర్తియైనపిమ్మట ముందు వసదికి ప్రధానాచార్యుడగు సిద్ధనంద్యాచార్యులు ప్రథమపూజ నిర్వర్తింతురు. ఆపిమ్మట పెద్ద లందరు నొకరొక్కరే ముఖమంటపములోనికి వచ్చి నూతనప్రతిష్ఠిత నేమినాథవిగ్రహమును దర్శించి ప్రసాదము పుచ్చుకొని వెళ్ళవచ్చును.

ఉద్యోగులలోనచ్చటికి రేచర్ల రామిరెడ్డి నామిరెడ్డి మల్లయరెడ్డి గణపిరెడ్డి మల్రెడ్డి మధ్యాహ్నముననే వచ్చిరి. చీకటిపడువేళకు నాగిదేవనాయకుడు వచ్చి దర్శనమున కాలస్య మున్నదని తెలిసి వచ్చెద నని వెడలిపోయెను.

మహాదేవరాజు సాయంత్రము మూడు జాములకే ప్రయాణమై ప్రతాపరుద్రకుమారులను తెమ్మని అంతఃపురములోనికి వార్త పంపెను. అంతఃపురమునుండి ఇదిగో అదిగో అని కొంతవడి వార్తలు [illegible]ను. మహాదేవరాజు బయట తొందరపడుచుండెను. ప్రతాపరుద్రకుమారు[illegible] ఉబలాటపడుచుండెను. అతని తల్లి ముమ్మ

డయ్యె యాతని ప్రయాణమునకు ముస్తాబు చేయించుచుండెను. అంతలో కామసాని కుబ్జతో నా మెయొద్దకు వచ్చి, శ్రీరుద్రదేవమహారాజులు మరల తాము తిరిగివచ్చువరకు శ్రీ ప్రతాపరుద్ర కుమారుని నెట్టి సందర్భములందును అంతఃపురము వెడలిపోవనీయవద్దని యాజ్ఞాపించిరని జ్ఞప్తికి తెచ్చి నిషేధించెను. కామసాని అంతఃపురరక్షకురాలు అధికారిణి! అందులో నామె మహారాజుల స్పష్టమైన ఆజ్ఞను గుర్తుకు తెచ్చినది. అనిధిక్కరించి కుమారుని పంపుట సమంజసము కాదు. గట్టిగా కామసాని పట్టుపట్టినచో రాజపుత్రిక యగు తానుకూడ ఎదురాడ లేదు. కామసాని పట్టుదలమనిషి. అంత ముదుసలియైనను దాని తీవ్రత యేమియు తగ్గలేదు. మరి ప్రతాపరుద్రకుమారుని ఉబలాటమును మహాదేవరాజుల కోరకను తాను ధిక్కరించు టెట్లు? పాపము ముమ్మడమ్మ కామసానివంక చూచెను. దాని ముఖము నిశ్చలముగా తీక్ష్ణముగా నుండెను. లాభము లేదని నిశ్చయించి ప్రతాపరుద్రకుమారులు రాలేరని వినయవిధేయతలతో మహాదేవరాజులకు వార్త పంపెను. అది విని క్రోధోగ్రుడై మహాదేవరాజు కదలి యొంటరిగా చీకటిపడిన తర్వాత వసదికి చేరుకొనెను. అక్కడి పెద్ద లాతని మిక్కిలి గౌరవించి ప్రతాపరుద్ర కుమారులు రాలేదేమని మరిమరి ప్రశ్నించిరి. ఏమని చెప్పగలను? మనస్సులో క్రోధము మండిపోవుచున్నది. అంతఃపురజనము నిషేధించుటచే తాను తన కుమారుని వెంట తీసికొని రాలేకపోతి నని చెప్పనా? మూతి బిగించుకొని యట్లే యతడు సభలో కూర్చుండెను. గొప్పవారియింటి యాడుబడుచును వివాహమాడిన యల్లుని యవస్థలో నాతడుండెను.

మరియు నా సభకు ప్రోలరౌతు ప్రసాదాదిత్యనాయకుడు రుద్రమనాయకుడు ఇత్యాదులగు ఉన్నతోద్యోగులు వచ్చిరి. నేమినాథదర్శన మగువేళకు నాగదేవనాయకుడును మేచయనాయకుడునుగూడ వచ్చిరి.

పెద్దలను దర్శనమునకు ముఖమండపములోనికి రావచ్చునని సూచించుచు మనోజ్ఞమగు ఘంటారావ మొండు మ్రోగెను. అది యొక యపూర్వమగు ఘంట! ముఖమండపమునకును సభామండపమునకును మధ్య నున్న రెండు ద్వారములలో నొకప్రక్క నున్న ద్వారము తెరువబడెను.

మిక్కిలి ప్రొద్దుపోయినది. అందరును త్వరలో దేవదర్శనము కావించుకొని వెళ్ళిపోవలె నని తొందరపడుచుండిరి. లోపలికి వెళ్ళు ద్వారము చిన్నది.

రాజబంధువులలో అగ్రగణ్యుడగు మహాదేవరాజు ముందు బయలుదేరి ముఖమండపములోనికి వెళ్ళెను. అక్కడ జైనసాధువులు క్రిక్కిరిసియుండిరి. వా రెంతయు నాదరముతో నాతనికి గర్భాలయములో దిగ్వాససుడగు నేమినాథదేవుని దర్శనము చేయించి రుచ్యము లగు ప్రసాదము లిచ్చిరి. అతడు వచ్చిన దారినే తిరిగి వెళ్ళుటకు వెనుకకు చూడగా, మరియొక రటు లోనికి వచ్చుచుండిరి. ఆ వచ్చువారిని తాను త్రోసికొనిపోవునా? అందుచేత మిక్కిలి గౌరవముగా నక్కడివారు మహాదేవరాజును ముఖమండపమునకు దక్షిణముగా నున్న మరియొక ద్వారమున తీసికొనిపోయిరి.

మహాదేవరాజువిమ్మట ప్రసాదాదిత్యనాయకుడును రుద్రమనాయకుడును ప్రోలరౌతును నాగదేవనాయకుడును మేచయనాయకుడును లోనికి వెళ్ళిరి. వారి కందరకు దేవ

దర్శనము చేయించి ప్రసాదము లిచ్చి యట్లే ఒకరినొకరిని ప్రక్క ద్వారమున బంపిరి. గర్భాలయములో సిద్ధసంధ్యాచార్యులు లేకుండుట మేచయ కాశ్చర్యమై వారెక్కడ లేరేమని యడిగెను. వా రావల నున్నా రని దక్షిణద్వారము చూపి యచ్చటి కాతని బంపిరి. మేచయ కేదో సంశయము కలిగెను. కాని సంశయించుచునే అతడు దక్షిణ ద్వారమున ప్రవేశించెను.

ఆపిమ్మట పిల్లలమర్రిరెడ్లు—రేచర్ల కామిరెడ్డి నామిరెడ్డి చల్లయరెడ్డి గణిపిరెడ్డి సుర్రెడ్డి—మధ్యాహ్నమునుండి వచ్చి వేచియున్నవారు, దేవదర్శనమునకు వెళ్ళిరి. వారి నందరను ప్రసాద మిచ్చి మరియొకద్వారమున నావలకు పంపిరి.

ఇట్లే ప్రొద్దుపోవువరకు నగరములోని పెద్దలు దేవదర్శనమునకు ముఖమండపము లోనికి వెళ్ళుచునే యుండిరి. అక్కడినుండి వారిని కొందరిని దక్షిణద్వారమున, మరి కొందరిని ఉత్తరద్వారమున నావలకు పంపివేయుచుండిరి.

ప్రొద్దుపోవుచున్నకొలది దేవదర్శనమునకు సామాన్యప్రజల సందడి యెక్కువయ్యెను. ముఖమండపమునకును సభామండపమునకును మధ్య నున్న ద్వారము లాయొత్తిడికి సడలి మహాజనమునకు దారితీసెను. మహాకోలాహలముగా నక్కడ దేవదర్శన మగుచుండెను. వాకిట నిలిచియున్న పరిజనములు తమతమ ప్రభువు లేవాడ నున్నదియు తెలియక వాహనములతో తహతహలాడుచుండిరి !

## ౪౬

"సంగాసంగ జయాజయంబు పరిహాసప్రస్ఫుటాశ్లీల భా
షాంగం బాకలితాంతరావలయ కక్ష్యాభాగముద్రాలస
ద్భృంగీవిష్ఠిత కాష్ఠశంకుకము పాపద్యూత మీ పన్నిదం
బంగీకారము సేయువారి మొలలం బ్రాపించు గోపీనముల్."

వినుకొండ వల్లభరాయడు.

యువకవి యగు గోవిందశర్మయు కరణపాఠశాలలో చేరి విద్య నభ్యసించి యుండెను. శస్త్రపరిశ్రమ యాతనికి పూర్వపరిచితమే యైనందున ఈ నెలరోజులును ఆటవిడుపుగానే ఉన్నది. ఆతని తోడి బ్రాహ్మణులలో నెక్కువ మంది మహాశివరాత్రినాడు శస్త్రసాధనసిద్ధికై స్వయంభూదేవాలయమున శతరుద్రీయము జరిపించుచుండిరి. ఆతనికి తిరుగనేర్చిన కాలు ఐనందున, నిలుకడగా నచ్చట నిలువలేకపోయెను. మహాశివరాత్రి యుత్సవము చూచుచు ఓరుగంటి వీధుల వాడల సంచారము చేయ నాతడు బయలుదేరి పోయెను.

దారిలో నాతడు కర్ణాటభామలతో సరస మాడుచు, పామరభామలు గోమయ పిండములు ముంగిట చేయుట చూచుచు, సంపెంగనూనె యమ్మ కరణ

* వల్లభరాయడు.

కాంతల కోకిలస్వరము లాలకించుచు, ములికినాటి తెలికె చిలుకలకొలుకుల జఘనకు జూపుల కులుకును, మోహరివాడలలో కుట్రపుపనివారల గాంచును, నొక్కచోట పల్నాటి వీరుల కథ లాలకించెను.

"ద్రుతతాళంబున వీరగుంభితక ధుం ధుంధుం కిటాత్కారప
గతి వాయింపుచు నాంతరాళికయతి గ్రామాభిరామంబుగా
యతిగూడం ద్విపదప్రబంధమున వీరానీకముం బాడె నా
కృత ప్రత్యక్షరముం గుమారకులు ఫీట్కారంబునం దూలగన్."

అత డంత కాకతమ్మకు సైదోడగు ఏకవీరను దర్శించి ఆ దేవతయెదుట పరశు రాముని కథ లన్నియు పాడెడి బవనీల చక్రవర్తిని గాంచెను. దారిలో కాపుటాండ్రను జక్కుల పురంధ్రిని జూచుచు, సంతానకాంక్షి యగు నొకయజమాని అక్కలకు పెట్టుకొనుట తిలకించెను. భైరవుని గుడి, చముడేశ్వరీశక్తి నగరు, వీరభద్రాలయము, బుద్ధుని గుడి, మసానమ్మగుడి, కుమారస్వామి యాలయము, పాండవులగుడి, చూచుకొనుచు బోయి యాతడు మధ్యాహ్నమునకు బ్రాహ్మణులవాడకు చేరికొని, యట పూటకూటింట నొక్కరూక యిచ్చి కప్పురభోగివంటకము కమ్మని గోధుమ పిండివంటయు గుప్పెడు పంచదారయును క్రొత్తగా గాచిన యాలనేయితో పెసరపప్పును కొమ్ము నల్లనటిపండ్లు ఐదు నంజులతో గడ్డపెరుగుతో కూడ భుజించి గర్రున త్రేపుచు మరల నగరసంచారమునకు బయలుదేరెను.

అభ్యాసవశమున నాతని కాళ్ళంతట వేశ్యలవాడవైపుకు సాగిపోయినవి. దారిలో కోళ్ళపందెములు పొట్టేళ్ళపోరు చూచునంతలో చీకటిపడెను. వేశ్యలవాడ సమీపమున పలువురు జూదమాడుట యాత డుపలక్షించెను. మాచల్దేవి ముఖసందర్శనము చేయవలె నను నుత్కంఠనుగూడ మించి యాతని నా యక్షముల చప్పుడు నిలువవేసెను.

ఆ జూదమాడువారు గోవిందశర్మకు పూర్వపరిచితులు కారు. వారి యాకారములును మాటలునుగూడ అటువైపువారివిగా కనుపట్టలేదు. ఐనను జూదములో కొత్తపాతలతో నిమిత్తము లేదుగదా! ప్రొద్దుపోవువరకు వారితోపాటు గోవిందశర్మయు జూద మాడెను. కాని మధ్యమధ్య వారు పన్నిదములు వేయుటలో నర్మగర్భముగా "ఇదిగో మేచయ తలతో పందెము!" "ఇదిగో మహాదేవరాజు!" "ఇదిగో ప్రతాపరుద్రుడు!" "రుద్రదేవమహారాజులే ఈ పందెమునకు సాక్షి!"— ఇట్టి మాట లాత డాలకించి కలవరపడసాగెను. జూదరుల సంభాషణలో తప్పనిసరిగావచ్చు, అశ్లీలములు హేళనములు అర్థము లేని మాటలు పౌరుషవచనములు సంకేతవాక్యములు ఆతనికి పూర్వపరిచితములే! కాని యీనా డట్లు వారు మాట్లాడుచుండుట యాతని కేదో భయము కలిగించుచుండెను.

అంతలో దూరమున జైనవసతినుండి యొక ఘంటానాదము భయంకరముగా వినవచ్చెను. ఆ ఉత్తరక్షణముననే ఆ మందిరాంతర్భాగముననుండి యొక జైన సాధువు వచ్చి చేయి యెత్తెను. అందరు నొక్కసారిగా మంత్రముగ్ధులవలె యాట



చాలించి లేచి నిలువబడిరి. ఆ సాధువు గోవిందశర్మపై క్రూరమైన దృష్టి ప్రసరింప జేసి "ఇత డెవరు?" అని యచ్చటివారిల బ్రశ్నించెను.

ఆ మాటలు వినినంతనే ఆ కంఠస్వరము పూర్వపరిచితమైన దని యాత డుపలక్షించెను. అది మాచల్దేవి భవనమున ప్ర్వతనాయకునితో జూదమాడి పోరిన యజ్ఞాత యోగిది! అత డాతని కంఠము గుర్తించినదే తడవుగా ప్రక్కనున్నవా రాతని బట్టుకొనబోవుచుండి రని యాతనికి దోచినది. వెంటనే శర్మ వీథిలోనికి పరుగెత్తెను. నలువు రాతని వెంబడించిరి. చీకటిలో గోవిందశర్మ పారిపోవుచుండెను. వెంటబడువారిలో నొక్కడే యాతని నుపలక్షించి పట్టుకొన మీద బడెను. గోవిందశర్మ పూర్వాభ్యస్త మగు మల్లయుద్ధనైపుణ్యముచే నాతని మూడు పిడి గ్రుద్దులతో క్రింద పడవేసి తప్పించుకొని పోయి వేశ్యావాటిక జొచ్చి మాచల్దేవి యింటిలోనికి పరుగువారెను.

మాచల్దేవి యాతని తత్తర ముపలక్షించి ఎకసక్కెముగా, "ఏమిటి కథ, యువకవిగారూ?" అని ప్రశ్నించెను.

"కొంప మునిగిపోయినది!"

"మీ రీనాడు చెప్పిన పద్యములో యతిభంగ మయినదా?"

"మన కాభయము లేదు. యతిభంగమైన ఆంధ్రపద్యమును కర్ణాటసంప్రదాయ మని తప్పించుకొందును."

"మరి ప్రాసభంగ మైనచో?"

"అది నీకు తెలియదు, సంస్కృత మందును!"

"మీ దేహమున కేదో, ఈ మహాశివరాత్రిపూట, సంస్కార మైనట్లున్న దే!"

"సంస్కారమే కాదు, దేహశుద్ధియే కావలసినది, తప్పించుకొంటిని!"

"ఎవరె యింట?"

"అక్కడను సరసతే ఉండెడిది. జూదరుల యింట?"

"ఓడి ఎగవేసి వచ్చితిరా? నేను వారికి మిమ్ము పట్టించి ఈయవలసివచ్చును!"

"ఆ భయము లేదు!"

ఈ మాటలతో గోవిందశర్మ తేరుకొని మాచల్దేవికి ఏకాంతమున జరిగిన దంతయు తెలిపెను.

గోవిందశర్మమాటలు వినినంతనే మాచల్దేవికిని భయమయ్యెను. కొంతకాలము నుండి ఆ యోగిసంగతి తలచినప్పు డెల్ల విపరీతమైన భయముతో నది యదరిపోవ సాగెను. ప్రభువులను నగరనాయకులనుగూర్చి యంత చులకనగా ప్రసంగించుటయు, వారి తలలపై నక్షత్రములైన పంచెము లొడ్డుటయు సామాన్యులు చేయునవి కావు. జైన వసతిలో నేమినాథ ప్రతిష్ఠప నగరపెద్ద లందరును వెళ్ళియుండిరి. అక్కడి ఘంటనను ఇక్కడి యోగి జూదమాటనను ఏదో సంబంధ ముండి యుండవలెను. ఏదో మహా ప్రమాదము జరిగియుండవలెను!



ఇట్లాలోచించుచుండినంతలోనవె, జైనవసదికి తమ ప్రభువులవెంట నేగిన పరిచారకులు తమ ప్రభువులు కనబడనందున వేశ్యావాటికను వచ్చి రేమో తెలిసి కొనుటకు వారు వచ్చిరి. మేచియనాయకుని పరిచారకులు వచ్చి మాచల్దేవికి నమస్కరించి, "మా ప్రభువు లిటు వచ్చిరా ?" యని ప్రశ్నించిరి.

మాచల్దేవి : "లేదు. ఏమి జరిగినది ?"

"మా ప్రభువులు నేమినాథదర్శనమునకు లోపలికి పోయిరి. మరల కనబడలేదు."

"అంతేనా ? మరియొకమార్గమున ఇంటికి వెళ్ళిరేమో !"

"లేదు. మహాదేవరాజులును కనబడలేదని వారి పరిచారకులు వెదకుచున్నారు."

"ఆఁ ! ఏమి ?"

"అంతే కాదు ! ప్రసాదాదిత్యనాయకుడు, రుద్రమనాయకుడు, ప్రోలరౌతు నాగదేవనాయడు !_"

"త్వరగా పోయి, మీరు శ్రద్ధగా వారు సామాన్యముగా వెళ్లు ప్రదేశములు వెదకుడు !"

ఇట్లనుచునే మాచల్దేవి తీవ్రముగా నాలోచించెను. శీఘ్రముగా నొక నిశ్చయమునకు వచ్చెను. లోనికి పోయి ఒక్క యరగడియలో పురుషవీరుని వేషము ధరించి ఖడ్గము చేతబట్టి గోవిం...నుగూడ కవచము శిరస్త్రాణము ధరింపజేసి ఖడ్గము చేతికిచ్చి తనతో రిష్మని ...ండి నాతనితోగూడి ప్రయాణ మయ్యెను.

మాచల్దేవి యట్లు . ...పోయి యన్నమంత్రిదివాణము చేరి యక్కడ కాపున్న భటునిద్వారా తిక్కనసోమయాజులకు మీకొరకు శరణాగతు లిరువురు వచ్చినారని వార్త పంపెను. ఆ మాటలకు వెంటనే తిక్కనసోమయాజులు లోపలికి రానిమ్మని యనుజ్ఞ యీయగా భటుడు వారిని లోనికి తీసికొనిపోయెను.

మాచల్దేవి గోవిందశర్మ వెంట పోయి సోమయాజులకు ఆతనితోపాటు మ్రొక్కెను. వా రిరువురును జరిగిన దంతయు సోమయాజులకు నివేదించిరి. సర్వము నాలకించి సోమయాజులు వారిముఖములు తేరపార జూచెను. మోసము కనబడలేదు. అంతట నాతడు వారి నిట్లడిగెను.

"నావలన మీకు కావలసిన కార్య మేమి ? ఈ యర్ధరాత్రమున మీ మాటలు నమ్మువా రెవరు ?"

"మీయొద్ద శ్రీరుద్రదేవమహారాజుల అభయపత్ర మున్నది. మీ రెప్పుడైనను ఎక్కడి కైనను పోవుటకుగూడ ననుజ్ఞ కలదు. ఈవేళ రాజమందిరము చొచ్చి, యీ ప్రమాదవార్త రాజప్రతినిధుల కందజేసి, ప్రతీకారము ఆలోచించవలెను !"

సోమయాజులు మరియొక్కక్షణమే యాలోచించెను. ఇది యాలోచించుటకు గాని యాలసించుటకు గాని సమయము కాదు. గురునాథునకు మారనకును దివాణము భటులతో జాగరూకులై కాచుచుండవలె నని చెప్పి యప్పగించి, గోవిందశర్మను మాచల్దేవిని వెంట దీసికొని రాచనగరికి బయలు దేరెను.

నగరికి బయట కాపున్న భటులు ముందు వారి నడ్డగించిరి. ఆపిమ్మట సోమయాజులు చూపిన పత్రములు చూచి, కన్నుల కద్దుకొని, వారికి భయభక్తులతో త్రోవ విడిచిరి. కాని వారివెంట మాచద్దేవిని గోవిందశర్మను పోనీయలేదు.

సోమయాజుల కోరికప్రకారము భటులు దారితీయుచు సగౌరవముగా రుయ్యమ్మ వాకిలిముందుకు తీసికొనిపోయి వారి రాక యామె కెఱిగించిరి.

## ౪౮

రుయ్యమ్మ యింకను నిద్దురపోలేదు. రుద్రమ్మ యాత్ర పోవుచు ఆ పిల్లపై పెట్టిపోయిన భారము దుర్భర మైనది. రుద్రమ్మ యూహ యేమైన గావచ్చును గాని, యది రుయ్యమ్మకు భరింప సాధ్యము కాకున్నది. అందును ఆలనాటి యర్ధరాత్రమున తప్పెటల జూక జుంజుమ్మను చప్పుడు వినుచు, దేవగిరిప్రభువు దండెత్తి వచ్చినచో కోట రక్షించు టెట్లు, అను భయము కలిగిన నాటనుండి ఆ పిల్లకు నిద్రాహారములే లేవు. అది యాలోచించి ముందు అన్ని పనులను చాలించి రాజమందిరముచుట్టును శిలాప్రాకారము మాత్రము తొందర చేసి పూర్తి చేయునట్లు గావించినది. కాని యంతలో నేమగును? ప్రారంభించిన మహాశిలాప్రాకారము ఎన్నటికి పూర్తి యగును? ఏమైనను పుట్టకోటను రక్షించుటకైనను చాలినంతమంది సైనికులు లేరె!

మొదలే నిద్దురపట్టని రుయ్యమకు, రుద్రమయొద్దనుండి గాలివాన వచ్చినదాది వార్తలే రాకపోవుటతో, నీ నాడు మనస్సు జ్వరబాధతోవలె తపించి పోవుచున్నది. అన్నిటికి తోడుగా నీనాడు తిక్కచమూపతియొద్దనుండియు గోన గన్నారెడ్డియొద్ద నుండియు వార్తలు వచ్చినవి. ఇటు చోళసేనలు కాని, అటు కర్ణాటసేనలు గాని, దండెత్తి వచ్చుచున్న వార్తలు నిజముకావు. ఆ రెండు దిక్కులను ఎట్టి యలజడియు లేదు. ఆ రెండు మహాసైన్యములును వృథాగా ఓరుగల్లునుండి తరలింపబడినవి. అయ్యో! ఎంత ప్రమాదము సంభవించినది? తనకు రకరకములైన వార్తలు వచ్చియుండెనే! అవి యన్నియు నబద్ధములేనా? అట్లైనచో దేవగిరి ప్రభువు దేహళీసేనలను ఎదుర్కొనబోయిన వార్త నిజమగునా? రుయ్యమ్మకు ఆ మహాశివరాత్రినాడు కాళ్ళాడలేదు. ఎవరితో నాలోచన చేయగలదు? నగరములో పెద్దల నామె పిలువనంపెను.

మహాదేవరాజు జైనవసతినుండి రాలేదట! మేచయ రాలేదట. ఆతని యల్లుడు నాగదేవనాయడును రాలేదట. ప్రోలరౌతు రాలేదట. ప్రసాదాదిత్యనాయకుడును, రుద్రమనాయడును, వల్లనాయకుడును గూడ తిరిగిరాలేదట! వారెక్కడ నుండిరోకూడ వెంట వెళ్ళిన పరిజనమునకే తెలియదట. నేమినాథస్వామిదర్శనమునకు లోనికి వెళ్ళిన తర్వాత, వారిని చూచినవా రెవరును కనపడలేదు. ఎవరికి వారు మే మెరుగ మన్న మే మెరుగ మనుచున్నారు. పలువు రున్నతోద్యోగుల కథయు నిట్లే యున్నది. ఏమి యీచిత్రము!

రుయ్యమ్మ కీవార్తలు విన, పిచ్చి యెత్తినట్లే యైనది. ఎవరి నేమని యడుగును ? అట్టి సమయమున తిక్కనసోమయాజులు తనకై వచ్చిరని పరిచారకుడు చెప్పినంతనే, సాక్షాత్తుగా పరమేశ్వరుడే తన్నుద్ధరించుట కారూపమున ప్రత్యక్ష మైనట్లు దానికి తోచెను. వెంటనే వచ్చుచున్న సోమయాజుల కెదురు వచ్చి యది పాదాభివందనము చేసినది.

'శీఘ్ర మేవ కల్యాణప్రాప్తిరస్తు!'

మహాదేవుడు న న్నిట్లు ఆశీర్వదించుచున్నాడు ! అంత యాందోళనములో గూడ నా చిన్నదాని ముఖము సిగ్గుతో జాజువారెను.

అంతట నది సోమయాజులను వచ్చిన పని యేమని ప్రశ్నింపలేదు. తన్ను రక్షించుటకు తన తండ్రి వచ్చినట్లే భావించి, వెంటనే దాపరికము లేకుండ తనకష్టము లన్నియు సోమయాజుల కా చిన్నది నివేదించుకొనెను. సోమయాజులు శ్రద్ధతో నాలకించి, నగరివాకిట నిలుచున్న మాచల్దేవిని, గోవిందశర్మను లోనికి రుయ్యమ్మ యనుజ్ఞతో రప్పింపజేసెను. గోవిందశర్మ తాను ద్యూతశాలలో విన్న వాక్యములను తుదకు జరిగిన విషయమునునివేదించెను. మాచల్దేవి అజ్ఞాతియోగి వేషములు వివరించి మేచయనాయకాదు లకై వారి పరిచారకులు పట్టణములో వెదకుచున్నది తెలిపెను. రుయ్యమ్మకు ఆవార్త లింకొకవిధముగా తెలిసియున్నందున, సందేహము లన్నియు జైనవసతిమీదికి ప్రసరించెను. ఈనాడు వారు ప్రతాపరుద్రకుమారులనుగూడ ఉత్సవమునకు రమ్మని ఎన్ని విధముల వినయవిధేయతలతో బలవంతపెట్టిరి ? అందులో దురుద్దేశ ముండితీరవలెను. కామసాని యచంచల నిశ్చయము ప్రతాపరుద్రకుమారుల కట్టి విపత్తు రాకుండ కాపాడినది ! కాని యిందరు నాయకులకు ప్రమాద మేదో చేయ సాహసించినవారు అంతటితో నాగుదురా ? ఈ రాత్రి తెల్లవారులోపలనే ఎన్ని ప్రమాదములు జరుగనున్నవో గదా !

సమస్తభారమును తనపై నుంచుకొని కాకతీయసామ్రాజ్యమును అకాల ప్రళయమునుండి రక్షింపవలసిన దని సోమయాజులను ప్రార్థించుచు రుయ్యమ్మ ఆతని కాళ్ళపై పసిపిల్లవలె పడెను.

సోమయాజులు ప్రీతితో దానిని లేవదీసెను.

"నేను మంత్రిత్వము వదలి చాలకాల మైనది. ఇక్కడి రాజ్యతంత్రము నాకు సుపరిచితమును కాదు. వెంటనే అన్నమంత్రీశ్వరులను నిర్బంధమునుండి విడిపించి యీ భారమంతయు నాతనిపై బెట్టుము ! సర్వము శుభమగును !"

తిక్కనసోమయాజుల యాజ్ఞ రుయ్యమ్మ శిరసావహించి లేచెను. అది మరు మాటాడక తనకు పూర్వము శ్రీరుద్రదేవమహారాజు లిచ్చిన యనుజ్ఞాపత్రి మాధారము చేసికొని, వెంటనే అన్నమంత్రీశ్వరులను బంధమోచనము చేయుచు పత్రము వ్రాసి, మరియొకపత్రముపై శ్రీరుద్రదేవమహారాజులు తిరిగి వచ్చువరకు వారికి ప్రతినిధిగా నుండి వ్యవహరించుటకు తన కిచ్చిన యధికారము లన్నియుగూడ అన్నమంత్రీశ్వరులకే సంక్రమింపజేయుచు, ఆ పత్రముల రెంటికి ముద్రిక వేసి సోమయాజులకు చూపెను. సోమయాజులు అంగీకారసూచకముగా తల యూపెను.

మరుక్షణమున దూత వెళ్ళి ఒక్క గడియలోపల అన్నమంత్రీశ్వరులతో తిరిగి వచ్చెను.

అన్నమంత్రీశ్వరుడు మందహాసముతో నచ్చటికి వచ్చెను. అతడును ఆనాడు అనధ్యయనము గనుక మహారుద్రజపము చేసి, మహాశివరాత్రి మంతయు జాగరణము చేయ నుంకించుచు, నెట్లు ప్రొద్దుపుచ్చుటా యని యాలోచించుచున్నంతలో, నాతనికీ పిలుపువచ్చినది. అతడు వచ్చినంతనే సోమయాజులకు వందన మాచరించి యాతని యాశీర్వచన మందెను.

అన్నమంత్రిని చూచినదాది రుయ్యమ్మ నోట మాట రాకున్నది. అది ఎంత ప్రయత్నించినను ఏమియు చెప్పలేకున్నది. అది సోమయాజులు వెంటనే యుపలక్షించి స్వప్నము సూక్ష్మముగా అన్నమంత్రికి వివరించెను. అంతయు వినియు వినిపించుకొననటే యతడు ప్రశ్నించెను.

"కరణపాఠశాలలో విద్యార్థులు కరణవిద్య నవగతము చేసికొనిరా ?"

సోమ : "కరణవిద్య నేర్చిరిగాని, రణవిద్య నేర్వలేదని నేను పట్టా లీయ నిరాకరించితిని."

అన్నమంత్రి : "ఇప్పుడు రణవిద్య ఎంతవరకు నేర్చిరి ?"

గోవిందశర్మ యందుకొనెను.

"ఒక్కొక్క రొక్కొక్క యాయుధసాధన చేసి ఈనాడు తత్సిద్ధికై మహారుద్రజపము చేయుచున్నారు."

అన్న : "ఎక్కడ ?"

గోవింద : "స్వయంభూదేవాలయములో, మంత్రీశ్వరా !"

అన్న : "నీవు వెంటనే పోయి, మగల నాయొద్దనుండి వార్త వచ్చువరకు, స్వయంభూదేవాలయముననే వారల నందఱను కదలకుండవలసినదిగా నామాటగా వారితో చెప్పుము !"

"చిత్త" మనుచు గోవిందశర్మ కదలిపోయెను.

రుయ్యమ్మయు అన్నమంత్రీశ్వరులపై భారమంతయు బెట్టి నమస్కరించి, యభ్యంతరమందిరములోనికి మాచల్దేవితో కలసి వెడలిపోయెను.

అన్నమంత్రి సోమయాజులవంక తిరిగి 'ఈరాత్రి మీరు నాకు నరునకు నారాయణునివలె నండగా నుండవలె'నని యర్థించెను.

అంతట అన్నమంత్రి యొక్క నిమేషమాత్రము ధ్యానించెను. వెంటనే ఆతని మనస్సులో, తాను బంధములోపడకముందు క్రీడా శైలమున విన్న ప్రాకార నిర్మాణ వివరము లన్నియు, మూర్తీభవించి కన్నులయెదుట నున్నట్లే భాసించెను. కాని అందులో నెంతవరకు ఇప్పటికి కార్యరూపము దాల్చినదో ఆతనికి తెలియదు !

వెంటనే యాతడు సోమయాజులను తోడుతీసికొని, భటులు కాగడీపికలు వెంట గొనివచ్చుచుండ, రాజమందిరముచుట్టు కట్టబడిన శిలాప్రాకారముచుట్టి

వచ్చెను. అది పూర్వనిర్ణీతవిధమున చాలవరకు పూర్తియైనది. మరుక్షణమున నాతని తలలో మహావేగమున కొన్ని లెక్కలు పరివర్తితము లయ్యెను.

అంతట వారు శీఘ్రగమనమున స్వయంభూదేవాలయమునకు బోయిరి. అక్కడ కరణవిద్యార్థు లందరు, మహారుద్రజపము పూర్తికావించి, తమ శస్త్రములతో జాగరణము చేయ నుపక్రమించుచుండిరి.

అక్కడి కావేళ సోమయాజులును అన్నమంత్రియును వచ్చుట చూడగా, వారికి నరనారాయణులే, ఆదిమానులే, ఆరూపమున ప్రత్యక్ష మైనట్లు తోచి, లేచి సాష్టాంగదండప్రణామము లాచరించిరి.

వెంటనే వారికి అన్నమంత్రీశ్వరుడు ఆజ్ఞలు ప్రవర్తింపజేసెను.

"మీరు మీమీ శస్త్రములకు నమస్కరించి గ్రహించి వరుసగా నిలువబడుడు!"

మరుమాటాడక ఆ బ్రాహ్మణు లట్లు చేసి నిలుచుండిరి.

"మీలో ధనుస్సాధన చేసినవారు కుడిప్రక్కను నిలుచుండుడు!"

వా రట్లే చేసిరి.

"మీలో ఖడ్గసాధన చేసినవారు ఇటురండు!"

బ్రాహ్మణకరణము లట్లే చేసిరి.

"శూలసాధన చేసినవారు అటు నిలుచుండుడు"

వా రట్లే చేసిరి.

"పరశుసాధన చేసినవారు ఇక్కడ నుండుడు!"

అట్లే అతడు వేర్వేరు ఆయుధసాధనలు చేసినవారిని వేర్వేరుగా నిలుచుండ జేసెను.

శస్త్రధారణ చేయవలసివచ్చిన యందరు బ్రాహ్మణులను జూచుచుండగా, సోమయాజుల కొకవంక దుఃఖమును, ఒకవంక ఆనందమును కలిగి కన్నులు ఆర్ద్రము లయ్యెను.

అన్నమంత్రీశ్వరులు వారి నెల్లర నిట్లు సంబోధించెను.

మీ రందరు భృగువంశపావనుడగు పరశురాముల నొక్కమారు స్మరింపుడు! మీ శస్త్రసాధనకీ రాత్రియే పరీక్ష రానున్నది. ప్రశ్నలు వేయక చెప్పినరీతిగా నాజ్ఞలు పాలింపవలెను!"

దాని కంగీకారముగా నా బ్రాహ్మణు లందరును ఓంకార మొనర్చిరి. ఆ ప్రణవనాదము భూనభోంతరాళముల నిండిపోయెను!

అన్నమంత్రీశ్వరు డంతట తాను ముందు వేసియున్న లెక్కప్రకారము వివిధ శస్త్రధరులగు నా నూతనభటులలో రెండువేలమందిని రాజమందిరముచుట్టు నున్న ప్రాకారముపై నిర్ణీతప్రదేశములో కాపుంచెను. రెండువేలమందిని స్వయంభూదేవాలయ

మున, జాగరూకులై యవసరములకై పిలిచినప్పుడు వచ్చుటకుసిద్ధముగానుండు మూలబలముగా పెట్టెను. మిగిలినవారిలో నొక్క వందమంది వీరులతో గోవిందశర్మను పంపి యాతడు జూదమాడిన ద్యూతశాలలోనివారి నందరను నిర్దాక్షిణ్యముగా బంధించుటకును ఎదురుతిరిగినవారిని ఖండించుటకును ఆజ్ఞాపించెను. మరియు ప్రధానచత్వరములలో కాపుగా నుండ పెక్కువందల వీరుల నాజ్ఞాపించి యాతడు పంపెను. అట్లు పంపిన ప్రతిదళమునకును నాయకులను, ఉపనాయకులను వెంటనే నిర్ణయము చేసెను.

ఇట్లాజ్ఞలు నిర్వర్తించి తనపై పెట్టుకున్న భారమునకై యొక్కగడియ పాటు యోచించెను. అంతలో తాను పూనిన కార్యమునకు వీరశైవవీరుల సహాయము లేదని సాధించుట కష్టమని యాతనికి స్ఫురించినది. అప్పటికే స్వయంభూదేవాలయమున నందరు బ్రాహ్మణులు శస్త్రధారు లగుట తిలకించిన శివభక్తులకును ఆవేశము పెరిగియున్నది. వారి కేదో మహారుద్రకార్యము నిర్వర్తింపవలసిన యదను వచ్చిన దని పొడకట్టినది. వారందరును చేతి కందిన ఆయుధములు — కర్రలు, కట్టెలు, కత్తులు, బల్లెములు, గొడ్డళ్ళు, పలుగులు, పారలు — ధరించి యన్నమంత్రీశ్వరుల యాజ్ఞలకై నిరీక్షించుచుండిరి.

అన్నమంత్రియు వారి నందరగూడ దళములుగా విభజించి నాయకులను, ఉపనాయకులను నిర్ణయించి కూడదీసెను. అంతలో నిద్దరు యువకులు అశ్వము లెక్కివచ్చి అన్నమంత్రీశ్వరున కొక కవచమును, శిరస్త్రాణమును, ఖడ్గాద్యాయుధములు నర్పించి, యొక యశ్వరాజమును ఇచ్చి, తమ్ము నాతనికి అంగరక్షకులుగా నుండ ననుజ్ఞ వేడిరి. అన్నమంత్రియు వల్లె యని కవచాదులు ధరించి సోమయాజులకు నమస్కరించి సెలవు పుచ్చుకొని అశ్వముపై నా నూతనసైన్యముతో బయలుదేరెను.

తిక్కనసోమయాజులు స్వయంభూదేవాలయముననే ఉండిపోయిరి.

అన్నమంత్రీశ్వరుని సేనలు అరగడియ దాటకముందే పోయి మహాసంరంభముతో జైనవసదిని ముట్టడించెను. అచ్చట నున్న మహాసేన యొకటి వారిని క్రోధారభటితో నెదుర్కొనెను.

## ౪౮

“యస్తస్యైవ రణే జహార కరిణస్తత్పంచ శబ్దాదికాన్
యస్తత్యాజ వధూవధా దుపరత స్తద్భూభుజం రుద్రమామ్.”

హేమాద్రి.

కాకతీయరాజులకు పాకాలయొద్ద సేనాస్కంధావార మొకటి కలదు. అచ్చట విశాలమగు నొక సరోవరమును గలదు. దానికి తూర్పున యోజనముదూరమున కిన్నెరసాని యను నొక వాగు పుట్టి యడవులలోగుండ ప్రవహించి భద్రాచలసమీపమున గోదావరీ నదిలో కలయుచున్నది. కిన్నెరసాని వాగునుగూర్చిన కథ లనేకము కలవు. దాని

పేరే మనోజ్ఞ మైనది. భద్రాచలసమీపారణ్యములలో ప్రయాణము చేయువారిని దాని పలుకులు ఎంతయేని ఆకర్షించును. కవీశ్వరులు దాని గాంచి యుప్పొంగిపోవు టలో వింత యేమి?

రాజమహేంద్రవరమున కొప్పెరుంజింగడు స్వదేశమునకు తిరిగి పోవుటకు, శ్రీరుద్రదేవమహారాజులయొద్ద సెలవు పుచ్చుకొని, కతిపయపరివారముతో కదలి, ధాన్యకటకము దారినిబట్టి కాంచవదేశమునకు వెడలిపోయెను.

రుద్రమ్మ తిరిగి వచ్చుచున్న దారిలో కిన్నెరసాని వాగు తగిలెను. దానిని చూచినకొలదియు, రుద్రమ్మ దానిని వదలలేకపోయెను. దాని పేరు విన్నకొలదియు దానిపై మక్కువ తెలుగురాణి కెక్కువ యయ్యెను. ఇక దాని కథ విన్నతర్వాత రుద్రమ్మ మనస్సు కరగిపోయెను. ఈ కిన్నెరసాని భర్తపై అలిగి ద్రవించి ఏరుగా ప్రవహించి రాళ్ళుగప్పలపైనుండి పారుచు అడవులగుండ దిక్కులేక కాని మార్గములు సంచరించుచున్నది. కాని అక్కడనేని దాని యొయ్యారము నది వీడలేదు.

తాను తెలుగురాణి! తన భర్త తనకు కాకుండపోయినాడు. తా నిట్లు ఒంటరిగా దేశమంతట సంచరించుచున్నది. తనవెంట సేవకు లున్నారు, సైనికు లున్నారు. ఐనను తాను ఒంటరియే! తన సేనానులు శత్రువులను నిర్జించుచున్నారు. ఐనను తనకు విజయ సంతోషము లేదు! ఈ కిన్నెరసానివలెనే, తానును ఏకాంతమున నడవులలో సంచరించుచు, తుదకు గోదావరీగర్భమున కలసిపోయిన నెంత బాగుండును!— ఒకనాటి సాయంకాలమున కిన్నెరసానివాగు ఒడ్డున పరిజనులకు దూరమై ఒంటరిగా సంచరించుచు రుద్రమ యీవిధముగా తలపోయుచుండెను.

ఆ సమయమున తనకు కొంచెము దూరమున జనులు సంభాషించుకొనుచున్న సవ్వడి వినవచ్చెను. అందులో నొకడు దేవగిరి యాదవరాజగు మహాదేవరాజు ప్రశస్తిని గానము చేయుచుండెను.

"అయం శిశు స్త్రీ శరణాగతానాం హంతా మహాదేవనృపో నజాతు
ఇత్థం వినిశ్చిత్య తతో బిభీతై రంధ్రైః పురంధ్రీ నిహితా నృపత్వే."

అంతవరకు కలవరించుచున్న దానివలె రుద్రమ యీ మాటలు విని, తోక త్రొక్కిన యాడుత్రాచువలె నొక్కసారి లేచెను. ఆ శబ్దము వచ్చుచున్నవైపు శ్రద్ధగా పరికించెను. చూడగా నచ్చట పలువురు మన్నట్లున్నారు. అక్కడ నా శ్లోకము చదువువాని తల తెగవేయవలె నని, ముందు కలిగిన యుత్సాహమును నిలువరించు కొనెను. అంతలో మరల దేవగిరిమహారాజును పొగడు శ్లోకములు వినపడినవి.

"తిల్లింగక్షితిపాల తూలనిచయ ప్రక్షేప చండానిలః."

అని వినుట యామె చెవులు భరింపలేకపోయెను. అంతలో మఱియు నిట్లు వినబడెను.

"తిల్లింగాధిపతేః పశో ర్విశసనం రుద్రస్య రౌద్రాకృతేః
కృత్వా పూరుషమేధయజ్ఞ విధినా లబ్ధ స్త్రిలోకీ జయః."

ఆ మాటలకు రుద్రమకు కన్నీరు వచ్చెను. తన పెదతాతగారగు రుద్రదేవుడు, యాదవులతో యుద్ధముననే ప్రాణములు కోల్పోయియుండెను. తన తాతగారును అట్లే యాదవులతో యుద్ధమున నిహతుడయ్యెను. తన తండ్రి గణపతిదేవుడు చిన్నతనమున బహుకాలము వారి చెరసాలయందే యుండెను. పిమ్మట తన తండ్రి యాదవులకు తగినశాస్తి చేసియుండెను గాక! ఎన్నాళ్ళనాటి మాట! ఇప్పటికి అవి జరిగి డెబ్బదియేళ్ళయియుండును. అయినను దేవగిరిప్రభువులు తమప్రతాపమునకు ఆ ప్రగల్భవాక్యములతో పొగడుకొనుచున్నారు. సరి ఇప్పుడు వారి ప్రతాపమునకు భయపడి, శిశువులను స్త్రీలను శరణాగతులను చంపకుండు దీక్ష తన కున్నదని తెలిసి, ఆంధ్రులు స్త్రీని తమ రాజ్యమునకు పట్టాభిషేక మొనర్చిరనియూ వారి ప్రగల్భములు!

రుద్రమకు కోపము దుర్భర మయ్యెను. ఖడ్గము దూసెను. ఆ పాడుచున్న గాయకు డున్న వైపునకు నాలు గడుగులు వేసెను. అంతలో తాను ఒంటరిగా నున్నమాట జ్ఞప్తికి వచ్చెను. దూరమున నుండి యామె సంచారమును కనిపెట్టుచున్న ఆమె అంగరక్షకదళ పర్వతనాయకుడును, ఆ శ్లోకభాగములు వినినట్లున్నాడు. ఆ జనము వైపునకు బయలుదేరిన రుద్రమ నుపలక్షించి వెంటనే యాతడామె యెదుట బడి నమస్కరించి, యడ్డము నిలిచి, యిక్కడ నొంటిగా సంచరించుట ప్రమాదకరముగా నున్నదని నివేదించి స్కంధావారమున కామెను తోడుకొని పోయెను.

అప్పటికి బాగుగా చీకటిపడినది. ఐనను రుద్రమ వెంటనే చారులను ఆ శబ్దము వచ్చిన దిక్కుగా బంపి యక్కడి విషయము తెలిసికొనెను. ఆ యర్ధరాత్రమునకు వారు నిశ్చయమగు వార్త తెచ్చిరి. కిన్నెరసాని యావలియొడ్డున నజ్ఞాత మగు నొక మహాసేన యున్నది. అదియు తన సేనను అనుసరించి వచ్చుచున్న శత్రుసేనగా తోచుచున్నది. అది ఎంత సేనగలదనియు మొదలగు వివరములు మాత్రము వారిప్పుడు చెప్పలేకపోయిరి.

ఆ వార్త యందినవెంటనే తన స్కంధావార మంతయు నెప్పటికంటె నెక్కువ యుసన్నద్ధమై యుండ నామె యాజ్ఞాపించెను. ఆమె వెంటనున్నదైదువేల సేనకంటె లేదు. శత్రుసైన్య మెంతయున్నదో! అందుచే నామె వెంట నున్న సేనానులు, వెంటనే మరియొక మార్గమున పాకాలవైపునకు నడచుట క్షేమకరమని సూచించిరి. కాని రుద్రమ దాని నంగీకరింపలేదు. "ప్రగల్భపుశ్లోకములు విని జడిసిమనము పారిపోవుటా!— ఆ ప్రగల్భములాడు వాచాలురను నొకసారి చూడనిగాని పోరాదు.!"

చారులు విషయసంగ్రహణమునకై అన్నిదిక్కుల నేగిరి.

* * * * * *

కాని యంతలో నా రాత్రియే భయంకరమగు గాలివాన ప్రారంభించెను. మూడు రాత్రులు మూడు పవళ్ళు ఎడతెరపి లేకుండ వాయువు మహారౌద్రముగా వీచుచుండెను; మేఘము లేకధారగా వర్షించుచుండెను.

ఆకస్మికముగా కిన్నెరసాని తన బక్కచిక్కిన దీనాకారము వదలినది. భయంకరమైన మహాప్రవాహమైనది. ఆ మహారణ్యములో హోరు పెట్టి వీచుచున్న

ప్రభంజనము వేగమును గూడ కిన్నెరసాని ప్రవాహ వేగము మించిపోయినది. కిన్నెర సాని పొంగుగాంచిన కవీశ్వరులకే దాని వర్ణింప సాధ్యము!

మహావాతమునకు పటకుటీరము లాగునా? ఎంత చెట్లమాటున నుంచినను మారుతుడు వానిని ఎగురగొట్టివేయుచుండెను. మరియు నచ్చటి మహావృక్షము లెన్నియో ఆ గాలికి కూకటివ్రేళ్ళతో పెల్లగింపబడినవి. ఏ వృక్ష మెవరిపై బడునో? ఆ మహాసంకటములో మహారాజునకును సామాన్యసైనికునకును భేదము పోయినది. శ్రీ రుద్రదేవమహారాజులకే ఆకలి తీరుట కష్టమయ్యెను. వంటలు చేయుట యెక్కడ? ఎట్లు? వెంట వచ్చుచున్న గోవులు గేదెలు నిలువ నీడయే లేకున్నవి. అవి మాత్రము పాలైన నెట్లీయగలవు? సమీపమున నున్న చిన్న పల్లెలకు పోయిన కొంత సాధింపవచ్చును. కాని మనుష్యమాత్రు లా గాలిలో వర్షములో ఎట్లు కదలగలరు?

శ్రీరుద్రదేవమహారాజుల స్కంధావార మంతయు చిరిగిపోయిన గాలిపటము వలె నైనది. ఆ గాలియు వానయు చూచుచుండ రుద్రమహృదయ మేలనో ఉత్సాహముతో నుప్పొంగసాగెను. ఎదుట కిన్నెరపొంగు చూచుచున్న కొలదియు, నామె హృదయములోని పొంగు ద్విగుణీకృత మయ్యెను. ఆ సమయమున తాను తిల్లింగప్రభువు నను మాట మరచిపోగలిగెను. కేవలము మానవమాత్ర నను భావ మామె నావేశించెను. వాడెవడో యాదవరాజు ప్రతాపము కీర్తించుచు నన్న శ్లోకపాదము మరల మరల నామె కిప్పుడు స్మృతిలోనికి వచ్చుచు వింతశాంతిని చేకూర్చుచుండెను.

"తిల్లింగక్షితిపాలతూలనిచయ ప్రక్షేపచండానిలః"

"తిల్లింగక్షితిపాలతూలనిచయ ప్రక్షేప చండానిలః"

"నిజముగా ఈ చండానిలుని ధాటిముందు తెలుగుదేశమున కెల్ల రాణి నగు నే నెంత! లోకములోని రాజు లందరును గలిసినను మాత్ర మెంత!"

ఆ యరణ్యములో మూడు దినములును మూడు యుగములుగనే గడచిపోయెను. రుద్రమ సేనయు పరివారమును చెల్లాచెదరయిపోయినవి. వెంట నున్న గుర్రములు ఏనుగులు చెట్టు కొకటి పుట్ట కొకటిగా పోయిదాగుకొన్నవి. వెంట బంధితుడై వచ్చుచున్న మనుమసిద్ధిని రక్షకులు వదలిపోయిరి. అతనినిమాత్రము అతని పాలగుర్రము వదలలేదు. అతడును శిబిరము దాటి పారిపోలేదు. తుపాను తగ్గగానే ముందు రుద్రమ్మ దర్శనము చేసినది కూడ మనుమసిద్ధియే!

గాలివాన తగ్గిపోయినను పరివారము కూడుకొనలేకపోయినది. పలువురు ఎవరికి దోచిన త్రోవను వారు పాకాలకు ప్రయాణమైరి. వారు తలదాచుకొన్న తావుల నుండి మరల శిబిరమున్న ప్రదేశము గుర్తించుటే చాలమందికి అసాధ్య మైనది. వార్తాహరులే సరిగా చిక్కలేదు. కిన్నెరసాని ఇంకను భయంకరముగా ప్రవహించుచున్నందున, చారులు ఆవల నున్న సేనజాడలుకూడ తేలేకపోయిరి ఐదువేల సైనికులలోనను నూరుమంది మాత్రమే రుద్రమను ఆ సాయంకాలమునకు పరివేష్టింప గల్గిరి. పర్వతనాయకుడు శీఘ్రయానమున పాకాల చేరుకొనుట శ్రేయస్కరమని యుపదేశించెను. మనుమసిద్ధియు అందులకే తొందర చేసెను. కాని రుద్రమ వారి మాట లాలకింపలేదు.

మహాశివరాత్రి వచ్చినది. ఆ యుదయమునకు సరిరెండువందల భటులు రుద్ర మను చేరికొనిరి. పాతిక యశ్వములు ఐదు ఏనుగులు మాత్ర మామె వెంట నున్నవి.

కిన్నెరసాని ప్రవాహము తగ్గుముఖ మగుచున్నది. ఏనుగు నొకదానిని దాటింప రుద్రమ్మ యాజ్ఞ యిచ్చెను. ఆ ఏనుగు కొంతదూరముపోయి పోలేక వెనుదిరిగి వచ్చి నది. మరల ఎంతపొడిచినను ఆ ఏనుగు నీటిలో నడుగుపెట్ట సాహసింపలేదు. కిన్నెర ప్రవాహ మట్లున్నంతసేపును, ఎంతసైన్య మావల నున్నను తనకు భయము లేదని రుద్రమ్మ నిబ్బరము!

కాని రుద్రమ్మ పొరపడినది. మహాశివరాత్రి మరునాటికి స్పష్టముగా కిన్నెర సాని ప్రవాహవేగము చాల భాగము తగ్గినది. ఆవల యాదవసైన్యము ఐదువేలకు తక్కువలేకుండ నున్నదనియు అందును ఏబదిగజములు కల వనియు చారులు తెల్లవారు నప్పటికి వార్త తెచ్చిరి.

రుద్రమ వెంటనే తన పరివారమును ప్రయాణముచేయ నాజ్ఞ లిచ్చెను. ముందు ఐదశ్వములపై వేగరుల పాకాలకు పంపి మహాసేన తనకై ఎదురు రావల సిన దని యాజ్ఞాపించి తన చిన్న పరివారముతో మిక్కిలి జాగరూకతతో కదలెను. ఆ యడవిదారు లెరిగిన కోయదొరలు ఆమెకు దారి చూపుచుండిరి.

ఆమెపరివారము మిక్కిలి స్వల్పము. ఐనను అది శత్రుసేనకుకనబడనీయగూడదు. అందుచే ఉదయముననను మధ్యాహ్నముననను సాయంకాలముననను, మహారభటితో పంచ తూర్యములను మ్రోయించుచుండ రుద్రమ యాజ్ఞాపించెను. పరివారముకూడ పెద్దగా ధ్వనిచేయుచు సాగుచుండ నేర్పాటు జేసెను. తనతో నున్న ఐదుగజములనే కిన్నెర సాని ప్రక్కను సాగుచు ఎదిరిసేనలకు కనబడునట్లు చేసెను.

శీఘ్రప్రయాణముతో నిట్లొక రోజు గడచిపోయెను. మరి యొక్కరో జిట్లే ప్రయాణము చేసిన తాను పాకాల చేరికొనును.

మరునా డుదయము తనకు వచ్చిన ప్రమాదము దూరమైన దను నాశతో, నుత్సాహముగా రుద్రమ సాగిపోవుచున్నది. కిన్నెరసానియు నిప్పుడు దూర మైనది. రుద్రమ యశ్వముపై నున్నది. ఆమె కిరువైపుల నశ్వములపై పర్వతనాయకుడును మనుమసిద్ధియు నున్నారు. కష్టసమయమున మనుమసిద్ధి ప్రదర్శించిన విశ్వాసము రుద్రమ కాతనిపై కొంత దయ కలిగించినది. అదియును గాక తనవెంట బంధితులను గూడ కాపు కాయగల పరివార మప్పుడు లేదు. అందుచే నేమైనను అతని నమ్మక పీలులేదు. ఆ ముప్పురితో కలసి ఇరువదిమంది యాశ్వికులే ఉన్నారు.

మధ్యాహ్నమున విశ్రమించి ఎక్కువగుచున్న ధైర్యముతో తన యల్ప పరివా రము గొని రుద్రమ బయలుదేరినది. కొంత దవ్వేగగా వెనుకనుండి పలువు రాశ్వి కులు వచ్చుచున్న ధ్వని స్పష్టముగా వినవచ్చినది. ఇప్పటికి వారు అడవిదారి దాటి నారు. ఒక్క అర గడియలో వారిని వచ్చి యొక యాశ్వికదళము తాకెను. అందులో ఐదువందలమందికి తక్కువ యాశ్వికులు లేరు.

వెంటనే రుద్రమ యాజ్ఞతో ఆంధ్రగజములు ఐదును ఆ యాశ్వికులను తాకెను. అవి ముందువరుసలలో నున్న ఏబది యశ్వములను చెండాడినవి. కాని వానిపై మావటీంద్రులును యోధులును ప్రాణములు వదలిరి. తిల్లింగక్షితిపాలుని ఆ ఐదు కరులును శత్రువశమైనవి.

అంతట నా యాశ్వికులు రుద్రమ పంచతూర్యములు మ్రోయించు పరివారమును, వారి వృషభములతోసహా నిర్బంధించి, యా పంచతూర్యములును హరించిరి.

ఆంధ్రపదాతులు అంతట రుద్రమ యాజ్ఞలచే ఆ హయదళము నెదుర్కొనిరి. కాని వా రెంతసేపు నిలువరింపగలరు? ఐనను ఆ వ్యవధిలో తన వెంటనున్న యాశ్విక పరివారముతో రుద్రమ శీఘ్రగతి ముందుకు సాగిపోగలిగెను. ఆపైన నెట్లైనను పాకాల సురక్షితముగా చేర్చుటే వారి యాదర్శమైనది. సురువులు గ్రక్కునట్లు వారాయశ్వముల పరువెత్తించుచుండిరి.

ఏబదిమంది యాశ్వికులు పోరు వదలి శీఘ్రగతి వారిని వెంబడింపసాగిరి. పర్వత నాయకుని యాజ్ఞలతో పదిమంది యాశ్వికులు వెంబడించుచున్న యా ఏబదిమందిని ఎదుర్కొనుటకు వెనుకకు తగ్గిరి. ఒక్క అరగడియకంటె వారా ఏబదిమందిని నిలువరింపలేకపోయిరి. వెంబడించుచున్న యాశ్వికులలో పాతికమంది వారిని దాటి, రుద్రమను బట్టుకొన తమ యశ్వముల బరువెత్తించుచుండిరి.

మనుమసిద్ధి తన యశ్వమును మిగిలినవారితోపాటు పోనిచ్చుటకు కళ్ళెము బిగబట్టవలసివచ్చుచుండెను. అత డది రుద్రమకు చూపి యిట్లు ప్రార్థించెను.

"మహారాజా, మీరు ఈ పాలగుర్రి మెక్కిన సురక్షితముగా పాకాల చేరికొనగలరు. దయచేసి దీని నధిరోహింపుడు!"

ముందు రుద్రమ యందు కంగీకరింపలేదు. కాని యందరు ప్రార్థించుటచే తుద కంగీకరించెను. ఒక మలుపు తిరిగినయెడ రుద్రమయు మనుమసిద్ధియు నశ్వములు మార్చుకొనిరి.

ఇప్పుడు శ్రీ రుద్రదేవమహారాజు లధిరోహించిన పాలగుర్రమునకు కళ్ళెము వదలిరి. అది మిగిలిన తొమ్మిది యశ్వములను దాటిపోయి వాయువేగమున బరువెత్తుచున్నది. అది ముందై పోయినది.

మిగిలిన యశ్వదళమును కలసికొని, వెనుకనుండి తరుముకొని వచ్చుచున్న యశ్వదళము వచ్చి తాకినది. మనుమసిద్ధి యశ్వమును జూచి రుద్రమయశ్వ మను బుద్ధితో వా రందరు ముం దాతనిపైననే కవిసిరి. తొమ్మిదిమంది వీరులు పాతికమంది వీరులతో సమానముగా యుద్ధము చేయగలరా? మనుమసిద్ధి గాయమై గుర్రముపై నిలువలేక క్రింద పడిపోయెను. పర్వత నాయకుడును అట్లే పడిపోయెను.

ఆ వచ్చిన యాశ్వికుల నాయకుడు పడిన మనుమసిద్ధిపై కుప్పించి శిరస్త్రాణము తీసి చూచెను. రుద్రమ కాదు!

మెరుపు మెరసినట్లా నాయకుడు తన యాజానేయముపై నెక్కెను. ఒక్కక్షణము నేలపై గుర్రపు గిట్టల జాడలకై నలుపైపులు చూచెను. రుద్రమ యెక్కిన

పాలయశ్వము వెళ్ళిన జాడను ఉపలక్షించి దాని వెంట నంటెను. అతడును మిక్కిలి శీఘ్రముగా బోవుచుండెను. ఆతని పారశీకాశ్వము త్వరలో రుద్రమను కలసికొను చుండెను.

రుద్రమ మాటి మాటికి వెనుదిరిగి చూచుచు పోవుచున్నది. ,పాపము నా పరివార మే మైనది?

చూడగా నామెకు పరివారము కనబడలేదు. ఒంటరిగా నొక్క యాశ్వికుడే తన్ను వెంటాడి వచ్చుచున్నాడు. తా నింతవరకు స్వప్రాణరక్షణకు పరుగిడి వచ్చు చుండుటయే సిగ్గుగా నున్న దామెకు! ఒక్క క్షణము ఆమె ఆలోచించెను. మరుక్షణ మున మనస్సు దిటవుచేసికొనెను. తన యశ్వవేగము తగ్గించెను. దానిని వెనుకకు మర ల్చెను. తన్ను వెంటనంటి వచ్చుచున్న యా యాశ్వికయోధుని రభసమున రుద్రమ్మ ఎదుర్కొనెను.

అప్పుడు వారిద్దరకు భయంకరముగా ద్వంద్వయుద్ధము ప్రవర్తిల్లెను. ఇద్దరును అశ్వకుశలత కలవారే! ఇద్దరును శూలఖడ్గయుద్ధ విశారదులే!

వారిద్దరును ఒండొరుల శూలముల తాకునకు తా మెక్కిన యశ్వములపైనుండి క్రింద పడిపోయిరి. ఇద్దరును మెలకువగా దెబ్బ తగులకుండ తప్పించుకొని ఒరలనుండి ఖడ్గములను పెరికి ఒకరితో నొకరు తలపడిరి.

వా రిద్దరు ఖడ్గయుద్ధమున నొకరి కొకరు తీసిపోకుండిరి. రుద్రమ మహాకాలికవలె విజృంభించిన, నా యోధుడు వీరభద్రునివలె నట్టహాస మొనర్చెను.

రుద్రమ యథాశాస్త్రీయముగా నంధ్రదేశసంప్రదాయానుగతమైన విధమున ఖడ్గభ్రమణములం చేయుచుండెను. ఆ యోధుని భ్రమణములం కొంత వింతగా నున్నవి. అవి యాంధ్రభూమివిగా లేవు. అవి విదేశమార్గముల ననుకరించుచున్నవి. అందుచే రుద్రమకు కెక్కువ మెలకువ యవసర మయ్యెను. రుద్రమ మెలకువ చూచినకొలదియు నా యోధుని దురుసుదన మెక్కువయ్యెను. ఆ యోధుని దెబ్బలను సులభముగా రుద్రమ తన పలకతో కాచుకొనుచున్నది. ఆమె కాచుకొనుచున్న కొలదియు, యోధుని దురుసుదనమును ఆత్మవిశ్వాసమును ఎక్కువ కాసాగినవి. అతని కాత్మరక్షణ తక్కువైనది.

ఆ సందు ఒక్కసారి రుద్రమ యుపలక్షించినది. కాని వెంటనే వ్రేటు వేయ లేదు. మరియొకతీరున ఆత్మరక్ష చేసికొని తన బలహీనపక్షమున నేయునేమో!

మరల రెండవసారి అవకాశ ముపలక్షించినది! ఈమారును వదలివేసినది!

మూడవమారు అవకాశము వచ్చినది! ఈమారు రుద్రమ వదలలేదు. ఆ యోధుని దక్షిణబాహువున వ్రేటువేసినది. ఆయోధుడు జీవించినను ఈ జన్మకు మరి యుద్ధము చేయలేడు!

ఆ యోధుడు పడిపోయెను. రుద్రమ యిప్పుడు తన యశ్వమెక్కి పోయి యాత్మరక్షణ చేసికొనవచ్చును కాని యా యోధుని యుద్ధపద్ధతి యామెకు పూర్వ

విదితమైనదిగా స్ఫురించినది. ఇతనితో మున్ను యుద్ధము చేసినట్లున్న దెప్పుడో! "ఎప్పుడు? – ఎప్పుడు? – ఎప్పుడు?"

రుద్రమ యావేశముతో నాతని శిరస్త్రాణము నెత్తి ముఖము చూచునుగదా ఆతడు వీరభద్రేశ్వరుడే! తనభర్త వీరభద్రేశ్వరుడే తన ప్రధానశత్రువు వీరభద్రేశ్వరుడే! అతడిప్పుడు కుడిభుజము గాయపడి స్మృతితప్పి పడిపోయియున్నాడు!

అంతలో నశ్వదళ మొకటి యక్కడికి చేరుకొనెను!

## ౪౬

మహాశివరాత్రినాటి రాత్రి నేమినాథదర్శనము చేయించి మహాదేవరాజును ప్రక్కనున్న గదిదారిన బంపిరికదా? ఆ ప్రక్క గదిలో పలువురు పరిచారకులు కలరు. మహాదేవరాజా గదిలోనికి రాగానే వారందరును భయభక్తులతో లేచి నమస్కరించి విశేష గౌరవముతో దారి చూపుచు నొక చిన్న ద్వారమునొద్దకు తీసికొనిపోయి యది తెరచిరి.

ఆ ద్వారము నావల కటికిచీకటిగా నున్నది. ఆ ద్వారమున బయటికి పోవుటకు ఇంచుక సంశయించుచు మహాదేవరాజొక త్రుటికాలము లోపల నిలిచెను. వెంట నున్నవారు మిక్కిలి గౌరవముతో "ఏమి, మహాప్రభూ, చీకటిగా నున్నదా? వెలుగు తెత్తుమా?" అని యడిగిరి.

మహాదేవరాజుకు తనను వారు భయపడుచున్నట్లు భావించిరని తోచెను. అందు కాతనికి అభిమాన మనిపించెను. "వెలుగెందుకు? అవసరము లేదు!" అనుచు నాతడు ఆ ద్వారము దాటి చీకటిలో రెండడుగులు వేసెను.

రెండడుగులు కాదు, ఒక్క అడుగే! ఆ ఒక్క అడుగుకే అతడు ముందుకు పడిపోయెను. ఎంత లోతుకు పడిపోయెనో ఆత డెరుగడు. పడిపోవుచున్నను అతడొక కేకకూడ వేయలేదు. మహాదేవరాజు ప్రమాదావస్థలో నైనను ఆర్తుడై కేక వేయునా!

అతడు పడిన ప్రదేశములో నదృష్టవశమున జల మున్నది. కాని లోతుగా లేదు. పడిన మొదటిపాటుకు ఆతడు దిమ్మరపోయెను. ఒక్క క్షణములో స్మృతి వచ్చినది. రోషోగ్రుడై యాతడా నీటిలో పైకి లేచుటకు ప్రయత్నించెను. అది యొక విశాలమగు బలపపురాతిగది. గోడలు నున్నగానుండి పైకి ఎక్కుటకు ఎక్కడను ఎట్టి పట్టును ఇచ్చుటలేదు. ప్రాపట కెన్నియోమారులు ప్రయత్నించి సాధ్యము కాక జారి నీటిలో పడిపోవుచుండెను.

అంతలో మరల తాను పడిపోయిన ద్వారము తెరచిన చప్పుడైనది. మరల బయట ఏవో మాటలు వినబడినవి. మరుక్షణమున మరియొకరి దేహము నీటిలో పడిపోవుట మహాదేవరాజుకు వినబడెను.

మహాదేవరాజు తానట్టి యపాయస్థితిలో నున్నందు కట్టి భయమును పొందుట లేదు. ప్రాణత్యాగమునకు వెనుదీయని వీరవంశములో జనించినవాడాతడు! మహారాజుల యల్లుడగు తాను ఈ నీచస్థితిలో నీటిలో దోగుచు నుండు ననాథ స్థితికి అభిమానముగా నున్నది. ఇట్టిస్థితిలో తా నుండుట మరియొకరు చూతురే యని సిగ్గుతో ఆతనికి ప్రాణమే పోవుచున్నట్లున్నది. అందుచే నాతడు ఎట్టి సవ్వడియు జేయక ఆ పడిపోవు మనుష్యునకు దూరముగా నుండెను.

అట్లు పడిన రెండవ వ్యక్తి ప్రసాదాదిత్యనాయడు! అతని యనుభవమును మహాదేవరాజునువలెనే ఉండెను. దిమ్మెరపోయినవాడు లేచి గోడలం పట్టుకొని పైకి ప్రాకుటకు ప్రయత్నించెను. అట్లు ప్రయత్నించి పడుచుండుటలో నాతనికి తనతో పాటు మరియొక వ్యక్తి యందులో నున్నట్లుతోచెను.

"ఎవరు ?"

మహాదేవరాజు మాటాడలేదు. సిగ్గుతో నాతని సర్వావయవములు కుంచుకొని పోవుచున్నవి. ఆతడు మాట్లాడకుండుటతో ఎవరో శత్రువని సందేహము ప్రసాదాదిత్యనాయకునకు తోచెను. వెంటనే యాతడు తన యొరలో నున్న ఖడ్గము పెరికి పొడిచివేయుటకు సిద్ధముగానుండి క్రోధావేశముతో పలికెను. తనను మోసము చేసిన వారిపై గల కోపమంతయు నిట్లు రూపొందెను.

"ఎవరు ? వెంటనే చెప్పనిచో పొడిచివేసెదను !"

ఈమాటు మహాదేవరాజునకు ఆ కంఠము గుర్తు వచ్చెను. ఈ స్థితిలో తన కాప్తుడగు ప్రసాదాదిత్యనాయనితో కలహించుటా ? లజ్జతో గద్గద మగు కంఠముతో మహాదేవరాజు పలికెను.

"నాయకా ! నేను !"

ప్రసాదాదిత్యనాయడు ఆ గొంతు విని ఒక్కక్షణ మాగెను. గుర్తు వచ్చినది. ఆతని కోపము మైకము దిగిపోయెను. కత్తి యొరలోనికి పోయినది.

"క్షమించు, మహాదేవరాజా ! మీకుగూడ ఈ యవస్థ పట్టినదా ?"

వారు మాటాడుకొను నవకాశము లేదు. మరల పైని ద్వారము తెరచిన చప్పుడు ! మరల మాటలు ! మరల నొక వ్యక్తి పడిపోయెను. మరల ద్వారము మూసికొనెను.

ఈ మారా పడిపోయిన వ్యక్తి లేచి గోడలు ప్రాకయత్నింప నవసరము లేకపోయెను. అతడు పడినవెంటనే ప్రసాదాదిత్యనాయడును మహాదేవరాజును దగ్గరకు పోయి లేవదీసి యాతని నాదరముతో ప్రశ్నించిరి. ఈ మా రట్లు పడిపోయినది రుద్రమనాయడు.

తలుపు మరల మరల తెరచికొనసాగెను. ప్రోలరౌతు పడిపోయెను. నాగదేవనాయడును పడిపోయెను. వల్లనాయకుడు పడిపోయెను. మరల పైన తలుపు తెరచుకొనెను. ఈమారు ఆ బయట నున్న వ్యక్తి ప్రక్క నున్నవారిపై కేకలు వేసెను.

అంతలో నక్కడ చిన్న పోరాటము జరిగిన ట్లున్నది. పలువురు కలసి యా వ్యక్తిని బలవంతముగా లోపలికి త్రోసివేసిరి. ఈమారు మేచయ నాయకుడు!

మేచయనాయకుడు పడినవెంటనే అందులో నెవరున్నదియు తెలిసికొనెను. అంతట నాత డా చీకటిలో వీలయినంతవరకు నాగది స్వభావము తెలిసికొనుటకు ప్రయత్నించెను.

ఆ గది మూడువిండ్ల లోతున నున్నది. అందులో నీరున్నను అది బావికాదు. ఈ మధ్య గాలివానచే కురిసిన విశేషవర్షముచేత నడుములబంటిగా నీరూరినది. ఆ నీరు లేకున్న తా మెవ్వరును జీవించియుండుట సాధ్యము కాదు. ఇందులో పడినవారు జీవములతో నుందు రని పైవా రనుకొనరు. "అందుచే మన మందరమును జీవించి యున్నట్లు సందేహము పైవారికి కలిగింపరాదు!"

కొంతవడి నొకరితర్వాత నొకరు పైనుండి వ్యక్తులు పడుచునే యుండిరి. ఏకశిలా నగరములో తలగలవారందరును నీరూరిన యా చీకటినేల కొట్టులోననే పడిపోయి యుండిరి. పై తలుపు మూసికొన్నది. ఎంతసేపైనను మరల నది తెరచుకొనలేదు. అది యిక మరల తెరచుకొన దని తేలిపోయినది.

అప్పుడు మేచయనాయకుడు అందున్న పెద్ద లందరకును నమస్కరించి తన నిర్ధారణ తెలియజేసెను.

"మన మిప్పు డిందుండి ప్రాణములతో బయటపడుద మని యూశింపరాదు. నగరములో పెద్ద ప్రమాదము లేవో యిప్పుడు జరుగుచుండవలెను. ఏకశిలానగరమున కిప్పుడు తగురక్ష లేదు. మాకు వార్తలు తెచ్చువారే పలువురు మోసగాండ్రని స్పష్ట మయినది. జైనకరణములు రాజ్యాంగములో అల్లుకొని పెనవేసికొని యుండుటచే ఏ వార్త నమ్ముటకును ఏ వార్త నమ్మకుండుటకును సాధ్యము కాకున్నది. భగవంతుడు గణపతిదేవులను ప్రతాపరుద్రకుమారులను ఈ రాత్రి కాపాడును గాక!"

తాము పడియున్న ప్రదేశము వాకిలికి మూడు విండ్లలోతున నున్నదని మేచయ తన చూపుతో నూహించెను. కాని యది చీకటిలో చూపు! అందుచే నది నిర్ధారింప దలచి గోడల నూని యొకరి భుజములపై నొకరిని నిలుచుండజేసి, వారి క్షమాభిక్ష కోరుచు, మేచయ స్వయముగా నా పైవాని భుజములపై తా నెక్కి చూచెను. అతని కిప్పుడు ద్వార మందినది. దాని నాతడు ముందు నెట్టిచూచెను. ఏమియు సందీయలేదు. వెనుకకే తెరచుకొనుచున్నట్లున్నది. చీకటిలో చేతితో తడవి చూచి, దాని యంచు లుపలక్షించి కొంచెము నెమ్మదిగా నది లాగి చూచెను. అది యించుక వెనుకకు వచ్చి యంతట నాగిపోయినది. బయట గొళ్ళెము వేసి యున్నదని యాతడు నిశ్చయించెను. ఈ దారి ప్రస్తుతము లాభము లేదు! నెమ్మదిగా నాతడు మరల నీటిలోనికి దిగి పోయెను.

ఆ ద్వారముగాక మరియొక ద్వార మేమైన నున్నదేమో యని యాతడు గోడ లన్నియు పరీక్షించెను. ఏమియు నగపడలేదు. కాని యా గోడలు కట్టిన పనివారు పరంజ కట్టుకొనుటకు గోడలలో నుంచిన కంతలు మాత్రము పూడ్చియుండలేదు.

ఆ కంతలలో క్రిందివానినుండియే సన్నగా నీరా గదిలోనికి కారుచున్నది. మేచయకు సందేహ మైనది. ఆ గది నీటితో నిండిపోయిన ?

"ఇక్కడ నందరికి ఈత బాగుగా వచ్చునా ?"

"వచ్చును—వచ్చును—వచ్చును." అను గుసగుసలు వినవచ్చెను. రాదను శబ్దము రాలేదు. దానితో మేచయకు ధైర్యము కలిగెను. ఆ కంతలం పొడిచి దారికై తాము ప్రయత్నించు నెడ నేదైన జలప్రవాహము లోనికి వచ్చునెడల నేమగును ? ఇప్పుడా భయములేదు.

ఇక్కడ తామల్లెంతసే పుండగలరు ? తల యెత్తి పరీక్షించెను. కప్పుపైనుండి అక్కడక్కడ నక్షత్రములు కానవచ్చుచున్నవి. ఊపి రాడుట కొంత కష్టముగా నున్నది. కాని గాలికి దారి లేకపోలేదు. లోపల నున్నవారికి అవసరమగుచో ఆహార మందిచ్చుట కా కంత లుద్దేశింపబడినవి. తాము జీవించియున్నది లేనిది యుపలక్షించుటకు గూడ నవి యుపయోగింపగలవు.

ఎక్కడ నేదైన శబ్దము వచ్చునేమో యని యాతఁ డాలకింపసాగెను. శబ్దము లేదు. అతడు చేయుచున్న ప్రతికార్యమునందును అతని యల్లుడగు నాగదేవనాయ డాతనికి సహాయ మగుచుండెను. మహాదేవరాజు మధ్యమధ్య కోపముతో పండ్లు పటపట కొరుకుచుండెను.

మిక్కిలి ప్రొద్దుపోయినది. వారి దేహము లన్నియు నలసట చెందియున్నవి. నిద్రాభారము దుర్భర మగుచున్నది. అక్కడ నున్నవారిలో పలువురు గోడలకు జేరగిల బడి కూర్కసాగిరి. ఆ మునుకుటలో ఒక్కొక్కసారి నీటిలోనికి జారిపోయి దేహము లంతయు తడిసిపోయి దీనావస్థలో మరల లేచుచున్నారు. కాని యిట్లందరును నిద్రించుట లేదు.

రాత్రి మూడుజాము లైనట్లున్నది. అప్పుడు వారి కేదో నేల యదరుచున్న శబ్దమువలె వినవచ్చెను. అది యంతకంత కెక్కువ యయ్యెను. పైన నేదో మహాయుద్ధము జరుగుచుండవలె ! శ్రీరుద్రదేవమహారాజుల సేనలకు జయ మర్థించుచు ఆ పాతాళగృహములోని నాయకులు మహాదేవుని ప్రార్థించుచుండిరి. కాని శ్రీరుద్రదేవ మహారాజుల పక్షమున పోరుటకు పెద్ద సేనలు నగరములో లేవు. రేచర్లవారి బలము లున్నవి. వారు రాజభక్తి కలవారైనచో వారును ఈ పాతాళగృహములో నుండ వలసినదే. లేరు గనుక వారిపై నాధారపడుట సాధ్యముకాదు. పూర్వము గణపతిదేవులు దేవగిరిచెరసాలలో నుండగా కాకతీయసామ్రాజ్యమును రక్షించి 'కాకతి రాజ్యభారధౌరేయు'డని ప్రసిద్ధివహించిన రేచర్ల రుద్రసేనానివంశమున నెట్టి రాజద్రోహు లిప్పు డుదయించినారు !

అంతకంతకు యుద్ధము భయంకరమైన ట్లున్నది. ఆ ప్రదేశమునకు దడదడలాడు నొక శబ్దము తప్ప మరేమియు రాలేదు.

అంతలో తాము ఇందులో పడకముందు ఉన్న గదిలో పలువురు యడుగుల చప్పుడు వినపైనది. ఎవరో సత్వరముగ ద్వారము తీసినారు. లోపలికి రాబోయి యా

వ్యక్తి తనతోపాటు పడిపోయినది. అట్లు పడిపోవుచు నావ్యక్తి యార్తస్వరము నొనర్చెను. "అయ్యో, అన్నా—" అది యొక స్త్రీకంఠముగా మేచయకు భాసించెను. పూర్వపరిచితమగు కంఠమువలె కూడ నాతనికి తోచినది. ఎవరో యనుచు నుద్ధరించుటకు దగ్గరకు పోయెను. ఆత డొక బాలవీరుడు!

మేచయ దగ్గరకు రాగానే ఆ బాలవీరునికి అపరిమితమగు భయము వేసెను. ఆకస్మికముగా నట్లు తాను కూపములో పడిపోవుట, అచ్చట తన్ను ఒక వ్యక్తి పట్టుకొనుట, ఎవరికి భయము కలిగింపదు! అట్లు తనను పట్టుకొన్నది భూతమో పిశాచమో! భూతప్రేతపిశాచములు ఉన్నవని మేము నమ్మమని ప్రగల్భములు పలుకువారే, ఒంటరి పాటున చిత్రధ్వనులు విన్న, నది యేమో దయ్యమని భ్రమింతురు. మరి యిక వాని యునికి విశ్వసించువారి కెట్లుండును?

ఇంకను కొందరు లోపలికి పడియుండెడివారే. ఎవరో ఒక వ్యక్తి అక్కడి వారల నా ద్వారమున బోవద్దని వారించుచుండెను. మరికొంతసేపటికి పైన దివిటీలు కానవచ్చెను.

మేచయకు తా ముద్ధరింపబడితి నని ధైర్యము కలిగినది. ముందు ప్రయత్నించిన విధముగా నొకరిపై నొకరని నిలువబెట్టి వారిద్దరి భుజములపైనుండి మేచయనాయకుడు ఆ తెరచిన ద్వారబంధమును లంఘించి శీఘ్రగతి పైకి వచ్చెను.

అచ్చట నాతనికి ఎదురుగా అన్నమంత్రీశ్వరుడు ప్రత్యక్ష మయ్యెను. కవచగాత్రుడైన యా మంత్రీశ్వరుడు శిరస్త్రాణము పైకెత్తి యా గదిలో నెవరుండిరో తెలిసికొన దివిటీ వెలుగున ప్రయత్నించుచుండెను. వచ్చుచున్న మేచయ నాతడే చేయూత యిచ్చి యుద్ధరించెను.

మేచయ నిర్ఘాంతపోయెను. తనచే బంధితుడైన యన్నమంత్రి యిక్కడ నుండుటేమి? ఆత డేమి చేయుచున్నాడు? రాజద్రోహుల నాయకుడితడేనా? అది మరియొకడైనచో మేచయనాయకుడు వెంటనే పోరుకు తలపడియుండును. మహామంత్రీశ్వరుడగు అన్నమంత్రి తేజస్సు మేచయనుగూడ ముగ్ధునిజేసెను. అన్నమంత్రి శాంతముగా ప్రశ్నించెను.

"మరి ఎవ రున్నారు లోపల?"

మేచయ సందేహము ఒక్కత్రుటిమాత్రమే! మరుసటి క్షణమున నాతడు చెప్పివేసెను. నీళ్ళలో దోగియున్న మేచయకు వెంటనే యుపచారములు చేయ భటుల కాజ్ఞాపించి అన్నమంత్రి మిగిలినవార నుద్ధరించుటకు ప్రయత్నములు చేసెను. భటుల యుత్తరీయములును ఉష్ణీషములును మెలివేసి వెంటనే త్రాడుగాచేసి బలశాలులగు భటులు పట్టుకొని లోపలికి దింపిరి. దాని సహాయముతో నొక్కరొక్కరే పైకి వచ్చిరి.

ముందు పైకి వచ్చినది బాలవీరుడు. క్రిందివారును పైవారును ఎంత యత్నించినను లోపల నున్నవా రెల్ల నుద్ధరింపబడునంతవరకు మహాదేవరాజు పైకి రాలేదు. అందరు పైకి వెళ్ళిరని నిశ్చయింపబడిన తర్వాత అతడును పైకి వచ్చెను.

సహదేవరాజుకు సంతోషముకంటె సిగ్గు ఎక్కువగా నున్నది. అది దివిటీ వెలుగున నుపలక్షించిన యన్నమంత్రీశ్వరుడు తన రెండు బాహువులం కైదండ యిచ్చి యాతని నాదరముతో పైకెత్తెను.

సంతోషము పట్టలేక మహాదేవరాజు, "నీవటయ్యా, అన్నమంత్రీశ్వరా ?" అనుచు నాతని గాఢముగా నాలింగనము చేసికొనెను. సహదేవరాజు సురక్షితముగా నున్నందుకు అన్నమంత్రికి ఆనందబాష్పములే కారెను.

అంతట నందర నాయకులకును తానే ప్రభు డైనట్లు అన్నమంత్రి సాదరముగా నాజ్ఞలం అందజేసెను.

"మీయందరకి తీరని పనియున్నది. కాని యింతయలసటలో ఇప్పు డేమియు జేయలేరు. మీరు వెంటనే భటుల సహాయముతో మీగృహముల కేగి విశ్రమించి జాము ప్రొద్దెక్కునప్పటికి స్వయంభూదేవాలయమున నన్ను గలసికొనుడు ! ఇప్పుడు నాకు తీరని పనియున్నది. మంచిది !"

మంత్రిముఖ్యులవలె నందరు నిర్ణీతు లైన భటుల రక్షణతో తమ తమ గృహముల కేగిరి.

* * * *

మరి యిది యంతయు నెట్లు జరిగినది ?

ఆ రాత్రి అన్నమంత్రీశ్వరుడు స్వయంభూదేవాలయమున తిక్కనసోమయాజుల సెలవు గైకొని నూతనబ్రాహ్మణవీరులతోడను శైవవీరులతోడను జైనవసతిపై కదలెనుగదా ! వారి నక్కడ నొక సేన యెదిరించెను గదా ! ఆ యెదిరించిన సేన కధిపతులం రేచర్ల కామయ, నాముయ, మల్లయ, గణపరెడ్డి, మల్రెడ్డి ! రేచర్లరుద్రసేనాని వంశజు లగు వారిని చూచినంతనే ఒక్క క్షణకాలము అన్నమంత్రికి చేతులం కాళ్ళాడలేదు. మహాసభాసమయమున శ్రీరుద్రదేవమహారాజుల యభిషేకము నిషేధించి హరిహరదేవుని నభిషేకింపు డని వాదించుటతో నీ రాగలేదు ! వెంటనే తన సేనకు అన్నమంత్రి వారితో పోరుట కాజ్ఞ యిచ్చెను.

ఇట్టి యుద్ధములకు పూర్వాపేక్షిత మైనది కాదాతని వెంటనున్న సేన ! కాని యన్నమంత్రి తమకు నాయకుడుగా నుండుటయే దానికి మహాసాహసము చేకూర్చెను. జైనవసతిని చుట్టియున్న సేనయు మిక్కిలి పెద్దది కాదు. ఇంత యాకస్మికముగా సిద్ధపు వసతిపై నెత్తివచ్చుదు రని రేచర్లవా రూహించియుండలేదు.

శైవవీరుల మొకటితాకే వసతిని చుట్టియున్న సేనలను చీకాకుపరచెను. అదియు నొక గాలివాన తాకువలెనే యుండెను. చిట్టడవిని మహాప్రవాహమువలెనే, ఆ సేన వసతిని ముంచివేసెను. గణపయ కాకముందె రేచర్ల కామిరెడ్డియు నామిరెడ్డియు గణపిరెడ్డియు హతులైరి ; మల్లయరెడ్డి, మల్రెడ్డి గాయపడి పట్టుపడిరి. వసతి అన్నమంత్రి వశమయ్యెను.

వీరావేశముతో శైవవీరులం వసతిని త్రవ్వివేయ ప్రారంభించిరి. కొన్ని ప్రక్కల కొనికి వారు నిప్పు ముట్టించిరి. అన్నమంత్రీశ్వరుడు అతికష్టముమీద వారి యావేశము మాన్పి యాయగ్ని చల్లార్చ జేసెను.

"వసదిలో నగరనాయకు లున్నా రని యైన మీరు మరువరాదు!" అంత స్పష్ట ముగా ప్రకటించువరకు నా శైవవీరులు ఆగలేదు.

అన్నమంత్రి యంతట వసది నంతయు వెదకించెను. అందులో నొక్క జైన సాధువుకూడ కనపడలేదు. నూతనముగా ప్రతిష్ఠితమైన నేమినాథవిగ్రహమునకు వెనుకనున్న చిన్నగదిలో, వసదికి నామమాత్రము అధిపతియగు సిద్ధనంద్యాచార్యులు ప్రాణమాత్రావశిష్టులై పడియుండెను. ఆతని నోట గుడ్డలు క్రుక్కబడి యున్నవి. కొన్ని దినములుగా నతడు భోజనము చేసినట్లే లేదు. ఆతని రక్షించుటకు తనతో వచ్చిన బాలవీరులలో చిన్నవాని నప్పగించి, రెండవవానితో నగరనాయకుల నన్వేషించుచు అన్నమంత్రి బయలువెడలెను.

ఒక ప్రక్కను వారు వసది కరణశాలను జూచిరి. అప్పటికి కొద్దిసేపటివరకును అక్కడ కరణములు వ్రాయుచుండిన చిహ్నములు కనబడినవి. కాని కరణములు లేరు. వారు వెళ్ళిపోవుచు కొన్ని పత్రములు ఒకమూల ప్రోవువేసి అగ్ని ముట్టించినట్లున్నది. ఆ యగ్ని ఇంకను రాజుకొనుచునే యున్నది. దానిని వెంటనే ఆర్పించి ఆగదికి బ్రాహ్మణ వీరులను కాపుపెట్టి అన్నమంత్రి త్వరితగతిని రెండవ బాలవీరునితో నాయకులకై వెనువెంట వసది గాలింపసాగెను.

నేమినాథవిగ్రహమునకు దక్షిణమున నున్నగది వారు ప్రవేశించిరి. అందుండి పాతాళగృహమునకు బోవు ద్వారమును పలక్షించి, యా బాలవీరుడు గొళ్ళెముతీసి దూర మాలోచింపక ముందుకు అడుగువేసి పడిపోయెను.

* * *

...డు చేసిన యుపచారములతో సిద్ధనంద్యాచార్యుడు కొంచెము తేరి ...వది పాకశాలనుండి గోక్షీరములు తెప్పించి సిద్ధనంద్యాచార్యుల నవి ...త్రావించెను. కొంచెము ఓపిక రాగానే సిద్ధనంద్యాచార్యులు "ఎక్కడ ...?" అని యడిగెను. బాలవీరుడు శాంతముగా "వసదిలోనే ఉన్నారు. ఆ ...ందరు పారిపోయినారు" అనెను.

...నంద్యాచార్యులు నిట్టూర్చెను.

* * *

...వసది తమ వశమైన తర్వాత, శైవవీరులను దానిని నేలమట్టము చేయకుండ ...సాధ్యము కాకుండెను. వారి సంప్రదాయమున జైనవసదుల విటతాట మొన ...ట యొక పుణ్యకార్యము! పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రలో ...క్తులు ఎన్ని జైనవసదులను వ్రచ్చి వ్రయ్యలు చేసినట్లు వర్ణింప లేదు! ప్రాచీన ...క్తులను తాము అనుకరింపవలెనని వారును ఉగ్రూతలూగుటలో నాశ్చర్య ... కాని అన్నమంత్రీశ్వరుని యాజ్ఞలను ఆనకట్టకు వారు విధిలేక కట్టువడి ...నవారైరి.

ఏకశిలానగరమున మహాశివరాత్రినాడు ఎన్నియో చోట్ల అలజడులు రేగినవి.

పలువురు తండములు తండములుగా నగరములోని వ్యవహారశాలలపై దాడులు సలిపిరి. అక్కడక్కడ కాపున్న యల్పసంఖ్యాకులగు భటులు ఆ దాడుల నతికష్టముపై నరికట్టిరి.

ఒక తండము అన్నమంత్రి భవనమును ముట్టడించెను. కాని యక్కడ గురునాగుడును మానవయు పరివారము నంతటిని సిదము చేసికొని యెదుర్కొనుటచే వచ్చినవారు విచ్చిపోయిరి.

రాజమందిరము-ముట్టును కొందరు తారాడుచున్న ట్లుపలక్షించి యచ్చటి భటులు జాగరూకులై వారిని పారద్రోలిరి.

ఒక తండము వేశ్యావాటికవైపు పోయి, యందులో మాచల్దేవి భవనములోనికి జొరబారి విలువగల వస్తువులను భగ్నము చేయుచు ద్రవ్యము దోచుకొనసాగిరి. సకాలమున నచ్చటికి గోవిందశర్మ తన నూర్గురు బ్రాహ్మణవీరులతో వచ్చి యా మూకలను పారద్రోలెను.

గోవిందశర్మ అన్నమంత్రి యాజ్ఞచొప్పున తన భటులతో ద్యూతశాలకు పోయెను గాని యా ద్యూతశాలలో నెవ్వరు లేరు. ఆపిమ్మట వారు మాచల్దేవి భవనమువైపు వెళ్ళియుందు రని యూహించి యటు వెళ్ళెను గాని వారెవ్వరు నక్క లేరు. ఐనను మాచల్దేవి యిల్లు దోచుకొనుచున్న పూర్వోక్తమగు మూక పారద్రోలగలిగెను.

అత డంతట జూదరులకై పట్టణమున నలజడి జరుగుచున్న చోటుల నె కెను. కాని కనపడలేదు.

తుదకు క్రీడాశైలమునొద్ద పెద్దమూక చేరినదని విని యాత డచ్చటికి బో అప్పటికే ఆ మూక యక్కడి భటులను నిర్జించి క్రీడాశైల మెక్కుచుం నెక్కువారును క్రీడాశైలశిఖరమునకు పెద్ద మోపులతో గడ్డి చొప్ప చె రము చేర్చుచుండిరి. అది చూడ గోవిందశర్మకు ముందు చిత్ర మనిపించె యుద్దేశ మేమి?

అంతలో లోకానుభవము గల యా యువకవికి మెరుపు మెరసినట్లును వేశమువలెను స్ఫురించినది.

"దూరమున నున్నవారి కెవరికో వీరు సంజ్ఞతో వార్త నంప బూనుకొన్నారు

వెంటనే గోవిందశర్మ తనతో నున్న వీరులతో క్రీడాపర్వతముపై క హించి యక్కడ నున్నవారితో తలపడెను. వారిలో ద్యూతశాలలో చూచినవా రున్నారు. ఆ లోపలినుండి వచ్చిన జైనసాధువేషధారియు నున్నా

ఉభయులకును పోరు సాగుచున్నది. పై శిఖరభాగమున చేర్చిన చెత్తను ఆ వేష ధారి స్వయముగా నిప్పు అంటించినాడు. శర్మ ఎన్నడు మున్ను వినియుండని వాక్కులు ఏదో భాషలో నుచ్చరించుచు, నా వేషధారి యా చెత్తచుట్టును తిరుగుచు చుట్టును నిప్పు అంటించుచున్నాడు. ఆ చెత్తయు రగుల్కొని మండసాగినది.

ఆ శిఖరమునకు పోయినవారు వచ్చిన మార్గమునగాని వెనుదిరిగి రాలేరు. ఆవల కొండరాయి నున్నగా నిట్టనిలువున నున్నది. మనుష్యమాత్రు డటు పోయి ప్రాణము లతో నుండలేడు. సరాసరి పోయి ఎంతో దిగువ నున్న స్వయంభూసరోవరములో పడిపోదురు! అందుచే పై నున్నవారు గోవిందశర్మతో వచ్చిన వీరులతో పోరాడక తప్పలేదు. కాని వారందరు నిష్కారణముగా ఖండింపబడిరి. వేషధారిమాత్రము శిఖరాగ్రమునుండి రెండుమూడు తాళ్ళ ప్రమాణమున క్రింద నున్న స్వయంభూసరో వరములోనికి తలక్రిందుగా దూకి యదృశ్యుడయ్యెను.

గోవిందశర్మ ఎంత ప్రయత్నించినను ఆ మండెడు మంట లార్పింపలేక పోయెను. ఆ పైన చిన్న కొండపడియలో నున్న యుదకము తప్ప వేరు నీరు అక్కడలేదు. ఆ ఉదక మంతయు బోయించినను మంటలు చల్లారలేదు. తెల్లవారు వరకు ఆ యేకశిలాగ్ర పల్లే మండుచుండెను. దూరమున రెండుమూడు యోజనముల వరకు నది కనబడుచు నేకశిలానగరమే మండి దగ్ధమై పోవుచున్నదను భావము కలిగింపసాగెను.

* * * *

వసదినుండి స్వయంభూదేవాలయము వైపునకు వచ్చుచుండిన అన్నమంత్రి యది గమనించెను. కాని ఏమి చేయగలడు?

అన్నమంత్రి ఇప్పు డెక్కడి కేగవలెను? ఒక్క క్షణకాల మాత డాలోచిం చెను. ఆతనికి స్వగృహమునకు పోవ నిచ్ఛ కలుగలేదు; సరాసరి తా నిన్నాళ్ళు నున్న చెరసాలకే తిరిగిపోయెను.

తెల్లవార బోవుచున్నది. అన్నమంత్రి స్నానసంధ్యాదికము లాచరించెను. క్రిందటి దినమంతయు నాత డుపవసించి యుండెను. రాత్రి యంతయు జాగరణము చేసి బడలియుండెను. ఏమైన భుజింపవలె నను నిచ్ఛ జనించినది. కాని నేడమావాస్య. అమావాస్యాంగము లగు పితృకర్మ లాచరింపనిది తా నేమియు భుజింపరాదు.

జాము ప్రొద్దెక్కువేళ పూర్వనిర్ణీతవిధమున స్వయంభూదేవాలయము ప్రాంగ ణమున నాయకుల నందర కలసికొనెను. కొద్దిమాటలతో రాత్రి జరిగిన విషయములు వారల కాతడు వివరించెను. క్రొత్తగా వచ్చిన వార్తలు ఆలకించెను. ఏకశిలపై ఆ వేసిన మంట ఎవరికో సంకేతము! ఎవరికి? ఎవరికైనను కోట సర్వవిధముల రక్షించు టకు పూనుకొనవలెను. విశ్వాసపాత్రు లగువారిని నిర్ధారణచేసి వారికి పను లప్పగింప వలెను!

అన్నిటికంటె ముందు శ్రీరుద్రదేవ మహారాజుల క్షేమవార్తలు తెలిసికొనవలెను! వెంటనే తిక్కచమూపతిని గోనగన్నారెడ్డిని తమ మహాసైన్యములతో అతిశీఘ్రప్రయా

ణముల వెనుదిరిగి ఏకశిలానగరము చేరుకొనునట్లు చేయవలెను అంబదేవునికూడ సాధ్యమైనంత సేనతో ఏకశిలానగరమునకు రమ్మని వార్తలు పంపవలెను! ఆ సభలో ఏకవాక్యతయే గాని రెండవమాట లేదు.

ఆ సభయైన వెంటనే అన్నమంత్రి తన బంధనశాలకు పోయి అమావాస్యాంగ కర్మకలాపములు కావించుకొని భుజించెను. భోజన మగునప్పటికి, తిక్కనసోమయాజుల యాజ్ఞచే నాతని యాశ్వికభటు డగు బలిసీడు, అన్నమంత్రీశ్వరుల కాంభోజాశ్వమును దెచ్చెను. దాని నెక్కి యన్నమంత్రి ఏకశిలానగరమం దెల్లెడ సంచరించెను. ఆత డట్లు వాహ్యాళికై సంచరింపలేదు!

అతడు వెళ్ళుచున్న ప్రదేశమంతయు నాతని మనస్సులో నచ్చొత్తినట్లు చిత్రిత మొనర్చుకొనుచుండెను. శిలాప్రాకార మే స్థితిలో నున్నది? పుట్టకోట ఎట్లున్నది? ఎట్టివా రెక్కడ నున్నారు? దానితోపాటు ఆతని తలలో లెక్కలును సాగిపోవుచుండెను. ఈ కోటరక్షణకు ఎందరు భటులు కావలెను? ఎట్టి భటులు కావలెను? ఆతడు మరల నిజబంధనశాలకు వచ్చునప్పుడు ఉత్సాహముగా లేడు!

ముం దాతడు విపరీతముగా నాహారపదార్థములు రాజమందిరమునకు చేర్పించి, యందలి జలాశయము లన్నియు నింపునట్లు చేసెను. పుట్టకోటను కాపాడగల సేనలు ప్రస్తుతము లేవు. శిలాప్రాకారము పూర్తి కాలేదు. రాజ ప్రాసాదముచుట్టును పూర్తిగా కట్టబడియున్న యున్నత మగు ప్రాకారమే ప్రధానమగు శరణ్యప్రదేశముగా నాతనికి పొడకట్టెను. అక్కడనే మహాసేనలు వచ్చువరకు శత్రుసేనల నిలువరించుట సాధ్యపడవచ్చును! ఇంతలో కొంత సేనను ప్రోవుచేయవలెను!

అదృష్టవశమున మూడవనాటికి శ్రీ రుద్రదేవమహారాజులు సురక్షితముగా పాకాల స్కంధావారము చేరి రను వార్త వచ్చినది!

* * * * *

శ్రీవీరభద్రేశ్వరులను గాయపరచి శ్రీరుద్రదేవమహారాజులు గుర్తించిన సమయమున, నక్కడికి వచ్చిన యాశ్వికులు పాకాలనుండి సాయము వచ్చుచున్న సైనికులు. వారు శ్రీరుద్రదేవమహారాజుల యాజ్ఞచే వీరభద్రేశ్వరుని భద్రముగా చికిత్సకై వైద్యుల యొద్దకు పాకాల చేర్చిరి.

ఆ యాశ్వికులు శ్రీరుద్రదేవమహారాజుల నా స్థితిలో చూచుటచే ఉద్వేగమును ఆనందమును పొంది పాకాలకు దయచేయ వేడిరి. కాని మహారాజులందు కంగీకరింపక ఆ యాశ్వికసేనను తీసికొని, తాను వచ్చిన దారిన వెనుకకు ప్రయాణమయ్యెను. ముందు వారికి మనుమసిద్ధియు పర్వతనాయకుడును కనబడిరి. ఆ తొమ్మిదిమందిలో జీవించి యున్నవారు వారిద్దరే. వారును మిక్కిలి గాయపడి బాధపడుచుండిరి. వెంటనే రుద్రప వారి కుపచారములు చేయించి వైద్యులయొద్దకు చికిత్సకు చేర్పించెను.

మరికొంతదూరము పోగా ముందు వెన్నాడి వచ్చిన యాశ్వికుల నెదిరించిన పదిమంది యాశ్వికుల శవములును కనిపించినవి. శ్రీ రుద్రదేవమహారాజులు కన్నీటితో వారికి తర్పణ మొనర్చి, వారి శవములకు విధివిధానమున సంస్కారము లొనర్ప నాజ్ఞ లిచ్చెను.

అంత మరియు వెనుకకు బోయి అశ్వికులను ధైర్యసాహసములతో తనపదాతు లెనరించిన ప్రదేశము చేరుకొనెను. వారిలో పలువురు వీరశయ్యాలలంకరించిరి. కాని నూరుమందిమాత్రము గాయపడియు ప్రాణములతో నున్నారు. వారి కందరికు నుపచారములకును వైద్యమునకును ఏర్పాట్లు చేసి, వరల నా యాశ్వికులతో తన్ను వెంటాడిన యాశ్వికదళమును కనిపెట్టి వెంటాడి పోరుట కుద్యమించెను. కాని వారు కనబడలేదు. వారి జాడయే లేదు!

ఎంత ప్రయత్నించినను ఆశత్రుసేన హరించిన తన యైదు కరులును పంచశబ్దములును శ్రీరుద్రదేవమహారాజులకు తిరిగి లభింపలేదు !

తుదకు నిరాశ జేసికొని యా రాత్రికి మహారాజు పాకాల చేరుకొని విశ్రమించి ఏకశిలానగరమునకు వార్త లంపెను.

అక్కడనుండి శ్రీ రుద్రదేవమహారాజు లాపరునాటి యుదయముననే బయలుదేరి రాత్రికి ఏకశిలానగరము చేరుకొనిరి.

మహారాజులు విజయయాత్ర చేసి తిరిగి వచ్చియుండుటచే మహోత్సవము చేయవలసియుండెను. కాని యట్టి దేదియు జరుగలేదు. శ్రీరుద్రదేవమహారాజులను మరల చూడగలిగినందుకు నాయకు లందరును ఆనందభావపూర్ణులై యుండిరి. కాని వారిపై నిప్పుడు విశేషభారము పడినది! ఏకశిలానగరమును, గణపతిదేవులను ప్రతాపరుద్రకుమారులనే కాక, శ్రీరుద్రదేవమహారాజులను గూడ రానున్న యాపదనుండి రక్షించుకొనవలసిన భారము వారిపై నిప్పుడున్నది. దేవగిరి యాదవసేనలు సమీపించిన వార్త యిప్పుడు రహస్యము కాదు. అది యందఱకిని తెలిసినది !

అంతఃపురములోనికి వెళ్ళి శ్రీరుద్రదేవమహారాజులు ముందు గణపతిదేవుల దర్శించి మ్రొక్కి నిజమందిరము చేరిరి. కామసాని వచ్చి దృష్టి తీసినది. కుబ్జ ప్రతాపరుద్రకుమారులను తీసికొనివచ్చినది. ముమ్మడాంబ వచ్చి నమస్కరించినది. మహాదేవరాజు వందన మాచరించెను.

రుయ్యమ్మమాత్రము రాలేదు! తాను ప్రతినిధిగా నుంచిపోయిన రుయ్యమ్మ రుద్రమకు కనిపించనేలేదు! చిత్రము! అస్వస్థతగా ఉన్నదా? ఎవరును ఏమియు చెప్పలేరు. అడుగుటకు రుద్రమ సాహసింపలేదు!

ఈమధ్యలో జరిగిన సంగతు లన్నియు గననచేసికొనుచు, నా రాత్రి రుద్రమ్మ ప్రొద్దు పోవువరకు నిద్రపోలేదు. నిద్రించి యారుగడియ లైన గాలేదు!

అంతలో మార్గమున భయంకరముగా తప్పెట్ల మ్రోత వినవచ్చినది. అది పూర్వము రుయ్యమ్మ వినిన ఉత్సవాంగ మగు తప్పెట్ల జుకుజుంజుం మ్రోత కాదు! ఇవి రణతప్పెట్లు! రణభేరులు!

తెల్లవారి చూచునప్పటికి దేవగిరి యాదవసేనలలో నగ్రదళములు ఏకశిలానగర ప్రాకారమును దాటి పురాపరోధనమునకు ననుకూల మగు స్థానములు నిర్ణయించుకొనుచుండెను! వెనుకనుండి సేనాప్రవాహమే వచ్చుచున్నది!

## ౫౧

"రేరే ఘూర్జర జర్జరోసి సమరే, లంపాక కిం కంపసే ?
వంగ త్వంగసి కిం ముధా ? బలరిజః కాణోఽసి కిం కోంకణ ?
ప్రాణత్రాణపరాయణో భవ మహారాష్ట్రోఽపరాష్ట్ర స్యమీ
యోద్ధారో వయ మిత్యరీ నభిభవం త్యంధ్రక్షమాభృద్భటాః"
ప్రతాపరుద్రీయమ్.

దేవగిరియాదవులే తిమ్మ మహారాష్ట్రుల మని చెప్పికొనుటయు గలదు. మహారాష్ట్రములో నొక భాగమువారు దేవగిరియాదవులు. యాదవసైన్యములు ఏకశిలానగరమును ముట్టడించునని ముందుగనే అన్నమంత్రి యూహించెను. అతడును పుట్టకోట చుట్టు నున్న కందకము నీటితో నింపియుంచెను; పుట్టకోట గోడలపై యథాశక్తిగా రక్షకభటుల గాపుంచెను. కాని పుట్టకోటను దీర్ఘకాలము రక్షించుట సాధ్యముకాదు!

పుట్టకోటగోడ నిడివి నలుపైపుల గలసి రమారమి రెండు యోజనములు కలదు. కోట రక్షించుటకు శిక్షితులైన భటులు ఐదువేలమందికంటె లేరు. వారికి ఇప్పుడు క్రొత్తగా ఆయుధసాధనమాత్ర మభ్యసించిన యారువేలమంది బ్రాహ్మణవీరులుతోడు కాగలరు. కాని వా రెంతమాత్రము పోరాడగలరో? రక్తమాంసములతో బీభత్సముగా నుండు రణరంగమునకు వారు అలవాటు పడగలరో, లేరో ? వారుగాక ఏడెనిమిది వేలమంది వీరశైవులు ఇప్పుడు యుద్ధభటు లగుటకు అంగీకరించినారు. కాని వారు పలువురు కోట నిర్మించుటకు వచ్చినవారు. వారికి పలుగులు, పారలు, ఉలులు, బాడిసలు, శాణములు, సుత్తెలు, పట్టాటలో నేర్పు కలదు గాని, రణసాధనములకు వారు క్రొత్తవారు. కరియును వారలు ఆవేశపూరితులు! ఆజ్ఞలు సక్రమముగా సుశిక్షితముగ పాలించు నభ్యాసము వా రింకను అలవరచుకొనవలసియున్నది. ఇట్టి సేనతో సుశిక్షితములగు మహారాష్ట్రసేనల నెదిరించు టెట్లు? మహారాష్ట్రసేన మూడు లక్షలకు తక్కువ లేదు. దానిని నడపుచు యాదవప్రభువగు మహాదేవుడే స్వయముగా వచ్చియున్నాడు. ఎంత నిబ్బరము లేనిది అతడు స్వయముగా వచ్చును?

పుట్టకోటను రక్షించుటలో మరియొక ప్రమాదముకూడ గలదు. పుట్టకోటకును లేచుచున్న రాతికోటకును మధ్యనే జైనుల నివాసము లున్నవి. అచ్చటనే విదేశీయులగు కర్ణాటులయు యవనులయు మహారాష్ట్రులయు కళింగులయు నివాసములును ఉన్నవి. అట్టి సందేహాస్పదులను వెనుక నుంచుకొని కోటగోడలు రక్షింప బూనుకొనుట ఎంత అపాయకరమగు పని ?

ఐనను అన్నమంత్రి యిట్లు నిశ్చయించెను. సుశిక్షితమైన సేనలు పుట్టకోటను ముందు రక్షింప బూనుకొనవలెను. సందులు గిలిగి యసంపూర్ణముగా నున్న శిలాప్రాకారము, నెట్లో సందులు పూడ్చి, వీరశైవయోధులు రక్షింప దొరకొనవలెను. రాజప్రాసాదముచుట్టు నున్న శిలాప్రాకారమును బ్రాహ్మణయోధులు కాపాడవలెను. పుట్టకోట యాగనప్పుడు దాని వదలి యన్నటి భటులు శిలాప్రాకారము

చేరికొనవలెను. అదియు సాధ్యము కానప్పుడు వారును వీరశైవభటులును గలసి రాజప్రాసాదము చేరికొనవలెను. ఇట్లు రాజప్రాసాద మైనను నెలరోజులపాటు రక్షింపబడినచో భయము లేదు. అప్పటికి తమ సేనల సహాయము తప్పక చేకూరును. కాని యిన్నాళ్ళు ఈ కోట నిలుచుట కష్టసాధ్యము! అదే అన్నమంత్రి కున్న బాధ!

మహారాష్ట్రసేనలు ఒక్కనాడు మాత్రము స్థావరము లేర్పాటు చేసికొనుచు పోరుకు దిగకుండెను. కాని మరునాటి యుదయమున చీకటి యుండగనే, వారు కోట పట్టుకొనుటకు తలపడిరి. కోటగోడలపైభటులు పలుచపలుచగా నుండుట వారు నిర్లక్షించిరి. దానితో వారికి వచ్చిన వార్తలు ధ్రువపడెను. మొదటినాటి సాయంత్రమునకు వారు పలుచోట్ల కందకము పూడ్చివేసి కోటగోడలు దరియుటకు దారులు చేసికొనిరి. మరునాడు తెల్లవారునప్పటికి వారా దారులు దృఢపరచిరి.

నాగదేవనాయకుడును ప్రసాదాదిత్యనాయడును దనకు సహాయముగా, అన్నమంత్రి స్వయముగా కోటగోడలను పరీక్షించుచు శత్రుసేనల శక్తిసామర్థ్యముల నుపలక్షించుచుండెను. అన్నమంత్రి రెండు దృష్టులతో నది తిలకించుచుండెను. ప్రస్తుతము వారి నాపు టెట్లు? ముందు తగినంత బలము వచ్చినప్పుడు, వారిని నిర్జించు టెట్లు? అన్నమంత్రికి బాలవీరు లిద్దరును పార్శ్వరక్షకులుగా నుండి యాతని నిరతము ననుసరించు చుండిరి.

ఐదవనాటికి పుట్టకోట రక్షించుట సాధ్యము కాదని ధ్రువపడెను. ఆ రాత్రి పుట్టకోట గోడలపై నన్నమంత్రి యాజ్ఞానుసారముగా నార్భాట మెక్కువగా భటులు చేయసాగిరి. ఇది యేమని శంకించి మహారాష్ట్రులు వెనుకనుండి యెక్కువ సేనలు వచ్చువరకు గోడలపై నెక్కుటకు సాహసింపలేదు! ఆ వ్యవధిలో చీకటిమాటున ఆంధ్రసేనలు పుట్టకోట వదలి శిలాప్రాకారము వెనుకకు చేరుకొని వీరశైవభటులను గలసెను.

ఇంత యాకస్మికముగా నంధ్రసేనలు పుట్టకోట విడిచిపోవుట మహారాష్ట్రసేనల కాశ్చర్య మయ్యెను. ఇందులో నేదో మర్మ మున్నదని శంకించి వారు వెంటనే గోడలపై నెక్కి యాక్రమింప సాహసింపలేదు. అట్లు వారికి హస్తగతము లైన పుట్టకోట గోడలను రెండు దినములవరకు వారాక్రమించుకొనలేదు. ఎక్కడ నేగోతులు త్రవ్విరో యని బహుజాగరూకులై వారు ముందుకు సాగిరి.

పుట్టకోటకును శిలాప్రాకారమునకును మధ్య నున్న ప్రదేశము నవగతము చేసికొని యందులో పోరున కనువుగ తమ సేనల స్థాపించుటకు మహారాష్ట్రులకు మరి రెండురోజులు పట్టెను. ఆ పిమ్మట నూతనోత్సాహముతో వారలా యసంపూర్ణమగు శిలాప్రాకారము ముట్టడించిరి.

ఈ శిలాప్రాకారములో సందు లున్నవి. ఆ సందులలో నిలిపిన యన్త్రాంగలు దృఢమైనవి కావు. ప్రాకారమే కొన్నియెడల పైకి లేవలేదు. అట్టియెడల దాని నెత్తుగా చేయుట కుపయోగించిన సాధనములును గట్టివి కావు. అయిన నేమి? ఈ శిలాప్రాకార మున్నంతవరకు దుర్భేద్య మైనది. పుట్టకోటకంటె పొడుగు తక్కువ; దానిని రక్షించుచున్న సైనికుల సంఖ్య ఎక్కువ. అన్నిటికంటెను వీరశైవయోధుల

[40]



యావేశము దుస్సాధముగా నున్నది. సామాన్యసేవలను నేర్పు ఉండునుగాని, యంత రణోత్సాహ ముండదు.

ఆంధ్రభటులు కోటగోడలపై నుండి గురి తప్పకుండ బాణములు వేయుచు యాదవవీరుల పలువురు గూల్చుచుండిరి. గోడల సమీపమునకు వచ్చినవారిపై శైవ వీరులు శిలావర్షము కురిపించుచుండిరి. అట్లు వర్షించుటకు శిలలకు కొదువ లేదు. శిలా ప్రాకారము పూర్తిచేయుటకు సిద్ధపరచియున్న శిలలన్నియు నిప్పుడు శత్రుసేనపై పడవేయుట కనువుగా నున్నవి. అసంపూర్ణముగా నున్న ప్రాకారపు సందులలో యాదవులు తమ గజబలమును ప్రయోగించుచుండిరి. ఆ గజములమీద కోటగోడలపై నుండి సలసల కాచిన జలమును నూనెయు వీరులు పోసి నొప్పించుచుండిరి.

శిలాప్రాకారము నొద్ద పోరులో నొక క్రొత్త చిక్కు వచ్చెను. పుట్టకోటయొద్ద పోరు సాగుచుండగనే రెండు ప్రాకారముల మధ్య నివసించు విదేశీయులలోనను జైనులలోనను కలవరము ప్రారంభ మయ్యెను. ఇప్పు డది తీవ్రతర మైనది. అది యొక మహాప్రవాహమునే అనుకరించుచుండెను. జైనుల వసదిని మహాశివరాత్రినాడు అన్నమంత్రి పట్టుకొనినప్పు డక్కడ సిద్ధనంద్యాచార్యులు తప్ప మరి యెవ్వరును లేరుగదా! ఆ మరునాడే సిద్ధనంద్యాచార్యులను భటులు అదిమముతో రాజప్రసాదమునకుం దీసికొనిపోయి యుండిరి. పుట్టకోట విడుచునాటికి ముందుగనే రాజభటులు అన్నమంత్రి యాజ్ఞలతో వసది వ్యవహారశాలలలో తగులబెట్టబడకుండ మిగిలిన పత్రములను రాజభవనమునకు చేర్పించి కార్యభరణుడగు రామనామాత్యుల వ్యవహారశాలలో పరిలము చేసిరి. ఇది జైనులలో విప్లవకారులకు వంక యయ్యెను.

"రాజభటులు జైనవసదిపై దండెత్తి వసది తగులబెట్టిరి. మహానుభావుడగు సిద్ధనంద్యాచార్యులను గూడ బంధించినారు. ఇప్పుడు వసదిపత్రములను ద్రవ్యమును హరించినారు. ఈ రాజ్యమును మనము ధ్వంసముచేయవలెను! జయ హరిహరదేవ రాజ! జయ మహారాష్ట్ర మహాదేవరాజ!"

ఈ విధముగా విప్లవకారులగు జైనులు ప్రచారము సాగించిరి. అందులో ముఖ్యుడు నాగాచారి. సామాన్యజైనులు పలువురు ఈ ప్రచారమునకు వశులై, స్త్రీ బాల వృద్ధు లను విచక్షణకూడ లేక, చేతికి దొరికిన యాయుధములు ధరించి శిలా ప్రాకారముపైకి విజృంభింపసాగిరి. మహారాష్ట్రులును ఆ వీలు గమనించి అపాయకర మైన ప్రదేశముల నెల్ల వారినే ముందుంచి యుద్ధయాత్ర సాగించిరి. ఇందువల్ల మహారాష్ట్ర సేనకు నష్టము తగ్గిపోయెను.

కాని జైనులందరు ఈవిప్లవవచనములకు వశులు కాలేదు. వారిలో పలువురు కాకతీయరాజన్యుల రక్షణతో తరతరములుగా నీరాజ్యములో కాపురములు చేయుచున్నారు. వారికి రాజకీయములతో పనిలేదు. సుఖముగా ఎవరి సంసారయాత్ర వారు చేసికొనుటే వారికి ప్రధానము. "ఎవ రెంత చెప్పినను జైను లైనంతమాత్రమున రాజభటు లెన్నడికి నన్యాయము చేసియుండలేదు. దుర్మార్గము చేసినవారిని రాజభటులు శిక్షింపకుందురా? నగరినాయకుల నందరిని వధించుటకు కుట్రచేసినవసది వారిని ఏ ప్రభుత్వము వదలి పెట్టును?" ఈ విధముగా వా తలంచుచు ఆ యలజడులలో

జోక్యము కలిగించుకొనకుండిరి. కాని వారికచ్చట నిలుచుట సాధ్యము కాకున్నది. వారిలో కొందరు నగరము విడిచి చుట్టుపట్టుల తమ యాత్మీయు లున్న ప్రదేశములకు తలదాచుకొన బోయిరి. కాని యందరకు నట్టి యాప్తులు లేరు. అట్టివారు శిలాప్రాకారములోనికి రానిమ్మని రాజభటుల నర్థించుచుండిరి. ఏమి చేయుట? నమ్ముటా! వీరిని నమ్మకుండుటా? ఇట్లు శరణాగతులై వచ్చినవారిలో వీరభల్లటదేశికుడును గలడు. వీరభల్లటదేశికుడు ప్రసిద్ధుడు గనుక వెంటనే అతనికి లోనికి రా ననుజ్ఞ వచ్చినది. కాని పలువురు అల్లాడిపోవుచుండిరి. అట్లు లోనికి వచ్చుట కనుజ్ఞ రానివారు ఆంధ్రరాజును తిట్టి దూరము తొలగుచుండిరి; హరిహరదేవరాజుకు జయ జయ నినాదములు చేయుచుండిరి.

శిలాప్రాకారము మరి రెండు దినములకంటె నెక్కువకాలము మహారాష్ట్రుల ధాటికి నిలువలేదు. తత్ప్రాకారరక్షకులు వెనుకకు తగ్గి రాజప్రాసాదము చుట్టు నున్న ప్రాకారరక్షణకు అక్కడ నున్న బ్రాహ్మణవీరులతో కూడి పూనుకొనిరి. రెండు ప్రాకారములు దాటినతర్వాత మహారాష్ట్రసేనల యుత్సాహ మెక్కువయ్యెను. ఆంధ్రవీరులకు గుండెలు జారిపోయెను. ఇప్పుడు స్వయంభూదేవుని యాలయమునే యెట్టి రక్షణయు లేకుండ వదలవలసివచ్చినది.

రాజప్రాసాదముచుట్టు నున్న ఆవరణము మిక్కిలి చిన్నది. అందులోనికి ఇప్పుడు మహాప్రధానులయు నగరనాయకులయు కుటుంబములగూడ చేర్చవలసివచ్చినది. అందరితోపాటు, అన్నమంత్రీశ్వరుని తల్లి గౌరమ్మయు, పత్నులగు పార్వతమ్మ లకుమమ్మలును, కూతురు బాలయు, రాజభవనము చేరికొనిరి. తిక్కనసోమయాజియు సోమిదేవితో నచట చేరికొనెను. గురునాథునకు మారనకు, బ్రాహ్మణవీరులకు శిక్షణయొసగుటతో తీరిక లేకున్నది. అన్నమంత్రి మాత్రము తన బంధనశాల వదలలేదు. అదియే ప్రస్తుత మాతని దివాణము! అతడు శ్రీ రుద్రదేవమహారాజులనుగూడ దర్శింపక, తనపై బడిన కార్యభారము తీర్చినపిమ్మట దర్శింతునని వ్రాతమూలమున నివేదిక పంపుకొనెను. మహారా జందులకు సమ్మతి తెలిపెను.

రాజప్రాసాదముచుట్టును భయంకరముగా యుద్ధము రేగుచున్నది. రాత్రింబవళ్ళు విధివిరామము లేకుండ స్త్రీపురుషు లందరు ఏదో ఒక విధమున పోరాడుచున్న యోధులకు సహాయపడుచుండిరి. ప్రాసాదము లోపలను బయటను మహాకోలాహలమే వినవచ్చుచున్నది. మహారాష్ట్రసేనలు మాటిమాటికి హరిహరనాథునికి జయశబ్దములు చేయుచుండుటచేత ఆ సైన్యముతో రుద్రమ సవతికుమారు డగు హరిహరు డున్నట్లు విశదమయ్యెను.

అప్పటికి కొంతకాలమునుండి గౌరమ్మ తిక్కనసోమయాజుల నర్థించి వారు రచించుచున్న ఆంధ్రమహాభారతము వినుచుండెను. పూజ్యురాలగు నామె పలుకులచేత రాజమందిరమున గల స్త్రీజనమునం దంతటను శ్రీమహాభారతప్రశంస ప్రాకిపోయినది. శ్రీమహాభారతము కల్పవృక్షమే! అది [illegible]ధర్మశాస్త్రము, నీతిశాస్త్రము! అదియే ఆధ్యాత్మవిద్య! శ్రీరుద్రదేవ [illegible] కూడ ఆ ప్రశస్తి వినవచ్చినది. ఆనాడు స్వయంభూతేశ్వరాలయము [illegible]జుల భారత

భాగము విన్నదాది ఆమెను కలగా నున్నది. కల్పవృక్షము నశించిన కోరిక నెరవేరదు? "రాజనీతివిశేషము లేవి? శత్రురాజుల జయించు తెరం గేమి? ఈ ప్రశ్నలకు మహాభారతములో నుత్తర ముండునా?" యని శ్రీరుద్రదేవమహారాజులకు ఆకాంక్ష కలిగెను. ఆనాటి రాత్రియే పనులన్నియు సద్దుకొని తీరిక చేసికొని రుద్రమ్మ, గౌరమ్మ ఏకాంతమందిరమున కేగి సోమయాజుల నట్టి భాగ మున్న వినిపింప వేడెను.

సోమయాజులు చిరునవ్వు నవ్వుచు, "అమ్మా, ఈనాడే ఆభాగము వ్రాసినాను. అవధరింపుడు!" అని ఇట్లు వినిపించెను. రుద్రమ యాశ్చర్యముతో నాలకించెను.

"ధృతరాష్ట్రుడు ధర్మజునకు రాజనీతివిశేషంబులు సెప్పుట.

"నీవు నిచ్చలును విద్యావృద్ధజనముల దగ నుపాసింపు, మర్థముల వారి
ప్రీతుల జేయుము, నీతులు వా రుపదేశింప వాని నూదిన మనంబు
గలిగి నిర్వర్తింపు కార్యంబు, నింద్రియంబుల రాజ్యతంత్రంబు బోలె నరసి
రక్షింపు, నుప్పింపు రక్షితం బైన శుభంబులం గావించు, భావశుద్ధి

ధామములును బితృపితామహక్రమసమా
గతులు విశదగతులుగాగ వలయు
సచివు, లతి విదగ్ధచారుల బనుపుము,
పనుల నాప్తజనుల భంగు లరయ.

"పురరక్షణము దృఢంబుగ,
నావ చేయుంగవలయు నమ్మంగలుగు స
త్పురుషుల నిడందగు గుడుపు ని
దుర మొదలగు లోని పనుల తోడనువు లరయన్.

"న్యాయంబుతోడ వివిధో
పాయంబుల నర్థముల నుపార్జింపుము, భూ
నాయక రాజ్యవిఘాతము
సేయుజనుల నెఱిగి చంపం జెఱపనవలయున్.

"నీవలనను భక్తిస్నేహా
వేశము గలిగి శూరులైన యులజడికిం
దా విసువని సత్కులజుల,
గావింపుము సైన్యవిభులంగాం గురుముఖ్యా!

"ధృతరాష్ట్రుడు ధర్మరాజునకు శత్రురాజుల జయించు తెఱంగు సెప్పుట

"కుడువ నిచ్చు తటియుం గుసవర క్రిక్కించు
నవసరంబు నెఱిగి యకిన్నపాలు
నీవు ధీర … టం బోనిమ్ము,
క్రమ … చెఱపు.



సంపదల నాపదల నొక్క చంద మగుట
వికృతి నొందుట యీ బలవితతులందుఁ
గాంచి యెల్లప్పుడును హితకారి యైన
బలము నెక్కుడుగాఁ బ్రోవు ధరితముఖ్య.

"వినికి గలిగి రక్షించుచు,
ననువున దయతోడి పాడి నాయకు లెల్లం
గొనుచు దగనేలి పొగడొం
దిన రాజున కుర్వి గామధేనువ కాదే!"

అట్లు వినిపింప విని కోశపూజ గావించిన సువర్ణాక్షతలు తిక్కన సోమయాజుల స్వహస్తదత్తంబులు, భక్తితో శ్రీరుద్రదేవమహారాజులు శిరస్సున గ్రహించి సెలవు తీసికొని నిజమందిరమున కేగెను.

* * * *

అక్కడి కప్పుడే కొలనిరుద్రుడు పంపిన విజయవార్త వచ్చియుండెను. వ్యాకరణబ్రహ్మ సేనల మొదటి ధాటికే కాళింగసేనలు విచ్చిపారినవి. వారితో నున్న మురారిదేవుడు మాత్రము సాహసించి మార్కొని తల గోల్పోయినాడు. ఆంధ్రసేనలు కళింగసేనలను సింహాద్రి దాటి నాలుగుయోజనముల మేర తరిమివేసినవి. శీఘ్రముగా శ్రీ రుద్రదేవమహారాజుల దర్శనమునకు విజయోత్సాహముతో కొలనిరుద్రుడు వచ్చుచున్నాడు!

ఆ వార్త వినగానే రుద్రదేవునకు బ్రహ్మానంద మైనది. అది తిక్కనసోమయాజుల యాశీర్వచనమునకు సద్యఃఫలముగా నామెకు భాసించినది. అట్టిపూజ్యుల వాక్కుల మోఘములు!

రుద్రమ యొక్క క్షణకాలము ధ్యానించెను. ఆవల మహారాష్ట్రసేనలు, "జయ హరిహరదేవరాయ!" అని చేయుచున్న జయజయధ్వనినాదము లామె చెవుల బడెను. "ఈ కలహ మేల? ఈ జననాశన మేల? ఇది కులకలహము! జ్ఞాతికలహము! రాజ్యలోభముచే దాపురించిన కలహము!"

అంతలో ఆమెకు తిక్కన సోమయాజుల మూర్తి మనోవీధిలో భాసించినది. కురుపాండవసమరసమయమున వ్యాసభగవానులు నిర్లిప్తులై దాని నాలోకించుచుండెను గదా! నేడు తిక్కనసోమయాజులు తాము వ్రాసిన ఆంధ్రమహాభారతభాగము వినిపించిరి. "అది వారే వ్రాసినారట! ఈ మహాయుద్ధ సమయమున వారికే మనఃస్తిమిత మెట్లు కల్గినదో! వ్యాసభగవానుల యంశ తప్పక తిక్కనసోమయాజులలో నున్నది!"

అంతలో రుద్రదేవమ్మకు తిక్కనసోమయాజులు వినిపించిన చివరి వాక్యము జ్ఞప్తికి తగిలినది!

"తగనేలి పొగడొందిన రాజున కుర్వి కామధేనువ కాదే!"

"కామధేనువ! ఈ యుర్వి కామధేనువ కాదా నాకు?" ఇట్లామె ధ్యానించుచుండగా వ్యాసభగవానుడే తిక్కనసోమయాజుల రూపమున తన్నానాడు ఆశీర్వదించి నట్లు స్ఫురించినది.

"నాకు ఉర్వి కామధేను వగుటకు ఆరంభించినది!" ఇట్లనుకొనుచు కోలని రుద్రుని విజయవార్తను మహారాజు తిక్కన సోమయాజులకు ముందు తెలియజేసి, ఆ వెంటనే ప్రాసాదాంతర్భాగమునను కోటగోడలపైనను చాటింప బంచెను.

ఆంధ్ర సైనికులు బ్రాహ్మణయోధులయు వీరశైవయోధులయు సహాయముతో నిప్పటికి రెండు దినములుగా రాజప్రాసాదమును రక్షించుచున్నారు. దాని గోడ లున్నతమైనవే కాని బలిష్ఠమైనవి కావు. మధ్య ఇటుకరాతితో కట్టబడినవి. అవి వర్షములకు కారిపోకుండుటకై రెండువైపులకు రాతిపలక లమరించినారు. ఆ యిటుకలు మిక్కిలి గట్టివే కాని తేలికవి. బరువుండవు. నీటిలో వేసిన నవి మునుగక తేలును. కాకతీయశిల్పులు ఆ యిటుకగోడల నిర్మాణమున నెంతయో నేర్పు చూపించిరి. కాని యవి మహాయుద్ధమును ఓర్చు నుద్దేశముతో నిర్మించినవి కావు. రాజప్రాసాదమునకు సామాన్యరక్ష చేయుటకే అవి ఉద్దిష్టమైనవి. ఆ గోడల నాశ్రయించి యిప్పుడు మహారణము చేయవలసివచ్చినది! దానిలోపలనున్న యవకాశము స్వల్పము. ఆ కొద్ది తావులో నింత పెద్ద జనసమూహ ముండుట మిక్కిలి కష్టముగా నున్నది. పుష్కలముగా నాహారము జలము ఉన్నవి. కాని మరి రెండునాళ్ళట్లే యున్నచో మహామారివంటి యంటువ్యాధి యేదో పుట్టుట నిశ్చయము! క్షణ క్షణము సైనికుల ధైర్యము దిగజారిపోవుచున్నది. ఆ సమయమున కోలనిరుద్రుని యీ విజయఘోష వారికొక ధైర్యము కలిగించెను. ఆశాకిరణ మంకురించినది.

మరునాటి యుదయమున మహారాష్ట్రవీరులు విపరీతమైన సాహసము చేసి ప్రాసాదకుడ్యములపై కెగబ్రాకుచుండిరి. వారు హరిహరదేవుని ఆంధ్రసామ్రాజ్యమునకు పట్టము కట్టినవారివలెనే "జయ, హరిహరదేవరాజ, జయ!" అని యుద్ఘోషించుచున్నారు. వారి ఏనుగులయు నిడుమూలములయు తాపులు భీమముగా ప్రాసాదకుడ్యములను కంపింపజేయుచున్నవి. ప్రతితాపుతోపాటు హరిహరదేవరాజుకు జయఘోషయు మిన్నుముట్టుచున్నది. హరిహరదేవుడే యాపోటు నడిపించుచుండబోలును!

ఆ తాపులు ముఖ్యముగా ప్రాసాదమున నంతఃపుర ముందువైపున తీవ్రతరమైనవి. అక్కడనే హరిహరుని జయశబ్దములును అతిశయించినవి. అచ్చట ప్రసాదము గోడలు భగ్నమగుటకుముందు బీటలువారినవి. అంతలో నవి సడలిపోవ ప్రారంభించినవి. మహారాష్ట్రసైనికులు ఆసందులలోనుండి లోనికి రాసాగిరి.

కామసాని యది ముందుగనే నిరీక్షించినది. వెంటనే అది ప్రతాపరుద్రకుమారుని కుబ్జ కప్పగించి కొద్ది పరివారముతో నేలలో నున్న యొక సొరంగము మార్గమునుండ కోట దాటించు నేర్పాటు చేసినది. ఆ పని చేసినవెంటనే, అది యంతఃపురపరివారమును గూర్చుకొని, అప్పటికే అటువైపు వచ్చుచున్న మహారాష్ట్రసైనికుల నెదిరించెను.

కామసాని ఎనుబదేళ్ళ వృద్ధురాలు. వంగిపోయిన నడుమును ప్రయత్నపూర్వకముగా నది నిలువబెట్టుకొనుచున్నది. వడకుచున్న చేతుల నది దృఢము చేసికొనుచున్నది. ఎడమచేతితో డాలు పట్టినది, కుడిచేతితో ఖడ్గము ధరించినది. దాని వెంట నున్న పరివారములో కొద్దిమంది స్త్రీలు, మిగిలినవారు పేడులగు విదల్లులు! వారిని మహారాష్ట్ర సైనికులు 'జయ హరిహరదేవరాయ, జయ!' అనుచు భయంకరముగా దాకిరి.

ఆ జయనాదము చెవుల బడగానే రోషముతో కామసాని ఆపాదమస్తకము కంపించినది. దానికి ఆ వేశము ఆగలేదు. అట్లు జయనాదముచేయుచున్న మొదటివానిని అది ఖడ్గపు కొనతో పొడిచివేసెను; రెండవవాని తల తెగవేసెను. చిరకాలముగా దానికి ఖడ్గవిద్య యభ్యస్త మయినందున, బలహీనమై వడకుచున్న దాని చేతులలో చూడ నాఖడ్గము అప్రయత్నముగా బోలె విలాసముగా పరిభ్రమించుచున్నది. ఆ సమీపముననే నేల సొరంగ మున్నదని యెరిగినవారే యట్లు వచ్చుచున్నట్లు దానికి తోచినది. ఇందులో హరిహరుడే ఉండవచ్చును. కాని కవచాచ్ఛాదితులై శిరస్త్రాణములు ధరించినవారిని గుర్తించు టెట్లు?

అంతలో కామసానికి హరిహరుడే ఎదురయ్యెను. అతని ముఖము కనబడకున్న నేమి? అతనికి ఉనికి నడక దానికి చిరపరిచితమే! కామసాని క్రోధమూర్తియై 'ఓరీ పాపీ!,' యనుచు నాతనిపై విజృంభించెను.

కాని దానికి మనస్సులో నున్నశక్తి దేహములో లేదు. అప్పటికే అది తూలుచున్నది. కన్నులు మూసికొనిపోవుచున్నవి. చమురయిపోయిన దీపశిఖవలె నున్నది దాని స్థితి! స్వయముగా హరిహరరాయల నది ఎదుర్కొని పోరాడగలదా? అతని మొదటి వ్రేటుకు దాని ఖడ్గము దూరముగా పడిపోయినది; రెండవ వ్రేటు దాని హృదయములో దిగబడినది. ఆ యంతఃపురరక్షణకు ముందు ప్రాణమర్పించినది కామసాని! ఆ వృద్ధురాలి ప్రాణములు హరించుటయను మహావీరకార్యముతో హరిహరదేవుడు రాజమందిరములో నడుగు పెట్టెను!

అంతఃపురరక్షకులకును అతడు హరిహరు డని తెలిసిపోయినది. సొరంగమును సమీపించుటకే వారిట్లు కవియుచున్నారని వా రూహించిరి. మధ్యనింకను రెండు ద్వారము లడ్డమున్నవి. వా రా రెండును మూసి ముందుకువచ్చి వచ్చుచున్న వీరులతో తలపడిరి.

వారు స్త్రీలును పేడులునే గాని మహాభయంకరులు! అందును ఆ పేడులు జాలితెలియనివారు. ఐన నేమి? హరిహరునివెంట మహారాష్ట్రసేనలు క్షణక్షణము ఎక్కువైపోయి లోనికి జొరబారుచున్నవి. వారిని నిలువరించుట యచ్చటి రక్షకులకు సాధ్యమగుట లేదు!

ఆ క్రిందటిరాత్రియే అన్నమంత్రి ప్రాకారసంచారములో ఆవైపుగోడ బలహీనస్థితిలో నున్నదని నిర్ణక్షించి యుండెను. ఆ భాగము ఎప్పుడు విచ్చిపోయిన నాక్షణమే అటు కదులుటకు ఐదువందలమంది బ్రాహ్మణవీరులను ఆదేశించి సిద్ధముగా నుంచెను. వారిలోనొక వందమందికి గోవిందశర్మ నాయకుడు! ఆ

యువకవి యీ యుద్ధయులో మిగుల నేర్పు కనబరుచుచు, అన్నమంత్రి మెప్పు నడయుచుండెను.

అన్నమంత్రి పార్శ్వరక్షకు లగు ఇద్దరు బాలవీరులలో పెద్దవాడు గోవింద శర్మతో పరియాచకము లాడుచుండును.

"గోవిందశర్మా, మీ వాక్కు కవిత్వములో ప్రసరించెడుకంటె, మీ బాహువులు రణరంగములో నేర్పుగా ప్రసరింపగలవయ్యా !"

కాని యిప్పుడు పరిహాసమాడు సమయము కాదు. ఆ ఐదువందలమంది బ్రాహ్మణవీరుల కగ్రేసరుడై ఇప్పుడు స్వయముగా అన్నమంత్రీశ్వరుడే వచ్చినాడు! ఆ బ్రాహ్మణవీరుల రాకతో మహారాష్ట్రవీరుల విజృంభణము కొంచెము వెనుకపట్టినది.

హరిహరదేవుడు అన్నమంత్రిని, అన్నమంత్రి హరిహరదేవుని గుర్తించినట్లున్నారు! వా రుభయులును ఒకరితో నొకరు తలపడినారు! తేజశ్శాలు రగు వారు పోరుచుండ మిగిలినవారు మంత్రముగ్ధులవలె ఒకటి రెండు విమేషముల పాటు రిచ్చవడి నిశ్చేష్టులై వారి యుద్ధము చూచుచు కన్ను లప్పగించి నిలిచిరి.

వారు తలపడినదాది హరిహరుడు అన్నమంత్రిని జంపివేయుటకే ఉంకించుచుండెను. అన్నమంత్రి యాత్మరక్షణ చేసికొనుచు హరిహరునినిరాయుధుని జేయుటకే యత్నించుచుండెను. కాని ఎంత ప్రయత్నించినను అన్నమంత్రి కది సాధ్యము కాకుండెను. హరిహరుని విజృంభణమును ఎక్కువయినది. ఎన్నియోమారులు అన్నమంత్రి హృదయభాగము అరక్షితమై యున్నట్లు చూపరకు తోచుచుండెను.

ఈమారు స్పష్టముగా అన్న మంత్రీశ్వరుల విశాలవక్షఃస్థలము అనాచ్ఛాదితముగా నున్నది. మెరపు మెరసినట్లు బలమైన విసురుతో హరిహరుని ఖడ్గమావైపునకు వచ్చుచున్నది. అన్నమంత్రి హరిహరునిచేతిలో హతము కానున్నట్లున్నాడు. అదిచూడలేక బ్రాహ్మణవీరు లందరు హాహాకారము లొనర్చుచు కన్నులు మూసికొనిరి. ఏక కాలమున రెండుశబ్దములు దిక్కులను చీల్చియే వేసెను. ఆ రెండు శబ్దములును చీల్చు శబ్దములే !

హరిహరుని ఖడ్గము అన్నమంత్రిహృదయమును స్పృశించుటకు ముందుగనే ఆతని చర్మ వడ్డుతగిలినది. బలముతో విసరిన హరిహరుని వేటుకు అతని ఖడ్గము అన్నమంత్రి పలకలో దిగబడినది. అది యాతడు వెనుకకు లాగివేయు నవకాశము లోపలనే అన్నమంత్రి ఖడ్గము హరిహరదేవుని కంఠమును తెగనేసెను. హరిహరదేవుని శిరస్సు త్రెస్సి, పడిపోయియున్న కామసాని పాదముల ముందు పడి, రక్తధారలతో నభిషేక మొనర్చెను!

ఇది యంతయు ఒక రెప్పపాటుకాలములో జరిగిపోయినది. ఆ పైని రెండు బలములు తారసిల్లినవి. హరిహరుని పార్శ్వరక్షకు లిద్దరు అన్నమంత్రిపై కవిసిరి. ఇప్పుడన్నమంత్రి యలసినట్లున్నాడు. ఆ బడలిక యాతని శరీరమునుకంటె మనస్సు నావేశించిన ట్లున్నది. శ్రీ రుద్రదేవమహారాజుల యభిషేకమునకు పూర్వము, కాకతీయ సామ్రాజ్యమునకు చక్రవర్తి యగునని అందరు తలంచుచుండిన ఆ హరిహరదేవుడు,

త్రన చేతులతో నిట్లు తల తరుగబడి పడియుండుట చూడ, నెవరికి జంకు కలుగదు! ఆ జంకుతోపాటు అన్నమంత్రి కుత్సాహమును గలిగినది!

అన్నమంత్రి మనస్సులో నా క్షణమున గలిగిన యాందోళనతో హరిహరుని పార్శ్వరక్షకుల ఖడ్గములకు తన ప్రాణము లర్పించియుండెడివాడే! కాని యాతని పార్శ్వరక్షకు లగు బాలవీరు లిద్దరును వారిని నరకివేసి అన్నమంత్రి ప్రాణము లా క్షణమున గాపాడిరి.

అన్నమంత్రిమనస్సు మరుక్షణముననే కుదుటబడెను. ప్రాకారములోనికి జొరబారిన మహారాష్ట్రవీరులపైకి తన వెంటనున్న బ్రాహ్మణవీరులను పురికొల్పుచు నాతడు విజృంభించెను. ఆ బ్రాహ్మణవీరులును యుద్ధమునకు అపరిచితులైనను సుశిక్షితులవలెనే ప్రవర్తించుట అన్నమంత్రికే యాశ్చర్య మొదవించుచుండెను.

ఇది యిట్లు జరుగుచుండ నావల ఒక మందిరములో గౌరమ్మ తన యిద్దరు కోడండ్రతోడను మనుమరాలగు బాలతోడను ప్రసంగించుచున్నది. వారికి రాజప్రసాదములోనికి శత్రువీరులు ప్రవేశించినవార్త యింకను తెలియదు. ఆ గదిలోనికి ఆయుధపాణు లగు మహారాష్ట్రభటు లిరువురు ప్రవేశించిరి. అది చూచి యంతఃపురములోనికి పరపురుషులు ప్రవేశించి రను భావముతో, గౌరమ్మ వారిపై కోపముతో నిప్పులు కురియు దృష్టితో చూచుచు, 'ఎవడురా యది ?' యని యడిగెను. ఆమె ధీరగర్జన కా భటులిరువురు నులిక్కిపడి ఒక్క యడుగు వెనుకకు వేసిరి. వారు తెప్పరిలి ముందుకు సాగుచుండగా గోవిందశర్మ వారి నిద్దరను తనచేత నున్న శూలముతో గోడకు గ్రుచ్చివేసెను. ఆతని వెంటనున్న బ్రాహ్మణభటులు ఆ కళేబరముల నావలికి త్రోసివేసిరి. 'కవాటము బంధించి యప్రమత్తులుగా నుండు' డని యచ్చటివారిని నిర్దేశించి గోవిందశర్మ ఐదుగురు భటులను బయట కాపుంచి వెడలిపోయెను.

అంతఃపురము వైపున విచ్చిన ప్రాకారకుడ్యముగుండ ప్రవేశించిన మహారాష్ట్రులతో, ఆ బ్రాహ్మణవీరులు మధ్యాహ్నమువరకు పోరెనపిమ్మట, నంతవరకు లోనికి ప్రవేశించినవారి నందరి వారు వధించి యామార్గము నిరోధింపగలిగినారు.

కాని ప్రాణము లేని రాతిగోడ చేయవలసిన నిరోధము, ప్రాణులగు మనుష్యులతో పెట్టిన గోడ ఎంతసేపు చేయగలదు? అక్కడ సందు కలిగినదని తెలియగనే, మహారాష్ట్రసేనాప్రవాహ మా వైపునకే మరలినది. వెంటనే అన్నమంత్రియు శూలధారులగు నారువేలమంది బ్రాహ్మణవీరులను అంతఃపురరక్షణకై యక్కడ జీవత్కుడ్యముగా జేసి కాపుగా నుండ నియోగించెను.

మూడు జాము లైనది! ఏమి కారణమో గాని, చిత్రముగా, మహారాష్ట్రసేనల యౌద్ధత్యము తగ్గిపోయినది. అది చూడ నగరనాయకులకే యాశ్చర్యమైనది. నగరరక్షణమునకై ఈ నాడెంతో బ్రాహ్మణరక్తము చిందినది. ఆ రక్త బిందువులనుండి శత్రుబాధకములగు నమానుషశక్తు లేవైన నుద్భవించి మహారాష్ట్ర

సేనల నావల మార్గ్గనుమన్నవా? ముందున్న సేనలు ముందున్నవి; కాని వెనుకనుండి మహారాష్ట్రసేనలు ముందుకు వచ్చుటలేదు!

సాయంకాల మగుచున్నది! ఆ రాత్రి రాజప్రాసాదమును శత్రువుల యొత్తిడినుండి రక్షించుట దుస్తరమని నగరనాయకులు నిశ్చయించిరి. ఎవరెవరని ఏ యే రహస్యమార్గముల సురక్షితప్రదేశములకు చేరవేయుటో, ఎవ రెవరు తుదివరకు నిలిచి పోరాడుటో నిశ్చయమైనది. శ్రీ ఏమహారాజులు ఎంత చెప్పినను వినక, తన నగరనాయకులతోపాటు చివరవరకు పోరాడువారిలో నుండుటకే నిశ్చయించిరి. వారు ఆత్మరక్షణకై పారిపోవుట కిచ్చగింపలేదు. అపాయ మెక్కువగుచున్నకొలదియు వారి వీరోత్సాహమును ఎక్కువగుచున్నది!

సాయంకాల మయినది. మహారాష్ట్రసేనలు వెనుకకే తగ్గుచున్నవి! ఏమి యీ మాయ? కనుకట్టుగా నున్నదే!

రాత్రి జాముప్రొద్దు పోయినది! మహారాష్ట్రసేనలు శిలాప్రాకారము వెనుకకు పోయినవి. రాజప్రాసాదమునకును శిలాప్రాకారమునకును నడుమ నొక్క యాదవవీరుడును లేడు! ఏమిది!

అర్ధరాత్ర మైనది! మహారాష్ట్రసేనలు పుట్టకోట బయటికి చేరినవి. ఏమి యీ యద్భుతము! కోటలోని వారిని ప్రలోభపెట్టి బయటకు రానిచ్చి ఒక్కసారి విజృంభించుటకు ఎత్తిన పన్నుగడయా?

తెల్లవారనగి. మహారాష్ట్రసేనలు తమ స్కంధావారము నంతయు నెత్తి వేసి పలాయనోన్ముఖముగా నున్నవి!

ఏమిది? తెల్లవారువరకును కోటలోనివారికి కారణము తెలియదు. రెండు మూడు దినములనుండి బయటనుండి యే వార్తయు రాకుండ శత్రువులు నిరోధించి యుండిరి. తమ్ము ముట్టడించిన సేనలు నిష్కారణముగా నింత యాకస్మికముగా వెనుదీయుచుండుట, కోటలోనివారికి మోసమనియే తోచెను. ఆ యూహతో రాజ ప్రాసాదము నెవ్వరును విడిచి పోరా దని మహారాజు లాజ్ఞాపించిరి. గూఢ చారులు మాత్రము రహస్యమార్గముల నిజమారయ బయలు వెడలిరి.

తెల్లవారునప్పటికి చారులు నిజవార్త తెచ్చిరి! "మనము రక్షింప బడితిమి!"

ఆ మాటలు రాజప్రాసాదమున నల్దెసల ప్రతిధ్వనించెను. పాలిపోయిన వారల ముఖములలో నెత్తురు చిమ్మినది! "రక్షింపబడితిమి! రక్షింపబడితిమి!"

ఎట్లు?

ఆవల తిక్కచమూపతియు గోనగన్నారెడ్డియు తమ యాశ్వికబలములతో రెండువైపులనుండి మహారాష్ట్ర సైనికస్కంధావారమును తాకి చెండాడు చున్నారు. రాత్రియంతయు భయంకరముగా యుద్ధము సాగినది. తెల్లవారు

నప్పటికి వారి పదాతిబలములు కలసికొనగలవు! అంబదేవుడును కొంతిసేనను పంపినాడు. అదియును సమీపించినది!

ఆనాటి సూర్యోదయముతోపాటు ఏకశిలానగరమున ధైర్యసూర్యోదయ మయ్యెను. వార్తలు ధ్రువపడినవి. ఆ వెంటనే శూలధారు లగు నాయవేల బ్రాహ్మణయోధుల కగ్రేసరుడై అన్నమంత్రి నగరద్వారములు వెలువడి మహారాష్ట్రసేనలను తాకెను. మహాబలముతో రుద్రదుయ నాతనివెంట తోడుగా సాగినది.

వారుభయులకును వీరశైవబలము అండగా మహోత్సాహముతో బయలు దేరినది!

## ౫౨

దొడ్డిలో కాకి మరల మరల అరచుచున్నది! ఈమధ్య చెలరేగిన గాలివానతోడను మహాయుద్ధముతోడను ఏకశిలానగరములోని వెలిపాలెము ముఖ్యముగా ఎక్కువ దెబ్బతిన్నది. బొల్లని ఇంటి కప్పుకు వేసిన ఆకు లన్నియు లేచిపోయినవి. నిరాటంకముగా ఇప్పుడు సూర్యభగవాను డందులోనుండి ఇంటిలోనికి ఉదయము మొదలు సాయంకాలమువరకు ప్రవేశించి రాకపోకలు సలుపుచున్నాడు. ఆ మధ్య కాకుల సంచారము కూడ కట్టువడినది. ఈనాడు ఆ కాకి మరల మరల తన దొడ్డిలో అరచు చుండుటచే, మంగికి నిస్పృహలో ఒక ఆశాలేశము అంకురించినది.

"ఎవరు వస్తారు, కాకమ్మా ?"

ఆ మాటలు విని ఉత్సాహముతో పాటి అందుకొన్నది. తెలుగుగడ్డపై తెలుగు పుట్టినప్పటినుండి ఉన్న పాట ప్రారంభించినది :

"కాకమ్మ, కాకమ్మ, కరారు కాకమ్మ!
చుట్టా లొస్తే చూచి పో,
పక్కా లొస్తే పారి పో,
నీ కాలికి గజ్జె కట్టిస్తా,
నీ కూతురుకు వెన్న పెట్టిస్తా,
మా యయ్య వస్తే కాలెత్తి
గంతెయ్యి,—ఒక్కటే గంతూ !"

ఆ కాకియు చిత్రముగా ఒక్కటే గంతు వేసినది. పాటిముఖము నవ్వుతో వికసించినది. మంగి తనకు కడుపులో పొంగుకొని వచ్చుచున్న దుఃఖము ఎట్లో పైకి కనబడ నీయకుండ ఆపుకొనుచు, 'మీయయ్య వస్తాడులేవమ్మా!' అన్నది.

పాటి ఊహలు దూరముగా అల్లుకొనిపోయినవి,

"మా యయ్య నా కేమి తెస్తా డమ్మా ?"

మంగికి కన్నులలోనుండి నీరు ఉబుకుకొని వచ్చుచున్నది. పాటికి అర్థము కాలేదు.

"అయ్య వస్తుంటే అట్లా ఏడుస్తా వేమే ?"

కాకిగంతుమీద పాటి కున్న నమ్మకము తల్లి కేది? వాకిటిలో బరువైన అడుగుల చప్పు డైనది. "అయ్య వచ్చాడు !" అనుచు చెంగున పాటి వాకిటిలోనికి పరుగెత్తినది. దాని వెంటనే మంగికూడ నెమ్మదిగా నడచినది.

వాకిటిలోనికి వెళ్ళగానే పాటికి ఉత్సాహభంగ మైనది ! సంపూర్ణముగా కవచములు ఆచ్ఛాదించిన దేహములు గల ఇద్దరు యోధవీరులు దానికి కనబడినారు. వారిద్దరును ముఖపిధానము చేయు పట్టములు పైకెత్తి చిరునవ్వుతో దానివైపు చూచుచుండిరి. తన తండ్రి కానందుకు బిక్కమొగము వేసికొని పాటి చప్పున ఆగి, ఎగాదిగ వారి వంక చూడసాగినది. దానికి ఉత్సాహభంగమై ఏడుపు కూడ వచ్చుచున్నది. ఆవచ్చిన యోధు లిద్దరు పక్కున నవ్వి, స్వతంత్రముగా, ముందుకు వచ్చినారు. అందులో ఒకడు ఆదరముతో పాటిని తన చేతులతో నెత్తికొన్నాడు. పాటి వెగటుతో ముఖ మావలకు త్రిప్పి తప్పించుకొనవలె నని ప్రయత్నించుచున్నది.

ఈ మారు చిరునవ్వు నవ్వినది మంగి ! దాని కన్నీ రంతయు నది తుడిచికొని సంతోషమే రూపొందిన ట్లైనది.

"ఏమే? అయ్యను మామయ్యను పోల్చుకో లేదుటే ?"

"ఎవరు ?—అయ్య ?— మామయ్య ?—"

పాటి నెత్తుకొనిన వీరుడు దానిని దింపి శిరస్త్రాణము పూర్తిగా తీసివేసి పాటికి తన ముఖమును చూపినాడు. అది వెంటనే 'అయ్యా !' అనుచు వానిని కౌగిలించుకొనినది.

మంగి లోనికి వెళ్ళి ఇద్దరకు కాళ్ళకు నీళ్ళు తెచ్చినది.

కొంచెముగా సంభాషణ జరిగినతర్వాత బొల్లనికి ముందు ఆశ్చర్యమై భాగ్యను ప్రశ్నించినది ఆ యింటినిగూర్చి !

"నేను పంపిన బంగారము నీకు చేరలేదా ?— దానితో పెద్ద భవనమే నీవు కట్టించి యుండవచ్చునే !"

మంగికి ఆశ్చర్యమైనది !

"నీవు బంగారము పంపినావా ?— పాపము మహానుభావుడైన ఒక ఫకీరు నాపై జాలి పొంది చారెడు బంగార మిచ్చినాడు. తర్వాత లెక్కపెట్టగా ఏబది మాడలున్నవి. అవి జాగ్రత్తగా ఇంతవరకు వాడుకొనుచున్నాను. ఇంకా ముప్పది మిగిలి ఉన్నవి !— ఇవుగో !" అని మంగి లోపలికి వెళ్ళి తెచ్చి బొల్లనికి చూపినది !

అది చూచుచునే బొల్లడు మండిపోయెను. మంగి ఉలికి పడెను. పాటి ఏడుపే సాగించెను.

"వాడు మహానుభావుడా ? దొంగ !— ఏబది మాడలు నీకు ముష్టి పెట్టినాడా?"

మంగికిని ఆశ్చర్యమై బొల్లనివంక చూడసాగినది.

"నేను వేయి మాడలు పంపినాను!—"

అతనితో వచ్చిన గండడు చిరునవ్వు నవ్వుచు, "పోనీ, పాపిష్ఠి ధనమతీరే అంత!" అనుచు బొల్లని ఓదార్చెను.

"ఆ దొంగ ఇప్పు డెక్కడ ఉన్నాడు? మరల కనబడినాడా?"

మంగి మౌనము వహించెను. స్వయంభూదేవాలయసమీపమున జరిగిన శాస్త్రి సంగతి అది చెప్ప సాహసింపలేదు. అంతలో అది బొల్లని ప్రక్కనున్న గండనివంక తిరిగి "గండా, ఎన్నాళ్ళకు కనిపించినావు! కాళ్ళు కడిగికొనలే దేమి?" అని అడిగినది.

"నే నింకా ఇంటికి చేరలేదు. నీ రాజును నీకు అప్పగించిపోదామని వచ్చినాను. ఇదుగో! — మరచిపోకు, బొల్లా! మధ్యాహ్న వేళకు సరిగా మనము మేచయనాయకుల దర్శనము చేయవలె! — పాటీ, మీ అయ్య నీకే మేమి తెచ్చినాడో అడుగు! పెద్ద సాహుకా రయినాడులే, వారిని వారిని దోచి గుంటూరులో!"

ఇట్లనుచు గండడు తన ఇంటికి చేరికొనెను.

* * *

ఏకశిలానగర మంతయు నిప్పుడు రుద్రభూమివలెనే ఉన్నది. ముందు వచ్చిన భయంకరమైన గాలివాన! దానిధాటిని సరిచేసికొనకముందే మీదబడిన మరాటీల దండు! ఎప్పటి కప్పుడు ఉభయ సేనలను చనిపోయినవారి దేహములకు సంస్కారములు చేసివేయుచుండెను. కాని యింకను కళేబరములు మూలమూలల మిగిలిపోయినవి. ఏపొదచాటుననో, ఏపాడుపడిన యింటిలోనో ఒకటిఉండును. గాయపడిన వీరుడు ఆత్మరక్షణకో, దాహము దీర్చుకొనుటకో, క్షుధానివారణకో, చికిత్సకొరకో, ప్రాకులాడి ఎక్కడనో ప్రాణములు వదలియుండును. ఎక్కడ నున్న నేమి? ఆ ప్రాణి జీవించియుండగా కన్నులున్న యాతని యాప్తులకును కనబడియుండక పోవచ్చును; ఇప్పుడు ప్రాణము వదలిన పిమ్మట ఆదేహమునుండి వచ్చు దుర్గంధము మాత్రము శత్రుమిత్రు లను విచక్షణలేకుండ, అందరకు దుర్భరమై దాని యునికి గుర్తుకు తెచ్చును! అది చూచువారికి శ్మశానవైరాగ్య మంకురించుటలో విశేషములేదు.

అందరు మనుష్యులొక్కసారి బలవన్మరణము పొందుట కాకులకు, గ్రద్దలకు, రాబందులకు, నక్కలకు, కుక్కలకు, పెద్దపండుగ! అవి ప్రాణము లేనివార కళేబరములనే కాక, సజీవులై వానిని నివారింపలేని స్థితిలో నున్నవారిని గూడ, పొడుచుటకును కరచుటకును • వెనుకాడకున్నవి. అభ్యాసవశమునుచేత వాని కొక వింత ధైర్యమును వచ్చినది. ఒంటరిగా నిద్రించుచున్నవారిని గూడ నవి ఇప్పుడు బాధింపసాగినవి. ఇన్ని కాకులు, గ్రద్దలు, రాబందులు, నక్కలు, కుక్కలు, ఎక్కడినుండి వచ్చినవో!

ఈ శవము లన్నియు తొలగింపవలెను. పడిపోయిన యిండ్లుబాగుచేయవలెను. కూలిన వాపీకూపములు పునర్నిర్మింపవలెను. గండ్లు తెగిన కాలువలు సరిపరచవలెను. అపరిశుభ్రమైన తావులు శుభ్రము చేయవలెను. చెడిపోయిన రాజమార్గములు బాగుచేయింపవలెను. శిథిలమైన నగరకుడ్యములు పరిష్కరింపవలెను. ఇవన్నియు

నగరరక్షణలో నెట్టి ప్రాల్మాలికయు లేకుండ, సాగింపవలసి యున్నది. మారుమూలల దాగియున్న యంతశ్శత్రువులను బహిశ్శత్రువులను గాలించి తగిన శిక్షలు విధింపవలెను. ఈ కార్యక్రమమంతటికి మేచయనాయకుడు పూనుకొనెను. అతని కండులో నాగయ్యనాయకుడు మిక్కిలి సహాయపడుచు తోడుగా నుండెను. అంబదేవుడు పంపిన సైన్య మిప్పుడు నగరరక్షణకు నియమింపబడినది.

పూర్వనిర్దిష్టవిధమున నామధ్యాహ్నమే గండడు బొల్లని తీసికొని మేచయనాయకుల దర్శించెను. వా రిద్దరు దళపతుల వేషములతో వచ్చుట నాయకునకు ముందాశ్చర్యమై తలయెత్తి సందేహముతో వారివంక నాతడు చూచెను. వెంటనే గండడు అంబదేవుడు పంపిన పత్రములు మేచయకు సమర్పించెను. అవి చదువుచున్నకొలదియు మేచయ యాశ్చర్యము వ్యక్తము చేయుచుండెను. "బొల్లడు చేసిన యకృత్యములు స్వల్పములు. ఐనను అతడు పశ్చాత్తప్తుడై, రాజద్రోహులను పట్టించుటలో ఈమధ్య చూపిన నమ్మకముచే, నాతని దోషములు క్షమింపదగినవి. అతని సత్ప్రవర్తనకు గండడే పూటగా నుండునట్లు చేసి, గండనికి ఆతడు సహాయుడుగా నుండునట్లు చేయవచ్చును!"

అంబదేవు నంతవాని సూచనపత్రమే యైనను, అది మేచయకు శిరోధార్యము!

"బొల్లా, నీ కీ నగరములో పని చాల పడును. ముందా యోగివేషధారి యగు యవనుని మాకు పట్టింపవలెను!"

"ప్రభూ, చిత్తము! నాకును అందుకే మనస్సు ముందు తొందరపడుచున్నది. ఆపిమ్మట నాగాచారిని పట్టుకొనవలెను!"

"బొల్లా, నీ వనుక్షణము జాగరూకుడవై యుండవలెనుమా! ఆ వెలిపాలెములో నీ కాపురము మాకు సమ్మతముకాదు!—గండా నీకును!"

వా రిద్దరకును శిలాప్రాకారములోపల ఒకదాని సరసను ఒకయిల్లు నిర్దేశించి, వారి నందుండ మేచయ నియమించెను. ఆ సాయంత్రమునకే వా రిద్దరును తమ కుటుంబములతో నూతననివేశములలో ప్రవేశించిరి. ఆ రాత్రియే బొల్లని కదృష్టము పండినది!

బొల్ల డా రాత్రి బిచ్చగానివేషముతో నగరసంచార మొనర్చుచుండెను. అతడు సంచరించుచున్నదియు నగరమంతటిలో వింతలై యసహ్యాకరమైన ప్రదేశములు. ఇంత మహాద్భుతమగు నగరములో గూడ నింత నికృష్టమైన ప్రదేశము లుండునా యని చూచిన క్రొత్తవారి కనిపించును శిధిలమైన భవనములు, కూలిపోవుచున్న కుడ్యములు, పొదలు పుట్టలు పెరిగి క్రూరజీవుల కునికిపట్లగు జీర్ణోద్యానములు, పాడువడిన బావులు! ఇవి యన్నియు గూడ ఆంధ్రరాజుల రాజధానీనగరములోనివేనా? గబ్బిలముల కంపు, నక్కల కూతలు, అంతకంటె భయంకరమగు మనుష్యుల గుసగుసలు. ఆ ప్రదేశములో ముష్టివాని కేమి ముష్టి లభించును? ఎక్కడనైనను దొంగలు ఘాతుకులు నక్కియుండవచ్చును. కాని బిచ్చగాండ్లకు పోరాని ప్రదేశమేమి?

బొల్లడిప్పు డొక యాపానభూమిని సమీపించెను. అచ్చటినుండి వినవచ్చుచున్న కేకలు పాటలు తిట్లు దీవనలు ఆతని నాకర్షించినవి. అక్కడ త్రావినవారికి

యథాధికారముగా కులార్ణవతంత్రోక్తము లగు సప్తభూమికలలో నొకానొకటి ప్రాప్తించినది. తత్వవేదులగువారు మద్యమునే గలుగు నుల్లాసమును ఏడువిధములుగా వర్ణించినారు. ఆరంభము, తరుణము, యౌవనము, ప్రౌఢము, ప్రౌఢాంతము, ఉన్మనము, అనవస్థము అని యీ యుల్లాసములు వరుసగా సప్తభూమికలు. వానిలో ప్రౌఢోల్లాసమును వర్ణించుచు నా తంత్రము,

"పీత్వా పీత్వా పునఃపీత్వా యావత్పతతి భూతలే
ఉత్థాయ చ పునః పీత్వా పునర్జన్మ న విద్యతే॥
య త్సుఖం కులనిష్ఠానాం నికులద్రవ్య నషేవణాత్
తత్సౌఖ్య మేవ మోక్షం స్యాత్ సత్య మేవ న సంశయః॥"

అని వర్ణించినది. ఆ తంత్రములో చెప్పిన మోక్షమున కర్హులగువారు పలువురా యాపానగోష్ఠిలో నున్నారు.

అట్లు మోక్షస్థాయి నందుకోలేక ఆరంభ తరుణ యౌవనభూమికలలో నున్నవారు ద్యూత మాడుచుండిరి. వారిలో నారంభభూమికలో నున్నవాడొకడు చప్పున ప్రక్కవాని చేయి పట్టుకొని వాడు చేసిన మోసము బయలుపెట్టెను. వెంటనే ఆ సాయంత్రమునుండి అతనితో నాడి ధనము కోల్పోయినవా రందరు నామోసగానిపై బడిరి. అతడు ఎంత పారిపోవ ప్రయత్నించినను, మిగిలిన త్రాగుబోతులు పోనీయక వానిని పొదివి పట్టుకొనిరి. తలవరులను పిలువగా సమీపములో నున్నవారు ఇరువురు వచ్చిరి.

మరుక్షణమున నక్కడ కితవధర్మాసనము ఏర్పడెను. ఆ ధర్మాసనము ప్రభుస్థాపితము కాదు. అక్కడి కితవులే అందులో పెద్దలు. వారే ధర్మము విచారించి శిక్షవిధింతురు. అది తలవరులు విధిగా నిర్వర్తింపవలసినదే! అట్లే జారులలో తగవులు ప్రాప్తించిన జారధర్మాసనము తీర్చును. కితవధర్మాసనములు జారధర్మాసనములు తీర్చుట ఆ చాటుగొందులలో సర్వసామాన్యము!

అట్లు ముందు చేయి పట్టుకొనినవాడు రెండవ కితవుడు చేసిన మోసము వర్ణించెను. అక్షముఖము ముందు తన కనుకూలముగా స్పష్టముగా కనిపించినది. అంతలో నా మోసగాని హస్త మావైపు ప్రసరించినది. అంతే అక్షముఖము మారిపోయినది! వెంటనే అతని చేయిపట్టుకొనినాడు.

దానికి నిందితుడైన కితవుడు అతడు చెప్పిన దంతయు నబద్ధమని వాదించెను. ఆ నిందితుడు విశేషవర్తకునివలె నున్నాడు. అతడు విలువగల వస్త్రములు నాభరణములు ధరించి యుండెను. అతని వాక్కు కూడ సౌమ్యమై, నిరపరాధయనియే అందరికి అనిపించుచుండెను. పాప మేదో పొరపాటు జరిగియుండవలెను. కాక మొదటివాడే మోసగాడో!

కాని అత డానాడు ధన మోడుచుకొన్నవా రందరును అట్లే సాక్షమిచ్చిరి. అందరును అతని హస్తచాలనము గమనించినవారే, కాని కేవలము అక్షము స్పృశించి నట్లు చెప్పగలవా రెవరును లేరు. మొత్తముమీద నతనికి హస్తలాఘవవిద్య తెలిసియో

అభ్యస్తమని వారు నిర్ణయించిరి. మరి కానున్న సరిగా నావేళకే హస్తఘాలన మస్లేల జరుగవలెను ?

గోవిందశర్మ యీదారిన పోవుచు ఇక్కడ నీధర్మాసనము తీరినారేమని ప్రశ్నించెను. ధర్మాసనము తీరిన పెద్దలు విషయము నివేదించి గోవిందశర్మను ఏమిచేయుట సమంజసమని యర్థించిరి. గోవిందశర్మ వెంటనే బదులు చెప్పెను.

"ఇందరు అక్షువిదులు కూడినారు. దీనికి పాణ్మాసచింత ఏలనండీ! ద్యూతములో హస్తలాఘవము ప్రదర్శించినవారికి కరచ్ఛేదనము !"

వెంటనే ధర్మాసనము కూడిన పెద్దలు గోవిందశర్మ యుపదేశ మంగీకరించి తీర్పు చెప్పిరి. హస్తచ్ఛేదము!" తలవరులు ఆ వర్తకుని పట్టుకొనబోవుచుండగా నాతడు కుప్పించి పారిపోవుచుండెను. సరిగా నప్పుడే బొల్లడెదురై యాతని దృఢముగా బంధించి "ఇతడు దొంగ! నా తొమ్మిదివందల యేబది మాడలు హరించెను." అనెను. భిక్షుకుడా మాట లనుచుండుటచే నందరికి నవ్వు వచ్చినది!

అంతలో చుట్టుపట్టులనుండి అపూర్వమైన భాషలో ఏదో మాట్లాడుచు, నా బంధితుని తప్పించుటకు పాతికమంది మనుష్యులు అక్కడివారిపై కలబడిరి. వెంటనే గండని పరివారము యల్లరిమూకను మాయాకితవునితోపాటు బంధించి మేచయనాయకున కప్పగించెను. గండడు పరివారముతో బొల్లని ననుసరించుచునే యుండెను.

ఈవిధముగా మేచయ కన్నులు కప్పి ఎప్పటికప్పుడు మారువేషము ధరించి తప్పించుకొనుచున్న అజ్ఞాతయోగి బొల్లని జాగరూకతచే నీనాడు వశమయ్యెను.

* * * *

బొల్లనియు, గండనియు నదృష్ట మంతటితో నాగిలేదు. వారానాడు అర్ధరాత్రమువరకు నగరసంచార మొనర్చి జైనవసది చేరి, పాడుపడియున్నదానిలో నొకగదియందు శయనించిరి. అదియే పూర్వము జైనసిద్ధు డున్నగది! వారు నిదురనటించుచుండిరేకాని నిదురపోవుట లేదు. అంతలో నాగదిగోడ యొకటి కదలెను. అందుండి యొక వ్యక్తి గదిలోనికి నెమ్మదిగా నడుగులిడుచు, దారి కానక తన చేతిలో నున్న కత్తి క్రింద పెట్టి, వెలుగు చేయుటకై చెకుముకిరాయి కొట్టుచుండెను. అప్పటికే జాగరూకులై యున్న గండడు, బొల్లడు చివ్వున లేచిరి. గండడు క్రిందపెట్టియున్న కత్తి పట్టుకొనెను. బొల్లడు అవ్యక్తినే పట్టుకొనెను. వెలుగు చేసి పరీక్షింపగా నాతడు నాగాచారి! అతనియొద్ద ప్రభువుల ముద్ర లెన్నియో లభించెను.

తిక్కచమూపతియు, గోనగన్నారెడ్డియు మహాసైన్యములతో కదలిపోయి, యటువైపులనుండి శత్రుసైన్యములు వచ్చుట లేదని తెలిపినప్పటినుండియు, మేచయ కెవరో అబద్ధవార్తలు నమ్మకమైనవిధమున బంపుచున్నారని యనుమానము కలిగెను. దేవగిరివైపునుండి యెట్టి యలజడియు లేదని వార్తపై వార్తవచ్చుటయు, అటునుండియే మహాసేన దండెత్తివచ్చుటతో, నాతని సందేహము ధ్రువపడెను. నవరాత్రమలనాటి సమ్మెలో పాల్గొని యుద్యోగములు పోగొట్టుకొనిన కరణము లేదానికి కారకులై యుండవచ్చుననియు, నాతనికి దోచినది. జైనవసదిని పట్టుకొనినప్పుడందు

దొరకిన పత్రములు పరీక్షించినకొలదియు నాతని కా యూహ నిజమని నిశ్చయమైనది.

అన్నిటికి మూలకారకుడు నాగాచారి ! అతడు కనబడుటలేదు. కాని యాతడు నగరము వదలలేదు. అతనికై నగరమెల్లెడ గాలించుచున్నను కనబడుచుండలేదు. ఈనాడు మేచయ వసదికి మరల కొన్ని పత్రములు చేర్చినట్లు నటన చేసెను. అక్కడ నెట్టి రక్షకభటులను కాపుండ నట్లే చేసి, గండని బొల్లని నర్ధరాత్రమున కచ్చటికి పంపెను. మేచయ యత్నము ఫలించినది !

* * * * *

శ్రీరుద్రదేవమహారాజులు మహారాష్ట్రసేనలను తరుముకొనుచు పురనిర్గమనము చేసిన యైదుదినములలో ఏకశిలానగరము యథాస్థితికి వచ్చినది. పదునైదు దినములు ఆ పట్టణము నిరోధింపబడినది. అందులో కొన్నిదినములు మహారాష్ట్రసేనలు నగరమధ్యముననే ఉండెను. ఆంధ్రసేనలకు మహారాష్ట్రసేనలకు మహాయుద్ధము సాగినది. కాని యందులో నొక విశేషము ! ఏకశిలానగరమున గల యన్ని దేవాయతనములందును నిత్యపూజలకు ఒక్కనాడుకూడ విఘ్నము కలుగలేదు. రాచనగరు నంటియున్న కేశవస్వయంభూదేవాలయములందుగూడ నంతే ! వాని ప్రాకారమునకు, రాజప్రాసాదము ప్రాకారమునకు మధ్య ఒక పెద్ద రాజవీథియే అడ్డమున్నది. ఆ విశాలరాజవీథియం దంతట యుద్ధము భయంకరముగనే సాగుచున్నది. మహారాష్ట్రప్రభు వగు మహాదేవరాజు కేశవ శ్రీ స్వయంభూనికేతనములలోనికి తనవెంట వచ్చిన ఋత్విక్కులను పంపి పరీక్ష చేయించి యచ్చట భటు లెవ్వరును లేరని నిశ్చయించి, యాపైని ద్వారములయొద్ద మాత్రము భటుల గాపువెట్టెను. మహారాష్ట్రప్రభువే ఆ యాలయములలో తన గోత్రనామములతో పూజలు చేయింప ఋత్విక్కుల నియోగించెను. అతని సామంత దండనాథులుగూడ పూజలు చేయించిరి.

అట్లే అన్నమేశ్వరుని యాలయమునకుగూడ నించుకంతయు ఆటంకము కలుగలేదు. పైగా యథావాక్కుల అన్నమయ్య మహాత్త్వము మహారాష్ట్రసైనికులలో కథలుగా ప్రాకినది. అందుచే వారు భయభక్తులతో నాతనికి నమస్కరించి, తాము విన్న యాతని మహత్త్వము ఒకరితో నొకరు చెప్పుకొనుచు వేనోళ్ళ పొగడుచుండిరి. ప్రత్యేకముగా నప్పు డన్నమయ్యకు సర్వేశ్వరశతకమునుండి యీ పద్యము తరచుగా నోట నావృత్తి యగుచుండెను.

"కులశైలంబులు పాదు పెల్లగిలి దిక్కూలంబునం గూలినం
జలధుల్ మేరల నాక్రమించి సముదంచద్భంగి నుప్పొంగినన్
జలజాత ప్రియశీతభానులు యథాసంచారము ల్దప్పినం
దలఁకం డుబ్బఁడు చొప్పుఁదప్పఁడు భవద్భక్తుండు సర్వేశ్వరా!"

అన్నమయ్య యుండు ప్రదేశమునకు మిక్కిలి సమీపముననే సిద్ధనంద్యాచార్యులను భటులు చేర్చిరి. జైనవసదిలో జరిగిన దుర్ణయమున కా మహానుభావున కెట్టి సంబంధము నుండదని రాజపురుషుల కందరకు తెలియును. పైగా నాతడు నోటిలో

గుడ్డలు కుక్కబడి యవశిష్టప్రాణమాత్రుడై యున్న స్థితి చూచినవారికి, వసది వ్యవహర్తల యాగడ మాతడు ప్రతిఘటించి యుండు ననిగూడ స్పష్టపడినది. రాజపురుషు లాతని గౌరవముతో నాదరముతో రాజభవనమునకు చేర్చి సమస్తోపచారములు చేయుచుండిరి.

రాజమందిరము చేరినప్పటినుండియు నాతనిలో నొకమార్పు ద్యోతమయ్యెను! వసదిలో నకృత్యము లెన్నియో ఆతడు చూచెను. వసది వ్యవహర్తలు ద్రోహియగు వీరభద్రేశ్వరునే జైనసిద్ధవేషముతో వసదిలో దాచి, పైపెచ్చు తిరుణాల సాగించిరి. మరియు నచ్చటివారి యకృత్యము లెన్నియో ఆతడు కన్నులార చూచియుండెను. అందుచేతనే ఆ మార్పు వచ్చినదో, మరి పూర్వకర్మానుగుణముగా కలిగినదో, కాక తరచుగా యథావాక్కుల అన్నమయ్యను ప్రత్యక్షముగా చూచుచుండుటచే నేర్పడినదో—కారణ మేమైనను, ఒక మార్పు సిద్ధనంద్యాచార్యులలో వచ్చినది. ఆతని హృదయమున నేదో యొక శూన్యభావ మావేశించినది. ఆతడు బహుకాలముగా శ్రద్ధాభక్తులతో జినధర్మ మనుష్ఠించియుండెను.

"దగ్ధే బీజే యథాత్యంతం ప్రాదుర్భవతి నాంకురః
కర్మబీజే తథా దగ్ధే న రోహతి భవాంకురః

కర్తాస్తి కశ్చిత్ జగతః సచైకః ససర్వగః స స్వవశః స నిత్యః
ఇమాః కుహేవాకవిడంబనాః స్యుః తేసాం న యేషా మనుశాసక స్త్వమ్"

"కర్మబీజము దగ్ధమైనవారికి భవాంకుర ముండదు. అంతే కాని జగత్తుకు నిత్యుడగు పరమాత్మ యొక డున్నాడనుకొనుట కుబుద్ధికృతము!"— ఇత్యాది విధముగా నాతడు విశ్వసించి యనుష్ఠించియుండెను. కాని యీనాడు సిద్ధనంద్యాచార్యులకు హృదయములో నావేశించిన శూన్యభావము దుర్భర మైనది. దేవతా ప్రతిష్ఠలేని శూన్యాలయమువలెనే యాతనికి తన హృదయము తోచినది. ఎదుట శివార్చనాపరుడై ఆనంద తేజస్సుతో కలకలలాడుచున్న అన్నమయ్య రూపము ఆతనిని ఆకర్షించినది. వెంటనే సిద్ధనంది బయలుదేరినాడు!

ఆతడు దిగంబరుడు! దారిలో చీమలు మొదలగువానికి బాధ కలుగనీయకుండ తన చేతిలోని కుంచె యాడించుచునే ముందు కాతడు సాగెను. ఉచ్ఛ్వాస నిశ్వాసములలో గానిలోసి జీవులకు బాధ కలిగింపకుండుటకు ముఖమునకు పిధానవస్త్రము తగిలించికొనియే ఆతడు బయలుదేరెను. భుజమున వడపోతగుడ్డయు గలదు. పోయి యాతడు అన్నమేశ్వరుని యాలయముముందు నిలిచెను. అన్నమయ్య పూజ యాపి తన్ను సాక్షత్తుగా శివుడే వెనుకకు పిలిచినట్లు వచ్చెను. ఆవేశముతో నాత డిట్లు సిద్ధనందిరూపు డగు సర్వేశ్వరుని సంబోధించెను.

"అమరంగా గురుమంత్రకార్ముకమునం దాత్మాస్త్ర మష్టాంగయో
గమహాముష్టివివేకి యేయుటయుఁ, దత్కాండం బజాండాదిత
త్త్వము లెల్లన్వడి గ్రుచ్చి పాటిభవదుద్యత్సూక్ష్మకైవల్యల
క్ష్యమునం దద్భుతశక్తితోడ గమియింగా నాటు, సర్వేశ్వరా!"

అష్టాంగయోగసాధనలో నిష్ణాతు డగు సిద్ధనంద్యాచార్యుల కది యద్భుతముగా దోచెను. మరుక్షణమున నాతడు తనకు " శివదీక్ష " నిమ్మని యన్నమారాధ్యుల వేడి కొనెను. వెంటనే యథావాక్కుల అన్నమయ్య యాతనికి పంచాక్షరీ మంత్రోపదేశ మొనర్చి నిత్యార్చనకు ప్రాణలింగము నొసంగెను.

సిద్ధనంద్యాచార్యులు జంగము లైన వార్త ఏకశిలానగరమునను, చుట్టుప్రక్కలను ప్రాకినమాత్రముననే, వందలు వేలుగా జైనులు అన్నమయ్య నాశ్రయించి, యాతని యనుగ్రహముచే లింగధారణ మొనర్చి జంగము లైరి. అది యొక వేలము వెర్రిగా పరిణమించెను. వారిలో పలువురు సిద్ధనంద్యాచార్యులు మారి రనిన విని నమ్మ లేక చూడవచ్చినవారే! చూచినపిమ్మట వారికిని మార్పు వచ్చినది. ఇట్లెన్నో జైన కుటుంబములవారు శివదీక్ష గ్రహించిరి.

* * *

మరి మహారాష్ట్రదేవరాజు యాదవసైన్యములను తరుముచు బోయిన యాంధ్ర సేన లేమి చేసినవి? ఆ యాత్రలో శ్రీరుద్రదేవమహారాజు లేమి చేసిరి? శూలధరులైన యారువేలమంది నూతనబ్రాహ్మణవీరుల నడిపించుకొనిపోయి అన్నమంత్రీశ్వరు డేమి సాధించెను? ఏకశిలానగరము క్లిష్టస్థితిలో నుండగా నుత్సాహముతో తోడుపడిన వీర శైవయోధు లెట్లు పరాక్రమించిరి? గోన గన్నారెడ్డియు, నాతని సేనానులును, సేనలును ఏమొనర్చిరి? తిక్కచమూపతి యనుష్ఠించిన మహత్కార్య మేమి?

అని యన్నియు నొక్కొక్కటి యొక్క బృహత్కథ కాగలదు. ఒక్కొక్కటి ఒక్కొక్క ఆంధ్రకవి ప్రత్యేకముగా విస్తరించి వర్ణించి గానముచేయదగిన వీర గాథ! ఆ కాలపు కవు లవి గానము చేసియుండిరి. ఆ యుద్ధములో ఆంధ్రవీరులు చూపిన ధైర్యసాహసములు, అన్నమంత్రి యుజ్జ్వలప్రతిభ, గోనగన్నారెడ్డి పరాక్రమప్రదర్శనము, తిక్కచమూపతి ప్రతాపము, వీరరుద్రమహారాజుల సర్వతోముఖప్రజ్ఞ—ఆ కాలపు కవు లనేకవిధముల గానముచేసిరి. అవి అరువదియేండ్లపాటు ఆంధ్రదేశమున తిరుమలతిరుపతినుండి సింహాద్రివరకును, కల్యాణకటక శ్రీశైలముననుండి ప్రాక్సముద్రమువరకును, మారుమ్రోగిపోయినవి. అంతే కాదు! ఆ యుద్ధములో పాల్గొనిన రెండు లక్షల యేబదివేలమంది యోధుల యింటింటను ఒక్కొక్క యోధుని వీరగాథయు దినదినమును స్మరింపబడుచుండెను. కుమారులు, కుమారికలు, మనుమరాండ్రు— ఆ యోధవరేణ్యులనోటనే ఆ గాథలు విన నోచికొనిరి. అట్లు అరువదియేండ్లు ప్రతిధ్వనించిన ఆంధ్రవీరుల విజయఘోష, ఆ అరువదియేండ్లను ముంచుకొనివచ్చిన మహాసముద్ర ప్రవాహములో కలసిపోయి విస్మృతమయినది. జనులు మరచిపోయినారు!

* * * *

కాని యామహాయుద్ధము కన్నులార జూచిన గోదావరీనదియు, మంజీరానదియు, ఆ చుట్టుపట్టుల గల పర్వతారణ్యములునుమాత్రము ఇప్పటికిని అది మరువ లేదు! మంజీరానది మంజీరమంజుశింజితము పలుమరు నాకథనే స్మరించును. గోదావరీనదియు మంద్రగంభీరస్వరమున నాకథనే స్మరించును. ఆ రెండునదులకును ఆంధ్రులును, మహారాష్ట్రులును ఒక్కటే! ఆ రెండు దేశములవారును ఒకరితో

నొకరు కలహించుట యీ రెండు నదులకును ఇష్టము లేదు. వారు ఒకరిపై నొకరు దండెత్తకుండ నా నదులు బహుకాలము వారించుచుండెను. ఆనదుల యానలు ఎవ రెప్పుడుమీరినను అట్లు మీరినవారి నానదులు శిక్షించుచుండెను. అట్లు శిక్షించుచునే ఆ రెండు నదులును విషాదము నొందును. తమ కుమారులు ఒకరితో నొకరు కలహించు చుండుట ఏ తల్లి కిష్టమగును!

మహారాష్ట్రులకు, ఆంధ్రులకు తల్లులగు మంజీరా గోదావరీ నదులకు విషాదము కలిగించు గాథ మనము మాత్రము త్రవ్వుటేల! కేవలము శుష్కచరిత్రకారులు చెప్పినట్లు ఆ యుద్ధకథ స్మరింతము!

మహారాష్ట్రసేనలు వెనుదిరిగి పోయిపోయి మంజీరానది గోదావరిని కలియు చోట నాగెను. అంతవరకు ఆంధ్రసేనలు వానిని వెన్నంటి విడువక తరుము చుండెను. ఇక పారిపోవుటకు వీలులేదు. రెండు నదీప్రవాహము లడ్డమయినవి. మహారాష్ట్ర సేనలు తమ్ము తరుముచున్న ఆంధ్రసేనల నెదుర్కొని పోరాడక తప్ప లేదు. మహారాష్ట్రులు మూడు లక్షలున్నారు. ఆంధ్రులును రెండు లక్షల యేబదివే లున్నారు. ఉభయరాజ్యముల ప్రభువులును రెండుసేనలను నడుపు చున్నారు. ఉభయసేనలలోనను సమర్థులగు సేనాను లున్నారు. ఉభయసేన లలోనను వీరు లున్నారు. ఉభయసేనలును భయంకరముగా పోరాడినవి. రాత్రి వరకు పోరాడినవి. ఉభయసేనలందును పలువురు యోధులు ప్రాణములు కోల్పో యినారు. ఆరాత్రికిమహారాష్ట్ర మహాదేవరాజుకు పశ్చాత్తాప మావహించినది.

"అక్రమముగా సరిహద్దు దాటిపోయినది నేనే!"

ప్రక్కనే ప్రవహించుచున్న మంజీరానది యూ నన్నది. ఆ ఓంకారమునే గోదా వరీ నది దూరమున ప్రతిధ్వనించినది!

ఐన నేమి? మరునాడును యుద్ధము ఉభయసేనలకును మహా భయంకరముగనే సాగెను. అంతవరకును ఒకరిని మించి యొకరు యుద్ధము చేయుచున్నారు. ఉభయుల యుద్ధవిధానములును ఒకటియే! ఉభయుల బలములును ఇంచుమించుగా నొకటియే! ఆమధ్యాహ్నమునకు కోలనిరుద్రుడు, కళింగసేనలను పారద్రోలిన విజయగర్వముతో, నొక మహాసేన తోడుత వచ్చి గోదావరి యావలి యొడ్డునకు జేరికొని మహారాష్ట్రసేనలను వెనుకవైపున నిరోధించినాడు. ఆ సాయంకాలమునకు కొంత సేనను గోదావరి దాటించి మంజీరానది యావలియొడ్డున రేవులనుగూడ నాతడు నిరోధించినాడు!

మహారాష్ట్రమహాదేవరాజునకును వెంటనే సంధిచేసికొనుట యుత్తమ మని తోచినది. ఇంకను జననష్టమైనపిమ్మట పర్యవసాన మేమగునో! అతడు శ్రీరుద్రదేవ మహారాజులకు రాయబార మంపెను.

"మహారాష్ట్రులును, ఆంధ్రులును ఒకతల్లిబిడ్డలు. మన మిట్లు కలహించుట యుచితము కాదు. ఉత్తరదేశమున ఉభయులకును శత్రువులు చెలరేగుచున్నారు. మేము సరిహద్దు దాటి వచ్చిన తొందర పనికి నష్టపరిహారముగా కోటి సువర్ణము లర్పించుకొందుము. మన మింతటితో వైరము లుడిగి మనియుందము!"

ఇట్లు మహారాష్ట్రప్రభు పంపిన రాయబారుల వాక్కులు శ్రీరుద్రదేవమహారాజులు నిండు కొలువుండి యాలకించిరి. వారు తమ మంత్రి సామంత దండనాథులను తమకు యుక్తమని తోచినది చెప్పగోరిరి. వారును పరిపరి విధముల తమ తమ యూహలు నివేదించిరి. అంతయు మహారాజులు శ్రద్ధగా నాలకించిరి. తిక్కన సోమయాజులు ఆంధ్రమహాభారతమునుండి వినిపించిన పద్యములలో నొకటి మహారాజుల చెవులలో ప్రతిధ్వనించెను.

"కుడువనిచ్చు తఱియు గురువర క్రిక్కించు, నవసరంబు నెఱిగి యరినృపాలు
నీవు ధీరవృత్తి నిడు ద్రాట బోనిమ్ము, క్రమ్మ కపిల యనగ గ్రమ్మి చెఱుపు."

ప్రకృతిజనముల యనుమతితో శ్రీ రుద్రదేవమహారాజు లా సంధి కియ్యకొనిరి. దేవగిరియాదవ ప్రభునివలన కోటి సువర్ణములను గొని, శ్రీ రుద్రదేవమహారాజు గోదావరీ, మంజీరానదీతీరముల తన విజయ స్తంభములు నెలకొల్పజేసి విజయోత్సాహముతో తన సామంత మంత్రి దండనాథులతో ఏకశిలానగరమునకు మహావైభవముతో ప్రయాణ మయ్యెను. ముందు మహారాష్ట్రులవలన దాను గొన్న కోటిసువర్ణములతో తిక్కచమూపతిని పంపి, మహారాజులును, శీఘ్రప్రయాణముల వసంత నవరాత్రోత్సవములు నిర్వర్తించు వ్యగ్రతతో సాగి వచ్చుచుండిరి.

ఈ యుద్ధములో మారన తీవ్రముగా గాయపడెను. అతనిని అందలముపై శస్త్ర వైద్యులు పరివేష్టింప తిక్కచమూపతి సేనలతో పంపివేసెను.

మహారాష్ట్రులను తరుముకొనిపోవు సమయమున మాత్రము ఒక విషాదసంఘటన జరిగినది. ఆంధ్రరాజ్యములో మహారాష్ట్రసేనలకు ముప్పదియారు జనపదములు ఆశ్రయ మిచ్చియుండెను. అందులో ముఖ్యముగా జైనులు నివసించుచుండిరి. మహారాష్ట్రుల నా జనపదములనుండి పారద్రోలెడి సమయమున, ఆంధ్రసేనలు వానిపై కఠినచర్య తీసికొనెను. ఆ గ్రామములలోని పెద్దల నందరను దండనాథులు పిలిచి తీవ్రముగా శిక్షించిరి. ఆ రాత్రియే ఆ ముప్పదియారు గ్రామములును పరశురామప్రీతి యయ్యెను. జైనులు తమ గ్రంథములలో మతావేశముచే శైవులీ రాక్షసకృత్యమొనర్చిరని వ్రాసిరి. పాపము, ఆంధ్రసేనతో వచ్చుచున్న వీరశైవులు తా మేమియు నెరుగమనియు, శివనింద చేయువారిని శివకోపాగ్నియే దహించు ననియు చెప్పికొనిరి. ఆ గ్రామములలో నల్లాడుచున్న జనులను బాలురను, వృద్ధులను, స్త్రీలను, రక్షించుటకు ఆంధ్రసైనికులు మిక్కిలి పాటుపడిరి.

కాని యపకీర్తిమాత్రము వారికి పోలేదు.

* * * *

ఆంధ్రసేనలు కృతార్థము లైనవి. శ్రీరుద్రదేవమహారాజులను ఏకశిలానగర పౌరులు మహానందముతో ఎదుర్కొని దీవించి, యాదరించి పూజించిరి. ఇంతవరకు శ్రీమహారాజుల సర్వసేనలకు నాధిపత్యము వహించిన అన్నమంత్రీశ్వరు డిప్పుడు సర్వభారమును త్యజించి, మరల తన్ను మహారాజు లుంచిన చెగసాలకు పోయి, అందులో యథాపూర్వముగా వేదాధ్యయనము వేదాంగ వేదాంతశ్రవణములలో నిమగ్నుడై నాడు.

*  *  *  *

శ్రీ రుద్రదేవమహారాజులు అంతఃపురము చేరగనే కుబ్జ మంగలారాత్రికము పట్టినది. దాని వెంటనే ప్రతాపరుద్రకుమారుడు వచ్చి పాదాభివందనము చేసినాడు. రుద్రమ యాతని నాశీర్వదించి చేతులలోనికి తీసికొన్నది. మునుపటివలె నెదుర్కొనుటకు వృద్ధురా లగు కామసాని యీనాడు లేదు.

వెంటనే రుద్రమ కామసాని అంతఃపురరక్షణ చేయుచు ప్రాణము లర్పించిన గదికి బయలుదేరినది. రుద్రమ పెంపుడు నెమలి పింఛము విప్పి యాడుచు క్రేంకారము చేయుచు నెదురువచ్చెను. పంజరములో రామచిలుక 'జయ రుద్రా! జయ రుద్రా!' అని పలుకసాగెను.

కామసాని ప్రాణములు వదలిన ప్రదేశమునకు సమీపమున కుడ్యమున వీరభద్ర పటము వ్రేలాడుచున్నది. ఆ పటము రుద్రమ స్వయముగా చిత్రించినది. దక్షాధ్వర ధ్వంస మొనర్చిన వీరభద్రావతార మందులో తాను చిత్రించినది.

ఆ గదిలోనికి చేరగనే రుద్రమను ఎదుర్కొన్నది రుయ్యమ! గోదావరియాత్ర చేసివచ్చిన దాదిగా ఇంతవరకు రుద్రమకు రుయ్యాంబ కనబడలేదు. దానిని చూచుటకు రుద్రమ తహతహలాడుచుండెను. ఆ తల్లి కూతుండ్రు ఒకరి నొకరు గాఢముగా కౌగిలించుకొనిరి.

## ౫౩

"అమృతరసాభి వర్షకమ యౌ శివ కామ సఖీకృపాకటా
క్షమున మహాద్భుతక్రమ వశంవద నవ్యనిరూఢితోడ నా
సమయమునన్ జనించె సరసస్మయమాన ముఖాంబుజంబుతో
సుమశర శేఖరుండు జిగి సొంపున దొల్లిటికన్న మిన్నయై."

కామసంజీవనము. *

శిశిరఋతువు గతించినది. వసంతము ప్రవేశించినది. ఏకశిలానగరమున వసంతోత్సవములు మహావైభవముతో నారంభమైనవి!

వసంతోత్సవమునకు మూలకందము లైన మావులు చిగిర్చినవి; అవి పూసినవి; కాయలు కాసినవి. అవి ఎర్రగా తెల్లగా పచ్చగా నుండి చూపర నాకర్షించుచున్నవి. తేనెటీగలు వానిపై మూగుచున్నవి. తుమ్మెదలు ఝుంకారము చేయుచు ప్రదక్షిణ సంచారము లొనర్చుచున్నవి. కోయిలలు కవులతోపాటు వాగుచున్నవి!

నదులందును, సరస్సులందును నీరు తేటగా నుండి స్నాన పానాదులకు సుఖముగా నున్నది.

---

*అముద్రితము. కర్త: శ్రీ గట్టి లక్ష్మీనరసింహశాస్త్రి

ఐనను శరత్కాలమువలెనే వసంతమును జీవులకు ప్రమాదకరమగు కాలము!

'కాలుని దంష్ట్రియుగ్మ మనగా విలసిల్లు వసంతముగ శర
త్కాలము, ఘోరరోగకృతి కారణముల్, బహుదుర్గమంబు లా
వేళలు సర్వజీవులకు, విశ్రుతభక్తి వివేకశాలు రీ
మూల మెఱింగి చండికకు బూజ లొనర్ప్రి విశేష మత్తఱిన్.'

ఇట్లని శ్రీ దేవీభాగవత ముపదేశించుచున్నది. ఆ యుపదేశము జనులకు జనపతులకు దృఢముగా నాటుకొనియుండిన పుణ్యకాల మది. వసంతోత్సవము వసంత నవరాత్ర వ్రతముతో నారంభించును.

శ్రీ రుద్రదేవ మహారాజుల యభ్యర్థనము ననుసరించి రాజగురువులగు శ్రీ విశ్వేశ్వర శంభుదేశికులు ముందుగనే అనేక శిష్యగణముతోగూడి రాజధానీనగరమునకు విచ్చేసియున్నారు. వారి శివవాక్కులచే రాజ్యాభిషిక్తులైన శ్రీ రుద్రదేవ మహారాజులు వారి యాశీర్వచనముతో రాజ్యభార మూని, పరిపాలన మారంభించినారు. ఈ యారు నెలలలో మహారాజుల కెన్నియో ఉపప్లవములు ఎదుర్కొనినవి. శ్రీగురువుల కటాక్షముతో పాటు, పరమేశ్వరుని కటాక్షేక్షణమును, మహారాజులపై ప్రసరించి వారిని సర్వోపప్లవములనుండియు నుత్తరింపజేసినది. భగవంతునిపై భారముంచి, ధర్మ మనుష్ఠించువారికి, ప్రయత్నము లేల ఫలింపకుండును? కాకతీయసామ్రాజ్యముపై ఒక్కసారిగా తుపానువలె కష్టములు చెలరేగి శ్రీరుద్రదేవ మహారాజుల ప్రయత్నమను మహావాయువుచే విచ్ఛిన్నమైనవి. కాని యన్ని ప్రయత్నములందును, కంటికి కనపడకున్నను, అనుభవమున స్పష్టము గా గోచరించుచు, శ్రీ శివగురుకరుణావలోకనము సిద్ధముగనే యున్నది. మహారాజులు ఒకవంక మహారాష్ట్రసేనలను వెన్నాడిపోవుచునే, విస్మరింపక రాజగురువులకును, సామ్రాజ్యమునం గల మహానుభావులకును ఆహ్వానము లంపిరి. జన్నిగ గురువులగు శాంతశివదేశికులును వచ్చిరి.

నగరమం దెల్లెడల వరాహధ్వజములు చిరుగాలి కల్లల నాడుచు ఉత్సాహముతో కన్నులపండువు చేయుచున్నవి. భూమండలమును తన దంష్ట్రాగ్రముతో నుద్ధరించిన యజ్ఞవరాహమూర్తి స్వరూపమే అనాదిగా ఈ మధ్యభూమి రాజులకు ధ్యేయముగా నున్నది; ప్రభుత్వచిహ్నముగా నున్నది. వారివి వరాహధ్వజములు. వారినువర్ణములు వరాహాంకితము లై అజ్ఞుల నోళ్ళలో బడి వరహా లైనవి.

స్వయముగా శ్రీ రుద్రదేవమహారాజులు విధివిధానముగా ఉపవసించి వసంత నవరాత్రపూజలు నిర్వర్తించుచున్నారు. స్వయముగా శ్రీ విశ్వేశ్వర శంభుదేశికులు మహారాజుల దక్షిణపార్శ్వమున నున్నతపీఠ మలంకరించి సహస్తము నడిపించుచున్నారు. నవరాత్రపూజలలో ప్రాతఃకాలమునందు కుమారీపూజయు, సాయాహ్నముల సువాసిన్యర్చనయు, మహావైభవముతో సాగుచున్నవి. అట్టి మహారాజులు శ్రద్ధతో అర్చించునప్పుడే సహస్రనామముల సంపూర్ణప్రయోజనము ఘటిల్లును. ఒక్కొక్క కుమారికి, ఒక్కొక్క సువాసినికి, ఒక్కొక్క నామముతో పూజ జరుగుచున్నది. ఇట్లు సహస్రనామములకును, కుమారికలు సువాసినులు లభ్యమయినారు.

రాజమందిరమున రాజవైభవముతో నిట్లుపూజలు సాగుచుండ, ఏకశిలానగరమున నాబాలగోపాలము వసంతోత్సవములు జరుపుచున్నారు. చిల్లరదేవతల గుళ్ళనుండి కేశవ శ్రీ స్వయంభూనికేతనములవరకు, ఉత్సవము యథాధికారముగా యథోత్సాహముగా సాగుచున్నది. ఇందరు దేవత లెక్కడ నున్నారు ? ఈ పట్టణములో నింటి కొక దేవత యున్నదా ? ముప్పది మూడుకోట్లమంది దేవతలును స్వర్గమునుండి నవరాత్రోత్సవము చూడ దిగివచ్చినారా ? అని క్రొత్తవారి కనిపించును !

యువకవి యగు గోవిందశర్మతో పోయి వీథులు తిలకించి యాతని వర్ణన లాలకింతము !

అదిగో, పలనాటి వీరపురుష పరమదైవతములగు శివలింగభవనవాటిలో నొక వనిత ద్విపదప్రబంధమున వారి వీరకథ పాడుచుండగా వీరులు కొందరు వీరసంబెట వ్రేయుచుండ, గొందరు కుంతాభినయము చేయుచున్నారు. ఒకడుఫీట్కారము చేయగా నొకడు గుజ్జము భంజళ్ళ బరపుచున్నాడు.

ఇక రేణుకాస్వరూపమగు ఏకవీరామహాదేవి యాలయము ప్రాంగణముననో ? బవనీడు పరశురాముని కథ పాడుచుండగా, జనంగమప్రమద ఏమిచేయు చున్నది ? గోవిందశర్మ వర్ణన మాలకింతము !

"అలరుంబోడి జనంగమ ప్రమద మధ్యానద్ధఘంటాధ్వనుల్
చెలగం బాడె సమస్తలోక జననిన్ శ్రీ యేకవీరాంబికన్
వలరా జోక్కొక మూర్ఛనాస్వరమునన్ బ్రాణంబు కల్పింపగా
గలకంఠీ కలకంఠ కోమల కుహూకారంబు తోరంబుగన్."

మరి జక్కులపురంధ్రి కామవల్లీమహాలక్ష్మి ఎదుట కైటభారి వలపును పాడుచు,

" ....గిలుక్కు గిలుక్కున మ్రోయు కింకిణీగుచ్ఛంబు తాళమానంబుతో మేళవింప
రాగముననుండి లంఘించు రాగమునకు నురుమ యూరుద్వయంబుపై నొత్తిగిల్లి"

వచ్చుచున్నది. అటు చూతము ! అదేమిటి !

"మంద్రమధ్యతార మానత్రయాభిన్న మహిషశృంగనాదలహరి గూడి
డమరు డిండిమంబు ఢమఢమధ్వని మ్రోసె నద్భుతం బదేమి యార్భటంబు !"

అది మైలారుభటుల సందడి ! వారి కెల్ల బొల్లడు అగ్రగామియై తనదళవాయి వేషము త్యజించి మైలారుభక్తుని రూపముతో సాగుచున్నాడు. కూనా డాతనికి 'అడసోకు' భయములేదు. ఆ యుత్సవములో నిప్పుడు స్త్రీలుకూడ నున్నారు. ఆ యాడుచున్న నాగరపడుచు నే మనుచున్నాడు, గోవిందశర్మ !

"వెనుకకు మొగ్గవాలి కడు విన్నను వొప్పుగ దొట్టినీళ్ళలో
మునిగి తదంతరస్థ మగు ముంగర ముక్కున గ్రుచ్చికొంచు లే
చెను రసనాప్రవాళమున శీఘ్రము గ్రుచ్చెను నల్లపూస పే
రనుపమలీల ని ప్పడు చుపాయము లిట్టివి యెట్లు నేర్చెనో !"

అదుగో! వారికి కాకతిభటులు ఎదురైనారు? వారికీనాడు గండడే అగ్రగామి! వీరికి వారికి ఈనాడు పోరు మరల పొసగునా? లేదు.! కాకతి భటులును, మైలారు భటులును కలసి మెలసి కొంతదూరము ఊరేగి ఎవరి దారిన వారు పోవుచున్నారు.

ఆ భైరవస్థానము చూడండి! గోవిందశర్మ భైరవుని వర్ణించుచున్నాడు!

"అమితోత్సాహముతోడ నీవు పటు బాహాశక్తి నొక్కొక్క మా
రు ఘనఃకంపము నొందజేయ దొలకాడుణ వారి వేలాలుర
త్క్రమతం బై వలమాన మానమయి, యుద్యన్నక్రమై, యుత్తర
త్తిమియై, యుల్లలదంబు మగ్నధులియై ధీరా మహాభైరవా!"

ఈ మహోత్సవములో నెందరి దేవతలను భక్తులను, దర్శింపగలము? అల్లదే బొద్దదేవుని విహారము! ముద్దరా లుమ్మసానమ్మ నివాసము అదిగో! కుమారస్వామి నగరదే! ఆపైన పాండవులగుడి యల్లదిగో! అన్నింటికంటె పైగా, మన కన్నులున్నందుకు సార్థకత కల్పించుచున్న యీ రెండుగోపురములు చూచితిరా?

"కొంతదవ్వుల నదే, మహాగోపురముల
పైడి కుండలు రవిదీప్తి బ్రజ్వలించి
కాననయ్యెను మేరుశృంగములబోలె
గేశవశ్రీ స్వయంభూనికేతనములు!"

వాని శిఖరదర్శనముతో జన్మములు పావనములైనవి. ఆ యాలయప్రాంగణమున కరణవిద్య నేర్చిన యారువేలమంది బ్రాహ్మణులును, ఇతర బ్రాహ్మణులగూడి వేదపారాయణము చేయుచున్నారు.

వీథుల సంచారము చేయుటచే, గోవిందశర్మ తాను శుచిగా నున్నట్టు భావింపక, ఆలయములకు తొలగి వెళ్లుచున్నాడు. అతనికి పుష్పలావిక యెదురై,

"శివుని చిచ్చుఅకంట వెచ్చిన యనంగు బూని కినయైన కమ్మ పుష్పాళ్ళతోడ
దావి ఘనమైన కమ్మగేదంగిపూవు...."

ఇచ్చినది. దానిమీద జాలితో గోవిందశర్మ పద్యము చెప్పుచున్నాడు.

"క్రొన్నెలరేఖతోడ గెడగూడి సుఖింపగ భాగ్యలబ్ధమిన్
ఖిన్నత నొందు గాని నవకేతకి శూలి వివేకహీనుడై
తన్ను దిరస్కరించుటను దైన్యమునొంద దదే వివేక సం
పన్నిధ దాని పాలి పెనుమాళ్ళొక డెక్కడనైన లేడొకో!"

ఆ కేతకిని గ్రహించి యాతడభ్యాసవశమున వేశ్యవాటికలో ప్రవేశించి మాచల్దేవి మందిరము సమీపించినాడు. అక్కడ,

"చందనంబున గలయంపి చల్లినారు.
మ్రుగ్గులిడినారు కాశ్మీరమున ముదమున
వ్రాసినారింద్ర జమున రంగవల్లి
కంజముల దోరణంబులు గట్టినారు."

గోవిందశర్మను జూచినంతనే హంసతూలికాతల్పమువీద గూర్చున్న హావ భావ విభ్రమ విలాసనిధి మాచల్దేవి లేచి,

"కంకణాలంక్రియాఝుణత్కార మెసగ
నయ్యగారికి జోహారు లనుచు మ్రొక్కె."

"కవిగారూ, దర్శన మిచ్చి ఎన్నాళ్ళయినదండీ మీరు? ఉదయమునుండి మీకై దూతికపై దూతికను పిలువ బంపితిని. మీజాడ కనిపంపలేదు. సరిగా వేళకు దయ చేసినారు!"

"ఏమి పని?" ఇట్లనుచు తనచేత నున్న మొల్లిచెండును మాచల్దేవి కీయగా నది మహా ప్రసాదమని గ్రహించి యిట్లనెను.

"చెప్పెదను. రసజ్ఞులైన మీరు లేని దీ యుత్సవ మింతవరకు శోభగా లేదు!"

"ఏమి టీ యుత్సవము?— రాజకార్యము లైపోయినవా?"

"ఆడుదానికి రాజకార్యము లేమిటి ? యోగివేషధరుని మోసముచే వచ్చిన ప్రమాదము తప్పకొనుటకై పెట్టుకొన్న పని! ఈనాడు వసంతోత్సవ ప్రారంభముగా నూతనచిత్రశాలాప్రవేశము చేసినాను! ఈ చిత్రశాలలో చిత్రములు మీరు చూడనిది నాకు తృప్తి లేదు!"

అప్పటికే నగరములోని పెద్దలు పలువురా చిత్రములు తిలకించుచుండిరి. గోవిందశర్మయు చిత్రములు పరికించి మాచల్దేవితో నిట్లన్నాడు:

"చిత్తజుని శౌర్య మెఱిగించె చిత్రశాల!"

మాచల్దేవి చిరునవ్వు నవ్వి గోవిందశర్మతో పని చెప్పెను.

"మీరు మదాలస నెరుగుదురు గదా, అది అన్నమంత్రీశ్వరుల ఇంట నృత్యమునకు తరుచుగా వెళ్ళేదది! అది ప్రభుకార్యార్థినియై అంబదేవుని సేనల నునుగ మించి, గొంటూరిలో జగన్నాథస్వామియాలయములో శత్రుమధ్యమున నృత్యమొనరించి రంజింపజేసి, కాకతీయసేనల కెంతయో సహాయము చేసినది. దానికి మదనరేఖ యను చక్కని చెల్లెలు కలదు. దానిని నేను పెంచుకొన్నాను. దాని కీనాడు ముఖవీక్షణము జరుపవలసి యున్నది!"

గోవింద : "మధ్య నే నెందుకు? "

మాచల్దేవి: "యువకవీ, నీకీనా డొక రహస్యము చెప్పెదను. మాయింటి వారికి అనాదిగా కాకతి రాజన్యులతో చెలిమి మెలివేసికొనియున్నది. పెద ప్రోలరాజునాటినుండియు మా పూర్వు లిక్కడనే ఉండి ప్రభువుల యనుగ్రహము పొందుచున్నారు. నేను శ్రీగణపతిదేవమహారాజుల యనుగ్రహముచే ఖ్యాతి నందురు! నా నివాసము ఇట్లు వృథాగా గడచిపోవుచున్నది. రాజ వంశమువారిని దక్క మావంశమువారు ఇతరుల నొల్లరు. కాకతివంశాంకురమగు శ్రీప్రతాపరుద్ర కుమారులు వ్యాసంగినొంపుచున్నారు. వారిని రంజింపజేయగల కుమార్తెను ఈ మదనరేఖ తప్పలేని నాలోచిక!"

గోవింద : "దానికీ ముకురవీక్షణమునకూ ఏమిసంబంధము?"

మాచల్దేవి : మాకులమువారికి అద్దము శ్రీమహాలక్ష్మివంటిది. మరియు,

'పుణ్యచారిత్ర, దృష్టాంతభూమి గాదె
దర్పణమ్ము వివర్తవాదముల కెల్ల!'

గోవింద : "ఓహో, బహు మంచిదానవే! శ్రీవిద్యాశంకరభారతీయతీంద్రుల దక్షిణామూర్తిస్తోత్రము స్మరించినావా? 'విశ్వం దర్పణ దృశ్యమాన నగరీతుల్యం....' పూజ్యుల వాక్కులు, నీనోట నింకొక విధముగా వివర్తమే చెందుచున్నవి!"

మాచల్దేవి : "క్షమింపుడు! నాకూతురు మదనరేఖ మీకును కూతురువంటిది! వేదవిదులగు మీరు మీచేతిమీదుగా దాని కిప్పుడు అద్దము చూపి దీవింపవలె! సరిగా లగ్నము సమీపించినది. అపరాహ్ణమైనది. మాకులము వారందరు కూడి నిరీక్షించుచున్నారదిగో!"

గోవిందశర్మ చిరునవ్వుతో నంగీకరించెను. జాయపనాయకుడు బద్దెనతో వచ్చెను. మరియు నగరి పెద్దలు పలువురు వచ్చిరి. మాచల్దేవి శీఘ్రగతి వారికి మర్యాదలు చేయించెను. జాయప కప్పుడే విషయము తెలిసి యిట్లనెను.

"ముకురవీక్షావిధానంబు మొదలలేక
వెలపడంతికి గారాదు విభుని గవయ,
యాయజూకున కెట్లు చేయంగవచ్చు
నరణిసంగ్రహ మొనరింప కధ్వరంబు!"

కులమువారును నగరి పెద్దలును పరివేష్టించియుండ గోవిందశర్మను ఉన్నతాసనమున గూర్చుండజేసి మాచల్దేవి పూజించెను. అంతట వెలయాండ్రు మదనరేఖను చక్కగా నలంకరించి ఎదుటికి తెచ్చి యంతకు మున్నె సంపూజితమైయున్న రత్న ముకురమును గోవిందశర్మ చేతి కిచ్చిరి.

గోవిందశర్మ మదనరేఖను దుహితృస్థానమగు తన కుడితొడపై కూర్చుండ బెట్టుకొని, యాదరముతో దానికి చూచుకొనుటకు క్రొమ్మించుటద్దము చేతి కిచ్చెను. అదియు గోవిందశర్మకును, అద్దమునకును విలాసభంగి నమస్కరించి చేతబట్టి యద్దము చూచుకొనెను.

గోవిందశర్మ వెంటనే దాని చెవిలో 'శ్రీవర్ధస్వ' మంత్రముచెప్పి శిరస్సున నక్షతలు చల్లి దీవించి దానిచేత పదునారు సువర్ణము లుంచి, మరియు నిట్లు అందరు విన నాశీర్వదించెను.

"శ్రీ ప్రతాపరుద్ర ధరణీశో పాత్త గోష్ఠీ ప్రతిష్ఠాపారీణయగు కూతు నను శీఘ్రముగా కని కృతార్థురాల వగుదువు గాక!—దానికి మాచల్దేవి పేరుపెట్టవలె సుమా!"

మదనరేఖ సిగ్గుతో తల వాల్చెను. గోష్ఠియం దంతట నానావిధ సల్లాపములు సాగినవి. మాచల్దేవి యందరను గంధపుష్పఫలతాంబూలవస్త్రాదులతో పూజించెను.

చల్లబడుచున్నది. ఎదురుగా గున్నమామిడి చిగిర్చి పూచి కాయుచు వృద్ధుడగు జాయపనాయకుని దృష్టి నాకర్షించినది. అంతలో మేచయనాయకుడు వచ్చెను. ఆతడు వచ్చుచునే మాచల్దేవి నుద్దేశించి,

"నీవు అదృష్టవంతురాలవు. నిన్ను కొంతకాలముగా కారాగృహమునకు పంపవలెనని యోజించుచున్నాను. ఈనాడే యోగివేషధారి యగు నా యవనచారునిపై దెచ్చుచున్న యభియోగములో నిన్ను ప్రధానసాక్షిగా వేయ నిశ్చయించినాను. నీవు ప్రమాణము చేయుటకు ముకురము తీసికొని అధికరణస్థానమునకు రావలసియుండును."

జాయప : "ఎప్పుడు ?"

మేచయ : "రేపు !"

జాయప : "బ్రదికించినావు. ఇప్పుడు నాకు సహకారభంజికోత్సవముపై మనసు పోయినది. దానికి విఘ్నము రాదుగదా !"

ఇట్లనుచు ఎదుటనున్న గున్నమామిడి నాతడు చూసినాడు. వెంటనే ఆ కూడిన నాగరకలోకములో నుత్సాహము బలసినది. అక్కడనున్న స్త్రీలును పురుషులును బారులు తీరినారు. మాచల్దేవి వసంతరాగాలాపనము చేసినది. అంతట నందరు లయానుకూలముగా నడుగులు వేయుచు నామావిగున్నకు ప్రదక్షిణము చేసినారు. ముమ్మారు ప్రదక్షిణ మైనపిమ్మట వలయాకారముగా నందరు దానిని పరివేష్టించినారు. వసంతరాగమున గీతము సాగుచునే యున్నది !

లయ తప్పకుండ ఒక్కరొక్కరే ముందుకు సహకారముక్రిందికి చేరి, ఎగిరి నోటితో దాని పిందెలు గ్రహింప నుంకించుచున్నారు. అటు గ్రహించుటలో బాహువులు హస్తములతో నభినయించుచుండును. ఎగిరి నోటితోడనే పిందె లందుకొనవలెను. లయ తప్పకూడదు !

ఎవరికో కొందరికి గాని నోటికి పిందె లందుట లేదు. కొందరికి చిగురుటాకులే నోటి కందుచున్నవి. ఎక్కువమందికి ఆ ఎగిరిన తాకుకు రాలిన మావిపూల నలుసులు కన్నులలో పడుచున్నవి. వృద్ధుడగు జాయప కెంతో నేర్పు కలదు. బద్దెన కెంతయో నీతి తెలియును. మేచయకు తెలియనిదే లేదు. గోవిందశర్మ లోకజ్ఞుడు. మాచల్దేవి నాగరకవృత్తప్రవీణ. ఐనను వా రందరకు ఆమావి కన్నులలో పూలదుమ్ము చల్లుచున్నది. గాయము నయమైన పర్వతనాయకుడు కూడ వచ్చినాడు. కుంభకర్ణునివలె నెత్తైన యాతని దేహసహాయముతో, నాతడు ఎగరకుండగనే మాటి మాటికి మామిడికాయలు విలాసముగా నోటితో నందుకొనుచున్నాడు !

మాచల్దేవి ఇంట నిట్లు సువసంతకోత్సవము ప్రారంభించినది. నృత్యములతో, నాట్యములతో, సంగీతములతో, కవిపండితగోష్ఠులతో నా యుత్సవ మక్కడ సాగిపోవుచున్నది. ఇది చైత్రపూర్ణిమవరకు సాగును.

ఒకనాడు అశోకోత్తంసిక యను నుత్సవము చేయుదురు. అది అష్టమినాడు జరుగును. అశోకపు చిగుళ్ళను ఆ దినమున భక్షించి అశోకపుష్పములతో రకరకములుగా

శిరోభూషణము లొనర్చి యలంకరించుకొందురు. మరియొకనాడు చూతలతిక యను నుత్సవము అదేవిధముగా మామిడిపూలతో, లతలతో నొనర్తురు.

నవమినాడు కదంబయుద్ధములు చేసెదరు. నాగరకులు భాగములుగా దీరి కదంబ పుష్పములను గుత్తులుగా గట్టి విల్లంబులతోడను, వడిసెలలతోడను, హస్తముల తోడను, ఒకరిపై నొకరు ప్రయోగించుచు యుద్ధము చేయుదురు.

ద్వాదశినాడు దమనభంజిక జరుగగలదు. శ్రేయోభివృద్ధికై యానాడు నాగరకు లొకరి నొకరు దమనముతో పూజించుకొందురు.

మరి శుక్ల చతుర్దశినాడు మదనోత్సవమే జరుగును. ఆనాడు మన్మథపూజ చేసెదరు. హరనేత్రాగ్ని సందగ్ధుడైన కాముని సంజీవన కథ నానాడు గీతములతో, నృత్తములతో, ప్రదర్శనములతో స్మరింతురు.

వసంతోత్సవము పూర్ణిమనాడు. వసంతములు బుక్కాయలు చల్లుకొనుటతో వేశ్యవాటికలో పూర్తికాగలదు. మన కంతవరకు ఈ యుత్సవముల తిలకించుచుండ తీరిక యున్నదా?

* * * *

చైత్ర శుద్ధ పంచమినాడు కేశవశ్రీ స్వయంభూనికేతనములో మహావైభవముగా బ్రాహ్మణు లందరు వైదిక వైభవముతో సరస్వతీపూజ జరిపిరి. పూజాంతమున పరిషత్తు సమావేశ మయ్యెను. ఆ పరిషత్తుకు తిక్కనసోమయాజి యాహూతుడై వచ్చెను. కేతనకూడ అప్పటికి ఏకశిలానగరము చేరికొన్నందున నక్కడ సిద్ధమయ్యెను.

ఆ పరిషత్సమక్షమున కరణవిద్య నభ్యసించిన యారువేలమంది బ్రాహ్మణుల పట్టాలపై తన చేవ్రాలు చేసి, తిక్కనసోమయాజులు స్వయముగా వారలకు బహూకరించెను. వారల నీనాడు మరల పరీక్ష చేయలేదు. విద్యాపరీక్ష పూర్వమే యైనది. ఈనుధ్య శస్త్రపరీక్ష మహాయుద్ధమునందే ఐనది. ఆ పత్రములపై గురునాథుడును, కేతనయు గూడ చేవ్రాళ్ళు చేసిరి. ఆ యారువేలమంది బ్రాహ్మణులును ఆపత్రములు తమ దేవతార్చనసంపుటములలో పదిలము చేసికొనిరి.

పరిషత్తు ప్రారంభమునుండి తిక్కచమూపతి యక్కడనే ఉండెను. మారన గాయము నయమై తిక్కనసోమయాజుల సమీపమున నుండెను. సభాంతమందు తిక్కచమూపతి మారనను నిర్దేశించి తనకుమారుని వరల తన కిస్మని తిక్కనసోమయాజుల నర్థించెను.

ఏమిది? తిక్కనసోమయాజులకు విస్మయ మయ్యెను. వెనుక పదియేండ్లనాడు, విక్రమసింహపురములో సర్వాభరణములతో నుండ, చోరులు ఎత్తుకొనిపోయి ఆభరణము లపహరించి ప్రాణావశిష్టునిగా నుండ, నాతని యేక పుత్రుని పెన్నాతీరమున పారవైచిరి. తిక్కచమూపతి వెదకించియు, లాభములేక నిరాశతో తన పట్టణమునకు మరలెను.

ఆ పిల్లవానిని చూచి రక్షించిన ధర్మాత్ము లాతని నేమి ప్రశ్నించినను పలుకలేదు. పరిగినగులకు మాటలు వచ్చి 'మాతండ్రి తిక్కనామాత్యుడు' అని

యాతడు చెప్పెను. వారంతట అనుగ్రవానిని తిక్కనామాత్యుని ఇంటికి చేర్చిరి. తిక్కనామాత్యునికి పుత్రులు లేనందున నాబ్రాహ్మణబాలకుని పుత్రనిర్విశేష ముగా గ్రహించి ఉపనయనాదికము లొనర్చి విద్య నేర్పుచుండెను. అతని దక్షిణ పార్శ్వమున సుదర్శనాకారముగల పెద్ద పుట్టుమచ్చయు కలదు. ఈమధ్య యుద్ధములో గాయపడిన మారనను వైద్యులు పరీక్షించుచుండగా తిక్కచమూపతి యది నిరీక్షించి యాతడు తన పుత్రుడని గుర్తించెను. పిమ్మట విచారించి మారన పూర్వకథ తెలిసికొని తన కుమారుడే యని నిర్ధారణ చేసెను.

ఆకథ విని తిక్కనసోమయాజులు మారనవైపు తిలకించెను. మారన ఆ యిద్దరు తిక్కనలవైపును పర్యాయదృష్టులు పరపుచుండ వెర్రిరాలు అగ్రహారాగ్రణి కేలన వ్యవస్థ చేసెను.

"ఇతడు తిక్కనామాత్యపుత్రుడు, తిక్కనసోమయాజి శిష్యుడు!"

మారన తిక్కచమూపతికి నమస్కరించెను. తిక్కచమూపతి ఆనందబాష్పము లతో పది సంవత్సరములనాడు పోగొట్టుకొనిన తన ఏకపుత్రుని మారనను, సోమయా జుల ప్రసాదముచే మరల ప్రాప్తించిన కుమారుని, లేవనెత్తి యానందబాష్పములతో నభిషేకించి గద్గదకంఠముతో దీవించెను.

*　　　*　　　*　　　*

గోన గన్నారెడ్డికి యోగివేషధారి యగు యవనచారుని, నాగాచారిని, ఇతర చారులను, జైనవసదిలో నగరి పెద్దలను తుదముట్టింప యత్నించిన వ్యవహర్తలను, సార్థవాహులతో కలసిన చారులను, తిక్కన సోమయాజులను వీథిలో కొట్ట యత్నిం చిన దుండగులను, విచారింప విశేషాధికారము లొసంగబడెను. వారలపై నభియోగ ములు అనేక పత్రములవలనను, సాక్షులవలనను ఋజువైనవి. వారందరికు చత్వర ములలో శూలారోప మొనర్చునట్లు శిక్షలు విధింపబడెను.

ఆ యధికరణవ్యవహారములలో అన్నమంత్రీశ్వరుడు సంపూర్ణముగా నిర్దోషి యను విషయమును నిశ్చయమైనది. అది గన్నారెడ్డి మహారాజులకు తెలియబరచెను.

## ౨౪

"యస్యోత్తుంగతరంగతాడిత వియత్సప్తార్ణవీయం జలమ్
పాదాంగుష్ఠ నఖాగ్రదఘ్న మభవ ద్దూర్భాంకుండలో ద్ధారణే
దంష్ట్రాగ్రకోటి కుటీరకోటరగతం త్రైలోక్య మబ్బిందువ
ద్బ్రహ్మాండా ఇవ రోమకందనికరో, వందే వరాహం హరిమ్."

వసంతనవరాత్రములు దీక్షతో నుపవసించి శ్రీ రుద్రదేవమహారాజులు గడపినారు. ఇన్ని దివసములును అన్నమంత్రి తల్లియగు గౌరమయు, పత్నులగు పార్వతీదేవియు

లకుమమ్మయు, పుత్రికయగు బాలయు రాజమందిరముననే విశేష గౌరవముతో పూజింపబడుచు గౌరవింపబడుచున్నారు. వారికి రుయ్యాంబ సమస్త విధముల నుపచరించు చున్నది. అన్నమంత్రి మాత్రము చెరసాల విడిచి రాలేదు.

దశమినాడు ఉదయముననను, సాయాహ్నముునను శ్రీ మహారాజులు పేరోలగము తీరవలసియుండెను. ఆ యుదయము సభకు పోకముందు, రుద్రమ్మ రుయ్యాంబను వెంట బెట్టుకొని, అన్నమంత్రి కుటుంబమున కిచ్చిన మందిరమునకు బోయెను. రుయ్యాంబ గౌరమ్మకు నమస్కరింపగానే ఆమె 'శీఘ్రమేవ కళ్యాణ సిద్ధిరస్తు' అని దీవించినది. వెంటనే రుద్రదేవుడు యందుకొనెను.

"అమ్మా, ఇది నా ముద్దుల కుమార్తె. దీనిని నీ కోడలిగా గ్రహింపవలె నని నా యభ్యర్థనము!"

గౌరమ్మ శాంతముగా "అంత మహాభాగ్యమా? అవశ్యము!" అన్నది. వెంటనే రుద్రదేవుడు చెప్పెను.

"కాకతిసామ్రాజ్యనౌకను కష్టకాలమున మునిగిపోకుండ నిలువబెట్టిన నీ కొడుకు మరల చెరసాలకుపోయి కూర్చున్న కారణ మిప్పుడు తెలిసినదా?"

గౌరమ్మ: "కారణజన్ముడైన మా అన్నయ్యకు చెరసాల ఏమిటి? వానికి జన్మమే చెరసాల!"

రుద్రదేవుడు: "పెద్దదానవు నీకు తెలియదులే. అదంతేయు మా అల్లుని పెట్టు! వద్దన్న కొలదియు చెరసాలలో పోయి కూర్చుండి వేదపారాయణము చేయుచున్నాడు. ఇప్పుడే తగిన గౌరవముతో కొలువుకూటమునకు రావింతును."

ఇట్లనుచు సల్లాపములతో రుద్రమ్మ యొక్కనియుష మచ్చట నుండెను. కడచిన తొమ్మిదినాళ్ళను కుమారీపూజలు పొందుచున్న బ్రాహ్మణబాలికలు పలువురా సమీపమున ఉదకక్ష్వేడిక యను క్రీడ సల్పుచుండిరి. నవరాత్రదీక్ష ముగిసినది కనుక ఈనాడు పిచికారులవంటి గొట్టములతో వారు ఒకరిపై నొకరు వసంతము చల్లుకొనుచుండిరి. వారిలో బాల యున్నది.

బాల రుద్రమ్మను తామున్న సంకేతములో చూచినది. వసంతముతో పూరించిన ఉదకక్ష్వేడక దానిచేతిలో నున్నది. దానితో నది సరాసరి వచ్చి రుద్రమ్మను సమీపించినది. ఇతరులు వారించు వ్యవధానము లేదు. ఆవసంతము బాల స్వయముగా రుద్రమ్మపై కొట్టినది. వెంటనే రుయ్యమ్మపైనను కొట్టినది.

అది చూచి పార్వతమ్మయు లకుమమ్మయు 'ఇదేమి యాగడమమ్మా!' అనుచు శీఘ్రగతి వారింప వచ్చుచుండిరి.

రుయ్యాంబ చిరునవ్వు నవ్వినది. రుద్రమ్మకు నవ్వు రాలేదు. మనస్సులో నొక వికార ముదయించినది. కన్నులు చెమరించిన వేమోగాని, కోపించినట్లు లేదు. సత్వరమున రుద్రమ బాలను చేతిలోనికి తీసికొన్నది.

పార్వతమ్మ "అమ్మా. తప్పుకాదా, బాలా!"



లకుమమ్మ : "ఎప్పుడూ, అల్లరి చేయనిదానవు ఈనాటోజున ఇలా చేసితి వేమమ్మా!"

బాల తెల్లవోయినది. క్రీడోత్సాహముతో నది చేసివేసినది. తల్లు లెప్పుడును కోపింపనివారు, ఈనాడిట్లు మాట్లాడుటతో ఆకస్మికముగా దాని మనస్సు వెనుకాడినది. నాయనమ్మవంక చూచినది; గౌరమ్మ నిశ్చలముగా నున్నది.

రుద్రమ్మ బాలను చేతిలోనికి ఆదరముతో తీసికొని అన్నది:

"నీవు దీనికై శిక్ష వేయకతప్పదు. ఈ పిల్లను వెంటనే అంటకట్టింపవలెను!"

పార్వతమ్మయు, లకుమమ్మయు బెరుకుతో చూచుచుండిరి.

"పాపము, చిన్నపిల్ల, తెలియక తొందరపడ్డదమ్మా!"

రుయ్యమ్మ అందుకొన్నది:

"అమ్మా, నీకీ ఈడులో వసంతోత్సవము చేసిన బాలను బహూకృతి చేయక శిక్షటమ్మా?"

రుద్రమ : అంటకట్టుట శిక్ష కాదా?"

గౌరమ్మ : ఎవరికి అంటకట్టెద వమ్మా?"

ఆమాటలతో రుద్రమ్మ పరిహాస మాడుచున్నదని అందరకు తెలిసిపోయినది. "ఇంత అల్లరిదానిని తగినవానికే! ఓర్పుగలవాడు ఉండవద్దూ!"

ఆమందిరమూ ఆస్త్రీజనము నవ్వులతో చిరుగంటల నాదమువలె నిండి ధ్వనించినది.

గౌరమ్మ : "నీమనుమరాలికి అప్పుడే సంబంధ మాలోచించినావు కూడనా?"

రుద్రమ్మ : "ఆతిక్కచమూపతి కుమారు డెవరు?

అందరు నిర్ఘాంతపోయిరి. తిక్కచమూపతి కుమారు డెవరు ?

రుయ్యమ్మ : "మారన!" ఇట్లనుచు ఆ కథ వివరించెను.

గౌరమ్మ : "మొదటిమారు వానిని చూచినప్పటినుండియు నా కదే భావము కలిగినది. అతడు తిక్కచమూపతి కుమారుడని తెలిసినందున మరింత సంతోషమవు చున్నది!"

ఏమి టీ యింటితీరు? ఆవల ఇంటియజమాను డగు అన్నమంత్రి చెరసాలలో ఉన్నాడు! అతనికిని అతని కూతురునకునుగూడ అతని తల్లి వివాహసంబంధములు నిశ్చయించినది.

బాల కొట్టిన వసంతముతో అంకితమైన వస్త్రములతోడనే శ్రీరుద్రదేవమహారాజు లానాడు కొలువుకూటమునకేగిరి. వందిమాగధులు కైవారము లొనర్చిరి. అక్కడ గౌరవాసనముల నుపవిష్టులై యున్న రాజగురువులను గణపతిదేవచక్రవర్తులను నమస్కరించి శ్రీరుద్రదేవమహారాజు సింహాసన మలంకరించెను.

రాజగురువులకును, గణపతిదేవులకును దప్ప ఆసభాస్థానమున నున్న తక్కిన యందరికిని, పిన్నలకు, పెద్దలకు, వస్త్రములపై వసంతములు చల్లబడిన గుర్తులు కొంచెమో, గొప్పయో, ఉన్నవి. ఈనాటి యుత్సవమునకు జనుల కాస్వాతంత్ర్య మున్నది. అందును ఆంధ్రరాజు లీ యేడు దిగ్విజయము చేసియుండిరికూడ నాయెను! దారిలో నాయకుల కందరకును, అశ్వములపై వచ్చినను, గజములపై వచ్చినను, ఆందోళికలలో వచ్చినను— ఆ వసంతమర్యాద జరిగినది. మహాదేవరాజు తనపై వసంతము చల్లవచ్చువానిపై కోపముతో తిలకించినందున, ఒక్కసారిగా పది పండ్రెండుమంది యాతని వసంతముతో ముంచియేవేసిరి. అతని యుష్ణీషమునుండి పాదములవరకు వసంతము నిండిపోయినది.

సభాప్రారంభమునకు ముందుగనే మహారాజులు మేచయను పిలిచి, అన్నమంత్రీశ్వరులు దోషులేమో యని కలిగిన భ్రాంతికారణములు వివరించునట్లు చేసి, యాతడు నిర్దోషియని ముందు ఉద్ఘోషింపజేసిరి. పిమ్మట కార్యభరుణుడగు, దామనామాత్యుడు కాకతిసామ్రాజ్యమును కష్టకాలమున నుద్ధరించిన నౌకకూడ నాతడేయని రాజాజ్ఞచే ప్రకటించెను. అంతట వెనుకటికంటె నధిక గౌరవములతో నాతని సభాముఖమునకు తోడుకొనివచ్చుటకు మహారాజులు మేచయనాయకులనే నియోగించిరి. అన్నమంత్రియు మేచయతో సభాస్థానమునకు వచ్చెను. ఎట్లు?

"అయిదువన్నెలగొడు గర్ధగటారి వింజామరల్ గల్గ భూమిపతికి
గంధవారణ మైమఘంటలు పులితలాటంబు ప్రధాన ఘోటకము నసరు
వెలసిన సామంతవీధుల గొల్లెన నడయాల మే నాయకాగ్రణికిని

* * * *

అవని మూరురాయర జగదాది గండ
బిరుద జగచుర్త్యగండర బిరుదకీర్తి
మహితహితుడు మహాత్ముడు మంత్రి యిందు
లూరి యన్నయ విభునకు నొరులు సరియె!
"చండ భుజబలుండు సంబెట నారాయ
ణుండు, కలియుగ భీముండు నుతయశుండు
ఘనుడు మండలీక ఘంటాది నాద వి
ఖ్యాతు డిందులూరి యన్నవిభుండు" *

ఇంత యార్భాటముగా వందిమాగధుల కైవారములతో అన్నమంత్రి సభాస్థానమునకు వచ్చుచున్నను, ఆతనికిని వసంతమర్యాద తప్పలేదు. దారి పొడవునను ఆబాలగోపాలము ఆనందముతో నాతనిపై వసంతము చల్లి యర్చించిరి. అది యంతయు నాతడు ఆదరముతో శిరస్సు వంచి గ్రహించెను. ఆత డాపాదమస్తకము వసంతముతో తడిసి, సాక్షాత్తుగా వసంతమూర్తియై సభాప్రవేశ మొనర్చెను. సభామధ్యమున నాతని కానాడు జరిగిన మర్యాదలు వర్ణించుచు బోయిన మహాగ్రంథ మగును.

---

* శివయోగసారము

కార్యభరణుఁడానాఁడు ముందు మహారాజులే స్వయముగా శిక్షింపవలసిన ద్రోహులవిషయము ప్రస్తావించెను. చేతులకు కాళ్ళకు సంకెలలు తగుల్చబడియున్న రేచర్ల మల్లయరెడ్డిని, మల్రెడ్డిని భటులు మహారాజుల ముందుంచిరి. వీరు కాకతిరాజ్య భారధౌరేయుఁడగు రేచర్ల రుద్రసేనాని వంశజులు. నగరి పెద్దలను బంధించుటకు వసదివారికి మహాసేవలతో నిప్పుడు తోడ్పడిన ద్రోహులు. ఇట్టివారిని శిక్షించు టెట్లు? వారి కా రాత్రి యుద్ధములో సైనగాయము లింకను మానలేదు. అట్టి యుత్తమవంశ సంభూతుల నిట్టి హీనస్థితిలో రాజాస్థానమున ప్రవేశపెట్టుటయే, వారికి తలలు నరకించిన కంటె నధికమగు శిక్షగా నుండెను. వారు ఇద్దరును తలలు వంచుకొనిరి.

"ఇక్కడ నిలుచుండ బెట్టుటకంటె ద్రోహము చేసిన మమ్ము తలలు తీయింప వేడెదము!"

వా రిద్దరు నట్లు కోరుట సభవారికి కష్టమయ్యెను. బుద్ధిమంతులు కూడ ఒక్కొక్క సమయమున భ్రాంతిలో పడిపోవుదురు!

కార్యభరణుఁడు వారు చేసిన ద్రోహములు వినిపించెను. వా రన్నిటికి నొప్పుకొనిరి. శ్రీ రుద్రదేవమహారాజు పితృపాదులవంక తిలకించెను. గణపతిదేవులు మాటాడలేదు, కాని వారలవంక కరుణాపాంగవిలోకనము ప్రసరింపజేయు చుండిరి. మహారాజు తీర్పు చెప్పెను.

"వీరి కిద్దరకును సంకెలలు వెంటనే తొలగింపుడు. వీరి కున్న సర్వస్వము రాజకోశమునకు చెందును. వీరి కున్న సమస్తపదవులు, మర్యాదలు తీసివేయుచున్నాము. మా కొలువు అర్థించినచో వారి కేదో గతి చూపకపోము. వీరి పితామహుఁడు ఈ సామ్రాజ్యమునకు చేసిన మహోపకారము మరచిపోలేము!"

వెంటనే వారికి శృంఖలములు భటులు తొలగించిరి. వారును వినీతులై "మహారాజుల సేవచేసి మా యపరాధమునకు నిష్కృతి చేసికొన నిశ్చయించితిమి!" అని నివేదించిరి. మహారాజులు త్వరలో తెలిపెద మని వారిని సభనుండి పంపివేసిరి.

కార్యభరణుఁ డంత రాజబంధు వగు కోటకేతరాజును మహారాజులముందు నిలువుమని కోరెను. అట్లు చేయగా మహారాజు లిట్లనిరి:

"మీరు శత్రువులతో మంతనములు చేసితిరి. కాని ప్రత్యక్షముగా ఏ యకార్యమును చేయలేదు. శత్రుప్రయత్నములు మాకు తెలుపకుండుటయు సామాన్యదోషము కాదు. మీరు మా కేమియు చెప్పుకొన నక్కరలేదు. మీ కిక రాజబంధువుల కున్న మర్యాద లుండవని తెలిసికొనవలసినది!"

కోటకేతరాజు శిరస్సు వంచి నమస్కరించెను.

కార్యభరణుఁడు ఆనెగొందిపాలకుఁడగు రామదేవరాయలు పారిపోయినాఁడని నివేదించెను. అతఁడు దొరికినపిమ్మట నాతని శిక్షవిషయ మాలోచింప వచ్చునని మహారాజులు సెలవిచ్చిరి.

అంతలో దౌవారికుఁడు వచ్చి వీరభద్రేశ్వరులు వచ్చుచున్నారని మహారాజులకు నివేదించి వారి యనుజ్ఞతో నాతని ప్రవేశపెట్టెను.

వీరభద్రేశ్వరుని దక్షిణ బాహువుపై గాయము మానినది. కాని యా బాహువు సన్నగిలిపోయి నిస్సారమై యున్నది. దౌవారికుడు చెప్పకున్న నీతడు చాళుక్యవీరభద్రేశ్వరుడని సభలో పలువురు గుర్తించియుండరు. అతడు సర్వవిధముల హీనస్థితిలో నున్నాడు. ఇద్దరు భటులు సహాయము చేయనిది యాతడు నిలువలేకున్నాడు. ఆ భటులే యాతనికి కాపుగాకూడ నుండిరి. అతనికి రాజచిహ్నములు లేవు. చక్రవర్తి జామాతృచిహ్నములును లేవు. కేవల మొక సామాన్యయోధునివలె నున్నాడు. అతడు ప్రవేశించుచుండగనే సభ నిశ్శబ్ద మయ్యెను.

వీరభద్రేశ్వరుడు వచ్చి రాజగురువులకును, గణపతిదేవులకును రుద్రదేవ మహారాజులకును తల వంచి నమస్కరించి నిలువబడెను. మరుక్షణమున నాతనికి సామాన్యమగు నొక సుఖాసనమున గూర్చుండ ననుజ్ఞ కాగా నట్లు చేసెను.

శ్రీ రుద్రదేవమహారాజుల కార్యభరణుడగు దామనామాత్యుడు మహారాజుల పక్షమున వ్యవహరించెను.

"గతించిన యాశ్వయుజ శుద్ధ దశమినాడు శ్రీ చాళుక్య వీరభద్రేశ్వరులు తమ కనుగ్రహింపబడిన సర్వబిరుదాదికము మహారాజులకు పంపుకొనుచు తాము విరక్తులై సన్యసించు నుద్దేశ మున్నట్లు వార్త పంపిరి. సన్యాసమునకు ముందు పరిషదనుజ్ఞ యవసరమని వారికి తెలిసియుండు ననుకొందుము. వా రేమందురు?"

వీరభద్రేశ్వరుడు చిత్తమని యంగీకరించెను.

దామనామాత్యుడు: "ఇప్పటికిని వారికీ యిచ్ఛ యున్నచో ఈ పరిషత్సమక్షమున ననుజ్ఞ వేడవచ్చును."

వీరభద్రేశ్వరుడు: నేను విరక్తుడను. నాకు సన్యసింప నీ పరిషత్తు ననుజ్ఞ యీయ వేడుచున్నాను!"

వెంటనే స్మార్తపండితులు, "క్షత్రియులు తురీయాశ్రమము స్వీకరించుట శాస్త్ర మంగీకరింపదు!" అని నిష్కర్ష చేసిరి.

వీలభల్లటదేశికు లిట్లు సెలవిచ్చిరి.

"జినదీక్ష పుచ్చుకొన్నవారు ఎవరైనను సన్యసించుటకు మే మంగీకరింతుము."

పలువురు జైనవిద్వాంసు లందు కంగీకరించిరి.

దామనామాత్యుడు: "వీరభద్రేశ్వరులే వారు జినదీక్ష పుచ్చుకొని రేమో సెల వీయగలరు!"

వీరభద్రేశ్వరుడు: "లేదు!"

రాజగురువులు మాట్లాడ దలచినట్లు సూచించిరి. అందరును నిశ్శబ్దముగానుండిరి.

"స్మార్తపండితుల నిర్ణయమునకు అపవాదము లుండునేమో గాని, ముందు వీరభద్రేశ్వరులు విరక్తులో కారో నిర్ణయించుట ముఖ్యము. వారు విరక్తులమని విజయదశమినాడు తెల్పుకొనిరి. ఈ యారునెలలు వారు చేసిన కార్యములు విరక్తులు చేయునవిగనే ఉన్నవా? ఆనాడు వీరు అహింసాప్రతిజ్ఞ చేసినచో నీస్థితి ఏమై యుండువారు?"

మొగమాటములేని రాజగురువుల వాక్కులకు ఆ సభ నివ్వెరగందెను. వీరభద్రేశ్వరుడు తలవంచి ప్రత్యుత్తర మిచ్చెను.

"అప్పటి విషయము వేరు. అప్పుడు క్రోధలోభము లట్లు పలికించినవి. ఈనాడు నాకు విరాగము కాక వేరు దిక్కులేదు!"

రాజగురువు: "మీ రానాడు అధికారము లేకుండ పంపిన సందేశమును ధర్మదేవత వారియొక్క రూపమున నింత కఠినముగా మిమ్ము కటాక్షింప నెంచి యుండదగును. మీరు వనప్రస్థవృత్తికి సదృశమైన స్థితికి వచ్చితిరని మీ ప్రవర్తనచే నిరూపింప నీ పరిషత్తు ఆరు నెలలు గడు వీయగలదు!"

పండితులు, 'తథాస్తు!' అనిరి.

వీరభద్రేశ్వరుడు, 'మహాప్రసాద' మనెను. మరల విశ్వేశ్వరశంభుదేశికులు సెలవిచ్చిరి.

"మీ కిప్పుడు పుత్రులు లేరు. మీ దౌహిత్రులగు శ్రీ ప్రతాపరుద్రకుమారులను మీ పుత్రులుగా దత్తస్వీకారము చేసికొనుట కంగీకరించునెడల, ఇప్పుడు మీరు వనప్రస్థవృత్తికి అధికారము సంపాదింప నిజముగా యత్నింతురని ఈ పరిషత్తు ముందు కొంత విశ్వసింపగలదు!"

వెంటనే వీరభద్రేశ్వరుడు వినీతుడై పరిషదాదేశము శిరసావహించెను. మంగళతూర్యపంచకము మ్రోసెను. వజ్రకంఠికాది సర్వాలంకారములతో నలంకృతుడగు శ్రీ ప్రతాపరుద్రకుమారుని మాచల్దేవి పురస్సరముగా కన్యకలు సభాస్థానమునకు దెచ్చిరి. గణపతిదేవచక్రవర్తి ఆనందపారవశ్యముతో నోట మాట లేక తిలకించుచుండెను. పరిషదనుజ్ఞతో మహాదేవరాజు లేచి, ప్రతాపరుద్రకుమారుని చేతుల నందుకొని, తాంబూల ఫలపురస్సరముగా నాతని వీరభద్రేశ్వరుని చేతుల నుంచగా, నాతడు స్వీకరించెను. జయ జయ నినాదములు మ్రోసెను. భూసురుల యాశీర్వచనములు చెలంగెను. విద్యానాథుడను యువకవి యిట్లు వర్ణించెను.

"శౌర్యోష్మా నిరవగ్రహః ప్రతినృపా స్సర్వేపి నమ్రీకృతాః
పాతివ్రత్యముపైతి భూ రియ మయం నాథః స్వయంభూ శ్శివః
ధీరోయం యువరాజ ఏవ వహతి శ్రీ వీరరుద్రో ధురం
సర్వా మిత్యనుమోదతే ప్రతికలం శ్రీ కాకతీంద్రో నృపః!"

శ్రీ రుద్రదేవమహారాజు ప్రతాపరుద్రకుమారుని దన యంకస్థలి జేర్చుకొని యాదరించెను. పెద్దలందరు నాశీర్వచనపురస్సరముగా నక్షతలు కుమారుని శిరస్సుపై నుంచిరి. వీరభల్లట దేశికులును వీరభద్రేశ్వరులునుగూడ తమ యక్షతలు కుమారుని శిరస్సున శ్రద్ధగా నుంచిరి.

ఇంతవరకు నిశ్శబ్దముగానున్న గణపతిదేవచక్రవర్తి యిప్పుడు ఆనందముతో [illegible]మగు కంఠముతో మాటాడెను.

"వెనుక మేము శ్రీరాజగురువుల యాజ్ఞ శివాజ్ఞగా శిరసావహించి శ్రీరుద్రదేవమహారాజులను యౌవరాజ్యమునకు అభిషేకింప నిశ్చయించినపుడు, ఆ నిర్ణయము ధర్మేతరమని శంకించినవారి సంశయములు ఇప్పటికి తీరిన వని భావింప వచ్చు గదా!" ఇట్లనుచు చక్రవర్తి తన దృష్టి వీరభల్లటదేశికులపై బరపెను.

వెంటనే వీరభల్లటదేశికులు సభలో లేచి, సర్వాత్మనా తన యంగీకారము తెలిపెను. ధర్మనిశ్చలుం డగు నాతనికి ముందు కలిగినదియు ధర్మసందేహమే కాని పక్షపాతకృతము కాదు. ఆతడును ఆతనితోపాటు పలువురు జైనపండితులును రాజశత్రువుల చర్యలతో నెట్టి జోక్యమును కలిగించుకొనలేదు. వారలను రాజభటులు కూడ నెట్టి యలజడియు పెట్టియుండ లేదు.

చక్రవర్తి ప్రసాదదృష్టితో సభను తిలకించుచుండెను. అంతలో సభాబహిరంగణమున నుచ్చై రావముతో జయఘోష వినవచ్చెను. దౌవారికుడు వెంటనే మహారాజుల కెరిగించెను:

జన్నిగదేవులు జటావర్మ సుందరపాండ్యుని విక్రమసింహపురమునుండి పారద్రోలిన విజయవార్త గొని త్రిపురాంతకుడును అంబదేవుడును స్వయముగా సభాప్రవేశము జయఘోషలతో కాంక్షించుచున్నారు. సభయంతయు వికసించెను. వారిని వెంటనే ప్రవేశపెట్ట ననుమతి యైనది.

"దిగ్విజయీభవ రుద్రదేవ మహారాజ!" అనుచు త్రిపురాంతకుడును, అంబదేవుడును ఉత్సాహాతిశయముతో సభలో ప్రవేశించి మహారాజులకు మ్రొక్కి జయజయ సింహనాదము లొనర్చిరి.

వంది రుద్రదేవమహారాజుల దిగ్విజయయాత్ర వర్ణించెను. పల్లవ కొప్పెరుంజింగడు పరాభూతు డయ్యెను. మహారాష్ట్రమహాదేవుడు వెన్నిచ్చి పారిపోయెను. కళింగబలములు కాందిశీకము లయ్యెను. సుందరపాండ్యుడు తరిమివేయబడెను. చోళసామంతులు శిక్షింపబడిరి. కర్ణాటులు కదల లేరైరి. ఆరునెలలలో కాకతి సామ్రాజ్యము శ్రీరుద్రదేవమహారాజుల భుజస్తంభము లాశ్రయించి సుస్థిరశ్రీ వహించినది.

మహానందముతో నానాటి యుదయసభ ముగిసెను.

మరల సాయంకాలమున విజయసభ ప్రారంభ మైనది. దానికి విజయదశమి నాడు తాము పొందిన జమ్మిపత్రములు తమ వక్షోభాగముల నలంకరించుకొని మహారాజ మంత్రి సామంత దండనాథులు విచ్చేసిరి.

త్రిపురాంతకుడు సిద్ధయదేవచోడని పత్రము ధరించెను. అంబదేవుడు, ఎఱువ మల్లిచోడ, కేశవదేవ, సోమదేవ, అల్లుగంగు, మల్లికార్జున, దామోదర, నాగదేవ నామాంకితములగు పత్రములు ధరించి పత్రసంకీర్ణుడై కనిపించెను. వ్యాకరణబ్రహ్మ యగు కొలనిరుద్రుడు, కళింగరాజ మురారిదేవపత్రములు ధరించెను. అన్నమంత్రి హరిహరదేవపత్రము ధరించెను. జన్నిగదేవుడు సభకు రాలేనందున, నాతని గురువులగు శాంతశివదేశికు లాతడు సంపాదించిన కొప్పెరుంజింగ సుందరపాండ్య నామాంకితపత్రములు తన సమీపమున కలశములో ప్రదర్శించెను.

శ్రీ రుద్రదేవమహారాజులు స్వయముగా వీరభద్రనామాంకితమగు పత్రమును మహారాష్ట్రి మహాదేవ నామాంకిత పత్రమును ధరించిరి. ఈ సాయంకాల సభకు చాళుక్య వీరభద్రేశ్వరుడు రాలేదు. జీవచ్ఛవము లిక నిక్కడ నేటికి?

ముందు కార్యభారిణుడగు దామనామాత్యుడు శ్రీరుద్రదేవమహారాజులు తాము మహారాష్ట్రి మహాదేవరాజునొద్దనపరాధముగా గొనివచ్చిన కోటి సువర్ణములలో ఏబదిలక్షల సువర్ణములు ఆయుద్ధములో పాల్గొనిన సైనికులకు యథాన్యాయవిధమున పంచిపెట్ట దలచిరని ముందు ప్రకటించెను. అందులో వీరసైనవీరులకు లక్ష సువర్ణములు నిర్దేశింపబడినవి.

ఆయెడ తిక్కనసోమయాజులు మహారాజులు పంపిన యాందోళికపై సభాస్థానమునకు విచ్చేసిరి. వారివెంట కేతనయు గురునాథుడును, మారనయునే గాక గోవిందశర్మయు మరియు కరణవిద్యలో నుత్తీర్ణులైన పలువురు వేదవిప్రులును అనుగమించిరి. వారికెల్లరకు నుచితాసనము లొసంగబడెను.

ముందు కార్యభారిణుడు కృష్ణా గోదావరీ మండలములలోనను గొంటూరు మండలమునను—అనగా వెలనాటియందెల్ల — కరణములు నమ్మరానివారుగా నున్నందున వారిపై కాపుగా మరియొక కరణమునుగూడ ప్రతియూరను నియోగింప మహారాజు లాలోచింప నున్నారని విశదపరచెను.

అంతవరకు ఎక్కువ కల్పించుకొనని జాయపనాయకు డప్పు డిట్లు చెప్పెను:

"మన భద్రభూపాలుడు — నేను స్వతంత్రముచే బద్దెన యందును! — ఈసందర్భమున నొక పద్యము చెప్పినాడు. అతడు ఋషివంటివాడు. అతడుపదేశించు నీతిసుమతు లందరు గణింపదగినది. ఏది, బద్దెనా, మహారాజులకు వినిపించు!"

చిరునవ్వుతో మహారాజు లనుమతించిరి.

సిగ్గుతో బద్దెనకు ప్రాణము పోయినట్లయ్యెను. అయిన నేమి చేయగలడు? రాజాజ్ఞ యాయెను! అతడిట్లు చదివెను.

"ఒకయూరికి నొక కరణము నొక తీర్పరి యైన గాక నొగి దఱుచైనం
గకవికలు గాకయుండునె సకలంబును గొట్టువడక సహజము, సుమతీ!"

ఆ పద్యమును సభవా రందరు మెచ్చుకొనిరి.

మహారాజులతో కార్యభరణుడు ఆలోచించి మహారాజుల నిశ్చయ మిట్లు తెలియజేసెను.

ముఖ్యముగా వెలనాటియందును, మరియు నితర గ్రామములను ఇప్పటిలో విశ్వాసపాత్రులు కాని కరణముల నందరను తొలగించి వారి స్థానములలో ఈ బ్రాహ్మణకరణములను నియోగింప నిశ్చయించినాము. గ్రామములలో నీసామ్రాజ్య రక్షణభార మంతయు నికముందీ విప్రోత్తములే భరింతురుగాక!"

అపిమ్మట మహారాజులు తిక్కనసోమయాజుల సంబోధించి వారిని గురుదక్షిణ దని యర్థించిరి. "వెనుక మా మంత్రిసామంత దండనాథులు గురుదక్షిణ

కోరుకొందన విద్యాంతమందుగదా గురుదక్షిణ యంటిరి. మా మంత్రి సామంత దండనాథులకు గురువులైన మీరు మాకును గురుస్థానీయులే!"

తిక్కనసోమయాజులు ప్రత్యుత్తర మిచ్చిరి.

"మా యల్లుడు మనుమసిద్ధి లోపము లేనైన నున్న క్షమించి యాతనికి మరల విక్రమసింహపుర రాజ్యము దయచేయించుటయే మేము కోరగల గురుదక్షిణ!"

సభలో నున్న మనుమసిద్ధి లేచి శ్రీరుద్రమదేవ మహారాజులకు తలయొగ్గెను.

మహారాజు: "అది పూర్వమే నిశ్చిత మైనది! మీరు కోరుకొన నక్కరలేదు! మరియొకటి కోరుకొనవలెను."

తిక్కనసోమయాజులు చిరునవ్వుతో నిట్లనెను: "మా అన్న మంత్రీశ్వరునకు మీ గాదిలిసుత యగు రుయ్యమ్మ నిచ్చి వివాహముచేయ వేడెదను. అది బాలవీరుని వేషముతో అన్నమంత్రి ననుగమించి యుద్ధమున నెంతయో సహాయపడినది!"

మహారాజు: "అదియు ముందే నిశ్చిత మైనది. మా వియ్యపురాలికి చెప్పి యొప్పించినాము. మరియొకటి కోరికొనుడు."

తిక్కన: "అట్లయినచో అన్నమంత్రీశ్వరుల కూతును బాలను మా మాగన కిప్పింపుడు!"

మహారాజు: అదియు నీయుదయమున పూజ్యురాలగు గౌరమ్మ యొద్ద నిశ్చిత మయినది. మరియొకటి కోరికొనుడు!"

[illegible]యినచో మరియొకటి కోరకొన నాకు కోరకలు లేవు."

[illegible]లు [illegible]న సోమయాజులు సిద్ధసంకల్పులు!"

సిరి భార్యామణిగాఁ, విరించి కొడుకై, శ్రీగంగ సత్పుత్రియై,
వరుసన్ నీ ఘనరాజసంబు నిజమై వర్ధిల్లు, నారాయణా!"

సరిగా నాసమయముననే శ్రీ రుద్రదేవమహారాజులకు స్వయంభూనాథభక్తులగు కాంభోడియా ప్రభువు లంపిన కానుకలు రాయబారులు వచ్చి సమర్పించిరి.

అంతట మహారాజు తిక్కన సోమయాజులను వారు రచించుచున్న యాంధ్ర మహాభారతమునుండి తమకు రాజ్యపరిపాలనమున నుపదేశముగా నుండగల ఘట్ట మొక్కటి వినిపింప నర్థించిరి. సభ యుత్కంఠతో నిశ్శబ్ద మయ్యెను. ఒక్క క్షణము ధ్యానించి సోమయాజులు మారనయొద్ద నున్న కోశము గ్రహించి కోశపూజ యొనర్చి తన దివ్యకంఠముతో నిట్లు వినిపించెను :

"వ. జనకచక్రవర్తికి నొక్క బ్రాహ్మణునకుం గలిగిన సంవాదంబు సెప్పెద నాకర్ణింపుము. జనకుడు తన కట్టెదుర బ్రాహ్మణుండు గొఱగామి సేసిన నతనితో నీవు నా విషయంబున వసియింపవలదు పొమ్మనిన నతండు.

"క. నీవిషయ మెంతవట్టిదియే విని పగవిషయమునకు నేగెద దెలియం
గా వినిపింపు మనుడు నా, భూవల్లభు డూరకుండె బుణ్యచరిత్రా !

"ఆ. ఊరకుండి మూర్ఛనూని యొక్కింత సే
పునకు దెలిసి యిట్టు లనియె నాదు
తాత తండ్రితరము ధరణి వశ్యత
నుండ నాకు మమత యొలయ దందు.

"వ. మిథిల నెప్పుడు వసియించెద ...

